తెలుగు సాహితీ వ్యాస

# మందారదామం

సివిల్ సర్వీసెస్, గ్రూప్ - I & II
నెట్, స్లెట్, విశ్వవిద్యాలయ పరీక్షలకు -
సాహితీ ప్రేమికుల కోసం...

మండగొండి నరేష్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**TELUGU SAHITHEE VYAASA MANDARADAAMAM**
***by Mandagondi Naresh***

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

ప్రచురణ నెం. : 2350/14

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబర్, 2003



ముఖచిత్రం : రాజా

వెల: రూ.150/-

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

# అంకితం

నన్ను పెంచి పెద్దచేసిన
మా నాయనమ్మ
మండగొండి వేంకటలక్ష్మీనరసమ్మ గార్కి
నమస్కారాలతో...

# An Opinion

These essays on writers in Telugu — from the classical Nannaya to the present-day Volga, show Naresh's ardent love for Telugu literature.

Much more.

They show a way of analysing and evaluating the contribution each writer made.

We can go through these essays with pleasure and profit.

Profit-especially for students appearing for examinations conducted by various agencies such as UPSC, APPSC, NET, SLET and so on.

The general reader will find this brief romance with literature leading to the pleasure of a lifetime.

*B.V.L. NARAYANAROW*

July 1, 2003.
G-13, Gayatri Towers,
Street 1, Tarnaka,
Hyderabad.

# విన్నపం

ఈ పుస్తకం తెలుగు సాహిత్యంలోని కొందరు మహాకవుల ముఖ్య రచనలపై చేసిన విమర్శనాత్మక వ్యాఖ్యానాల సంకలనం. ముఖ్యంగా సివిల్ సర్వీసెస్, గ్రూప్-1 పరీక్ష రాసే అభ్యర్థుల అవసరాలను దృష్టిలో ఉంచుకొని రాసినప్పటికీ ఇందులోని వ్యాసాలు సాహిత్యంపై అనురక్తి ఉన్న ప్రతి ఒక్కరికి ఉపయోగపడతాయి.

ఈ వ్యాసకర్తకు తెలుగు సాహిత్యంపై మొదటినుంచి ప్రేమాభిమానాలు. సాధ్యమైనన్ని పుస్తకాలను చదవటం సాహిత్యంపై ఒక సమగ్రమైన అవగాహనను కల్పించుకోవటానికి కారణమైంది. తెలిసిన వాళ్ళు చెప్పే మంచి మాటలను వినటం వల్ల ఏవిధంగా మన అభిప్రాయాలను చెప్పాలో తెలిసింది. మొదట్లో కొన్ని వ్యాసాలు రాసి ఆ తరువాత ఇదిగో ఇలా పుస్తకం రాసేదాకా వచ్చాడు.

ఎవరైనా అసలు రచనలు ఎందుకు చేస్తారు? కొందరు పేరు కోసం. కొందరు డబ్బు కోసం. మరికొందరు తమనుతాము నిరూపించుకునేందుకు. పోతన తన భాగవతాన్ని ఏమీ ఆశించక రాశారు. ఏదిఏమైనా ఒక రచయిత రచన అతనిని మనకు చూపిస్తుంది.

"అనగననగ రాగ మతిశ యిల్లుచునుండు...." అని వేమన అన్నాడు. రాస్తూ రాస్తూ ఉంటే చక్కగా రాయటం వస్తుంది. అయితే రాస్తున్నప్పుడు పూర్తిగా నిమగ్నమై రాస్తే బావుంటుంది. రచన పూర్తికాగానే రచయిత తను వేరు, తన రచన వేరు అనుకోవటం మంచిది. కన్న కొడుకుకు పేరు వస్తే, వాడు యోగ్యుడయితే తండ్రికి సంతోషం. కొడుకు సాధించే విజయాలు తండ్రికి చెందవు. అదే విధంగా రచన బాగుందని నలుగురూ అంటే అది ఆ రచనకే చెందాలి. "ఇది నా పుస్తకం. దీన్ని బాగా రాశాను. దీన్ని అందరూ ప్రశంసిస్తున్నారు అంటే నేను మంచి రచయితని"... అని అనుకోవటం కంటే రచన పూర్తికాగానే అది రాయటం అయిపోయింది. దానిలోని యోగ్యత కారణంగా దానికి ఏ పేరు రావాలో అది వస్తుంది అనుకోవటం మేలు.

ఈ రోజుల్లో ఎక్కడ చూసినా అయోగ్యతే. దీనికి చాలా కారణాలున్నాయి. ఏదో ఒక విధంగా, ఏదో ఒకటి రాయటం అలాగే ఎలాగో ఒక లాగా పేరు పొందాలనుకోవటం ఎక్కువవుతోంది. కానీ, కొంచెం మనసుపెట్టి ఆలోచిస్తే ఈ "పేరు" శాశ్వతం కాదని ఎవరికైనా అర్థమవుతుంది. అప్పుడు వ్యక్తి తనలోని అయోగ్యతను తెలుసుకొని యోగ్యుడుగా మారడానికి ప్రయత్నిస్తాడు.

ఈ వ్యాసాలు రాయటం వెనుక ఎంతో శ్రమ, ఎందరో వ్యక్తుల ప్రోత్సాహం ఉంది. కొందరు పండితులు తమ అమూల్య సలహాలనిచ్చి ఈ రచయితకు చాలా సహాయపడ్డారు. పెద్దవాళ్ళు చెప్పిన మంచి మాటలు చాలా ఉపయోగపడ్డాయి. ఈ

పుస్తకం బాగా ఉంది అంటే నిజానికి వారందరూ ఇచ్చిన ఆదరణ, సలహాలు కారణం అయితే లోపాలు మాత్రం పూర్తిగా రచయితవే.

ఈ వ్యాసాలు చదివి పరీక్ష రాసే అభ్యర్థులు మంచి ఫలితాలు పొందాలని కోరిక విద్యార్థులు ఈ వ్యాసాల్లోని సమాచారాన్ని ఉపయోగించుకుంటూ, పరీక్షలో వచ్చే ప్రశ్నకు అనుగుణంగా దీనిలోని సమాచారాన్ని మలచి సమాధానాలను రాయాలి. ముందుగా మూల రచయితల గ్రంధాలను చదివి తమదంటూ ఒక అభిప్రాయాన్ని ఏర్పర్చుకోవాలి. ఆ తరువాత కొందరు సుప్రసిద్ధ విమర్శకుల గ్రంధాలను చదవాలి. పాత ప్రశ్నాపత్రాలను జాగ్రత్తగా చదివి ఏ తరహాలో ప్రశ్నలను అడుగుతున్నారో గమనించాలి. దానికి అనుగుణంగా చదువుకోవాలి. కేవలం ఈ ఒక్క పుస్తకాన్నే చదవటంవల్ల మీకు విజయం లభిస్తుందని చెప్పే సాహసం, లేదా అటువంటి అపోహ ఈ రచయితకు లేదు. అయితే ఈ పుస్తకాన్ని సరిగా, సమగ్రంగా ఉపయోగించుకుంటే మీకు మంచి ఫలితాలు లభిస్తాయి.

పరీక్షలో సమాధానాలను రాసేటప్పుడు మూలగ్రంధంలోని వాక్యాలను ఉదహరిస్తూ రాయాలి. కవి గురించి మీకు నిజంగానే అవగాహన ఉందని చూపించాలి. ప్రసిద్ధ విమర్శకుల అభిప్రాయాలను కూడా సందర్భానుసారంగా ప్రస్తావించాలి. అయితే మీకు వేరే అభిప్రాయాలు ఉంటే వాటిని కూడా చెప్పవచ్చు. వాటికి ఉదాహరణలిస్తూ రాస్తే మీ అభిప్రాయాలకు బలం ఏర్పడుతుంది. అప్పుడవి వాస్తవాలవుతాయి. చేతి రాత కూడా గుండ్రంగా, ముచ్చటగా ఉండటం అవసరం. అత్యున్నతమైన పరీక్షలను రాస్తున్నపుడు సాధ్యమైనంత జాగ్రత్తగా ఉండటం అవసరం.

చిన్నతనంలోనే తెలుగు సాహిత్యంపై ప్రేమ కలిగేలా చేసి రచయితకు స్ఫూర్తిగా నిలిచిన తండ్రి, ఆంధ్రమహాభారతాన్ని అమూలాగ్రంగా, ప్రేమగా చదివిన పండితుడు శ్రీ మండగొండి సత్యనారాయణకి నమస్కారాలు. ముందుమాట రాసి ఇచ్చిన గురుదేవులు శ్రీ నారాయణరావుగార్కి పాదాభివందనాలు.

ఈ గ్రంథాన్ని రాస్తున్న కాలంలో రచయితకు తోడు నీడగా నిలిచిన సహచరి చంద్రకుమారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని వెలుగులోకి తేవడానికి ముందుకు వచ్చిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజర్ శ్రీ రాజేశ్వరరావు గారికి, విశాలాంధ్ర సంస్థకు కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని కంపోజ్ చేసిన డిటిపి వారికి కూడా ధన్యవాదాలు.

ఈ గ్రంథంలోని లోపాలను రచయితకు తెలియచేస్తే అతను వాటిని సవరించుకుంటాడు.

ఇట్లు
పండిత సేవకుడు
మండగొండి నరేష్

తేదీ: 22 జూన్, 2003.

# ఈ మందారదామంలో...

# నన్నయ భట్టారకుడు

నన్నయ భట్టారకుడు తెలుగులో ఆదికవి. సర్వకాలీన సత్యాన్ని వెల్లడించే మహాభారతాన్ని తెనుగుసేత చేసేందుకు సాహసించిన నన్నయ గొప్ప పండితుడు. వాగనుశాసనుడు అపరిమిత కావ్యరచనా శక్తికి, శబ్దశక్తికి, కథాకథన దక్షతకి బృహస్పతి సమానుడు. బ్రహ్మాండాది పురాణాలని ఆపోసనపట్టిన నన్నయశిల్పి చేతిలో నిర్మితమైన తెలుగు మహాభారతం వేయిసంవత్సరాలకి పైబడినా పండితపామరులని విశేషంగా ఆకర్షిస్తూనే వుంది. అనంతరం తెలుగు సాహిత్యం నన్నయ వేసిన బాటలోనే నడుస్తూవస్తూ జాతికి ప్రేరణనిస్తూనే వుంది.

మూలకథని తన రచనావసరాలకి అనుగుణంగా పరిహరించటం, పెంచిరాయటం నన్నయ లోకజ్ఞతకి నిదర్శనం. మానవ జీవితాల్లోని మౌలిక సంఘర్షణనీ, వైవిధ్యాన్నీ తెలుగు మహాభారతం ప్రతిఫలించిన తీరు అద్భుతం. ఆది, సభాపర్వాలు రెంటినీ సమగ్రంగా అనువదించినా, నన్నయ అరణ్యపర్వంలో కొంత భాగాన్ని పూర్తి చేయలేదు. వయోభారం దీనికి కారణం కావచ్చు. రాఘవపాండవీయమనే భీమకవి ప్రణీత గ్రంథాన్ని అణిచివేయడం వల్ల నన్నయ మతిభ్రమించిందని కొందరు అంటారు. కానీ దానికి ఆధారాలు మాత్రం లేవు.

పంప యుగ సంప్రదాయాలపై తిరుగుబాటు చేసిన ఆంధ్ర కవితావిశారదుడు అత్యున్నతమైన రచనా ప్రమాణాలు పాటించి తెలుగు భాషాసాహిత్యాలకు ప్రాణం పోసాడు. నన్నయగారిది అంతా ధ్వన్యాత్మకమైన రచన అని పండితులు అభిప్రాయాల్ని వ్యక్తం చేసారు. నన్నయ రచనాచమత్కృతికి, అక్షర రమ్యతకి భారతంలో చాలా ఉదాహరణలు కనిపిస్తాయి.

లౌకిక ప్రయోజనం కాకుండా లోకశ్రేయస్సుకోసం రచన చేసిన నన్నయ గురించి వేర్వేరు కాలాల్లోని మహాకవులు అందరూ గౌరవంగా మాట్లాడారు. ఆయన రచనా విధానాన్ని ఒక లక్ష్యంగా తీసుకొని ఇతరకవులు వారి రచనలని మెరుగుపర్చుకున్నారు. నన్నయ రచించిన వ్యాకరణ గ్రంథం కూడా పండితులకు కల్పతరువులాంటిది.

ఆదికవి నన్నయ జీవిత విశేషాలను సమగ్రంగా తెల్సుకోవటానికి వీలులేకపోయింది. అయినా అవతారికలోని పద్యాలు నన్నయ వ్యక్తిత్వాన్ని వివరిస్తాయి. భట్టారకుని ఆదర్శాలు వారి ఉపాఖ్యానాల్లో కనిపిస్తాయి. వేదధర్మాన్ని ప్రతిష్ఠించే ఆశయంతో, సామాన్యులకిసైతం ధర్మతత్వనిరూపణ చేసే సంకల్పంతో నన్నయగారి భారతరచనా యజ్ఞం సాగింది. నన్నయ పుణ్యాత్ముడు. కవులందరికీ కవి. మానవులలో దైవస్వరూపం.

# 1. భారత అవతారిక - రచనా విధానాలు - వ్యక్తిత్వ విశేషాలు

ఆదరణీయ సార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి య
ష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమై పెనుపొంది యుండ నం
దాది దొడంగి మూడుకృతు లాంధ్ర కవిత్వ విశారదుండు వి
ద్యాదయితుండొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్

- తిక్కన సోమయాజి

శ్రీకారంతో ప్రారంభించి మహాభారత సంహితా రచన బంధురుడయిన ఆదికవి నన్నయభట్టు కారణజన్ముడు. సూర్యచంద్రాదులున్నంత వరకూ నన్నయ కీర్తితారిక సాహితీ వినీలాకాశంలో తేజోవంతంగా ప్రకాశిస్తూ ఉంటుంది. సాహితీ తపస్సు ద్వారా తెలుగులో ఆదికవిగా నిలిచిన నన్నయగారి వ్యక్తిత్వం భారత అవతారికలోని ఏ పద్యాన్ని పరిశీలించినా కనిపిస్తుంది. పంచమవేదాన్ని అనుసృజనగా (Transcreation)[1] తీర్చిదిద్దిన వాగనుశాసనుడు సరస్వతీ ఉపాసనతో, నిత్య సత్యవచనంతో, పారమార్థిక చింతతో రచనచేసారు. సంస్కృత భారతాన్ని కాచివడపోసిన నన్నయగారి చేతిమీదుగా భారతరచన సాగటం భరతజాతికి దక్కిన అదృష్టం.

నన్నయ ఒక ఋషి. ఆ పుణ్యాత్ముని నోటి వెంట మంగళ శ్లోకం దైవప్రేరణతోనే వెలువడింది. వేదసమానమైన మహాభారతాన్ని అనుసరించి త్రిమూర్తిప్రాయులైన కవిత్రయంవారు తెలుగులో భారతరచన చేస్తారనే సూచన నన్నయ నోట రావటం భగవదేచ్ఛ.[2] అందుకే లోకంలో ప్రచారంలో ఉన్న బ్రహ్మవిష్ణుమహేశ్వరులని ఈ వరుసక్రమంలో కాకుండా పురుషోత్తమాంబుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే అని ఓం ప్రథమంగా మంగళశ్లోకంలో శ్రీవాణి నన్నయనోట పలికింది: ఇది సద్విమర్శకుల కల్పన అనుకునే కన్నా అవిరళ జపహోమ తత్పరుడు, నిత్య సత్య వచనుడు నన్నయనోట సాక్షాత్తూ పరబ్రహ్మ చేసిన సూచన అని భావించటమే సబబు. నన్నయ శబ్దం నారాయణ శబ్దంతో సామ్యం. తిక్కనకి కవిబ్రహ్మ ఉభయకవి మిత్రుడు అనే బిరుదులు ఉన్నాయి. ఎర్రనకి ప్రబంధ పరమేశ్వరుడు అన్న పేరు ఉంది. ఈ విధంగా పై ఊహ సమంజసంగా ఉంది.

సంస్కృతకావ్యమర్యాదలను అనుసరించి కావ్యాలు మంగళ శబ్దంతో ఆరంభమై, అవిధంగానే పూర్తవుతాయి. తొలిసారిగా తెలుగులో కావ్య రచనని ప్రారంభించిన నన్నయ ఇతరకవులని మెప్పించేందుకు మహాభారతాన్ని మంగళశ్లోకంతో ప్రారంభించారు. అహంభావం లేకుండా తన కవితాశక్తికి కారణమైన దివ్యశక్తికి మొక్కి వినమ్రతతో రచన ప్రారంభించిన వినయమతి నన్నయ. ప్రపంచసాహిత్యంలో మహాకావ్యాలను రచించిన గొప్ప కవులంతా పై విధంగా తొలుత వారికి కవితాశక్తిని ప్రసాదించిన ఆ వాగ్దేవిని పూజించినవారే.[3] రాజరాజనరేంద్రుడు ధర్మదయార్ద్ర నిబద్ధబుద్ధియై రాజ్యం చేస్తున్న రాజకులైక భూషణుడు. "ఆశ్రిత పోషణంబున ననంత విలాసమునన్, మనీషి విద్యాశ్రమతత్వ విత్త్వమున దానగుణాభిరతిన్, సమస్త వర్ణాశ్రమ ధర్మ రక్షణ మహామహిమన్" గొప్ప పేరుపొందిన రాజరాజు శీల సంపదని గ్రంథ

ప్రారంభంలోనే ప్రస్తావించిన ప్రభుభక్తి పరాయణుడు నన్నయభట్టు. రాజురాజుకి ఈ యోగ్యతలే లేనిపక్షంలో సాహిత్యాన్ని పోషించాల్సిన అవసరాన్ని గుర్తెరిగేవాడే కాదు. రాజరాజు కొలువులో "యపారశబ్ద శాస్త్ర పారంగులైన వైయాకరణులును భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును మృదుమధుర రస భావభాసురనవార్థ వచనరచనా విశారదులయిన మహాకవులును వివిధ తర్కవిగాహిత సమస్త శాస్త్ర సాగరగరీయ: ప్రతిభులైన తార్కికులను నాదిగాగలుగు విద్వజ్జనంబులు." ఉండేవారు. దీనినిబట్టి రాజరాజనరేంద్రునికి సాహిత్యాభిమానం మెండు అని అర్థం అవుతోంది. అతను అనేక పురాణాలను విన్నాడని, అర్థధర్మశాస్త్రాల స్వరూపం తెలుసుకున్నాడని, ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు తిలకించాడని, జగత్పరిపూజ్యములైన ఈశ్వరాగమముల యందు హృదయాన్ని భక్తితో నిలిపాడని అవతారికలోని పద్యాలు వివరిస్తున్నాయి.

రాజరాజు తన వంశకర్తలైన పాండవుల కథని వినాలనే కోరికతోనే భారత రచనని ప్రోత్సాహించాడని మనం భావించలేం. భారత శ్రవణాసక్తి, దానశీలత, సాధుసాంగత్యం, పార్వతీపతి పదాబ్జ ధ్యాన పూజామహోత్సవము, భూదేవకులాభితర్పణ రాజరాజుకి మిక్కిలి ప్రీతికరమైనవి. ఇంతేకాక పంచమవేదాన్ని తన రాజ్యంలోని సామాన్యులు కూడా తెలుసుకోవాలని అతని కోరిక. కన్నడ భాషలో జరిగిన మహాభారత అనువాదంలో కొన్ని మార్పులు చేసారు[4]. ఇవి దృష్టిలో ఉంచుకొని రాజరాజు నన్నయని "కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థమేర్పడ" భారత రచనని అధిక ధీయుక్తితో చేయమని కోరుతాడు. వీటి ద్వారా రాజరాజు పరిపూర్ణ వ్యక్తిత్వం తెలుస్తోంది. రాజరాజు వలననే నన్నయకి భారత కథా రచన భాగ్యం దక్కింది. దాన్ని గ్రహించి తన ప్రభువుని నన్నయ అశ్వాసాంత పద్యాల్లో, అవతారికల్లోనూ శ్లాఘించారు. దీన్ని భూస్వామ్యయుగ సంస్కృతి అని కొందరు విమర్శిస్తున్నారు. నన్నయగారి ఆశయమైన 'జగద్ధితం' కూడా వారికి ఆమోదం కాలేదు. అభ్యుదయ కవిత్వం పేరిట వచ్చిన రచనలనే మెచ్చుకోవటం, ఈనాటి విలువలు, ప్రమాణాలు తీసుకొని నన్నయ కాలంనాటి పరిస్థితులని విమర్శించటం, ఆదికవిని పరుషపదజాలంతో నిందించటం సమంజసం కాదు. నన్నయ ఎక్కడా మితిమీరి రాజరాజుని స్తుతించలేదు. తన వ్యక్తిత్వాన్ని హైన్యపరుచుకొని రాచరికం ముందు సాగిలపడలేదు.[5] పైపెచ్చు నిక్కచ్చిగా రాజుల విధానాలని, క్షత్రియ దుర్వ్యాపారాలని ఖండించిన మనీషి. నన్నయగారు మత దృష్టితో భారతాన్ని రచించలేదని విశ్వనాథ సత్యనారాయణగారు నిరూపిస్తారు.[6] తన భారత కథాశ్రవణానికి రాజరాజు పేర్కొన్న కారణాలు-

అమల సువర్ణ శృంగఖురమై కపిలం బగుగోశతంబు ను
త్తమ బహువేదవిప్రులకు దానము సేసిన తత్ఫలంబు త
ద్యమ సమకూరు భారత కథాశ్రవణాభిరతిన్ మ దీయ చి
త్తము ననిశంబు భారత కథా శ్రవణ ప్రవణంబ కావునన్

పాండితీదర్పము నన్నయకి లేశమాత్రం కూడా లేదు. అందుకే సర్వవేద శాస్త్రముల అశేషసారాన్ని నిబిడీకృతం చేసుకున్న భారతం అనే సముద్రాన్ని ఈదటం చాలా కష్టమని తను చేయాల్సిన కార్య క్లిష్టతని, తన బాధ్యతని ప్రస్తావిస్తాడు. వినయంగా "ఆయనను దేవా నా యనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెదనని..." అంటాడు. పండితుల ఆదరాభిమానాలే తనకు ప్రోత్సహమని అనటం చూడాలి. ఆనాడు కవుల ప్రతిభను పరీక్షించి, ప్రోత్సహించే పండిత సభలు ఉండేవని దీని ద్వారా మనకు తెలుస్తోంది. అది సకల గమ్య సుతీర్థములు కాబట్టి సర్వులకూ ప్రవేశం. అందులోని కవిశేఖరులు పరమ వివేకులు. మహామనోహర సుచరిత్ర పావనపయః పరిపూర్ణములైనవని నన్నయ వాటిని కీర్తిస్తారు.

ఎందరో పండితులు తన కొలువులో ఉన్నప్పటికీ నన్నయనే భారతరచన చేయమని రాజరాజు కోరటం భట్టారకుని పాండిత్యాన్ని వెల్లడిస్తోంది. అవతారికలోని పద్యాలన్నింటినీ ఉత్తమ పురుషలోనే రాయటం నన్నయ శీలనిదర్శనం.

రచనా ప్రారంభంలోనే గురుపద్యవిద్యకు ఆద్యుడైన వాల్మీకిని స్మరించటం పరిశీలనార్హం. సంస్కృతంలో పద్యవిద్యకు మహాకవి వాల్మీకి ఆద్యులు. నన్నయ చాలా విషయాల్లో వాల్మీకికి మానస పుత్రుడుగా కనిపిస్తాడు. వ్యాసుని కూడా ఒక చక్కని పద్యంతో 'మునిపూజితు భూరి యశోవిరాజితున్' అంటూ నన్నయ పూజిస్తారు. పూర్వ కవులని పొగిడి వారి గుణగణాదులని ప్రస్తావించటం, వారి రచనా విధానాలను వెల్లడించటం ద్వారా నన్నయ తన కవితాశక్తిని సూచనామాత్రంగా వెల్లడించినట్లు అవుతోంది.

నారాయణభట్టు భారతరచనలో నన్నయకి నిరంతర ప్రోత్సాహాన్నందించారు. మిత్రభావనలో నన్నయగారిది మొదటిపేరు. "పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణునట్లు" అంటూ ఒక ఉత్పలమాలతో నన్నయ తనకు ఇష్టుడు, సహాధ్యాయి నారాయణభట్టుకి కృతజ్ఞతలు వెల్లడిస్తారు.

జీవితాన్ని సమగ్రంగా దర్శించటం, దాన్ని గంభీరదృష్టితో అర్థం చేసుకోవటం నన్నయగారి భారతరచనలో కన్పిస్తుంది. సత్యాన్ని అవగతం చేసుకోవటాన్ని ఆయన 'లోనారసి బుద్ధితో' జీవితాన్ని దర్శించటంగా పేర్కొన్నారు.

నన్నయగారు సారమతిం గవీంద్రులు. ప్రసన్నమైన కథలో అమరిన అర్థచాతుర్యం తన కవిత్వలక్షణమని ఆయన పరోక్ష విధానంలో చెప్పారు. మరో ఉత్తమలక్షణం అక్షరరమ్యత. పదాలను వాటి శబ్దార్థాల ఆధారంగా కావ్యంలో ప్రయోగించటంలో అగ్రతాంబూలం నన్నయదే. ఆయనగారి పద్యాలన్నింటిలోనూ నానారుచిరార్థ సూక్తినిధిత్వం ఉంటుంది. మహాభారతాన్ని 'సంహిత' అనటంతో దాని ఉత్కృష్టత కనిపిస్తోంది.[7]

నన్నయకి సత్యం అంటే తగని ప్రీతి. అనేక సందర్భాల్లో అసత్యాలను నిరసించారు. ఉత్తమ జ్ఞానమే ఇంతటి సంస్కారానికి బీజం వేస్తుంది. భృగువంశ

కీర్తనము సందర్భాన "శాపభయము దీర్చుకొనఁగఁబోలుఁ దీర్పరాదనృతాభిభాషణమునైన పాపభయము" అని అగ్నిదేవుడు భావించినట్లుగా లిఖించటాన్ని చూస్తే ఇది తెలుస్తుంది. దుష్యంతుని చరిత్రలో కూడా "సర్వతీర్థాభిగమనంబు సర్వవేదసమధిగమము సత్యంబుతో యెరుగు యెల్ల ధర్మంబులకెందు బెద్ద యంద్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు" అని అంటారు. భారతంలోని ఉపాఖ్యానాల్లో ఎన్నోసార్లు ఈ విధంగా దాని సత్యస్వభావాన్ని, ప్రాశస్త్యాన్ని నన్నయ చెప్పటాన్ని పరిశీలించాలి.

నన్నయ భారతం గురించి, తనగురించి చెప్పుకోవటాన్ని అతని కావ్యకళా దృక్పథం అర్థం చేసుకోవటం కోసం పరిశీలించాలి. నన్నయ అవిరళజపహోమతత్పరుడు, విపుల శబ్దశాసనుడు, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు, ఆపస్తంబ సూత్రుడు, ముద్గలగోత్రుడు, సద్వినుతావదాత చరితుడు, లోకజ్ఞుడు, ఉభయ కావ్యరచనాభిశోభితుడు, సత్ప్రతిభాభియోగ్యుడు, నిత్యసత్యవచనుడు. తెలుగుసాహిత్యంలో మాత్రమే కాదు ప్రపంచసాహిత్య చరిత్రలోనూ ఈ విధంగా సత్యప్రకటన చేసిన కవి కనిపించడు. ఇంతటి ఉత్తముడు చేపట్టిన బృహత్కార్యానికి దైవబలం తప్పక తోడవుతుంది. అందుకే అన్ని విషయాల్లోనూ పరిపూర్ణత్వం ఉన్న నన్నపార్యుని చేతనే భారతరచన ప్రారంభమయ్యేలా జ్ఞానజ్యోతి ఆశీస్సులు అందించింది. తన అపార కరుణాకటాక్షాలని లోకంలో ప్రసరించేటందుకు మాధ్యమంగా నన్నయభట్టునే ఎంపిక చేసుకుంది.

మహాభారత ప్రాశస్త్యాన్ని వర్ణిస్తున్న సందర్భంలో నన్నయ ఈ విధంగా విభిన్న ప్రజలు విభిన్నరీతులలో మహాభారతాన్ని కొలిచే విషయాన్ని వివరిస్తారు.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, యైతిహాసికు లితిహాసమనియు
బరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయం బని మహిఁగొనియాడుచుండ"

కొందరికి ఇతిహాసంగా, కొందరికి పురాణంగా, కొందరికి ధర్మశాస్త్రంగా, కొందరికి వేదాంతంగా, కొందరికి నీతిశాస్త్రంగా, కొందరికి మహాకావ్యంగా కనిపించే మహాభారతాన్ని నన్నయ సమగ్రంగా దర్శించారని తెలుస్తోంది. ఇది అతని సత్ప్రతిభ కి మంచి ఉదాహరణ. అదే విధంగా నన్నయకృత భారతములో ఋతువర్ణన కూడా అద్భుతంగా ఉంది.

భారత ఫలశృతిని చెప్పే సందర్భంలో ప్రత్యేకించి వినయం గురించి చెప్పటాన్ని గ్రహించాలి. ఇది నన్నయలో ఉన్న సుగుణం. గుణములలో ఉన్నతమైన వినయగుణం గురించి వివరించిన నన్నయ నిరహంభావి అని తీర్మానించటానికి అసంఖ్యాక నిదర్శనాలు మహాభారతంలో లభ్యమవుతున్నాయి.

తెలుగు భాషామర్మాలను కూలంకషంగా గ్రహించిన నన్నయభట్టు తన కావ్యంలో ఎన్నో ప్రయోగాలను చేసారు. తెలుగు జాతీయాలను విరివిగా ఉపయోగించారు.[8]

ఆనాటి సంస్కృత పండితులకు జానపద గేయములు, పదాలు కావ్యగ్రంథాల్లో తీసుకొని రచించే విధానం రుచించలేదు. అయితే నన్నయ భారతమునకు పూర్వమున్నవి 'గాసట బీసటే చదివి గాథలు త్రవ్వి' నట్టివని దెప్పిపొడవలేదు. దేశీయ ఛందోవిశేషములైన తరువోజ, మధ్యాక్కరలను భారతంలో ప్రయోగించారు. అంతేకాక మానిని, వసంత తిలకవృత్తము, మహాస్రగ్ధర, తరలము, తోటకము, లయగ్రాహి, పృధ్వి, వనమయూరము లాంటి ఎన్నో ప్రయోగాలను చేపట్టారు. అక్కర, మధురాక్కర అనే దేశీకవితలను కూడా ఉపయోగించారు. నన్నయ కేవలం పండితులకే కవికాదు. అతను ప్రధానంగా విశాలమైన ప్రపంచంలోని జానపదులను, వారి ఆచార మర్యాదలను దృష్టిలో ఉంచుకొని రచనలు చేసారు.

నన్నయ ఒక ఆదర్శరచయిత, మహాభారతంలోని పర్వానుక్రమణికలో తాను రాయబోయే మహాకావ్యంలోని ముఖ్యఘట్టాలను, వివిధ పర్వాలను, అందులో రచించబోయే పద్యాల సంఖ్యను వివరించారు. నన్నయ ప్రణాళికాచాతుర్యం ఎంత గొప్పది! దీనివల్లనే అనంతర కవులకు రచనా విధానం, ప్రణాళిక, పరిపూర్ణత, సత్యనిష్టత మొదలైన విధానాలు తెలిసాయి. నన్నయ భారతాన్ని తత్పరమతితో పఠించే రచయితలు వారి రచనా శక్తిని, రచనా విధానాన్ని అభివృద్ధి చేసుకోగలుగుతారు.

పర్వానుక్రమణికలో 'మనః ప్రీతిద మగుచు నాది పర్వం' అని నన్నయ అంటారు. నన్నయ ఆదిపర్వాన్ని చాలా మనఃప్రీతితో రచించారనే విషయంలో పండితులు ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చారు. మిగతా పర్వాలను పరిచయం చేసే సందర్భంలో సభారంజనమై, సభారమ్యంబగు, మిమ్మగు సభలన్, అమరున్ సభలన్, అతిహృద్యంబై సుకవిపండిత సభలన్, బుధశ్రేణి నుతంబై, అత్యంత వివిధ వస్తు విస్తరమగు బుధవరుల సభల, అత్యుత్తమ కథలను వెలయు.... అని నన్నయ ఆయాపర్వాల్లోని ప్రధాన లక్షణాన్ని వివరిస్తారు. దీన్ని చూస్తే మనకు నన్నయ పాండిత్యము, క్రమశిక్షణ, రచనా ప్రమాణాలు తెలుస్తాయి.

నన్నయ చేతిలో రూపుదిద్దుకొన్న భారతమనే దేవాలయ దర్శనం శుభప్రదం. నన్నయ మహాభారతాన్ని కల్పవృక్షంతో పోలుస్తారు. నరనారాయణులైన శ్రీకృష్ణార్జునుల నానాగుణకీర్తిని వర్ణించే మహాభారతం ధాత్రీసురప్రార్థ్యమైంది.

"అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయ మై
సుమహావర్గ చతుష్క పుష్ప వితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్త నార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారతపారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై"

శ్లేషవల్ల పై పద్యంలో భారతాన్ని ఒక గ్రంథంలాగా, కల్పవృక్షం లాగా భావించుకునే వీలు ఉంది. ఎన్నో అఖ్యానకాలనే కొమ్మలతో నిండిన భారతం వేదములలోని విశిష్టార్థాలనే ఛాయని అందిస్తుంది. పుష్పాలతోనూ, లతలతోనూ నిండి ఉంటుంది. ఇది కృష్ణద్వైపాయనుని ఉద్యానవనం లోనిది. మహాభారతం దివ్య

పారిజాతంలా భూమిపై దేవతారూపులైన బ్రాహ్మణులకి పూజనీయమైంది. గ్రంథంలాగా తీసుకుంటే అసంఖ్యాకమైన ఉపాఖ్యానాలతో నిండినదని, వేదములలోని విశిష్టార్థాల ప్రతిబింబమైన భారతం పంచమవేదమని, వ్యాస భగవానునిచే లిఖించబడిందని, కృష్ణార్జునుల కీర్తనతో నిండి ఉంటుందని తెలుస్తోంది. నన్నయ విధానాన్ని అనుకరిస్తూ అనంతర కాలంలో పోతన తన భాగవతాన్ని గూడా పై విధంగానే పోల్చి చెప్పారు.

"ఇట్టి మహాభారతంబు ననేక విధ పదార్థ ప్రపంచ సంచితంబు నుపపర్వ మహాపర్వశోభితంబు నుపద్వీపమహాద్వీపసంభృతం బయిన భువనం"

అని నన్నయ ఒక వచనంలో చెప్తారు. ఒక విధంగా చూస్తే నన్నయ ఇలా మహాభారత కావ్యాన్ని భూమండలంతో పోల్చటం సరైనదే అనిపిస్తుంది. ఈ భూమిమీద నివసించే ఏ మనుషునికైనా మహాభారతంలోని ఇతివృత్తం అతని జీవితంతో సంబంధం కలిగి ఉందనే తోస్తుంది. భారతాన్ని పృథ్వీమండలంతో పోల్చటం దానిలోని విషయాలు భూమిమీద ఉన్న అన్ని విషయాలు అనీ, భారతంలోని విషయం ఏ సందర్భానికైనా మానవజీవితంతో అన్వయిస్తుందనీ వివరిస్తున్నట్లు అర్థమవుతోంది.

కవిబ్రహ్మ నన్నయ భారతాన్ని అనువాదంలా కాకుండా పునఃసృష్టిగా రచించమన్న రాజరాజు కోరికను తీర్చాడు. ఈ ఆశయ సిద్ధికై మూల భారతంలోని కొన్ని వర్ణనలను, ప్రశ్నోత్తరాలను, వ్యక్తినామపట్టికలను, ధర్మతత్వనీతి విషయకోపన్యాసములను సంక్షేపిస్తూ మళ్ళీ ఎక్కడా ప్రధాన కథకు విస్తరభీతిచే ఏ విధమైన అంతరాయం రాకుండా జాగ్రత్తపడ్డాడు. అనువాద విషయంలో కూడా నన్నయ మార్గమే శ్రేష్ఠమైంది. విపులంగా ఉండేలా అనువాదంచేసి సాధ్యమైనన్ని పదాలను ధ్వని ప్రాతిపదికన తీసుకొని కథని నడిపించటంలో నన్నయది అనితరసాధ్యం.[8] తిక్కన తన అనువాదం నన్నయగారి విధానాన్ని అనుసరిస్తూ చేసాడు.

కొందరు భౌతిక, చారిత్రక, సామాజిక దృష్టితో నన్నయ రాజరాజుని కీర్తించిన 'అన్యరాజ్య తేజోజయశాలి' లేదా 'అపరాజిత భూరిభుజా కృపాణ ధారాజల శాంతశాత్రవపరాగుడు' అన్న మాటలను విమర్శిస్తారు. నన్నయ భూస్వామ్య యుగానికి చెందినవాడైనా ఎక్కడా రాజులనికానీ, వారి విధానాలని కానీ సమర్థించలేదు. పైపెచ్చు, ఎన్నో ఉపాఖ్యానాల ద్వారా క్షత్రియులలోని అహంకారాన్ని, అధర్మాన్ని నిక్కచ్చిగా నిరసించాడు. శమంతపంచకాక్షౌహిణీ సంఖ్యా కథనములో సరమనోట 'తగునిది తగదని యెదలో వగవగ, సాధులకు బేదవారల కెగ్గుల్ యొగిఁజేయు దుర్వినీతుల కగునని మిత్తాగమంబులయిన భయంబుల్' అని చెప్పించాడు. ఉదంకోపాఖ్యానంలో "నిండు మనంబు నవ్య నవనీత సమానంబు" అని బ్రాహ్మణ, క్షత్రియ గుణ తారతమ్యాలని విశేషంగా వివరించాడు. కొందరు నన్నయ మితిమీరి చేసిన బ్రాహ్మణస్తుతి అనవసరమైందని, అది నన్నయ వర్గదృక్పథాన్ని వివరిస్తుందని కూడా భావించారు. అయితే నన్నయ గుణత్రయ విభాగం ఆధారంగా బ్రాహ్మణ శబ్దాన్ని వాడాడు తప్ప ఒక వర్గంగా వారిని కీర్తించలేదని విశాల పంథాతో భారతాన్ని విశ్లేషిస్తే తెలిసివస్తుంది.[9]

శమీకుడు శృంగితో "క్రోధము తపముంజెరచును" అంటాడు. అంటే క్రోధం అంతఃశత్రువుల్లో చాలా ముఖ్యమైంది. దీన్ని నిగ్రహించుకోవటం అత్యావశ్యకం. రాజు తాను సన్మార్గంలో నడుస్తూ, ప్రజలని నడిపించాల్సిన వాడు. అందుకే నన్నయ - క్రోధాన్ని వదిలిపెట్టమని రాజలోకానికి ఆనాడే హితవు పలికాడు. ఎన్నో గాథలను, దృష్టాంతాలని చూపిస్తూ రాజులను వారి విధానాలు మార్చుకోవాలని వాదించాడు.

స్త్రీలకు జరిగిన అన్యాయాలని నన్నయ గర్హించారు.[10] దుష్యంతుని చరిత్ర ద్వారా శకుంతలలాంటి స్త్రీలు పడిన, పడుతున్న వేదనని చెప్పి దాన్ని నివారించాల్సిన అవసరాన్ని చెప్పారు. కుంతీదేవి పాత్రను బహుజాగ్రత్తగా తీర్చిదిద్ది సమాజంలో తల్లి బాధ్యతని, స్థానాన్ని విశదీకరించారు.[11] ఖాండవ వనదహనం ఘట్టం ద్వారా మాతృప్రేమని వెల్లడించాడు. నన్నయ ప్రతిపాత్రని కడు సమర్థంగా తీర్చిదిద్దిన ధీశాలి. ముందే చెప్పుకున్నట్లు అవతారికలో తన ఆశయాన్ని 'జగద్ధితంబు' అని పేర్కొన్న నన్నయ సర్వప్రాణికోటి శ్రేయస్సునే కోరాడు తప్ప తన స్వార్థం చూసుకోలేదు.

కథన, వర్ణన, సంభాషణా శైలులు మూడూ నన్నయ రచనలో కన్పిస్తాయి. అయితే కథనశైలి కొంచెం ఎక్కువగా కనిపిస్తుంది. అక్షరరమ్యత తన కవిత్వ లక్షణంగా నన్నయ చెప్పారు కదా! ఎన్నడూ నశించనివి కాబట్టి అవి అక్షరాలు. భిన్న ఛందస్సుతో సందర్భానుసారంగా రచన చేసిన నన్నయ అక్షరరమ్యత లోకోత్తరమైనది.[12] ఈ విధంగా కథనశైలి అక్షరరమ్యత కారణంగా రక్తి కడుతుందని తెలుస్తోంది. నన్నయగారి రచన తెలుగువారు మాట్లాడుకొంటున్నట్లు ఉంటుంది. తెలుగు మాటల్లోని గడుసుదనమంతా పొదిగినట్లు వారి గద్యం ఉంటుంది.

"అప్పాండవులతో విగ్రహంబు సేయుటకెన్నండును నొడంబడ బిత్పైతామహంబయిన రాజ్యంబునకు నీయట్ల వారునర్హులు గావున వారికి నర్థరాజ్యంబిచ్చిన నీకును నీ బాంధవులకును లోకంబులకును బ్రియం బగు నట్లుగాననా దపకీర్తి యగు గీర్తి నిలుపుటయ కాదే జనులకు జన్మఫలంబు..." లాంటి వచనాలు దీన్ని నిరూపిస్తాయి.

(ఆదిపర్వము - అష్టమాశ్వాసము).

"గద్యం కవీనాం నికషం వదంతి" అని ఆర్యోక్తి. ఇది నన్నయకు ప్రత్యేకించి వర్తిస్తుంది. ఆదికవి పద్యానికీ, గద్యానికీ సముచితస్థానమిచ్చి రెంటిని సమానంగా పోషించారని భమిడిపాటి విశ్వనాథంగారి అభిప్రాయం. పద్యాలను అధికంగా రాస్తూ మధ్యమధ్య గద్యాలను రాయటం నన్నయ విధానం. కథాకథనానికి, విషయప్రతిపాదనకు, సంవాద రూపమునకు, ధర్మాలను ఉగ్గడించటానికి నన్నయ వచనం చాలా ప్రసిద్ధమైంది. వివరణ గద్యం, అనుసంధానగద్యం, అలంకార శోభితమైన గద్యం, వర్ణనకోసం ఉపయోగపడే గద్యం, గద్యశైలి మొదలైనవాటన్నింటిలో నన్నయ గారు దిట్ట.

నన్నయలో నాటకీయ శైలి కూడా చాలా ఉంది. శిశుపాల వధ ఘట్టంలోనూ, కుమారాస్త్రవిద్యాసందర్శన కథలోనూ నన్నయ నాటకీయత కనిపిస్తుంది. నాందీ

ప్రస్తావన, నాటకీయ రచనా ప్రయోగము, సూత్రధారి ప్రవేశం, సంభాషణలు, రంగముపై ప్రదర్శనాసాధ్యంకాని అంశాలని పరిహరించి వాగ్వివాదాలని ప్రవేశపెట్టటం మొదలైనవన్నీ నన్నయ నాటకీయ శిల్పాన్ని వెల్లడిస్తున్నాయి. దీన్ని తిక్కన అనుసరించి ఆదరించాడు.

ఆదికవి నన్నయ శైశవలీలలను కూడా భారతంలో నిర్వహించాడు. భరతుని శైశవక్రీడలను కవి అద్భుతంగా వర్ణించాడు.

ఒక విభక్తిని వదిలి మరో విభక్తిని వాడి నన్నయ "తన ప్రత్యేక విధానాన్ని ప్రకటించుకున్నారు. అవతారికలో తోడన్, తోన్ బదులుగా "అధిక ధీయుక్తి మెయిన్" అనటం చూడాలి. అలానే 'వలన' ప్రయోగం.

సంధిలో ముఖ్యంగా త్రికసంధిలో నన్నయ విశిష్టార్థస్ఫురణార్థం సాధించారు. అద్దివ్య, అత్తురంగంబు, ఆయ్యుదంకుండు లాంటి ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి. సమాసాల్లో కూడా ఈ కవి తన నానారుచిరార్థసూక్తి నిధిత్వం అభివ్యక్తీకరించాడు. భారతకథా శ్రవణాభిరతిన్, కృతాంత నికేతనాతిధిన్, మనోజరాజ్య లక్ష్మి లాంటి ప్రయోగాలు దీన్ని నిరూపిస్తున్నాయి. అదే విధంగా 'దిక్కుల దనయాజ్ఞ వెలిగించుచును' అన్న ఉదాహరణలు నన్నయ క్రియాపదాలను ప్రయోగించటంలో కూడా నేర్పరి అని చెపుతున్నాయి. రోసిరోసి, చనిచని, తలచితలచి, వచ్చివచ్చి, ఎరిగి ఎరిగి మొదలైన ప్రయోగాలు, క్రియల్ని ద్విరుక్తం చేసి తద్వారా తన సూక్తి నిధిత్వాన్ని వెల్లడించాడని స్పష్టం చేస్తున్నాయి.

నన్నయ భారతరచన తెలుగుసాహితీ చరిత్రలో ఒక దివ్య సంఘటన. విమల సద్గుణ శోభితులైన పాండవులు, శ్రీకృష్ణభగవానుని సహాయంగా చేసుకొని భూమిమీద ధర్మాన్ని సంస్థాపించిన ఉదాత్తచరిత్ర మహాభారతం. దీన్ని అత్యంత ప్రతిభావంతంగా అనువదించి నూతనకావ్యమా అన్నట్లుగా తీర్చిదిద్ది సర్వప్రజలకూ అందుబాటులోకి తెచ్చిన నన్నయలో త్రిమూర్తులశక్తి రాశీభూతమైనట్లుగా కనిపిస్తుంది. నన్నయగారి భారతాన్ని 'లోనారసి' బుద్ధితో పరిశీలిస్తే ఎన్నెన్ని విశేషాలు కన్పిస్తాయో?

ఈ కారణాల వల్లనే ఏ కాలంలోనైనా, నన్నయ భారతం ప్రజల మనస్సులో నిలిచిపోయిన కావ్యంగా ఉంటుంది. నన్నయ కారణజన్ముడు. తెలుగుభాషని చిరకాలం నిలిచి ఉండేలా చూడటానికే అతను జన్మించాడు. నన్నయ నిజానికి ప్రాతః స్మరణీయుడు.

"నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌముని, కవితా
పట్టాభిషిక్తు, భారత
ఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢ ప్రతిభున్"

వివరణలు:

1. ఆచార్య **పి.లాల్** అనువాద ప్రక్రియను పరిశీలిస్తూ కేవలం **అనువాదాన్ని** Translation అంటే కవితాప్రతిభ ఉన్న అనువాదకుడి రచనని **అనుసృజన** (Transcreation) అనవచ్చునన్నారు. ఆచార్య నారాయణరావు **ఈ** విధానంలో Transbridgement, translargement, transtoxis, లాంటి పదాలను సృష్టించారు.

2. విశ్వనాథ సత్యనారాయణ 'పూర్వ సంస్కృత కవులంతా కావ్యాదిలో మంగళాచరణముతో త్రిమూర్తులను పేర్కొనలేదు. నన్నయ్యేదానికి మొదలు' అని చెప్పారు. శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో వక్షో ముఖాంగేషు.... అన్న వాక్యానికి "వక్షము గౌణార్థంలో హృదయమై నన్నయ ఆయుస్సు పోసినవాడు అవుతున్నాడు. ముఖాన అంటే ఒక పర్వప్రారంభంలో విరాటపర్వాదిలో ధరిస్తున్నాడు, తిక్కన. అంగములో అంటే అవయవంలో, ఒక భాగంలో అరణ్యపర్వభాగంలో, ఎర్రన ధరిస్తున్నాడు..." అని విశ్వనాథ అర్థం వివరించారు.

3. ఇంగ్లీష్ సాహిత్యంలోని పురాణం (Epic) జాన్‌మిల్టన్ రచించిన Paradise Lost. ఈ కావ్య ప్రారంభంలోనే... "of Man's first disobedience, and the fruit of that forbidden tree, whose mortal taste Brought Death into the world, and all our woe with the loss of Eden, till one greater man Restore us, and regain the blissful seat... *Sing heavenly muse"* అని ఆయన దివ్యశక్తికి మొక్కి తన వినయాన్ని సూచించారు.

4. పంప, పొన్న, రన్నలు కన్నడంలో భారతరచన చేసి రత్నత్రయంగా పేరుపొందారు. పంపడు మొదట తెలుగువాడు. కన్నడ దేశానికి వలసపోయాడు. కొంతవరకూ నన్నయ పంపకవి పద్యవిధానాన్ని అనుసరించాడని నిడుదవోలు వెంకటరావుగారి లాంటి విమర్శకులు నిరూపించారు.

5. భారతంలో ఒక్క పద్యంలోనైనా నన్నయ అటు రాజరాజు ముందుగానీ ఇటు ఇతర రాజులముందుగాని తన వ్యక్తిత్వాన్ని అల్పం చేసుకున్నట్లు ఆధారం లేదు. కన్యాశుల్కం నాటకం "అంకితం"లో రాసిన పంక్తులు చూస్తే తెలుస్తుంది. విమర్శకులు అప్పారావుని అభ్యుదయ కవిగానే కీర్తిస్తున్నారు. మరి నన్నయ మాత్రం రాజాశ్రితకవి?!

   ఆయా కాలంలోని విలువలని దృష్టిలో పెట్టుకొని చూస్తే ప్రతికవి తన కాలానికన్నా ముందున్న వాడేనని, ఆదర్శాలతోనే రచన చేసారని తెలుస్తుంది. కవులందరూ మార్పు కోరినవారే, విప్లవకారులే! భారతాన్ని సరిగా అధ్యయనం చేస్తే నన్నయ కూడా అభ్యుదయ కవిగానే కనిపిస్తాడు.

6. విశ్వనాథ సత్యనారాయణగారు ఇలా అంటారు: "సభాపర్వములో శిశుపాలవధ సందర్భాన భీష్ముడు శ్రీకృష్ణుని యొక్క పరమేశ్వరత్వము చాలా సర్గలలో

వర్ణించాడు... ఇవి యన్నియు విష్ణుపారమ్యబోధకములైన విషయములు, వీటినన్నింటినీ నన్నయగారు వదిలిపెట్టెను. హిందూమతమును రక్షించుటకు నన్నయగారు భారతమును వ్రాసినచో ఈ భాగములను వదిలిపెట్టరాదు గదా!". అలాగే మందపాల చరితములో ఋగ్వేదములోని అగ్నిసూక్తులకు వ్యాసుడు వ్రాసిన శ్లోకాలు కూడా నన్నయ భారతంలో లేవు.

7. మహాభారతానికి మొదట్లో జయసంహిత అని పేరు. నన్నయ భారతాన్ని సంహిత అనటం అది వేద సమానమని చెప్పటం.

8. పదగతమైన సూక్తులు బహుచమత్కారంగా సున్నితంగా చెప్పటం నన్నయ నానారుచిరార్థసూక్తినిధిత్వంలోని మొదటిమెట్టు. క్రమములు, అభిప్రాయంబు, కర్కోటకుడు, ఏన, వినర్థనుండు, పెద్దయై, నేరబోలునే, ఏయది, తథ్యము సమకూరు, కాకేమి, ఇది యేటి తపము, చిత్తముకలదేని, పెద్దయుంబ్రొద్దు లాంటి పదాల్ని, పదబంధాల్ని నన్నయ ప్రయోగించారు. అలానే గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్, ప్రొద్దునుబోయె, రోయుతీగ, శ్రీరామోకాలొడ్డు, తామర తంపర, కాళ్ళం బెనగ, వంట ఇంటి కుందేలు... వంటి ప్రయోగాలు కూడ్గా కన్పిస్తాయి.

9. భగవద్గీత గుణత్రయ విభాగం ఆధారంగానే వ్యక్తివర్గీకరణ చేయటం గురించి వివరిస్తోంది.

చాతుర్వర్ణం మయా సృష్టం గుణకర్మ విభాగశ
తస్యకర్తా రమపిమాం విధ్యకర్తా రమన్వియం.

అదే విధంగా సత్వరజస్తమోగుణములు ప్రకృతి నుండి జనించిన **మూడు** గుణములు. ఇవి అవినాశియైన జీవుని శరీరములలో బంధించుచున్నవి **అని** శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశిస్తాడు.

సత్వంరజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః
నిబధ్నంతి మహాబాహోదౌహా దేహినమవ్యయమ్

10. పతివిహీనయైన సతిని లోకులు పునర్దారగా స్వీకరించుట జనసామాన్యంలో ఆనాడు తప్పుగాలేదు. బకాసుర వధ ఘట్టములో "నేను నీ పుత్రుని, పుత్రికను నీవు లేక పోషింపజాలను. నీవు పోయిన తర్వాత అనాధనైన నన్ను జనులు బలవంతము చేసి పెండ్లికి ప్రోత్సహింతురు..." అని బ్రాహ్మణి బకాసురునికి తాను ఆహారము నవుతానని అంటుంది.

11. ఆదిపర్వము సప్తమాశ్వాసములో కుంతీదేవి చెప్పినట్లు పాండవులు ఐదుగురు ద్రౌపదిని వివాహం చేసుకోవటం సబబే అని వ్యాసుడు చెప్పే సందర్భంలో ఈ విధంగా ఉంది:

గురువులోన బరమగురువు దల్లియ యట్టి
తల్లి వచనము విధాతృకృతము
నన్యథాకరింప నలవియే యనిన నం,
దొరకు నిట్టులనియె ద్రుపదవిభుడు.

12. సంగీత ప్రభావము సాహిత్యమునకు రమ్యత నాపాదించునప్పుడుదయించు కవితాగుణములలో అక్షరరమ్యత అతి ప్రధానమైనది. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు "సంగీత సాహిత్యములలో సంగీతము సాహిత్యమునకు, చేయిగా నిలిచినప్పుడు కలుగు సహజ పరిణామములలో అక్షరరమ్యత ఒకటి"... అంటారు.



# 2. నన్నయ - ఉదంకోపాఖ్యానం - కథాకథన చాతుర్యం

ఉదంకోపాఖ్యానం నన్నయ భారతంలో మొదటగా వచ్చే ఉపాఖ్యానం 'అమితాఖ్యానక శాఖలం బొలచిన' మహాభారతంలోని ప్రతి ఉపాఖ్యానం ఒక నీతిని వెల్లడించటానికి ఉద్దేశించినదే. భారతీయ సాహితీ సంప్రదాయాన్ని అనుసరించి కథ హృద్యంగా ఉండాలి.[1] అది అనవసర ప్రసంగం లేకుండా, ఆసక్తిదాయికంగా ప్రారంభమవ్వాలి. పాత్రచిత్రణ బాగుండాలి. కథలో చక్కని మలుపులు ఉంటే చదివేవారికి చదవాలనే కోరిక ఎక్కువవుతుంది. కథ ముగింపు పాఠకునికి ఆనందాన్ని ఇవ్వాలి. అంటే కథా ప్రయోజనం వ్యక్తి సహృదయతని తట్టి లేపటం. సాహిత్యంలో ఈనాటికీ కథ ఒక చక్కని ప్రక్రియగా ప్రశంసలు నందుకుంటోంది. తెలుగు సాహిత్యంలో ఈనాటికీ వివిధ సాహితీ ప్రక్రియల్లో కథకి ఒక చక్కని స్థానం ఉంది. ఎందరో రచయితలు కథారచనలో నూతన ప్రయోగాలు చేస్తున్నారు. వీరందరికీ ఆదికవి నన్నయ తన కథాకథన దక్షతతో స్ఫూర్తినిస్తున్నారు.

అవతారికలోనే నన్నయ 'ప్రసన్నకథా కలితార్థయుక్తి' గురించి ప్రస్తావించారు. అదే విధంగా భారత కథా ప్రస్తావనలో చక్కని కథకు కావాల్సిన లక్షణాలని పూర్తిగా వివరించారు. మన పెద్దలు కథను ఆఖ్యాన, ఉపాఖ్యాన, ఆఖ్యాయికా, చరిత, గాథ, చరిత్ర, పురాణ, ఇతిహాస, వృత్త, వృత్తాంత, వార్తా మొదలైన ఎన్నో రూపాలలో గ్రహించారు. అయితే ఆయా పేర్ల, ప్రత్యేకతలను కూడా వారు గ్రహించారు. భారతీయ లాక్షణికులు గద్యకావ్యాల్లో కథా, ఆఖ్యాయికా అని రెండు ముఖ్య భేదాలను చెప్పారు. అయితే విశ్వనాథుని అభిప్రాయంలో ఆఖ్యాయికకూ, కథకూ భేదం కేవలం కవి, స్వయంగా తన వంశకీర్తనాదులు చేయడంతో ఏర్పడుతున్నట్లు తెలుస్తోంది. దండ్యాచార్యుడి అభిప్రాయంలో కథా, ఆఖ్యాయికలు రెండూ ఒకే జాతికి చెందిన ప్రక్రియలని సూచించే పేర్లు.[2] విష్ణుపురాణ టీకాకారుడైన శ్రీధరస్వామి అభిప్రాయంలో కవి తాను స్వయంగా చూసిన విషయ కథనాన్ని 'ఆఖ్యానకం'గా భావించవచ్చు.

నన్నయగారు స్వయంగా మహాభారతాన్ని 'ఆఖ్యాన'మనీ "ఆఖ్యానవరిష్ట"మనీ ప్రశంసించారు. భారతాన్ని విచిత్ర కథానీక మండితమైందిగా పేర్కొన్నారు. అలానే వ్యాసభారతాన్ని 'ఆఖ్యానం', 'ఇతిహాసం', 'పురాణం' అని వివరించారు.

ఆదిపర్వం ప్రారంభంలో మహాభారతకథను పురస్కరించుకొని నన్నయగారు 'అక్కథయ వినగ నిష్టము మాకున్' అని చెప్పారు. దీని ఆధారంగా

పర్వసంగ్రహవిశేషాలను ఉపాఖ్యానాలుగా పేర్కొనటం చూస్తే ఉపాఖ్యానం అంటే ఉపకథ అని కూడా చెప్పవచ్చు.

ఉపకథకు కూడా ప్రత్యేకమైన అస్తిత్వం ఉన్నప్పటికీ అది ప్రధానకథతో జోడింపబడి ఉంటుంది. ఉపకథ ద్వారా భావికథా సూచనం ఒక విధానం. ఉదంకోపాఖ్యానం దీనికి చక్కని ఉదాహరణ. చాలామంది విద్వాంసులు పేర్కొన్న సంక్షిప్తత, భావస్థిరత, సమర్థత, న్యాయసూక్ష్మత అనే అంశాలు నన్నయ రచనలో కనిపిస్తాయి.

కొందరు విద్వాంసులు నన్నయ ఉదంకోపాఖ్యానాన్ని నాటకీయతకి ఉదాహరణగా, కథాగమనత్వరీకరణము చూపు వాక్యాలు ఉన్నదానిగా నిరూపించారు.

ఉదంకుడు అకారణంగా తనకు అపకారం చేసిన తక్షకుని మీద ప్రతీకారవాంఛతో సర్పకులనాశనాన్ని చేయబోవటం ఈ ఉపాఖ్యానంలోని ఇతివృత్తం. బ్రాహ్మణుడైన ఉదంకుడు కోపాగ్నితో చెలరేగిపోవటాన్ని చూస్తే అతనికి పట్టుదల అధికం అని తెలుస్తోంది. అయితే అతను నిమిత్తమాత్రుడు. సర్పకులనాశనం విధి కృతం.

పంకజభవ సన్నిభుడు అంటే బ్రహ్మతో సమానుడు. అఘపంకక్షాళన మహతపస్సలిడు అంటే పాపాన్ని శుద్ధి చేసుకునేటందుకు గొప్ప తపశ్శక్తి ఉన్నవాడు. అనాంతకమతి అంటే ఏ అడ్డూ లేనివాడు. ఇవన్నీ ఉదంకుని గూర్చి నన్నయవాడిన ఉపమానాలు. గురుకులంలో గురుశుశ్రూషద్వారా అణిమాది అష్టసిద్ధులను పొందినవాడు ఉదంకుడు. గురుపత్నీ నియోగం వలన పౌష్యరాణి కుండలాలని తేవటానికి ఒక్కరుండ చనినాడు. అతను పన్నిన వృషభగోమయ భక్షణ చేస్తాడని నన్నయ చెపుతారు. వృషభగోమయం అనే పదాన్ని పరిశీలిస్తే వృషభ అన్నపదం ధర్మానికి సంకేతమని, గోమయం అమృతసమానమైందని తెలుస్తోంది. కుండలాలని తేవటానికి వెళ్తున్న ఉదంకునికి ఎదురైన ఈ సంఘటనలు చూస్తే ఎవరో అతన్ని వెనకనుంచి కాపుకాస్తున్నారని తెలుస్తోంది. పన్నిన అన్న పదం దానికి హేతువునిస్తోంది. అంటే ఉదంకుని స్వయంగా గరువుగారే కాపాడుతున్నారన్నమాట. ఈ విధంగా కథ ఎటువంటి అనవసర ప్రసంగాలు లేకుండా మొదలవటం, కథలో ఎన్నో మలుపులురావటం నన్నయ కథాకథన చాతుర్యాన్ని వెల్లడిస్తోంది.

పౌష్యమహారాజుని ఉదంకుడు దండితారాతి అని సంబోధించి తాను గుర్వర్థమర్థినై వచ్చానని చెప్పి అతని భార్య కుండలాలని అడుగుతాడు. శత్రువులని దండించేవాడా అనే ఈ సంబోధన రాజును ఉద్దేశించినదైనా దానిద్వారా ఉదంకుని మనోప్రవృత్తి వెల్లడవుతోంది. రాజు "ఇట్టి మహాత్మునకీ గాంచితి గృతార్థుండనైతినని మనంబున సంతసించి" తన భార్యను అడిగి వాటిని ఇప్పించుకొనమని అంటాడు. నన్నయ రచనలో ప్రతిపదం ఎంతో సందర్భానుసారంగా ప్రయోగించబడుతుంది అని ఇది రుజువు చేస్తోంది. రాణి అంతఃపురంలో ఎక్కడా కనిపించకపోయేసరికి ఉదంకుడు రాజును తిరిగి సందర్శిస్తాడు. నీవు త్రిభువన పావనుడివి, నిన్ను అశుచివని ఎట్లా అంటానని రాజు సమాధానం. ఆమె అశుచులకు కనిపించదు. ఇది నన్నయ సారమతికి ఉదాహరణలు.

వృషభగోమయభక్షణ అనే పాపం తనను వెన్నంటివచ్చిందని ఉదంకుడు గ్రహిస్తాడు. దీన్ని చూస్తే ఉదంకుని వెంటనే ఎవరో వస్తున్నారనే ఊహ చదువరులకు కలుగుతుంది. "పూర్వాభిముఖుండయి శుద్ధోదకంబులం బ్రక్షాళితపాణి పాపం వదనుండయి యాచమించి" తిరిగి పౌష్యరాణి వద్దకు వెళతాడు. ఉదంకుడు అడగకుండానే ఆమె అతనికి నమస్కరించి దివ్యకుండలాలని ఇస్తుంది. ఆమె పరమ పతివ్రత. అందుకే ఉదంకుని కోరికను అతను చెప్పకుండానే గ్రహించింది. తిరిగి తక్షకుడు ఈ కుండలాలని అపేక్షిస్తూ ఉంటాడని వాడు అభేద్యుడు, మాయాదక్షుడు కాబట్టి 'వాని వలన సురక్షితముగజేసి చనుము రవినిభతేజా' అని హెచ్చరిస్తుంది.(4) రాణి మాటలను బట్టి ఉదంకుని తేజస్సు అమోఘమని, అతని తపశ్శక్తిముందు సర్పజాతి నిలబడలేదనే అర్థం వస్తోంది. తక్షకుడు పాతాళలోకవాసి. అక్కడ సూర్యరశ్మి సోకదు. ధ్వన్యాత్మకరచనకి నన్నయ పెట్టింది పేరు.

రాణి హెచ్చరికకు బదులుగా ఉదంకుడు 'అట్లుచేయుదు' అనటం అతని అజాగ్రత్తవైఖరిని వెల్లడిస్తోంది. పౌష్యుడు ఉదంకుని అతిధిగా పిలిచి భోజనం పెడతాడు. అన్నంబు కేశదుష్టంబైన అలిగి రాజుని అంధుడవగునని ఉదంకుడు శాపమిస్తాడు. రాజుకూడా "నల్పదోషంబున నాకు శాపంబిచ్చినవాడవు నీ వనపత్యుండవగు మని" ప్రతిశాపం ఇస్తాడు. ఉదంకుడు రాజుని పాపోపసంహారం చేయమని ప్రార్థిస్తాడు. కానీ ఈ శాపాన్ని మరల్చే శక్తి రాజుకి లేదు. ఉదంకుడు రాజుకిచ్చిన శాపాన్ని ఉపసంహరిస్తాడు. దీనికి కారణం బ్రాహ్మణుడు పలుకులు దారుణంగా పల్కినా నిండుమనంబు నవ్య నవనీత సమానమవటమే. ఈ లక్షణం రాజులందు వ్యతిరేకంగా ఉంటుంది.(5)

గురువుగారి భార్య కోరిక తీర్చే సమయం వచ్చిందని సంతోషిస్తూ ఉదంకుడు "నొక్క జలాశయంబు గని శుచిప్రదేశంబున దనచేతి కుండలంబులు పెట్టి యాచమించు" చుంటాడు. వచ్చినపని అయిందని అతనికి సంతోషము. సమయం కోసం కాచుకొని ఉన్న తక్షకుడు నగ్నవేషధరుండై ఆ కుండలాలని తీసుకొని పారిపోతాడు. ఉదంకుడు "వాని పిరుందన పారి పట్టికొనుడు." వెంటనే దిగంబరవేషం విడిచి మణికుండలాలని విడవక తక్షకుడు భూవివరము ద్వారా పాతాళలోకానికి వెళ్ళిపోతాడు. అణిమాది అష్టసిద్ధులు కలిగిన ఉదంకుడు కూడా అదేమార్గాన పాతాళలోకం ప్రవేశిస్తాడు.(6)

పాతాళలోకం తనకు కొత్త కాబట్టి ఉదంకుడు నాగలోక ముఖ్యులైన అనంతుడు, వాసుకిని, ఐరావతకోటి ఘోరఫణిరాజులని, తక్షకుని పేరుపేరునా ప్రార్థిస్తాడు. ఈ నాగస్తుతి పద్యాలన్నీ నన్నయ కావ్యశక్తికి నిదర్శనాలు. పై పెద్దలందరినీ ఉదంకుడు పేరుపేరునా స్తుతిస్తాడు. ఇది వ్యాజస్తుతి.

బహువన పాదపాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్ర సహస్ర ఫణాళి దాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధిశాయికి పాయకశయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుడనంతుడు మాకు బ్రసన్నుడయ్యెడున్

సంస్కృత భారతంలో నాగస్తుతి తొమ్మిదిశ్లోకాలలో సాగింది. దానిలో అనేక నాగమంత్రరహస్యాలు ఉన్నాయని పండితాభిప్రాయం. నన్నయ నాలుగు పద్యాలలో ఈ లక్ష్యాన్ని సాధించారు. ఈ నాలుగు పద్యాలు 'మాకు ప్రసన్నుడయ్యెడున్' అన్న మకుటంతో సాగినవి. నన్నయగారు ఎన్నో సాహితీ సంప్రదాయాలకు శ్రీకారం పలికారు.[7] మొదటి పద్యం చంపకంతో ప్రారంభించి తర్వాత దాన్ని చంపకంగా రాసి మిగతా రెండు పద్యాలను ఉత్పలంతో ప్రారంభించారు. ఉత్పలంకన్నా చంపకం లఘుగమనంతో ప్రారంభం అవుతుంది కాబట్టి నాగపతులని లాఘవవృత్తితో ముందు స్తుతించి ఆ తర్వాత గౌరవవృత్తిని అందుకొని ఉత్పలమాలలతో నాగస్తుతి పద్యాలు రచించటం జరిగింది.

మూలానికి భిన్నంగా నన్నయ నిర్మించిన 'బహువనపాద....' సమాస ఘటన స్వతంత్ర్యతా రమణీయమైంది. ఈ పద్యంలోని ప్రథమ పాదంలో చాలావరకూ ఒష్ఠ్యములైన వర్గాక్షరములతో పదాలు ప్రారంభమయ్యాయి. ద్వితీయ పాదం ఊష్మాక్షరంతో మొదలవుతోంది. అంటే ఈ పద్యం చదివేటపుడు నాలిక పాములాగా ఎన్నో మెలికలు తిరుగుతోంది. ఉదంకుని స్తుతితో పాములు పడగలు విప్పి ఆడుతున్నట్లుగా నన్నయ అక్షర సంయోజనం చేసాడు. అజస్ర - సహస్ర ఫణాళిదాల్చి అనటంతో విష్ణుమూర్తి కళ్ళముందు సాక్షాత్కరిస్తున్నాడు. జలధిశాయికి - పాయక అనటం అనంతత్వ లక్షణస్ఫూర్తి, అనుప్రాస మహత్వము వల్ల అక్షర రమ్యత కలుగుతోంది. నాగస్తుతి పద్యాలన్నింటిలోనూ ఉన్న శబ్దాక్షరాల నాదధార చూస్తే పాతాళంలో ఐరావతికోటి ఘోరఫణిరాజులు సంగీత పారవశ్యంతో పడగలు విప్పి నాట్యమాడుతున్నట్లుగా తోస్తోంది.

అనంతుడు భూభారాన్ని మోస్తున్నవాడు. బరువు, బాధ్యతలు తెల్సినవాడు కనుక గురుపత్నికి కుండలాలని ఇచ్చే తన బాధ్యత విషయంలో సహాయం చేయమని ఉదంకుడు ఔచిత్యవంతంగా ప్రార్థించటం ఉచితంగా ఉంది. వాసుకి తన సర్పకులాన్ని అరిది తపో విభూతి నమరారుల బాధలు పొందకుండగా నురగల నెల్లగాచిన మహోరగ నాయకుడు. అంటే నీ నాయకత్వంలో తక్షకుడు నాకుచేసిన క్షోభను చూడమని ఉదంకుని ప్రార్థన, నీ నాయకత్వం, నువ్వు అనే ఈసడింపూ కనిపిస్తోంది. దేవ మనుష్య లోకమున ద్రిమ్మరుచున్.... అని ఐరావత కోటిఘోరఫణిరాజులను ఉద్దేశించి ఉదంకుడు అంటాడు. ఇది వారిని తిరుగుబోతులని అనటమే. మహానుభావులు అనే పదం కూడా నిందార్థంలోనే ఉపయోగించబడింది.

ఉదంకుడు తక్షకుని ప్రార్థించే విధానం నన్నయ లోకజ్ఞతని సూచిస్తోంది. 'గోత్రమహామహీధర నికుంజములన్ విపినంబులన్' అనటం తిరుగుబోతు అనటం. 'ప్రకామగతి ఖేలన నొప్పి' అంటే దొంగ అని నిందించటం. ధాత్రి బరిభ్రమించు అంటూ తక్షకుని ఉన్నచోట ఉండకుండా ఇతరుల సొమ్ము దొంగిలించాలనే ఆలోచనలతోనే ఉంటావని ఆక్షేపిస్తున్నాడు. సహాశ్వసేనుడై అంటే తనే కాక కొడుకు కూడా బుద్ధిలేని వాడని కొడుకుని కూడా తనలాగా చెడగొడుతున్నాడని వ్యంగ్యంగా అనటం. తక్షకుని పరాక్రమదక్షుడు, శూరుడు అని స్తుతించి అతన్ని ఉదంకుడు ఎద్దేవా చేస్తున్నాడు.

నాగస్తుతికి ఎవరూ ప్రసన్నులు అవలేదు. ఉదంకుడు పాతాళలోకంలో 'సితాసితతంతు సంతానపటంబు ననువయించుచున్న'... వారిని, ఒక మహాపురుషుని చూసి విపులార్థవంతములైన మంత్రంబుల అతి భక్తియుక్తుండై స్తుతించడాన్ని అంతకు ముందు నాగస్తుతిలో మాకు బ్రసన్నుడయ్యెదున్ అనటాన్ని కలిపి పరిశీలించాలి. ఉదంకుని మితవచనానికి, యదార్థస్తుతులకు దివ్యపురుషుడు సంతోషించి "నీకు నభివాంఛిత మెయ్యది దాని జెపుము" అని అన్నాడని నన్నయ కథనం. కుండలాలని మాత్రమే కోరుకోడు ఉదంకుడు. 'యిన్నాగకులం బెల్ల నాకు వశంబగు నట్లులననుగ్రహింపమని' కోరతాడు. దీన్నిబట్టి అతని స్వభావం తెలుస్తోంది. దివ్యపురుషుడు చెప్పిన ప్రకారం ఉదంకుడు అశ్వ కర్ణరంధ్రా ధ్మానంబు చేస్తాడు.[8] దీంతో పాతాళలోకంలోని సర్పకులం తల్లడిల్లేవిధంగా 'పాతాళైక నికేతనాంతరమునం బర్వెందదశ్వాఖిల స్రోతోమార్గ వినిర్గతోగ్ర దహనార్చుల్...' కల్పాంతంలోని బాడబానలంవల్ల పన్నగవ్రాతములు భీతిల్లుతాయి.

ఉదంకుడు శంకరనిభుండగు విప్రుడు. అతని భయంకరకోపాగ్ని బాడబాగ్నివంటిది. బాడబుని వల్ల అది పుట్టింది. కాబట్టి బాడబాగ్ని[9]. ఈ అగ్ని అశ్వముఖాకారం కలిగి ఉంటుంది. ఉదంకుడు గుర్రం చెవిలో ఊదటంతో ఇది ఏర్పడింది. చెవిలో ఊదటం అంటే రహస్యం చెప్పటం. జాతాతంకుడయి తక్షకుడు కుండలాలని స్వయంగావచ్చి ఉదంకుడుకి అందిస్తాడు. నాగలోకాన్ని మహాక్షోభంబు చేసి కుండలాలని పొందినా కాలాతీతమవకుండా ఇల్లు చేరటం ఎలానా అని ఉదంకుడు మధనపడుతుంటాడు. తిరిగి ఆ దివ్యపురుషుడు "నీ హయంబు నెక్కియేగుము యిది వడిగలదు మనసుకంటె గాడ్పుకంటె" అని చెపుతాడు. ఉదంకుడు ఆ విధంగాచేసి గురుపత్నికి తాను తెచ్చిన కుండలాలని అందించి గురువుగారి కార్యం నిర్వహిస్తాడు.

కొన్ని రోజుల తర్వాత పైల మహాముని తన శిష్యుని ఆక్షేపిస్తాడు. ఏమీ ఎరుగనివాడివలె "ఈ యున్న పౌష్యుప్రోలికి బోయి కదుంబెద్దదవ్వు పోయిన యట్లత్యాయత విమల తపోమహిమా" అని ప్రశ్నిస్తాడు. ఈ సంబోధనద్వారా నీ తపశ్శక్తిని ఏం చేసావని గురువుగారు అడిగినట్లుగా తెలుస్తోంది. ఇన్ని దివసములేల మసలితి చెపుమా[10] అనటం గురువుగారి ఊహాశక్తిని సూచిస్తోంది. దీనికి వినయంగా "మీ యానతిచ్చినట్లు మసలవలదు" అని ఉదంకుడు సమాధానమిస్తాడు. ఒక్కరుండ అడవిలో బయలుదేరి నప్పటినుంచి జరిగిందంతా పూసగుచ్చినట్లు గురువుగారికి చెప్పి 'నిది యంతయు నేమి నా కెరింగింపు' మని ప్రార్థిస్తాడు.

1) *అప్పురుషుం డింద్రు దయ్యుక్ష మైరావతంబు గోమయ మమృతంబు నాగ భువనంబులో గన్న పొలతులిద్దరు ధాతయును విధాతయు వారి యనునయించు సితకృష్ణతంతు రాజితతంత్ర మది మహోరాత్రంబు ద్వాదశారములు గలుగు చక్రంబు మాసాత్మ సంవత్సరంబు కుమారుల య్యార్వురు మరియు ఋతువు.*

2) *లత్తురంగ మగ్ని యప్పురుషుండు పర్జన్యుడింద్ర సఖుడు సన్మునీంద్ర యాది నింద్రుగాంచి యమృతాశివగుట నీ కభిమతార్థసిద్ధి యయ్యెనయ్య.*

పై విధంగా గురువుగారి వివరణ. ఇది చూస్తే తన శిష్యుని శక్తిసామర్థ్యాలని పరీక్షించాలని పంపించి అతని క్షేమంపట్ల ఆదుర్దాతో వెనకనుంచి రక్షణఏర్పాట్లు చేసాడని తెలుస్తోంది. ఆయా ఆపదలలో ఉదంకుడు కేవలం స్వయంశక్తి వల్లే కాకుండా గురువుగారి సహాయంవల్లనే జయించాడు.

ఉదంకుని కార్యసాధనాతత్వం వల్ల పరమ సంప్రీత హృదయుండయి గురువుగారు అతన్ని 'గుర్వర్థంబునందు ఋణ విముక్తుండవయితివి నిజేచ్ఛనుండుమని' దీవిస్తాడు. చాలాకాలం తపస్సు చేసినా ఉదంకునిలో తక్షకునిపై ప్రతీకారవాంఛ పోలేదు. గతంలో గురువుగారు 'అరిసూదన' అని ఉదంకుని సంభోదించారు. అంటే శత్రువులను సంహరించమని స్వయంగా గురువే ప్రేరేపించినట్లు తెలుస్తోంది. కొన్ని రోజుల తర్వాత తక్షకుడు చేసిన అపకారానికి ప్రతీకారం చేయాలని చెప్పి ఉదంకుడు జనమేజయుని వద్దకు వెళతాడు.

'మితహిత సత్యవాక్య జనమేజయ భూజనవంద్య' అని అతన్ని సంబోధిస్తాడు. తాను గురుకార్యంమీద వెళ్ళగా వంచనోన్నతమతియై తక్షకుడు అకారణంగా అపకారం చేసాడని చెపుతాడు. దీని కారణంగా తక్షకుని స్వభావం కుటిలమైంది చూడండని అంటాడు. వాడు వివేకశూన్యుడని చెపుతాడు. ప్రజల కష్టాన్ని రాజు తీర్చాలి కాబట్టి తనకు సహాయం చేయమని ఉదంకుని ప్రార్థన.

'కాదన కిట్టిపాటి యపకారము దక్షకుడేక విప్ర సంబోధనజేసి చేసె నృపపుంగవ' అని రాజుని తక్షకునిపై ప్రతీకారం తీర్చుకోవటానికి 'భూసురాపాదిత సర్పయాగం' చేయమని చెపుతాడు. తనకే కాదు పరీక్షిత్తు మహారాజుని చంపి రాజుకి కూడా అన్యాయం చేసాడని వివరించి అతనిలో ప్రతీకారవాంఛ రేకెత్తిస్తాడు. బ్రాహ్మణ శాపం అనే నెపంతో తక్షకుడు "అసహ్య విషోగ్ర ధూమకేతన హతి చేసాడని' అదే నెపాన రాజు బ్రాహ్మణులతో సర్పయాగం చేయటం అధర్మం కాదని అంటాడు. అసలు ఒకడు చేసిన తప్పుకి కులం నాశనం అవటం అపూర్వ విషయమేమీ కాదు.

ప్రల్లదుడైన యొక్క కులపాంసనుచేసిన దాన తత్కులం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము గావునన్ మహీ
వల్లభ తక్షకాథము నెపంబున సర్పములెల్ల నగ్నిలో
ద్రెళ్లగ సర్పయాగ మతి ధీయుత చేయుము విప్రసన్నిధిన్

ఈ విధంగా భారతభావికథ సర్వమూ ఉన్మీలనం (evolve) అయ్యేటట్లుగా నన్నయ ఈ ఉపాఖ్యానాన్ని రచించారు. దుర్యోధనుడు ప్రల్లదుడైన యొక్క కులపాంసనుడే.(11) వాని వలన కౌరవకుల నాశనం జరిగింది. అదే కథ మళ్ళీ జరుగుతోంది. తప్పదు మరి!

కథాకథన విషయంలో నన్నయగారి సామర్థ్యం ఇక్కడ ప్రతిఫలించింది. ఈ ఉపాఖ్యానంలో పాత్రలు తక్కువగా ఉన్నాయి. ప్రారంభంలోనే పాత్రల స్వభావాలు తెలుస్తాయి. పాత్ర చిత్రణ అద్భుతంగా జరిగింది. ఉదంకుని వాక్చాతుర్యం, కార్యదక్షత,

కార్యసాధనానుకూల ప్రవర్తన, సమయానుకూలమైన మాటలు మనల్ని ఆకర్షిస్తాయి. దృశ్యకావ్యాల్లోని చాలా లక్షణాలు ఈ కథలో కన్పిస్తాయి.

ఒక్కరుండచని అని కథా ప్రారంభంలోనే ఉదంకుని పాత్రని ప్రవేశపెట్టిన తీరు అద్భుతం. దివ్య పురుషుని చూసి అతను తినమని అనకపోయినా వృషభగోమయ భక్షణం చేయటం ఉదంకుని సాహసప్రవృత్తిని వివరిస్తోంది. దీనివల్ల మనకు కథపై ఆసక్తి వినాలనే, అనురక్తి అధికమవుతున్నాయి. పౌష్యరాణి కనిపించి మాయమవటం, తక్షకుడు కుండలాలని దొంగిలించటం, నాగలోకంలోని దృశ్యాలు, బాడబానలం పుట్టి సర్పకులం క్షోభించటం, దివ్యపురుషుని ఆశీర్వాదంతో గుర్రం ఎక్కి ఇల్లుచేరటం ఇవన్నీ కథలోని చక్కని దృశ్యాలు. నాగస్తుతి పద్యాల్లో వాచికాభినయనం కనిపిస్తోంది.

నాటకీయతని పాత్రచిత్రణ, మనోగత భావాల వర్ణన, ఆంగికవాచకాది అభినయాల ద్వారా నన్నయ సాధించారు. జనమేజయుని ముందు ఉదంకుడు మాట్లాడిన మాటలు కూడా నాటకీయగమనానికి (Dramatic Movement) సంబంధించినదే.

కాదనకిట్టి పాటి యపకారము.... అనే పద్యం రెండుసార్లు నన్నయ భారతంలో వచ్చింది. ఇది ఒక శిల్పరహస్యం.

ఉదంకుడు బ్రాహ్మణుడైనా తనకు విరుద్ధమైన స్వభావం కలవాడు. తనకు జరిగిన అపకారానికి సర్పకుల ప్రళయానికి కారణమైన వ్యక్తి. భారత కథలో ధర్మరాజాదులు కూడా క్షత్రియులైనా ధర్మం తప్పనివారు. ఇతరులకి నిష్కారణంగా అపకారం చేయని శాంతస్వభావులు. పాండవులు తపశ్శక్తితో దివ్యాస్త్రాలు సంపాదించినవారు. శ్రీకృష్ణుని కరుణాకటాక్షాలతో రాజసూయం చేసి, మయసభలో ఇంద్రభోగాలని ధిక్కరించేటట్లు జీవిస్తుంటారు. వీరి సంపదలని, రాజ్యాన్ని, అపేక్షిస్తూ వంచనతోనే మాయాజూదంలో దుర్యోధనుడు వారి సంపదలని అపహరిస్తాడు. ఉదంకుడు కూడా గురుదయవల్ల అణిమాది అష్టసిద్ధులను పొందినవాడు. ఇతనికి ప్రతిదశలోనూ పౌష్యుని అండదండలు అందాయి. గురువుగారికోసం తెస్తున్న కుండలాలని తక్షకుడు అసూయతోనే అపహరించాడు.

ఉదంకుడు ప్రార్థించినా నాగలోకంలోని పెద్దలు ఎవరూ అతనికి కుండలాలని ఇప్పించరు. కౌరవులవల్ల ఎన్నో బాధలు పడి పాండవులు వారిరాజ్యాన్ని వారికివ్వమని ప్రార్థించినా భీష్మాది ధృతరాష్ట్రులు ఆ విధంగా చేయమని చెప్పినా దుర్యోధనుడు వినలేదు. ధృతరాష్ట్రుడు పితృప్రేమతో గాఢాంధుడయ్యాడు. అగ్నిసహాయంతో, దేవేంద్రుని కరుణ వలన కుండలాలు ఉదంకునికి చేరాయి. విదురుని వంటి పెద్దలు చెప్పటంవల్లనే పాండవులు చివరకు అర్ధరాజ్యం పొందారు.

ఉదంకుడు సర్ప కుల నాశనానికి సిద్ధపడతాడు. పాండవులు యుద్ధానికి కృతనిశ్చయులయ్యారు. ఉదంకుడు జనమేజయుని ద్వారా కార్యం సాధించాలనుకున్నాడు. పాండవులు దృష్టద్యుమ్నుని సహాయంతో ఇతర రాజులని కలుపుకొని యుద్ధం చేసారు. అయితే, వారు క్షత్రియులు, ఉదంకుడు బ్రాహ్మణుడు.

తక్షకుడు ఏదో నెపంమీద కుండలాలని అపహరించాడని భావించలేము.

మయసభలో అవమానం జరిగిందన్న నెపంపెట్టి దుర్యోధనుడు వారిని అడవుల పాల్జేశాడు. ఇద్దరూ ఈ రెండు కుంటిసాకులే. రెంటికీ కారణం అసూయే. అటు తక్షకుడు ఇటు దుర్యోధనుడు వంచనోన్మతులే. ఈ విషయాలని వివరించటానికే నన్నయగారు ఉదంకుని ద్వారా జనమేజయునితో బ్రాహ్మణ నెపమున తక్షకుడు పరీక్షిత్తుని చంపాడని అదే నెపంతో ఇప్పుడు జనమేజయుని సర్పయాగం చేయవచ్చని చెప్పినట్లు చిత్రించారు. యుద్ధరంగంలో కర్ణునిపై బాణప్రయోగానికి అర్జునునికి సందేహం. దుర్యోధనుని చంపటం ధర్మవిరుద్ధమేమోనని అనుమానం. కృష్ణుడు అధర్మపరులతో ధర్మయుద్ధం చేయటం వీలుపడదని వివరించాడు. ఉదంకుని మూలంగా సర్ప కుల నాశనం, పాండవుల మూలంగా దుర్యోధనాది కౌరవుల సర్వనాశనం. ఈ విధంగా భారత భావికథ సర్వమూ దీనిలో ప్రతిబింబిస్తోంది.

నన్నయగారు సృష్టికార్యక్రమాన్ని లీలామానుషుడైన భగవానుడు నిర్వహించిన విధానాన్ని అద్భుత విధానంతో వివరించారు. మహాభారత కథను మొత్తం చదవాలనే ఆసక్తిని కలిగించేలా శిల్పి నన్నయ తన కథను తీర్చిదిద్దారు. ఉత్తమ కథకు ఏయే లక్షణాలు ఉండాలో ఈ ఉపాఖ్యానం ద్వారా మనకు అర్థమవుతోంది. 'సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తి' అన్న మాటలు రుజువవుతున్నాయి.

నన్నయగారు చాలా పుణ్యాత్ముడు. అతని జీవితం అందరికీ ఆదర్శం. వారి కథలు నీతి ప్రబోధకాలు.

## వివరణలు:

1. నన్నయ కథపట్ల తన అభిప్రాయాన్ని భారత కథాప్రస్తావన సందర్భంగా వివరించారు. ఇది అగ్నిపురాణంలోని వివరణను పోలి ఉంది.

   "ఏయది హృద్య మపూర్వం
   బేయది యెద్దాని వినిన నెరుక సమగ్రం
   బైయుండు నఘనిబర్హణ
   మేయది యక్కథయ వినగ నిష్టము మాకున్"

2. దండ్యాచార్యుడు 'అపదా: పదసంతానో గద్యమాఖ్యాయకా కథా
   ఇతి తస్య ప్రభేదౌ ద్వౌతయోరాఖ్యాయికా కిల" అని చెప్పారు.
   అందుకే ఆచార్యదండి 'ఆఖ్యాయికా', 'కథలకు' మధ్య భేదాన్ని అంతగా పరిగణించలేదనే చెప్పవచ్చు.

3. డా॥ యశోదారెడ్డిగారు "భావస్థిరత" అనే గుణం రచయిత భావగతికి సంబంధించినది అంటే ఏకాగ్రియమైన బుద్ధితో ఆలోచించినప్పుడు సమకూరే స్థిరత అని భావించుకోవచ్చని అంటారు. ఈ లక్షణం కథానికకు ఎంతో ముఖ్యమైన గుణం.

4. కుండలాలని అపేక్షిస్తూ ఉన్నవాడు (కుండలి) తక్షకుడు. వాడు జిత్తులమారి. కార్యసాధనానందంలో పౌష్యరాణి హెచ్చరికను ఉదంకుడు మర్చిపోయాడు.

5. నిండుమనంబు పద్యాన్ని తిక్కన చాలా గొప్పదిగా కీర్తించాడు. ఈ పద్యం ద్వారా నన్నయ బ్రాహ్మణ, క్షత్రియ గుణాల తారతమ్యాన్ని వివరించాడు. "విశేషణ పాపేభ్యః ఆత్మానం పరం చ పాతీతి విప్రః" అంటే తనను పరులని విశేషంగా పాపం నుంచి రక్షించువాడు విప్రుడు.

6. వ్యాసుని కథనంలో "అథ ఉదంకః తస్యాః క్షత్రియాయాః వచః స్మృత్వా త్వం తక్షక మన్వ గచ్ఛత్॥ సతద్బిలం దండకాష్ఠేన చఖాన, సచా శకత్ తంక్లిశ్యమాన మింద్రోన్ పశ్యత్, స వ్రజం ప్రేషయామాస, గచ్ఛ అద్య బ్రాహ్మణాస్య సాహాయ్యం కురుష్వ ఇతి.... అథ వజ్రం దంఢకాష్ఠమను ప్ర విశ్య తద్బిల మదారమత్..." అని ఉంది. పౌష్యరాణి హెచ్చరిక, ఉదంకుడు కర్రతో తవ్వటం, ఇంద్రుడు వజ్రశక్తిని దండకాష్టాన ప్రవేశపెట్టటం ఇవన్నీ వ్యాస భారతంలో ఉన్నాయి.

7. శ్రీకారంతో గ్రంథ ప్రారంభం, ప్రతి అధ్యాయానికి శ్రీకారం చుట్టటం, మకుటంతో శతకాన్ని రచించటం, దండకరచన, చక్కని గద్య రచనలాంటి వివిధ సంప్రదాయాలను నన్నయ ప్రారంభించారు.

8. మూలంలో ఉదంకునితో అశ్వం అపానమార్గంలో ఊదమని చెప్పినట్లుగా ఉంది. ఇది పైపైన చూస్తే యోగవిద్యారహస్యాన్ని అంటే కుండలినిని ప్రేరేపించే ప్రక్రియను వివరిస్తోంది. దీన్ని నన్నయ అనుచితంగా ఉందనే భావించి ఉండవచ్చు. అందుకే పరిహరించాడు.

9. ఆదిపర్వము సప్తమాశ్వాసములో "అనిన నౌరుండు పితృదేవతా దేశంబున దన కోపానలంబు సముద్రంలో వైచిన నది యౌర్వానలంబు నా నశ్వముఖంబున నబ్ధిజలంబులు ద్రావుచుండు నిది వేదంబుల యందు వినంబడియెడు కథ".... అని నన్నయగారు రచించారు.

10. మూలంలో 'అనాగతోన్ సి యది ముహూర్తం మయాశప్తో భవిష్యసి' అని ఉంది. సమయానికి రాకున్నచో నేను నిన్ను శపించేవాడినని పైల మహాముని ఉదంకునితో అన్నారు. దీన్ని నన్నయ మార్చి 'మసలు' అన్న క్రియద్వారా ఎంతో విశిష్టార్థం సాధించారు. కుండలాలని తెచ్చినప్పటి నుంచీ శిష్యుని మొహంలో ఏదో సలసలకాగుతున్న భావనని (క్రోధాగ్ని) గురువుగారు పసిగట్టారు.

11. భారతంలోని ఆదిపర్వం - పంచమాశ్వాసంతో' ఆ దుర్యోధనుదుద్భవిల్లుదు నుగ్ర వ్యాదారవంబున్...' అని అంటే అతని జన్మకాలంలో ఎన్నో దుశ్శకునాలు, ఉత్పాతాలు ఏర్పడ్డాయని ఉంది. అదే ఆశ్వాసంలో పురోహిత ప్రముఖ బ్రాహ్మణవరులు ధృతరాష్ట్రునితో ఈ విధంగా అన్నారని ఉంది-

మన దుర్యోధనుజన్మంబున బెక్కులు
దుర్నిమిత్తములు పుట్టె జగజ్జన
సంక్షయ జననుండ గునని
పలికెదరె ఋక గల మహాత్ములు వానిన్.

# 3. నన్నయ - భృగువంశకీర్తన - కథాశిల్ప విశిష్టతలు

భృగువంశకీర్తన నన్నయ రచించిన ఉత్తమ కథలలో ఒకటి. ఈ కథలో పెద్దగా అలంకారాలు లేవు. నిరాడంబరమైన ఈ కథ నన్నయగారి నిరాడంబరతను సూచిస్తోంది. కథా రచనలో కేవలం శబ్దాన్ని ఉపయోగించుకొని ఇంత నేర్పుగా కథను నడిపించటం నన్నయ చాకచక్యాన్ని వెల్లడిస్తుంది. తన రెండవ కథలో నన్నయగారు పరిపూర్ణత్వం సాధించాలని ప్రయత్నించారు. భారతకథా శ్రవణానికి అనుకూలమైన వాతావరణాన్ని భృగువంశకీర్తనలో నన్నయ సృష్టించారు. దీనిలో శాంతరసం చాలా చక్కగా పోషించబడింది.[1] ఈ శాంతరసం పాఠకుల మనస్సులోని కల్మషాన్ని కడిగివేసి వారిని నిర్మల మనస్కులుగా చేస్తుంది. దీనివల్ల భారత కథలోని ప్రధాన విషయమైన కృష్ణతత్వాన్ని, అది బోధించే నీతిని పాఠకులు గ్రహించగలుగుతారు.

విమర్శకుల అభిప్రాయంలో భృగువంశ కీర్తనంలోని రెండు భాగాలు మంచి సౌష్ఠవానికి ఉదాహరణలు. ఈ కథలోని మొదటి భాగంలో అగ్ని సర్వభక్షకుడు అయిన పరిస్థితులను వివరించి రెండవభాగంలో ఆస్తీకుని చరిత్రని వర్ణించటం వల్ల ఈ సౌష్ఠవం ఏర్పడింది. ఈ రెండు భాగాల కథ తిరిగి మొదటి కథ ఉదంకోపాఖ్యానంతో ముడిపడి ఉంది. వీటివల్ల భావికథ గురించిన ఛాయా మాత్ర అవగాహన, ఆ కథ వినాలని లేదా చదవాలని పాఠకులకు తప్పక అనిపిస్తుంది.

భృగువంశకీర్తనం "అని యిట్లయ్యుదంకుండు జనమేజయునకు సర్పయాగ బుద్ధి పుట్టించెననిన విని శౌనకాది మహామునులక్కథకున కిట్లనిరి"[2] అని ఒక చక్కని వచనంతో ప్రారంభమవుతుంది. ఇది ఉత్కంఠని రేకెత్తించే విధానంలో ఉంది. వెంటనే భయంకరమైన విషాగ్నియు నప్రతిహన్యమాన వీర్యము గల ఆ సర్పాలకు జనమేజయుని సర్పయాగంలో పడి నాశనమయ్యే పరిస్థితి ఏ విధంగా ఏర్పడింది అన్న ప్రశ్నవినిపించింది. దానికి ఆ కథకుడు సర్ప కుల జనని కద్రువ శాపకారణంగా సర్పాలకు సర్పయాగంలో నశించే ఉపద్రవం వస్తుందని; దాన్ని భృగు వంశానికి చెందిన రురుని సర్పఘాతాన్ని సహస్రపాదుడు ఉడిగించినట్లు, జరత్కారుని కొడుకైన ఆస్తీకుడు ఉడిగించాడని మొత్తం కథని క్లుప్తంగా చెప్పారు. మొత్తం కథాసారాంశాన్ని ముందే ఈ విధంగా చెప్పటం అంటే కథ వినాలన్న ఆసక్తి, అనురక్తి తగ్గిపోవటమే. అయినా భృగువంశకీర్తనాన్ని వినాలనే అందరికీ ఉంటుంది. కథ వింటే కానీ దీనికి కారణాలు తెలీవు.

భృగుడు ఒక బ్రాహ్మణుడు. అతని భార్య పులోమ గర్భవతి. అతను భార్యతో 'అగ్నిహోత్రానికి అగ్నులు విహరింపుమని పంచి అభిషేచనార్థం' వెళతాడు. ఇంతలో పులోముడనే వింత రాక్షసుడు అగ్నిహోత్రగృహానికి వచ్చి పులోమని చూసి ఉన్మత్తుడై ఆమె ఎవరో చెప్పమని అగ్నిని అడుగుతాడు. అగ్నిదేవుడు అబద్ధం వల్ల వచ్చే పాపాన్ని విప్రుడైన భృగుమహర్షి శాపాన్ని రెంటినీ తల్చుకొని భయపడతాడు. శాపభయాన్ని తీర్చుకొనగబోలు కానీ అనృతాభిభాషణమునైన పాపభయము దీర్పరాదు అని భావిస్తాడు. దీనిద్వారా నన్నయగారు సత్యవాక్య ప్రభావాన్ని వివరిస్తున్నారు. నిత్యసత్యవచనుడనని స్వయంగా చెప్పుకున్నారు కదా!

అగ్నిదేవుడు చివరకు రాక్షసునికి పులోమ పరమపతివ్రత అనీ, భృగుపత్ని అనీ ఉన్న విషయాన్ని వివరిస్తాడు. పులోముడు విచారించి పులోమ తనకు మొదట వరియింపబడిన భార్య 'పదంపడి భృగుండు పెండ్లి యయ్యెనని' గ్రహిస్తాడు. వెంటనే వరాహరూపం ధరించి ఆ సాధ్విని అతి సాధ్వస చిత్తను ఎత్తుకొని పోబోతుంటాడు. వెంటనే ఆమె గర్భంలోని అర్భకుండు గరం బలిగి కుక్షిచ్యుతుండైన చ్యవనుడు బయటపడతాడు. సహస్ర సూర్య సమాన తేజస్సున్న చ్యవనుడు రాక్షసుని తన కోపాగ్నిలో దహించివేస్తాడు. పులోమ కొడుకు నెత్తుకొని నిజాశ్రమంబునకు వస్తుంది. అయితే అంతుకుముందు ఆ రాక్షసుడు ఆమెను ఎత్తుకొని వెళుతుండగా 'ఆ రక్కసునకు వెరచి యక్కోమలి యేడ్చుచుంబోయిన దద్బాష్పధారా ప్రవాహంబు' తదాశ్రమ సమీపానికి పారుతుంది. దీనికి లోక పితామహుడు వధూసర అని పేరుపెడతాడు.

స్నానం చేసివచ్చిన భృగుడు 'బాలార్కుందునుంబోని బాలకు నెత్తుకొని యున్న నిజపత్నిని' చూస్తాడు. ఆ రాక్షసుడు చేసిన అపకారానికి అలిగి భార్యను ఆ రాక్షసుడు నిన్ను ఎలా ఎరిగాడని ప్రశ్నిస్తాడు. ఆమె అగ్నిదేవుడు చెప్పగా రాక్షసుడు గుర్తించి ఎత్తుకొని పోయాడని వివరిస్తుంది.

జరిగిన వృత్తాంతమంతా విన్న మునీంద్రుడు అగ్నికి అతి క్రూరుడవు, సర్వ భక్షకుడవు అవమని అతి రోషమున శాపమిస్తాడు. తనకు తెలిసిన యదార్థాన్ని చెప్పమని అడిగినప్పుడు చెప్పనివాడు ఘోర నరకపంకాన పడతాడని అగ్నిదేవుడు ధర్మం వివరిస్తాడు. తనకు శాపం ఇచ్చినా భృగుమహామునికి ప్రతిశాపంబీనోపనివాడు అగ్నిదేవుడు. దానికి కారణం-

అడిగిన దిట్టినన్ మఱి మహాపరుషంబులు పల్కి యల్కతో
బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గు సేసినం
జెడు నిహముం బరంబునిది సిద్ధముగావు టెఱింగి భక్తి నె
ప్పుడు ధరణీసురోత్తముల బూజల దన్పుదు నల్గ నోడుదున్

భృగుడు బ్రాహ్మణుడు కాబట్టి ఏమి చేసినా చెల్లుతుందని కానీ తనకు శాపమివ్వటం వల్ల లోకాలన్నింటికి కీడు చేసినట్లు వుందని అగ్నిదేవుడు అంటాడు. అగ్నిలో వేల్చిన హవిస్సుని దేవపితృగణాలు ఉపయోగిస్తుంటారు కాబట్టి అగ్ని కౄరుడు,

సర్వభక్షకుడు అయితే క్రియానివృత్తి అయ్యి చివరకు లోకయాత్ర లేకుండా ఉంటుందని తెలుస్తుంది. అగ్నిభట్టారకుడు నిఖిలలోక వ్యాప్తంబైన తన తేజోమూర్తిని ఉపసంహరిస్తాడు. దీంతో త్రేతాగ్నులు, అగ్నిహోత్రాలు, దేవతార్చనలు, పితృకార్యాలు అన్నీ విచ్ఛిన్నమవుతాయి. జనులంతా సంభ్రమాక్రాంతులై మహామునుల దగ్గరకు వెళతారు. అందరూ కలిసి బ్రహ్మదేవుని వద్దకు వెళతారు.

బ్రహ్మ భృగు శాపాన్ని తెల్సుకొని అగ్నిని ఊరడిస్తాడు. ఆ మహాముని వచనం అమోఘం. అగ్ని సర్వభక్షకుడైనా శుచులలో అత్యంత శుచుడై, పాత్రులలో పరమపాత్రుడై, పూజ్యుల్లో అగ్రపూజ్యుడై భువనంబుల నడుపుతాడని అగ్నిని బ్రహ్మదేవుడు ఊరడిస్తాడు. భృగువచనాన్ని బ్రహ్మ ప్రతిష్ఠాపించాడు.

భృగువంశానికి మూలపురుషుడైన భృగు మహామునికి తీవ్రమైన కోపం ఉందని తెలుస్తోంది.[3] కుండలాలు తిరిగి పొందినా, నాగలోకంబెల్ల క్షోభ గావించినా భృగు వంశానికి చెందిన ఉదంకుని కోపం తగ్గలేదు. భార్య కొడుకుతో తిరిగి వచ్చినా, రాక్షసుడు చ్యవనుని కోపాగ్నిలో దగ్ధమైనా భృగునికి కోపం చల్లారలేదు. అగ్నికి శాపమిచ్చాడు. అంటే భృగు వంశంలోని తర్వాత తరాల వారికి కూడా ఈ లక్షణాలు సంక్రమిస్తాయని ఉంటాయని తెలుస్తోంది.

చ్యవనుడికి సుకన్యకు పుత్రుడు జన్మిస్తాడు. అతని పేరు ప్రమతి. ఈ ప్రమతికి అమృతోద్భవయగు ఘృతాచికి భార్గవ ముఖ్యుడైన రురుడు జన్మిస్తాడు. ఈ రురుని వల్ల సర్పజాతికి మళ్ళీ ఉపద్రవం ఏర్పడుతుంది. రురుడు ప్రమద్వర అనే స్త్రీని వివాహమాడ నిశ్చయిస్తాడు. ప్రమద్వర అంటే యవ్వనమదంతో త్రుళ్ళిపడేది అని అర్థం. ఆమె విశ్వావసుండనే గంధర్వ రాజునకు మేనకకు జన్మించింది.

నన్నయ పులోముని వృత్తాంతాన్ని దృశ్యకావ్యాల పరంగా చూస్తే ఎన్నో విశేషాలు కన్పిస్తాయి. ఈ వృత్తాంతంలో భృగు మహర్షి స్నానానికి వెళితే రాక్షసుడు రావటం ప్రారంభం. అగ్నిదేవునికి, రాక్షసునికి మధ్య జరిగిన సంభాషణ అంతా సంవాదం అవుతుంది. బ్రహ్మదేవుడు వచ్చి అగ్నిని ఊరడించటం, వరాలు ప్రసాదించటం కూడా సంవాదరూపంలో ఉంది. రాక్షసుడు పులోమను ఎత్తుకొని పోవటం, కుక్షిచ్యుతుడై చ్యవనుడు బయటకి రావటం, చ్యవనుని కోపాగ్నిలో ఆ రాక్షసుడు భస్మంకావటం ఇవన్నీ కథలోని వివిధ సంఘటనలు. పులోమ శోకించగా పెద్ద జలధార ఏర్పడటం అనేది ఈ ఉపాఖ్యానంలోని ఒక అద్భుతదృశ్యం. చదువుతున్నప్పుడు ఇది కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది. ఇది నన్నయ కథారచనా చమత్కారానికి మంచి ఉదాహరణ.

భృగువంశకీర్తన ప్రథమభాగం అనేక విషయాల్లో ఉదంకోపాఖ్యానంలోని ఇతివృత్తాన్ని పోలి ఉంటుంది. అయితే ఉదంకోపాఖ్యానంలో భారత భావికథ సర్వం సూచింపబడింది. సర్ప కుల నాశనం విధికృతమని గతంలోనే స్పష్టమైంది. భృగువంశ కీర్తనలో కూడా ఇదే విధంగా భావికథ సూచితం. పులోముడు భృగు భార్యని అవమానించాడు. ఫలితం వాని నాశనం. భారత కథలో కూడా ద్రౌపదిని అవమానించిన పాపానికి ఫలితాన్ని దుర్యోధనాదులు అనుభవించారు. ఈ విధంగా భృగువంశకీర్తనలో కేవలం విధికృతం వల్లే ప్రల్లదుడైన కులపాంసను... రీతిలో

దుర్యోధనాదుల నాశనాన్ని సమర్థించకుండా నన్నయ - వారు చేసిన పాపాలే వారి నాశనానికి దారితీసాయనే విషయాన్ని సూచించారు.[4]

రురుని భార్య ప్రమద్వర కన్నెలతో ఆటలాడుతూ ఉండగా పాదమర్దితమై ఒక పన్నగము కరిచిందని నన్నయ కథనం. పన్నగము కాళ్ళులేనిది. పాదాలు ఉన్న జీవి తనను తొక్కిందని అక్కసుతో ఆ భుజంగం ప్రమద్వరని కరిచింది. పాదమర్దితమై అన్న పదం ఈ విశిష్టార్థాన్ని ఇస్తోంది. ఈ కథాంశం కూడా భారత భావి కథను సూచిస్తోంది. దుర్యోధనుడికి అభిమానం మెండు. పాండవులు మయసభలో మహాభోగాలతో జీవిస్తున్నారు. వారి సంపద, భోగాలు కౌరవులకి మహాకంటకంగా ఉన్నాయి. ఆ సంపదలు తమకు లేవని, వాటి కారణంగానే వారు తమని హీనంగా చూస్తున్నారని దుర్యోధనుడి అభిప్రాయం. మయసభా ఘట్టంలో ద్రౌపది తనను చూసి నవ్విందని, అవమానించిందని భావించి ఆమెను నిండుకొలువులో అవమానించాడు.[5]

ప్రమద్వర విషప్రభావాన మరణిస్తుంది. దాన్ని తెలుసుకొని కరుణాకలిత హృదయులై గౌతమ, కణ్వ, కుత్స, కౌశిక, శంఖపాల, భరద్వాజ, వాలిఖిల్య, ఉద్దాలక, శ్వేతకేతు, మైత్రేయుడు లాంటి మహామునులు, ప్రమతి వచ్చి స్థూలకేశాశ్రమంబున విషవిగత ప్రాణియై పడిఉన్న ప్రమద్వరని చూసి దుఃఖితులౌతారు. 'అచ్చోట ఉండబుద్ధికాక' రురుడు శోకవ్యాకుల హృదయంతో అడవిలోకి వెళ్ళి ప్రమద్వరకు నిర్విషమవ్వాలని దీనవదనంతో ఆక్రోశిస్తాడు. తాను క్రమం తప్పక వ్రతాలు, పుణ్యకర్మాలు చేసేవాడినే అయిన పక్షంలో, గురు సద్విజభక్తుడైన పక్షంలో, లఘుతపస్వి అయితే ద్విజాధిపభూసురుల దయతో ప్రమద్వరకు విష ప్రభావం పోవాలని ప్రార్థిస్తాడు. ఎవరైనా మహాపురుషులు విషతత్వ సంహితానిపుణులు ప్రమద్వరకు జీవం వచ్చే ఉపాయం చెప్తారో వారికి తన తపస్సు, దాన, అధ్యయన ఫలాలను ఇస్తానని అంటాడు. ఈ మాటలు అతనికి భార్యపైనున్న ప్రేమానురాగాలను వెల్లడిస్తున్నాయి.

ఆకాశం నుంచి ఒక దేవదూత కాల ప్రభావాన్ని తప్పించటం ఎవరివల్లా కాదని చెపుతుంది. తన ఆయుష్యులో అర్ధభాగం ఆ కన్యకు ధారపోస్తే "నక్రోమలి దొల్లింటికంటే నధిక శృంగార సమన్వితయై" విషప్రభావం పోయి ప్రాణాలతో లేస్తుందని వివరిస్తుంది. ఈ ఉపాయాన్ని పాటించి అదే విధంగా చేసుకొని తన ప్రాణానికి ప్రాణమైన ప్రమద్వరను రురుడు కాపాడుకుంటాడు. రురుడు ఆమెను వివాహమాడి ఇష్టోపభోగాలను అనుభవిస్తుంటాడు.

తన భార్యకు అపకారం చేసిన పాములపై రురుడు తీవ్ర కోపం పెంచుకుంటాడు. ఒక్క పాము చేసిన తప్పుకు మొత్తం సర్పజాతికే ప్రమాదం ముంచుకొచ్చింది. రురుడు ఒక చిక్కని దండం తీసుకొని చూసినప్పుడల్లా పాములని చంపుతుంటాడు.

రురునికి ఉదంకునికి అనేక విషయాల్లో సామ్యం ఉంది. ఒక్క తక్షకుడు చేసిన తప్పుకి మొత్తం సర్పజాతినే నాశనం చేద్దామని ఉదంకుడు ప్రయత్నించాడు. అంతకు ముందు కుండలాలని తక్షకుడు దొంగిలించినప్పుడు పాతాళానికి వెళ్ళి, దివ్యపురుషుని ప్రార్థించి చివరకు నాగకులాన్ని మొత్తాన్ని క్షోభపెట్టినా అతని కోపం చల్లారలేదు. కుండలాలు పొంది గురుపత్నీ కార్యాన్ని నిర్వహించి తిరిగి సర్పయాగాన్ని నిర్వహించాలని

చూస్తాడు. ఎన్నో రోజులు కోపంతో మసిలాడు. రురుడు కూడా అంతే! తన ప్రేయసి ప్రాణాలు దక్కించుకొన్నాడు. దీనిలో దేవదూత సహాయం ఉంది. ఒక్క పాముచేసిన తప్పుకి మొత్తం పాములపై కోపం పెంచుకున్నాడు. ఈ రెండు ఇతివృత్తాల ద్వారా సర్ప కుల ప్రళయం విధి నిర్ణయం అని స్పష్టమవుతోంది. రురు – ప్రమద్వరల వృత్తాంతం, ఉదంకోపాఖ్యానం రెండూ సర్పయాగం జరుగుతుందనే వివరిస్తున్నాయి. ప్రమద్వర చనిపోయిన సందర్భంలో రురుడు ఆక్రోశిస్తున్నప్పుడు దేవదూత "అయ్యా కాల వశంబయిన నెవ్వరికిం దీర్ప దరంబు గాదు" అన్న మాటలు సర్పకుల నాశనం విధికృతం అనే విషయాన్ని సూచిస్తున్నాయి. దీనిలో రురుడు ఉదంకులు నిమిత్తమాత్రులు.

రురు – ఉదంకులు నరనారాయణులను స్ఫురిస్తున్నారు. ఉదంకుని కుండలాలని తక్షకుడు అపహరించుకొని పాతాళానికి వెళితే అతను అక్కడికి వెళ్ళి వాటిని సాధించుకొని వస్తాడు. సోమకాసురుడు వేదాలను అపహరించుకొని వెళితే విష్ణువు మత్స్యావతారం ధరించి వానిని చంపి వేదాలను తిరిగి తెస్తాడు. ఈ విధంగా ఉదంకోపాఖ్యానం నారాయణుని లీలని సూచిస్తోంది. ఆ తర్వాత విష్ణువు దశావతారాలను ధరించింది. రాక్షససంహారం కోసం. ఉదంకుడు కూడా సర్పయాగాన్ని చేయించాడు. ఇది రాక్షస సమానమైన సర్ప జాతిని తుదముట్టించటానికే. రురుడు నరుని గుర్తుకు తెస్తున్నాడు. తమ భార్యకు అవమానం జరిగిందనే, భీమార్జునులు దుర్యోధనాది సర్పసమానులను యుద్ధరంగంలో మట్టి కరిపించారు. ముఖ్యంగా అర్జునుడు భారతయుద్ధంలో ప్రధానపాత్ర వహించాడు. ఇలా విశ్లేషిస్తే రురు – ఉదంకులు ఏదో మానవులు కాదని వారి ప్రతీకార వాంఛ మానవీయ ప్రతీకార వాంఛ కాదని తెలుస్తోంది. ఎన్నో పాములని చూసినప్పుడల్లా చంపినా రురుని కోపం తగ్గలేదు.

తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరుపాముల రోసి రోసి ని
ష్ఠురతర దీర్ఘదండమున దొల్లఁగ వ్రేయుచు వచ్చి వచ్చి య
య్యెర నొక దుండుభం బను న హిం గని వ్రేయఁగ దండమెత్తుడున్
హరిహరి యంచు దుండుభ మహా హి భయంపడి పల్కు భార్గవున్

పుట్టల్లో, పొదల్లో వెదికి వెదికి, చూసి చూసి మరీ పాములని చంపసాగాడు. తన నిష్ఠురతర దీర్ఘదండమున ఎన్నో పాములని చంపాడు. ఒకరోజు దుండుభము అనే పాముని చూసి దానిపై తన దండాన్ని ఎత్తుతాడు. దుండుభము తీవ్రంగా భయపడుతుంది. హరిహరి అని అది భయపడి పల్కిన మాటలు రురుని కోపాన్ని తగ్గించవు. ఈ పద్యంలో రోసిరోసి, వచ్చివచ్చి అని క్రియలను నన్నయగారు అద్భుతంగా ప్రయోగించారు. దుండుభం భయపడిందన్న భావం, దాని మానసికస్థితి పై పద్యంలోని 'హరిహరియంచు దుండుభమహా హి' అనే పదం ద్వారా సూచితం. పై పద్యంలోని ఛందస్సు కూడా ఏదో విరిచినట్లుగా ఉంది.

దుండుభం రురునితో "ఏమి కారణమయ్య, పాములకేల అలిగితివి అని ప్రశ్నిస్తుంది." [6] రురునితో "నీవు తేజోమయుండవు, బ్రాహ్మణుండవు, సువ్రతుండవు" అని అంటుంది. దీనికి కోపంగా తాను రురుడననీ, తన ప్రియమైన భామకు పాములు

కీడు చేసాయని బదులిచ్చి దాన్ని దండతాడితు చేస్తానని అంటాడు. నన్నయ ఉదంకోపాఖ్యానంలో ఉదంకుని మనఃప్రవృత్తిని వివరించేందుకు దండితారాతి అనే పదాన్ని ఉపయోగించాడు. ఇప్పుడు రురుడు విషయంలో దండతాడితు అని రావటం గమనించాలి.[7] రురుని భార్గవున్ అనటం శబ్దసామ్యం వల్ల పరుశురాముని స్ఫురింపచేస్తోంది. పరశురాముడు తన తండ్రికి జరిగిన అన్యాయానికి కోపితుడై క్షత్రియులని వెతికివెతికి చంపాడు. నిజానికి గమనిస్తే నన్నయ భారత రచనా ప్రణాళికలో సర్ప కుల నాశనం, కౌరవ కుల నాశనం, క్షత్రియ వంశ నాశనం అనే మూడు ఇతివృత్తాలు కలిసిపోయి ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఆదిపర్వం ప్రథమాశ్వాసంలోనే శమంతపంచౌక్షణీ సంఖ్యా కథనంలో పరశురాముడు సకల క్షత్త్రరుధిరాపూర్ణంబులుగా నేను మడుగులు గావించి.... అని నన్నయ రచించారు.

త్రేతాద్వాపరసంధి నుద్ధత మదాంధీభూత విద్వేష్మి జీ
మూతోగ్రశ్వసనుండు రాముడలుకన్ ముయ్యేడు మాఱుల్ రణ
ప్రీతిన్ వైరి ధరాతలేశ్వరులఁ జంపెం బల్వురన్ దీర్ఘని
ర్ఘాతక్రూర కుఠార లూన నిఖిల క్షత్త్రోరుకాంతారుఁడై

పరశురాముడు పైన చెప్పిన విధంగా క్షత్రియులను వధించాడు. ఆయన క్షత్రియ రక్తంతో చేసిన పితృతర్పణాల వల్లగానీ శాంతి పొందలేదు. ఆ శమంతపంచకంబే ఆ తర్వాత కురుక్షేత్రంగా మారింది. ఆ ప్రదేశంలోనే మొదట జనమేజయుడు దీర్ఘ సత్రయాగాన్ని ప్రారంభించాడు. ఆ తర్వాత సర్పయాగాన్ని కూడా నిర్వహించాడు.

రురుడు అలిగి డుండుభాన్ని దండంతో కొట్టబోతాడు. వెంటనే డుండుభం స్థానంలో ఒక మునీశ్వరుడు ప్రత్యక్షమవుతాడు. ఆశ్చర్యపోయిన రురుడు "ఉరగమువై యుండి మునీశ్వరవేషము యున్నవడు... నితో" నిజవృత్తాంతాన్ని చెప్పమని కోరతాడు. ఆ మునీశ్వరుడు తన పేరు సహస్రపాదుడు అని చెపుతాడు. అతని సహాధ్యాయుండు ఖగ ముఖుండను మునిముఖ్యుడు. అగ్నిహోత్ర గృహంలో ఉండగా పరిహాసం చేద్దామని సహస్రపాదుడు గడ్డితో చేసిన పామును ఖగముఖునిపై వేస్తాడు. దానిపై అతను కోపించి సహస్రపాదుని 'నిర్వీర్యంబైన యురగంబువగుమని' శాపమిస్తాడు. సహస్రపాదుడు క్షమించమని ప్రార్థిస్తాడు. తన వచనం అమోఘమని కొంతకాలమైన తర్వాత "భార్గవకుల వర్థనుడైన రురుం గనిన యప్పుడు శాప విముక్తంబగునని" ఖగముఖుని వచనం.

ఖగముఖుని - సహస్రపాదుని వృత్తాంతం పరీక్షిత్తు మహారాజు చనిపోయిన సర్పాన్ని మునిమెడలో వేసి వెళ్ళటం అనంతరం ముని కుమారుడైన శృంగివలన శాపాన్ని పొందటం అనే కథను పోలి ఉంది. నన్నయగారి రచనలో ప్రతి కథ దేనికదే ప్రత్యేకమైనదిగా పైకి కనిపిస్తుంది. కానీ మణిమాలలోని మణులలాగా ఈ కథలన్నీ ఒక దానితోనొకటి కలిసి ఉన్నాయి. అన్ని పూసలని కలిపిన సూత్రం మాత్రం ఒక్కటే. దుష్టశిక్షణ తప్పదు. అది భగవానుని మొదటి కర్తవ్యం.[8] సహస్రపాదుడు రురునితో తన వృత్తాంతాన్ని చెప్పి బ్రాహ్మణ లక్షణాన్ని వివరిస్తాడు.

భూనుత కీర్తి బ్రాహ్మణుఁడు పుట్టుడుఁ దోడన పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహిత సంహిత బుద్ధియుఁ జిత్తశాంతియున్
మానమదప్రహాణము సమత్వము సంత వేదవిద్యను
ష్ఠానము సత్యవాక్యము ధృఢవ్రతముం గరుణాపరత్వమున్

ఇటువంటి విశిష్ట లక్షణాలన్నీ ఉన్నవాడు బ్రాహ్మణునిగా పిలవబడతాడు అని నన్నయగారి అభిప్రాయం. సత్యవాక్య ప్రాధాన్యతని నన్నయ మళ్ళీ వివరించినారు. కరుణతో ఉండాలని, సర్వభూతాల పట్ల సమభావాన్ని కలిగి, చిత్తశాంతిని, సమత్వమును కలిగి ఉండాలని చెపుతున్నారు. దీనికి విరుద్ధంగా నడిచినపుడు ప్రళయం వస్తుంది.

ఒక పెద్ద వచనంలో నన్నయగారు ఈ విధంగా చెప్పారు: "అయ్యా నీవు బ్రాహ్మణుండవు, భృగువంశ సముత్పన్నుండవు, సర్వగుణసంపన్నుండ విది యేమి దొడంగి తిట్టి దారుణ క్రియారంభంబు క్షత్త్రియులకుం గాక బ్రాహ్మణులకుం జనునే బ్రాహ్మణు లహింసాపరు లొరులుసేయు హింసలు వారించు పరమ కారుణ్య పుణ్యమూర్తులు...." జనమేజయుడు చేయబోయే సర్పయాగాన కద్రువ శాపం కారణంగా సర్ప కుల ప్రళయం రాబోతోంది. దాన్ని రురుని తండ్రిగారి శిష్యుడైన ఆస్తీకుడు అనే బ్రాహ్మణుడు నివారించబోతున్నాడు. ఈ విధంగా సర్ప కుల ప్రళయం ఇక ముందూ జరగబోతోందని, దాన్ని ఎలాగూ నివారిస్తారు కనుక రురుడు కూడా తన సర్పనాశనాన్ని ఆపివేయాలని సహస్రపాదుడు అడుగుతాడు. దీన్ని రురుడు మన్నిస్తాడు.

వెంటనే శౌనకాది మహామునులు కద్రువ శాపానికి కారణం అడుగుతారు. ఇతరులపట్ల వచ్చే చెడుని, ఓటమిని పొందకుండా తన పుత్రులను తల్లి కాపాడుతూ ఉంటుంది. మరి అటువంటి తల్లే స్వయంగా బిడ్డలకు శాపం ఇవ్వటానికి కారణం ఏమిటా అనే ఆసక్తి కలగటం సహజం. దీనితో శౌనకాదిమునులకు సౌపర్ణోఖ్యాన శ్రవణా కుతూహలం కలిగింది. నన్నయగారి రచనా విధానంలోని గొప్పతనం అంతా ఇదే. కథ ప్రారంభం నుంచి చివరిదాకా ఉత్సుకత కలిగిస్తుంది. కథ ముగిసిన వెంటనే ఇంకో కథ మొదలు. అసలు మొదటికథ వింటున్నపుడే రెండో కథ వినాలనే కోరిక కలుగుతుంది. సౌపర్ణోపాఖ్యానం అవగానే జనమేజయుని సర్పయాగం ఆగిపోవటం అతనికి భారతకథా శ్రవణ కుతూహలం పెరగటం రెండూ జరుగుతాయి.

కద్రువ స్వయంగా శాపం ఇచ్చిన కారణంగానే సర్ప కుల నాశనం మొదలైంది. విధికృతం అలా ఉంది. అయినా సర్పయాగం నివారించబడింది. మరి అలానే భారతయుద్ధం కూడా ఆపివేయబడితే... అన్న ఊహ పాఠకులకు, శ్రోతలకు రావటం చాలా సహజం. పై పెచ్చు భారత కథలో గాంధారికి పుత్ర ప్రేమ అధికం. ఆమె కద్రువలాగా తన బిడ్డలపై కోపించి శాపం ఇవ్వలేదు. భారతయుద్ధం కూడా మధ్యలో ఎక్కడైనా ఆపివేయబడితే....? ఇలాంటి ఎన్నో ఆలోచనలను, అభిప్రాయాలను నన్నయభారతం కల్గిస్తోంది. చివరకి భారతయుద్ధం తప్పలేదు. కథారచనలో ఇక్కడ నన్నయగారి విశ్వరూపం కన్పిస్తున్నది. సారమతిం గవీంద్రులు నన్నయ మితవచనం, లోకజ్ఞత, ప్రసన్న కథాకలితార్థయుక్తి మొదలైనవన్నీ ఇందులో కన్పిస్తున్నాయి.

పాత్రచిత్రణ చాలా రమణీయంగా ఉంది. ఈ ఉపాఖ్యానాన్ని ఇంత చక్కగా తీర్చిదిద్దిన నన్నయ చాలా గొప్పవాడు.

## వివరణలు:

1. భృగువంశకీర్తన రెండు భాగాలలోనూ అంతిమంగా శాంతమే జయించింది. అగ్నిదేవుని కోపాగ్నిని బ్రహ్మ శాంతపర్చాడు. రురుని సర్ప ఘాత బుద్ధిని సహస్రపాదుడు శాంతపర్చాడు.
2. ఉదంకుడు రురునిలాగా స్వయంగా సర్ప కుల నాశనాన్ని చేయలేదు. దీన్ని జనమేజయుని ద్వారా సాధించాడు. తిక్కన భారతంలో అశ్వమేధ పర్వం, తృతీయాశ్వాసంలో ఉదంకుని కథ మళ్ళీ వస్తుంది. అక్కడ ఉదంకుడు తనను చూడవచ్చిన శ్రీకృష్ణుని భారతయుద్ధం తప్పించనందుకు క్షమించనని, శపిస్తానని అంటాడు. శ్రీకృష్ణుడు అతని శాపాన్ని శాంతింపచేసి అతనికి తన విశ్వరూపం చూపిస్తాడు.
3. పూర్వగాథల ప్రకారం భృగుమహర్షి త్రిమూర్తులలో ఉత్తముడు ఎవరో తెల్సుకోవటానికి వైకుంఠం వెళ్ళి విష్ణువుని కాలితో తన్నాడు. విష్ణువు అతని అరికాలిలోని కన్నును కాలువత్తుతూ చిదిపివేస్తాడు.
4. తిక్కన భారతంలోని అశ్వమేధపర్వం తృతీయాశ్వాసంలో శ్రీకృష్ణుడు ఉదంకునితో కౌరవపాండవులకు సంధి కుదర్చలేదనే నిందను ఎదుర్కొంటాడు. శ్రీకృష్ణుడు "నేనే పరతత్వమును. అధార్మికులం బొలియజేతును. ధార్మికులను రక్షింతును. అట్టివాడనైనా అధర్మపరులైన ధృతరాష్ట్ర సంతానాన్ని అత్యంత ధార్మికులైన ధర్మనందనాదులతో కలపటానికి ఎన్నో పాట్లు పడితిని. చివరకు కౌరవులు వారి దురాత్మతత్వానికి ఆహుతి అయ్యారు" అని వివరించాడు.
5. పాండవసభా మహిమకు దుర్యోధనుడు లజ్జితుడైన సందర్భంలో అంటే "జలాశయంబు స్థలంబుగా వగచి కట్టిన పుట్టంబు దడియం జొచ్చి క్రమ్మరిన వానిం జూచి పాంచాలియు బాండుకుమారులును నగిరంత"... ధర్మరాజు అతనిని ఏమీ హేళన చేయలేదు. ధృతరాష్ట్రతనయునకు సమీరతనయు చేత దివ్యవస్త్రాలను, దివ్యభూషణాలను ధర్మరాజు అందించాడు. సమీర అన్న పదం ద్వారా భీముని వ్యక్తిత్వ నిదర్శనం.
6. ఈ మాటలు కూడా భయంతో పలికినట్లుగా ఉన్నాయి.
7. రురుని గురించి చెప్తూ 'నిష్ఠురతరదీర్ఘదండమున' అని నన్నయ పదప్రయోగం చేసారు. పరుశురాముడు "దీర్ఘనిర్ఘాత క్రూర కుఠారలూన నిఖిల క్షత్త్రోరుకాంతారుడై" అని నన్నయ అన్నారు. ఈ రెంటికి శబ్దసామ్యం ఉంది.
8. భగవద్గీతలో భగవానుడు ఈ విషయాన్ని స్పష్టం చేసారు:

   "యదాయదాహి ధర్మస్య గ్లా నిర్భవతి భారత
   
   అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానాం సృజామ్యహమ్"

# 4. నన్నయ - దుష్యంత చరిత్ర - సామాజికాంశాలు - స్త్రీల జీవితం

నన్నయ శ్రీమదాంధ్ర మహాభారతములోని ఆదిపర్వము చతుర్థాశ్వాసము దుష్యంత చరిత్రను వివరిస్తుంది. కౌరవ వంశ వివరణలో దుష్యంతుని కథ వస్తుంది. జనమేజయ మహారాజు కోరకపోయినా దుష్యంతుని చరిత్రను నన్నయ వైశంపాయుని ద్వారా సవిస్తరంగా చెప్పటానికి తగిన కారణాలు ఉన్నాయి. భరతవంశకర్తల జన్మలలో సుప్రతిష్ఠమైన ధర్మాలను తెల్సుకోవటానికి దుష్యంతుని కథను విశాలమైన దృష్టితో పరిశీలించాల్సిన అవశ్యకత ఉంది.

భరతవంశంలో ముఖ్యంగా ముగ్గురు వంశకర్తలు ఉన్నారు. పూరుడు, భరతుడు, కురుడు. పూరుని తండ్రి యయాతి కాగా భరతుని తండ్రి దుష్యంతుడు. కురుని తండ్రి సంవరణుడు. ఈ ముగ్గురికే కాక వారి తల్లులకు కూడా చాలా ప్రాముఖ్యం ఉంది. పూరుని తల్లి శర్మిష్ఠ రాక్షసరాజైన వృషపర్వుని కూతురు. భరతుని తల్లి శకుంతల విశ్వామిత్రుని పుత్రిక. జన్మతః క్షత్రియుడైనా విశ్వామిత్రుడు రాజర్షిగా, బ్రహ్మర్షిగా పేరుపొందాడు. దేవవేశ్య మేనక శకుంతల తల్లి. ఇంక కురుని తల్లి తపతి ఆదిత్యుని కూతురు. శర్మిష్ఠ దానవి, మహాసౌందర్యవతి. దీన్నిబట్టి చూస్తే పౌరవ వంశకర్తల తల్లులు అభిజాత్యము చేత సౌందర్యము చేత ఉత్తములని అర్థమవుతోంది.

ఈ వంశకర్తల తల్లిదండ్రుల వివాహాలు కూడా ప్రత్యేకమైనవి. శుక్రుని అదేశానుసారం శర్మిష్ఠకు యయాతి భర్త కాగా, క్షత్రియోచితమైన గాంధర్వ విధానంలో దుష్యంతుడు శకుంతలని వివాహమాడతాడు. తర్వాత కణ్వుడు వారి వివాహాన్ని ఆమోదిస్తాడు. సంవరణుని వివాహం వైదిక పద్ధతిలో జరిగింది. ఈ విధంగా చూస్తే ఒక్కొక్క వంశవిస్తారకుని వివాహములో ఒక్కొక్క కొత్తదనం కనిపిస్తుంది.[1] ఈ మూడు వివాహాలలో దేనికదే ప్రత్యేకమైన ధర్మానుగుణమైన సంస్కారము బహిర్గతమవుతున్నది. తండ్రి వార్ధక్యాన్ని అంగీకరించటం చేత పూరునికి రాజ్యార్హత కలిగింది.

దుష్యంతుని చరిత్రలో అంతిమంగా సత్యమే జయించింది. ఈ విధంగా భరతవంశకర్తల జన్మలు ఒక నూతన ధర్మానికి దారితీసాయి. ఒక ఉత్తమ సంస్కారము ఉన్మీలనమయింది.

శకుంతలోపాఖ్యానం కథాకథన దృష్టితో చూస్తే ఒక అద్భుతం. నన్నయగారు ఈ కథను చాలా సూటిగా చెప్పారని భావించవచ్చు. సాధారణంగా ప్రతికథకు దానికి తగిన

వాతావరణం (setting) ఉంటుంది. దుష్యంతుని చరిత్రలో దీనికి కావల్సిన అవకాశం లభ్యమయి చక్కని వాతావరణం విస్తరిల్లింది.

బాలహరిణముల బట్టెడు... దుష్యంతుని బాల్యంతో ప్రారంభించి అతని యవ్వనాన్ని రాజ్యపాలన గురించి నన్నయ వివరిస్తారు. దుష్యంతుడు బాహువీర్యంబున ధర్మమార్గాన దేశాన్ని పరిపాలిస్తున్నాడని తెలుస్తుంది. ఇంతవరకు అతనికి ఆ ముని ఆశ్రమం అక్కడి పవిత్ర వాతావరణం అన్నవే పరిచయం లేవు. వేటమీది వేడుకతో రాజు ఒకనాడు బయలుదేరతాడు. అనేక మృగాలు చంపిన తర్వాత, అతను కణ్వాశ్రమంలోకి అడుగు పెడతాడు. అది అమరపతి ఖాండవమునకు రమణను వైశ్రవణు చైత్రరధానికి సమానమైనది. ఆ దివ్యమునీంద్ర నివాసములో అనేక వృక్షజాతులు ఉన్నాయి. శుకకోకిల సుస్వరాలు వీనులవిందు కలిగిస్తున్నాయి. శ్రవణ సుఖముగా సామగానం వినిపిస్తోంది. ఇవన్నీ ఆశ్రమ వాతావరణంలోని నిర్మలత్వాన్ని, పవిత్రతని వెల్లడిస్తున్నాయి. ఫలితంగా రాజు మనసులో కూడా సత్వగుణ ప్రభావం మొదలయింది.

సహజవైరం ఉన్నప్పటికీ ఎలుకలు, పిల్లులు కలిసిమెలిసి జీవించటం గమనించిన రాజు మునిశక్తికి నివ్వెరపోతాడు.[(2)] అమిత తపోశక్తి సంపున్నుడైన మునీంద్రునికి నమస్కరించి వెళ్దామని ఒక్కరుండచనిన దుష్యంతునికి పయోజదళాయతాక్షి సంకులమిళితాళినీల పరికుంచిత కోమల... శకుంతలని కణ్వుని మందిరంలో చూస్తాడు. శకుంతల దుష్యంతునికి సకలమర్యాదలు చేసి ఆదరిస్తుంది. ఆ కన్యతో రాజు ఇలా మాట్లాడతాడు.

"క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహాముని జూచిపోవఁగా
వచ్చితి మెందుఁ బోయిరొకో వారనిన్ విని యాలతాంగి వా
రిచ్చటనుండి యీ క్షణమ యేఁగిరి కానకుఁబండ్లు దేర మీ
వచ్చు టెరింగిరేని జనవల్లభ వారును వత్తు రింతుకున్"

రాజు మానసిక స్థితికి పై పద్యం మంచి ఉదాహరణ. ముని ఆశ్రమ వాతావరణం, ప్రకృతి రమణీయతలతో సేదదీరిన రాజు శకుంతల అందచందాలకు సంభ్రమాశ్చర్యాలకు లోనవుతాడు. పై పద్యంలోని రెండు పాదాలు దీన్ని వివరిస్తున్నాయి. శకుంతల కూడ స్త్రీ సహజమైన సిగ్గుకు లోనై కణ్వుడు వచ్చేదాకా ఒక్క ముహూర్తం ఉండమని కోరుతుంది. ఆమె వినయానికి, మృదుమధుర వచనాలకు సంతోషించిన రాజు 'నీవెవ్వరికూతుర విట్టి రూపలావణ్య విలాస విభ్రమగుణసుందరి విందులకేల వచ్చితివని' ప్రశ్నిస్తాడు. దానికి శకుంతల సమాధానం - ప్రజలు ధర్మస్వరూపుడని కీర్తించే కణ్వమహాముని ఆత్మజను. మునికన్య పట్ల తనకు అనురక్తి కలిగిందని దుష్యంతుడు గ్రహిస్తాడు. శకుంతల జన్మ వృత్తాంతాన్ని వివరించమని రాజు కోరతాడు. రాజర్షి బ్రహ్మర్షి విశ్వామిత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నప్పుడు ఇంద్రుడు దాన్ని భంగం చేయటానికి అప్సరలలో గొప్పదైన మేనకను నియోగిస్తాడు. "అమ్ముని యల్గి చూచుదును నా క్షణమాత్రన గోత్రధారుణీధ్రమ్ములు ద్రవ్యు నయ్యిసుము దక్కగ

నంబుధులింక.....నుగ్రతం బమ్మినయట్టి కోపపరుపాలికి భామలు మోవనోడరే" అని భయపడినా చివరకు మేనక దేవేశ్వరుని ఆజ్ఞను శిరసావహిస్తుంది.[3] మేనకా విశ్వామిత్రుల శృంగార ఫలితంగా శకుంతల జన్మిస్తుంది. మేనక దేవలోకానికి, విశ్వామిత్రుడు తపోవనానికి వెళ్తారు. ముని ప్రభావాన శకుంతపక్షులు బిడ్డను రక్షిస్తుంటాయి. శిష్యులతో ప్రయాణిస్తున్న కణ్వుడు బాలికను చూసి శకుంతరక్షిత అయిన కారణాన శకుంతల అని నామకరణం చేస్తాడు.

శకుంతల జన్మవృత్తాంతాన్ని విని దుష్యంతుడు చాలా సంతోషిస్తాడు. ఇది "మునినాథ కన్యయని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా హృదయము రాజపుత్రినని యిక్కమలాక్షి నిజాభిజాత్య సంపద నెరిగించిన మదన బాణపరంపర కిప్పుడుండ" అని భావిస్తాడు. వల్కలాజినములు, వన్యఫలాశనములు, కుటీరవాసములు ఆమెకు తగినవి కావని చెప్తాడు. తన భార్య అయి అశేష రాజ్యలక్ష్మీ మహనీయ సౌఖ్యములు పొందమని అభ్యర్థిస్తాడు.[4] అష్టవివాహ పద్ధతులలో క్షత్రియులకు గాంధర్వ వివాహం సముచితమైందని చెప్పి పరస్పర ప్రేమతో జీవితం సాగిద్దామని శకుంతలను వేడుకుంటాడు. దుష్యంతుని మాటలకు సిగ్గుపడి, నేలచూపులు చూస్తూ తన తండ్రిగారు కరుణా నిరతులు, ధర్మస్వరూపులు అని వారు వచ్చిన వెంటనే వారి అనుమతితో తన పాణిగ్రహణము చేయమని సమాధానమిస్తుంది.

శకుంతల వ్యక్తిత్వం చాలా గొప్పది. తనకు భార్యగా వచ్చి రాజ్యసుఖాలను పొందమని రాజు ప్రలోభపెట్టినా ఆమె నిగ్రహం కోల్పోలేదు. ఎటువంటి తొందరపాటుకు లోనవకపోవటం ఆమె వ్యక్తిత్వ నిదర్శనం. గాంధర్వ వివాహాన్ని ప్రతిపాదించిన సామ్రాట్టుతో తాను తండ్రి చాటు బిడ్డనని వారి అనుమతితో తన పాణిగ్రహణం చేయమని కోరటం గమనార్హం. దీనినిబట్టి ఆమె గుణం తెలుస్తుంది. ఇది ఒక కన్యకు ఉచితమైన పద్ధతి. శకుంతలని ఒప్పించేందుకు దుష్యంతుడు గాంధర్వ వివాహ పద్ధతిని వివరిస్తాడు. గాంధర్వం అతి రహస్యం. అది అమంత్రకం. అంటే వివాహం చేసుకునే వారిరువురికే తప్ప ఇతరులకి దాని గురించి చెపితేకానీ తెలీదు.[5] మంత్రాలు చదివేవాళ్ళు కూడా ఉండరు కాబట్టి సాక్ష్యులు లేరు. రాజు మాటలను నమ్మిన కన్య ఆ వివాహానికి అంగీకరిస్తుంది. కానీ ఒక షరతును విధిస్తుంది. తామిరువురికీ జన్మించిన కుమారుడికి రాజ్యాభిషేకం చేయాలని వరం కోరుతుంది. "నరనుత నీ ప్రసాదమున నా కుదయించిన నందను మహీగురుతర యౌవరాజ్యమునకు దయతో నభిషిక్తుఁజేయగా వరము..." అని కచ్చితంగా చెపుతుంది. రాజు ఆమె కోరిన వరాన్ని అంగీకరిస్తాడు. గాంధర్వ వివాహంబున అభిమత సుఖంబులనుభవించిన రాజు తిరిగివెళ్ళిపోయే కాలం వస్తుంది.

దుష్యంతుడు వెళ్ళిపోతూ 'నిన్నుఁ దోడ్కొని రా నస్మత్ప్రధాన వర్గంబుఁ గణ్వమహామునిని పాలికిం బుత్తెంచెదనని.' శకుంతలని ఊరడిస్తాడు. ఇలా శకుంతల రాజుని విశ్వసించటం, రాజు ఆమెని నమ్మించి వెళ్ళటం జరిగింది.[6]

వనం నుంచి తిరిగి వచ్చిన కణ్వుడు లలిత శృంగార భావనంబున లజ్జావనత వదనయు నతిభీత చిత్తయునై యున్న కూతురును చూసి తన దివ్యజ్ఞానమున విషయాన్ని

గ్రహిస్తాడు. క్షత్రియులకు గాంధర్వము సరి అయినదని చెప్పి అంగీకరిస్తాడు. "తల్లీ నీ కులగోత్ర సౌందర్యములకుఁ దగినపతిఁ గంటి...వని" చెప్పి శకుంతలకు కోరిన వరం ఇస్తానని అంటాడు. దానికి శకుంతల" నా చిత్తం బెప్పుడు ధర్మువునంద తగిలి యుండను నా కుద్భవిల్లెడు పుత్త్రుండు దీర్ఘాయురైశ్వర్యబలసమన్వితుండును వంశకర్తయుఁ" కావలెనని ప్రార్థిస్తుంది. కొంతకాలానికి శకుంతలకు భరతుడు జన్మిస్తాడు. శకుంతలా భరతులు కణ్వాశ్రమంలోనే కొంతకాలం ఉంటారు.

ఎట్టిసాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్ద కాలమునికి తద్ద తగదు
పతుల కదన యునికి సతులకు ధర్మువు
సతుల కేడు గడయుఁ బతులచూవె

ఎంతటి సాధ్వీమణులకైనా పుట్టింట్లో ఎక్కువకాలం ఉండటం మంచిది కాదు. భర్తలదగ్గర ఉండటమే భార్యలకు ధర్మం. సతులకు పతులే రక్షకులు అని కణ్వుడు శకుంతలకు బోధపరుస్తాడు. వివాహం అయిన వెంటనే స్త్రీకి తండ్రి ఇంట్లో ఉండే అర్హత పోతుందని దీని అర్థం.(7)

కణ్వుడు మహాతపోధనులైన తన శిష్యులను కొందరిని తోడిచ్చి శకుంతలని దుష్యంతుని వద్దకు పంపిస్తాడు. భరతునితో సహా శకుంతల దుష్యంతుని వద్దకు వస్తుంది. సకల సామంతమంత్రి పురోహిత ప్రధాన పౌరజన పరివృతుండై యున్న రాజును శకుంతల చూస్తుంది. శకుంతలకి వెంటనే ఒక విషయం అర్థమవుతుంది. ఆశ్రమంలో తాను చూసిన రాజుకి ఇప్పటి రాజుకి ఏదో తారతమ్యం కనిపిస్తాయి. ఆనాటి దుష్యంతునిలో చూసిన ఆదరణ, అనుగ్రహం, కరుణలు కనపడక ఆశ్చర్యపడుతుంది. వెంటనే ఈ విధంగా భావిస్తుంది. రాజు తనని ఎరగడా? లేక ఎరిగినా ఎరగనట్లు ప్రవర్తిస్తున్నాడా? మహారాజులు ఎన్నో కార్యాలలో నిమగ్నులయి ఉంటారు అని తనని తాను సమాధానపర్చుకోవాలని ప్రయత్నిస్తుంది.

కానీ దుష్యంతుని చూపులు క్రూరంగా, విరసంగా ఉంటాయి. "చూడ్కులు విరసంబులై కరము క్రూరములైన నిమిత్తమేమియో" అని ఆలోచిస్తుంది. ఆశ్రమంలో తనకు ఇచ్చిన వాగ్దానాన్ని తప్పించుకోవాలని చూస్తున్నాడా అని భయపడుతుంది. 'నవప్రియులైన ధరాధినాధులన్' నమ్మటం మంచిదికాదని అనుకుంటుంది. ఆలోచిస్తున్నకొద్దీ శకుంతలకు బాధ కల్గుతుంది. మరిచిపోతే గుర్తు చేయవచ్చు. కానీ 'ఎరిగిఎరుగనొల్లని కరటిం దెలుపంగ గమలగర్భునివశమే' అని భావిస్తుంది. తెలిసి ఉండీ కావాలని తెలీనట్లు ప్రవర్తించేవారికి గుర్తుచేయటం ఎవరికి సాధ్యం?

చల్లకొచ్చి ముంత దాచటం వృథా అని ఎరిగిన శకుంతల తమ పూర్వకథని చెప్పి గుర్తుచేద్దామని ప్రయత్నిస్తుంది. రాజు వేటకి వచ్చినపుడు కణ్వాశ్రమంలో తనతో గడపటం, సంతోషంతో వరాన్ని ఇవ్వటం జ్ఞాపకం చేసుకోమంటుంది. బాలార్క తేజుడగు నీ బాలుడు నీ కొడుకు.... అని చెపుతుంది. అయినా దుష్యంతుడు తెలిసికూడా తెలియనివాడివలె మాట్లాడతాడు. నీవు ఎవరు? ఎందుకిలా అనుచితంగా

మాట్లాడుతున్నావు అని అంటాడు. ఎక్కడినుంచి వచ్చావో అక్కడికి వెళ్ళిపొమ్మని కోరతాడు. ఈ పరుషవాక్యాలకు శకుంతల నివ్వెరపోతుంది. మాటలురాక చేష్టలుడిగి నిల్చొనిపోతుంది. ఆమె ఎలా జరుగుతుందని భయపడిందో అలానే జరిగేసరికి కోపారుణితన యనంబుల అశ్రుబిందువులు రాలతాయి.

తాను మోసపోయానన్న వాస్తవం, రాజు మోసం చేసాడన్న బాధ ఆమెను వెక్కిరిస్తాయి. దుఃఖానికి లోనయినా దాన్ని కనిపించనీయకుండా తలవంచి దుష్యంతుని క్రీగంట గమనిస్తూ తన హృదయవేదనని ఉపశమింపచేసుకొని మాట్లాడుతుంది. "ఏల యెరుకలేని యితరుల యట్ల నీవెరుగననుచు బలికె దెరిగి యెరిగి యేన కాని దీని నెరుగరిలిరులని తప్పబలుకనగునె ధార్మికులకున్" అని శకుంతల ప్రశ్నిస్తుంది. వాస్తవం ఏదో అది కేవలం వారిద్దరికే తెల్సు. తెలిసికూడా తెలియనట్లు చెప్పటం ధార్మికులకు తగదు. సభలోని వారికెవరికీ నిజానిజాలు తెలీవు. నువ్వు ధర్మాత్ముడవైతే అసత్యం చెప్పవు అని దుష్యంతుని అంతరాత్మ ప్రబోధాన్ని ఆలకించమని తెలివిగా చెపుతుంది.

శకుంతల విమల యశోనిధీ అని రాజును సంబోధిస్తుంది.[8] శాశ్వతమైనది యశస్సు మాత్రమేననీ కాబట్టి తన కీర్తికి కళంకం తెచ్చుకోవద్దన్న సూచన ఈ సంబోధం ద్వారా వెల్లడవుతోంది. పురుషుని ప్రవర్తన వేదాలు, పంచభూతాలు, ధర్మదేవత, సంధ్యలు, అంతరాత్మ, యముడు, సూర్యచంద్రులు, దివారాత్రాలు గమనిస్తూ ఉంటాయి. వీటినుంచి తప్పుకోవటం వీలవదు. ప్రతివ్యక్తి తప్పనిసరిగా తన అంతరాత్మకు సమాధానం చెప్పుకోవాలి. అంటే నా యెరిగినట్లు యిన్నియు నీయిచ్చిన వరము ధారుణీవర యెరుగున్ అని అర్థం. కాబట్టి ఇదివరలో వలెనే నామీద అనుగ్రహం చూపమని ప్రాధేయపడుతుంది.

అయినా రాజు ప్రవర్తనలో ఏ మార్పురాదు. దీంతో శకుంతలకు దుష్యంతుని వ్యక్తిత్వం తెలుస్తుంది. రాజు తనకు ఇచ్చిన మాట గురించి సాక్ష్యమిచ్చేందుకు ఆమె చెప్పిన వారెవరూ రారు. ఇది దుష్యంతునికి తెలుసు. అంతరాత్మ నోరునొక్కిన దుష్యంతుడు దుర్మతి. అందుకే ఆఖరి ప్రయత్నంగా సతియును గుణవతియు బ్రజావతియు ననువ్రతయునైన వనిత నవజ్ఞాన్విత దృష్టి జూచిన దుర్మతికి ఇహపరాలు ఉంటాయా అని మతి బరికింపమని హెచ్చరిస్తుంది.[7]

వివిధ ధర్మశాస్త్రాలను ఉటంకిస్తూ ఎన్నెన్నో ఉపదేశాలు చేస్తుంది. గృహస్థాశ్రమ ధర్మాలను వివరిస్తుంది. ధర్మార్థకామ సాధనలకి, గృహనీతి విద్యకు, ఉన్నత స్థిరగుణమణులకు, సంతోషానికి భార్య ఆలవాలమైందని కనుక భర్తకు ఇతరములైనవేవీ ప్రియముకావని నిశ్చయంగా చెపుతుంది.

భార్య పురుషునిలో సగభాగమైంది కనుక పరలోకాన కూడా పతివ్రతలు నిరీక్షిస్తుంటారని, భార్యని అవమానించటం అధర్మమనీ, పురుషుడు భార్యయందు ప్రవేశించి గర్భమున పుత్రుడై ఉద్భవిల్లును కాబట్టి జనకునికి, పుత్రునికి భేద లేదని వేదవచనాలని ఉదహరిస్తుంది. తాను తన నీడ నీళ్ళలో నేర్పడ, జూచునట్లు కొడుకుని చూసి తండ్రి పరమానందం పొందుతాడని చెప్తుంది. పున్నామ నరకాన్నుంచి తప్పించే పుత్రుడు ఉభయపక్షాల వారిని ఉద్ధరిస్తాడు. నీ పుణ్యతనువువలన ఈ కుమారుడు

జన్మించాడని వివరించి దీపంవలన వేరొక దీపం ఉదయించినట్లు రాజుకిభరతుడు జన్మించాడని శకుంతల అంటుంది. విపరీత ప్రతిభాషలు దేనికని ప్రశ్నిస్తుంది(10) అయినా దుష్యంతుడు బదులివ్వడు.

కుమారుడు వంశకరుడవుతాడని నూరు వాజపేయాలను చేస్తాడని వినువీధినుంచి సరస్వతి - మునులు వినేటట్లుగా పల్కిందని చెప్తుంది. 'భూరిగుణునిట్టి కులవిస్తారకు దార కునుదార ధర్మప్రియ నిష్కారణమ తప్ప జూడగ సారమతీ చనునె నాటి సత్యము గలుగన్' అంటుంది.

ఎన్ని విధాలుగా చెప్పినా, ఎన్నిసార్లు వివరించినా రాజు నిజాన్ని అంగీకరించేటట్లు కనపడదు. చివరకు సత్యం గొప్పదనాన్ని, ప్రాముఖ్యాన్ని ఉగ్గడిస్తుంది. నుతజలపూరితంబులగు నూతులు నూరిటికన్నా సూనృతవ్రత యొక బావి మేలు అని అలాంటి నూరుబావులకన్నా ఒక క్రతువు గొప్పదని క్రతుశతంబునకన్నా, కొడుకు మిన్న అనీ దానికన్నా సత్యం ఇంకా చాలా గొప్పదని విశదీకరిస్తుంది.

వేయి అశ్వమేథ యాగాలకన్నా సత్యమే శ్రేష్ఠమైందని చెప్పి శకుంతల రాజుని నిజాన్ని అంగీకరించేటట్లు చేయటానికి ప్రయత్నిస్తుంది.

సర్వతీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్ల ధర్మంబులకెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు

ఇంతచెప్పినా రాజు మనసు మారదు. అంతరాత్మ నోరునొక్కిన వారికి ఎవరికీ సత్యాన్ని అంగీకరించని కారణాన బాధ కలగదు. ఈ పద్యం నన్నయగారు సత్యానికి ఇచ్చే విలువని వెల్లడిస్తుంది. నిజానికి ఈ మాటలన్నీ శకుంతలే అన్నప్పటికీ రాజు మనసులో కూడా ఒక అంతరంగ సంఘర్షణ (Inner conflict) మొదలయింది. ఏదో పైకి ఎరగనట్లు ప్రవర్తిస్తున్నా మనసుపొరలలో మాత్రం దుష్యంతునికి ఇబ్బందిగానే ఉంది.

శకుంతల చివరగా - కణ్వాశ్రమ సంభావిత సమయస్థితి దయ గావింపుము కొడుకు జూడు కరుణాదృష్టిన్ - అని కోరుకొంటుంది. ఆశ్రమంలో దుష్యంతుని వాగ్దానం ప్రకారం భరతుని యువరాజుని చేయాలి. అలా చేయాలంటే దానికి ముందుగా శకుంతలని రాణిగా దుష్యంతుడు స్వీకరించాల్సి ఉంది. అతని మోహంలో ఆ విధమైన ఆలోచనలు కనపడవు. పైపెచ్చు ఆమె అసత్యం చెపుతోంది అనే విధంగా అతని మొహంలో అభిప్రాయాలు కనపడుతున్నాయి. అందుకని శకుంతల 'బొంకు పలకగ అంత ధర్మేతరనే' అని చివరిమాటగా చెపుతుంది.

దుష్యంతునికి ఏదో ఒకటి తేల్చి చెప్పాల్సిన సమయం ఎదురయింది. ముందుగానే నిర్ణయించుకున్నవాడిలా కనిపించినా ఒక సంకటస్థితిలో చిక్కినవాడిలా మాట్లాడతాడు. శకుంతలని దుష్యంతుడు తిరస్కరిస్తాడు.

ఏ నెట నీ వెట సుతుఁడెట
యే నెన్నఁడుఁ దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మానిను లసత్యవచనలు
నా నిట్టు లసత్యభాషణంబు చితంబే?

దుష్యంతుని మాటలు పొడిపొడిగా కనిపిస్తాయి. పై పద్యంలోని నడక అంతా ఎక్కడికక్కడ తృంచివేయబడినట్లు ఉండి అతని మనస్థితికి అద్దం పడుతున్నాయి. ఇక్కడి రచన అంతా శిథిలమై కనిపిస్తుంది. ఏదో ఒక నిశ్చయానికి రాలేక పోయిన వాడిలా హృదయాన ఏదో బాధను అనుభవిస్తున్నవాడిలా రాజు కనిపిస్తాడు. ఈ మాటలు గమనిస్తే నిశ్చయంగా కావాలని భార్యను అవమానించదల్చినవాని మాటలవలే కనపడవు. అందువల్లనే లోకాపవాదభీతి చేత ఆమెను ఎరగనని తాను అన్నాడన్న దుష్యంతుని తర్వాత మాటలు విశ్వసనీయమవుతున్నాయి. నిశ్చయంగా ఈ కందం నన్నయ రచనా శిల్పానికి చక్కని ఉదాహరణ.

నేను రాజును. మరి నీవు మునిపల్లెలో ఉండేదానిని. ఈ కుమారుడు ఏమిటి? నేను ఇంతవరకు నిన్ను చూసి ఎరగను. అని దుష్యంతుడు నిర్దయగా మాట్లాడతాడు. “ఇట్టి లోకవిరుద్ధంబులకే మోదుదు మయుక్తంబులయిన పలుకులు పలకక నీ యాశ్రమంబునకుం బొమ్మని” కఠినంగా దుష్యంతుడు చెపుతాడు.

శకుంతలకి ఏమీ చేయలేని నిస్సహాయస్థితి. ఆమె చేసిన అన్ని ప్రయత్నాలు చెవిటికి శంఖం ఊదినట్లుగా మిగిలిపోతాయి. ఒకే ఒక్కమాటతో తన బాధ్యత నుంచి రాజు తప్పుకున్నాడు. వారి పరిచయాన్ని, వివాహాన్ని, సంతానాన్ని ఒక్కసారిగా తోసిరాజన్నాడు. శకుంతల సత్యంపై రాజుచెప్పిన అబద్ధమే జయించింది. అంతేకాక నిందుకొలువులో 'మానిను లసత్యవచనులనాన్' అని ఎకసెక్కం చేయటం మొత్తం స్త్రీజాతినే అసత్యవాదులని నిందించటం శకుంతలని తీవ్రంగా అవమానించాయి. ఆశ్రమంనుంచి బయలుదేరినప్పుడే కణ్వుడు స్త్రీలకు భర్తే రక్షకుడని భర్త దగ్గరే ఉండటం భార్యలకు ఉచితమని ఉపదేశించాడు. ఒకరకంగా ఆమెకు ఆశ్రమంలో అడుగు పెట్టే వీలులేదు. ఇప్పుడు ఆమెకు నాథుడు ఎవ్వరు? ఎక్కడ తలదాచుకోవాలి?

తనకు న్యాయం లభ్యమవటం ఇంక కష్టమని శకుంతల తెలుసుకుంది. భారం దైవానికే వదిలివేసింది. తాను పుట్టినప్పుడే తల్లిదండ్రుల చేత విడవబడ్డానని ప్రస్తుతం భర్తచేత కూడా, తిరస్కరించబడ్డానని విలపిస్తుంది.

అశరీరవాణి ఆ సమయంలో శకుంతల మహాపతివ్రత, సాధ్వి అని ప్రకటిస్తుంది. భరతుడు నీకు కుమారుడు. అతనిని గ్రహించి, భరించు అని దివ్యవాణి సభాసదులందరూ వినేటట్లుగా చెప్తుంది. అప్పుడు రాజు ఇతరులతో వారి వివాహాన్ని వేరెవరు ఎరగరని అంటాడు. ఈ కారణంగానే తాను ఆమె ఎవరో తెలిసి ఉండీ తెలీనట్లు ప్రవర్తించానంటాడు. విషయం అందరికీ తెల్సాక రాజు అనురాగంతో కొడుకుని ఆలింగనం చేసుకొని శకుంతలని ప్రేమపూర్వకంగా ఆదరిస్తాడు.

యౌవరాజ్యానికి భరతుని పట్టాభిషిక్తుని చేస్తాడు. ఈ విధంగా శకుంతలకి చివరకు న్యాయం జరిగింది.

శకుంతలోపాఖ్యానం ఎన్నో సామాజిక విషయాలను ప్రస్తావించింది. స్త్రీని సమాజం ఏ కారణం లేకుండా చిన్నచూపు చూస్తుంది. ఆమె నిస్సహాయురాలు. వివాహం పేరుతో ఆమె మోసానికి గురి అవుతూనే ఉంది. ఆర్థిక సామాజిక అసమానతలు వివాహానంతరం ఆమెకి ఇబ్బందులనే కల్గిస్తున్నాయి. సాంఘికామోదం లేని పక్షంలో ఆ స్త్రీ, ఆమె సంతానం ఎన్నో రకాలుగా అవమానాలకు లోనవుతారు. శకుంతల లాంటి ఎందరో స్త్రీలు నిస్సహాయస్థితిలో దైవాన్ని ప్రార్థించటం తప్ప గత్యంతరం లేక విలపిస్తున్నారు.

ఈనాటి స్త్రీవాద సాహిత్య నేపథ్యంలో పరిశీలించినవారికి తనకాలంలోని స్త్రీల సామాజిక స్థితిగతులను నన్నయ అర్థం చేసుకున్నాడని వారి దీనావస్థకి శోకించాడని ఈ ఉపాఖ్యానం నిరూపిస్తుంది. నన్నయ నిస్సందేహంగా స్త్రీజన పక్షపాతి. శకుంతల అమాయకత్వాన్ని, నిస్సహాయస్థితిని, ధర్మబుద్ధిని, తార్కికతను నన్నయ వివరించిన విధానం అద్భుతం. చివరలో శకుంతల పాతివ్రత్యాన్ని ఆకాశవాణి పల్కిందని చెప్పిన పద్ధతిలో నన్నయకు స్త్రీలమీద ఉన్న జాలి, దయ వెల్లడవుతున్నాయి. ఈ కథ ద్వారా రాజలోకం స్త్రీల విషయంలో ధర్మబుద్ధితో ప్రవర్తించాలని, వారి శృంగార కాంక్షలకోసం వివాహం చేసుకొని ఆ తర్వాత వారిని అవమానించటం మహాపాపమనీ నన్నయ వివరించారు. యథా రాజా తథా ప్రజా. రాజు తను ధర్మంగా ప్రవర్తిస్తూ పౌరులకి మార్గదర్శకునిగా ఉండాలి. అనాదిగా స్త్రీలు సమాజంలోని ద్వంద్వ ప్రమాణాల దృష్ట్యా అవమానాలకు గురవుతున్నారు. సాంఘికామోదం లేనప్పుడు ఆర్థిక అసమానతల వల్ల వారి వివాహాలకు భద్రత లభించదు. అప్పుడు ఆ స్త్రీ, ఆమె సంతానము తిరస్కరించబడతారు. ఈ వాస్తవాలని వెల్లడించిన నన్నయను నిస్సందేహంగా స్త్రీలకు న్యాయంకోసం వాదించినాడనే అర్థం చేసుకోవాలి. ఈ దృష్ట్యా చూస్తే నన్నయ శకుంతలోపాఖ్యానం విజయం సాధించింది.

శకుంతల పాతివ్రత్యానికి, సత్యానికి, ధర్మానికి, ప్రతీకగా నిల్చి అనాదిగా ప్రజలను సన్మార్గంవేపు నడిచేలా దారి చూపిస్తూనే ఉంది.

## వివరణలు:

1. బ్రాహ్మంబు, దైవంబు, ఆర్షంబు, ప్రాజాపత్యంబు, రాక్షసంబు, గాంధర్వంబు, పైశాచంబు, ఆశురంబు అనేవి ఎనిమిది రకాల వివాహాలు.
2. దివ్యమునీంద్రుని నివాసం కావటంతో అక్కడ "నాజ్యహ విర్హుత సౌరభ ధూమలతాతతులం బెనగిన మ్రాకుల కొమ్మల మీద నపేత లతాంతములైనను బాయని మధుపప్రకరంబులంజూచి" దుష్యంతుడు ముందుకు వెళ్ళాడని నన్నయగారి కథనం. మహాముని ఆశ్రమంలో కామభావనలు ఏ జీవికి లేవని స్పష్టం. మరి శకుంతలని చూసి 'సర్వలక్షణాలక్షితంబులయిన సర్వావయంబులుం జూచి సంచలిత హృదయుడై' అని దుష్యంతుని గురించి చెప్పటం అసమంజసంగా లేదా?

3. ప్రభువు ఆజ్ఞాపించితే వెళ్ళవలసిందే. నన్నయగారు స్త్రీలు ఏ విధంగా రాజాజ్ఞని మన్నించి, వారికి కష్టమైన పనులైనా చేయక తప్పని పరిస్థితిని చెపుతున్నారు.
4. ఈ విధంగా ప్రలోభపెట్టి శకుంతలని రాజు వివాహం చేసుకున్నాడని చెప్తూ పురుషప్రవృత్తిని వాస్తవదృష్టితో నన్నయ చిత్రించారు.
5. శకుంతల తన తండ్రి అనుమతితోనే వివాహమాడమని కోరింది. ఆమెను ప్రలోభపెట్టి గాంధర్వరీతిన దుష్యంతుడు వివాహమాడాడు. కానీ, సాక్షులు లేరు. ఈ కారణానే ఆమెను తిరస్కరించగలిగాడు రాజు. (గాంధర్వ) వివాహవ్యవస్థలోని లోపాన్ని నన్నయ వివరించునట్లుగా ఉంది.
6. ఈ విధంగా శకుంతల మెట్టుమెట్టుకీ మోసపోయిందని చెప్పటం నన్నయ స్త్రీజాతి దుస్థితికి బాధపడ్డాడు అని వివరిస్తోంది. పురుషుడిని విశ్వసించి తర్వాత చింతించడం శకుంతల ఇతివృత్తంలో కనిపిస్తోంది.
7. ఈ పద్యాన్ని దానికి ముందున్న వచనంతో అన్వయించి- 'వీడఖిల భువనయౌవ రాజ్యాభిషేకంబునకు సమర్థుండగు దెంచెనని' చదివితే వివాహంకాగానే స్త్రీ తండ్రి ఇంట ఉండే అర్హతని కోల్పోతుంది. అని నన్నయ భావించాడనే అపవాదు సరికాదని తెలుస్తుంది.

దుష్యంతుడు వెళ్ళటం, భరతుడు పెరిగి పెద్దవాడవటం అంటే చాలా కాలమైంది. యౌవరాజ్యాభిషేకునిగా భరతుని చేస్తానని ఆనాటి రాజప్రతిజ్ఞ.
8. విమల యశోనిధీ అన్న సంబోధన ద్వారా పాపం చేసి కీర్తిని మలినపర్చుకోవద్దనే సూచన. ఆదిపర్వం - అష్టమాశ్వాసంలో నన్నయ ఇలా చెప్పారు.

కీర్తి లేని వానికిని జీవనంబు ని
రర్థకంబు సూవె యవనిమీద
నిత్యమయిన ధనము నిర్మలకీర్తియ
యట్టికీర్తి వడయ టఁ్రశమంబె

9. మూలకారుడు "విభ్రాజమానాం వపుషా తపసాచ దమేనచ రూప యౌవన సంపన్నాం" అని శకుంతల గురించి అంటాడు. శకుంతల రాజుని హెచ్చరించినట్లు చిత్రించిన నన్నయ స్త్రీ సంక్షేమం కోసం ఎంతో ఆర్తిచెందాడని భావించవచ్చు.
10. సంస్కృత భారతంలో ఈ విధంగా ఉంది-

నవాససాం నరామాణాం నాపా స్పర్శస్తథా విధః
శిశో రాలింగ్య మానిస్య స్పర్శ స్సూనోర్యధా సుఖః
సర్వగుణములు రక్త నిష్టమైయుండును అని వివరించటానికి నన్నయ మూలానికన్నా విశిష్టంగా రాసారు.



# 5. తిక్కనసోమయాజి

శ్రీ మదాంధ్ర భారతాన్ని నన్నయ తర్వాత తిక్కనసోమయాజి చాలా చక్కగా అనువదించి ఆంధ్రావళికి అందించాడు. నిర్వచనోత్తర రామాయణాన్ని మనుమసిద్ధికి అంకితమిచ్చిన తిక్కన తన భారతాన్ని హరిహరనాథునికి అంకితమిచ్చిన మహోదారుడు. తాను మొదట్లో శైవుడైనా 'విష్ణురూపాయనమశ్శివాయ' అని శివకేశవులపట్ల సమభావాన్ని చూపించాడు. ఆనాటి మత సంఘర్షణలను దృష్టిలో పెట్టుకొని చూస్తే తిక్కన గొప్పతనం తెలుస్తుంది.

విరాటపర్వం నుంచి ప్రారంభించి జగద్ధితంబుగా మహాభారత అనువాదం చేసిన తిక్కన ఆది కవీంద్రుల నూత్న సత్కవీశ్వరులను భక్తి గొల్చి తగవారి కృపం గవితా విలాస విస్తర మహనీయుడైనాడు. దాదాపుగా ఏడువందల శ్లోకాలు ఉన్న భగవద్గీతను యాభయి పద్యగద్యాలలో అనువదించిన విధానం తిక్కన ప్రతిభకు నిదర్శనం. చిన్నతనం నుంచీ సంస్కృత భారతాన్ని శ్రద్ధగా అధ్యయనం చేసిన తిక్కన తన అనువాదానికి నన్నయగారి మార్గాన్నే అనుసరించాడు. భారతం పదిహేను పర్వాలను అనువదించి తిక&కన తెలుగు భాషకి సేవచేసాడు.

తిక్కన తాను ఉభయకవిమిత్రుడనని స్వయంగా పేర్కొన్నాడు. అనంతర కవులు తిక్కనని అనేక విధాలుగా కీర్తించారు. ముఖ్యంగా కేతన తిక్కనను 'కవీంద్రలోకాధారుడ'ని, 'సారకవితానిర్మాణచాతుర్యుడ'ని, 'కవితాధన్యుడ'ని, 'కవిలోక చాతకవ్రజనవ జలదస్తనిత భూషణప్రకరుడ'ని, 'వేదాది సమస్త విద్యాభ్యాస విభాసి' అని పలు విధాలుగా స్తుతించారు. కేతన దశకుమార చరిత్రను స్వీకరించి తిక్కన కృతిపతి కూడా అయ్యాడు.

తిక్కన విరాటపర్వమున 'నానారసాభ్యుదయోల్లాసి' అని పేర్కొని ఆ లక్ష్యసిద్ధికి రసానందాన్ని ఒక మధురసాధనముగా చేసుకున్నాడు. భారత రచనలో తిక్కన ఉభయకావ్యప్రౌఢి శిల్పము పరిపక్వమైంది. రససిద్ధిగావించే నేర్పరితనంలో తిక్కన ప్రవీణుడు. నాటకీయ శైలిలో తిక్కనది అందెవేసిన చేయి. కవితను ఒక విధమైన ఆవేశంగా తిక్కన భావించాడు. విజయసేనము, కవిసార్వభౌమఛందస్సు, కృష్ణశతకము మొదలైన రచనలు కూడా తిక్కన చేసాడు.

తిక్కన దృష్టిలో మహాభారతం లేఖ్యమైన ఆమ్నాయము. ఈ దృష్టితోనే సోమయాజి భారతరచనా యజ్ఞాన్ని నిర్వహించారు. తిక్కన వైదిక మార్గనిష్ఠతో, నిరంతర భగవత్పాద పూజాదికాలతో, సత్యనిష్ఠతో జన్మాంతర దుఃఖాలను తొలగించుకున్న గొప్ప కవి. భారత రచనతో తిక్కన జీవితం సార్థకమైంది. అతనిది సంపూర్ణ జీవితం.

# మహాభారతం - విరాటపర్వం - నాటకీయ శైలీ విశిష్టతలు

"శరణాగతుండ భక్తుండఁ, బరమపదవిఁ గోరెదను శుభంబుగ నిన్నుం
బరికించి యెది మే ల, య్యిరవు దొరకొనంగఁ దలఁ పవే కమలాక్ష"
- శాంతిపర్వం (2-54)

తిక్కన పరబ్రహ్మను, వాఙ్మయరూప యజ్ఞంతో పూజించిన సోమయాజి. యోగము, తపము, యజ్ఞము మొదలైనవి తిక్కనకు చాలా ఇష్టమైన విషయాలు. తిక్కనకు కవిత్వమే ఒక యోగము, తపము, యజ్ఞము. మహాభారతంలోనే దీనికి నిదర్శనాలు కనిపిస్తున్నాయి. ఇవన్నీ అతని వ్యక్తిత్వాన్ని నిరూపిస్తున్నాయి. వేదరూపమైన మహాభారతాన్ని అత్యంత భక్తిశ్రద్ధలతో ఎంతో ప్రతిభావంతంగా అనువాదం చేయటం అతని భారతరచనలో భగవానుని ఆశీర్వాదబలం పనిచేసిందేమోననే ఊహలు కల్గిస్తున్నాయి.

మహాజ్ఞాని, తాత్వికుడు అయిన తిక్కన ధర్మశాస్త్ర విషయాలను అన్వయక్లేశం కలగకుండా సరళమైన భాషలో రచించి పండిత పామరులందరి అర్థమయ్యేలా తీర్చిదిద్దాడు. దీనికి అతని వాస్తవిక చిత్రణాశక్తి, శబ్దశక్తి, మానవ మనస్తత్వ సునిశిత పరిశీలన, రాజనీతి, పరిణత బుద్ధి, కవిత్వతత్వం మొదలైనవన్నీ కారణాలు.

తిక్కన భారతాన్ని సవిమర్శనా దృష్టితో పరిశీలిస్తే అతని కవిత్వ విధానం తెలుస్తుంది. మహాకవిత్వ దీక్షావిధి నొంది రసమయ కావ్యంగా మహాభారతాన్ని రచించిన తిక్కనగారిది నాటకీయమైన శైలి అని, రసాభ్యుచిత బంధము, అర్థగౌరవము కలిగిందని పలువురు విమర్శకులు భావించారు. కావ్య పరమావధి రసం. శిల్పము రసావిష్కరణాత్మకమైన కళ. కథను కళ్ళకు కట్టినట్లుగా వర్ణించటం, పాత్రోచితమైన భాష, పాత్రల మనోగత భావాలను వివరించే విధానం, సన్నివేశాల చిత్రణ మొదలైన విధానాల ద్వారా తిక్కన నాటకీయతని సాధించారు. కథాగత పాత్రలను వాటి మనస్తత్వం వివరించే పదాల పొందికతో పాఠకుల మనస్సులలో స్ఫురింపచేయటాన్నే కావ్యశిల్పము అని భావించవచ్చు. దీనిని రసోన్ముఖముగా పయనించేటట్లు చేయటం రసశిల్పము అవుతుంది. తిక్కన సందర్భానుసారముగా సముచితరసరామణీయకముగా తన భారతాన్ని రచించారు.

శ్రవ్యకావ్యంగా పేరుపొందిన మహాభారతాన్ని తిక్కన కావ్యలక్షణ శోభితమైన ప్రబంధంగా తీర్చిదిద్ది తెలుగు సాహిత్యంలో నూతన ప్రక్రియను ప్రారంభించారు.

తిక్కనగారి నాటకీయత కేవలం కథను సంభాషణ రూపంలో నడపటంతో మాత్రమే కాకుండా అందులోని పాత్రల ప్రవేశం, వివిధ సన్నివేశాల్లో పాత్రలు సాధారణ మానవులుగా ప్రవర్తించటం, వివిధ హావభావాలు, సంభాషణా చాతుర్యాల వల్ల పరిపుష్టమైంది.

విరాటపర్వం ప్రారంభించిన తిక్కన హరిహరంబగు రూపము దాల్చిన హరిహరనాథుని స్తుతించి ప్రారంభించాడు. విజ్ఞాన సంపద్విఖ్యాతుడు, విద్వత్సంస్తవనీయ

భవ్య కవితావేశుండు వ్యాసమహర్షికి ప్రణమిల్లుతాడు. తెలుగులో మహాభారత రచనని ప్రారంభించి తనకు మార్గం చూపిన ఆంధ్రకవిత్వ విశారదుడు, మహితాత్ముడు అయిన నన్నయభట్టుని స్మరిస్తాడు. ఇవన్నీ తిక్కన వ్యక్తిత్వాన్ని వివరిస్తున్నాయి.

రచనా ప్రారంభంలోనే తిక్కన హృదయాహ్లాది, ఊర్జిత కథోపేతంబు, నానారసాభ్యుదయోల్లాసి అనే విశేషాలను భారతం గురించి ఉపయోగించి అవి తన రచనలోనూ చోటు చేసుకున్నాయని సూచించారు.

తిక్కన రచనాకౌతుకముతో ఉండి నిద్రిస్తున్న సమయంలో హరిహరనాథుడు సాక్షాత్కరించి పారాశర్యుని కృతి అయిన భారతమనే పేరుగల పంచమవేదాన్ని తెలుగులో రచింపమని, తత్ఫలితంగా 'భవ్య పురుషార్థ తరుపక్వ ఫలముగాదే' అని ఆజ్ఞాపించాడట. తిక్కన తన భారతాన్ని 'జన్మాంతర దుఃఖముల్ దొలగునట్లుగా చేసి సుఖాత్ముఁ జేయవే' అని హరిహరనాథుని ప్రార్థించి అతనికే అంకితం చేసాడు. తిక్కన మనసంతా సంతోషంతో నిండిపోయింది.

భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి, ఆంధ్రావళి మోదం చెందేటట్లుగా భారతరచన చేస్తానని తిక్కన ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించాడు. తిక్కనకి పద్యములు, గద్యములు రచించటమనేది ఎంతో ప్రీతికరమైన విషయం.

తిక్కన హరిహరనాథతత్వాన్ని తన అద్వైతభావము, కర్మమార్గములతో ప్రారంభించి క్రమక్రమంగా భక్తిమార్గంలో పడి, జ్ఞాన మార్గములో సమన్వయమవుతున్న దశలో, ధర్మాద్వైతస్థితిని వ్యక్తం చేస్తూ విశ్వసించిన విధానం. శరీరాత్మతత్వమే హరిహరతత్వమని తిక్కన భావన. పరబ్రహ్మ సృష్టిస్థితి లయల నిమిత్తం త్రిగుణాత్మకమైన విష్ణు, బ్రహ్మ, రుద్ర రూపాలను భరించాడు. ఈ హరిహరాభేదము ఉపనిషన్మతము. దీనిని తిక్కనగారు అంగీకరించి లోకంలో ప్రచారం చేయటానికి సిద్ధపడ్డారు. తిక్కన హరిహరనాథ తత్వాన్ని గురించి తిమ్మపూడి కోటేశ్వరరావుగారు లాంటి పండితులు కొన్ని అభిప్రాయాలను(1) వ్యక్తం చేసారు.

విరాటపర్వంలో పాండవులు అజ్ఞాతవాసం చేసిన రీతి, వారు ఎదుర్కొన్న పరిస్థితులు, కీచకుని చేతిలో ద్రౌపది అవమానం పొందటం మొదలైన అంశాలు తిక్కన నాటకీయశైలికి మంచి ఉదాహరణ. ముఖ్యంగా ద్వితీయాశ్వాసంలోని కీచక వధా ఘట్టం అద్భుతమైన రచనా విధానానికి పేరుపొందింది. ఈ ఘట్టంలోని ప్రతి పద్యం కూడా సందర్భానుసారంగా అభినయిస్తుంది. ఇందులోని ప్రధాన పాత్రలైన కీచకుడు, భీముడు, ద్రౌపది, ధర్మరాజు మాట్లాడిన ప్రతి మాట, వారి చేష్టలు మానవప్రవర్తనా విధానాన్ని నిశితంగా అధ్యయనం చేసిన తిక్కన పరిపూర్ణరచనా చమత్కారాన్ని వెల్లడిస్తుంది. ఈ అశ్వాసాన్ని చదువుతున్నంతసేపు పాఠకులు తమ కళ్ళ ముందు పాత్రలు రక్తమాంసాలతో ప్రవర్తిస్తున్నట్లుగా అనుభూతి చెందుతారు.

నాటక నియమాన్ని అనుసరించి తిక్కన కీచక వధా ఘట్టాన్ని సువిస్తారంగా తీర్చిదిద్దారు. నాటక ప్రయోజనం ప్రేక్షకులలో రసానందం కలిగించటం. తిక్కనది రసపరిపోషణలో అగ్రస్థానం. కీచక వధా ఘట్టంలో శృంగార, వీర, రౌద్ర రసాలను

తిక్కనగారు చాలా చక్కగా పోషించారు. మూలములో అంత విస్తారంగా లేని కీచకుని కాముకతని తిక్కన చాలా విశదీకరించి రాసారు. విరాటపర్వం ద్వితీయాశ్వాసంలో తిక్కన అమలిన శృంగారభావనని వివరించారని కొందరు విమర్శకులు అభిప్రాయపడ్డారు[2]

తిక్కన రచనలో ఇతర కవులలో కనపడని ప్రత్యేకతలు ఎన్నో కనిపిస్తాయి. తెలుగు పదాలను ఎక్కువగా వాడటం, క్లిష్టమైన భావాలు చెప్పేటపుడు కూడా తెలుగు పలుకుబడులను సంస్కృతం చేసి వాడటం, జాతీయాలని, లోకోక్తులని విరివిగా ప్రయోగించటం, వ్యావహారిక పదాలకు దగ్గరగా ఉన్న పద ప్రయోగం చేయటం మొదలైన లక్షణాలన్నీ కనిపిస్తాయి. భావావేశానికి తగినట్లుగా వాక్యనిర్మాణం చేయటంలో తిక్కన సమర్థుడు. తిక్కన పదౌచిత్యానికి మహాభారతంలోని అనేక అంశాలు నిదర్శనములు. సార్థక పదప్రయోగం వల్ల తిక్కన రచనలో వచ్చిన విశిష్టత ఒక ఎత్తు కాగా ప్రకృతి వర్ణన ద్వారా నాటకీయగమనంలోని మార్పులని సూచించేటట్లు రాయటం మరో ఎత్తు. తిక్కన రౌద్ర భయానకాదులని వర్ణించేటపుడు దానికి అనుగుణంగా దీర్ఘసమాసాలని వాడి ఔచిత్యాన్ని సాధించారు. శృంగారకరుణాది రసములని పోషించేటప్పుడు తిక్కన లలితమైన పదాలను వాడి హృద్యమైన శైలితో రచనలు చేసారు.

తిక్కన వృత్తాలను ప్రయోగించేటప్పుడు ఎంతో ఔచిత్యాన్ని పాటించారు. సౌప్తిక సర్వంలో బీభత్సభావానికై స్రగ్ధర ప్రయోగించటం, మహాస్రగ్ధర ప్రయోగించటం అలానే స్త్రీపర్వంలో కరుణరస సాధనకై ఉత్పలమాలాది వృత్తాలు కాకుండా కొన్ని అరుదైన వృత్తాలని ప్రయోగించటం గమనార్హం. తిక్కన వర్ణనలకు సీసపద్యాలని, వీరరౌద్ర రస సందర్భాలలో శార్దూల మత్తేభాలను ప్రయోగించారు. నీతి విషయాల సందర్భంలో కందాలని అద్భుతంగా ఉపయోగించారు.

నాటకీయ హాస్యం, సంభాషణల ద్వారా హాస్యం, పాత్రల చేష్టల ద్వారా హాస్యం ఏర్పడేటట్లు రచించిన తిక్కన భారతంలోని కీచకవధా ఘట్టం పాఠకులని అలరిస్తుంది. ఆయా సన్నివేశాలను వర్ణించేటప్పుడు తిక్కన సాత్త్విక, ఆంగిక, వాచిక ఆహార్యాభినయాలకు అనువైన సూచనలు చేయటం రచనావిధానం దృష్ట్యా గొప్పది. దీనిద్వారా తిక్కనగారు నాటకీయత సాధించారు.

ద్వితీయాశ్వాసం ఒక విష్కంభంతో మొదలవుతుంది.[3] విరాటరాజు కొలువులో పాండవులు వివిధ స్థానాలలో నియమితులయ్యి ధర్మరాజు తను జూదంలో గెల్చిన ధనాన్ని తమ్ముళ్ళకు అందిస్తూ, భీమసేనుడు "వంటకు మిగిలిన మాంసంబులమ్మి నెపంబున నిచ్చలు సహోదరులకు ఇస్తూ" అర్జునుడు "సంగీత ప్రసంగంబున మెచ్చువడసిన కనకాంబరాదులు" సోదరులకి అందిస్తూ, నకులుడు "దురంగంబుల గ్రాసంబులం గనిన ధనంబుల" తోబుట్టువులకు పెడుతూ, సహదేవుడు "గోవులం జూచి భూవల్లభుండు సంతసిల్లిన సమయంబున సముపార్జితంబు లగు పదార్థంబు" అన్నలకు అందిస్తూ, ద్రౌపది "దన్నరసికొని తిరుగుచున్న వీరులం గన్నులారం జూచుచు" కాలక్షేపం చేస్తున్నారని తెలుస్తుంది. మహావీరులైన పాండవులు ఈ విధంగా బ్రతుకుతున్నారన్న ఆలోచనతో పాఠకుల మనస్సులు వారిపట్ల సానుభూతితో నిండుతాయి. వారికి ముందు ముందు ఏయే పరిస్థితులు ఎదురవుతాయో అనే

ఆలోచనలు వస్తాయి. పాఠకుల ఆలోచనా విధానాన్ని కథాగమనానికి అనువుగా వుండేలా ఈ రెండింటిని సమన్వయం చెందేలా రచించటం తిక్కనగారి ప్రతిభని నిరూపిస్తోంది.

దుర్యోధనుడు పంపిన బలవిక్రమ సంపన్నులగు మల్లులు వివిధ దేశాలు తిరుగుతూ విరాటరాజు కొలువులోకి వస్తారు. వీరిలో ఒక్కడు, అమితబలుడు తాను అనేక దేశాలు తిరిగానని కానీ 'యగ్గలించి నా యెదుర బాహప్పణించి కడగజాలెడు మల్లులగాన నెందు' అని విరాటరాజు ఎదుట నిల్చి భుజాస్ఫాలనంబు చేస్తాడు. ఇక్కడ పదప్రయోగం ద్వారా భుజాలను చరుచుకున్న మల్లుని రూపం పాఠకుల ఎదుట సాక్షాత్కరిస్తుంది. మల్లుని 'ఉగ్ర సమదాకృతియుం బటు వాక్యవృత్తియుం' చూసి, విని సభలోని మల్లులందరూ భయ కంపితులవుతారు. ధర్మరాజు విరాటరాజుతో మన 'బానసీడు వలలుండను శూద్రుడు' అనేకమంది మల్లులని ఓడించాడని 'నిను మెచ్చింపంగ జాలు నిజమిది యధిపా' అని అంటాడు. ఇది సంభాషణారీతి. దీనివల్ల చదివేవారు కూడా నాటకాన్ని చూసిన అనుభూతి చెందుతారు. విరటుని ఆజ్ఞతో భీముడు, 'ధర్మతనయు కనుసన్న' తెల్సుకొని మల్లునితో పోరుకి సిద్ధపడతాడు.

తిక్కనగారు భీముడు మల్లునితో యుద్ధానికి దిగేముందు 'భుజాస్ఫాలనంబు సేసి మ్రొక్కి' ఆ తర్వాత 'యుద్ధ రంగంబు మన్ను ఫాలప్రదేశంబున ధరియించి' అనేక విధాలుగా తన శక్తిని చూపించి గొండొక సేపు విరాటునకు వినోదంబు సలిపాడని రాసారు. ఇదంతా ఆనాటి మల్లయుద్ధ విధానాలని వివరిస్తోంది. ఈ సన్నివేశం సంస్కృత నాటకాల్లో వచ్చే 'గండము' అనే అంగాన్ని పోలి ఉంది.(4) భీముడు తర్వాత కీచకుని వధిస్తాడన్న సూచన దీని ద్వారా వస్తోంది.

నాటక నియమావళి ప్రకారం నాయకుని పాత్ర నాటకంలో తొలిసారిగా ప్రవేశపెట్టాలి. భీముని బాహుబలం, యుద్ధోద్రేకం, అన్నగారి మాటకు కట్టుబడి ఉండటం, గాంభీర్యం, వినయం, సమయపాలన మొదలైన వ్యక్తిత్వ విశేషాలు మొదట్లోనే పరిచయం చేయటం తిక్కనగారి రచనా విధానాన్ని వివరిస్తోంది.

భీముడు మల్లుని 'కాళ్ళును చేతులు వ్రేల' మదగజం లాగా పోరాడి 'ముక్కున వాతను, నెత్తు రొలక' ఎత్తి వేస్తాడు. తిక్కన వీరరసాన్ని ఇక్కడ అద్భుతంగా పోషించారు. దీనివల్ల భీముని వీరత్వం పాఠకులకు తెలుస్తుంది.

కీచకుడు ఈ నాటకంలో ప్రతినాయకుడు. ఇతని పాత్ర ప్రవేశంలోనే అతని వ్యక్తిత్వానికి చెందిన అంశాలు ప్రస్తావించబడ్డాయి. అతను మత్స్యపతి మరిది. దండనాథుడు. కీచకాగ్రజుడు. రూపాభిమాని. నానాభరణ ధరణశీలుడు. దుర్విదగ్ధుడు. బలగర్వితుడు. సింహబలుడు. వీనిద్వారా, కీచకుని శీలం తెలుస్తోంది. ఇతను సర్వాధికారి, ఆభరణాల ప్రీతి ఉన్నవాడు, బలగర్వితుడు కాబట్టి ఎటువంటి పనికైనా వెనుకాడడని అర్థం అవుతుంది. వెంటనే స్త్రీ అయిన ద్రౌపదికి ఈ రూపాభిమాని కారణంగా ఏమైనా ఇబ్బందులు వస్తాయా అన్న ఆలోచన మన మనసులో మెదలుతుంది. ప్రస్తుతం దాసీగా హీనస్థితిలో ఉన్న ద్రౌపదిపై ఒక విధమైన ప్రేమ, సానుభూతులు ఏర్పడతాయి. పాఠకుల మనస్తత్వాన్ని ఈ విధంగా ప్రభావం చెందేలా రచించడం ఒక చక్కని విధానం.

తన అక్క సుదేష్ణాదేవికి మొక్కుదామని వెళుతున్న కీచకుడు "అద్దేవి కనతి దూరంబుననున్న ద్రుపదరాజనందనం గనుంగొని... అని చెప్పటం వల్ల అప్పటివరకూ నడుస్తున్న పాత్ర ఒక్కసారిగా ఆగిపోయిన దృశ్యం మనకు ఎదుట కనిపిస్తుంది.

ద్రౌపది "అక్కజమైన చెల్వమున నాత్మకు వేగయిపొల్చు"...గా ఉండగా చూసి కీచకుడు మోహావేశానికి గురి అవుతాడు. ఇది అతని కాముకప్రవృత్తిని సూచిస్తోంది. సింహబలుడు మన్మథుని బాణానికి దెబ్బతింటాడు. అతను మనసులో అనుకున్న మాటలను తిక్కనగారు అద్భుతంగా వివరించారు. నాటకంలో స్వగతాలకు ఎంతో ప్రాధాన్యత ఉంటుంది.

ఎందున నిట్టి రూపు నరు లెవ్వరుఁగాంచిరె నాక కాదు సం
క్రందన సూతికిం దగిలి కన్గొనఁ జాలదె దీన నిందిరా
నందనునాజ్ఞ యేచి భువనంబులఁ బ్రబ్బదె యిత్తలోదరిం
జెందగఁ గాన్పు గాదె ఫల సిద్ధి పురాతన పుణ్యవృద్ధికిన్

కీచకుని మలినబుద్ధి కన్పిస్తోంది. 'ప్రబ్బదె' అన్న పదం ఓజోగుణ రాజసికగుణాధిక్యము గల కీచక చిత్తవృత్తిని సూచిస్తోంది.' "సంక్రందన సూతికిం దగిలి కన్గొనఁ జాలదే" అని కీచకుని భావన.(5) కీచకుని శృంగారాపేక్ష ధర్మబద్ధము కాదు. కాబట్టి అతని శృంగార పర్యవసానం ఏ విధంగా ఉంటుందో తెలుసుకోవచ్చు.

ద్రౌపది 'చెలువంబుగన్న శచీప్రియుండైనను గనుకలి నవయక' ఉండలేదని ఆమె ప్రాపున పార్వతీశుడైనా మన్మథబాణానికి గురి అవుతాడని తలుస్తాడు. కుసుమబాణుని బాణములు అయిదింటిని కరగబోసి లలితాంగి ద్రౌపది దేహాన్ని చైతన్యసంపుటము చేసినట్లున్నదని ఆలోచిస్తున్న కీచకుడు మన్మథుని పంచప్రహారాలైన సమ్మోహనం, ఉన్మాదనం, శోషణం, తాపనం, స్తంభనాలకు వశుడై 'దీని జన్మంబున దేజంబు నొందిన యింతియుఁ బతియును నెవ్వరొక్కొ అని తలపోస్తాడు. "దీనిఁ బొందఁ గాంచు తెరగు నా కెయ్యది" అని ఉన్మత్తుడవుతాడు. విపరీత శృంగారభావనలతో, మోహావేశంలో ఉన్నవారు కోర్కె తీర్చుకోవటానికి ఏ పని చేయటానికైనా సిద్ధపడతారు. 'అనియని యుగ్గడించు ధృతి యల్లలనాడినఁ దల్లడించు" మనోజ వికారమగ్నుడైన కీచకుని అవస్థలు, ఔత్సుక్యమును వ్యంజించుచు అతని అనుచిత శృంగారాభిలాషని తీవ్రతరం చేస్తున్నాయి.

వెఱవక 'తనను జూచు వాడని' ద్రౌపది కీచకుని గురించి భయపడుతుంది. శృంగారోన్మత్తుడైన సింహబలుడు ఏమైనా చేయవచ్చని 'దిక్కులెవ్వరు నాకను భయమున' అని శరీరంలో కంపం పుట్టగా ఉపాయమేమిటా అన్న ఆలోచనలు చేస్తుంది. ద్రౌపది భయానక స్థితిలో ఉండగా ఆమె మానసిక స్థితిని వివేకహీనుడైన కీచకుడు గ్రహించడు. వాటిని సాత్త్విక భావాలుగా భావిస్తాడు. కీచకుడు రాగసాగరపూర నిర్మగ్నుఁడవుతాడు. తిక్కనగారు 'గీచక ముఖ్యులోచనంబులు' ద్రౌపది శరీరకాంతిని అప్పము బరిజనములుఁ దనుఁ దప్పక కనుగొనుచునుండ' ఏ మాత్రం సిగ్గుపడకుండా పొల్లుపోకుండా త్రాగివేసాడని రాసారు. మిగతా ఇంద్రియాలని కాదని 'నయనం ప్రధానమను పూర్వవచః

స్థితి' నిలుపునట్లుగా అవి ఉండిపోయాయి. 'నొదవు చెమటతోఁ జిత్తంబు సెదిరి' కీచకుడు శృంగార ఝురిలో పడి మునిగిపోతాడు.

కందర్పదర్ప గోచరుండైన కీచకుడు తన అక్కవల్ల సైరంధ్రికి చెందిన సమాచారం తెలుసుకోవాలనుకుంటాడు. 'ఇయ్యరవింద గంధికుల మేమి' అని ప్రారంభించి సైరంధ్రి చరిత్ర, పేరు, ప్రస్తుతం ఉన్న ప్రాంతం, భర్త గురించి అడుగుతాడు. సుదేష్ణాదేవి 'యితడనంగ శరదళిత హృదయుండయ్యెనకటా' అని తమ్ముని స్వభావానికి బాధపడుతుంది. తమ్ముని 'చిత్త వృత్తి మరలుప ననురూపంబగు నుపాయ మది యెయ్యదియో' అని ఆలోచిస్తుంది. గతంలోనే ద్రౌపది తనను ఆశ్రయించిన సందర్భంలో ద్రౌపది సౌందర్యాన్ని చూసి తన భర్త ఉవ్విళ్ళూరతాడేమోనని ఆమె భయపడింది. ఇప్పుడు తమ్మునివల్ల ఆ ప్రమాదం ముంచుకు వచ్చేసరికి ఏ విధంగా అతనిని మార్చాలా అని ఆలోచించింది.

కీచకుడు ద్రౌపదిని అనేక ప్రశ్నలడుగుతాడు. పాంచాలి నిర్వికారయై ఊరుకుంటుంది. ఆమె కనువిచ్చి చూడదు, నవ్వదు, మరుమాట మాట్లాడదు. అంతఃపురంలో కాముకుడైన కీచకుని చేష్టలను మౌనంగా భరిస్తున్న సాధ్వి ద్రౌపదిపై పాఠకులకి సానుభూతి కలుగుతుంది. దాస్య వృత్తితో ఉన్న సైరంధ్రి మనోభావాలు పాఠకులకి తెలిసివస్తాయి.

కీచకుడు తెగించి పాంచాలితో తన అభిప్రాయం చెపుతాడు:

చెలువ యింక నొక్కించుక సేపు నీ వ
నాదరంబున నెప్పటియట్ల యున్న
మన్మథుడు సమయించిన మగుడనన్నుఁ
బడయ వచ్చునె యెన్ని యుపాయములన్

కీచకాధముని ప్రవర్తనకు ద్రౌపది కోపిస్తుంది. 'దుర్వారంబైన పరిభవ వికారంబు దోపఁ కుండ' తనను తాను ఉపశమింపచేసుకుంటుంది. దీన్నిబట్టి ద్రౌపది శీలం, వ్యక్తిత్వం తెలుస్తున్నాయి. 'వీడు దురభిమానియై యున్నవాడు' అని తొందరపాటు పనికిరాదని ఆలోచించుకుంటుంది. 'వేగిరపాటు వలను గాదు వెరవుతోడన తప్పించు' కోవాలని నిర్ణయించుకుంటుంది. ఇది ఆమె నిశ్చలత్వాన్ని, ధీరత్వాన్ని, సమయానుకూల ప్రవర్తనా విధానాన్ని వివరిస్తోంది. ద్రౌపది 'నాయున్నబాము దలఁపవ యీ యొడలీ చీర యిట్టి యేవపుఁజందం బోయన్న మదన విక్రృతిం జేయుననుట యెంతయు నిషిద్ధముకాదే' అని కీచకుని సమాధానింప ప్రయత్నిస్తుంది. తిరిగి ఇటువంటి మాటలాడటం తగునా అని, "ఆడుఁ బుట్టువుల తోడ నీవును బుట్టినాడవని" బుద్ధి చెప్తుంది. 'హీన వంశాభి జాతనైన పతిపత్నినగు' తనను అలా అడగటం తగదని చెప్తుంది.

ఈ మాటలకు కీచకుని ప్రతిస్పందన తిరిగి కాముక ప్రవృత్తితోనే ఉంటుంది. 'యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి' అని ద్రౌపది అంగాంగ వర్ణన చేస్తూ "యీ త్రిప్పులేటికిఁ గమలవదన" అని అంటాడు.

కాముకత అధికమై, పరసతీ సంగమమున వచ్చు పాపాన్ని భరిస్తాననీ అంతేగాని "సైరింప నోపఁ బచ్చ విలుతూపుల తాఁకున కలరుఁబోఁడి" అంటాడు. నీచుడు కాబట్టి జంకించినగాని మెత్తబడి పోడని గ్రహించిన సైరంధ్రి కోపంతో పరుష వాక్యాలు పల్కుతుంది.

దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్డ నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా

విరాటపర్వంలో ఈ పద్యం రెండుసార్లు వస్తుంది. గంధర్వులు తన భర్తలని, వారి చేతిలో చావవద్దని 'యందని మ్రాకుల పండ్లు గోయఁ దలఁచుట హితమే' అని హెచ్చరిస్తుంది.

కీచకుడు మదనాగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లగా సుదేష్ణాదేవిని ద్రౌపది వివరాలు చెప్పమని అడుగుతాడు. అతని 'వేగిరపాటు సూచి శిరకంపంబు సేయుచు సుధేష్ణ' అన్న మాటలలో తల ఊపిన దృశ్యం కనిపిస్తుంది. బుద్ధి వినవయ్యా అని తమ్మునికి నీతులు చెపుతుంది. బలగర్వంలో 'జతురాశి మధ్యంబునన్ ఘనబాహుబాల మొప్ప నన్ను నెదురంగా నొక్కఁడున్ లేమి' అని ద్రౌపది భర్తలను 'మద్భుజాసమదీలలన్ గీటడంగించెదన్' అని అంటాడు.

'దైన్యంబు నొందెడు నాననంబు తోడ దిగ్గునలేచి' అన్న తిక్కన ప్రయోగంతో కూర్చున్న పాత్ర ఒక్కసారిగా లేచి నిలుచున్న దృశ్యం కళ్ళముందు కదలాడుతుంది. సుదేష్ణాదేవి 'వీని కెమ్మెయింజావు నిజంబు మన్మథనిశాతశరంబులనైన నక్కటా' అని మనసులో అనుకుంటుంది. ఇక్కడ మసలవలదు అని తమ్ముని "యూరటతోడ నీ వేగు" మని చెపుతుంది.[7] 'నీదు నివాసమునకు దివములో నవశ్యంబును నేనా సుదతిం బుత్తెంతునని' కీచకునికి వాగ్దానమిస్తుంది.

కీచకుడు తన ఇంటికి తిరిగి వెళ్ళి ద్రౌపది మీద మోహంతో పరితపిస్తాడు. 'దుర్విదగ్ధుండు గావున నమ్ముగ్ధకుం దన సన్నిధి గామ వికారంబు పుట్టుట గలుగ భావించుచు' అని తిక్కనగారి కథనం. ద్రౌపదికి తన పట్ల ప్రేమ ఉందని "గ్రొత్తకాన్పుగుట నడ్డము సొచ్చిన సిగ్గు' అని 'అనేక భంగుల ననంగ విభ్రమంబుల కనురూపంబులైన బహువిధ ప్రలాపంబులం' పొద్దు గడుపుతున్న కీచకుని రూపం, అతని చేష్టలు పాఠకులలో ఆనందం కలిగిస్తాయి. ఇక్కడ హాస్యరసం వెల్లివిరిసింది.

సుదేష్ణాదేవి అక్కడ పాంచాలిని పిలిపించి 'కీచకుని యింట నెప్పుడు వాచవి యగు బహువిధంపు వారుణి గలుగున్' అని చెప్పి పంపిస్తుంది. ఈ సందర్భంలో సుదేష్ణ "చూతముగాని నీ గమన వేగంబున్" అంటుంది. ఇది ద్రౌపది కీచకుని ఇంటినుంచి జాగ్రత్తగా, వేగంగా తప్పించుకొని రావాలని సుదేష్ణ సూచించినట్లుగా కనిపిస్తోంది. ద్రౌపది శరీరం తల్లడిల్లుతుంది, చెమట పడుతుంది. అక్కడికి పోననకూడదు, ఊరికే

పోరాదు, నేర్పు సంధిల్లగ దీని బాపికొను దీమసమెట్టిది యొక్కొ దైవమా" అని ఆలోచిస్తుంది. ఉచితమైన పనులు తప్ప "దుష్కృత్పరివార యోగ్యపరిచారములు చేయనని, పంపవద్దని" వేడుకుంటుంది. కానీ సుదేష్ణాదేవి ద్రౌపదిని అనేక విధాలుగా ప్రార్థించి ఒప్పిస్తుంది.

దైవం మీద భారం వేసి కల్లు తేవటానికి కీచకుని ఇంటికి ద్రౌపది వెళుతుంది. ఆమె సాహసప్రవృత్తికి పాఠకులు ఆశ్చర్యపడతారు. ఆమె "బెబ్బులియున్న పొదరు సొచ్చు లేడి చందంబున" అని తిక్కన వర్ణించటం పాఠకులకి కీచకవధ జరగాలనే అభిప్రాయం కలుగుతుంది. ఇక్కడ ద్రౌపది హరిస్మరణ చేసి బయలుదేరిందని తిక్కన కథనం. ఆమె 'పాండుపుత్రుల కేను దప్పని మనంబు గలుగుదానన యేని' అని కమలమిత్ర నన్ను రక్షింపు కరుణతోడ అని ప్రార్థిస్తుంది. కమల మిత్రుడు సూర్యుడు. సూర్యుడిని రక్షించమని ప్రార్థించటం త్వరగా తెల్లారితే కీచకవధ భీముని చేత జరుగుతుందనే సూచననిస్తోంది.(8)

కీచకుడు పాంచాలికోసం ఎదురుచూస్తూ చిడుముడి పడుచు నెదురుసన గడఁగుచు హారములు చక్కఁగాఁ ద్రోచుచు' అన్నమాటల ద్వారా విరహాన్ని అనుభవిస్తున్నాడని తెలుస్తుంది. కీచకుడు 'కరితురగరథసమితి', రుచిరమణ భూషణంబులు ఇస్తానని, తన కులకాంతలు ఆమెకు దాసీలవుతారని, తాను ఆమె కనుసన్నలలో మెలుగుతానని అసభ్య ప్రతిపాదనలు చేస్తాడు. ద్రౌపది అతని చేయి విదిల్చి తప్పించుకొని విరాటరాజు కొలువులోకి ప్రవేశిస్తుంది. కీచకుడు మదించిన ఏనుగు కదులుతున్న తీగను పట్టుకున్నట్లు, క్రూరదానవుడు భూచారి నిర్జరకాంతను వెంబడించినట్లు, భయంకరమైన గద్ద సుకుమార నాగాంగనను పట్టుకున్నట్లు, పిల్లి బాలశారికను పట్టుకున్నట్లుగా ద్రౌపదిని వెంటాడి పట్టుకోబోతాడు. ఈ విధంగా ఉపమాలంకారాన్ని ప్రయోగించడం వల్ల సన్నివేశం రక్తికడుతోంది.(9) కీచకుడు ఉగ్రుడై "చిగురుబోడి పజ్జ గడువడి దగిలి క్రోపంబు గదుర నొడిచి తలపట్టి తిగిచాడని" తిక్కన వర్ణన. అప్పుడు పాంచాలీ రక్షకుడైన రాక్షసుండతని డొల్ల వ్రేసిన కీచకుడు వ్రేటుపడి, లేచి వెనక జని విస్మయగోచరుడైనాడని చెప్పే కథనం పాఠకులకి నవ్వు తెప్పిస్తుంది. ఇది నాటక గమనం ద్వారా, పాత్రల చేష్టల ద్వారా ఏర్పడిన హాస్యం. ఈ నాటకీయ హాస్యం పాంచాలి దురవస్థకు శోకతప్తులైన పాఠకులకి కొంత హాస్యదృష్టి కలిగించేందుకు ఉద్దేశించింది.

తన కళ్ళ ఎదుటే ప్రియసతి అవమానం చూసి భీమసేనుడు ఆగ్రహంతో ఊగిపోతాడు. ఈ క్రింది పద్యంలో అతని రూపం, కోపతీవ్రతన పళ్ళు కొరకటం, అంగాలు కదలటం, ఆగ్రహంతో ముడిచిన కనుబొమ్మలు విచిత్రంగా నర్తించటం, శరీరమంతా చెమటపట్టటం మొదలైనవన్నీ ప్రత్యక్షమయ్యేలా తిక్కన రచించారు.

కనుఁగొని కోపవేగమున గన్నుల నిప్పులు రాల నంగ ము
ల్లనరఁగ సాంద్రఘర్మ సలిలంబులు గ్రమ్మ నితాంత దంత పీ
డనరట దాస్యరంగ వికట భ్రుకుటీచటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకారభయ దస్ఫురణా పరిణద్ధమూర్తియై

రౌద్రరసం ఇక్కడ అద్భుతంగా పోషించబడింది. కన్నులు ఎర్రబడినవనుట స్వభావోక్తి కాగా నిప్పులు రాలాయనటం వక్రోక్తి. నితాంతదంత అన్నంత వరకు దంత్యాక్షర విశిష్టమైన రచన. క్రోధాన్ని లాస్యసుందరంగా, పళ్ళు పటపట కొరుకుతుండగా కనుబొమ్మలు వికటంగా నర్తనం చేస్తున్నవని తిక్కనగారి వర్ణన. భీముని మనసులో ఎన్ని భావాలు కదిలాయో సీసపద్యంలో ఆ తర్వాత చెప్పారు. ఈ విధంగా కోపంలో ఉన్న వ్యక్తి సంపూర్ణ స్వరూపాన్ని కవిబ్రహ్మ చిత్రించారు.

'చేరువనున్న యున్నత వృక్షంబు వీక్షించి యాననంబు పల్లటిల్ల' భీముని ధర్మరాజు వలలుండెక్కడ జూచె అని సంబోధించి 'విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపగా గల యీ భూజము వంట కట్టియలకై ఖండింపగా నేటికిన్' అని చెప్పి వారిస్తాడు. అన్నగారి మాట విని భీముడు ఆగిపోతాడు.

ద్రౌపది 'ఈ నరపతి యాస్థానములో నొక్కరుడైన' అని సభలోని వారిని ఆక్షేపిస్తుంది. ధర్మరాజు ఆమె సభకు వచ్చుట మర్యాదకాని, నటిలాగా ప్రవర్తిస్తున్నదని అంటాడు. దీంతో ఆమె 'నాదు వల్లభుండు నటుడింత నిక్కంబు' అని మత్పతి శైలూషుండు కాదు కితవుండని' నిందిస్తుంది. ఆమె రోషం, నిందావిధానం సహజంగా ఉండి సన్నివేశం రక్తి కడుతుంది.

ద్రౌపది పరాభవంతో వెళ్ళి భీముని కలుస్తుంది. 'మందమంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శంబున' భీముడు నిద్రలేస్తాడు. తన బాధను చెప్పుకొని కీచకుని సంహరించమని కోరుతుంది. ధర్మరాజు మహిమను చెప్పి పాండవుల రాజభోగాలను, బలపరాక్రమాదులని గుర్తు తెచ్చుకొని శోకిస్తుంది. వారి ప్రస్తుత జీవితానికి బాధపడుతుంది. వారు నర్తనశాలలో కీచక వధకు పథకం రచిస్తారు.

తరువాత ప్రభాతకాల వర్ణనలో తిక్కన 'ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు' అని ద్రౌపది మనోగత భావాలు కనిపించేటట్టు రాసారు. చంద్రుని వర్ణన, తారకోదయాది వర్ణనము కూడా అలంకార శోభితంగా, భావికథాసూచకంగా చూపించారు. "పెనఁకువఁ దనిసిన తనువు లొండొంరిటితోఁ గీలించి నిద్రించి మేలుకాంచి తరుణులు" అని తిక్కన ప్రకృతిలోని శృంగారాన్ని వర్ణించారు.

ద్రౌపది కీచకునితో నర్తనశాలలో కలుద్దామని చెపుతుంది. ఇక్కడ ద్రౌపది కీచకుని చూసీచూడనట్లుగా ఉండటం, ఆమె ప్రవర్తన, మాట్లాడిన విధానం అంతా నాటకీయతతో ఉంది.

కీచకుడు పశుపక్ష్యాదుల శృంగార చేష్టలను చూసి పులకించిపోతాడు. ద్రౌపదితో వివిధ విధాలుగా సుఖించాలని "కెంగేలు గేలితో గీలించి", "గుచము లురంబున గుదియించి", "ఇంతి వింత భంగుల కెలయించి వెకలిచేసి యభిమత క్రీడనములకు నలవరింతు"... అని ఇలా ఆలోచిస్తాడు.

సూర్యాస్తమయ వర్ణనని ఇక్కడ తిక్కన కథానుకూలంగా చేసారు. 'ఇనుడు దనకడకు నేతెంచిన రాగము బొందుటది యుచితమనగా' అనటం కీచకవధకు తగినట్లుగా ఉన్న వర్ణన. చుక్కలు ఒకటొకటిగా రావటం, జనసంచారం తగ్గిపోవటం, చంద్రోదయం మొదలైన వర్ణనలన్నీ శిల్ప ఔచిత్యాన్ని చూపిస్తున్నాయి.

నర్తనశాల వివేకరహితుని హృదయంబునుం బోలె ఉందనే వస్తు వర్ణన కీచకుని హృదయాన్ని సూచిస్తోంది. 'విదగ్ధ వనితా ప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును" అనటం ద్రౌపదికి సూచిస్తోంది. నర్తనశాలలోకి సతికేలు పట్టుకొని భీముడు ప్రవేశిస్తాడు. "ఘోరాటవీ భావగంబునుబోలె నిర్మనుష్యంబున ఉన్న శాల" చీకటితో ఉండటం కీచకవధా ఘట్టానికి కావల్సిన లక్షణం. ఈ శాల వర్ణన సన్నివేశానికి తగినట్లుగా ఉంది.

భీముడు నర్తనశాల ప్రవేశించి పాంచాలిని దాగి ఉండమనటం చేష్టాసూచితం. తల్పాన పడుకొని భీముడు పాంచాలిలా నటించటం, అతని మాటలు నాటకీయ హాస్యాన్ని (Dramatic Irony) కలిగిస్తాయి. భీముడు కీచకునితో నన్ను ముట్టుకున్న తర్వాత నీవు స్త్రీల దగ్గరగా వెళతావా? నా శరీరం చేర్చినపుడు నా శరీరం ఏమవుతుంది అని ప్రశ్నిస్తాడు. వీటివల్ల శ్రవ్యకావ్య పూర్ణానుభూతి కలుగుతుంది.

సమయం మించిపోతోందన్న భయంతో భీముడు గ్రక్కున లేచి దండ తాడిత భుజంగము భంగి విజృంభిస్తాడు. ఇద్దరూ కొంతసేపు పోరాడతారు. భీముడు చప్పుడు చేయని నిగూఢ విమర్దన ప్రహారాలతో తన మల్లయుద్ధ ప్రావీణ్యాన్ని చూపిస్తాడు. చివరగా భీమునికి వికృతపు చావు చంపాలని వేడుక పుడుతుంది. మస్తకమును బీన దీర్ఘ భుజశాఖలు బాదయుగంబు మేనిలోనికి జొర నుగ్గుగా దుటిమి కీచకుని చక్కని ముద్దగా చేస్తాడు.[10] పాంచాలిని పరాభవించినందుకు కీచకుడు ఈ విధంగా ప్రతిఫలం పొందాడు. 'చింతాశల్యము వాసెనే భుజభలోత్సేకంబు నీకెక్కెనే' అని ద్రౌపది వెంటపడిన వాళ్ళకు తన చేతిలో చావక తప్పదని చెపుతాడు. భీముని గర్వం, కార్యసాధన, వీరత్వం, సతిప్రేమ, అనునయం మొదలైనవన్నీ దీనిలో కనిపిస్తాయి. భీముడు ద్రౌపదికి క్రిందపడి ఉన్న పీనుగును చూపిస్తాడు. అచ్చెరువు, భయము, ప్రియము కలబోసిన భావాలతో ద్రౌపది కీచకుని శవాన్ని చూస్తుంది. అది సందర్భం కాదు కాబట్టి మౌనంగా వివిధ చేష్టలు చేస్తుంది. ఇది చక్కని మూకాభినయం అవుతుంది.

చూచుచుఁ జేరి వ్రేల్మిడుచుచుం దలయూచి విలక్షచిత్తయై
యా చపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై
కీచక యింత సేసితి సుఖత్వముఁ బొందుదుగాక యింక న
ట్లేచిన నిట్లుగా కుడుగునే యనుచున్ వెఱఁగందు చుండఁగన్

పాఠకులు ఉత్కంఠ తొలిగిపోయి ఆనందపడతారు. తిక్కన నానారసాభ్యుదయం ద్వితీయాశ్వాసంలో వెల్లివిరిసింది. దీనిలో నవరసాలను పోషించిన తీరు అద్భుతం. నాటక నియమావళి అనుసరించే కీచక వధా ఘట్టం జరిగింది. మొత్తం కథ నడిచిన ప్రాంతాలు తక్కువ. మొత్తం మీద రెండు పగళ్ళు, రెండు రాత్రుల కాలంలో ఈ ఘట్టం పరిసమాప్తమవుతుంది.

తిక్కన విరాటపర్వంలోని వస్తువు మానవ జీవితానికి సన్నిహితంగా ఉండి వారిని నాటకంలో లీనమయ్యేలా చేస్తుంది. నాటకం చూసిన తర్వాత ప్రేక్షకులు కీచక వధ సమర్థనీయమని భావిస్తారు. పరస్త్రీ వాంఛ కీచకుని ప్రాణానికి ముప్పు తెచ్చింది,

ప్రేక్షకులు ఈ ఇతివృత్తాన్ని వారి దైనందిన జీవితాలతో అన్వయించుకుంటారు. క్షాళన చెందుతారు. ఇది తిక్కన విరాటపర్వ విజయం.

తిక్కన సాహిత్యంలో ఉన్నత ప్రమాణాలు సాధించాడు. అతని లేఖిని ఆంధ్రావళికి మోదము కలిగించింది. అతని భాషా ప్రయోగాలు, వర్ణన, నాటకీయత అన్యులు ప్రయోగించలేనివి. మనస్తత్వ నిరూపిత రచనావిధానంలో తిక్కన అగ్రగణ్యుడు. అతని కావ్యంలో తిక్కన ఆదర్శాలు కనిపిస్తాయి. తిక్కన సాహిత్యం తెలుగుజాతికి ఒక అమూల్య వరం.

## వివరణలు:

1. కృషిర్భూ వాచన శ్శబ్దో - ఇశ్చ నిర్వృత్తి వాచకః
   విష్ణుస్తద్భావ యోగాశ్చ - కృష్ణో భవతి శాశ్వతః

   - ఉద్యోగపర్వం

   శ్రీ ఆదిశంకరులు కృష్ణ శబ్దాన్ని 'ఇతి వ్యాస వచనాత్ సచ్చిదానందాత్మకః కృష్ణ' అని వివరించారు. శరీరాత్మ సమన్వయమే హరిహరతత్వము.

   "తమోమయాత్మకో రుద్రః సాత్విక మయాత్మకో విష్ణుః రాజస మయాత్మకో బ్రహ్మః" - అని పాశుపత బ్రహ్మోపనిషత్తు స్పష్టం చేస్తోంది
   "ఏకోదేవో బ్రహుధాని విష్ణుః" అని ముద్గలోపనిషత్తు సూత్రం.

2. డా॥ ఎల్లూరి శివారెడ్డి తన "ఆంధ్రమహాభారతములో రసపోషణము" గ్రంథంలో తిక్కన ఎప్పుడు శృంగారాన్ని వర్ణించినా భావముల తీవ్రతను, రుచిరతను, ఆ భావాలకు ఉద్దీపనము కలిగించు విషయాలను మాత్రమే వర్ణించునని వివరిస్తూ తిక్కనగారి అమలిన శృంగారభావాన్ని వివరించి చెప్పారు.
3. నాటకాలకు చెంది ప్రాచీనులు ఏర్పరచిన సూత్రాల్లో ఒకటి విష్కంభం. నాటకంలో ప్రదర్శనకి కుదరని దీర్ఘకాల వృత్తాంతాలు, భూతభవిష్యత్ వృత్తాంతాలు మొదలైనవి సూచించేవి విష్కంభాలు.
4. సంస్కృత నాటకాల్లో భావికథ సూచించేది గండము. ఇది సూచ్యార్థ సూచనము. కీచకవధా ఘట్టంలో భీముడు ద్రౌపదికి కలిగించిన వినోదాన్ని మల్లునితో పోట్లాడిన సన్నివేశం సూచిస్తోంది.
5. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనేవి మన్మథుని అయిదు బాణములు. ద్రౌపదీరూపం అనే ఉచ్చులో కీచకుని హృదయం అనే మృగం చిక్కుకున్నదని తిక్కన చెప్పారు. ఇక్కడ కీచకునికి ద్రౌపది 'సంక్రందన సూతి' అర్జునుని భార్య అని తెలియదు.
6. "విను నీరూపము సూచి మా నృపతి యువ్విళ్ళూరు" అని విరాట పర్వం - ప్రథమాశ్వాసంలో (321) ఉంది. సుదేష్ణాదేవి ఈ విధంగా భావించింది.

దుర్భరవగు నినుఁ గర్కటి
గర్భము ధరియించునట్లు
గైకొని నాకై నిర్భర విధ్వం సదశా
విర్భావము దెచ్చికొనుట వెరవైయున్నే

7. మసలు అంటే ఇక్కడ సామాన్యార్థం తిరగటం. అయితే సలసలమసలు అనే ప్రయోగాల్లో వేరే అర్థం వస్తుంది. మదనాగ్ని జ్వాలలలో కీచకుడు మసలుతున్నాడనే విశిష్టార్థం కూడా ఈ సందర్భంగా వస్తుంది.
8. కీచకుని చావుకి నర్తనశాలలో ముహూర్తాన్ని ద్రౌపది, భీమసేనులు పెడతారు. కీచకుడు ద్రౌపదిమీద వ్యామోహంతో మాయారవి ఏల క్రుంకడో అని ఆలోచిస్తాడు. ఇవి తిక్కనగారి శిల్ప విశిష్టతలు.
9. "ఉపమా కాళిదాసస్యః" అన్న వాక్యాన్ననుసరించి చూస్తే తిక్కన కవితా శక్తి తెలుస్తుంది. ఈ ఉపమానాలు కీచకుని జాంతవోద్రేకాన్ని సూచిస్తున్నాయి. 'ఇంపైన ప్రియకాన నిచ్చి నిల్చిన మధువాదట" అన్న పద్యంలో జంతువుల శృంగారాన్ని చూసి "యుల్లంబుననేఁచి కోర్కులదర జిదుముడిపడు ప్రూనుపడు వెడంగుపడు వెనుంబడుఁ దల్లడపడు దురంత చింత బారికి నగపడు సింహబలుడు" కీచకుడు పడ్డ పాట్లని తిక్కన వర్ణించారు.
10. తిక్కన జుగుప్సాభావమును కూడా రమణీయతని జోడించి చెప్పగల సమర్థుడు, రౌద్ర రసం నుంచి బీభత్సరసానికి తీసుకుని వెళ్ళిన రచనా చమత్కారం గొప్పది. వ్యాసభారతంలో ఈ విధంగా ఉంది.

తస్య పాదౌ చ పాణీ చ శిరోగ్రీవాంచ సర్వశః
కాయే ప్రవేశయామాస పశోరివ పినాక ధృక్
తం సంమంధిత సర్వాంగం మాంసపిండోపమం కృతమ్
కృష్ణాయై దర్శయామాస॥

# 6. ఉద్యోగపర్వం - నాటక లక్షణాలు, లావణ్యాలు

శ్రీకృష్ణరాయబార ఘట్టం తిక్కన సోమయాజి నాటకీయతకు అద్దం వంటిది. మహాభారత యుద్ధాన్ని నివారించటానికి మిగిలిన ఏకైక సాధనం సంధి. దీనికి పాండవుల తరపున రాయబారిగా భగవానుడు స్వయంగా వెళ్ళటం విశేషం. శ్రీకృష్ణునితో మాట్లాడుతూ 'అయిదూళ్ళను మాకిచ్చినను జాలు' నని ధర్మరాజు అంటాడు. కానీ 'ఆ దుర్యోదనుడు అంత మాత్రమును జేయంజాలడే' అన్న శంక ఉంది. కలహం వల్ల ప్రాణహాని కల్గుతుందని, పోరులో జయమగు నోదుదుమను నిశ్చయ మెక్కడ లేదు అని ధర్మజుడు అంటాడు. పగ కలిగితే పాము ఉన్న ఇంట్లో ఉన్నట్లు అని కులక్షయంగాకుండా ఏ విధంగానైనా సయోధ్య నెలకొనేలా చూడమని శ్రీకృష్ణుని కోరతాడు. ఇవి ధర్మరాజాదుల చిత్తశుద్ధిని వివరిస్తున్నాయి.

"లోకంబెల్ల మెచ్చం బ్రకాశిత ధర్మస్థితి నొంది మా మనము నిశ్చింతంబుగాఁ జేయుమీ" అన్న పాండవాగ్రజుని కోరిక వారి ధర్మబుద్ధిని సూచిస్తోంది. కృష్ణుడు ధర్మరాజుతో కౌరవుల దుర్ణయంబు చెపుతాడు.

గురుభీష్మాదులు సూచు చుండ సభ మీకుం గీడు నాఁడట్లు ము
ష్కరులై చేసిరి యంత సేసియును బశ్చాత్తాపముం బొంద నో
పర వా రెన్నడు నట్టిచోటఁ గృపయున్ బంధుత్వముం దక్కు మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకుల గర్వ క్రౌర్యముల్ సూచినన్

మొదటినుంచి పాండవులపై క్రౌర్యంగా ప్రవర్తిస్తూ, వారికి కీడు కలిగించాలని చూసిన కౌరవులు సంధికి ఒప్పుకుంటారా అని ప్రశ్నించటం ద్వారా మహాభారత యుద్ధం జరుగుతుందనే సూచన ధ్వనిస్తోంది. పై పద్యం పాఠకులని వివిధ సన్నివేశాలను శ్రద్ధగా చదివేటట్లుగా వారి మనస్తత్వాన్ని నాటకగమనానికి అనుగుణంగా ఉండేలా సంసిద్ధం చేస్తోంది. 'ఎవ్వరుఁ గోపింపరె' అనటం ద్వారా ఇది సాధించబడింది.

భారతంలో కర్తవ్యపాలన ప్రాముఖ్యత వివరించబడింది. శ్రీకృష్ణుడు 'పాపాత్మకులగు హింసకులం బాముల నెట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు" అని ప్రబోధిస్తాడు. ఈ వచనం తిక్కనగారి గద్య రచనాశక్తిని నిరూపిస్తోంది.[(1)] ధర్మరాజు వినయాన్ని, ధర్మమార్గాన్ని కౌరవసభలో వివరిస్తానని కృష్ణుడు చెపుతాడు. భీముడు 'సమరంబు గలుగుననుచును మము వెఱపింపంగవలదు మాధవ' అని పాండవకౌరవులు మొదట్లో పాలునీరుగా కలిసిమెలసి ఉండేవారని దుర్యోధనుడి దుష్టచేష్టలు కులక్షయానికి దారితీస్తాయని అంటాడు.

శ్రీకృష్ణుడు, ధర్మరాజు, భీముడు మాట్లాడుతున్న విధానమంతా ఒక నాటకంలో పాత్రధారులు మాట్లాడినట్టు ఉంటుంది. భీముడు తన మాటగా కురుకులేశ్వరుని ఆస్థానంలో సుయోధనునితో 'అన్నదమ్ములమై ఉండి పరులు తలఎత్తి చూసే పరిస్థితి రాకుండా చూడాలని, సంధి చేయమని పెద్దవారి మాట వినమని' చెప్పమంటాడు. శ్రీకృష్ణుడు కౌరవులతో యుద్ధానికి భీముని పురికొల్పుతాడు. "వెఱ పెట్టిదియో యెన్నఁడు నెఱుఁగని నీయట్టి వానికెవ్వరొకో యీ పిఱికితన మింత యలవడఁ" అని శౌరి కలకల నవ్వుతాడు. ఈ ఎత్తిపొడుపు మాటల వల్ల భీమునిలో యుద్ధావేశం కలిగేటట్లు మాట్లాడటం నాటకీయతతో ఉండి పాఠకులని అలరిస్తుంది. కృష్ణుడు "ఇదే పోయెద" అనటం ఒక చేష్టాసూచితంగా ఉంటుంది.

అర్జునుడు తన అభిప్రాయం చెపుతూ కౌరవులకి, తమకు ఒడంబడిక చేసి పుడమిని సగముగా చేయమని దానివల్ల మేలు జరుగుతుందని అంటాడు. సంబోధనలో కృష్ణుని ఉద్దేశించి కంసమర్దనా, భుజంగ భంజనా అనటం పాండవులు కూడా దుష్టశిక్షణ చేస్తారన్న ఊహ కల్గిస్తోంది.

నకులుడు 'పద్మనాభ నీ యనుగ్రహమున' అంటూ శ్రీకృష్ణుడు వెళితే కార్యం అవుతుందని అభిప్రాయం వ్యక్తం చేస్తాడు. సహదేవుడు 'సుయోధనుండెక్కడ భూమిలోన సగమిచ్చుట యెక్కడ దానవాంతకా'. అని శ్రీకృష్ణునితో అంటాడు. ఇక్కడ పాండవుల హావభావాలు, మాట్లాడిన విధానం చాలా సహజంగా కనిపిస్తాయి.

ద్రౌపది స్త్రీ పాత్ర. కౌరవుల దుశ్చేష్టల మూలంగా ఆమె ఎంతో బాధపడింది. ధర్మనందనుని పలుకులు ఆమెకు హృదయతాపం కల్గిస్తాయి. ఆమె గద్గద కంఠంతో ఈ విధంగా మాట్లాడుతుంది.

అంతలు సేసి పో నడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె యిట్టి యూరట మదిం బ్రియ మంది యుధిష్ఠరుండు దా
నంతన యూళు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చు నొక్కొ యీ
కంత కృపావిహీనమతి నాతఁడు నేఁచునె యన్నదమ్ములన్

ద్రౌపది ఆత్మాభిమానం కలది. ఆమె వ్యక్తిత్వం, రోషం, ఆలోచనా రీతిపై పద్యంలో కనిపిస్తాయి. తన గురించి మాట్లాడుతూ వరాన పుట్టినదాన్నని, పాండురాజునకు కోడలైనానని, జనవంద్యులను పొందానని, నీతి విక్రమ స్థిరులగు పుత్రులకు తల్లి అయినానని, అన్ని విషయాలలో ప్రశస్తికెక్కానని అని చెపుతుంది. కృష్ణుడు సుభద్ర కన్నా ఎక్కువగా ఆప్యాయం చూపించే తనను 'వేణి వట్టి యీ యేవురుఁ జూడగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే' అని తన అవమానాన్ని గుర్తు చేసుకుంటుంది. 'బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మున విడ్చి వెంద్రుకల్ దా వల చేతఁ బూని' అన్నప్పుడు రోషమూర్తి ద్రౌపదిరూపం కళ్ళ ముందు కన్పిస్తుంది. ఆమె శిరోజాలు 'మహాభుజంగమో' అన్నట్లు ఉన్నాయనటం అతిశయోక్తి అలంకారం.(2) మనంబున బొంగు విషాదరోషముల్ గాఁవగ లేక బాష్పములు గ్రమ్మగ దిగ్గున లేచి అన్న

సందర్భంలో కరుణరసం చాలా సహజంగా పోషించబడింది. దిగ్గునలేచి అనగానే ఒక్కసారిగా విషాదమూర్తి ద్రౌపది లేచి నిల్చున్నట్లు మన ముందు సాక్షాత్కరిస్తుంది.

"ఈ వెంద్రుకలు వట్టి యీడ్చిన యా చేయి దొలుతగాఁ బోరిలో దుస్ససేను తను *వింతలింతులు తునియలై చెదరి రూపఱి యున్నఁ గని యుడ కాఱుఁ గా*" పై మాటలు ద్రౌపది ఆవేశాన్ని, కసిని వెల్లడిస్తున్నాయి. తను వింతలింతలు అంటున్నపుడు ఆనాడు దుశ్శాసనుడు చేసిన అవమానం గుర్తుకు తెచ్చుకొని శోకతప్త హృదయంతో ఉన్న ద్రౌపదిపై పాఠకులకు సానుభూతి కలుగుతుంది. శ్రీకృష్ణుడు ద్రౌపదిని పరిపరివిధాలుగా ఓదారుస్తాడు.

శ్రీకృష్ణునికి పాండవులు, ధార్తరాష్ట్రులు చుట్టఱికంబున ఒక్కరూపు కాబట్టి ఉభయపక్షాలకు ఉచితహితము చేయమని అర్జునుడు కోరతాడు. దీనికి అజాతశత్రువు ధర్మరాజు 'చిత్తంబున పొంగి' అట్లు చేయమని అంటాడు.

పాండవుల ధర్మబుద్ధి, నీతి, ఓర్పు, సహనం మొదలైనవన్నీ ఇక్కడ నిరూపితమయ్యాయి. పాఠకులలో వారిపట్ల అభిమానం, సానుభూతి పెరుగుతాయి.[3]

శ్రీకృష్ణుడు రాయబారం కోసం వెళుతూ "దుర్యోధనుడు దుష్టాత్మకుం డతండు మన్నించు మానుసులునుం గుటిల బుద్ధులు గావున జక్రగదాద్యాయుధంబులు రథంబునం బెట్టింపవలయుననని" సాత్యకితో అంటాడు. దీనిలో కృష్ణుని దూరదృష్టి, ప్రణాళికాచాతుర్యం కనిపిస్తాయి. శ్రీకృష్ణుడు వెళుతూ దారిలో నారదాది మహామునులను చూసి రథం దిగి నమస్కరిస్తాడు.

ధృతరాష్ట్రుడు విదురునితో శ్రీకృష్ణుని రాక చెప్పి సంతోషిస్తాడు. దుర్యోధనుడు భీష్మునితో, తండ్రితో మాట్లాడుతూ దురాలోచనలు చేస్తాడు. 'పాండవులకు నేడుగడయు జనార్దనుం డతనిం బట్టి బంధించిన ఱెక్కలు విఱిగిన పులుఁగులుంబోలె వారు నాకు విధేయులగుదురు' అని దుర్బుద్ధి చూపిస్తాడు. దీనికి ధృతరాష్ట్రుడు "ఓహో యిట్లనుట జగద్ద్రోహం" అని చెప్పి వారిస్తాడు. ఇక్కడ ఓహో అనటం వాచికాభినయం. గుడ్డివాడైన రాజు కొడుకుని వారిస్తూ అంగిక వాచికాభినయనాలు చేయటం మనం ఇక్కడ చూడవచ్చు.[4]

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని మందిరానికి వెళుతుండగా స్త్రీలు రమ్యహర్మ్యంబులపై నిలిచి వారిలోవారు ఇలా మాట్లాడుకున్నారు.

*ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల పాలు ద్రావిన ప్రౌఢబాలుఁడితఁడె*
*వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించిన యా జగజెట్టి యితఁడె*
*దుర్వృతుండగు కంసుఁ దునిమి యాతని తండ్రిఁ బట్టంబు గట్టిన ప్రభువితండె*
*సత్యభామకుఁ బారిజాతంపుపైఁ గల కోర్కి దీర్చిన రసికుండితండె*

పై పద్యాన్ని చదువుతున్నప్పుడు ఇళ్ళపై భాగాన నిల్చిన స్త్రీ సమూహం కళ్ళముందు గోచరమవుతుంది. బాలుడితడె అన్నప్పుడు వేలుపెట్టి కృష్ణునివేపు చూపించి మాట్లాడుకున్నారని తెలుస్తోంది.

అలానే శ్రీకృష్ణుని వివిధ లీలావిశేషాలను వారు గుర్తుకు తెచ్చుకున్నట్లే అవి మనకళ్ళ ముందూ తిరుగుతాయి. ఇలా వర్తమాన విషయాలను వర్ణిస్తూ భూతకాలానికి చెందిన దృశ్యాలని ప్రస్తావించటం శిల్పపరంగా ఒక చక్కని విధానం.

ధర్మరాజాదుల మాటలని ధృతరాష్ట్రునికి చెప్పి శ్రీకృష్ణుడు విదురుని వద్దకు వెళతాడు. పాండవుల వృత్తాంతం వివరించిన అనంతరం కుంతీసదనానికి వెళ్ళి ఆమెతో సంభాషిస్తాడు. "అద్దేవియు నతని తోడు నీడయుంబోని తన కొడుకులం దలంచి యడలు పుట్టిన నమ్మాధవుని మెడ వట్టికొని యెలుంగెత్తి" ఏడుస్తుంది. కృష్ణుని చూసిన వెంటనే తన కుమారులు గుర్తుకువచ్చి కుంతీదేవి శోకించటం ఒక మాతృమూర్తి వేదనని వెల్లడిస్తోంది.(5) కృష్ణుని మెడపట్టుకొని అన్నప్పుడు కుంతీదేవి రూపం పాఠకుల మదిలో మెదుల్తుంది. కుంతీదేవి ధర్మరాజాదుల యోగ క్షేమాలని విచారించి వారి పరిస్థితులకు శోకిస్తుంది. భీమార్జున నకులసహదేవులకు 'భుజ బలమున జీవించుట నిజధర్మము మెత్తబడుట నింద్యము' అని తన మాటగా చెప్పమంటుంది. శ్రీకృష్ణుడు కుంతీదేవితో "ఉత్సాహంబున శత్రుకులోత్సాదన విధి యొనర్చి యున్నత సామ్రాజ్యోత్సవము నొందు పుత్రుల నుత్సుకతం జూతుగాక" అని ఊరడిస్తాడు. కుంతీదేవి ఈ మాటలతో మొహం విప్పారి "కృష్ణుని మాట వేదంబ కాదె యఖిలంబునకున్" అని పలుకుతుంది. వీరిద్దరి సంభాషణా విధానం కూడా శ్రవ్యకావ్యంలో పాఠకులకి నాటకాన్ని చూస్తున్న అనుభూతిని కలిగిస్తుంది.

శ్రీకృష్ణుడు దుర్యోధనునితో 'మధురసంభాషణంబులు' చేస్తాడు. భోజనం చేయమన్న గాంధారీనందనుని మాటలకు కృష్ణుడు 'ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడి కూడది లెస్స కూడు' అని అంటాడు. అలానే 'పగవారి యింట గుడిచిన నగుఁ దమ కనుమాన మమృతమైనను' అని చెపుతాడు. ఈ సంభాషణంతా కృష్ణుని రాజనీతిని, మాటకారితనాన్ని వెల్లడిస్తోంది. "ఇట్లున్న మీ యందఱ యన్నంబులు దుష్టాన్నంబులు విదురుండొక్కని యన్నంబు భోక్తవ్యం బని" శ్రీకృష్ణుడు నిశ్చయిస్తాడు. భోజనం చేయననటం, ఆ విధంగా ఆగ్రహాన్ని వ్యక్తం చేయటం, అవతలివారిలో అపరాధ భావాన్ని కలిగించటం మొదలైనవన్నీ నిత్యజీవితంలో మానవప్రవృత్తిని వివరిస్తున్నాయి.

శ్రీకృష్ణుడు విదురునితో సంభాషించిన విధానం అంతా ప్రేమపూర్వకంగా ఉంటుంది. విదురుడు ఇచ్చిన ఆతిథ్యాన్ని భగవంతుడైన శ్రీకృష్ణుడు ప్రేమగా స్వీకరిస్తాడు. తర్వాత రాయబారం కోసం సభాస్థలికి బయలుదేరతాడు.

శ్రీకృష్ణుడు వివిధ పాత్రలతో సన్నిహితంగా మాట్లాడిన సన్నివేశాలన్నీ చక్కగా, సన్నివేశానికి తగిన సంభాషణతో ఉండి రక్తికట్టాయి. ఇవన్నీ నాటకవికాసంలోని వివిధ దృశ్యాలు. ఈ సన్నివేశాలన్నింటిలోనూ పాత్రచిత్రీకరణ, అభినయం, ఆహార్యం, రసపరిపోషణ మొదలైనవన్నీ అద్భుతంగా పోషించబడ్డాయి.

సభలోకి వెళ్ళిన తర్వాత అంతరిక్షంలో నారదముని ప్రముఖులు ఉజ్వలులై కనిపిస్తారు. వారిని ఉచితాసనములలో కూచోమని ఆహ్వానించి అందరూ ఆసీనులవుతారు. నారదాది మునులు అంతరిక్షంలో కనిపించటం నాటకాన్ని వీక్షిస్తున్న ప్రేక్షకుల్లో విస్మయం కలిగించటానికి ఉద్దేశించిన దృశ్యం.

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో సంభాషిస్తూ 'జననాథ నీ యెఱుంగని పనులు గలవె' అని అంటాడు. ఇది సంభాషణాచాతుర్యానికి సంబంధించినది. అందరూ వివిధ కనక మణిమయ ఆసనాలలో ఆసీనులవటం కూడా నాటకంలోని ఒక సన్నివేశాన్ని గుర్తుకు తెస్తోంది. కృష్ణుడు ఈ విధంగా మాట్లాడతాడు:

భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణ యుఁ గల్గియుండు ననఁగా నుతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁ దమ్ముఁడు నీ తనయుల్ యశోధురం
ధర శుభశీల రీ సుచరిత క్రమ మిప్పుడు దప్ప నేటికిన్

ప్రశాంతంగా నచ్చచెపుతున్న ధోరణిలో శ్రీకృష్ణుడు మాట్లాడుతున్న విధానానికి తగినట్లుగా పై పద్యం ఉంది. సభలోని ప్రముఖులతో ధర్మబద్ధంగా మాట్లాడుతున్న భగవానుని దివ్యమంగళరూపం కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తుంది.(6)

శ్రీకృష్ణుడు పాండవులు చెప్పిన మాటలు ధృతరాష్ట్రునితో వివరిస్తాడు. 'వారి తండ్రి పాలు వారికి నిచ్చి నీ పాలు నీవుఁ బుత్రపౌత్రచయము ననుభవించి' సుఖంగా ఉండమని నీతి చెపుతాడు.

జామదగ్న్య మహాముని సుయోధనునితో 'వినుము దంబోద్భవుం డనురాజు దనకెదురెవ్వరు లేరంచు గ్రొవ్వి' నరనారాయణులు తపోనిష్ఠలో ఉండగా వారితో కయ్యమాడి వెనక్కిమళ్ళారని వారే శ్రీకృష్ణార్జునులని చెపుతాడు. కణ్వుడు గరుత్మంతుని వృత్తాంతాన్ని చెప్పి విష్ణువు అతన్ని గర్వాన్ని అణిచివేసిన విధానాన్ని చెపుతాడు. ఈ రెండు వృత్తాంతాలు రెండు చక్కని ఉపనాటికలుగా ఈ నాటకంలో కనిపిస్తున్నాయి. ఈ విధంగా నాటకంలో నాటకం వచ్చేటట్లుగా రచించిన శిల్పనైపుణ్యం తిక్కనగారి ప్రతిభను వివరిస్తోంది.(7)

గాలవుని వృత్తాంతాన్ని వివరించి 'నెట్టివారికి నిర్బంధము దగదు' అని మునులు హితము చెపుతారు. కానీ "మునీంద్రులు సెప్పిన హితోపదేశంబుల దెస ననాదరంబు సేసి గాంధారేయుండు రాధేయుంగనుంగొని చే యప్పళించి నవ్వి వీర లింత వెఱ్ఱులగుదురే "అన్న మాటలు దుర్యోధనుని దుష్టబుద్ధిని సూచిస్తున్నాయి. "చే యప్పళించి నవ్వి" అన్నప్పుడు మూకాభినయం గుర్తుకు వస్తోంది.

దుర్యోధనుడు నారదాదిమునుల మాటలని నిరాకరిస్తాడు. "మునులారా నన్ను విధియేమని పుట్టించె నట్టులయ్యెడుఁ" అని మొండిగా తన మాటలు చెపుతాడు. ధృతరాష్ట్రుడు 'మందబుద్ధి నాదు నందనుఁ డీవు పోరాని చుట్టమవు మహానుభావుఁ డవు' అని కృష్ణునితో అంటాడు. ఇక్కడ మందబుద్ధినాదు నందనుడు అన్నప్పుడు దుర్యోధనుని వేపు చూపించటం, నీవు అన్నప్పుడు కృష్ణుని వేపు చూపటం మొదలైన చేష్టలన్నీ నాటకంలో లాగా ఉన్నాయి.

పాండవులు అజేయులనీ వారిని గెలవటం దుర్లభమని దుర్యోధనునితో శ్రీకృష్ణుడు అంటాడు.

వారును మీరుఁ బొంది జనవల్లభు లెల్లను భృత్యభావనం
జేర సమస్తవస్తువులుఁ జేకుఱఁగాఁ బ్రదుకొప్పుఁగాక నీ
కీరస మెత్తికోల్ గఱపి యిప్పుడు కార్యము దప్పఁ జూచు నీ
వారలు ముట్టవచ్చిన నవశ్యము నంతకుఁ జాలరుంజుమీ

ఉద్యోగపర్వము తృతీయాశ్వాసములో శ్రీకృష్ణుడు సభలో ప్రసంగించే సన్నివేశం చాలా ముఖ్యమైంది. దీన్ని దృష్టిలో ఉంచుకునే తిక్కనగారు ఈ సన్నివేశాన్ని తీర్చిదిద్దారు.(8) దీనిలోని ప్రతి పద్యం ఒక దృశ్యాన్ని వివరిస్తుంది. ఆయా సన్నివేశాల్లో వివిధ పాత్రలు రంగస్థల ప్రవేశం చేయటం, వంతులవారీగా మాట్లాడటం, అభినయించటం మొదలైనవన్నీ చక్కని నాటకీయశైలితో ఉండి ప్రేక్షకులకు ఆనందం కలిగిస్తాయి.

భీష్మద్రోణులు కూడా దుర్యోధనునికి హితము చెపుతారు. "కృష్ణార్జునుల తోడి విరోధంబే బంధులోకంబునక కాదు లోకంబున నెవ్వరికినిం జూడం బోలదు" అని భీష్మపితామహుడు మెల్లగా నచ్చచెపుతాడు. ద్రోణాచార్యులు 'వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తారవాక్ప్రచయంబుత్రోవఁ బో వన్న కుమార యట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు' అని బోధిస్తాడు.

ఎవరెన్ని చెప్పినా దుర్యోధనుడు తన మంకుపట్టు వీడదు. చాలా నిర్లక్ష్యంగా 'వాడి సూదిమొన యించుక మోపిన యంత మాత్రయున్ భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె' అని సంగ్రామంలో గెలుపొంది రాజ్యము చేస్తానని నిర్లక్ష్యంగా మాట్లాడతాడు.

శ్రీకృష్ణుడు దుర్యోధనునితో అంతుకు ముందు చేసిన చెడ్డ పనులు చెప్పి అతని తీవ్ర పాపబుద్ధి వలననే అంతవరకు వచ్చిందని వివరిస్తాడు. పాండవులకు 'విషమిడి, పెనుబాముల గఱపించి, నీరిలోఁ గట్టి త్రోచి, లక్కయిల్ గాలిచి పెక్కుభంగులఁ జంపఁ దలచిన "దుర్యోధుని పాపాలను నిరసిస్తాడు. ఈ సందర్భంలో శ్రీకృష్ణుని భావోద్రేకం కనిపిస్తుంది. కపట జూదం కల్పించి పాండవుల సంపదలను దోచుకున్న వైనాన్ని, సతుల తలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి చీరలొలిపించిన దుర్మార్గాన్ని, దుర్యోధనుడు కర్ణుడు సభలో మాట్లాడిన అసభ్యమైన మాటలు మొదలైనవన్నీ చెప్పి పద్ధతి మార్చుకోమని మదోన్మత్తుడైన దుర్యోధనునికి చెపుతాడు.

నారాయణుడు నానాప్రకారాలుగా నీతి చెప్పినా దుర్యోధనుడు వినిపించుకోడు. దుర్యోధనునితో దుశ్శాసనుడు "కృష్ణునితో నిన్నొప్పించు వారింత నిజం బిచ్చట నింత నీయునికి నెట్లుం గీడు పుట్టుం జుమీ" అని అంటాడు. వెంటనే రాజసమున దుర్యోధనుడు దిగ్గన లేచి పోతాడు. అతని వెంటనే కర్ణుడు, శకుని, కొందరు రాజులు లేచి బయటకి వెళతారు. దీనికి భీష్ముడు ఆశ్చర్యపోతాడు. 'చనిరేమి తలంచియో' అని కీడు శంకిస్తాడు.

ఈ దుర్యోధనుఁ డింత గర్వియగునే యీయున్నవారెల్ల నా
చే దైన్యంబునఁ బొందు టొప్పు దని చర్చింపండ యీ భంగికిన్
లేదే యొండు దెఱంగు సత్కులముఁ బాలింపంగ వర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ బోదే భేద మీ జాతికిన్

కృష్ణుడు రాయబారిగా వచ్చాడు. దుర్యోధనాదులు సభ వదిలిపెట్టి వెళ్ళటం అమర్యాదా సూచితం. కృష్ణుడు దీన్ని ఎంత మాత్రము సహింపలేదు. శాంతమూర్తుల సహనాన్ని దుర్మార్గులు అసమర్థతగా భావించి కీడు తలపెట్టటానికి సైతం వెనుకాడరు. కృష్ణుని మాటలు అతని క్రోధాన్ని వెల్లడిస్తున్నాయి.

వైద్యుడు దుర్మాంసముకోసి రోగికి చికిత్స చేయును. ఉత్తమ పురుషుడు శత్రువులనే దుర్మాంసముకోసి సమాజానికి పట్టిన పీడ నిర్మూలిస్తాడు(9) శ్రీకృష్ణుడు 'నేను దుర్మాంసము గోయు వైద్యుని క్రమంబున నాతని ద్రుంచి' అని ధర్మసంస్థాపన తన ప్రథమ కర్తవ్యమని వివరిస్తాడు. ఇక్కడ శ్రీకృష్ణుని ఉత్సాహాన్ని, ఆవేశాన్ని చూడవచ్చు.

ధృతరాష్ట్రుడు ఈ మాటలకు అదిరిపడి విదురునితో త్వరగా వెళ్ళి గాంధారిని తోడ్కొని రమ్మని చెపుతాడు. 'నీవైనఁ జెప్పి శాంతుంగావింపగ నోపుదేనిఁ' అని గాంధారితో అంటాడు. వీరందరూ పిలవగా 'మొగము జేవుతింపఁగ' సభకు దుర్యోధనుడు తిరిగి వస్తాడు. తల్లి అతనికి ధర్మంబును, నీతియును, జుట్టతికంబును బ్రతుకుఁ దెరువును నిజశక్తిని' అన్నీ చెపుతుంది. కానీ, దుర్యోధనుడు ఆ మాటలను అనాదరం చేసి 'యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణాదులం గలసి వారునుం దానునుం దుర్మంత్రంబునకు' సిద్ధపడతాడు. శ్రీకృష్ణుని పట్టి చెరలో పెడితే పాండవులకు దిగులు పుడుతుందని, కోరలు పీకిన పాములు ఏం చేస్తాయనీ దుష్టచతుష్టయం పథకం వేస్తారు. 'హరిబట్టు సంకులము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్ బఱటి కొనిపోయి కృతవర్మఁ బన్నఁ బనిది'. సాత్యకికి విషయం తెలిసి జనార్ధనునికి విషయం వివరిస్తాడు.

విదురుడు దుర్యోధనుని దుర్మంత్రాన్ని తెలుసుకొని భయపడతాడు. 'శ్రీకాంతు దైత్యాంతకుం బొదువందారు దలంచుటెల్ల ననలంబు జీర బంధింపగా మది నూహించిన' అన్న సాత్యకి మాటలతో విదురునికి జరుగుతున్నదంతా తెల్సి ఏ ఉపద్రవం రాబోతుందోనని ఆలోచిస్తాడు. విషయాన్ని 'హరిం గేవల మర్త్యుఁగాఁదలఁచి' దుర్యోధనాదులు 'మంటపై వావిరిఁ గ్రమ్మి నా శలభ వర్గము చాడ్పున మ్రంది పోరె' అని మహారాజుకి వివరిస్తాడు.

గోవిందుడు విషయం గ్రహించి కోపితుడవుతాడు. 'రోషము నా పయిం గలిగి క్రూరతం గౌరవులింత సేఁత' అని ధృతరాష్ట్రునితో అంటాడు. వెంటనే సంభ్రమంగా ధృతరాష్ట్రుడు విదురునితో 'దుశ్శాసనాది సకల పరిజనంబును నా దుర్జనునిం దోడ్కొని రమ్మని' నివేదిస్తాడు. సపరివారంగా వచ్చిన దుర్యోధనునితో తండ్రి 'అలవి యెఱుంగ కిట్లు దనుజారికిఁ గీ డొనరింప నీవు నీ తులువలు నుత్సహించి తిరి దుర్మతులార' అంటాడు. మహాద్రిని కదల్చటం, దావానలం అదుపుచేయటం, శ్రీకృష్ణుని బంధింప

పోవటం అసంభవమనీ వివరిస్తాడు. 'వినాశముఁ బొందెద రేమి సేయుదున్' అని తల పట్టుకుంటాడు.

విదురుడు సుయోధనునితో 'బాలకేళిఁ దొడఁగి లీలం గృష్ణుఁ డెచట నెచట నెవ్వరెవ్వరి నేమేమి సేసె వినవె యేల చెడియెదిట్లు' అని అంటాడు. ఈ సందర్భంలో సాత్యకి, విదురుడు, భీష్ముడు, ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని గురించి చెప్పిన మాటలు, అతను మర్త్యుడుకాడనీ సాక్షాత్తూ విష్ణువే అనీ వెల్లడిస్తున్నాయి.

వాసుదేవుడు 'యే నొక్కరుండన యని తలంచియె బొదివిపట్ట నుత్సాహంబు చేసితివి' అని దుర్యోధనునితో చెప్పి దరహాసము చేస్తాడు. ఒక్కడినే అనుకున్నావా అన్న వ్యంగ్య వాక్యంలో శ్రీకృష్ణుని విరాట్ స్వరూపం సూచితం.

విశ్వరూప సందర్శనము అద్భుత రసావిష్కరణకు చక్కని ఉదాహరణ. విశ్వరూప ప్రయోజనం కార్యజగత్తుకు మూలకారణమైన కారణజగత్తును దర్శించటం. నాటకాన్ని చూస్తున్న ప్రేక్షకులు దీనితో సంభ్రమాశ్చర్యాలకు గురవుతారు. అద్భుత దృశ్యాన్ని చూసిన అనుభూతి వారి స్వంతమవుతుంది.

శ్రీకృష్ణుడు దరహాసము చేయగానే 'ఫాల ప్రదేశంబున బ్రహ్మయు వక్షంబున విరూపాక్షుండును, వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్ర యమ వరుణకుబేరులు నాదిత్యమరు ద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి. హలగాండీవమండిత బాహులగు బలదేవార్జునులు సవ్యదక్షిణ భుజంబులును నిజాయుధహస్తు లగు యుధిష్ఠర భీమ నకుల సహదేవులు వీఁపునను వివిధ ప్రహరణ పాణులగు యదువృష్ణిభోజాంధక వీరులూరులను బ్రభవించిరి. జనిత నానా హస్త విన్యస్తంబులయి శంఖచక్ర గదాఖడ్గ శక్తి శార్ఙ్గ ప్రముఖ నిఖిల సాధనంబులు వెలింగె నేత్రశ్రోత్ర నానా వివరంబుల సధూమ ధూమకేతు జ్వాలా జాలంబులు నిగిడె రోమకూపకలాపంబులం దరణి కిరణ నిభప్రభలు వెడలె".

అద్భుతమైన విశ్వరూప సందర్శనం వల్ల సభాసదులంతా సుప్రీతులవుతారు. భగవానుడు 'భీష్మ విదుర ద్రోణ సంజయుల వలనను, నారదాది మహామునుల వలనను గరుణాతరంగితం బగు కటాక్ష వీక్షణం బొలయ వారలకు దివ్యదృష్టి' అందిస్తాడు. వారందరూ హరి విశ్వరూపాన్ని సందర్శించి సంతోషపడతారు. దేవదుందుభులు మ్రోగుతాయి. కల్పవృక్ష పుష్పధారామయ వృష్టి కురుస్తుంది. సిద్ధ సాధ్య విద్యాధరశ్రేణి జయజయధ్వానాలు చేస్తారు. అప్పుడు ధృతరాష్ట్రుడు ఆ మహాసంకులం అంతా విష్ణుని విజృంభణగా తెల్సుకుంటాడు. 'కరుణింపుము సంశ్రిత భయహరణ ధురీణా సహింపు యజ్ఞానంబున్' అని వేడుకుంటాడు. నీ పాదపద్మాలను కనుగొనే వరం ప్రసాదింపమని పరమాత్మని ప్రార్థిస్తాడు. పరమాత్ముడు దయార్ద్రచిత్తుడయి ధృతరాష్ట్రునికి దృష్టి ప్రసాదిస్తాడు. అంధుడైన రాజుకి దయతో విశ్వరూప సందర్శన భాగ్యం కల్గిస్తాడు. విశ్వరూపాన్ని సందర్శించి ధృతరాష్ట్రుడు భక్తితో మొక్కుతాడు. "నిను గంటి గృతార్థుఁ డనైతి నింక నొల్ల నొరులఁ జూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే' అని శ్రీకృష్ణుని ప్రార్థిస్తాడు.

విశ్వరూప సందర్శనభాగ్యం అటువంటిది. ధృతరాష్ట్రునికి ఇంక భౌతిక ప్రపంచంలోని ఏ విషయం చూడాలని అనిపించలేదు. ఈ అనుభూతి విశ్వరూపాన్ని

సందర్శించిన ప్రతివారికీ కలిగింది. లోకోత్తరమైన విశ్వరూప దర్శనంతో పవిత్రమైన దృష్టి పాపపంకిలం కాగూడదని అతని అభిమతం. ఈ దృశ్యాన్ని చూసిన ప్రేక్షకులు అందరూ కూడా ధృతరాష్ట్రుని అభిప్రాయంతో ఏకీభవిస్తారు.

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని కోరికను మన్నించి అతని దృష్టి ఉపసంహరిస్తాడు. తన విశ్వరూపాన్ని కూడా ఉపసంహరిస్తాడు. మునీంద్రులందరూ కూడా అంతర్ధానమవుతారు. శ్రీకృష్ణుడు వెనక్కి మళ్ళుతాడు.

ఉద్యోగపర్వం తృతీయాశ్వాసంలో రసపరిపోషణ అద్భుతంగా జరిగింది. శ్రీకృష్ణుడు రాయబారిగా వెళ్ళినప్పుడు మాట్లాడిన మాటల్లో వీరరసం పోషించబడింది. శ్రీకృష్ణుని విశ్వరూప సందర్శనాఘట్టంలో అద్భుతరసం వెల్లివిరిసింది. ద్రౌపది మాటలలో కరుణరసం చాలా పరిపూర్ణంగా కనిపిస్తుంది. వివిధ సంభాషణలు పాత్రోచితంగా ఉన్నాయి. మహాభారతంలో శ్రీకృష్ణరాయబార ఘట్టం ఒక చక్కని సన్నివేశం. ఈ సన్నివేశాన్ని నాటకీయంగా మలచిన గొప్ప నాటకకర్త తిక్కన సోమయాజి.

## వివరణలు:

1. 'వాక్య సాంగత్యము సేయుచోనయిన గద్యము తోడుగఁ జెప్పిపెట్టి' అనటం. తిక్కన గద్య రచనలో ఆరితేరినవాడు అని చెపుతోంది. దీన్ని నిరూపించటానికి అనేక ఆధారాలు భారతంలో కనిపిస్తాయి. తిక్కన సందర్భానుసారంగా గద్యాన్ని ప్రయోగించి తన రచనకు సొగసుని తెచ్చాడు. సామెతలని, వ్యావహారిక భాషా ప్రయోగాలని చేసి తెలుగు పదాల శక్తిని వెల్లడించాడు.
2. ద్రౌపది మాటల్లో రౌద్రరసం కనిపిస్తుంది. 'ఇంతలింతలు' తునాతునకలు కావాలనటం అభినయం. అలా కాని పక్షంలో భీమార్జునుల పరాక్రమము వృథా. అర్జునుని 'కట్టి' అని వ్యంగ్యంగా, కోపావేశంతో సంబోధిస్తుంది. ఈ వెంద్రుకలు అనటం వాటిని ఆ చేతి నుంచి ఈ చేతిలోకి మార్చటం కూడా రౌద్రరస వర్ణన అవుతోంది.
3. 'భావప్రకాశము'లో ఈ విధంగా పేర్కొన్నారు:

   *యస్తుష్టేతుష్టి మాప్నోతి శోకేక ముపైతి చ*
   *క్రోధోకృద్ధోభయే భీరు: స: శ్రేష్ఠ ప్రేక్షక: స్మృత:*

   కథానాయకుని తుష్టియందు తాను తుష్టుడై, అతని శోకాన్ని తాను అనుభవించి, అతని క్రోధంతో రోషం పొంది, అతను భీతుడైతే తాను భయపడేవాడు శ్రేష్ఠుడైన ప్రేక్షకుడు.

   ఈ విధంగా ప్రేక్షకులలో అనుభూతులని కలిగించేది ఉత్తమ దృశ్యకావ్యం.
4. శ్రవ్యకావ్యం కన్నా నాటకం చూస్తేనే రసానందం కలుగుతుంది. ఈ సందర్భంలో సన్నివేశాన్ని నాటక లక్షణ సంభరితముగా తీర్చిదిద్దిన తిక్కన నైపుణ్యాన్ని చూడవచ్చు. రసచిత్తులైన కవులు శ్రవ్య కావ్యార్థాలని కూడా ప్రత్యక్ష కల్పముగా చేయగలరని భట్టతౌతుని అభిప్రాయం.

వర్ణనోత్కలితాః భోగప్రౌఢోక్త్యా సమ్యగర్పితాః
ఉద్యాన కాంతా చంద్రాద్యాః భావాః ప్రత్యక్షవత్ స్ఫుటాః

5. తిక్కన అంగికాభినయ పూర్వకముగా కుంతీదేవిని వర్ణించాడు. పుత్రుల శోకం ఆమె శోకానికి విభావము అయింది.
భరతుని నాట్యశాస్త్రమందు శోకం గురించి ఈ విధంగా ఉంది.

"స్త్రీ నీచ ప్రకృతి ష్వేష శోకో వ్యసన సంభవం।
ధైర్యేణోత్తమ మధ్యానాం నీచానం రుదితేన చ"॥

6. తిక్కన శ్రీకృష్ణుని రూపాన్ని సుమధురంగా ఇలా వర్ణించాడు.
ఇది నాటకంలోని పాత్రవర్ణనలాగా ఉంది.
అంబున శుభగాత్రం బీ
తాంబార ధరుఁ గమలదళ నిభాక్షున్ హరిఁ జూ
డం బడసి లోచనములమృ
తం బానిన మాడ్కి ముదంబున దేలన్ (ఉద్యోగ - 3-254)

7. ఆంగ్లనాటకకర్త విలియం షేక్స్పియర్ తన నాటకం 'Hamlet' లో ఈ విధానాన్ని పాటించాడు. అక్కడ తన బాబాయి అపరాధభావాన్ని తెల్సుకోవటానికి హామ్లెట్ ఒక నాటకాన్ని ప్రదర్శిస్తాడు. ఇక్కడ గరుత్మంతుని వృత్తాంతం ద్వారా దుర్యోధనునిలో అపరాధ భావం కలిగించి, అతనికి బుద్ధిచెప్పటం ఆశయం.

8. "రాయబార ఘట్టమున శ్రీకృష్ణుడు ప్రదర్శించిన చాతుర్యము రాజకీయరంగమున తిక్కన గడించిన అపార అనుభవమునకు చక్కని నిదర్శనము" అని డా॥ జి.నాగయ్య అభిప్రాయపడ్డారు. ఈ సన్నివేశాల్లో ఆత్మకథా విధానం కనిపిస్తోంది.

9. పోతన తన భాగవతంలో ఈ విధంగా రాసాడు.
"అంగవ్రాతములోఁ జికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీ యజ్ఞుం గులద్రోహి॥" (సప్తమ-188)

10. రాయబారానికి వచ్చిన శ్రీకృష్ణుని పరమేశ్వరునిగా సదస్యులు భావించారని ఈ పద్యం నిరూపిస్తోంది.

ఆ కొలువువారు కరమచ
లాకృతి నొక పలుకులేక యందఱు వింజం
బాఁ కిడిన కరణి నవశము
దాకారిత చిత్తవృత్తులై యుండంగన్ (ఉద్యోగ - 3-258)

# బమ్మెర పోతన

'శ్రీ కైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్' అని భాగవత కావ్యాన్ని ప్రతిఫలాపేక్షరహితంగా రచించిన పోతరాజు తెలుగులో చాలా గొప్పకవి. పండితులకు పరీక్ష అయిన భాగవతాన్ని తెలుగులో అత్యంత రమణీయమైన శైలితో చెప్పిన భాగవతుడు పోతన తెలంగాణాప్రాంతానికి చెందిన ఓరుగల్లులోని బమ్మెర గ్రామానికి చెందినవాడని పరిశోధకులు సప్రమాణకంగా నిరూపించారు. పోతనగారిది కౌండిన్యసగోత్రము, అపస్తంబ సూత్రం. పోతన మొదట్లో వీరశైవుడైనా భాగవతం రచించేనాటికి హరిహరులకు భేదం ఎంచని అద్వైతిగా మారాడు. యివటూరి సోమనారాధ్యుడు పోతన గురువు. వీరభద్ర విజయము, భోగినీ దండకము, నారాయణ శతకము అనేవి పోతన కృతులు.

సహజపండితుడైన పోతన కీర్తికి భాగవతమే మూలం. సంస్కృతంలోని భాగవతాన్ని అనన్య సామాన్యంగా పోతన అనువాదం చేసాడు. భక్తుల విజయగాథలని పోతనామాత్యుడు అందించిన విధానం చాలా శ్రేష్టమైంది. సామాన్య హాలిక జీవితాన్ని గడిపిన పోతన తాత్వికుడై ఆత్మగౌరవంతో బతికాడు. పోతన వ్యక్తిత్వం చాలా ఉన్నతమైనదనటానికి అతని భాగవత రచనా విధానమే ఉదాహరణ. ఈ కావ్యంలోని ప్రతి వాక్యంలోనూ పోతరాజు వ్యక్తిత్వం కనిపిస్తుంటుంది. భాగవతంలో భక్తుల గాథలని చూస్తే పోతన ఎంత గొప్ప భక్తుడో తెలుస్తుంది. 'రాజ్యము గీజ్యముమే సతతమ్' అని భావించిన ఈ కవీశ్వరుడు ఎన్ని ఒత్తిడులు వచ్చినా లొంగిపోక, తన కావ్యాన్ని భగవంతునికే అంకితం ఇవ్వటం గమనార్హం.

15వ శతాబ్ది ఉత్తరార్థిలో జీవించిన పోతన పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్రుడు. పోతనది కథానువాద, భావానువాద విధానమని పండితులు చెపుతారు. అనువాదం విషయంలో పోతన ఔచిత్యదృష్టి పరిశీలించదగింది. సందర్భానుసారంగా విపులీకరించి రాయటం, మూలభిన్న రచనలు చేయటం, పెంచిరాయటం ఈ కవి విధానం. వర్ణనలు, పాత్రపోషణము, రసపోషణము, వ్యంగ్య రచన, భక్తిప్రకటన మొదలైన వాటిలో మహాభాగవతం చాలా ప్రామాణికమైంది. కొందరు దీనిలోని కథలను మనోజ్ఞ కథారూపకముగా ఉన్నాయని చెపుతారు. ఏది ఏమైనా భాగవతంలోని వామనావతారం, శ్రీకృష్ణుని లీలలు, గజేంద్రమోక్షం, ప్రహ్లాదునికథ, రుక్మిణీ కళ్యాణం మొదలైనవన్నీ తెలుగువాళ్ళకు నిత్యం పారాయణ యోగ్యం. భాగవత పద్యాల్లో కనీసం కొన్ని అయినా రాని తెలుగువాడు లేడనటం నిజం. ధనమదాంధుల కొలువేల తాపసులకి – అని చెప్పిన పోతన అక్షరాలకు అమ్మ సరస్వతినే నమ్ముకున్నాడు. ఈ కవితోపాసకుని జీవితం చాలా ఆదర్శవంతమైంది. భక్తులందరికీ పోతన భాగవతం దారి చూపుతూ వారు కర్మపాశాలను తొలగించుకోవటంలో ఉపయుక్తంగా ఉంటుంది. పోతన ఒక పుణ్యపురుషుడు.

# 7. శ్రీమహాభాగవతం - భాగవతాఖ్య కల్పతరు వుర్వీన్ సద్విజశ్రేయమై

శ్రీమహాభాగవతము ఇతర మహాపురాణాల వలనే ముముక్షువులకు నిత్యపఠనీయ గ్రంథం. తెలుగులో మహాభారత, రామాయణ గ్రంథాలవలే భాగవతం పేరు పొందింది. నిగళకల్పతరు గళితమైన శ్రీమహాభాగవతాన్ని భగవద్రూపముగా పరమ భాగవతులందరూ భావిస్తారు. వేదాంత శ్రవణ, గీతాపారాయణములచే కూడా లభ్యంకాని భక్తిజ్ఞానవైరాగ్యాలు కేవలం భాగవత పఠనం లేదా శ్రవణం ద్వారా సమకూరుతాయని పండితులు అంటారు.

"నిగమములు వేయి జదివిన, సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా"

భాగవతాన్ని వేదంగానే పెద్దలు పరిగణిస్తున్నారు. పండిత కీర్తనీయుడగు బమ్మెరపోతన తనకుతానుగానే ప్రేరణచెంది భాగవతరచన చేద్దామని నిశ్చయించుకున్నాడు. పోతన భాగవతం ఉత్పన్నమవటానికి ఆనాటి దేశ సామాజిక రాజకీయ సాంస్కృతిక పరిస్థితులే కారణం అని భావించవచ్చు. ఏ కారణం వల్లనో పోతనగారి భాగవత నిక్షేపం యథాతథంగా లభ్యమవటం లేదు. రాచకొండను ఏలు సర్వజ్ఞసింగ భూపాలుడు భాగవతాన్ని పాతిపెట్టించాడని, దానిలోని కొన్ని భాగాలు శిథిలమై పోయాయని చెప్పే ఒక కథనం ప్రచారంలో ఉంది. వెలిగందుల నారయ్య గంగన, సింగన లాంటి కొందరు కవులు ఖిలమైపోయిన వివిధ భాగాలను పూరించారని విశ్వసించబడుతోంది. పదునారవ శతాబ్దిలో ఖమ్మంమెట్టు ప్రాంతంలో నివసించిన హరిభట్టు అనే పండిత కవి శ్రీ మహాభాగవతంలోని కొన్ని శిథిల భాగాలను పూరించాడు.

శ్రీనాథయుగమున వెలసిన ఆంధ్ర మహాభాగవతం ఒక మహాకావ్యము. దీనిలోని అనేక పద్యాలు, మాటలు ఈనాటికీ ప్రజలందరి నాలుకలపై నలుగుతూ ఉండటమే దీని గొప్పతనానికి, సుపరిచితకు నిదర్శనం. వ్యాసకవి ప్రణీతమైన సంస్కృత భాగవతాన్ని స్వీకరించినా పోతన దీని తెలుగుసేత ద్వారా అనువాదాన్ని నిర్వచించి, దానికి నూతన అర్థం కల్పించారు. దీనిలో కవిత్రయము వారి స్వతంత్ర విధానము, శ్రీనాథుని భావానువాద విధానము మిళితమయ్యాయి. పోతన మహాభక్తుడు. భాగవతం భగవంతుని కరుణకు పాత్రులైన భక్తుల భక్తి విశేషాలను వివరిస్తుంది. అందుకని భక్తిపారవశ్యంతో పోతన ఎక్కడ వీలైతే అక్కడ భక్తిభావాలకు తన స్వీయాభిప్రాయాలను కలిపి వివరించారు. మూలములో కొన్ని తాత్విక విషయములు సాధారణ పాఠకులకు వివరణలేకుండా అర్థం అవని కారణాన పోతన వాటిని విపులీకరించారు. శ్రీధరుని భాగవత వ్యాఖ్యానము సహాయంతో పోతన సందర్భోచితంగా పెంపు చేసారు. కొన్ని చోట్ల యథాతథానువాదం కూడా కనిపిస్తుంది. మూలంలో లేకున్నా పోతన నరకాసుర సంహార ఘట్టంలో సత్యభామ యుద్ధాన్ని అత్యంత మనోహరంగా రచించాడు. భగవంతుని భక్తరక్షణ పరాయణతను మిక్కిలి ఔచిత్య శోభితంగా వర్ణించటం

పోతనలాంటి కవులకే చెల్లుతుంది. గజేంద్ర మోక్షఘట్టంలో పోతన 'అలవైకుంఠ పురంబులో' లాంటి అపురూప పద్యాలను ప్రయోగించి ఎంతో విస్తృతపర్చారు.

భాగవతానికి అసంఖ్యాకమైన వ్యాఖ్యలున్నాయని చెపుతారు. వీటిలో శ్రీధరుని వ్యాఖ్యకే అధిక ప్రచారం ఉంది.[1] పోతన తన భాగవత అనువాద విషయంలో దీన్నే అనుసరించి అద్వైతపరంగానే భాగవతాన్ని అనువదించాడు. మూలమున సూచ్య మాత్రములుగా ఉన్న ఒకటి, రెండు పదాలను గ్రహించి వానికి వ్యాఖ్య లేకపోయినా స్వీయప్రతిభతో పోతన వివరించిన విధానం ప్రశస్తమైంది. పోతన మూలంలోని శ్లోకాలను అనువదిస్తున్నపుడు పద్యం కొంత భాగంలోనే భావము వ్యక్తీకరించబడితే, మిగిలిన పద్యభాగాన్ని చాలా రమ్యముగా పూరించాడు. ఈ పూరణలలో పోతన భావనాశక్తి, సంక్షిప్తత కనిపిస్తున్నాయి. పొరపాటునో లేదా కావాలనో పోతన మూలానికి భిన్నంగా రచనలు సాగించిన సందర్భాలు కూడా ఉన్నాయి.

గద్యరచనలో కూడా పోతరాజుది పరిపూర్ణ విధానం. మహాభాగవతములోఅతి దీర్ఘములైన కొన్ని వచనాలలో పోతన వచనరచనా విశిష్టత కనిపిస్తుంది. ఈ దీర్ఘ వచనాలలో కొన్ని అనుప్రాసాది శబ్దాలంకాలతోనూ, రూపకం, ఉపమ, ద్వర్థి వంటి అలంకారాలతోనూ, శ్లేష విరోదాభాసములతోనూ అలరారుచున్నాయి. పోతనకి శబ్దంపై అధికారం మెండు. భాగవత కావ్యంలోని మొత్తం గద్యపద్యాలలో దరిదాపుగా మూడింట రెండువంతులు వచనములే కనిపిస్తున్నాయి. కొన్న వచనాలు ఏక పద పంక్తి పరిమితమైనవి అయినా ఆయా సందర్భాలకు తగినట్లు ఉన్నాయి. పోతనగారి వచనం ఎక్కువగా సంస్కృత పదాలతో ఉండి, ధ్వని సౌందర్యంతో నిండి ఉండటం విశేషం.

పోతన కవిత్వము ఛందస్సంపాదితమైన లయసౌందర్యంతోనూ, వివిధ అలంకారాల కూర్పుతో నిండిన గాంభీర్యంతోనూ, మధుర ప్రసన్న పదప్రయోగముతోనూ ఉండి నిండుగా ప్రవహించే భాగీరదిలా భాసిల్లుతుందని కావ్యప్రేమికులు భావిస్తారు. తెలుగు భాష మాధుర్యాన్ని చవిచూడాలంటే పోతనగారి భాగవతాన్ని చదవటం మంచిది. నన్నయగారి అక్షరరమ్యత పోతన గ్రంథంలోనే కనిపిస్తుంది.

పోతనగారు కందపద్యాలను రచించటంలో నిష్ణాతులు. కందములు, సీసములు రచించటంలో పోతన విజయం సాధించాడు. సామాన్య వృత్తాలలో మత్తేభాలను పోతన ఎక్కువగా ఉపయోగించాడు. ఏ వృత్తాన్ని తీసుకున్నా ఈ సహజపండితుని చేతుల్లో అవి మధురాతి మధుర భావసంచయిని లాగా శోభిల్లాయి. సంస్కృత సమాస ప్రచురములైన పద్యాలు, తెలుగు పలుకుల తీయదనంతో నిండినవి పోతన భాగవతంలో అసంఖ్యాకంగా లభిస్తున్నాయి. పెక్కు పద్యాలలో రసభావ పరిపోషణ పరమోన్నతంగా ఉంది. పదాలను అతి జాగ్రత్తగా ఏరికూర్చిన పోతన పద్యాలు ఏ యుగానికైనా నిలిచి ఉంటాయని చెప్పటానికి ఈ కారణాలు సరిపోతాయి.

పోతన – భాగవతంలో అఖండ యతిని ప్రయోగించాడు. రేఫ రకారములకు యతి యతి ప్రాస విషయంలో మైత్రి పాటించని కారణంగా కొందరు పోతనని అంగీకరించలేదు. కొందరు అప్పకవీయాన్ని అనుసరించి భాగవతంలోని యతిని

దిద్దటానికి ప్రయత్నించారు. మహాకవి పోతన ఉ - పు యతిని, ఋ - రు యతిని విరివిగా వాడాడు. అప్పకవీయాన్ని ఆధారంగా చేసుకొని పోతన కృతిలోని యతులని దిద్దటం భావ్యం కాదని ఎక్కువ మంది తెలిసినవాళ్ళు చెపుతారు.

పోతన రచనలో మాండలిక పద ప్రయోగాలు, అన్యదేశ్యాలు, సుదీర్ఘమైన సమాసాలు, జాతీయాలు, సామెతలు, అనుకరణాలు ఇబ్బడిముబ్బడిగా కనిపిస్తాయి. కొన్ని తెలుగు నుడికారాలను సంస్కృతీకరించి పోతనగారు అలవోకగా ప్రయోగించారు. సంస్కృతవాక్యాలను కూడా యథాతథంగా ప్రయోగించటం వల్ల భాగవతానికి ఒక విశిష్టత ఏర్పడింది.[2] ధ్వన్యనుకరణ పదాలను (Onamatopiac words) కూడా పోతన ప్రయోగించారు. నన్నయాది పూర్వకవుల అనుకరణలు పోతన రచనల్లో కనిపిస్తాయి. అనేక పద్యాలలో శ్లేష చమత్కృతి ఉంది.

పోతన భాగవతం ఆధారంగా దోనూరి కోనేరునాథుడు బాలభాగవతాన్ని రచించాడు. వెన్నెలకంటి సూరన, వెలిగందల నారయ, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి, కాసుల పురుషోత్తం కవి మొదలైన వారి రచనలపై పోతన ప్రభావం కన్పిస్తుంది. ధర్మపురి శేషప్పకవి రచించిన నరసింహ శతకంలోనూ పోతనగారి భావాలు ప్రతిధ్వనించాయి. ఆదిభట్ల నారాయణదాసుగారి ముందుకాలం నుంచే అనేకులు భాగవతంలోని ప్రసిద్ధ ఘట్టాలను హరికథ ఇతివృత్తాలుగా స్వీకరించేవారు. ఈ విధంగా ఎందరో రచయితలు వారి రచనల్లో భాగవత భావాలను స్వీకరించటం జరిగింది. ఇది భాగవత గ్రంథ ప్రజాదరణను, ప్రాశస్త్యాన్ని వివరిస్తోంది.

మహాభక్తుడు బమ్మెరపోతన గ్రంథ ప్రారంభంలోనే శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్ అని చెప్పటం క్షణభంగురమైన ఐహికసుఖాపేక్షలను ఆశించికాక పరమేశ్వరుని చరణాలను చేరటానికి మాత్రమే అంటాడు. కావ్యారంభంలో ఆశీర్వాదంకాని, వస్తునిర్దేశం కాని, నమస్కారము కాని చేయాలని లాక్షణిక నియమం. భాగవతం మొదటి పద్యంలోనే పోతన వస్తునిర్దేశం చేస్తున్నాడు.

శ్రీకైవల్య పదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోక ర
క్షై కారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండ కుంభకు మహానందాంగనాడింభకున్

దీర్ఘమైన శ్రీకార ప్రయోగం హృద్యంగా ఉంది ఏదో అనిర్వచనీయమైన హృదయానందాన్ని అందిస్తోంది. మహాభాగవతంలో మహానందాంగనాడింభకుడైన శ్రీకృష్ణభగవానుని లీలల వర్ణనే కావ్య వస్తువు. పోతన కృతిపతి ఆ భగవంతుడే అయిన కారణంగా అతని స్మరణతోనే కావ్యాన్ని ప్రారంభిస్తున్నాడు. శ్రీకృష్ణుని వర్ణించటానికి పోతన ప్రయోగించిన విశేషాలు భాగవతంలోని వస్తువుని సూచిస్తున్నాయి. భక్తపాలన కళా సంరంభకుడు, దానవోద్రేక స్తంభకుడు అనే విశేషాలు భాగవత కావ్యంలోని నాయకుడు అయిన భగవంతుడు భక్తులని రక్షించటానికి సర్వదా ఉత్సాహంతో ఉంటాడని, దానవుల ఉద్రేకాన్ని స్తంభింపచేయటానికి అనేక అవతారాలను దాల్చి

దుష్టశిక్షణ చేస్తాడని వివరిస్తున్నాయి. భాగవతంలోని ప్రధాన కథలన్నింటిలోనూ భగవంతుని ఆర్త త్రాణ పరాయణత్వం ప్రకటితమవుతోంది. భగవంతుడు 'కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నానా కంజాత భవాండ డింభకుడు' అనటం సృష్టి రహస్యాన్ని గురించి వివరిస్తోంది. బ్రహ్మాండాన్ని సృష్టించిన ఆ పరమపురుషుని జగన్నాటక సూత్రధారుని కరుణాకటాక్షాలను ఈ కావ్యం విశదీకరిస్తుంది. సృష్టిహేతువు ఛాందోగ్యోపనిషద్‌లో చెప్పబడింది. మహాభాగవతం దీన్ని అంగీకరిస్తోంది. సకలలోకాలకు మూలమైన ఆ విరాట్‌స్వరూపుని కీర్తించి పోతన భక్తులందరికీ అనుసరణీయమైన మార్గాన్ని చూపుతున్నాడు.

పోతన ఆశయం పునర్జన్మ లేని స్థితికి చేరుకొని జీవితాన్ని సఫలం చేసుకోవటం. దీనికి మహాభాగవత రచన ఒక సాధనవంటిదని ఆయన విశ్వాసం. కర్మ, జ్ఞాన మార్గాలకన్నా భక్తిమార్గమే సులభమైనదని పోతరాజు చెపుతున్నాడు. దీనికి నిదర్శనంగా అంబరీషుడు, ప్రహ్లాదుడు, నారదుడు, బలి, గజేంద్రుడు, రుక్మిణిదేవి మొదలైన భక్తుల కథలను పోతన ఎంతో ఉత్సాహంతో, శ్రద్ధతో రచించాడు.

ఇష్టదేవతా ప్రార్థనలో పోతన శివుడిని అత్యంత భక్తి ప్రవత్తులతో కీర్తిస్తాడు. గణాధిపతిని 'విఘ్నవల్లికాచ్ఛేది' గా పిలుస్తూ ఆదరంతో మొక్కుతాడు. 'వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్' అంటూ ఆ సరస్వతీదేవిని మనసులో స్మరిస్తాడు. 'ముగురమ్మల మూలపుటమ్మ'గా ఆ మాహేశ్వరిని పూజించిన పోతన ఆ అమ్మలగన్నయమ్మ దయతో మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలు పొందాడు. అజ్ఞానాంధకారాన్ని పారద్రోలే దినకరుడిని పూజిస్తాడు. పోతనగారి భక్త్యావేశం ఇక్కడ చూడవచ్చు.

పూర్వకవులని పేరుపేరుగా స్మరించటం పోతన శీల నిదర్శనం. 'ప్రథమ కవితా విరచన విద్యావిలాసాతిరేకి' వాల్మీకి అంటే పోతనగారికి భక్తి. వ్యాసుని కవిత్వం అందరికీ మార్గదర్శకం. 'నిగమవహ విభాగ నిర్ణయ నిపుణతా సముల్లాసుండగు' వ్యాసునికి మొక్కటం ద్వారా వ్యాసుని రచనావిధానాన్ని పోతన ఆకళింపు చేసుకున్నాడని భావించే వీలు ఉంది. అయితే వ్యాసుని కొడుకు శుకుడు సాధించిన విలువలు అధికం. అందుకే 'శ్రీమహాభాగవత కథా సుధారస ప్రయోగి' శుకయోగికి నమస్కరించి పోతన తన భాగవత రచనని ప్రారంభించాడు.

సంస్కృత కవుల్లో బాణ, మయూర, కాళిదాసు, భారవి, మాఘుడు లాంటి మేటి కవులందరినీ పోతన పేరుపేరునా స్మరిస్తాడు. తెలుగులో ఆదికవి నన్నయ్య 'ఆంధ్రకవితా గౌరవ జనమనోహరి' గా గౌరవిస్తాడు. తిక్కన మనీషిని పూజిస్తున్నానని, ప్రబంధ పరమేశ్వరుని కీర్తిస్తున్నానని పోతన అంటాడు. ఇతర పూర్వకవులనందరినీ కూడా ఆదరణ పూర్వకంగా స్మరించటం గమనార్హం. 'వర్తమాన కవులకుం బ్రియంబు పలికి భావికవుల బహూకరించి' పోతన తన కావ్యరచనని ప్రారంభిస్తాడు.

ఇతర కవులలాగా, ఐహికసుఖాల కోసం వెంపర్లాడకపోవటం పోతన వ్యక్తిత్వంలోని గొప్పలక్షణం. కావ్యాన్ని "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు, వాహనంబులున్, సొమ్ములు" పుచ్చుకోవటం పోతన అభిమతం కాదు. అశాశ్వతమైన ఈ

భౌతిక సుఖాలు పోతనని ప్రేరేపించలేకపోయాయని అతను తన కవితాశక్తిని పరమేశ్వర ప్రీతికే వెచ్చించ దలుచుకున్నాడని దీంతో స్పష్టం. శరీరము వదిలి "కాలుని సమ్మెట వాటులం బడటం", జననమరణ చక్రంలో చిక్కుకునిపోవటం అవివేకమనే ఒక నిశ్చలాభిప్రాయం వల్ల రాజులసేవ చేయనని పోతన వివరిస్తున్నాడు. తన కావ్యాన్ని ఆ శ్రీహరికి అంకితమివ్వటమే ఈ భాగవతోత్తముని ప్రధాన ఆశయం. అందుకే "బమ్మెర పోతరాజొకండు భాగవతంబు జగద్ధితంబుగన్" రచిస్తున్నాడని ప్రకటించాడు.(3)

పోతన హరిహర చరణారవింద వందనాభిలాషి. హరిహరులకు భేదం లేదని ఈ మనీషి త్రికరణ శుద్ధిగా విశ్వసించాడు. సత్యం అన్ని ధర్మాలలో ఉన్నతమైందని, దయ చాలా ఉత్తమగుణమని భాగవతకర్త వెల్లడిస్తున్నాడు. "చేతులారంగ శివునిఁ బూజింపఁ డేని, నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువఁడేని" అంటూ ఇరువురి దైవాలని సమానదృష్టితో పూజించిన భక్తుడు పోతన. "దయయు, సత్యంబు లోను గాఁదలఁపఁడేని గలుగనేటికిఁ దల్లుల కడుపు చేటు" అంటూ దయావిహీనులని, అసత్యవాదులని నిరసిస్తున్నాడు.

'శ్రీమన్నారాయణ కథా ప్రపంచకుతూహలం' తన పూర్వజన్మ సంచిత తపః ఫలమని పోతన ప్రగాఢ నమ్మకం. పూర్ణ సాత్వికుడైన ఈ కవి చంద్రోదయకాలంలో గోదావరికి పోయి స్నాతుడైనాడు. మహనీయమంజుల పులినతల మండప మధ్యంబున మహేశ్వరధ్యానంలో నిమగ్నుడయ్యాడు. ఈ విధంగా ధ్యానపారవశ్యంబులో ఉన్న పోతన మనోనేత్రాలముందు 'చంద్రమండల సుధాసారంబు పోలిక ముఖమున చిరునవ్వు ఉన్నవాడు వల్లీయుత తమాల వసుమతీజము భంగి బలు విల్లుమూపున' ఉన్నవాడు 'నీలనగాగ్ర సన్నిహితభానుని భంగి ఘన కిరీటము దీలగల్గువాడు' ఒక దివ్యమంగళరూపి దర్శనమిచ్చి అతని జన్మ ధన్యము చేసాడు. మధురభక్తిని వెల్లడించటంలో పోతన లేఖినికి రామబాణంవలే తిరుగులేదు.

ఆ శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహాన్ని పోతన వర్ణించిన విధానం అత్యంత సహజంగా, సమగ్రంగా, సుందరంగా ఉండటానికి అతను సర్వకాల సర్వావస్థలలోనూ ఆ స్వామి సేవలోనే కాలం గడపటమే కారణం. ఒక చెయ్యితిరిగిన చిత్రకారుడు కుంచె చేతపట్టి అతి శ్రద్ధగా చిత్రించిన విధానంలో రామచంద్రుని వర్ణన చేయటం పోతన భక్తికి ఉదాహరణ. ఆ నీలమేఘశ్యాముని చక్కని ఉపమానాలతో పోతన చదువరుల నేత్రాల ముందు సాక్షాత్కరింపచేసాడు. రాముడు 'పుండరీక యుగముఁ బోలు కన్నులవాఁడు'. విశాలమైన బాహువులున్నవాడు.

ఆ రాజశేఖరుని చూసి పోతన అతనితో సంభాషించ ప్రయత్నము చేస్తాడు. పోతన మహేశ్వర ధ్యానంలో ఉండగా కళ్ళముందు రామభద్రుడు సాక్షాత్కరించటమే అతని శివకేశవాద్వైత భావాన్ని నిరూపిస్తోంది. ఆ జానకీపతి పోతనతో "దా రామభద్రుండ మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము నీకు భవబంధములు దెగునని" మాట్లాడాడు. ఆ ప్రభువు ఆజ్ఞని శిరసావహించటమే ఈ భక్తుని జీవిత ఆశయమైంది. ఆనతిచ్చిన రాముడు తిరోహితుడైన తర్వాత పోతన 'సమున్మీలిత నయనుండై వెఱగు పడి చిత్తంబున' ఇలా భావించాడు.

పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద వేఱొండుగాథఁ బలుకఁగ నేలా

పోతన వినయశీలత ఇక్కడ కనిపిస్తోంది. తాను నిమిత్తమాత్రుడనని సర్వం ఆ ప్రభువు ఆజ్ఞమేరకే జరుగుతుందని ప్రకటించటం పరిశీలనాయోగ్యం. సాక్షాత్తు రామభద్రుడే తన నోట ఆ కావ్యాన్ని పలికిస్తున్నాడని చెపుతున్నాడు. భాగవతం తప్ప వేరే గాథ పలకటం ఎందుకని ప్రశ్నించటం సర్వవేదాంత భాండాగారమైన, భాగవతుల కథాసరిత్సాగరమైన మహాభాగవత ప్రాశస్త్యాన్ని వెల్లడించటం అవుతోంది.

భాగవతాన్ని తెలిసి పలకటం 'శూలికైనఁ దమ్మిచూలికైన చిత్రంబు' అనే అభిప్రాయాన్ని పోతన ప్రకటిస్తున్నారు. 'విబుధజనుల వలన విన్నంత కన్నంత తెలియవచ్చునంత తేటపరుచు' అనటం నిగర్వి పోతన మనోప్రవృత్తిని వివరిస్తుంది. పండితుల వద్ద నుంచి తాను విన్నది, చూసింది తనకు తెలిసినంత మేరకు వివరిస్తానని పోతరాజు అంటున్నారు. ఈ రెండు పద్యాలను అన్వయించి చూస్తే తాను చేయబోయే కార్యం ఎంత కష్టమయినదో తెలుసుకున్నాడని అహంకారం దరిచేరకుండా, ఆత్మవిశ్వాసంతో, దైవబలం తోడైతే భాగవతాన్ని తెనుగు చేయగలనని ప్రకటిస్తున్నాడని అర్థమవుతోంది.

ఆనాటి కవుల్లో కొందరు సంస్కృతానికి ప్రాధాన్యతనిస్తే కొందరు తెలుగుకి గౌరవం ఇచ్చేవారు. ఈ ఇరుపక్షాలవారిని మెప్పిస్తానని పోతన సవినయంగా మనవి చేస్తున్నాడు. 'కొందరికిఁ దెనుగు గుణమగు, గొందరికిని సంస్కృతంబు గుణమగు' అని వివరిస్తూ కొందరికి ఈ రెంటిపట్ల ఆదరాభిమానాలు ఉంటాయని అంటాడు. ఆయా సందర్భాలలో కృతుల ద్వారా అందరి మెప్పు పొందటానికి కృషిచేస్తానని చెపుతున్నాడు. భాగవతంలో కొన్ని చోట్ల సంస్కృతపద గాంభీర్యం, మరికొన్ని చోట్ల తెలుగుపద లాలిత్యం అలానే ఇంకొన్ని చోట్ల ఈ రెంటి మిశ్రిత శబ్దార్థ సౌందర్యం కనిపిస్తాయి.

పూర్వకవులు రామాయణ భారతాల జోలికే పోయారుకానీ ఏ కారణంగానో భాగవతాన్ని అనువదించే ప్రక్రియను ప్రారంభించలేదు. తెలుగుసాహితీ కన్య కంఠసీమను భాగవత రత్నాభరణాలతో అలంకరించే అదృష్టాన్ని విధి పోతనకు అందించింది. 'ఒనరన్ నన్నయ తిక్కనాదికవులీ యుర్విం బురాణావళుల్ తెనుఁగుల్ సేయుచు.....తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్' అని పోతన సాహిత్యసేవ చేసే అవకాశం లభించినందుకు పొంగిపోతాడు. దీనికి 'మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో' అనటంతో లభించిన అవకాశం పూర్వజన్మ పుణ్యఫలంగా భావిస్తున్నాడని తేటతెల్లం అవుతోంది. భాగవతాన్ని తెనిగించి తన జన్మను సార్థకం చేసుకుందామని పోతరాజు ఆశయం. భాగవత రచన ద్వారా పునర్జన్మ లేకుండా భగవత్సాన్నిధ్యాన్ని పొందటమే పోతన కోరిక.

భాగవత కావ్య శ్రేష్ఠత దానిలోని ప్రధాన తత్వం వివరిస్తూ పోతన ఈ కావ్యాన్ని కల్పవృక్షంతో పోలుస్తున్నారు.

*లలితస్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం*
*జులతా శోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో*
*జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాల వాలంబునై*
*వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్విజశ్రేయమై*

భాగవతగ్రంథానికి శ్రీకృష్ణుడే మూలం. లలితాదేవి దీనికి ఆధారం. ఈ గాథని గానం చేసిన పుణ్యాత్ముడు శుకుడు. దీన్ని రచించిన వ్యాసుడే దీనికి ఆలవాలం. సద్విజులందరికీ ఈ గ్రంథం మోక్షమార్గాన్ని చూపిస్తూ వారికి సదా శ్రేయస్సు కల్గిస్తుంటుంది. కల్పవృక్షమైన ఈ గ్రంథానికి శివశక్తిస్వరూపిణైన లలితా దేవి స్కంధము. ఈ కల్పవృక్షం మూలం నల్లరంగులో ఉంటుందని ఎన్నో లతలతో పెనవేసుకుని ఉంటుందని మరో అర్థం కూడా వస్తుంది. ఎన్నో పక్షులు ఈ కల్పవృక్షంపై గానాలాపన చేస్తుంటాయి. సుందరమైన, ఉజ్వలమైన వృత్తంతో ఈ వృక్షం శోభిల్లుతోంది. దీన్ని ఆశ్రయించుకున్న వారందరూ మహాఫలాలను పొందుతారు. సద్విజులందరికీ ఈ కల్పతరు శ్రేయస్సు కల్గిస్తుంది. భాగవతంలోని భాగాలను స్కంధములు అంటారు. ఈ స్కంధముల్లో వర్ణితమైంది శ్రీచక్రరూపిణియైన లలితాదేవి లీలలే. శివశక్తి సంపుటము నుంచి జగదుత్పత్తి అవుతుందని భాగవతకావ్యం వెల్లడిస్తుంది.(3)

నిగమ కల్పతర గళితమైన ఫలం భాగవతం. శ్రీమహావిష్ణువు లీలలను వర్ణించే ఈ మహాకావ్యాన్ని దేవర్షి నారదుడు తెచ్చి కృష్ణద్వైపాయనుడైన వ్యాసునికి అందించాడు. వ్యాసుడు దానిని శుఖముఖ నిహితమొనర్చాడు. అమృత సమానమైన భాగవతం శుకముఖాన భూమిపై రాలింది. పద్మపురాణోత్తర ఖండమందలి మొదటి ఆరు అధ్యాయములలో శ్రీమహాభాగవత మహాత్మ్యము వివరించబడింది. పోతన కూడా భాగవతకావ్యం మోక్ష శాస్త్రమని చెపుతున్నాడు.

పోతన చిత్తంలో శ్రీరామచంద్రుని సన్నిధానంబు కల్పించుకొని అహరహం ఆ స్వామిసేవలోనే గడిపిన పుణ్యాత్ముడు. 'విశ్వమయుని అనుదినంబు' పూజిస్తున్నానని, అతనిని కోరి చింతించెదనని అంటాడు. సత్యం పరబ్రహ్మమని పోతన విశ్వాసం. 'సత్యం పరం ధీమహి' అనే గాయత్రీ ప్రారంభావ బ్రహ్మరూపంబై ఉండే ఆ దేవిని తలుస్తాడు. 'ధర్మవిస్తారంబును వృత్రాసుర వధంబును నెందుఁ జెప్పంబడు నదియు భాగవతంబని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీమహాభాగవతంబన నొప్పుచుండు' అని వివరిస్తున్నాడు.

ఇతర శాస్త్రాలు, ఎన్ని చదివినా ఈశుడు చిక్కడని 'శ్రీమంతమై ముని శ్రేష్ఠకృతంబైన' భాగవతాన్ని సద్భక్తితో పఠించే వారలకు, వినగోరే వారలకు లభ్యమవుతాడని పోతన విషయం చెపుతున్నాడు. 'ఈ భాగవత ఫల రసాస్వాదన పదవిని' రసిక భావవిదులు పొందగలరు. భాగవతాన్ని పురాణంగానే పోతన అభివర్ణించాడు. పురాణ లక్షణాలైన సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, వంశము, వంశానుచరితము

అనేవి భాగవతంలో కనిపిస్తాయి. ఈ పురాణంలోని ద్వితీయస్కంధంలో ప్రపంచోద్భవ ప్రకారము, నవమస్కంధములో వంశవంశాను చరిత్రలు ఉన్నాయి. మిగిలిన స్కంధాలలో భగవంతుడు వివిధ అవతారాలలో భక్తులను కాపాడిన వృత్తాంతాలు వర్ణించబడ్డాయి.[5]

'వేదకల్పవృక్ష విగళితమై శుకముఖ సుధాద్రవమున మొనసియున్న' భాగవతాన్ని పురాణంగానే పోతన వ్యవహరించాడు. ఈ పురాణ ఫలరసాస్వాదన మహాతత్త్వబుద్ధిని, బ్రహ్మానందాన్ని అందిస్తుందని పోతన పిండితార్థం. పోతన భాగవతంలోని 'అమృతములు గురియు పలుకులు' వినేవారలకు 'శ్రవణపర్వమగుచు' వారిని అమితంగా అలరిస్తాయి.

పోతన నైమిశారణ్య వర్ణన చాలా అద్భుతంగా ఉంటుంది. ఇక్కడ పోతన వచనరచనా పరిపూర్ణత కనిపిస్తుంది. "నిగమంబునుం బోలె గాయత్రీ విరాజితంబై మహాకావ్యంబును బోలె" నైమిశం శ్రీవిష్ణు క్షేత్రం. అందులో శౌనకాదిమునులు సత్కృతుండై సుఖాసీనుండైన సూతునితో కలియుగంలో మానవులు మందభాగ్యులని, సుకర్మలు చేయజాలరని కాబట్టి సర్వసౌఖ్యమైనది, ఆత్మకు శాంతి నిచ్చేది ఏదో చెప్పమని అంటారు. ఎవరి పాదాలు పూజించి తాపసులు శాంతిపొందుతారో ఆ శ్రీకృష్ణభగవానుని లీలలను వర్ణించే భాగవతాన్ని వినగోరతారు. భక్తినావచే సంసారజలధి దాటి వెళ్ళటం వీలవుతుందని అంటూ విష్ణు ప్రభావాన్ని తెలపమని వేడుకొంటారు.

నారాయణునికి, నరునికి, భారతికి, వ్యాసుని పాదాలకు నమస్కరించి శౌనకాదిమునులతో సూతుడు 'వాసుదేవుని యందుఁ బ్రయోగింపంబడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానాలను పుట్టించు'నని వివరిస్తాడు. తత్వనిరూపణ, త్రిగుణాల స్వరూపాలు వెల్లడించటం, భగవంతుని ఏకవింశత్యా వతారములు వివరించటం మొదలైనవన్నీ వచనాలలో నిక్షిప్తీకరించబడ్డాయి. శ్రీమద్భాగవత రచనాది వృత్తాంతములు కూడా వెల్లడించబడ్డాయి.

వ్యాసపుత్రుడైన శకుడు మహాయోగి, సమదర్శుడు. నగ్నంగా చరిస్తున్న శుకుని చూసి దేవకన్యలు 'హా శుక' అంటూ వెనక్కి వెళతారు కానీ వ్యాసుని చూసి తమ చేలంబులు ధరిస్తారు. శుకునికి ఇది సతి, ఇతడు పురుషుడు అనే భేదదృష్టి లేదు. అతను నిర్వికల్పుడు. అతడు గోదోహనమాత్ర కాలం సంచరించిన స్థలాలు తీర్థాలు అవుతాయి.

విష్ణుస్వరూపుడైన వ్యాసుడు 'ఏకంబైన వేదంబును ఋగ్యజుస్సా మాధర్వణంబులను నాలుగు నామంబుల' విభాగించాడు. ఇతిహాసపురాణాలని పంచమవేదంగా ప్రకటిస్తాడు. పైలుడు ఋగ్వేదాన్ని, జైమిని సామవేదాన్ని, వైశంపాయనుడు యజుర్వేదాన్ని, సుమంతుడు అధర్వవేదాన్ని పఠిస్తారు. అఖిలపురాణేతిహాసాలను రోమహర్షణుడు అధ్యయనం చేస్తాడు. దీనవత్సలుడైన వ్యాసుడు స్త్రీ శూద్రులకు వేదశ్రవణ అర్హతలేని కారణాన వారికై భారతాన్ని రచిస్తాడు. 'భూతహితమందుఁ దన హృదయం' సంతోషించకపోగా అంతరంగంలోని వ్యాకులత నానాటికి అధికమవుతుండగా నిరాసక్తతతో ఉంటాడు. 'హరికి యోగివరుల కభిలషితంబైన భాగవత విధంబుఁ బలుకనైతి' అని బాధపడుతూ ఉంటాడు. ఆ సందర్భంలో నారదమునీంద్రుడు వ్యాసుని వద్దకు వస్తాడు. బ్రహ్మర్షిని వ్యాసముని

ఆదరిస్తాడు. పరాశరాత్మజుని నారదుడు పరిపరివిధాలుగా కీర్తిస్తాడు. వ్యాసుని బ్రహ్మతత్వ నిర్ణేతగా, భారత శ్రుతి విధాతగా స్తుతిస్తాడు." యోగినేతవు నీవు చలించి చెల్లరే కాతరు కైవడిన్ వగవఁ గారణమేమి పరాశరాత్మజా'? అని నారదుడు ప్రశ్నిస్తాడు. దీనికి 'నా కొఱత యెట్టి దంతయు నాకున్ వివరింపుమయ్య నారద' అని వ్యాసుడు అడుగుతాడు.

హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్య దుర్మదనత్కాకోల గర్తాకృతిన్

'అంచితమైన ధర్మచయమ ంతయుఁ జెప్పితి వందులోన నించుకగాని విష్ణు కథ లేర్పడ జెప్పవు' అని నారదుడు వ్యాసునితో అంటాడు. హరినామస్తుతి చేసే కావ్యమే కావ్యం గానీ ఇతరాలు కావని నారద మహర్షి విశదీకరిస్తాడు. 'అపశబ్దంబులఁ గూడియున్న్ హరిచరిత్రా లాపముల్ సర్వపాప పరిత్యాగము' చేస్తాయని అందుకని శ్రీహరిని మనసులోనిల్పి పూజించినా, పాడినా, జపాలు చేసినా, విన్నా సర్వజనులందరూ ధన్యులు అవుతారని అంటాడు. వాసుదేవుని లీలా విశేషాలను భక్తితో వర్ణించినవారి జీవితాలు ధన్యమవుతాయి. 'నిర్గతకర్మంబైన నిరుపాధికంబైన జ్ఞానంబు గలిగినను హరిభక్తి లేకున్న శోభితంబుగాదు' అని నారదుడు బోధిస్తాడు. విష్ణువే విశ్వమని, విష్ణునికంటే వేరేమీలేదని వెల్లడిస్తాడు. పూర్వజన్మలో తాను వేదవాదుల ఇంటి దాసీకి పుత్రునిగా జన్మించానని, విష్ణుభక్తి వలననే పరమ భక్తిపుంగవుడుగా అయ్యానని తన వృత్తాంతాన్ని వివరిస్తాడు.

నారద అన్న పదానికి జ్ఞానం ప్రసాదించేవాడు అన్న అర్థం వస్తుంది. 'నర' అంటే హింసించేది అని 'ద' అంటే ఖండించేది అని అర్థం. అంటే నారద అన్న పదానికి మృత్యువుని ఖండించేది అని అర్థం. పరిపూర్ణమైన జ్ఞానం 'నారద' అన్న పదం ద్వారా స్ఫురిస్తోంది. నారదుని పూర్వజన్మ వృత్తాంతం అనేక ఆధ్యాత్మిక రహస్యాలకు నెలవైంది.

భారతీయ సనాతన చింతనా విధానాన్ని అనుసరించి పురాకృత కర్మ విస్తరిస్తుంది. ఆత్మజ్ఞానం అవగతం కానంతవరకూ 'నేను' అన్న అహంకారం పోదు. అహంకార రాహిత్యమే ముక్తిమార్గానికి దారితీస్తుంది. అముష్మిక ధర్మమార్గ ప్రబోధకాలైన గ్రంథాలలో ఉన్నతమైన భాగవతంలో నవవిధ భక్తిరీతులు వివరించబడ్డాయి. విరోధభక్తి అనే నూతన భక్తి భావన గురించి కూడా భాగవతం చర్చిస్తుంది. ఈ భక్తిని హిరణ్యకశిపుడి విషయంలో చూడవచ్చు. అన్నివేళలా వైరిని హతమార్చాలన్న ఆలోచనలతో ఉండే విరోధి భ్రమరకీటక న్యాయాన్ని అనుసరించి పరమాత్మను చేరుకోవటం విరోధభక్తి విధానం అవుతుంది.

నారదుడు పూర్వకల్పంలో దాసీపుత్రునిగా జన్మించాడు. చాతుర్మాస దీక్షలో ఉన్న యోగిజనులకు పరిచర్యలు చేయటానికి నారదుడిని నియమిస్తారు. బాలుడైనప్పటికీ నారదుడు వారికి సపర్యలు చేయటంలో విసుగు ప్రదర్శించకుండా నడుచుకునేవాడు. తోడిబాలురతో ఆటలకి వెళ్ళకుండా ఆ యోగిజనులకు కావల్సిన సేవలను చేస్తూ

ఉండేవాడు. వారు ఎంగిలి చేసిన పదార్థాలను మంగళప్రదంగా భావించి తినేవాడు. ఎండకు వానకు భయపడక అన్నివేళలా ఆ యోగీశ్వరుల ఎదురుగా సేవలు చేయటంకోసం హాజరయ్యేవాడు. వర్షాకాల, శరత్కాలారాలు మొత్తం ఇతర పనులన్నీ మర్చిపోయి, ధ్యాసపెట్టి వారికి సేవలు చేసేవాడు. వీటితో ఆ మునులు సంతుష్టులయ్యారు.

వారల్ కృష్ణ చరిత్రముల్ చదువఁగా వర్ణింపఁగాఁ బాడఁగా
నా రావంబు సుధారస ప్రతిమయై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నే నంతటన్
బ్రారంభించితి విష్ణుసేవ కితర ప్రారంభ దూరండనై

ఆ యోగిపుంగవులు శ్రీకృష్ణుని లీలావిశేషాలను చదవగా, వర్ణింపగా, పాడగా నారదుడు మనసుపెట్టి విని సంతోషించేవాడు. శ్రీకృష్ణనామామృతం నారదునికి వీనులవిందుగా ఉండేది. భక్తి విధానాలలో శ్రవణం, కీర్తనం ముఖ్యమైనవి. వీటి ద్వారా నారదునికి భక్తి ప్రాధాన్యత తెలిసింది. మిగతా విషయాలనన్నింటిని వదిలివేసి విష్ణుభక్తిలోనే నారదుడు నిమగ్నమయ్యాడు.

హరిసేవలో నిమగ్నుడైన నారదునికి ప్రపంచాతీతుడైన, బ్రహ్మరూపకుడైన పరమాత్మ స్థూలరూపంలో తనయందే ఉన్నాడని అర్థం అయింది. రజస్తమోగుణ పరిహారిణియైన భక్తి అతనికి కలిగింది. ఈ బాహ్య ప్రపంచాన్ని మాయారూపకంగా కనుగొన్నాడు. శరీరం కూడా నిజమాయాకల్పితమైనదని గ్రహించాడు. మహాత్ములైన యోగిజనుల వలన నారదునికి జ్ఞానలక్ష్మి ప్రాప్తించింది. అపచారాలు లేకుండా నిత్య పరిచర్యా భక్తియుక్తుడై నారదుడు ఆ మునులను కొలిచాడు. చపలత్వం లేకుండా భక్తిగా నారదుడు చేసిన సపర్యలతో చాలా సంతోషించి వారు నిష్కపటత్వంతో దీనవత్సలతతో నారదునికి ఈశ్వరరహస్యోదార విజ్ఞానాన్ని ఉపదేశిస్తారు. వారి ఉపదేశం వల్ల నారదుడు వాసుదేవుని మాయాప్రభావాన్ని తెలుసుకున్నాడు. దీని ఫలితంగానే అతనికి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని స్పష్టమైంది. విషయవాంఛాపేక్ష దూరమైంది. మాయాకల్పితమైన శరీరాన్ని అశాశ్వతమైనదిగా తెలుసుకున్న నారదునికి సంసార తాపత్రయాలు అనవసరమని స్పష్టమైంది. విష్ణుపూజాది భక్తివల్ల శరీరం, దాన్ని అంటుకొని వచ్చే రాగద్వేషాలు, అరిషడ్వర్గాలు ఇవన్నీ అతనికి తెలిసాయి. ఈశ్వరుని ఉద్దేశించి, అతన్ని పూజిస్తూ చేసే కార్యం ఫలప్రదమై జ్ఞానాన్ని ప్రసాదిస్తుందని అవగతమైంది.

విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందు, శునకము, శునకమాంసం తినే ఛండాలునియందు సమదృష్టి ఏర్పరచుకోవటం మాయా ప్రభావాన్ని జయించి, అవిద్యను దూరం చేసుకొని జ్ఞానమార్గాన ప్రయాణించటం ద్వారా వీలవుతుంది. సర్వశక్తి సంపన్నుడు, సర్వవ్యాప్తుడు అయిన వాసుదేవుని శరణువేడి, అహాన్ని విడనాడటం దీనికి మొదటి సోపానం. 'ప్రణవ పూర్వకంబుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణానిరుద్ధమూర్తి నామంబులు' భక్తితో ఉచ్చరించి యజ్ఞపురుషుని పూజించే పురుషుడు సమ్యగ్దర్శనుడు

అవుతాడు. శ్రీమహావిష్ణువుని పూజించిన ఫలితంగానే నారదునికి 'ఈశ్వరునియందు సమర్పితంబైన కర్మంబు తాపత్రయంబు మానుప నౌషదంబగు' అని అర్థమైంది. ఈ విధంగా నారదుడు తన పూర్వజన్మ వృత్తాంతం ద్వారా విష్ణుభక్తి ప్రాశస్త్యాన్ని, ప్రభావాన్ని వివరించాడు.

దాసీ పుత్రుడైనా నారదునికి సజ్జన సాంగత్యం లభించింది. చాతుర్మాస దీక్షలోని మునులను పుణ్యపురుషులుగా భావించి వారి శుశ్రూష చేయటం ద్వారా ఆ జ్ఞానుల అనురాగవాత్సల్యాలకు పాత్రుడయ్యాడు. ఈ శుశ్రూషల ద్వారా వారి ఉపదేశాన్ని అందుకున్నాడు. నారదుడు దాసీపుత్రుడు అంటే భగవంతుడిని యజమానిగా భావించే దాస్యభక్తి అవలంబించేవాడు. భగవంతునికి తనను సేవకునిగా చెప్పుకొని పూజించే మనోప్రవృత్తి ఉన్న నారదుడు సాంసారిక విషయాలలో నిమగ్నమవక విష్ణుభక్తికి నోచుకున్నాడు. చాతుర్మాసవ్రత దీక్షలోని మునుల సేవలు చేయటం ఒకవిధంగా విష్ణుసేవ అవుతోంది. వేదోక్తంగా పరమపురుషుని అర్చించటంవల్ల ధర్మతత్వం తెలిసిపోయి ఆత్మజ్ఞాని అయ్యాడు. ఆ యోగి పుంగవుల ఎంగిళ్ళు తినటం అంటే వారి జీవనతాత్వికతని ఆకళింపుచేసుకున్నాడని, వారి సాధనామార్గంలోనే తన ఉపాసనని కొనసాగించాడని అర్థం. ఈ ఉపాసకునికి కృష్ణకథాసక్తి ఏర్పడి శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, దాస్యం మొదలైన భక్తివిధానాలతో దేవుని ఆరాధించటం ద్వారా భక్తివిజయం ప్రాప్తమైంది. ఈ విధంగా నారదుడు వెల్లడించిన వృత్తాంతం భాగవతకథలోని ప్రతి భక్తుని విషయంలోనూ కన్పిస్తుంది.

పోతన భాగవతంలో సర్వాంతర్యామి శ్రీకృష్ణుని లీలా విశేషాలను వర్ణించే విధానం చాలా ఉన్నతమైంది. హరకథా శ్రవణాసక్తి శ్రోతలకు శుభం కలిగిస్తుందని భాగవతం చెపుతోంది. సత్పురుషులందరికీ ఈ కావ్యం భగవంతుని కరుణా కటాక్షాలని అందిస్తుంది.

## వివరణలు:

1. శ్రీమహాభాగవతానికి సుమారుగా నలబది వ్యాఖ్యలు ఉన్నాయి. వీనిలో భాగవత భావార్థదీపిక అనే శ్రీధరుని అద్వైతవ్యాఖ్య చాలా పేరుపొందింది. భాగవత చంద్రిక అనే పేరుగల శ్రీమద్వేంకట కృష్ణాచార్యుని విశిష్టాద్వైత వ్యాఖ్య, విజయధ్వజీయము అనే పేరుగల శ్రీమద్విజయ ధ్వజాచార్యుని ద్వైత వ్యాఖ్య ముఖ్యమైనవి.
2. సంస్కృత వాక్యాలు అనేకం పోతన రచనలో కనిపిస్తాయి. ఉదాహరణాలు – బ్రాహ్మణో న హంతవ్య, మంగళం మధుసూధన, తుభ్యం నమోవిశ్వభరణ దేవ, నమోనమ దయావననిధయే.
3. ఈ వాక్యంలో నన్నయ ప్రయోగించిన 'జగద్ధితంబు' కనిపిస్తుంది. నన్నయకి, తిక్కనకి కావ్య ప్రయోజనం జగద్ధితంబు. బమ్మెరపోతనకి కూడా ఇదే అదర్శం.

4. గౌడపాదాచార్యులవారు తమ 'సుభగోదయము'లో ఈ విధంగా అన్నారు -

పరోఽపి శక్తి రహితః శక్తః కర్తుం న కించన

శక్తః స్యాత్ పరమేశాని శక్త్యా యుక్తో భవే ద్యది ॥

5. మధుసూదన సరస్వతి తన గ్రంథం 'భక్తిరసాయనము' లో భాగవత ప్రథమస్కంధములో నారదునిచే వర్ణింపబడిన భక్తి ఉపాయాలను అనుసరించి భక్తి యొక్క పదకొండు భూమికలను వివరించాడు.

ఉపాయాః ప్రథమస్కంధే నారదే నోపవర్ణితాః

సంక్షేపాత్తా నహం వక్ష్యే భూమి 'భేద విభాగతః' భక్తిరసా ॥

# శ్రీనాథ కవిసార్వభౌముడు

శ్రీనాథుని రచన గంగాప్రవాహము లాంటిదని పండితులందరి అభిప్రాయం. ఆంధ్రసాహిత్యంలో శ్రీనాథుని కవిసార్వభౌమునిగా పేర్కొంటారు. సకలశాస్త్రాలను మధించినవాడు. అమృతసమానమైన కవితాధారతో రసజ్ఞులను ఉర్రూతలూగించాడు. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాడే సరస కవితాగానం చేసిన గంధర్వుడు. 'సరస్వతే ఇతన్ని వరించింది కామోసు. లేకపోతే ఇంత చక్కని పదాలు అతని కవితానాదంలో వెలువడేవి కావు.

శ్రీనాథుడు కమలనాభుని పౌత్రుడు, కవితా మహారాజ్య భద్రాసనారూఢుడు, పరమ పుణ్యుడు, పాత్రుడు, అపస్తంబ సూత్రుడు, భారద్వాజసగోత్రుడు, సజ్జనమిత్రుడు, కులపవిత్రుడైన భీమాంబికా మారనామాత్యునందనుడు. ఇతను అఖిల పురాణవిద్యా ప్రవీణుడు. వేదశాఖాదీతి నిష్ణాతుడు. ఆంధ్రభాషానైషధాబ్జభవుడనని స్వయంగా చెప్పుకున్నాడు. ఉభయభాషల్లోనూ కవిత్వప్రయోగ కుశలుడు.

అద్భుతమైన వాదనతో గౌడ డిండిమభట్టుని నిర్జించి అతని కంచుఢక్కని పగలగొట్టించాడు. కర్నాటక ప్రభువుల కొలువులో కనకాభిషేకం పొందాడు. అనేక రాజసభల్లో సమ్మానాలు, గౌరవాలు పొందాడు. రాజభోగాలతో సుఖించాడు. కవిత్రయంవారి తర్వాత అంతటి అఖండఖ్యాతి పొందినవాడు శ్రీనాథుడే. భీమఖండము, హరవిలాసము, కాశీఖండము, శృంగారనైషధము, శ్రీ శివరాత్రి మహాత్మ్యము మొదలైన కావ్యాలు ఈనాడే కాదు ఏనాడైనా ఆంధ్రసాహితీలోకానికి ఆనందాన్ని అందిస్తుంటాయి. శ్రీనాథుని రచనలు పదునాల్గుపదిహేను శతాబ్దాల్లోని ఆంధ్రుల సామాజికార్థిక రాజకీయ, సాంఘిక, సారస్వత చరిత్రలకు ప్రతిబింబాలు. ఇతని అనువాదాలన్నింటిలోనూ మూలకథకు దీటుగా ఉన్న శిల్పం కనిపిస్తుంది. శ్రీనాథుడు తన రచనల్లో, ముఖ్యంగా పల్నాటిచరిత్రలో పదకవితలను విరివిగా ప్రయోగించాడు. యక్షగానాలను తన భీమేశ్వరపురాణంలో అనేకచోట్ల ప్రవేశపెట్టాడు. వీటినిబట్టి అతని జానపదగేయ ప్రీతిని తెలుసుకోవచ్చు.

రెడ్డిరాజుల తర్వాత శ్రీనాథుడు చాలా ఇబ్బందులు పడ్డాడు. బొడ్డుపల్లి గ్రామంలో భూమిని కౌలుకి తీసుకొని, వరదలురాగా పంట నష్టమై - ఎట్లు చెల్లింతు టంకంబులు ఆరునూర్లు....? - అని బాధపడతాడు. సార్వభౌముని భుజంపై నల్లగుండు నిలిపారు. అయినా అతని ఆత్మవిశ్వాసం చెక్కుచెదరలేదు. 'దివిజకవివరు గుండియలు దిగ్గురనగ నరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి' అని స్వర్గంలోని కవులని సవాల్ చేసాడు.

శ్రీనాథుని నిర్యాణంతో తెలుగుసాహిత్యంలో ఒక తార రాలగా స్వర్గంలో వేరొక తార ఉద్భవించింది.

# 8. శ్రీనాథుడు గుణనిధికథ - భక్తితత్వం, ధర్మస్వరూప వివరణ

స్కాందం బందనువంది వందితమునౌ ఖండద్వయం బాంధ్ర భా
షం దివ్యంబుగజేసి క్షేత్రమహిమాచార్యుండనన్ గౌరవం
బందె న్మన్నుగ బిల్వనాథ సమనామాఢ్యుం దెవండెంతు న
త్పందోహస్తుతు నమ్మహాకవిని విద్వన్నాథు శ్రీనాథునిన్

- కొక్కొండ వేంకటరత్నం పంతులు (బిల్వేశ్వరీయం)

శ్రీకాశీఖండము శ్రీనాథ కవిసార్వభౌముని గొప్ప కావ్యాల్లో పేర్కొన దగ్గది. క్షేత్రమహిమలను వర్ణించటంలో శ్రీనాథుడు చాలా ప్రతిభావంతుడు. సంస్కృతంలోని కాశీఖండాన్ని కవిశేఖరుడు ఆంధ్రీకరించిన విధానం చాలా చక్కనిది. దీనిలో నన్నయభట్టు కవిత్వంలోని ఉభయవాక్ప్రౌఢి, తిక్కన రసాభ్యుచితబంధం, ఎర్రన సూక్తివైచిత్రి మూడూ కనిపిస్తాయి. పూర్వకవుల వచనారీతులను జీర్ణంచేసుకున్న సంస్కృతాంధ్ర సాహితీపారగుడు శ్రీనాథుడు. ఈ 'కాశీఖండం' లో కాశీక్షేత్ర మహిమను వర్ణించాడు. అనేక మంత్రతంత్ర విశేషాలను యోగశాస్త్ర మహిమను వర్ణించాడు. అనేక యోగశాస్త్ర మర్మాలు, ఉపాసక విశిష్టతలు దీనిలో ఉన్నాయని చాలామంది పండితులు భావిస్తారు. ఎందరో లాక్షణికులు, వైయాకరణులు, నీతికోవిదులు, తత్వవేత్తలు ఈ గ్రంథంలోని విషయాలను ఉదహరిస్తూ దాని ప్రాశస్త్యాన్ని వర్ణించారు. ఉదాహరణకు అప్పకవి కాశీఖండములోని లక్ష్యములను వివరించారు. కూచిమంచి తిమ్మకవి తన 'సర్వ లక్షణ సారసంగ్రహమున' కాశీఖండంలోని డెబ్బయి పద్యాలను ఉదహరిస్తూ ఈ గ్రంథం గొప్పదనాన్ని వర్ణించాడు. నరస భూపాలీయంలో కూడా భట్టుమూర్తి దీనిలోని లక్షణాలను విశదీకరించాడు. పరవస్తు చిన్నయసూరి కూడా దీనిలోని పాఠభేదాలని గుర్తించాడు, భాషావిషయంగా ఇది ఎంత ప్రమాణమో వివరించాడు.

స్కాందపురాణాన్ని తీసుకొని దానిలోని ఇతివృత్తమైన కాశీఖండాన్ని శ్రీనాథుడు అనితర సాధ్యంగా రచించాడు. పౌరాణిక విషయాలు, శైవమత తత్వనిరూపణ, జాతివార్తా చమత్కార విలసితం, క్షేత్ర వర్ణనల వల్ల ఇది నూతన రచనగానే కనిపిస్తుంది. సంస్కృతంలోని మయూర సూర్యశతక శ్లోకానువాదములు, వాల్మీకి రామాయణం, భవభూతి ఉత్తరరామ చరిత్రము, విశాఖదత్తుని ముద్రారాక్షసము మొదలైన రచనల ప్రభావం శ్రీనాథుని కాశీఖండంపై పడింది. ఈ గ్రంథంలోని సప్తమాశ్వాసంలో అనేక తీర్థమహత్యాలని వర్ణించిన విధానం చాలా శ్రేష్టమైనది. ఇవేకాక పంచమాశ్వాసంలో సదాచార నిరూపణం, స్త్రీలక్షణ నిరూపణం, యోగనిరూపణ, కాలజ్ఞాన కథనము మొదలైనవి అనేక విషయాలని వెల్లడిస్తున్నాయి. చతుర్థాశ్వాసములో ఈశాన, చంద్ర, నక్షత్ర, బుధ, శుక్ర, అంగారక, బృహస్పతి, శనైశ్చర, సప్తర్షి ధృవపద లోకాల వర్ణనని అసమాన ప్రతిభతో అద్భుతంగా చేసాడు.

అవతారికలోనే శ్రీనాథుడు ఇష్టదేవతా ప్రార్థనలో "శ్రీకాశీ నగరాధి రాజ్యపదవీ సింహాసనాధ్యాసి లోకైక గ్రామణి విశ్వనాథు విశాలాక్షీ మనోభర్త" లను స్మరిస్తాడు.

ఆకొన్నవారి కగ్రుతత దివ్యాన్న మిడు విశాలాక్షీ అంటే కవికి చాలా భక్తి. తరువాత నన్నయగారి పద్యాన్ని అనుకరిస్తూ" పాయక నిర్నిరోధ నిరపాయసమగ్ర కృపాగుణైక పారాయణ" అని ఒక పద్యాన్ని రచించారు. ఆ తర్వాత తన గురించి చిన్నారిపొన్నారి చిఱుత కూకటినాడు మరత్తరాట్ చరిత్రను, నూనూగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్తశతిని, నిండు జవ్వనంబునను శ్రీహర్ష నైషధకావ్యమును రచించానని చెప్పుకున్నాడు. అనంతరం-

*బ్రాయమెంతయు మిగుల గైవ్రాలకుండ*
*గాశికాఖండమను మహాగ్రంధ మేను*
*దెనుగు జేసెద గర్నాటదేశకటక*
*పద్మ వనహేళి శ్రీనాథ భట్ట సుకవి*

కాశీఖండాన్ని శ్రీనాథుడు ప్రబంధముగానే పిలిచాడు. దీన్ని వీరభద్ర భూపాలునికి అంకితమిచ్చాడు. నైషధాది మహాప్రబంధాలని వీరభద్రేశ్వరునికి శ్రీనాథుడు చెప్పాడని తెలుస్తుంది. ఈ ప్రబంధ రచనాకుతూహలుడై బాదరాయణునికి మొక్కి ప్రాచేతసుని మనఃపదవి నిల్పి, భట్ట, బాణ మయూర, భవభూతి, శివభద్ర, కాళిదాసులాంటి మహాకవులని స్మరిస్తాడు. రాజశేఖరుని, భారవిని, మాఘుని గీర్తించి ప్రవరసేనుని, దండి, భాసు దలచి హర్షు, బిల్హణుని కొనియాడాడు. ఆ తర్వాత శబ్దశాసనుని, సత్కవిశ్రేష్ఠుని, సత్ప్రబంధ మహేశ్వరుని - ఆంధ్రకవితా త్రిమూర్తులైన నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలని - ప్రార్థిస్తాడు. మత్పితామహు గవి పితామహుని దలతు... అని కూడా అంటాడు. ఇదంతా శ్రీనాథుని నమ్రతని వెల్లడిస్తోంది.

పద్మాదికంబులు పదియు నెనిమిదియు నాదిపురాణంబు[1] ....లని చెప్పి వాటిలో నాలుగు పురుషార్థాలకు, బ్రహ్మవిద్యకు ఆది కారణమనంగ అఖిలఖండాలలో ప్రఖ్యాతి పొందిందని చెప్పి శ్రీనాథుడు పురాణప్రశంస చేస్తాడు. పురాణలక్షణాలని వివరిస్తాడు.[2] నైమిశశబ్ద నిర్వచనం కూడా చేస్తాడు.

శ్రీకాశీఖండములోని చతుర్థాశ్వాసంలో కుబేరవృత్తాంతము వస్తుంది. దీనికే గుణనిధి కథ అని పేరు. కుబేరుడు వెనకటి జన్మలో గుణనిధిగా జన్మించాడు. కాంపిల్య పురములో యజ్ఞదత్తాఖ్యుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను వేదవేదాంగ వేదార్థ విత్తముండు. ఆ ద్విజుడు యజ్ఞ విద్యా విశారదుడు. అతని కుమారుడే గుణనిధి. అతనిని ఉపనీతుని చేసి ఆచార్యుని దగ్గర విద్యాభ్యాసానికి పంపిస్తారు. అయితే ఇతను పేరుకే గుణనిధి. ద్యూతక్రీడారతుడై అతడు తన స్నేహితులతో పగటిపూట, సాయంపూట అని లేకుండా తిరుగుళ్ళు మొదలుపెట్టాడు. బ్రాహ్మణాచారాలని పరిహాసము చేసేవాడు. అగ్నిహోత్ర విధానం అంటే అలిగేవాడు. సంధ్యావందనమంటే వెగటు, గీతా వాద్య వినోద కార్యక్రమాలంటే ప్రీతి. దుర్భాషలు చేసేవాడు. ధాతువాదుల మీద దాత్పర్యమొనరించేవాడు. నాస్తికులతో స్నేహం చేసేవాడు. ఇన్ని అవలక్షణాలు ఉన్నవానికి సదాచారం, విద్యాబుద్ధులు ఎట్లా పట్టుబడతాయి?

సజీవ నిర్జీవద్యూతంబుల నోచిన ధనంబులు గితవులకుం దల్లి మేని రవణంబుల నమ్మి పెట్టుచుండు! అని శ్రీనాథుని వచనం. దీంతో గుణనిధి తల్లి అతని దుర్వ్యసనాలని అడ్డుపెట్టటం లేదని, పుత్రవాత్సల్యంతో అతనికి స్వయంగా ధనం ఇస్తోందని తెలుస్తోంది. ఆమె కూడా ప్రతిసారి అతనికి బుద్ధులు చెపుతుండేది. ధూర్తులతో సహవాసం వద్దని దాన్ని విడిచిపెట్టి ఉండమని ప్రతి దినమూ గుణనిధికి చెప్పేది. తండ్రి గృహకార్యాల్లో నిమగ్నుడయి కొడుకు గురించి పట్టించుకునేవాడు కాదు.

దీక్షితుడు కొడుకుగురించి భార్యను అడిగినప్పుడల్లా ఆమె గుణనిధి అంతవరకూ అక్కడనే ఉండి అప్పుడే బయటకి వెళ్ళాడని, పుత్రప్రేమతో అతన్ని వెనకవేసుకొని వచ్చేది. చదువుకోవటానికి వెళ్ళాడని భర్తతో ఆమె అబద్ధాలాడేది. దీక్షితుడు ప్రశ్నిస్తే ఆమె తక్షణం సమాధానాలు ఇచ్చేది.

*స్నానమాడెనె? వార్చెనే సంధ్య? యగ్ని*
*హోత్ర మొనరించేనే? యింతి? పుత్రుడ నిన*
*స్నానమాడెను వార్చెను సంధ్య యగ్ని*
*హోత్ర మొనరించె ననుచును నువిద మొరుగు*

లేకలేక పుట్టిన కొడుకు కాబట్టి గుణనిధి దుశ్చేష్టలను ఆమె కడుపులో దాచుకొని భర్తకు తెలీకుండా కాపాడుకుంటూ వచ్చింది. స్నేహార్ద్ర హృదయంతో కుమారునికి అతని దుర్వ్యాపారాలను మానుకోమని హితవులు పలికేది. కొడుకుతో 'అన్న! మీ తండ్రి కోప స్వభావం తెల్సు కదా, నీ విషయం తెలిస్తే అబద్ధాలు ఆడినందుకు నన్ను మీ తండ్రి చంపుతాడు' అని చెపుతుంది. శ్రీనాథుని పద్యాల్లో సంభాషణ శైలి చాలా సహజంగా ఉంటుంది.

సచ్ఛ్రోత్రీయులు ననూచానులు అయిన కులపెద్దలను తలచి, రాజమాన్యుడు, సత్యరతుడైన జనకుని తలచి, భాగ్యసంపద పుణ్యపతి దేవతలలోన దగియెడు నన్ను తలచి, వేదశాస్త్ర పురాణ విద్యానిరూఢులై వాసికెక్కిన తోడివారిని తలచి - చెడు తిరుగుళ్ళు మానమని అనేకవిధాలుగా కుమారునికి నచ్చచెపుతుంది. భార్యను తలచుకొనైనా చెడు సహవాసాలకు, జూదానికి స్వస్తి పలకమని కొడుకుని కోరుతుంది. 'అఖిల కల్యాణ గుణగణాయుత్త యత్తమామ...ల' గురించి చెప్పి అతన్ని మంచివేపు నడిపించాలని ప్రయత్నిస్తుంది. పట్టణ వీధులలో వెర్రివాడిగా చెడుగుల గూడు చౌర్యములు సేయు విషయం తండ్రికి తెలిస్తే ఇంకేమైనా ఉందా అని ప్రశ్నిస్తుంది. భర్త ఇటువంటి విషయాలను సహించడని, కుటుంబాన్ని పరిత్యజిస్తాడని దానివల్ల కూడు లేక బాధపడాల్సి వస్తుందని చెపుతుంది.

పట్టణంలో అతను దర్పమున జేయు కొయ్యతనములు వీక్షించి అందరూ నవ్వుతారని, దీక్షితుని వెనక అతన్ని హేళన చేస్తారని కాబట్టి అతని పద్ధతిని మార్చుకోమని అనేక రకాలుగా బుద్ధి చెపుతుంది. తల్లికి తగ్గ తనయుడు అని ఆమెని ప్రజలు ఆక్షేపిస్తారని వారి మాటలకు అడ్డంబు గలదె? అని ప్రశ్నిస్తుంది. అవినయ

నిధానమగు నీ నవయౌవన శైశవముల నడిమి వయసునం గవిసెడు వ్యసనోద్రేకం మానవయ్య అని కొడుకుని ప్రేమగా నీతిబోధ చేస్తుంది.

అనేక విధాలుగా తల్లి మంచిమాటలను చెప్పినా గుణనిధి ఆ మాటలను చెవులసోకనీయలేదు. శ్రీనాథుని వచనరచనలో ఒక విశిష్టత ఉంది. "మృగయామద్య పై శున్య వేశ్యా చౌర్యదురోదర పరదారా భిలాషంబులను దోషంబులు నవయౌవనారంభంబున సంభవించెనేని వానిం బరా వర్జింప నెవ్వరు నేర్తురు?" అన్న మాటల్లో ఈ విశిష్టత కనిపిస్తోంది. గతంలో తల్లి ఎన్నోసార్లు నీతి బోధించినా గుణనిధిలో మార్పురాలేదు. వర్జింప అన్నపదం గుణనిధి చేష్టలు తెల్సి ఏదో ఒకనాడు తల్లి భయపడినట్లుగా దీక్షితుడు కుటుంబాన్ని వర్జిస్తాడని సూచిస్తోంది. గుణనిధి పేరు నిగమశర్మ కథను సూచిస్తున్నట్లుగా ఉంది.[3] గురువచనం బతి నిర్మలంబయ్యు సలిలంబునుంబోలె శ్రవణస్థితంబై యభవ్యునికి శూలపుట్టించున యదార్థ నామధేయుండన గ్గుణనిధి యథాపూర్వంబు దుర్వర్తనంబుల దిరుగుచుండ... అన్న మాటలద్వారా కథా కథనం రక్తికడుతోంది.

ఒకనాడు సోమయాజియైన దీక్షితుడు ఒక జూదరి వేలికి నవరత్నమయమైన అంగుళీయాన్ని చూస్తాడు. దాన్ని రాజుగారు పుణ్యకాలంలో దీక్షితునికి ఇచ్చారు. భార్య సోమిదమ్మ మీద ప్రేమతో దీక్షితుడు దాన్ని ఆమెకు ఇచ్చాడు. అది చేతులు మారి జూదరి చేతికి వచ్చింది. విషయం గ్రహించిన దీక్షితుడు జూదరిని నిజం చెప్పాల్సిందని లేకపోతే భూపాలుసన్నిధిం బెట్టి నిజంబు దెలిపి దండింతునని భయపెట్టగా వాడు గుణనిధి జూదంలో ఒడ్డిన విత్తానికై ఆ ఉంగరాన్ని తనకిచ్చాడని చెపుతాడు. ఆ ఉంగరమే కాదు ఎన్నో భృంగారుకర్కరీ కలాచికలు, తళియలు, పళ్ళెరంబులు, తామ్రపాత్రంబులు తాకట్టుపెట్టి గుణనిధి పట్టణంలో తిరుగుతున్నాడని జూదరి నిజం చెపుతాడు. శ్రీనాథుడు ఒక చక్కని పద్యంలో తండ్రీకొడుకుల మధ్య భేదాన్ని వివరించాడు.

అక్షధూర్తులలోన నీ యనుగుగొడుకు
దొరయునంతటి యక్షధూర్తుండు లేడు
క్షితితలంబున యాగదీక్షితులలోన
గీర్తి నీ యట్టి యాగదీక్షితుడు లేడు.

'లజ్జాక్రోధంబులు మనంబున ముప్పిరిగొన' దీక్షితుడు అవమానం భరింపలేక 'నీర్కావిదోవతిని నటిముటి జుట్టకొని' ఇంటిదారి పట్టాడని శ్రీనాథుని కథనం. ఇంతకాలంగా భార్య తనను మోసం చేసిందనే బాధ, కొడుకు నడవడిక తెల్సి క్రోధం వచ్చి తండ్రి ఆ విధంగా ప్రవర్తించటం సాధారణ విషయం.

ఇంటికి వెళ్ళిన దీక్షితుడు భార్యతో ఏమీ ఎరగని వాడివలే "ఏమిచేయుచున్నదాన! యిటు రమ్ము! నీ కొడుకె క్కడంబోయె? బోవు గాకేమి!" అని మాట్లాడటం శ్రీనాథుని సందర్భానుసార రచనాశైలికి నిదర్శనం. భార్యకు వెంటనే ఉంగరాన్ని తెచ్చి ఇవ్వమని ఆజ్ఞాపిస్తాడు దీక్షితుడు. భార్య వెంటనే మధ్యాహ్నసంధ్యా సమయమైందని,

గుణనిధి కులాచార హీనుండు, పితృవాక్య పరాఙ్ముఖుండు, సత్య శౌచ పరిభ్రష్టుండు, సంధ్యాస్నాన వర్జితుండు, శివనిర్మా ల్యావహర్త కాబట్టి యమలోకానికి తీసుకొని వెళతామని కోరుతారు. దానికి శివభటుల సమాధానం-

*శివధర్మం బతి సూక్ష్మము*
*శివధర్మము లేశమైన సిద్ధించినచో*
*వివిధ మహాపాపోప*
*ద్రవములు చేరంగ రావు ధన్యుని నతనిన్*

శివధర్మాచారము సూక్ష్మరూపంబైనదనీ, స్థూలదృష్టికి చూస్తే గుణనిధి పాపాత్మునిగా కనిపిస్తాడనీ కానీ అతను పుణ్యం చేసి శివలోకానికి వెళ్ళే యోగ్యత పొందాడని వివరిస్తారు.[7] శివరాత్రిలాంటి మహాపర్వదినాన గుణనిధి ఉపవాసం చేసాడు. మిగతా భక్తులతో కలిసి రాత్రంతా జాగరణ చేసాడు. వారితో కలిసి నృత్తగాన కీర్తనాది కార్యకలాపాలలో పాలుపంచుకున్నాడు. గర్భగుడిలో దీపం వెలిగించాడు. చివరకు శివరాత్రినాడే శివసన్నిధిన శరీరాన్ని వదిలిపెట్టాడు. సూక్ష్మదృష్టికి విచారించి చూస్తే ఇంతకంటే ధర్మాలు ఏమి ఉన్నాయి? కనుక అతను శివలోకానికి రాగల పుణ్యాత్ముడు అని చెప్పి దివ్యవిమానంలో శివలోకానికి తీసుకొనివెళతారు.[8] గుణనిధి శివానుగ్రహం పొందాడు. మరు జన్మలో దముండు అనే పేర రాజుగా జన్మించి ఈశ్వరానుగ్రహంబున పట్టాభిషిక్తుడౌతాడు. తన దేశంలో నిత్యశివపూజలు, దీపకళికాకోటులు నిత్యం ఉండేలా చేస్తాడు. చంద్రశేఖరస్వామి నిలయంలో దీపకళిక నిలపనివారిని దల ద్రెవ్వగ వ్రేయుండని తన రాజ్యంలో శాసనం చేస్తాడు. అనేక పుణ్యకార్యాల ఫలితంగా జన్మాంతరాన కుబేరుడై, ఈశ్వరునికి సఖుడై సుఖిస్తాడు.

గుణనిధి కథ పరమేశ్వరుని కరుణని వివరిస్తోంది. మహాశివరాత్రినాడు మనుజులు చేసే పుణ్యకార్యాలు మహాఫలాలని అందిస్తాయని ఈ వృత్తాంతం వివరిస్తోంది.

శ్రీనాథుని కవితాశక్తి ఈ ఇతివృత్తంలో కనిపిస్తోంది. గుణనిధి కథ ద్వారా శ్రీనాథుడు ప్రాయశ్చిత్తం సర్వపాపాలను పోగొడుతుందని, శివభక్తి మహాత్మ్యాన్ని వివరించారు.

## వివరణలు:

1. మనకు పద్దెనిమిది పురాణాలు ఉన్నాయి. వీటిని-
   మద్వయం భద్వయం చైవ వ చతుష్టయం బ్రత్రయం
   అనాపద్లింగకూస్కాని పురాణాని పృథక్ పృథక్
   మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్య, వరాహ, వామన, వాయు, విష్ణు, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద పురాణాలుగా వీటిని గుర్తుంచుకోవాలి.

2. శ్రీనాథుడు శ్రీకాశీఖండము అవతారికలో ఈ విధంగా చెప్పాడు.
సర్గవిసర్గంబు నా బ్రతిసర్గ మనగ
వరుసతో వంశ వంశానుచరితము లన
గ్రమపరిప్రాప్తి మన్వంతరము లనంగ
లలి బురాణంబునకు నైదు లక్షణములు

3. తెనాలిరామలింగకవి 'నిగమశర్మఅక్క' పేరుతో ఒక కథ రాసారు. నిగమశర్మ కూడా దొంగతనాలు చేస్తూ, దుర్వ్యాపారాలతో జీవితం నాశనం చేసుకుంటుంటే అతని అక్క మందలిస్తుంది. బుద్ధులు చెప్పిన అక్క ముక్కెరనే నిగమశర్మ దొంగిలిస్తాడు. శ్రీనాథుని సుకుమారుని చరిత్రలో సుకుమారుడు కూడా ఇటువంటివాడే.

4. ప్రల్లదుడైన కులపాంసను.... అని నన్నయ భారతం ఆదిపర్వం ప్రథమాశ్వాసంలో వస్తుంది. శ్రీనాథుడు దీన్ని అనుకరించాడు.

5. విద్యాధనం గొప్పదని భర్తృహరి సుభాషితాలు వివరిస్తాయి.
"హర్తుర్యాతి న గోచరం కిమపి శం పుష్ణాతి యత్సర్వదా
హ్యర్థిభ్యః ప్రతిపాద్య మానమనిశం ప్రాప్నోతి వృద్ధిం పరాం,
కల్పాన్తేష్వపి న ప్రయాతి నిధనం విద్యాఖ్యమన్తర్ధనం
యేషాం తాన్ప్రతి మానముజ్ఝత నృపాః కస్తైస్సహ స్పర్ధతే"

6. శ్రీనాథుడు స్రగ్ధర, మహాస్రగ్ధర, మాలిని, తోటకము, రగడలాంటి ఎన్నో మార్గ, దేశీ ఛందో విశేషాలను ప్రయోగించాడు.

7. శివరాత్రి వ్రతం దృష్ట్వా యత్పుణ్యం ప్రాప్తీవాన్ ద్విజః।
తత్పుణ్యేన ప్రదగ్ధా శ్చ మహాపాతక కోటయః॥
(ఈశానసంహిత - 103)

8. జ్ఞానా జ్ఞానా కృతంబు లయ్యుఁ బశుహింసా బ్రహ్మహత్యాసురా
పానస్తేయము లాదిగాఁ గలుగు పాపంబుల్ దహించు న్నిమే
షానన్ శంభు నిశావ్రతంబు ప్రబల జ్వాలా వృతం బగ్ని యె
ట్లేనింగాలుచు నార్ద్రశుష్కముల నొక్కింతిర్మభారంబులన్
(శివరాత్రి మహాత్మ్యము - పంచము - 37)

# ఆతుకూరి మొల్ల

"తేనె సోక నోరు తీయన యగు రీతి తోడ నర్థమెల్ల"తోచేట్టు రామకథా చరితను రమణీయంగా తేటతెలుగు మాటలలో అందించిన కవయిత్రి మొల్ల. లెక్కకు మిక్కిలిగా ఉన్న తెలుగు రామాయణాలన్నింటిలోనూ ఎన్నదగినది మొల్ల రామాయణం. ఈ విశిష్టత "విమల మకరంద లుబ్ధ భ్రమర నికర పక్ష పవన పరికంపిత సత్కమనీయ కుముద కైరవ కమలంబులు గలుగు కొలను"... లాంటి రచనా చమత్కారం. రామభక్తి ప్రధానంగా సాగినా కొన్నిచోట్ల మొల్ల కవిత్వంలో, ఇతర కవులతో పోల్చదగిన ప్రౌఢరచన కన్పిస్తుంది. ఎక్కడ చూసినా కందువ మాటలు, సామెతలు అందంగా కూర్చిన నేర్పరితనమే కనిపిస్తుంది.

మొల్ల రామాయణంలో మొత్తం గద్యపద్యాల సంఖ్య పరిమితంగానే ఉన్నా వాటిలోని సౌందర్యం, రమ్యత కారణంగా ఈనాటికీ అందరినీ ఆకర్షిస్తున్నాయి. మొల్ల ఆరంభంలో కథను సంగ్రహంగా చెప్పి తర్వాత సుందర, యుద్ధకాండలని విపులంగా రాసింది.

విఖ్యాత గోపవరపు శ్రీకంఠమల్లేశు వరముచేత అసాధారణ కవితాశక్తి పొందిన మొల్ల జీవితవిశేషాలు సమగ్రంగా లేవు. ఈమె తండ్రి గురులింగ జంగమార్చన పరుడూ, శివభక్తి రతుడైన ఆతుకూరి కేసన. గోపవరం నెల్లూరి పట్టణానికి సమీపంలోని ఒక పల్లె అని ఆమె కుమ్మరి కులానికి చెందినదని వివిధ వాదాలు ఉన్నాయి. ఏది ఏమైనా ఆ అజ్ఞానపుటంధయుగంలో స్త్రీ, అందులోనూ బ్రాహ్మణేతర వర్గానికి చెందినది ఎంత ప్రతిఘటన పరిహాస పరాభవాలని ఎదుర్కొన్నదో ఊహించ నలవికాదు. ఆత్మబలంతో రామాయణం లాంటి ఉద్గ్రంథాన్ని మనకందించిన స్త్రీరత్నం మొల్ల పూజ్యనీయురాలు.

కొందరి అభిప్రాయంలో మొల్ల తిక్కనసోమయాజికి, ప్రతాపరుద్రుడికి, భాస్కర కవికీ కూడా సమకాలీనరాలు అవుతుంది. అయితే దానికి తగినన్ని ఆధారాలు లభ్యమవటం లేదు.

మొల్ల రామాయణంలో సీతారాముల కళ్యాణం, గుహుని చతురభక్తి, శబరి మధురభక్తి, శ్రీరాముని అవిరళవిరహం, సీతారావణ సంవాదం, హనుమత్సందేశం, యుద్ధవర్ణన, రావణ సంహారం మొదలైనవన్నీ చాలా చక్కగా తీర్చిదిద్దబడ్డాయి.

ప్రకృతిని రమణీయంగా వర్ణించటంలో మొల్ల తన ప్రజ్ఞని నిరూపించుకుంది. అయోధ్యకాండలో మొల్ల చాలా అద్భుతంగా ప్రకృతిని వర్ణించింది.

ఎల్లప్పుడు ఇహ పర సాధన చేస్తానని చెప్పిన మొల్ల "జిల్లర రాజలోకమున్ జేకొని మెచ్చగ నిచ్చ పుట్టునే?" అని ప్రశ్నిస్తుంది. ఏ స్వార్థములేక తన రామాయణాన్ని శ్రీరామచంద్రునికే అంకితం చేసి జీవితాన్ని సార్థకం చేసుకున్న మొల్ల ఆధునికకాలంలోని యువతులకు అనేక విధాలుగా ఆదర్శప్రాయురాలు.

## 9. మొల్ల రామాయణం - అవతారిక - మధుర కవిత్వభాండాగారం

తెలుగు రామాయణాలన్నింటిలోనూ బహుళజనాదరణ పాత్రంగా దాన్ని తీర్చిదిద్దిన మొదటి కవయిత్రి కుమ్మరిమొల్ల. రాజాస్థానాల జోలికి పోకుండా లౌకిక సుఖాపేక్ష రహితంగా రామయాణాన్ని రచించిన మొల్ల జీవితవిశేషాలు స్పష్టంగా లేవు. అశ్వాసాంత గద్యాలతో కేసనసెట్టి తనయ అని ఉన్న కారణంగా వాళ్ళు వైశ్యులు అని కొందరు వాదిస్తున్నా అనుశ్రుతంగా వచ్చే కథలు ఆమె కుమ్మరి కులానికి చెందినదని వివరిస్తున్నాయి. ఈమెని తెనాలిరామలింగనికి సమకాలీనురాలిగా చేసే అనేక కథలు వ్యవహారంలో ఉన్నాయి. అయితే 16వ శతాబ్దివాడైన ఏకామ్రనాథుడు వచనంతో వ్రాసిన "సిద్ధేశ్వరచరిత్ర"లో మొల్లని గురించి విచిత్రమైన అంశాలు తెలియచేసాడు. తిక్కన సోమయాజుల వరప్రసాదంవల్ల రామాయణం అనే వచనకావ్యాన్ని వ్రాసి మొల్ల ప్రతాపరుద్రునికి అంకితం చెయ్యాలని తీసుకొని వెళితే కొలువులోని విద్వాంసులు దాన్ని "శూద్రకవిత్వం" అని ఆక్షేపించారట. ఇది ప్రామాణికమా కాదా అన్నమాట అటుంచి అన్ని ప్రతికూల పరిస్థితులలో ఒక బ్రాహ్మణేతర స్త్రీ మిక్కిలి సాహసంతో రామాయణం వంటి మహాకావ్యాన్ని పండితులకి ఆమోదయోగ్యంగా వ్రాసిన పాండిత్యాన్ని ప్రశంసించటం ఉచితం.

శ్రీకారంతో ప్రారంభించి మొల్ల తన రామాయణాన్ని సర్వ స్వతంత్ర్యంగా తేటతెలుగు పద్యాలతో తీర్చిదిద్దింది.(1) ఆరంభంలో కథను సంగ్రహంగా చెప్పి సుందర, యుద్ధకాండలని ప్రత్యేక దృష్టితో విపులంగా వర్ణించింది. మొదటి అయిదు కాండలనూ ఒక్కొక్క కాండను ఒక్కొక్క అశ్వాసంగా వ్రాసిన మొల్ల యుద్ధకాండను మూడు ఆశ్వాసాలుగా పెంచి వ్రాసింది.

కావ్యనాయకుని "మహా గుణశాలి, దయాపరుడు, శ్రీరాముదు "ప్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్లకాలమున్" అని కీర్తించిన మొల్ల సహజపాండితీ సంపన్నురాలు. ఇష్ట దేవతాస్తుతిలో శివుని, కృష్ణుని, వినాయకుని, పార్వతిని, సరస్వతిని అనేక విధాలుగా స్తుతించిన మొల్ల 'వాణి శబ్దముల నర్థములన్ సతతంబు మాకిదున్' అని ప్రార్థిస్తుంది. నిస్సంకోచంగా మొల్ల తన కవిత్వంలో ఈ విధంగా శబ్దార్థాలకు పొత్తు కుదిర్చియే వ్రాసిందని చెప్పవచ్చును.(2) ఇది నన్నయగారి అక్షరరమ్యతని స్ఫురించుచున్నది.

సంప్రదాయాన్ని అతిక్రమించని మొల్ల సంస్కృతాంధ్ర మహాకవులని స్తుతిస్తుంది. 'సురసన్నుత జ్ఞాను సువివేకి' వాల్మీకితో ప్రారంభించి వ్యాసుని, భారవిని, మాఘుని, భవభూతిని, బాణభట్టుని, కాళిదాసుల కవితా విశిష్టతలని స్మరించటం ఆమె వినయశీతలకి గుర్తు. అంతేకాక, వారి రచనా విశిష్టతలని వివరించటం ఆమె పాండిత్యాన్ని, పూర్వకవిసంప్రదాయాల్ని గ్రహించిన విధానాన్ని వివరిస్తున్నాయి. అలానే ఆంధ్రకవులలో నాచనసోముని, భీమకవిని, నన్నయని, శ్రీనాథుని, రామాయణాన్ని వ్రాసిన రంగనాథుని మొల్ల సవినయంగా కీర్తిస్తుంది. కవిరాజు భోజుని ప్రత్యేకించి ప్రస్తుతించటం ఒక విశిష్టం.

బ్రాహ్మణులకి తప్ప ఇతరులకి సాహిత్యాన్ని కొల్చే అవకాశం లేని ఆ రోజుల్లో రామాయణాన్ని రచించే సాహసాన్ని చేయబోతున్న తనని సాటికవులు ఏమందురోనన్న శంక మొల్లకి కలగటం సహజం. ఈ కారణంగానే 'తొల్లిటి యిప్పటి సత్కవివల్లభులని' ఆమె 'భక్తిగ దలతున్' అంటుంది. వారందరూ 'రసికవినుత వాగ్విభవ' కళామల్లుల గవితారచనల బల్లిదులైనట్టి ఘనులని' చెప్పటం ఆమె లోకజ్ఞతకి నిదర్శనం. ఇది ఒక విధంగా నన్నయగారి 'సారమతిం గవీంద్రులు' వంటిదే.

గోపవరపు శ్రీకంఠమల్లేశు వరము చేత కవిత్వం చెప్పటం అలవడిందని వినమ్రతతో పల్కిన మొల్ల తాను కావ్య సంపద క్రియలు, నిఘంటువులును గ్రమము లేవియు నెఱుగనని అంటుంది. తను కవిత్వంలో దేశీయపదాలు, తెలుగులూ, సాంస్కృతులూ, సంధులూ, ప్రాజ్ఞుల శబ్దవితతీ, శయ్యలూ, రీతులూ, చాటుప్రబంధాలూ, సమాసాలూ, అర్థాలూ, భావార్థాలూ, కావ్య పరిపాకాలూ, రసభావ చమత్కారాలూ, బహువర్ణాలూ, విభక్తులూ, ధాతువులూ, అలంకారాలూ, ఛందోవిలక్షణాలూ, ఏమీ ఎరగననీ ఆమె చెప్పినా నిజానికి ఇవన్నీ మొల్లరామాయణంలో తళుక్కున మెరిసే తారలు.

వినయ సంపదలో పోతన తర్వాత మొల్లనే పండితలోకం గుర్తించింది. పలికెడిది భాగవతం అని పోతన అంటే మొల్ల–

చెప్పుమని రామచంద్రుడు
సెప్పించిన పలుకుమీద జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్య చరిత్ర తప్పులెంచకుడు కవుల్

రాముని కరుణవల్లే రామాయణరచన సాధ్యమైందని చెపుతుంది. నిర్వికారంగా రచనాయజ్ఞాన్ని ప్రారంభించిన మొల్ల 'ఏ వేదంబు పఠించె లూత[(3)] అన్న రీతిన పురుషోత్తముడు రాముని దయ వల్లనే అంత ప్రజ్ఞావంతురాలయింది.

మాతృభాష మీద మొల్లకి మిక్కిలి ప్రీతి. 'తెలుగని చెప్పుగోట గడు దేటల మాటల గ్రొత్తరీతుల బొలుపు వహింపకున్న మఱి పొందగునే పటహాది శబ్దముల్' అని ప్రశ్నిస్తుంది. తన భాషలో భావవ్యక్తీకరణ చేయలేనివారు పరాయిభాషలో చేయలేరని ఆమె నిశ్చితాభిప్రాయం. "దన విద్య మెఱయ గ్రమ్మఱ ఘనమగు సంస్కృతము జెప్పగా రుచియగునే?" అని చెప్పె మొల్ల తేనె నోటిలో వేస్తే నోరు తీపి అయ్యే తీరులో కావ్యం సాగాలంటుంది. అర్థం తెలీకుండా గూఢశబ్దాలను కూర్చి వ్రాసిన కావ్యం మూగవాడు చెవిటివాడూ మాట్లాడుకున్నట్లు ఉంటుంది. ఈ విధంగా సాగిన కావ్యాలు కవికి, పాఠకునికి మధ్య భావ వినిమయాన్ని కలిగించవు. మొల్ల కవిత్వంలో పదాలు అన్నీ చాలా సులువుగా ఉండి పామరులకి సైతం వెంటనే అర్థం అవుతాయి.

తన కవిత్వంలోని ముఖ్యవిశేషణాలని కవి కన్నా మిన్నగా ఎవరు తెల్పుకోగలరు? మొల్ల తన కవిత్వంలో కందువమాటలు సామెతలను అందంగా అమర్చి విభుదుల

మదికి హత్తుకునేటట్లుగా జాగ్రత్త వహించింది. నన్నయభట్టు నుంచి కవిలోకం అంతా వారి కవిత్వ లక్షణాలు ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షరరమ్యత, హృదయాహ్లాది, చతురవచోనిధత్వం అని చెప్పుకుంటూ వచ్చారు. మొల్ల ప్రత్యేకించి తన కవితా లక్షణాలు ఇవీ అంటూ ఎక్కడా చెప్పకపోయినా సహజమైన వర్ణనలు, అలంకారాలు, సులభశైలి, చిన్నిపదాలు, కల్పనలు, సామెతలు ఇబ్బడిముబ్బడిగా ఆమె రామాయణంలో కనిపిస్తాయి. అధిక శాతం రచన తేటతెలుగు మాటలలో సాగినా అక్కడక్కడ దీర్ఘసమాసరచన కన్పిస్తుంది. ప్రకృతి వర్ణనలలో మొల్లది అందెవేసిన చేయి అని విమర్శకులు భావిస్తారు.(4)

భారతభాగవతాల తర్వాత ఆంధ్రపాఠకులు పూజించే పవిత్రగ్రంథం రామాయణం. ఏ కారణాల వల్ల అయితేనేమి, తెలుగుభాషలో అసంఖ్యాకంగా రామాయణాలు వెలువడ్డాయి. భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం, కట్టా వరదరాజు రామాయణం, గోపీనాథ రామాయణం, వాసుదేవ రామాయణం, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, సరస్వతీ రామాయణం, గోవింద రామాయణం ఇలా ఎన్నో ఉన్నప్పటికీ పద్యగద్యాత్మకంగా తేలిక భాషలో మొల్ల వ్రాసిన రామాయణం దాని ప్రత్యేకతని నిలబెట్టుకుంటోంది.

రామాయణ కవులందరూ వారి గ్రంథాలలో ఇన్ని రామాయణాలుండగా మళ్ళీ ఇది ఎందుకు అన్న ప్రశ్న వేసుకొని దానికి సమాధానమివ్వటం కన్పిస్తుంది. మొల్ల కూడా ఇదే విధంగా:

అది రఘురాము చరితము
నాదరముగ విన్న గ్రొత్తయై లక్షణ సం
పాదమ్మై పుణ్యస్థితి
వేదమ్మై తోచకున్న వెఱ్ఱినె చెప్పన్?

రామాయణాన్ని మొల్ల వేదంగానే భావిస్తుంది. తిక్కనకి భారతం లేఖ్యమైన ఆమ్నాయము అయితే మొల్లకి రాముని చరిత్రని వివరించే రామాయణం ఆదరంగా వింటే కొత్తదానిగా వినిపిస్తుంది. అది లక్షణ సంపాదం అయి, పుణ్యాన్ని అందిస్తుంది. అలా కాని పక్షంలో వెఱ్ఱినె చెప్పన్? అంటుంది వినయశీలి మన మొల్ల.

రాముడు అవతారపురుషుడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణలకై అవతరించిన రఘురాముని చరిత్రని వ్రాసి, పాడి, చెప్పి ఎందరో ముక్తి పొందారు. నిజానికి రామాయణం కావ్యం భుక్తికి, ముక్తికి మూలం. ఇట్టి రాముని చరిత్రని గతంలో కవీశ్వరులు ఎందరో బహుచక్కగా రచించి సార్థకులయ్యారు. రాముని నా రాజు అంటుంది మొల్ల. భక్త మీరాబాయి శ్రీకృష్ణుని తన సర్వస్వంగా భావించిన రీతిలో మొల్ల శ్రీరాముని తన దైవంగా, భర్తగా, గురువుగా గ్రహించినట్లు ఇక్కడ, తోస్తుంది. అందుకే 'నా రాజును దైవమైన రఘురాము నుతించిన దప్పుగల్గునే' అని మనల్ని ఎదురు ప్రశ్నిస్తుంది.(5)

పూర్వగాథల ప్రకారం ఒక వేశ్య తన చిలుకకు శ్రీరాముని పేరుపెట్టి పిలిచిందట. ఈ విధంగానే ఆమె మెంపు వహించిందని మొల్ల చెప్తుంది. భగవన్నామాన్ని కేవలం అవసాన దశలో విన్నవారే సాయిజ్యం పొందారని సాంప్రదాయం చెపుతుంది. అజామిళుని వంటివారే హరినామస్మరణ ద్వారా భగవత్సాన్నిధ్యాన్ని పొందగా అన్ని వేళలా రాముని నామజపంలో మునిగే వారికి ఆటంకాలు ఉంటాయా? ఎవరికి తోచిన రీతిలో వారు, వారికి నచ్చిన విధంగా రాముని వినుతిచేస్తే 'హర్షము' రాదే అనేది పరమభక్తురాలు వేసిన మరో ప్రశ్న. ఈ హర్షము మామూలుగా - వ్యక్తులు భౌతికవాంఛలు సఫలమైతే - పొందే హర్షము కాదు. ఇది కేవలం బ్రహ్మానందమే. నిర్వికార స్థితిలో పొందే పరిపూర్ణ ఆనందం అవ్యక్తీకరణమైంది. దీన్ని పొందటం దరిదాపుగా శ్రీకైవల్యపదంబు చేరటమే.

నేరుపు గల చందంబున
నా రాముని వినుతి సేయ నర్హముగాదే?

ఈ ప్రశ్న ఆమెని ఆక్షేపిస్తున్న సమకాలీన వ్యక్తులపై శక్తులపై ఎక్కుపెట్టిన కోదండం. భగవంతుని ఆరాధించటానికి కావల్సిన అర్హత ఏమిటి? ఫలాపేక్షలేని ప్రార్థన. ఈ ప్రార్థన మనసా, వాచా, కర్మణా పవిత్రంగా ఉంటే మరి కావల్సింది ఏముంది?

మాధవో మాధవో వాచి మాధవో మాధవో హృది
స్మరంతి సాధనః సర్వే సర్వకార్యేషు మాధవం

వాక్కులో మాధవుడు అనీ, హృదయంలో మాధవుడు మాధవుడు అనీ సర్వవస్థలలోనూ హరినామస్మరణ చేసే సజ్జనులకు సర్వత్రా విజయమే సిద్ధిస్తుంది.

భగవంతుడు ఎవరిని ఆదరిస్తాడు అంటే అందరినీ సమదృష్టితో కరుణిస్తాడనే సమాధానం వస్తుంది. "నేరిచి పొగడిన వారిని", "నేరక కొనియాడు వారినీ' కూడా ఆ సర్వేశ్వరుడు కాపాడటానికి కారణం వారివారి భక్తేగానీ చదువు, పాండిత్యం కానేకాదని మొల్ల ప్రకటిస్తుంది.

రామాయణంలో అనేకచోట్ల మొల్ల వినయస్వభావం మనకు కనిపిస్తుంది. వేదాలు, ఉపనిషత్తులు ఏమీ చదవకపోయినా భక్తితో జ్ఞానసిద్ధి పొందిన మొల్ల దృష్టిలో చదువులు నిజమైనవి కావు. విద్య అంతిమంగా భగవత్సాన్నిహిత్యాన్ని అందించాలి. శ్రీకాళహస్తీశ్వర శతకకర్త ధూర్జటి అభిప్రాయపడినట్లు ఏ వేదములు చదవకుండానే సాలెపురుగు, శాస్త్రాధ్యయనం ఎరగకుండా ఏనుగు, మూఢుడైన వేటగాడూ పరమేశ్వరుని కరుణకి పాత్రులయ్యారు. అలానే భక్తితో భగవానుని జయించవచ్చని మొల్ల వాదన.

సల్లలిత ప్రతాపగుణసాగరుడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుడైన రామ నరపాలకునిన్ స్తుతిసేయు జిహ్వకున్
జిల్లర రాజలోకమును జేకొని మెచ్చగ నిచ్చపుట్టునే?
యల్లము బెల్లముం దినుచు నప్పటికప్పటి కాస సేయునే?

ఉత్తమ గుణాలతో పరాక్రమంతో భూమండలంపై విలసిల్లి ప్రజలని పరిపాలించిన శ్రీరాముని నామ జపానికి అలవాటైన నాలుకకి అయోగ్యులైన రాజకీటకాలని ఆశ్రయించి కీర్తించాలని అనిపిస్తుందా? వారిచ్చే మీసాలపై తేనియలవంటి తుచ్ఛమైన తాత్కాలిక సుఖాలకు ఆశపడుతుందా అని సూటిగా ప్రశ్నించే మొల్ల పోతన బాటలో పయనించిందని తెలుస్తుంది. రాజుల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు అన్న ధూర్జటి కవి మార్గంలోనే తన సాహితీ ప్రయాణాన్ని కొనసాగించిన మొల్ల ఎక్కడా వెనుదిరిగి చూసుకోలేదు. ఉన్నాడు లెస్స రాఘవుడు ఉన్నాడని నమ్మిన మొల్ల తన రామాయణాన్ని ఆ సీతాపతికే అంకితమివ్వటం ఆమె వ్యక్తిత్వ నిదర్శనం.

స్వీయ సంప్రదాయాలన్నా ఆచార వ్యవహారాలన్నా ఎంతో గౌరవం చూపించే మొల్ల తన రామాయణంలోని అనేక సందర్భాలలో తెలుగుతనాన్ని వెల్లివిరిసేటట్లు చేసింది. జనకమహారాజు చేసిన వివాహప్రయత్నాలు, మర్యాదలు, వేదుకలు మొదలైనవన్నీ ఒక పెద్ద వచనంగా మొల్ల చేతిలో రూపుదిద్దుకున్నాయి.(5) ఇది మన తెలుగువారి వివాహమధుర సన్నివేశాలను జ్ఞాపకానికి తెస్తాయి.

సంగ్రహంగా విషయాలని వివరించటంలో మొల్ల అగ్రగణ్యురాలనే విషయం అవతారికను పరిశీలించినా లేదా వివిధ ఘట్టాలను చూసినా అర్థమవుతుంది. ఉదాహరణకి అయోధ్యకాండలో మంథర వృత్తాంతాన్ని మొల్ల పరిహరించింది. అంతే కాకుండా శ్రీరామపట్టాభిషేక ఏర్పాట్ల నుంచి దశరథుడు తన రెండు కళ్ళలాంటి రామలక్ష్మణులని ఎడబాసిన దుఃఖంతో ఉండటం అంతా చాలా క్లుప్తంగా ఒకటి, రెండు పద్యాలలో చెప్పిన విధానం అద్భుతం.

కందపద్యాలను ఉపయోగించటంలో మొల్లకి పోటీ కొందరే ఉన్నారనటం నిర్వివాదాంశం. అహల్యా శాపవిమోచన ఘట్టంలో, శివధనస్సు ఎక్కుపెట్టే సందర్భంలో, గుహుని కథలో, యుద్ధకాండలోని వివిధ సందర్భాలలో ఆమె నేర్పరితనం అనన్యసామాన్యం.

వీలు చిక్కినప్పుడల్లా మొల్ల తన కావ్యంలో చిత్రమైన స్వతంత్రకల్పనలు చేసింది. దీనివల్ల కథ సంగ్రహతకి ఏమీ ఆటంకం కలగలేదు. మారీచుని వధించి రాముడు తన పర్ణశాలకు బంగారులేడి చర్మంతో తిరిగి వచ్చే సందర్భంలో చెప్పిన పద్యం ఒక చక్కని కల్పన. ఈ కందంలో రాముడు లేడి తిత్తిగ దీసి వింటికొన దెచ్చెడి సన్నివేశం ఒక చక్కని దృశ్యంలా కనిపిస్తుంది.(6) అయితే మూలంలో ఇలా లేదు.

గుహుడు అమాయకంగా సుడిగొని రామపాదములు సోకిన ధూళి వహించి రాయి యేర్పడ నొక కాంతయయ్యెనట అని రామపద కంజ యుగాన్ని కడిగితే కానీ పడవలోనికి రావటానికి అంగీకరించకపోవటం మొల్ల విచిత్ర కల్పనా చమత్కారంవల్ల వాసికెక్కింది. ఇది ఆమె చతురరచనకి నిదర్శనం.

సౌందర్య వర్ణనలలోనూ, ప్రకృతి వర్ణనలలోనూ మొల్ల సవ్యసాచి. జానకి లోకోత్తర సౌందర్యాన్ని ఆమె వర్ణించిన తీరు నభూతో నభవిష్యతి. ఉపమా అలంకారాన్ని నేర్పుగా వాడిన గడుసరి మొల్ల.

రామాయణ మహాకావ్యాన్ని తన అసాధారణ ప్రతిభతో బహుజాగ్రత్తగా రచించి పండితపామరులకి ఎంతో మేలుచేసిన మొల్ల శాశ్వతమైన కీర్తిని గడించింది. తెలుగు భాషా వికాసానికి ఆమె చేసిన సేవలు గణనీయమైనవి. మొల్ల రామాయణం రచన ద్వారా శ్రీరామపదసన్నిధిని చేరుకున్న పుణ్యాత్మురాలు.

**వివరణలు:**

1. నన్నయభట్టు తన భారతాన్ని శ్రీకారం చుట్టి ప్రారంభించిన సంప్రదాయాన్ని అనంతరం తెలుగులో కవులందరూ అనుసరించారు. 'శ్రీమహిమాభిరాముడు వశిష్ట మహాముని పూజితుడు' అని సాగే మొల్లరామాయణ రామచంద్రుని స్తుతితో, మనోహరంగా మొదలవుతుంది.

2. అవతారికలోనే మొల్ల 'వాణి శబ్దముల నర్థములన్ సతతంబు మా కిడున్' అంటుంది. 'అర్థమొల్లఁ దోచకుండ గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము' మూగ చెవిటివారు మాట్లాడుకున్నట్లు ఉంటుందని మరో చోట అంటుంది. దీన్ని బట్టి అక్షరరమ్యతే ఆమె ఆశయమని స్పష్టం.

3. మొల్ల రామాయణ అవతారికలో ఈ విధంగా పేర్కొంది:

   *నేరిచి పొగడినవారిని*
   *నేరక కొనియాడువారి నిజకృప మనుపం*
   *గారణ మగుటకు భక్తియె*
   *కారణమగుఁ గాని చదువు కారణ మగునే?*

   ముక్తికి భక్తి హేతువుగాని చదువుకాదని మొల్ల అభిప్రాయం.

4. రాముని పేరు స్మరించటం శుభకరమనీ అది సర్వపాపాలని హరిస్తుందని ఆస్తికులు నమ్మటాన్ని మొల్ల వివరిస్తోంది. రాముని శరణాగత రక్షణ దీక్షను కూడా ఇది వెల్లడిస్తోంది.

   *"భగవా న్నారాయణో దేవ శ్రీమాం, శ్చక్రాయుధో విభు"*
   *అర్థితో మానుషో లోకో జజ్ఞే విష్ణుస్సనాతనః"* – వాల్మీకి రామాయణం

   పరతత్వము రామునిగా అవతరించిందన్న పై అంశాన్ని మొల్ల తన రామాయణంలో మూలతత్వంగా ప్రతిపాదించింది.

5. 'ఇట్లు శ్రీరామచంద్రుని సత్యసంపదకు మెచ్చి సంతోషించి....' అని మొదలయ్యే ఈ వచనం మొల్ల సంగ్రహరచనకు నిదర్శనం. ఇది 'విష్కంభం' వంటిది.

6. మొల్ల రామాయణంలోని ఈ సన్నివేశం మొల్ల స్వతంత్ర రచనాశిల్పానికి ఉదాహరణ. ఆ మృగాన్ని శీఘ్రంగా పడవేసి, 'దాని మై తిత్తిఁగఁ దీసి వింటి కొన దెచ్చెడి వేళ...' అన్న సందర్భంలో రాముని రూపం కళ్ళముందు కనిపిస్తుంది.

గోపీనాథ రామాయణంలో 'మృగరూపధరుండైన మారీచుని శరీరంబు ఛేదించిన శరార్తుండై యన్నీచిందు తాల ప్రమాణంబు మింటి కెగసి నిబిడంబుగా భైరవారావంబు సేయుచు నల్ప జీవితుండై ధరణింబడి యమ్మాయారూపంబు విడిచి నిజరూపం బంగీకరించి!... అని ఉంది. రాక్షసులు మరణసమయంలో నిజరూపం ధరిస్తారు.

వాల్మీకి రామాయణంలో ఇలా పేర్కొన్నారు -

పునరేవ్ దూరాద్ వృక్షఖండాద్ వినిస్సృతాః
దృష్ట్వారామో మహాతేజాస్తొ హన్తుమ్ కృతనిశ్చయః॥
భూయాస్తు శరయుద్ధత్య కుపితస్తత్ర రాఘవాః॥
సూర్యరశ్మి ప్రతీకాంశం జ్వలన్తమరిమర్దనమ్॥

(అరణ్యకాండ)

# 10. మొల్ల రామాయణం - బాలకాండ - రచనా చమత్కారాలు

శిష్ట వ్యవహారానికి మిక్కిలి సన్నిహితమైన భాషలో రామాయణ కావ్యాన్ని రమణీయంగా రచించిన మొల్ల ఒక మధుర కవయిత్రి. ఆమె కావ్యంలోని మాధుర్యం తేనెసోక నోరు తీయనయగు 'రీతిన సాగిన రచనా చమత్కారం'తో ఉంది. సహృదయతతో మొల్ల కావ్యాన్ని పఠించేవారికి ఆ రామచంద్రుని కరుణాకటాక్షాలతోపాటుగా లభ్యమయ్యేది కందువమాటలు, సామెతలు అందంగా కూర్చిన ఆమె కవితామృతం. నిజానికి ఇంత ప్రజాదరణకి కారణం మొల్ల రామాయణంలోని కవితాగుణం.

అయోధ్యాపుర వైభవంతో బాలకాండ మొదలవుతుంది. 'సరయూనదీ తీర సతత సన్మంగళ ప్రాభవోన్నత మహావైభవమ్ము' అని ప్రారంభించి సాకేతపురివైభవాన్ని మొల్ల కళ్ళకు కట్టినట్లుగా వర్ణిస్తుంది.(1) ఆ నగరవాసులందరూ పుణ్యాజనులు, ధర్మపరులు, నాలుగు వర్ణాలవారు వారివారి విధులని క్రమంతప్పకుండా ఆచరించేవారు. బ్రాహ్మణులు నిత్యాగ్నిహోత్రసంపన్నులు; పరిశీలిస్తే ఉత్తమ ద్విజులేగానీ టక్కరి హస్యనాటకులు కారట. వారిని పరమ పావనులని మొల్ల అంటుంది. అక్కడి కాపుప్రజలు సుఖిస్తున్నారు. ఆ నగరంలోని స్త్రీలు బహు రూపసులు. వారు మృదువచో రచనల వదలింపనేర్తురు. ఘనమునీంద్రులనైన గచ్చడములు - అనటం వారి అందచందాలను వర్ణించటమే.

సాకేతపురాధీశ్వరుడైన దశరథుడు కీర్తిప్రతిష్టలలో, శౌర్య పరాక్రమాదులలో సాటిలేనివాడు. తన దానధర్మాదులతో దారిద్ర్యాన్ని పారద్రోలాడు. అవినీతిపరుల మన్ననచేసి పరిపాలన చేయడు. ఇతర స్త్రీలవంక కన్నెత్తి చూడడు. పరుషమైనమాటలు ఎన్నడూ ప్రయోగించడు. ధనకాంక్ష లేనివాడు. యద్యదా చరతిః శ్రేష్ఠ - అన్నవిధంగా దశరథుని రాజ్యంలోని పౌరులందరూ ధర్మవర్తనతో మెలగుచున్నారు. అన్ని సంపదలున్నా సంతానంలేని కారణంగా మనోవేదనతో పరితపిస్తున్న దశరథుడు శిష్టవర్తనుడైన వశిష్ఠుని చూసి తన కోర్కె వినిపిస్తాడు. పుత్రకామేష్టి యాగంచేస్తే సంతానం కలుగుతుందని మునిసింహుడు రాజశ్రేష్ఠునికి వివరిస్తాడు.

ఇది ఇలా ఉండగా రావణుచేతి బాధలు నిరంతరమున్ బడి వేగి దేవతలందరూ బ్రహ్మదేవునితో వారి బాధలగురించి విన్నవించుకుంటారు. బ్రహ్మాది దేవతలందరూ విష్ణుసన్నిధిని చేరి శరణువేడతారు. బ్రహ్మ 'భీతిచే దేవర గానవచ్చెనిక దేవర చిత్తము వీరి భాగ్యమున్' అని విన్నతిస్తే వనరుహ లోచనుడు అభయమిచ్చి రావణుడు వరాలువేడినప్పుడు నరులవానరులను జెప్పమరచినాడు కాబట్టి తాను స్వయముగా

దశరథుని ఇంట జన్మిస్తానని చెప్పి 'దేవతలను కొందరు కపివంశంబున కొందరు భల్లూక కులమున గురు బలయుతులై.... పుట్టి పెరగడం భువిపై' అని ఆనతిస్తాడు. ఈ విధంగా రావణ సంహారానికి నాందిపల్కటం జరిగింది.

దశరథుని యాగం ఫలించి అగ్నిదేవుడు ప్రత్యక్షమై 'బంగారుపాత్రమ్ము పలదుగ్ధాన్నముతో' రాజుని దీవిస్తాడు. పాయసాన్ని ఆరగిస్తే 'తనయుల్ శ్రీపతి పుత్రసమానులు రూపసు లుదయింతు రమిత రూపస్ఫూర్తిన్' అన్న హవ్యవాహనుని మాటలతో దశరథుడు ఆనందిస్తాడు. రెండుభాగాలుగాచేసి అగ్రసతులకు ఇచ్చిన పాయసాన్ని వారిరువురూ సగం సగంతీసి సుమిత్రకివ్వటం జరిగింది. ఫలితంగా ముగ్గురు రాణులూ గర్భవతులయ్యి శ్రీరామ లక్ష్మణ భరత శతృఘ్నులు అవతరిస్తారు.

విశ్వామిత్రుడు యాగసంరక్షణార్థమై ఒకనాడు దశరథుని కొలువుచేరి రాముని పంపమని కోరతాడు. పుత్రప్రేమతో దశరథుడు 'మదిలోన నదరిపడుచు' వినయంతో 'రాముడు దనుజులతో సంగ్రామము సేయగలడే? కందుగదా!' అని ప్రశ్నించి తానే స్వయంగా వస్తానని అంటాడు. ఇది మానవనైజానికి అద్దంపడుతుంది. సాక్షాత్తూ నారాయణుడే రాక్షససంహారానికి అవతరించాడు. అయినా ఒక తండ్రిగా దశరథుని శంక, పుత్రవాత్సల్యం గమనించదగ్గవి.(2)

విశ్వామిత్రుడు నవ్వి "వినుమయ్యా! రాజ! నీ చేతగాదనరాదైనను రాక్షసుల్ విపుల గర్వాటోప బాహోబలుల్ ఘనుడౌ రాముడు దక్క వారి గెలువంగారాదు" అంటాడు. మునిశ్రేష్టుడు కాబట్టి రాముని శక్తిసామర్థ్యాలు తెల్సు. విశ్వామిత్రముని లోకకల్యాణార్థం అవతరించిన రాముని వల్లనే రాక్షససంహారం జరుగుతుందని గ్రహించినవాడు.

చివరకు క్రతురక్షణకై రామలక్ష్మణులను మునివెంట పంపడానికి దశరథుడు అంగీకరిస్తాడు.

మొల్ల శైలిలో తిక్కన కవిబ్రహ్మ వలే నాటకీయత పాలు అధికం. విశ్వామిత్రుడు యాగరక్షణకై దశరథునితో సంభాషించిన విధానం దీనికి ఉదాహరణ. వినుమయ్యా! రాజ! అనటం వాచికాభినయం. అలానే దశరథుడు మనసులో కంగారు పడటం నాటకీయతే. నాటకంలోవలే పాత్రల మనోగతభావాలను కళ్ళకు కట్టినట్లు వర్ణించటంలో మొల్లది గొప్పవిజయం.

అరణ్యమార్గంగూండా మునివెంటవెళ్తున్న రామలక్ష్మణులకు తాటకి భీకరాకారంతో కనిపిస్తుంది. యాటది యని యెంచుచు మొగమాడక నీవీపాటి పడనేయుమని ముని ఆజ్ఞ. రామచంద్రునికి "ఈ యాడుదాని జంపగ నా యమ్మునకేమి గొప్ప? నగరే వీరుల్?" అని అనిపించినా ఋషి ఆజ్ఞ శిరసావహించి ఒక్క అంబుతో తాటకిని నేలగూల్చుతాడు. విశ్వామిత్రుడు రాముని అనేక విధాలుగా దీవిస్తాడు. ఆ తర్వాత ఆకాశవీధి నెలకొని యాగాన్ని నాశనం చేయబూనిన రాక్షసులు రామలక్ష్మణులచేతిలో హతులవుతారు.

సీతాదేవి స్వయంవర వార్త విని విశ్వామిత్రుడు రామసౌమిత్రులతో మిథిలానగరానికి వెళుతుండగా శ్రీరాముని పదరజముసోకి శిల అహల్యగా మారుతుంది. ఇక్కడ, విశ్వామిత్రుడు అన్న మాటలు ముఖ్యమైనవి. 'రామ! భవత్ప దధూళి సోకి యా

భామిని రాయి మున్ను కులపావన! చూడగ చిత్రమయ్యె – నీ నామ మెరుంగువారలకు నమ్మగవచ్చును భుక్తి ముక్తులున్' అనటం శ్రీరామ నామమహాత్మ్యాన్ని వెల్లడించటమే. రామాయణ ఫలశృతి నిజానికి ముక్తిసాధనే.

శివధనువు నెక్కుపెట్టిన ధీరునకు సీతనిత్తునని జనక రాజర్షి ప్రకటిస్తాడు.[4] గురుభుజశక్తి గల్గు పదికోట్ల జనంబులు మాత్రమే హరుని శరాసనంబును చేర్చగలరట. అంతటి శివచాపమును చూసి వివిధ దేశాధినేతలు

విల్లా? యిది కొండా? యని'

తల్లిడపడి సంశయంబు తలకొని మదిలో

తత్తరపడతారు. కొందరు రాజకుమారులు విల్లు దగ్గరకు వెళ్ళటానికే జంకుతారు. ఇంకొందరు సాహసంతో దరిచేరినా ఆ విల్లును చూసి భయపడి సందులగొందుల దూరారట. చివరగా విసుగుపుట్టిన "రాజలోకం జగతిరాజుల మోసపుచ్చంగ దలచి జనకుడే మాయగావించె ననుకొని వెనుదిరుగుతారు.

పర్వతాకారంతో ఉన్న విల్లును దేవతలుసైతం చేరి చూడలేరని, దాన్ని హరిహరాదులు తప్ప ఇతరులు ఎక్కుపెట్టలేరని, దానితో గొడవ వారికెందుకని, దాని విషయమే అనవసరమని రాజకుమారులు భావిస్తారు. దీన్నిబట్టి చూస్తే రాముని శౌర్యం అవగతమవుతుంది. అనంతరకాలంలో రావణుని కూల్చగల శ్రీరాముడు తన శక్తిని నిరూపించుకునే సమయం ఆసన్నమయింది.

విశ్వామిత్రమునీంద్రుడు రామచంద్రుని ముఖంవైపు చూస్తాడు. శివధనుర్భంగానికి రాముడు సిద్ధమవుతాడు. లక్ష్మణస్వామి వెంటనే ఈ విధంగా అంటాడు.

కదలకుమీ ధరాతలమ, కాశ్యపిబట్టు ఫణీంద్ర భూ విష్వ
ద్వదులను బట్టు, కూర్మమ రసాతల భోగిధులీ కులీశులన్
వదలకపట్టు, ఘృష్టి ధరణీ ఫణికచ్ఛప పోత్రి వర్గమున్
బొదవుచు బట్టుడీ కరులు, భూవరడీశుని చాపమెక్కిడున్

బాలకాండలోని ఉత్తమపద్యాలలో ఇది ఎన్నదగింది. ఓ భూదేవీ! నువ్వు కదలబోకు. ఆదిశేషుడా, నీవీ భూదేవిని గట్టిగా పట్టుకో! ఓ కూర్మమా! భూమినీ, ఆదిశేషువునీ కదలకుండా భరించు. ఓ వరాహమా! భూదేవినీ, ఆదిశేషువునీ, కూర్మాన్ని కదలకుండా చూడు. ఓ దిగ్గజములారా! భూమినీ, ఫణినీ, కూర్మాన్ని, వరాహాన్ని గట్టిగా పొదివిపట్టుకోండి, రామభూవరుడు ఈ శివధనస్సుని ఎక్కుపెట్టుతున్నాడు.

ఈ పద్యంలో ఎన్నో విశేషార్థాలు కనిపిస్తాయి. భూదేవి స్వయంగా విష్ణుసతి. శేషువు పానుపు. కూర్మ, వరాహాలు రెండూ మహావిష్ణువు అవతారాలు.

భూభారాన్ని తగ్గించటానికి మానవరూపంతో భువిపై జన్మించిన శ్రీరాముడు విల్లు ఎక్కుపెట్టినపుడు, భూదేవి కదులుతుందా? స్వయంగా ఆదిశేషుని అవతారమూర్తి లక్ష్మణుడు శ్రీరామునికి తోడై జన్మించితే, ఆ శేషువు శివధనుర్భంగానికి ఆటంకమవుతుందా? కూర్మవరాహాలు కదిలి వాటి నిజకార్యాన్ని విఘ్నపరుస్తాయా?

పదాలను సందర్భానుసారంగా పొదగటంలో మొల్ల చాలా గొప్పది. రామ భూవరుడు అన్న పదంలో రాముడు భూమిపుత్రి సీతను వరించనున్నాడన్న అర్థం స్ఫురిస్తుంది.

ఇనవంశోద్భవుడైన రాఘవుడు బాహుశక్తితో శివధనస్సును ఎక్కుపెట్టి విరుస్తాడు. భూరి ఘోషమున వార్ధుల్ మ్రోయు చందంబునన్ ధనువును రాముడు విరిస్తే ధరణీశసూనులు శిరములెల్లవంచి సిగ్గుపడ్డారు. ఎరుల సొమ్ములు తమకేలదొరకు?(5)

సీతారాముల కళ్యాణవైభవాన్ని మొల్ల ఒక పెద్ద వచనంతో ముగిస్తుంది. దీనిలో మొల్ల క్లుప్తతను దృష్టిలో ఉంచుకొని వీలైనన్ని తక్కువపదాలను ఉపయోగిస్తుంది. భరతశత్రుఘ్నులకు కూడా రామలక్ష్మణులతోపాటుగా వివాహాలు జరిపిస్తారు. అయోధ్యకు తిరుగుప్రయాణమైన దశరధుని సమూహానికి పరశురాముడు ఎదురుపడతాడు. మొలక నవ్వుతోడ, దశరధుడు తనపేరు చెప్పి రాముడు తన కుమారుడని భీమబలుడని అంటాడు. క్రోధాగ్నితో పరశురాముడు తాను ఒకడినీ ఉండగా మరొకడు రాముడు ఎవరని, ఉన్నా తనతో యుద్ధంచేయమని పిలుస్తాడు. రాముడు పరశురాముని పరమపవిత్రుడవు బ్రాహ్మణుడవు భార్గవాన్వయుండవని అంటూ హవస్థలమున జగడ మాడ తనకు తగదని వారిస్తాడు. అయినా వినక పరశురాముడు తను శస్త్రశాస్త్రాలలో సన్నుతికెక్కిన భార్గవుడనని యుద్ధం చేయమని ఆహ్వానిస్తాడు.

ప్రియవచనాలతో రాముడు భార్గవరాముని శాంతపరుస్తాడు. శివుని విల్లు పాతదని. దాన్ని విరవటం గొప్పవిషయం కాదని అంటూ పరశురాముడు తనవద్ద ఉన్న నారాయణ చాపాన్ని ఎక్కుపెట్టితే చాలని సవాలుచేస్తాడు. శ్రీరాముడు ఆ శరాసనమును జిక్కఁగ నెక్కిడి వాడి బాణమందున నిడియేది లక్ష్యమన ద్రోవలు సూపిన ద్రుంచె గ్రక్కునన్ – దానితో దశరథాత్మజుడు పరశురాముని విష్ణుతేజమును అందుకుంటాడు.

పరిశీలిస్తే అయోధ్యాపురవర్ణన, సీతాకళ్యాణఘట్టం, పరశురామ గర్వభంగ ఘట్టాలే బాలకాండలో కాస్త వివరంగా కనిపిస్తాయి. ఇతర ఘట్టాలైన రామాదుల జననం, విశ్వామిత్ర యాగసంరక్షణ, తాటకవధ, అహల్యా శాపవిమోచనం చాలా స్థూలంగానే ఉంటాయి. శాంతాఋష్యశృంగుల కథను మొల్ల ఏ కారణంగానైతేనేమి వదిలివేయటం ఆక్షేపణకి గురైనా మొత్తంమీద ఆంధ్రసాహిత్య రసజ్ఞులందరికీ మొల్లకవిత్వం పన్నీటిజల్లుగానే ఉంటుంది.

## వివరణలు:

1. 'సరయూ నదీ తీర సతత సన్మంగళ ప్రాభవోన్నత మహా వైభవమ్ము' అని ప్రారంభమయ్యే మొదటి పద్యంలో అయోధ్యపుర వైభవము వర్ణించబడింది. ఇది తెలుగు రామాయణాల్లోని అనేకమైన వాటిలో ఎక్కడా కనిపించదు.
2. వాల్మీకి రామాయణంలో బాలకాండలో దశరధుడు విశ్వామిత్రునితో ఈ విధంగా అంటాడు.

   "ఊన షోడశవర్షో మే రామో రాజీవలోచనః ।
   న యుద్ధ యోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః ॥"

దాన్ని అనుసరిస్తూ మొల్ల ఈ విధంగా రచించింది.

*రాముడు దనుజులతో సం*
*గ్రామము సేయంగఁ గలఁడె? కందు గదా! నే*
*నే మిమ్ముఁ గొలిచి వచ్చెద*
*నో మునిరాజేంద్ర! యరుగు ముచిత ప్రౌఢిన్*

3. మానవ మనోప్రవృత్తి చిత్రణ, పాత్రల ఆంగిక, వాచిక మూకాభినయాలు, పాత్రల క్రమోన్మీలనం మొదలైనవన్నీ కలిసి నాటకీయతని కల్గిస్తాయి. వాటివల్ల వస్తుసాక్షాత్కారం కలిగి చదువరులు నాటకానుభూతికి లోనవుతారు.
4. అష్టవివాహపద్ధతులలో బలపరీక్ష ద్వారా వివాహం ఒక విధానం. 'నీ శంకరు చాప మెక్కిడిన సత్త్వ ఘనుండగు వాని కిత్తునీ పంకజనేత్ర సీత, నరపాలకులారా! నిజంబు సెప్పితిన్' అని అంటాడు. దీన్నిబట్టి రాముడు సత్త్వఘనుడు అని స్పష్టమవుతోంది.
5. ఈశోపనిషత్తు ఈ విధంగా పేర్కొంటుంది:
'కాస్యస్విద్ ధనమ్'
ఇతరుల ధనాన్ని దొంగిలించకు అని ఉపనిషద్వాక్యం. సీత రాముని సొత్తు. దీన్ని అపహరించాలని చూసే చోరుడు రావణాసురుడు. 'ఎరుల సొమ్ము తమ కేల దొరుకు?' అనటంద్వారా మొల్ల భావికథను సూచిస్తోంది. సీతాసాధ్విని అపహరించుకొనిపోయిన రావణుడు సీతను పొందలేదని, ఆ చోరుడు ప్రాణాలు పోగొట్టుకుంటాడని మొల్ల వ్యంగ్యం చేసింది.

# అల్లసాని పెద్దన

మనుచరిత్ర రచించిన అల్లసాని పెద్దన భువనవిజయములోని కవికుంజరులలో ఘటికుడు. తన కవితానైపుణ్యంతో పెద్దన నిర్మించిన ప్రబంధం ఈనాటికీ దానిలోని విశిష్టతల వల్ల సాహితీ ప్రియులనందరినీ అలరిస్తూంది. నందవరీక స్మార్త బ్రాహ్మణవంశమున జన్మించిన అల్లసాని అష్టాదశవర్ణనలతో నిండిన ఆరు ఆశ్వాసముల కావ్యాన్ని తన ప్రభువైన శ్రీకృష్ణ రాయలుకి అంకితమిచ్చాడు.

బాల్యంలో రాయలుకి గురువుగా అతనికి విద్యాబోధనలు చేసిన పెద్దన ఆంధ్రకవితా పితామహునిగా పేరుపొందాడు. తన విశేష ప్రతిభతో ఆశుకవితలు చెప్పి గండపెండేరాన్ని తొడిగించుకున్నాడు. పెద్దన ఎదురైతే రాయలు మదకరీంద్రము నిల్పి దిగి పెద్దనకి పాదాభివందనం చేసేవాడు. శిరీష కుసుమ పేశల సుధామయోక్తుల పెద్దన రచనాచాతుర్యాన్ని 'అల్లసానివాని అల్లిక జిగిబిగి' అనే పలుకులు నిరూపిస్తున్నాయి. భాషాంతరీకరణంలోనూ, శైలిలోనూ, కల్పనా చాతుర్యంలోనూ, తెలుగు నుడికారాల ప్రయోగంలోనూ, దేశీయ ఛందో ప్రయోగాలలోనూ, లోకజ్ఞాన ప్రకటనలోనూ పెద్దన పెద్దనే.

వాల్మీకి, వ్యాసుడు, బాణభట్టు, కాళిదాసు, నన్నయ, తిక్కన, ఎఱ్రన మొదలైన కవులందరినీ అర్థంచేసుకొని వారి రచనా విధానాలను ప్రమాణాలుగా పెట్టుకొన్న పెద్దన మార్కండేయ పురాణాన్ని అనుసరించి రాసినా సర్వకాలీన ధర్మాన్ని, కర్మ పరాయణతని వివరించేందుకు మూలంకన్నా భిన్నంగా కథని తీర్చిదిద్దాడు.

అయ్యలరాజు రామభద్రకవి తన గురువైన పెద్దన ఆశీర్వాదాలతో సకల కథాసార సంగ్రహము రచించాడు.

దేవబ్రాహ్మణ భక్తిపరుడైన పెద్దన అసంఖ్యాకంగా దానధర్మాలు చేసాడని శాసనాలు చెపుతున్నాయి. శివకేశవుల పట్ల పెద్దన సమ భక్తిభావం నిలిపాడు. హరికథాసారం అనే గ్రంథాన్ని "విద్యానిలయ గరుణా కటాక్ష నిబిడ జ్యోత్స్నా దళితాశ్రిత దురితచ్ఛలగాఢ ధ్వాంత సమితియైన" గురువు శఠకోపయతికి అంకితమిచ్చి గురురుణం తీర్చుకున్నాడు పెద్దన.

రాయలు మరణించిన కొద్దికాలానికే ఆతని నిర్యాణము గూర్చి సీసపద్య శతకాన్ని పెద్దన రచించాడని చెపుతారు. అదేవిధంగా రాయల నిర్యాణానంతరము కన్నడ రాజ్యముపైకి గజపతి దండెత్తి రాగా "నొడలెరుంగవొ చచ్చితో యుర్విలేవొ.... తెరచి నిలుచు కుక్కసొచ్చిన తెరగుదోప" అనే సీసపద్యాన్ని పంపితే అతడు సిగ్గుతో వెనుదిరిగాడని ఉదంతములున్నవి.

క్రీ॥శ॥ 1540 ప్రాంతంలో అల్లసానివారు అశాశ్వతమైన భౌతికకాయాన్ని విడిచి యశశ్శరీరంతో ఇంద్రసభని అలంకరించటానికి వెళ్ళారు.

# 11. పెద్దన - మనుచరిత్ర - తాత్విక చింతన

"పెద్దనఁ బోలుపండితులు పృథ్విని లే రని నీ వెరుంగవే
పెద్దన కీఁ దలంచినను బేరిమి నా కిడు కృష్ణరాణ్ణృపా"

తెలుగు సాహితీలోకంలో కవిత్రయం తర్వాత పెద్దన పేరు వినిపిస్తుంటుంది. రాయలు ఆస్థానంలోని కవులందరికీ అల్లసాని పెద్దన గురుతుల్యుడు. ఆంధ్రకవిత్వం మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లుతున్న ఆ వసంతంలో కవితాపితామహుడు వెలార్చిన మనుచరిత్రము రామాయణ భారత భాగవతాదుల తర్వాత అత్యంత పేరుపొందిన గ్రంథం అనటం సబబు. సప్త సంతానములలో ప్రశస్తిగాంచి ఖిలము గాకుండునది ధాత్రి గృతియ కాన రాయలు భువన విజయాఖ్య సంసద్భువన భద్రపీఠి బ్రాజ్ఞులగోష్ఠిలో చతుర వచోనిధి, అతులపురాణాగమేతి హాస కథార్థస్మృతి యుతుడైన అల్లసాని పెద్దనని స్వారోచిషమనుసంభవ మరయ రసమంచిత కథలన్ అతి నేర్పుగా మార్కండేయపురాణోక్త ప్రకారంబునం జెప్పుమని నివేదించాడు. పెద్దన ఈ బాధ్యతని అనన్యసామాన్యంగా నిర్వర్తించాడు.

స్వారోచిష మనుచరిత్రము, స్వారోచిష మనుసంభవము అనే ఇతరపేర్లు ఉన్నప్పటికీ ఈ ప్రబంధరత్నం మనుచరిత్రగానే అందరికీ సుపరిచితమైనది. తన కొలువులో ఎందరో విద్వాంసులు ఉన్నా పెద్దననే ఈ కథ రాయమనటానికి "బాలరసాల కిసాలము గ్రోలుచు బలికెడి పికంబు కో యన" లాంటి పెద్దన కవితా విశిష్టతలే కారణము. ఇదికాక ఆ కాలంలోని సమాజపు సంధిగ్ధావస్థలు రాజైన రాయలుకి చేరి, పారమార్థిక చింతనను ప్రజలలో పెంపొందింపచేయాలనే తపన గురించి తెలుసుకోవాల్సింది[1] ప్రజల మనసులో నిలిచే ఒక ప్రతీకను సాహిత్యం ద్వారా సృష్టించి తద్వారా ఆచరణీయమైన, అభిలషణీయమైన మార్గానికి వారిని మళ్ళించాల్సిన బాధ్యతను ప్రభువు అర్థం చేసుకొన్నారు. దీనికి నిరంతర తత్వచింత ద్వారా ఆత్మవిజ్ఞానం పొందిన పెద్దనయే తగినవాడు.

శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా కవి. ఆముక్తమాల్యదలాంటి కావ్యాన్ని రచించిన రాయలు విష్ణుభక్తుడు.[2] బహుపత్నీ వల్లభుడైన రాయలుకి తన రాజకీయ దురంధరత్వానికీ యుద్ధరంగ పరాక్రమానికీ, రామరాజ్యం లాంటి పరిపాలనా సామర్థ్యానికీ తన వంశకర్తల గుణాలే కారణమనే ఊహలు ఉండటానికి అవకాశాలు ఉన్నాయి. మనుచరిత్రలోని బ్రజలకెల్లను గడు రామరాజ్యమయ్యె లాంటి పద్యాలు దీన్ని వివరిస్తున్నాయి. అయినప్పటికీ తాను ఇంకా ఉన్నతుడిని కావాలని, జ్ఞానం పెంపొందించుకోవాలనే ప్రవృత్తి రాయలుకి మెండు. ధర్మదీక్ష, తత్వజిజ్ఞాస, దైవభక్తి ఉన్న రాయలు తనలోని కామప్రవృత్తిని ఏ విధంగా తగ్గించుకోవాలా అన్న ఆలోచనల్లో పడ్డాడు. ఉత్తమకావ్యం తనకు మార్గదర్శకంగా ఉండవచ్చని భావించాడు.

పెద్దన భోగమయజీవనాన్ని గడిపే వ్యక్తి. ఆనాటి సమాజంలో స్త్రీని భోగవస్తువుగా పరిగణించేవారు. తనలోని కామప్రవృత్తిని ఏవిధంగా వ్యక్తిత్వపు నిండుదనానికి, జీవితం

మీద ఆసక్తి గౌరవాలకు మరల్చాలా అని పెద్దన మధనపడ్డాడు. తన కావ్యంలో వర్తమాన పరిస్థితుల దృష్ట్యా, సామాన్యులు స్త్రీకాంక్షని వదిలిపెట్టి, స్త్రీపురుష సంబంధం ఏకప్రియానురక్తంగా మారి దాంపత్య ధర్మంగా రూపుదిద్దుకొని సాంఘిక జీవితానికి అంతిమంగా పునాదియైన కుటుంబంగా నిలబడాలి అని చూపించినా పెద్దన నిజానికి సమకాలీన జీవన విధానాన్ని నిరసించాడు. కవి అప్రకటిత శాసన కర్త అన్న వాక్యానికనుగుణంగా ఆదర్శవంతమైన సమాజసాధనకి కృషిచేసాడు. ఇది మనుచరిత్ర సాధించిన గొప్ప విజయం.

అంతరంగాల్లో పెద్దన స్త్రీపురుషుల శారీరక, మానసిక సంబంధాల గురించి తీవ్రంగా ఆలోచించారని మనుచరిత్ర కావ్యాన్ని సంపూర్ణంగా పరిశీలిస్తే అవగతమవుతుంది. మార్కండేయ పురాణంలోని ప్రవరుని పాత్రకు పెద్దన సృష్టించిన ప్రవరునికి చాలా భేదం కనిపిస్తుంది. వరూధినీ ప్రవరుల సంవాదంలో కవి తనలోని భావ సంఘర్షణని ప్రతిఫలింపచేసాడని కొందరు విమర్శకులు నిర్ధారించారు. అసలు ఏ కవి అయినా కథావస్తువుని ఎన్నుకునే సందర్భంలో ఈ విషయాన్ని పరిగణిస్తాడు. కథ అందులోని పాత్రలు తన హృదయావిష్కరణ చేసేందుకు అనువుగా ఉండేలా చూసుకుంటాడు. తన వ్యక్తిత్వంలోని భిన్నప్రవృత్తులు, దాని ద్వారా తనలో సంభవించే సంఘర్షణ తెలుసుకున్న కవి వాటికి అన్వయాన్ని లేదా తత్వదృక్పథాన్ని అందుకోవాలని ఆశిస్తాడు. సకల ప్రాణికోటికి సామాన్యమైన మైథునవాంఛని అణగదొక్కాలని చూడటం కుదరదని పెద్దనకి తెలుసు. అలా అని చెప్పి శరీర వాంఛలని విచ్చలవిడిగా వదిలేస్తే అది విపరీతానికి దారితీస్తుంది. జితేంద్రియత్వం అంటే ఇంద్రియాల నుంచి పరాఙ్ముఖత్వం కాదు. అదే విధంగా శృంగారసుఖం అన్ని వేళలా ఆనందాన్ని అందివ్వలేని పరిస్థితి పెద్దనని చాలా ఇబ్బందికి, ఆలోచనలకి గురి చేసింది. అందుకే తనలోని ద్వైదీ భావానికి ప్రతీకలుగా ప్రవరుడు, మాయాప్రవరుడు, స్వరోచి, ఇందీవరాక్షుడు, మనోరమ, కళావతి, విభావసి లాంటి పాత్రలు సృష్టించాడు. ఇవన్నీ ఆయన మనసులోని విభిన్న ప్రవృత్తల సంఘర్షణని వివరించేవే. ఒకే వ్యక్తిత్వంలోని విభిన్న ప్రవృత్తుల సంఘర్షణలని ఇంత అద్భుతంగా వివరించిన పెద్దన విధానం మన ఆధునికకాలంలోని మనస్తత్వశాస్త్రం చెప్పే సిద్ధాంతాలకు వందల సంవత్సరాలకు పూర్వమే ఉండటం చాలా గొప్ప విషయం.(3)

మనుచరిత్రలో పెద్దన బహుజాగ్రత్తగా తీర్చిదిద్దిన పాత్ర వరూధిని. ఈమె భోగలాలసతకు ప్రతినిధి. ప్రవరుడు పెద్దనలోని నైష్ఠికతకు గుర్తు. ఈ పాత్ర ఆయన బహిర్‌స్వరూపం అలానే వరూధిని ప్రవరుల సంవాదం దృష్టిలో పెట్టుకొని, అంతవరకు మాత్రమే చూస్తే కనపడే ఆదర్శరూపానికి ప్రతీక. విజృంభించిన భోగవాంఛకు ఇందీవరాక్షుడు సంకేతం. మనోరమ అంటే బుద్ధి. స్వరోచి – గంధర్వకాంత వరూధినీ (ప్రవరుడు, మాయాప్రవరుడు)ల కొడుకు. ఈ పాత్ర తనలోని ద్వైధీభావనకి తాత్కాలికంగా పెద్దన చేసుకున్న సర్దుబాటు మనస్తత్వానికి ప్రతినిధి. విభావసి మనస్సుకూ, కళావతి చిత్తానికి ప్రతీకలు. మాయాప్రవరుడు పెద్దనలోని అదనుచూసి భోగించబోయే తత్వానికి గుర్తు. అందుకే ఇంద్రియసుఖం అనుభవిస్తున్నప్పుడే మనస్సు

ఊరటలేక చింతించుచుండగా సర్వమును అసహ్యమగును అని మాయాప్రవరునిత వరూధినికి చెప్పించారు పెద్దన. రతి యన "యూనోరన్యోన్య విషయా స్థాయి నీచ్ఛారతిర్భవేత్" ఆలంకారిక నిర్వచనము. ఈ క్రింది పద్యం పెద్దన మనస్సాక్షికి దర్పణం వంటిది. ఇందులో పెద్దన సమయం కనిపెట్టి భోగించాలనే తన ప్రవృత్తి, భోగలాలసతకి మధ్య ఏర్పడిన సంఘర్షణని చాలా నిశితంగా పరిశీలించారు. దీన్ని కొందరు విమర్శకులు సరిగా అర్థం చేసుకోక పెద్దన వ్యక్తిత్వాన్ని గూర్చి "ప్రవరుని క్రూరుడు మహీసురాధముడు - అహంకారయుతుడు - సెభాష్ పెద్దనా, ముసుగులో దాగుకొని నీ అక్కసు వెళ్ళబుచ్చుకొన్నావు. కసిదీర్చుకున్నావు. ఈ సహానుభూతియే ఈ హృదయవైశాల్యమే నిన్ను మహాకవి పట్టమునకు అర్హుని జేయుచున్నది..." అని తీర్పునిచ్చారు.[4]

ఓ సరసీరుహాక్షి వినవో రతి గౌగిట నీవు చేర్చునిం
పా సురభర్తకైన గలదా వల దంచు బెనంగ నేను స
న్యాసినె యొక్కటే తహతహా మనసొగ్గదు కేళిపై 'ననా
శ్వాసిత దుఃఖితే మనసి సర్వ మసహ్య మనా' నెరుంగవే.

మాయాప్రవరుడు వరూధినితో 'కవయునెడ వలయు గన్ను గవయును మూయన్ భువి నిది యస్మద్దేశ వ్యవహారము' అని చెప్పటాన్ని పరిశీలించాలి. సంభోగ సమయంలో కన్నులు మూసుకొనుట మా దేశ ఆచారమనటం పెద్దన తాను స్వీయజీవితంలోనూ అలానే తన దేశవాసులు కూడా తమని తాము మోసం చేసుకుంటున్న వాస్తవాన్ని కళ్ళ ముందుంచారు. నిజాయితీతో పెద్దన చెపుతున్న విషయాన్ని అర్థం చేసుకోవాలి తప్ప ముసుగులో ఉన్నాడనటం సరికాదు. పైన చెప్పిన కళ్ళు మూసుకోవటం అనేది 'అనాశ్వాసిత దుఖితే' తో అన్వయించి చూస్తే పెద్దన నిర్మలత్వం, గాఢమైన ఆలోచనా విధానం తెలుస్తాయి.

మాయాప్రవరుడు వరూధినితో "నీ చనుదోయి సంకుమద నిర్భర వాసన యేననూనన, య్యోచిర సౌఖ్యముల్ గనుటయొండె దపం బొనరించి పాపముల్ రాచుట యొండుగాకి హపరంబుల కూరక దూరమై వయశ్శ్రీచన రెంటికిన్ జెడిన రేవడనౌదునె నీరజేక్షణా" అని వివరిస్తాడు. అంటే పెద్దనలోని భోగలాలసతతో అతని మనస్సాక్షి చేస్తున్న వాదనని చూస్తే చాలామందిలాగానే సమయానుకూలంగా సుఖాలు పొందాలని ఇది కాకపోతే మోక్షాన్నికోరి మనసుని విషయవాంఛల నుంచి దూరంగా మళ్ళించాలని ఉందని తెలుస్తోంది. మరి సందర్భానుసారంగా దేవాలయంవేరు, పడకటిల్లు వేరు అని సమాధానపర్చుకొని, మనస్సాక్షి నోరు నొక్కివేసి అందరి లాగానే ఉంటే పెద్దన ఇంత గొప్ప తాత్వికుడు, విజ్ఞుడు ఎలా అయ్యేవాడు!

పెద్దన మాయాప్రవరుని పాత్ర ద్వారా ఇంద్రియసుఖం అనుభవిస్తున్న వేళలో తరచుగా తనకు సంభవించే వైరాగ్యభావాన్ని "అంతా నాటకం. నేనేమీ సన్యాసినా?" అని వివరిస్తుంటే మనకు విశ్వాసం కలగదు. మరి పెద్దన తత్వజిజ్ఞాస పాండిటీ

ప్రకర్షగాకాక ఆత్మసాక్షాత్కారం వేపు ఆయన్ని ఎలా ఉన్ముఖం చేసిందో తెలియటానికి మనుచరిత్రను సమగ్రంగా అవగాహన చేసుకోవాలి.

కావ్యం ప్రారంభంలోనే లక్ష్మీస్తన కస్తూరి భూదేవియని మునులకు దోచుట గంధర్వుడు వరూధినికి బ్రవరునివలె త్రోచుటకు సూచనము. ఇది భ్రాంతిమదాలంకారము. తర్వాత పెద్దన శ్లేష ఉపయోగించి కుకవియందు చోరుని లక్షణములు ఆరోపించి ఇతరకవుల పద్యార్థములను దొంగిలించి తనవిగా పెట్టుకొని వానితత్వం తెలిసినవారు వెల్లడించినంత రాజసాన్నిధ్యంలో జరిగే అవమానాల్ని గురించి చెపుతాడు. కవిత్వంపట్ల పెద్దన వైఖరికి ఇది నిదర్శనం. అతని సత్యవ్రతానికి ఇది కూడా చక్కని ఉదాహరణ.

ప్రవరాఖ్యుడు చక్కదనము వైరాగ్యమున చేసి "కాంక్షసేయు జార కామినులకు భోగబాహ్యమయ్యె బూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకు బోలె" అని చెప్పటం భావికథలో వరూధిని పట్ల అతను కాముకుడు కాదని తెలిసివస్తోంది. రాజులు దానమిస్తానన్నా ప్రవరుడు తీసుకోడనటం అతని ధనాపేక్షరాహిత్యాన్ని సూచిస్తోంది. సిద్ధుని యిష్టమృష్టాన్నకలన సంతుష్టుచేసి పాదలేపనం పొందిన ప్రవరునికి తీర్థయాత్రవలన ధన్యాత్ముడు కావలెనని సంకల్పము.

ప్రవరుడు హిమాలయాలని దర్శించాలన్న కోరికతో వెళ్ళి ఆకాశమునంటు శిఖరాగ్రముల నుంచి ప్రవహించు సెలయేళ్ళ అలల చప్పుళ్లు మద్దెలమ్రోతగా భ్రమించి నృత్యము చేయుచున్న నెమళ్ళని తిలకిస్తాడు. రూపకాలంకారాన్ని ఉపయోగించిన పెద్దనామాత్యుడు వరూధినీ విషయంగా ఆమె ప్రవరుని గురించి భ్రమపడుతుందనే భావికథని సూచిస్తున్నారు.(5)

'నరనారాయణ చరణాంబురుహ ద్వయభద్ర చిహ్న ముద్రిత బదరీతరుషండ మండలాంతర' ప్రవరుడు వెళ్ళాడనటం అతని హృదయనిర్మలత్వాన్ని చెపుతోంది. ప్రవరుడు వ్యాసునితో పోల్చదగిన తపోసంపన్నుడని బదరీ శబ్దం స్ఫురింపచేస్తోంది.(6)

'మనసున బురికొను కౌతుకముతోడ' బ్రాహ్మణుడైన ప్రవరుడు తరుగహన గుహావిహారతత్పర మతియై వెళ్ళాడని ఉంది. తరువులు నిరంతరములుగా నుండుటచే గుహలు కటక ప్రదేశమున కేగినగాని కనుపట్టకున్నవని భావము.

ప్రవరుడు వేదోక్తమార్గాన్ని తప్పనివాడు. అతనికి నిశిత పరిశీలనాశక్తి ఉందని, ప్రకృతిని దానిలోని వింతలను తిలకించాలనే ఆతృత ఉందని వెల్లడవుతోంది.

తపసి యిల్లాండ్ర చెలువంబు దలచి తలచి
మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు
కనుపపులు వేల్పుబడ వాలుగన్న చోటు
హర్షమున జూచి ప్రవరాఖ్య దాత్మలోన

ప్రవరుడు అక్కడ భగీరథుడు తపస్సు చేసినచోటును, ఆకాశగంగ భూమికవతరించిన ప్రదేశమును, పార్వతి శివునికి శుశ్రూష సల్పిన ప్రదేశాన్ని,

మన్మథుడు శివుని కంటి మంటచే కాలిన ప్రదేశాన్ని, అగ్నిదేవుడు సప్తర్షుల భార్యలపై మోహం చెందిన ప్రదేశాన్ని, కుమారస్వామి జన్మించిన రెల్లుదుబ్బులను చూసి సంతోషించాడు.

హిమాలయాలని చూసి ప్రళయకాలాన దాని మహాగ్ని జ్వాలలచే భస్మమైన భూమిని మరల తరుగుల్మలతాదులతో మొలిపించగలిగే శక్తికి విస్మితుడౌతాడు. ఇది కథారచన దృక్పథాన్ని వివరించే పద్యం. జీవితాన్ని ఉదాత్తంగా చేయగల శక్తి హిమాలయాల్లా శాంతరసానికి ఉందని నిరూపితం. ప్రవరుని వ్యక్తిత్వాన్ని కూడా ఇది సూచిస్తోంది. తిరిగి 'పసుపునిగ్గులు దేరు పాపజన్నిద'... అంటూ అతను హిమవంతుని ఎంతో కీర్తిస్తాడు. "తలమే బ్రహ్మకునైన నీ నగమహాత్మ్యంబెన్న" అంటూ గ్రమ్మరువేళ దైవకృతమున కిల నసాధ్యంబుగలదె అన్న రీతిన పాదలేపనం కరిగిపోతుంది.(7)

'బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్' అంటూ ఆత్మనిందతో సాగుతున్న ప్రవరుడు తన ఎదుట వివిధ పక్షుల సంగీతాన్ని వింటాడు. కనుగొని యిది మునియాశ్రమమను తహతహతో సాగుతూ చేరువనున్న కొండకోననుండి వెడలిన సెలయేటి నుంచి చీలిపోతున్న కాలువపక్కన పుష్పించిన మల్లెతీగలను, తుమ్మెదల ఝుంకారాన్ని చివరగా బూవుంది వెలనొప్పు నొక్క భవనంబున గారుడోత్కీర్ణమున్ చూస్తాడు. ఆ వాతావరణాన్ని చూసి ప్రవరుడు ఆశ్చర్యపోయాడు. 'మృగమధసౌరభ విభవ ద్విగుణితమై మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్.' అయినప్పటికీ · ప్రవరుడు అవాత పరంపరని జనాన్వితమని భ్రమించి వెళ్ళి మెరుపు దీగ వంటి మేను, కమలముల వంటి కన్నులు కలదానిని, తుమ్మెదల వంటి కురులు గలదానిని, చంద్రునివంటి మోముకలదానిని, లోతైన బొడ్డు గలదానిని ఒక మరున్నారీశిరోరత్నాన్ని చూస్తాడు. ఆ దివ్యాంగన వరూథిని, 'నాలాపగతి జొక్కి యరమోడ్పు గనుదోయి రతి పారవశ్య విభ్రమమము దెలుప' వీణ వాయిస్తూ ఉంది. ఆమె ప్రవరుని చూసి లోలోపల కోరికలురేగగా 'గుబ్బమెరుంగు జన్గవ గుగుర్పొడువన్' నలకూబర సన్నిభుడైన ప్రవరుని తనవాడిని చేసుకోవాలని· కోరుకుంటుంది.

"చూచి ఝుళంఝుళత్కట సూచిత వేగ పదారవిందయై" ఆ దేవతా స్త్రీ కుచములును, గొప్పును, సన్న నడుమును నల్లలనాడగా ప్రవరుని మార్గంవేపు దొంతరదొంతరలుగా చూపుల కాంతులు క్రుమ్మరించింది. ఆ పంకజముఖికి అప్పుడు "మైనంకురితములయ్యె బులకలా విష్కృత మీనాంకానల సూచక ధూమాంకురములు బోలె" అని పెద్దన ఉత్ప్రేక్షించారు.

ప్రవరుని చూసిన వరూధినికి భ్రమరకీటక న్యాయాన మనుష్యత్వము సంభవించెనా అన్నట్లు అనిమేషస్థితి, అస్వేదతావృత్తి, బోధకళ మారి బిత్తరపుచూపులు, స్వేదం, మోహవిభ్రాంతి అనే మనుష్య ధర్మాలు వాటిల్లాయి. 'యక్షతనయేందు జయంత వసంత కంతులన్ జక్కదనంబునన్ గెలువజాలెడివాడు' ప్రవరునితో మన్మధసుఖములు అనుభవించాలనే కోరికలు ఆమెకు పుడతాయి.

వరూధినీ ప్రవరుల సంభాషణ పెద్దన చతురవచోనిధితత్వాన్ని, రచనాశిల్పాన్ని వివరిస్తుంది. మనుచరిత్ర ద్వితీయాశ్వాసములోని వీరి ముఖాముఖి తెలిపే పద్యాలు

ఆంధ్రసాహిత్యంలో చాలా పేరుపొందాయి. పాదలేపనం కరిగిపోయి ఇల్లు చేరే దారి కోసం వెతుకుతున్న ప్రవరుడు తన సహజ ధోరణిలో సహాయంకోసం మాట్లాడుతుంటాడు. ప్రవరుడు కనిపించగానే 'నను వాడు పరిగ్రహించినన్' అన్న ఊహతో పులకరించిన వరూధిని అతను మాట్లాడిన మాటలను తన పరంగా అన్వయించుకొని ఎంతో సంబరపడుతుంది.

1. *"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటి చరించె దోట లే*
*కివ్వన భూమి భూసురుడ నే బ్రవరాఖ్యుడ ద్రోవతప్పితిన్*
*గ్రొవ్వన నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబు జేర నిం*
*కెవ్విధిగాంతన్? దెల్పగదవే తెరువెద్ది? శుభంబు నీకగున్"*

2. *'ఇంతలు కన్నులుండ దెరువెవ్వరి వేడెదు? భూసురేంద్ర! యే*
*కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా*
*గింతియకాక నీ వెరుగవే మునువచ్చిన త్రోవచొప్పు? నీ*
*కింత భయంబు లే కడుగ నెల్లిదమైతిమే? మాటలేటికిన్?*

ముని ఆశ్రమం అనుకొని వచ్చిన ప్రవరుడు తన మానసికస్థితికి అనువుగా ఓ యువతీ! నీ వెవ్వతెవు? భీతి లేక యొక్కతెవే ఈ అరణ్యమందు తిరుగుతున్నావు. నేను బ్రాహ్మణుడను. నా పేరు ప్రవరుడు. క్రొవ్వెక్కి ఈ కొండకి వచ్చి దారి తప్పాను. ఏ విధముగా పురము చేరాలో చెప్పు. నీకు శుభం అవుతుంది అని మాట్లాడాడు.

భీతహరిణేక్షణ అను సంబోధన పెద్దనగారు ప్రవరునితో చెప్పించటం గమనార్హం. ఆ సంబోధన ప్రవరుని వంటి నిష్కామినోట రాదగదని కొందరు విమర్శకులు అంటారు.[8] బహుశా వరూధినిలో కలిగిన భావచాంచల్యం ఆమె కళ్ళలో కనిపించటాన్ని చూసి అతను అలా సంబోధించి ఉండవచ్చు.

పైపైన చూస్తే వరూధిని చెప్పిన ఇంతలు కన్నులుండ... కి ఓ విప్రుడా? ఇంతలు కన్నులు పెట్టుకొని ఇతరులని ద్రోవ అడుగుదవేమి? ఏకాంతంలోని స్త్రీలను ఏదో నెపం మీద పల్కరించటమే తప్ప నీవు వచ్చినదారినే మర్చిపోయావా? ఇన్ని మాటలు దేనికి? అసలు అంత భయంలేకుండా అడగటానికి మేము నీకు చులకనగా కనిపించాము కాబోలు అన్న అర్థం వస్తుంది. కాని ఆమె నర్మగర్భంగా తన అభిప్రాయాన్ని మరుగుపరచి ఎదుటివానికి సరసము దోచునట్లుగా మాట్లాడటాన్ని తెలుసుకోవాలి.

ఇంతలు కన్నులుండ అని అనటం ప్రవరుని నయనవైశాల్యాన్ని మెచ్చిందనటానికి గుర్తు. ఈ మాటలు వరూధిని తన కళ్ళ మీద చేతులు పెట్టుకొని అభినయిస్తూ అనటాన్ని పట్టి ఆమె వక్షోజసౌందర్యాన్ని చూపి అతన్ని ఆకర్షించాలనే ప్రయత్నం కనిపిస్తాయి. నెపమనుటచే రసికతా ప్రకటనకిది ఒక త్రోవ గాబోలు అని ఆమె ప్రవరుని గురించి అనుకున్నట్లుగా తెలుస్తుంది. ఏకాంతమనుట యదేచ్ఛావిహార భోగోచిత ప్రదేశమని సూచితం. జవరాండ్ర అన్న పదం సంభోగోచితయౌవన విభవనని

సూచించటం. భూసురేంద్ర అనటం అతను అందచందాలలో ఉన్నతుడు అని చెప్పటం. ఆమె దేవవేశ్య కనుక అతను బ్రాహ్మణుడు కనుక వారి సమాగమం తగినదని అభిలాష.

సభంగ, అభంగ, శ్లేషలద్వారా ప్రవరుని మాటలని కూడా వరూధిని తనపరంగా అన్వయించుకొని కోటి ఆశలు తెచ్చుకుంటుంది. అతని భీతహరిణేక్షణని ప్రశంసగానూ, యొంటిజరించె అనటాన్ని తన మీద ఆరాధనతో, శృంగారాభిలాషతో అన్నట్లుగానూ భూసురుడననటాన్ని బ్రాహ్మణునికి నాల్గుజాతుల వారితోనూ సమాగమం శాస్త్ర సమ్మతమని వివరిస్తున్నట్లుగానూ, త్రోవతప్పి అనటం నిత్యాగ్నిహోత్రులకు యోగ్యమైన మార్గాన్ని తప్పివస్తున్నట్లుగానూ, పురంబు అన్న పదాన్ని తన సౌందర్యాన్ని అందుకోవటం ఎలా అని ప్రశ్నించినట్లుగాను, తెరువెద్ది అనటం రహస్య కలయికకి తగిన ప్రదేశం ఏది అని ప్రశ్నించినట్లుగానూ, 'శుభంబు నీ కగున్' అనటాన్ని తన మనసులోని కోరికను అతను గ్రహించినట్లుగానూ వరూధిని అర్థం చేసుకొంది.

'చిన్ని వెన్నులకందు వెన్నుదన్ని సుధాబ్ధి' అంటూ వరూధిని కామశాస్త్ర సిద్ధాంతాలని పఠించుట చిన్ననాటి నుంచి వారికి అలవాటైందని చెపుతుంది. 'కైతవ కుసుమ శరాసన' అని అతన్ని కపట మన్మథునిగా సంబోధిస్తుంది. బహురత్న ద్యుతిమేదరోదరీ భాగంబులన్ అని చెప్పి 'ఇందిందర తుందిలంబు లివి' అన్న మాటలద్వారా ఇష్టోపభోగాలను పొందమని సలహానిస్తుంది.

విషయాసక్తుడు కాని ప్రవరుడు ఆమె మాటల వెనక ఉన్న భావాలని గ్రహింపడు. 'మానిని దివ్యముల్ మది దలంచిన నెందును మీద సాధ్యముల్ గానము' అని చిరునవ్వు నవ్వుతాడు. వరూధిని ఇంక దాపరికమెందుకని 'ధరణీసుర నందన యింక నీ పయిన్ జిక్కె మనంబు నాకు' అని తన కోరికలను వెల్లడిస్తుంది. బదులుగా ప్రవరుడు తాను 'వ్రతుడై దినములు గడపెడు విప్రుడనని' అతను కామిస్తే సమస్తధర్మములు నశిస్తాయని అంటాడు. దీనికి వరూధిని 'యజ్ఞకోటులం బావనులౌటకున్ ఫలము మా కవుగిళ్ళ సుఖించుటే కదా' అని నిలదీస్తుంది. 'వెన్నవలెన్ గరంగు నలివేణులలన్ గౌగిట జేర్చు భాగ్యముల్' అనిచెప్పి 'గృశుడవయి యాత్మనలచుట సశరీర స్వర్గ సుఖము సమకొని యుండన్' అని తర్కిస్తుంది. ప్రవరుడు అవన్నీ సకాముకుడికి వర్తిస్తాయని, బ్రాహ్మణుడు ఇంద్రియ నిగ్రహముతో ఉండాలని అది లేనిదే మోక్షం సిద్ధించదని చెపుతాడు. ఈ తర్కంలోనూ వరూధినిదే పైచేయి. ఆమె ఏ విషయం మీద మనస్సు వికాసము చెంది తన్మయమై నిర్వాణము చెందునో, ఇంద్రియాలన్నీ ఏ విషయమున లయించి సుఖమందునో దాన్ని బ్రహ్మానందం అంటారని వివరిస్తుంది.

*ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్*
*జెందున్ గుంభ గతప్రదీపకళికా శ్రీదోపనెం దెందుబో*
*కెందే నింద్రియముల్ సుఖంబు గనునాయింపే పరబ్రహ్మ 'మా*
*నందో బ్రహ్మ' యటన్న ప్రాజదువు నంతర్బుద్ధి నూహింపుమా*

ప్రవరుడు కేవలం శరీరం బాహ్యమైనదిగా, వ్రతాదులతో వైదిక కర్మలతో వైరాగ్యభావం పొందటమే తన అభీష్టమని ధర్మాన్ని నిర్వచించాడు. కానీ వరూధిని

సూచించిన ధ్యానసాధన శైవుల తాంత్రిక విధానానికి చెందినది. శైవం వదిలి విశిష్టాద్వైతం స్వీకరించిన పెద్దన తనలోని, కర్మ, జ్ఞాన, యోగ మార్గాలను ఆచరించాలనే తీవ్ర ఆకాంక్ష వెనుక జరిగిన మానసిక పరిణామాన్ని తెల్పుకున్నాడు. కావ్య ప్రారంభంలోనే శివుడిని కీర్తిస్తూ పెద్దన 'ఉల్లమునందు నక్కటిక మూనుట మీ కులమందు గంటి' అంటాడు. అరణ్యవాస కాలమున అర్జునుడు పాశుపతాస్త్రమునకై కావించిన తపస్సునకు మెచ్చి కిరాతవేషమున అరుదెంచి హేలగాబోరి యాతని కోడుట నభినయింపగా పార్వతి చూసి "మీ కులమున ఎన్నడునులేని జాలి కాన్పించెన్' అని పరియాచకాలాడుతుంది.[9]

వేటగాడైన శివుడు 'జాలి' మూనుటే విశిష్టాద్వైతములోని విశిష్టతగా పెద్దన భావిస్తున్నాడు. పెద్దన కాలంలోని సామాన్యుడికి ప్రతినిధియైన స్వరోచి వేటకెళ్ళినప్పుడు కూడా అతనికి వనదేవత జాలి, ప్రేమల గురించి చెప్పటాన్ని బట్టి ఇది నిరూపితం.

శాస్త్ర దృష్ట్యా మనుచరిత్రలోని ప్రధానరసము శాంతము. శాంతరసమనగా తృష్ణాక్షయ రూపమగు సుఖము పరిపోషితమునొందినట్టి స్థితి. కామాదికముల వలన జనించు సుఖముకంటే తృష్ణాక్షయము వలన లభించే సుఖమే గొప్పది. 'యచ్చ కామ సుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖం, తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతష్షోడశీం కలామ్' అని భారతం (శాంతి పర్వం) వివరిస్తోంది. వరూధినీ, ప్రవరుల సంవాదంలో శృంగారానికి (వరూధిని) ధర్మవీరానికి (ప్రవరుడు) ఏర్పడిన ఘర్షణ క్రమముగా మారి అహంకార రాహిత్యాన్ని చెంది అంతిమంగా శాంతం జయించుట పెద్దన కావ్యకళా ధృక్పథాన్ని వివరిస్తోంది.[10]

ప్రవరుడు 'చెప్పకు మిట్టి తుచ్ఛ సుఖముల్ మీసాలపై దేనియల్' అనటంతో ప్రవరుని "ఇనుపకచ్చడాల్ గట్టుకొని మునిముచ్చులెల్ల తామరసనేత్రలిండ్ల బందీలుగారె" అని వరూధిని నిందిస్తుంది. ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో బాలిండ్లు పొంగార ప్రవరుని గౌగిలించి యధరం బాసింప అతను హా! శ్రీహరీ అంటూ ఆమెను ఆవలకు త్రోసివేస్తాడు. పాటున కింతులోర్తురె కృపారహితాత్మక అని వరూధిని తిరిగి మరో ప్రయత్నంగా నీవు త్రోయగా ఇక్కడ నీ గోరు తాకింది. చూడమనే! నెపంతో విచ్చుగుబ్బ చనుమిట్టల నశ్రులు చిందువందగన్ ఏడుస్తుంది. 'పుణ్యములెన్ని యేనియున్ జేసినవాని సద్గతియె చేకురు భూతదయార్ద్ర బుద్ధి కో భూసురవర్య యింత దలపోయవు నీ చదువేల చెప్పుమా' అని అతనిలోని లోపాన్ని తెల్పుతుంది. ఇదంతా అంతర్ దృష్టి, ఆత్మవిమర్శద్వారా పెద్దన తెలుసుకున్న విషయం.

ప్రవరుడు గార్హపత్యవహ్ని ప్రార్థించి ఇల్లు చేరతాడు. అతని అహంభావం శరీరాన్ని నిరాకరించే వైరాగ్యం ద్వారా వ్యక్తమైంది. కేవలం సకామకర్మానుష్ఠాన దశలోనే ఉన్న ప్రవరుని ధర్మప్రవృత్తి ధర్మార్థకామమోక్షాలలోని చివరిదైన బ్రహ్మానందాది రాజ్యపదవిని కేవలం కరుణతోనూ, సర్వప్రాణికోటి పట్ల సమభావం పెంపొందించు కొనటంలోనూ, వ్యక్తి ధర్మం సృష్టిధర్మంతో అనువర్తించి ఏకమవ్వటంతోనూ సిద్ధిస్తుందని పెద్దన నిశ్చితార్థం. ఇదే ఆయన నిరంతర తాత్విక చింతన ద్వారా సాధించిన ఆత్మజ్ఞానం. మనుచరిత్రలోని కథ ద్వితీయాశ్వాసం దాటి వెళ్తున్నపుడు మనకు పెద్దన

తనలోని వైరాగ్య ప్రవృత్తికి లాలసకి అన్వయం చేసిన విధానం తెలుస్తుంది. ఇది ఏదో సాధారణ భావసంఘర్షణ కాదని, జీవుని పరిదేవనమని మనకు అర్థం అవుతుంది.

ప్రవరుడు వెళ్ళిన తర్వాత వరూధిని తీవ్రమైన మదనకాంక్షతో రగిలిపోతుంది. ఆమె మీద కోరిక ఉన్న గంధర్వుడు పై వృత్తాంతము తెలిసి మాయా ప్రవరుని వేషంతో వచ్చి ఆమెతో సుఖిస్తాడు. 'పుల్లనవలీనవైలావల్లిమతల్లికలతోద యొక లతాగృహాంతరసీమన్' చేరి ఇరువురు పెద్ద కాలం రసానందంతో మునిగారు. మాయాప్రవరుడినే వరూధిని ప్రవరునిగా భావించింది. అతని మీద మనసులగ్నం అవటంవల్ల రతిసమయంలో ఆమె కన్నులు మూసుకున్నా మనోనేత్రం ముందు ప్రవరుడే ఉన్నాడు. అతని ఉద్దీప్తమైనమూర్తి ఆమె మనసులో నిలిచింది. గంధర్వునితోడి శృంగారానుభూతి ప్రవరుని తేజసాంశకు దీపిక అయింది. మార్కండేయ పురాణములో గూడా వరూధిని ప్రవరుని మూర్తి హృదయమున నిల్పిందనే ఉంది. సూర్యచంద్రాదులగు కాంతిగలవారి ప్రభనడచు శరీరచ్ఛాయ గలవాడు కావున అక్కడి ఋషులు వరూధినికి జన్మించిన కుమారునికి స్వరోచి అని పేరు పెట్టారు. ప్రారంభంనుంచీ వరూధినీ ప్రవరుల వర్ణనలో తెలుపు, ఎరుపులని శశిభాస్కరులని సూచిస్తూ పెద్దన వర్ణించటం చూడాలి. 'వనరుహనేత్రి కన్నుగవ ధవళరుచుల్, వదన ప్రభూతలావణ్యాంబు సంభూత కమలంబులన వీని కన్నులమరు'... అనే పద్యాల్లో ఇది కనిపిస్తుంది.

తనలోని ద్వైవీ భావానికి తాత్కాలికంగా చేసుకున్న సర్దుబాటువల్ల శరీరం భోగాసక్త మవటం, ఆత్మ వైరాగ్యంతో ఉండటం దాని పరిణామాలు తెల్సిన పెద్దన మనోరమ వృత్తాంతాన్ని, హంస చక్రవాకాల సంభాషణాల్ని, వనదేవత వృత్తాంతాన్ని విపులంగా వర్ణించారు.

స్వరోచి 'గ్రుద్దున్ గోత్రాచలంబుల్ గులగులయిపోగోతముల్ గ్రుద్దులీలన్' పెరిగి పెద్దయి అటవికులకు రాజవుతాడు. 'వలదు కుక్కల విడువంగ వలవదేయ' అని అటవికుడు అతనికి వేటపై తమకాన్ని కల్గిస్తాడు. ఈ విధంగా పెద్దన చతుర్థాశ్వాసములో వేట గురించి విస్తృతంగా చెపుతాడు. రాయలుకి కూడా వేట మీద ప్రీతి. అల్లసాని అతనివెంట చాలాసార్లు వేటకి వెళ్ళాడనటానికి ఇక్కడ బోలెడన్ని నిదర్శనాలు.

ఇందీవరాక్షుడు తరుముతుండగా మనోరమ ఒక్కతె భయశోకంబుల వెక్కుచు వచ్చి రాజుని కాపాడమని వేడుతుంది. ఆమె ఊసరవెల్లి చందమున నొక్కట బీరనరాలుదేరగా... యొక్కజీర్ణమునింగని కౌతుకంబునన్ అతని వదనం, కుహరం, నేత్రద్వయం, కర్ణయుగళం మొదలైనవాటిని ఎలా ఉన్నాయో, అని తడిమి చూస్తూంది. ఇక్కడ జీర్ణముని కాలం మారిపోయి, విదేశీపాలనతో హైన్యపడి, దుమ్మూ ధూళిపడి, ఎవరూ పట్టించుకోకుండా మిగిలిపోయిన సనాతన భారతీయ ధర్మానికి ప్రతీక. అందుకే బుద్ధి (మనోరమ) కొత్తగా ధర్మం అంటే ఏమిటా అన్న వివేచనని ప్రారంభించింది. అడ్డూఅదుపూ లేకుండా, పెరిగిన ఇంద్రియవాంఛల విశాలరూపమే ఇందీవరాక్షుడు. ఈ భోగాసక్తివల్లనే తనకాలంలోని ప్రజలు వారి బుద్ధినే మ్రింగబోతూ అసురభావానికి గురి అవుతున్నారని పెద్దన వివరిస్తున్నాడు. మనోరమని జీర్ణముని నాగబెత్తంతో కొట్టటం అనేది బుద్ధిపై ధర్మం చేస్తున్న కట్టడి అనీ దానివల్లే బుద్ధి శరీరతృష్ణా విజృంభంపై అదుపు

సాధించగలదని చెప్పటం.[10] నాగబెత్తం అన్న పదం కూడా ముఖ్యమైనదే. తాత్విక దృష్టితో చూస్తే ఇంద్రియజ్ఞానం ద్వారా స్వరూపం దిద్దుకొనేదే బుద్ధి. ఈ విధంగానే మనోరమ ఇందీవరాక్షుని కూతురు. సరైన నియమం లేకపోవటంతో శరీరతృష్ణలో బుద్ధి విధ్వంసం అయ్యే పరిస్థితి ఏర్పడుతుందని పెద్దన హెచ్చరిక చేసారు. జీర్ణముని మనోరమని కొడుతుంటే కళావతి, విభావసులు అడ్డుపడతారు. వీరిలో కళావతి బ్రహ్మర్షికి తపోభంగం కావించిన అప్సరసకు, బ్రహ్మర్షికి జన్మించింది. ఆమె తండ్రి ధ్యానసమాధిలో ఉన్నాడనటంతో అన్ని కళలకు మూలం యోగవిద్య అని స్పష్టం అవుతోంది. తల్లి చిత్తవికారం కనుక ధ్యానసమాధి భంగం అవటంతో దానిలో లీనమైన చిత్తం పొందే వికారమే కళాసృష్టికి మూలం. ఈ విధంగా పెద్దన తనలోని సృజనాత్మకతని తారాస్థాయికి చేర్చటంలో ఏర్పడుతున్న ఇబ్బందులకు మూలకారణాన్ని అన్వేషించారు. మరోవిషయం ఏమిటంటే ఉన్నతమైన కళాసృష్టి సంప్రదాయాలను కూడా భోగాసక్తి (గంధర్వుడు) తస్కరింపచూస్తోంది, చూసింది కూడా. పార్వతీదేవి కళలను రక్షించింది. ఆమె ప్రసాదించిన పద్మినీవిద్య యోగవిద్య. అంటే సాధన చేయటం ద్వారానే తాను ఉత్తమ కళాసృష్టి చేయగలనని అదే యోగత్వం అనీ పెద్దన తెలుసుకున్నారని మనకు తెలుస్తోంది. ఈ విషయాలనన్నింటినీ కళావతి వృత్తాంతం వివరిస్తోంది.

విభావసి మందారుడని విద్యాధరుని కుమార్తె. ఆమె భూమి మీద ఉన్న అన్ని మృగముల, పక్షుల భాషలను తెల్సిన చంద్రకళా పోషిత. పెద్దన మూలంలోని విభావరి పేరును విభావసిగా మార్చాడు.

ఇందీవరాక్షుడు మ్రింగబోయిన మనోరమని పావకబాణం (ధర్మం) సాధనంగా కాపాడి బుద్ధి యొక్క విపరీత పరిస్థితిని ధైర్యంతో చక్కదిద్దాడు స్వరోచి. విపరీతంగా అంటే అభ్రమండలి మోచునందాక పెరిగిన ఇంద్రియతృష్ణకి కారణం మనిషిలోని మృత్యుభయం అని జిజ్ఞాసచేసి పెద్దన ధర్మనిరూపణ చేస్తాడు. దీనికి స్వరోచిలోని దయాగుణం ప్రధానకారణం.

ఈ ధర్మనిరూపణ ద్వారానే రాక్షసుని తిరిగి గంధర్వునిగా చేయటం వీలయింది. అంటే శరీరతృష్ణని అదుపులో ఉంచుకొని జీవితాన్ని ఉదాత్తంగా చేసుకోగల స్థితి ధర్మం ద్వారా వస్తుందని తెలుస్తోంది. ఇది ప్రవరుడు చేయలేకపోయాడు కానీ ప్రవరుని కొడుకైన స్వరోచి చేయగల్గాడు.

స్వరోచి మనోరమని వివాహం చేసుకొని ఇందీవరాక్షుని నుంచి ఆయుర్వేదం నేర్చుకుంటాడు. దీని ద్వారా మనోరమను వివాహం చేసుకుంటాడు. ఇప్పటికి పెద్దనలోని ద్వైదీభావం పరిణామం చెంది ఆత్మ ఇంద్రియసుఖాలను వదిలి బుద్ధి, మనస్సు, చిత్తము, కళలు లాంటి ఇతర వ్యాపారాల్లో లిప్తం అయింది. కరుణాప్రవృత్తి వైరాగ్యంపై గెలుపొందింది. విజ్ఞానం పెరిగింది. ఇంత సమన్వయం సాధించినా పెద్దనలో ప్రేమనుగూర్చిన జిజ్ఞాస చల్లారలేదు. ప్రేమతత్వాన్ని అర్థం చేసుకుంటే గానీ పరిపూర్ణత్వం రాదు. అప్పటికి కానీ ఆత్మజ్ఞానం తెలిసి మోక్షలక్ష్మీకటాక్షం లభ్యమవదు. అప్పుడే పండితుడు అవుతాడు.[11]

స్వరోచిని హంస పొగిడినా "చక్రవాకం తగులు నెవ్వడొక్క తరుణికి నొకనికి మెలత వలచునదియు మేలనంగ అంటూ అతనకి ముగ్గురు భార్యలమీదా ఆసక్తి ఉండటం ప్రేమ ఎట్లా అవుతుందని నిశితంగా విమర్శిస్తుంది. అది దాసీ నికరము కైవసమై సంచరించు క్రమమున విద్యా ప్రావీణ్యవైభవోన్నతిచే వచ్చినవారి గురించి చెపుతుంది. ఈ విధంగా స్వరోచిలో వైరాగ్యభావం తలెత్తినా మానరాని తమకంబున భోగాసక్తితో నూరేడులు గడుపుతాడు. ఆ తర్వాత గేళికావనము నందు ఆడలేళ్ళపై ప్రేమతో తిరుగుతున్నట్లుగా కనిపించిన మగలేడిని చూస్తాడు. కానీ, దాని మాటలు అతనిలో తిరిగి వైరాగ్యాన్ని కలిగించాయి.

హుంకారం బొనరించి వే తలగుడోహో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లప్పుడు దర్పస్ఫూర్తి గ్రీడింప ల
జ్జాంకూరం బడగించినారు తలపోయన్ నాకు రోతయ్యె మీ
రింకన్ బోయివరింపు డొక్కరుని భోగోచ్ఛన్ నివారించితిన్

అయినప్పటికీ స్వరోచి "వివేకము చొప్పు దక్కి యింపారగ నారునూరు సురహాయనము లిర్చియించె గ్రమ్మరన్." చివరకి ఒకసారి వేటకి వెళ్ళి అడవిపందిని చూచి బాణం సంధిస్తుంటే నృప! యీ క్రోడము నీకే యపకారముసేసె అని ఒక ఆడలేడి పరుగెత్తి వచ్చి మానవ భాషలో మాట్లాడుతుంది. నాపై నిపుడే శరమేసి నిగ్రహించుట యొప్పున్ అని భూతదయార్ద్ర బుద్ధిని వివరిస్తుంది.

అంటే భోగప్రవృత్తి దయనుంచి ఉద్భవించబడిన నిగ్రహం ద్వారా ప్రేమగా మారుతుందని తెలుస్తోంది. ఇది 'వల్లీమ తల్లి లావణ్య సర్వస్వంబు...' పద్యంలో కనిపిస్తోంది. స్వరోచిలోని దయాప్రవృత్తివలే పెద్దనలోనూ తాత్త్వికదృక్పథం పెరిగింది. స్వరోచిలోని వైరాగ్య భావం దయాభావంతో సమ్మేళనం చెంది ఆత్మసాక్షాత్కారదిశగా అతన్ని నడిపిస్తుందనే సూచన ధ్వనిస్తోంది. ఇతనికి కర్మసన్యాస దృక్పథం ఏర్పడినా వనదేవతని వివాహమాడి స్వారోచిషమనువుకు తండ్రి అవుతాడు. మార్కండేయ పురాణంలో స్వరోచి అడవికివెళ్ళి భగవత్సాక్షాత్కరం పొందినట్లు ఉంది. కానీ పెద్దన అలా రాయలేదు.

స్వరోచికి, వనదేవతకి స్వారోచిషమనువు జన్మిస్తాడు. అతను అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహము కలవాడై ప్రేమయందును, సత్యమందును, శుచిత్వమునను నిష్ఠకలవాడై విషయేచ్ఛలు లేనివాడై విష్ణుదేవుని గూర్చి తపస్సు చేస్తాడు.(12)

పరతత్త్వం బగు నీకు మోడ్పు గరముల్ పద్మాక్ష కీర్తించెదన్
బురుషార్థస్థితి నొప్పు నిన్ను గరుణాంబోధిన్ భవార్తున్ జ
డున్ శరణార్థిన్ ననుగాన గాదగు బ్రధానవ్యక్తకా లా
త్మ యీ, శ్వర భూతంబుల కీవె కర్తవున్ బ్రోవన్ భర్తవున్ హర్తవున్

ఈ విధంగా స్వారోచిషమనువు విష్ణువుని ప్రార్థిస్తాడు. అతనికి రెండవమనువై నీతిని ధర్మాన్ని వృద్ధిచేసి చక్కగా భూమిని పరిపాలించమని విష్ణువు ఆనతి.

జీవితం మీద ఆసక్తి, గౌరవం, ప్రేమ ఉన్న పండితుడు పెద్దన పై విధంగా తాను తెలుసుకున్న జీవితసత్యాన్ని వెల్లడించారు. తనలోని భావసంఘర్షణని సమతుల్యం చేసుకున్న పెద్దన గృహస్థాశ్రమ ధర్మాన్ని తనకాలం వారికీ, అన్ని కాలాలవారికీ తగినదానిగా వివరించారు. విశిష్టాద్వైత తాత్వికత పెద్దనకి జ్ఞానమార్గాన్ని చూపింది. రాయలుకి కూడా అతని జీవితాన్ని ఏ విధంగా పరిపూర్ణంగా తీర్చిదిద్దుకోవాలో మనుచరిత్ర ఉద్బోధించింది.

ఉదాత్త శృంగారానికి శ్రీకారం చుట్టిన పెద్దన వ్యక్తిత్వపు నిండుదనము, కావ్య రచనా చమత్కృతి, రస పరిపోషణ మొదలైన విషయాలు ఈ ప్రబంధంలో పఠితలకు గోచరమవుతాయి. సూర్యచంద్రులున్నంతవరకూ నిస్సందేహంగా మనుచరిత్ర మనుజులకు మార్గదర్శకంగా నిలబడుతుంది. అల్లసానిపెద్దన నిజంగానే ఒక సాహితీ ధ్రువతార.

## వివరణలు:

1. రాయలు కాలంలో హిందూ సమాజవైఖరికి మహమ్మదీయ సమాజవైఖరికి మధ్య సంఘర్షణ ఏర్పడింది. హిందువుకి పారమార్థిక చింత మెండు కాగా మహమ్మదీయులకి భోగలాలసత ప్రధానం. వీటిలో దేన్ని ఆచరించాలో తెలీని సందిగ్ధావస్థలో సమాజం పడింది.
2. ఆముక్తమాల్యదని పెద్దనే రచించాడనటానికి ఆధారాలు కొన్ని ఉన్నాయి. రంగరాట్ఛందమునందు ఆముక్తమాల్యదలోని పద్యాలు ఉదహరిస్తూ 'బెద్దన రచించిన ఆముక్తమాల్యద' లోని అని కవి అన్నారు.
3. ఫ్రాయిడ్ మనోవైజ్ఞానిక సిద్ధాంతంలో ఇద్, ఈగో, సూపర్ ఈగోలు ఉంటాయి. ఇద్‌లో కేవలం వాంఛలు ఉంటాయి. తప్పొప్పుల ప్రసక్తిలేదు. సమాజ నియమాల్ని చెప్పి తనకి వ్యతిరేక ప్రవృత్తిగల ఇద్‌ని నియంత్రిస్తుంటుంది. ఇద్, ఈగోల మధ్య ఏర్పడిన సంఘర్షణని సూపర్ ఈగో నివారిస్తుంది. ఈగో తార్కిక భావాలకు ప్రతీక. అసలు ఫ్రాయిడ్ జన్మించడానికి పూర్వమే ప్రతీకల ద్వారా ఇంద్రియవాంఛలకు (ఇందీవరాక్షుడు) బుద్ధి (మనోరమ) కి జరిగిన ఘర్షణని, ధర్మం (జీర్ణముని) దాన్ని నివారించిన విధానాన్ని పెద్దన వివరించారు.
4. కవిత్వతత్త్వ విచారములో కట్టమంచి రామలింగారెడ్డిగారు అలానే 'పెద్దన - సమకాలీన భావప్రతినిధి' వ్యాసాల్లో దువ్వూరి రామిరెడ్డిగారు పెద్దన వ్యక్తిత్వాన్ని గూర్చి తప్పుగా అభిప్రాయపడ్డారు.
5. సంస్కృత నాటకాలలో 'గండం' అనే అంకం వస్తుంది. దీని ద్వారా భావికథను సూచించటం ఒక విధానం. మహాభారతంలోని ఉదంకోపాఖ్యానంలోనూ భారత భావికథ సర్వమూ గోచరమవుతున్నది.
6. కాని వ్యాసునికన్నా శుకుడు సాధించిన విలువలు అధికం. అందుకనే మనుచరిత్రలోనూ ప్రవరుని మనుమడైన స్వారోచిషమనువుకి విష్ణుసాక్షాత్కారం అవుతుంది.

7. నళినీబాంధవ.... మధ్యాహ్నమున్ దెల్పెడిన్ అన్న పద్యం ద్వారా మనుచరిత్రలోని ఒక అసందర్భాన్ని విమర్శకులు చెపుతారు. ప్రవరుని ఇంటికి సిద్ధుడు కుతుపకాలమున నరుదెంచినట్లు ఉంది. ఇది పద్దెనిమిది ముహూర్తములలో ఎనిమిదవ ముహూర్తము. అతన్ని పూజించి సంతుష్టిడిని చేసి హిమాలయా సందర్శనానికి ప్రవరుడు బయలుదేరిన వెంటనే మధ్యాహ్నమవటం అసందర్భంగా, అసమంజసంగా ఉంది.

8. ప్రవరుడు ఆ తర్వాత వరూధిని అండజయాన, జలజాక్షి, భావజరూప, వనజేక్షణ అని సంబోధిస్తాడు. ఇవన్నీ సౌందర్యాన్ని సూచించే పదాలు. అయితే పెద్దనగారు కావ్యకళా దృక్పథంతో అలాంటి పదాలను వాడి ఉండవచ్చు.

9. విశిష్టాద్వైతం స్వీకరించినా పెద్దనకి శివుడిమీద భక్తి పోలేదు. ఇక్కడ శైవవిధానాల్లో జాలి, కరుణలని అంతగా ప్రధానమైనవిగా పెద్దన చెప్పటం లేదని కొందరి భావన. అయితే, ఇది అటవికుల గురించే చేసిన పరియాచకం. మరోవిధంగా చూస్తే రాయలుకి పరమేశ్వరుడు అభీష్టసిద్ధి జేకూర్చునని దీవించటాన్ని వ్యాఖ్యానిస్తే రాయలుకి ఉన్న భోగాపేక్షని బోళాశంకరుడు (కరుణతో ఇంద్రియసుఖాపేక్షని నియంత్రించటం) సరైన మార్గంలో పెడతాడనే పెద్దన ఆలోచన వెల్లడవుతోంది.

10. ఏకోరసః కరుణ ఏవః అని భవభూతి మాట. మనుచరిత్రలో చివరికి కరుణరస ప్రాశస్త్యాన్ని పెద్దన నిరూపించాడని కొందరి అభిమతం. స్వరోచికి కరుణద్వారానే పరిపూర్ణత్వం సిద్ధించినట్లుగా వనదేవత వృత్తాంతం సూచిస్తోంది.

11. పతనం అంచుకు చేరిన సామాజిక విపరీతాలని ధర్మమే సరిచేయగలదని పెద్దన ఈ వృత్తాంతం ద్వారా నిరూపించారు.

12. ప్రేమ ప్రాశస్త్యాన్ని హిందీకవి కబీర్‌దాస్ చెపుతారు. రెండున్నర అక్షరాల ప్రేమసారం తెల్సుకున్నవాడు పండితుడవుతాడని వారి సిద్ధాంతము. ఇది సర్వ ప్రాణికోటిపట్ల సమభావస్థితి. అప్పుడే "యాదేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా"... అన్న భావం నెలకొంటుంది.

13. పెద్దనకి విజ్ఞానం, తత్వ చింతనల ద్వారా తెల్సిన "ఆత్మవత్సర్వ భూతాని" అన్న సత్యం ముక్తికి సోపానమైంది. స్వారోచిష మనువుకి వాడిన ఉపమానాలు పెద్దన జీవితాదర్శాలకు సంకేతాలు.

# ధూర్జటి

అష్టదిగ్గజాలలో అత్యంత ప్రతిభావంతుడైన ధూర్జటి గొప్ప భక్తుడు. శ్రీకాళహస్తీశ్వర శతకం ధూర్జటి భక్తితత్వాన్ని వెల్లడిస్తుంది. ఈ శతకంలోని ప్రతి పద్యంలో ధూర్జటి వ్యక్తిత్వం, భక్తిభావం, శివభక్తిరీతి మొదలైనవన్నీ కనిపిస్తాయి. "నిన్నే రూపముగా భజింతు మదిలో"... అని చింతించిన శివభక్తుడు ధూర్జటి తన శతకంలో నవవిధ భక్తిరీతులని ప్రస్తావించాడు. వివిధ విధాలుగా శ్రీకాళహస్తీశ్వరుని సేవించి శివైక్యం పొందిన ధూర్జటికి శ్రీకృష్ణదేవరాయలు సాష్టాంగప్రణామాలు చేసేవాడని చెపుతారు.

శ్రీకాళహస్తీశ్వరశతకాన్ని ఆ భృంగమూర్తికే అంకితం చేసిన ధూర్జటి "నా కిమ్మైఁ దల్లియుఁ దండ్రియున్ గురుడు నీవే" అని అంటాడు. తన శతకంలో శివభక్తులు కథలను, పురాణగాథలను, వేదాంతరహస్యాలను, అధ్యాత్మికాంశాలను, తత్వవిధానాలను వివరించాడు. "రాజుల్ మత్తులు వారి సేవ నరకప్రాయంబు" అని స్పష్టం చేసిన ఈ పరమభక్తుడు రాజకీటముల నే సేవింపగా నోప అని త్రికరణశుద్ధిగా చెపుతాడు. ఈ శతకం రాజులబుద్ధిని, వారి విధానాలను వెల్లడిస్తోంది. ఆత్మజ్ఞానం లేని పండితులని నిక్కచ్చిగా విమర్శించిన ధూర్జటి రాజాశ్రయానికి పాకులాడే పండితులని నిరసించాడు. ఇది రాయలు అనంతరం ధూర్జటి ఎన్నో ఇబ్బందులు పడి ఉంటాడనే ఊహకి హేతువు కల్గిస్తోంది.

ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరశతకం ఒక సారస్వత తపస్సు. తన జీవిత చరమాంకంలో పరమశివుని పాదపద్మాలనే అంతఃకరణంలో నిలుపుకొని, నిర్మలమైన భక్తితో పద్యాలతోనే దివ్యార్చనచేసి దుర్లభమైన జన్మరాహిత్యాన్ని సునాయాసంగా సాధించిన విజయుడు. ముక్తిసాధనలో ధూర్జటి ప్రయాణించిన రాజమార్గమే; రాజులసేవలో పడి జీవితాన్ని భగవంతునికి అర్పించక ఐహిక సుఖాపేక్షలతోనే వెళ్ళబుచ్చేవారికి, అనుసరించాల్సిన భక్తిమార్గం.

ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరశతకంపై శ్రీ ఆది శంకరాచార్యులువారి భక్తిభావ ప్రకటనా విధాన ప్రభావం పడింది. పాల్కురికి సోమనాథుడు, భర్తృహరి, పోతన, మొదలైన పండితుల ప్రభావం ఈ కవిపై ఎంతగానో పడింది. శైవాద్వైతి ధూర్జటి పరమభక్తుల జీవితానుభవాలని శ్రద్ధగా చదివి అర్థంచేసుకున్న జిజ్ఞాసువు.

స్థితప్రజ్ఞుడు ధూర్జటి తెలుగుభాషలోని నుడికారాలని అద్భుతంగా తన పద్యాలలో ఉపయోగించి తన అతులిత మాధురీ మహిమను నిరూపించుకున్నారు. ధూర్జటి శతకం భక్తులందరికీ నిత్యపారాయణ యోగ్యమైంది. ఈ కవి ఆ ధూర్జటినే మెప్పించిన వినయశీలి.

## 12. ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకం - నవవిధ భక్తి భావనలు

శ్రీకాళహస్తీశ్వర శతకం ధూర్జటి భక్తితత్వాన్ని వివరిస్తుంది. నిర్మల మనస్సుతో, భక్తిభావంతో ధూర్జటి రచించిన పద్యాలన్నీ అంతులేని భావాల్ని వాటిలో నింపుకున్నాయి. ఈ శతకం శాంతరస ప్రధానమైంది. దీనిలోని పద్యాలన్నీ శివతత్వానికి సంబంధించినవి. పరమశివుడు భక్త సులభుడు. ధూర్జటి తన కవితాశక్తితో శివార్చన చేసి సాంబశివుని అనుగ్రహాన్ని పొందాడు. తన శతకంలో నవవిధ భక్తి విధానాలతో శివుని పూజించాడు.

భక్తి అనే పదానికి సేవ అనే అర్థం ఉంది. భజసేవాయామ్ అనే ధాతువునుంచి 'భక్తి' అనే పదం ఏర్పడుతుంది. సేవ యొక్క ఫలం ప్రేమ. ఈ ప్రేమ భక్తి పరిపూర్ణత్వం చెందితే సిద్ధిస్తుంది. శాండిల్య మహర్షి, నారదుడు మొదలైనవారు భక్తి గురించి వివరించారు.[1] ఈ భక్తి సాధనరూపమైన వైధభక్తి, సాధ్యరూపమైన నవవిధ భక్తి. శ్రీకాళహస్తీశ్వర శతకంలో ధూర్జటి నవవిధ భక్తిభావనలని వివరించిన విధానం చాలా గొప్పది.

శ్రీమద్భాగవతంలో ప్రహ్లాదుడు భక్తి విధానాలను ఇలా ప్రతిపాదించాడు:

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్।**
**అర్చనం వందనం దాస్య సఖ్య మాత్మనివేదనమ్॥**

(7:5:23)

శాస్త్రాలలో భగవానుని నామ, రూప, గుణ ప్రభావాదులను గురించి శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యభావం, సఖ్యభావం, ఆత్మసమర్పణం అనే భక్తిభావాలను ఏయే విధంగా వివరించారో వీటిని పూర్వకవులు ఏయే పరిస్థితుల్లో వర్ణించారో అధ్యయనంచేసి వాటిని చిన్న ముద్దుముద్దు మాటలలో ధూర్జటి తన శతకంలో వెల్లడించారు.

పరమాత్ముని నామ,గుణ,రూప,తత్వ రహస్యాలకు సంబంధించిన వివిధ గాథలను శ్రద్ధగా వినటం భక్తిభావనల్లో మొదటిది. శ్రీమద్భగవద్గీతలో భగవానుడు అర్జునునితో శ్రోత్రియులు, బ్రహ్మనిష్ఠులైన ఆచార్యులని దర్శించి, వారిని సేవించి పరతత్వజ్ఞానాన్ని వారిద్వారా తెల్సుకోమని చెప్పారు. శ్రవణం సర్వధర్మేభ్యో వరం మన్యే తపోధనా: అన్న వాక్యాన్ననుసరించి శ్రవణభక్తి చాలా శ్రేష్ఠమైందని తెలుస్తుంది. శ్రవణ భక్తితోనే భగవత్సాన్నిధ్యాన్ని చేరిన భక్తులు ఉన్నారు. పరీక్షిన్మహారాజు భాగవతశ్రవణం వల్లనే తరించాడు. నారదుడు పూర్వజన్మలో దాసీపుత్రునిగా మహామునుల సేవ చేస్తూ వారు భగవానుని లీలా విశేషాలని చెప్పగా శ్రద్ధగా ఆలకించాడు. ఈ శ్రవణభక్తి వల్లే మరుజన్మలో నారదునిగా జన్మించి మహాభక్తుడు అయ్యాడు.

శ్రీకారంతో మొదలయ్యే ఈ శతకంలో శ్రవణభక్తి విధానం గురించి చర్చించారు.

మొదటి పద్యంలోనే ధూర్జటి సంపదలనెడి మెరుపుతీగలతో కూడిన సంసారమనెడి మేఘముల నుంచి కురిసిన పాపములనే నీటిధారలచే మనఃపద్మము కాంతిలేక చిన్నపోయినదని అంటారు. రాగద్వేషాలు వ్యక్తిని బందీగా మారుస్తాయి.

భక్తిసాధనలో తొలిమెట్టు సంసార విషయాలను దూరం చేసుకొని జగత్తు సర్వం మాయతో నిండి ఉందని గ్రహించటం.

దినముం జిత్తములో సువర్ణముఖరీ తీరప్రదే శామ్రకా
నన మధ్యోపరివేదికాగ్రమున, నానందంబునం బంకజా
సన నిష్ఠన్నిను జూడ గన్న నదివో సౌఖ్యంబు లక్ష్మీ విలా
సిని మాయానటనల్ సుఖంబులగునే? శ్రీకాళహస్తీశ్వరా

సువర్ణముఖీనదీతీరాన ఉన్న మామిడితోటలోని రాతి అరుగు మీద పద్మాసనంలో ఉన్న శంకరుని ప్రతిరోజూ మనస్సులో నిలుపుకొని చూస్తే ఆనందం కానీ చంచలమైన లక్ష్మీదేవి చూపులు సౌఖ్యం ఇవ్వవని ధూర్జటి భావన. భగవంతుని స్వరూపాన్ని మనసులో ప్రతిష్ఠించుకుని శ్రవణేంద్రియాన్ని భగవంతునివైపు మళ్ళించటం పరబ్రహ్మ సాన్నిధ్యాన్ని అందిస్తుంది.

భగవంతుని నామ, తత్వరూపాన్ని అహరహం ఉచ్చరిస్తున్నప్పుడు హృదయం ఆనందంతో నిండిపోవటం, శరీరం పులకితి మవటం లాంటి లక్షణాలతో విలసిల్లటమే కీర్తన భక్తి. భగవంతుని పట్ల అనన్య ప్రేమతో కీర్తించటమ్ ఈ భక్తివిధానం. భగవద్గీతలో పరమాత్ముడు స్వయంగా ఈ విధంగా చెప్పారు.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ (9:30)

పరమదురాచారుడైనా అనన్య భక్తిభావంతో నా భక్తుడై నన్ను భజించుచున్నప్పుడు అతను సజ్జనునిగానే పరిగణింపదగినవాడని జగద్గురువే స్వయంగా బోధించారు. రామాయణ భాగవతాది పవిత్ర గ్రంథాలన్నింటిలోనూ భగవానుని నామగుణకీర్తనతోనే పాపాలన్నీ నశించి పరిశుద్ధులవుతారని ఉంది.[(2)] అజామిళుడు, గజేంద్రుడు మొదలైన వారందరూ ఈ విధమైన భక్తిభావనతోనే ముక్తి పొందారు.

సంపదలు నీటికెరటాలవలె, రావియాకులవలె, మెరుపుటద్దాలవలె, గాలిలోని దీపాలవలె, ఏనుగు చెవులవలె, ఎండ మావులవలె, మిణుగురు పురుగుల మెరుపులవలె, ఆకాశములోని అక్షరాలవలె, జీవులలోని ప్రాణములవలె, వెన్నెలముద్దలవలె చాలా చంచలములని, అశాశ్వతములని ధూర్జటి చెపుతాడు.

ఈశ్వరునితో తాను ఇదివరలో ఎన్నో జన్మలు ఎత్తి ఉన్నానని, వానిలో మాయామోహితుడై తాను చేసిన కర్మములను ఎంత ఆలోచించినా తెలిసికొన లేకున్నానని విన్నవిస్తాడు. ప్రస్తుత జన్మే పరమార్థమనే భ్రాంతిలో పడ్డానంటాడు. ఈ జన్మలోనే మోక్షము ప్రసాదించి తనను అనుగ్రహించమని కోరతాడు.

నీపైఁ గావ్యము జెప్పుచున్న యతడున్ నీ పద్యముల్ వ్రాసియి
మ్మా పాఠంబొనరింతునన్న యతడున్ మంజుప్రబంధంబు ని
ష్ఠాపూర్తిం బఠియించుచున్న యతడున్ సద్బాంధవుల్ గాక ఛీ
ఛీ! పృష్ఠాగత బాంధవంబు నిజమా? శ్రీకాళహస్తీశ్వరా!

ఈశ్వరుని మీద కావ్యం చెప్పువాడు, పద్యాలు వ్రాసి ఇస్తే చదువుకుంటాననేవాడు, శివుని గురించి చెప్పే పురాణాది దివ్య ప్రబంధాలని నిష్ఠతో చదువుకునేవారు బంధువులు తప్ప జన్మచేత, చుట్టరికం వల్ల అయ్యేవారు బంధువులు కాదని అర్థం చేసుకున్న జ్ఞాని ధూర్జటి.

ప్రణవ నాదమే బ్రహ్మానంద స్వరూపమని కవి వివరిస్తాడు. ఆ బ్రహ్మానంద స్వరూపుడు మహాశివుడు. దాని ప్రభావాన్నే లోకాలు నడుస్తున్నాయి. ఓంకారాన్ని శ్రద్ధగా ఆలాపించటం శివకీర్తన అవుతోంది. ఈ విధంగా జీవులని తరింపచేసే అకారోకారమకార యుక్తమగు ఓంకారనాదాన్ని ఆత్మాభ్రవీధుల గానంచేయటం ముక్తి ప్రసాదిస్తుంది.[3] ఈ విధంగా కీర్తన భక్తి గురించి ధూర్జటి వివరించారు.

స్మరణభక్తి అంటే స్వామి గుణ, లీలా, తత్వ విషయాలను విని లేదా చదివి వాటిని సదా మననం చేసుకోవటం. ఇంద్రియాలను విషయ రహితంగా చేసి వైరాగ్యభావంతో భగవంతుని సగుణ, నిర్గుణ తత్వాన్ని తెల్సుకోవటం అలానే దివ్య స్తోత్రాలతో ప్రార్థించటం మొదలైనవన్నీ ఈ భక్తి కోవలోకి వస్తాయి.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఈ విధంగా ఉపదేశించాడు.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ (9:22)

నిరంతరం నన్ను స్మరిస్తూ నిష్కామ బుద్ధితో భజించి చింతన చేస్తుంటారో అట్టి భక్తుల యోగక్షేమాలని స్వయంగా వహిస్తానని పరమాత్మ మాట ఇస్తున్నారు.

శ్రీమద్భాగవతంలో కూడా విషయవాంఛలు అధికంగా ఉన్నవారి మనస్సు ఇంద్రియసుఖాలపైనే నిమగ్నమవుతుందని, కానీ భగవంతుని సర్వకాల సర్వావస్థలలోనూ, స్మరించేవారి మనస్సు పరమాత్మలోనే లీనమవుతుందని చెప్పి ఉంది.

విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే ।
మామను స్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥ (11:14:27)

సనకసనాదిమునులు, ధృవుడు, భీష్ముడు, కుంతి, శబరి జటాయువు మొదలైన భక్తులందరూ ఈ భక్తిభావనతోనే మోక్షం పొందారు.

తమనేత్రద్యుతిఁ దామె చూడ సుఖమై తాదాత్మ్యముం గూర్పగా
విమలమ్ముల్ కమలాభముల్ జితుల సద్విద్యుల్లతా లాస్యముల్
సుమనోబాణ జయప్రదమ్ములనుచున్ జూచున్ జనంబాని హా
రిమృగాక్షీ నివహమ్ముకన్ను గవలన్ శ్రీకాళహస్తీశ్వరా!

ధ్యానసమాధిలో నిశ్చలచిత్తులైనవారికి ఆత్మ స్వరూపుడైన భగవంతుని సాక్షాత్కారం కలుగుతుంది. అహం బ్రహ్మాస్మి అనే అద్వైతస్థితి కలుగుతుంది.[4] స్త్రీ

సౌందర్యానికి దాసోహమనకుండా మహోన్నతమైన శివసౌందర్యాన్ని దర్శించాలని ధూర్జటి వివరిస్తున్నాడు.

అర్ధనారీశ్వరతత్వాన్ని ఆకళింపుచేసుకున్న ధూర్జటి శ్రీవిద్యోపాసకులు సంసారబంధాలను తొలగించుకుంటారని చెపుతూ నాదబిందుకళారూపిణి శ్రీచక్రాంతరవర్తిని అయిన భువనేశ్వరీదేవి యందు మనస్సు నిలిపి ఆ జగన్మాత దయవలన గర్వాంధకారం పోయి పరమేశ్వరి పాదపద్మాలను నిత్యం స్మరించమని బోధిస్తున్నాడు.

*అకలంకస్థితి నిల్పి నాదమును ఘంటారావమున్ బిందు దీ*
*ప కళాశ్రేణి వివేక సాధనము లొప్పం బూని యానంద తా*
*రక దుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తి వారించు వా*
*రికిగా వీడు భవోగ్ర బంధ లతికల్ శ్రీకాళహస్తీశ్వరా!*

పాదసేవనం అంటే భగవానుని దివ్యమంగళ విగ్రహాన్ని మనస్సులో నిత్యం నిలుపుకొని పూజించటం(3) ఆయన పాదకమలాలని మనసా శిరస్సుపై ధరించటం, భగవంతుని చరణస్పర్శపొందిన వస్తువులని పూజించటం, స్వామి స్పృశించిన పుణ్యక్షేత్రాలలోని ధూళిని భగవత్పాదధూళిగా ఎంచి శిరస్సుపై ధరించటం పాదసేవన భక్తి పద్ధతులు.

న వా కప్పష్ఠం న చ సార్వభౌమం
న పారమేష్ఠ్యం న రసాధి పత్యమ్ ।
న యోగ సిద్ధీ రపునర్భవం వా
*వాంఛంతి యత్పాదరజః ప్రసన్నాః ॥* (10:16:37)

శ్రీమద్భాగవతంలో పై విధంగా భగవంతుని చరణధూళిని ఆశ్రయించిన భక్తులు స్వర్గాన్ని కాంక్షించరని, చక్రవర్తిత్వాన్ని అభిలషించరని, బ్రహ్మపదాన్ని కోరుకొనరని, సంపూర్ణ భూమండలాధిపత్యాన్ని కూడా కోరుకోరని చివరకు మోక్షపదాన్ని అయినా వాంఛింపరని పాదసేవనా భక్తి ప్రాశస్త్యాన్ని వివరించారు.

భరతుడు ఈ భక్తితోనే సుఖించాడు. శ్రీశంకరాచార్యులు కూడా ఈ భక్తి మహత్యాన్ని పలువిధాలుగా కీర్తించారు.

పార్వతీపతి పదాబ్జ పూజాసక్తుడైన ధూర్జటి ఇతరులని సేవించనని గట్టిగా చెప్తాడు. రాజుల్మత్తులు వారి సేవ నరకప్రాయంబు అని చెప్తూ వారు దయతోనిచ్చే పరిచారికలు, గుర్రాలు, పల్లకీలు, ఆభరణాలు లాంటివన్నీ సంసారదుఃఖానికి బీజాలవంటివని చెపుతాడు. రాజైఁ దుష్కృతి జెందెఁ జందురుడు.... అని అంటూ ఆ రాజ శబ్దాన్ని జన్మాంతర మందు నొల్లనుజుమీ! అని ఛీత్కారం చేస్తాడు. నీ పంచంబడి యుండగా గలిగినన్ భిక్షాన్నమే చాలని శివునికి విన్నవించి 'రాజకీటములనే సేవింపగా నోప' అని ప్రతిజ్ఞ చేస్తాడు. నృపధామ ద్వారదేశంబు గాచి దినంబుల్ వృథపుత్తురజ్ఞు

లకటా అని ద్వారద్వారములందు గంచుకి జనవ్రాతంబు దండంబులన్ దోరంతః స్థలి బగ్గనం బొడుచుచు దుర్భాషలాడుచున్నా రాజాశ్రయానికి పాకులాడే కవులకి జ్ఞాన మార్గం బోధిస్తున్నాడు.

*గడియల్ రెంటికో మూటికో గడియకో కాదేని నేడెల్లియో*
*కడ నేడాదికొ యెన్నడో యెఱుగమీ కాయంబు లీ భూమిపై*
*బడగానున్నవి, ధర్మ మార్గమొకటిం బాటింప రీ మానవుల్*
*చెడుగుల్ నీ పదభక్తినిం దెలియరో శ్రీకాళహస్తీశ్వరా!*

భౌతిక శరీరం గడియకో, రెండు మూడు గడియాలకో లేదా నేడో రేపో చివరికి ఏడాదికో నశింపక తప్పదు కదా! మనుషులు ఈ వాస్తవాన్ని గ్రహించి పరమేశ్వర పదభక్తులై తరించే మార్గాన్ని గ్రహించాలని పదసేవన భక్తిని వివరిస్తున్నాడు.

అర్చన భక్తి అత్యంత శ్రేష్ఠమైనది. శ్రద్ధగా భగవంతుని పూజించితే స్వామి దివ్యమంగళరూపంతో సాక్షాత్కరించి వారిని ఆనందసాగరంలో ముంచుతాడని ధార్మికుల విశ్వాసం.

భగవద్గీతలో పరిశుద్ధమైన మనసుతో భక్తుడు ఏమి సమర్పించినా తనకు ప్రీతిపాత్రమైందని భగవానుడు వెల్లడించాడు.

*పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।*
*తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః ॥* (9:26)

శ్రీమద్భాగవతంలో భగవంతుని పాదాలకు అర్చనచేయటం జీవులందరికీ స్వర్గమోక్షాలతోపాటు సమస్త సంపదలకూ, సర్వసిద్ధులకు మూలం అని చెప్పబడింది.

*స్వర్గాపవర్గయోః పుంసాం రసాయాం భువి సంపదామ్ ।*
*సర్వాసామపి సిద్ధీనాం మూలం తచ్చరణార్చనమ్ ॥* (10:81:19)

కుచేలుడు అటుకులతోనూ, ద్రౌపది శాకపుష్పంతోనూ, శబరి పండ్లతోనూ పరమాత్ముని సంతుష్టుణ్ణి చేసి తరించారు. సగుణ, నిర్గుణ బ్రహ్మోపాసనలో రెండూ ఉత్తమమైన విధానాలు అయినప్పటికీ నిర్గుణ బ్రహ్మోపాసన చాలా కష్టం. భగవంతుని సాకారునిగా గ్రహించి పూజించటమే ఉత్తమం.

*నిన్నేరూపముగా భజింతు మదిలో నీ రూపు మోకాలొ? స్త్రీ*
*చన్నో? కుంచమొ? మేకపెంటియొ? యీ సందేహముల్ మాన్పి, నా*
*కన్నారన్ భవదీయమూర్తి సగుణాకారంబుగాఁ జూపవే*
*చిన్నీరేజ విహారమత్త మధుపా! శ్రీకాళహస్తీశ్వరా!*

ఈశ్వరా నీ రూపం మోకాలా, స్త్రీ వక్షోజమా, కుంచమా, మేక పెంటియా అనే నా సందేహాలన్నీ మాన్పి నీ రూపాన్ని నా కన్నారా, జ్ఞానపూర్ణమైన హృదయమనే

పద్మంలో విహారం చేసే మదించిన తుమ్మెద లాంటి స్వరూపాన్ని తెల్సుకునే మార్గాన్ని చూపవా అని ప్రార్థిస్తున్నాడు. పూర్వగాథల ప్రకారం శ్రీకృష్ణుడు అర్జునునికి తన మోకాలిని చూపి దాన్నే శివలింగమని వివరించాడు. శివభక్తుడు ఒకడు వేశ్యవక్షోజాన్నే శివలింగమని భావించాడు. ఒక వర్తకుడు కుంచెమును బోర్లించి దాన్నే శివలింగంగా పూజించాడు. గాఢభక్తుడైన గొల్లవాడు మేకపెంటికనే లింగంగా భావించి శివపూజ చేసాడు. ఈశావాస్య మిదం సర్వం అన్న ఉపనిషత్ వాక్యాన్ననుసరించి భగవంతుడు సర్వాంతర్యామి. ఈ విషయాలను వివరిస్తూ ధూర్జటి ఏ రూపంగా భావించి పూజించినా శివానుగ్రహం పొందవచ్చని నిరూపిస్తున్నాడు.

తాత్వికులు ఆత్మజ్ఞానం పొందకుండా వేదశాస్త్రాలన్నీ చదివామనీ, శరీరం అశాశ్వతమైందని తెలుసుకున్నామని సభల్లో ప్రసంగాలు చేస్తుంటారు. కానీ ఏ చదువులు చదవకుండానే సాలెపురుగు, పాము, ఏనుగు, ఎరుకలవాడు శ్రీకాళహస్తీశ్వరునిలో ఐక్యం అయ్యాయి. ప్రాణికోటికి మోక్షం పరమేశ్వరుని పాదాలు ఆశ్రయించిన మరుక్షణంలోనే లభిస్తుంది.

*ఏ వేదంబు పఠించె లూత? భుజంగం బే శాస్త్రముల్ సూచెఁ దా*
*నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి; చెం చే మంత్రమూహించె? బో*
*ధావిర్భావ నిదానముల్ చదువు లయ్యా? కావు; నీ పాద సం*
*సేవాసక్తియె కాక జంతు తతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!*

క్షణభంగురమైన జీవితం శివానుగ్రహం వల్ల పరిపూర్ణమవుతుందనీ, నీ రూపంబు దలంపగాఁ దుదమొదల్నే గాన, నీవై ననున్ రా రా రమ్మని యంచు జెప్పవు అని ఆ శివుడినే వేడుకుంటాడు. ఈశ్వరుని సేవిస్తున్నప్పుడు కష్టాలు వచ్చినా, సుఖాలు వచ్చినా, లోకం సామాన్యుడని అన్నా గొప్పవాడని అన్నా, జ్ఞానం కలిగినా లేదా గ్రహచారం క్రుంగదీసినా లేక మంచి చేసినా అవన్నీ తనకు ఆభరణాలు అవుతాయని ఎంతో నమ్మకంగా చెపుతాడు.

'అమరస్త్రీల రమించినన్ జెడదు మోహం బింతయున్' అని తీర్మానించుకున్న ధూర్జటి కాయల్గాచె వధూ నఖాగ్రములచే గాయంబు వక్షోజముల్ రాయన్ ఱాపడె ఱొమ్ము మన్మథ విహారక్లేశ విభ్రాంతిచే అని ఈశ్వరుని తన కాముక ప్రవత్తిని వెనక్కిమళ్ళించమని దీనంగా అర్థిస్తాడు. మనసు చంచలమైందనీ, అది స్త్రీసౌఖ్యాలను పూర్తిగా విడనాడలేదనీ, పుత్రులు, మిత్రులు, సంపదలపై భ్రమను విడవలేదనీ, కోర్కెలని చంపుకోలేదనీ చెపుతాడు. తిరిగి ఆ యోగీశ్వరుడినే తన చంచలమైన మనస్సుకి స్థిరత్వాన్ని కల్పించమనీ ప్రార్థిస్తాడు.

*తమకం బొప్పఁ బరాంగనాజన పరద్రవ్యంబులన్ ముచ్చిలం*
*గ మహోద్యోగము సేయు నెమ్మనము దొంగం బట్టి వైరాగ్య పా*
*శములం జుట్టి బిగించి నీదు చరణస్తంభంబునం గట్టి వై*
*చి ముదం బెప్పుడుఁ గల్గ జేయఁ గదవే! శ్రీకాళహస్తీశ్వరా!*

మనస్సనే పెద్ద దొంగ ఎల్లప్పుడూ పరస్త్రీలను, పరధనాన్ని అపహరించాలనె ప్రయత్నిస్తుంటుంది. కట్టుతప్పుతున్న ఈ దొంగను వైరాగ్యమనే తాడుతో బంధించి శంకరుని పాదాలు అనబడే స్తంభాలకు కట్టిపడవేసి వ్యామోహాలు పోగొట్టి ఆనందాన్ని పొందాలని శంకరుని వేడుకొంటాడు.

'పుడమిన్నిన్నొక బిల్వపత్రమననే పూజించి పుణ్యంబునుం బడయన్నేరక' వృధా వాగ్వివాదాలతో కాలం వృధా చేసేవారిని ధూర్జటి నిరసిస్తున్నాడు. కొంచెం నీళ్ళు, ఒక పుష్పం భక్తితో పరమశివునిపై ఉంచి శివుడిని సేవించటం ఉత్తమమని వారికి హితవు చెపుతున్నాడు.

వక్రబుద్ధిగల పండితులు కొందరు ఆత్మజ్ఞానం పొంది ఆనందం పొందలేక "పటవద్రజ్జు భుజంగవద్రజత విభ్రాంతిస్ఫురచ్ఛుక్తి వ ద్ఘటవ చ్ఛంద్ర శిలాజపా కుసుమరుక్సాంగత్య వత్తంచు" అనేక విధాలుగా జగత్తు మిథ్య అనీ, భ్రాంతి అనీ ఉదాహరణలతో వివరిస్తుంటారు.[6] త్రాడును చూసి పాము అనుకోవటం అంటే సత్యపదార్థం రజ్జువు జగత్తు మాయ కనుక మాయాప్రభావాన సత్యమైన బ్రహ్మను తెల్సుకోలేడు. ఆల్చిప్పను చూసి వెండి అనుకోవటం - శక్తి సత్యం. రజితం భ్రాంతి. సత్యమైన బ్రహ్మలో అసత్యమైన జగత్తును భావించటం భ్రాంతి. చంద్రకాంతమణివలె మంకెనపువ్వు కాంతితో ఎర్రనైనట్లు ఉండటం క్షణక్షణములకు మార్పులకు లోనయే జగత్తును శాశ్వతమైందిగా అనుకోవటం. ఈ ప్రతిపాదనలన్నింటినీ ధూర్జటి తిరస్కరిస్తాడు.

వందనం అంటే అహంకారాన్ని విడనాడి సర్వవ్యాపి అయిన భగవంతునికి నమస్కరించటమే. ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి, నక్షత్రాలు, దిక్కులు, వృక్షలతాదులు, సకల చరాచరప్రపంచం అంతా పరమేశ్వరుని శరీరంగా భావించి సాష్టాంగపడటం వందన భక్తివిధానం అవుతుంది.

భగవద్గీతలో యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు ఈ విధంగా చెప్పాడు

ఖం వాయుమగ్నిం సలిలం మహీంశ్చ
జ్యోతీంషి సత్త్వాని దిశోద్రుమాదీన్ ,
సరిత్సముద్రాంశ్చ హరేః శరీరం
యత్కించ భూతం ప్రణమేదనన్యః ॥ (11:2:41)

రామ్‌చరితమానస, శ్రీమద్భాగవతం, శ్రీమద్భారతం, మనుస్మృతి మొదలైన గ్రంథాల్లో మదన భక్తి గురించి వివరించబడింది.[7] భగవత్ప్రేమలో సంలగ్నులై భగవానునికి వందన పూర్వకంగా ప్రీతిచేసి ప్రాణం ఉన్నంతదాకా ఆ పరంధాముని భక్తితో సాధించటమే భక్తులకు పరమావధి. మనః పవిత్రతతో భగవానునికి అర్పించే ఒక్క నమస్కారమైనా పది అశ్వమేధయాగాలలో చేసిన అవభృధస్నాన సమానం అవుతుందని పవిత్రగ్రంథాలు వెల్లడిస్తున్నాయి.

శంకరాచార్యులవారు అగోచరుడై ఉండి కూడా సమస్త వేదాంతమునకు సంబంధించిన సిద్ధాంత వాక్యముల చేత మాత్రమే తెలియనగువాడు

పరమానందస్వరూపుడు, సద్గురువు అయిన పరమాత్మునికి ప్రణమిల్లుచున్నానని వారి వివేకచూడామణిలో మొదట్లోనే పేర్కొన్నారు.[8]

ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరునికి అనేక విధాలుగా వందనం చేస్తాడు. ఈశ్వరుని కట్టుబట్ట ఏనుగుతోలు, ఆహారము కాలకూట విషము, చేతి భిక్షాపాత్ర బ్రహ్మకపాలము, అలంకారము భయంకరమైన సర్పాలు. ఇటువంటి రూపాన్ని శ్రీహరి మనసులో నిల్పుకొని పాదాలను భక్తితో పూజిస్తుంటాడు. ఆదిభిక్షువుని ధూర్జటి పలువిధాలుగా పూజిస్తాడు.

*శ్రీశైలేశు భజింతునో? అభవుఁ గాంచీనాథు సేవింతునో?*
*కాశీవల్లభుఁ గొల్వఁ బోదునో? మహాకాళేశుఁ బూజింతునో?*
*నా శీలం బణువైన మేరు వనుచున్ రక్షింపవే నీ కృపా*
*శ్రీ శృంగార విలాస హాసములచే శ్రీకాళహస్తీశ్వరా!*

వివిధ క్షేత్రాలలో అనేక రూపాలలో వెలిసిన శివునికి వందనాలు అర్పిస్తానని దానికి బదులుగా తనను కాపాడమని ప్రార్థిస్తాడు.

లోకులు కొందరు కొడుకులు లేరని విలపిస్తుంటారు. ఈ అవివేకులకి కొడుకులు ఎందరు ఉన్నా లాభం లేదని ధూర్జటి మాట. శివుని తన సర్వస్వంగా నమ్మిన కవి బ్రహ్మచారిగా ఉండి మోక్షం పొందిన శకుని చరిత్రను గుర్తుకుతెచ్చుకున్నాడు. ధృతరాష్ట్రునికి వందమంది కొడుకులు పుట్టినా ఏమి ఫలమని ప్రశ్నిస్తాడు.

*నీ పేరున్, భవదంఘ్రి తీర్థము, భవన్నిష్ఠ్యూత తాంబూలమున్*
*నీ పళ్ళెంబు ప్రసాదముం గొనికదా నే బిడ్డనై నాడ! న*
*న్నీ పాటిం గరుణింపు మోపనిక నే నెవ్వారికిన్ బిడ్డగాన్*
*జేపట్టందగుఁ, బట్టి మానఁదగదో శ్రీకాళహస్తీశ్వరా!*

ఈశ్వరునితో నీ సేవచేయు నాకు పునర్జన్మరాహిత్యాన్ని, మోక్షాన్ని ప్రసాదించమని అభ్యర్థిస్తాడు. ఈశ్వరుని నామస్మరణం, పాదతీర్థం, నమిలి వదిలిన తాంబూలం, నివేదించిన ప్రసాదాలు స్వీకరించి అతనికి తాను పుత్రుడనైనానని కాబట్టి వేరెవరికీ కొడుకుగా మరి జన్మ ఎత్తలేనని చెపుతాడు. తనను దగ్గరకు తీసుకోమని లోకాలకు తండ్రిని తన తండ్రిగా భావించి అడుగుతాడు.

దాస్యభక్తి భక్తిభావనలన్నింటిలోకీ చాలా సులువైందని, చాలా శ్రేష్ఠమైందని పండితులు వివరిస్తారు. భగవానుని యజమానిగా భావించి దాసానుదాసునిగా ఆయన ఆజ్ఞలు శిరసావహించటం వల్ల మానవునికి భగవత్ప్రాప్తి సిద్ధిస్తుంది. లక్ష్మణుడు, హనుమంతుడు, ఆదిశేషువు, గరుడుడు దాస్యభక్తితో భగవంతుని సాన్నిధ్యానికి చేరుకున్నారు.

హిందీ కవి తులసీదాసు దాస్యభక్తి లేకుండా సంసారసాగరాన్ని దాటటం కష్టమని తెలిపారు[9] సేవకునిగా తనకు చెప్పుకోవటం అంటే అహంకారాన్ని వదిలిపెట్టటమే.

శివుని తన సర్వస్వంగా భావించిన జ్ఞాని ధూర్జటి పరమాత్మ అభిన్నము అనే సత్యాన్ని అవగతం చేసుకున్నాడు. ప్రేమమూర్తి స్వరూపాన్ని ఒక దాసునిగా భక్తితో పూజించటం భక్తి విధానాలలో సర్వోత్తమమైనదని కవి తెలుసుకున్నాడు.

అమ్మాయయ్య యటంచు నెవ్వరిని నే నన్నన్ శివా! నిన్ను నే
సుమ్మీ! నీ మదిఁ దల్లిదండ్రుల నటంచుంజూడగాఁ బోకు, నా
కిమ్మైఁ దల్లియుఁ దండ్రియున్ గురుఁడు నీవే కాన సంసారపుం
జిమ్మం జీకటి కప్పకుండఁ గనుమా! శ్రీకాళహస్తీశ్వరా!

అమ్మా అయ్యా అని ఏయే జన్మల్లో తాను పిలిచినా అవన్నీ శివునికే చెందుతాయని కవి అంటాడు. జన్మనిచ్చినవారు తల్లిదండ్రులు కారని అంటాడు. తల్లీ, తండ్రీ, గురువూ సర్వం శివుడేనని విన్నవించుకుంటాడు. సంసారం అనే చీకటిలో ఉన్న తనను తండ్రి అయిన శివుడు వెలుగు అనే ముక్తిలోకి తీసుకొని వెళతాడని విశ్వసిస్తాడు.

శ్రీకాళహస్తీశ్వరుని ఆప్తునిగా భావించిన కవి శివుని తప్ప అన్యులని నమ్మనని అంటాడు. సంసార విషసముద్రాన్ని దాటించి చిదానంద స్వరూపమైన సౌఖ్యసముద్రంలో ఏనాడు తేలియాడిస్తావో స్వామీ అని భక్తితో అంటాడు.

సఖ్యభక్తి అంటే పరమవిశ్వాసంతో మైత్రీభావంతో అన్ని వేళలా ఆ భగవానుని లీలా విశేషాలను నిత్యం ప్రసన్నభావంతో వర్తించటమే. సఖ్యభక్తిలో ప్రియతముడైన ప్రేమికునికి అత్యంత సుఖం కలగాలని, తన సఖ్యప్రేమ పరిపూర్ణంగా వృద్ధిపొందాలని వియోగం కలగకూడదని భావించటం ముఖ్యవిషయం. సుదాముడు, ఉద్ధవుడు, అర్జునుడు మొదలైనవారి చరిత్రలన్నీ సఖ్యభక్తికి మంచి ఉదాహరణలు.

ఆహో భాగ్య మహో భాగ్యం నందగోప వ్రజౌకసామ్ ।
యన్మిత్రం పరమానందం పూర్ణ బ్రహ్మ సనాతనమ్ ॥ (10:14:32)

శ్రీమద్భాగవతంలో పరమానంద పరిపూర్ణ సనాతన బ్రహ్మయైన ప్రభువుని మిత్రుడిగా కలిగిన నందగోపకులంలో నివసించే ప్రజల భాగ్యం ఎంత ధన్యం అని సఖ్యభక్తి గురించి పై విధంగా వివరించారు.

అర్జునుడి సఖాభావాన్ని భగవద్గీతలో పరమాత్ముడే స్వయంగా ప్రకటించారు.[10] ఈ సఖ్యభక్తి భారతభాగవతాలలో, రామాయణ కావ్యంలోనూ వివరించబడింది. భగవంతుడొక్కడే అత్యంత ప్రీతిపాత్రుడైనవాడు అని భావించి ప్రేమతో సఖ్యభక్తిని సాధించుకోవటం గొప్పవిషయం.

నీతో యుద్ధము సేయనోపఁ; గవితానిర్మాణశక్తి న్నినుం
బ్రీతుం జేయగలేను; నీ కొఱకుఁ దండ్రిం జంపంగాఁ జాల; నా
చేతన్ రోకట నిన్ను మొత్త వెఱతున్; జీకాకు నా భక్తి, యే
రీతిన్ నాకిక నిన్నుఁ జూడగలుగున్? శ్రీకాళహస్తీశ్వరా!

అర్జునునిలాగా శివునితో యుద్ధం చేయలేనని, సత్కీరునిలా కవిత్వం చెప్పి సంతోషపర్చలేనని, శివభక్తురాలివలే శివుడినే రోకలితో బాదలేనని, శివభక్తితో శివపూజలొద్దన్న తండ్రినే చంపలేనని ధూర్జటి పరమశివునితో స్నేహితునిలాగా మాట్లాడతాడు. దేహానికి మరణం లేకుండా చేయమని లేదా పుట్టుక లేకుండా చేయమని అంటాడు. ఈ రెండూ చేతకాని పక్షంలో ముందే పూజలన్నీ ముగించుకొని అనక నెమ్మదిగా వచ్చి కలుస్తానని సఖునిగా, స్నేహభావంతో సంభాషిస్తాడు.

ఆత్మనివేదనం అంటే తనకు తాను పరమేశ్వరునికి ప్రేమపూర్వకంగా సమర్పించుకోవటం. భగవానుని పట్ల అనన్యమైన ప్రేమను పొందటానికి, చేరుకోవటానికి ఆత్మనివేదన భక్తి ఉపయోగపడుతుంది.

విష్ణుసహస్రనామంలో వాసుదేవుని ఆశ్రయించి, ఆయన యందే పరాయణుడైన మానవుని అంతఃకరణము సర్వవిధాలుగా పరిశుద్ధమవుతుందనీ; అతను బ్రహ్మపదాన్ని చేరుకుంటాడని చెప్పారు.[11]

భగవద్గీతలో కూడా సర్వధర్మాలను పరమాత్ముని యందే నిలిపి నేను కేవలం నిమిత్తమాత్రుడననీ సర్వశక్తి సంపన్నుడైన సర్వాధారుడైన చిన్మయస్వరూపుని ఆశ్రయించినవారు, సర్వపాపాలనుంచీ విముక్తి పొందుతారని వివరించబడి ఉంది.

గోపికాకాంతలు, బలిచక్రవర్తి మొదలైనవారు ఈ భక్తిభావం ద్వారా భగవానుని చేరుకున్నారు.

ధూర్జటి తన శ్రీకాళహస్తీశ్వర శతకాన్ని ఆ స్వామికి అంకితం చేసాడు. తన జీవితాన్నే ఆ పరమేశ్వరునికి అర్పితంచేసి ఆత్మనివేదనం ద్వారా శివానుగ్రహానికి పాత్రుడయ్యాడు.

సంతోషించితిఁ జాలుఁ జాలు రతిరాజద్వార సౌఖ్యంబులన్ అని పశ్చాత్తాప హృదయంతో చెప్పిన ధూర్జటి బ్రహ్మపద రాజద్వార సౌఖ్యంబు కోసం తాపత్రయపడాలని భావిస్తాడు. తన కావ్యంలోని రసములే స్నానముగా, పద్యాలే పుష్పాలుగా, శబ్దాలతో వచ్చే ధ్వనులే భేరీవాద్యములుగా, అలంకారాలే వస్త్రాలుగా, కవితాసౌందర్యాలే దీపాలుగా, మాధుర్యమే నైవేద్యంగా సమర్పించి స్వామికి దివ్య కవితార్చన చేస్తాడు.

*అడుగం బో నిక నన్యమార్గరతులన్ బ్రాణావనోత్సాహినై*
*యడుగం బోయినఁ బోదు నీదు పద పద్మారాధక శ్రేణి యు*
*న్నెడకున్ నిన్ను భజింపగాఁ గనియు నాకేలా పరాపేక్ష? కో*
*రెడి దింకేమి? భవత్ప్ర సాదమ తగున్ శ్రీకాళహస్తీశ్వరా!*

జీవయాత్రకై శైవమార్గం తప్ప వేరే మార్గం తప్పనని కవి ప్రమాణం చేస్తాడు. యాచించాల్సి వస్తే నీ చరణదాసులైన భక్తులనే యాచిస్తానని శివునికి చెపుతాడు. శివానుగ్రహం కలిగితే ప్రాపంచిక సుఖాలెందుకని, అసలు వాటిని కోరుకోవటం దేనికని ప్రశ్నిస్తాడు.

ధూర్జటి అనునిత్యం శివనామస్మరణ కీర్తనాదుల ద్వారా పరమేశ్వరుని సాక్షాత్కరించుకున్న భక్తుడు. తన ఆత్మవంటిదైన శతకాన్ని శివార్పణం చేసి ఆత్మనివేదన భక్తి భావన ద్వారా మోక్షప్రాప్తిని సాధించారు. ధూర్జటి శతకం నిత్యపారాయణ యోగ్యమైంది. ధూర్జటి సదాపూజనీయుడు.

**వివరణలు:**

1. శాండిల్యమహర్షి "సాపరానురక్తిరీశ్వరీ" అని అన్నాడు. పరమేశ్వరుని యందు పరమానురాగం - అంటే పరమప్రేమభక్తి.
   దేవర్షి నారదుడు తన భక్తి సూత్రాలలో "సా త్వస్మిన్ పరమప్రేమ రూపా" అంటే పరమేశ్వరుని యందు అతిశయించిన ప్రేమ స్వరూపమే భక్తి అని వివరించారు. "అమృత స్వరూపాచ" అంటే అది ఇంకా శాశ్వతమైన అమృతస్వరూపం కూడా అని పేర్కొన్నారు.
2. రామాయణ భాగవతాది గ్రంథాలలో భగవంతుని నామగుణ కీర్తనలోనే సకల పాపాలు నశించి భగవత్ప్రాప్తి కలుగుతుందని చెప్పబడింది.

   బ్రహ్మహోపితృహో గోఘ్నో మాతృహాఽఽ చార్యహాఘవాన్।
   శ్వాదః పుల్కసకో వాసి శుద్ధ్యేరన్ యస్య కీర్తనాత్ ॥ (శ్రీమద్భాగవతం-6:13:8)

3. కఠోపనిషత్తులో ఓంకారం గురించి ఈ విధంగా పేర్కొనబడింది.
   ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।
   ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥ (1:2:16)
4. బ్రహ్మమునకు, జగత్తునకు ఏకత్వాన్ని ఆపాదిస్తూ శ్రీశంకరాచార్యుల వారు 'వివేకచూడామణి'లో ఈ విధంగా పేర్కొన్నారు.

   సదిదం పరమాద్వైతం స్వస్మాదన్యస్య వస్తునోఽ భావాత్ ।
   న హ్యన్యదస్తి కించిత్సమ్యక్పర మార్థ తత్వబోధే హి ॥

5. శ్రీ శంకరభగవత్పాదులు పాదసేవనాభక్తిని ఈ విధంగా పేర్కొన్నారు:
   "ద్విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌక"
   సంసారసాగరాన్ని సురక్షితంగా దాటటం ఎట్లా అని అడిగిన శిష్యునికి భగవచ్చరణ కమలరూపమైన నౌక ఒక్కటే సరైన ఉపాయమని వివరిస్తున్నారు.
6. శ్రీ ఆదిశంకరులు వివేకచూడామణిలో ఈ విధంగా పేర్కొన్నారు:
   భ్రాంతస్య యద్యద్భ్రమతః ప్రణీతం
   బ్రహ్మైవ తత్తద్రజితం హి శుక్తిః
   ఇదంతయో బ్రహ్మ సదైవ రూప్యతే
   త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్ ॥ (238)

7. మనుస్మృతిలో ఈ విధంగా వివరించారు:
న వాసుదేవాత్పరమస్తి మంగళం
న వాసుదేవాత్పరమస్తి పావనమ్
న వాసుదేవాత్పరమస్తి దైవతం
తం వాసుదేవ ప్రణమన్న సీదతి (101)
శ్రీతులసీదాసు జగమంతా రామమయమంటూ ఇలా గానం చేసారు:
సీయ రామమయ సబ జగ జానీ ।
కరఉఁ ప్రణామ జోరి జుగ పానీ ॥
8. వివేక చూడామణి మంగళాచరణమ్‌లో ఈ విధంగా పేర్కొన్నారు:
సర్వవేదాంత సిద్ధాంత గోచరం తమ గోచరమ్ ।
గోవిందం పరమానందం సద్గురం ప్రణతోఽ స్మ్యహమ్ ॥
9. శ్రీతులసీదాసు ఈ విధంగా ప్రకటించారు:
సేవక సేబ్య భావ బిను భవ న తరిఅ ఉరగారి ।
భజహుఁ రామపద పంకజ అస సిద్ధాంతి బిచారి ॥
10. "భక్తోఽ సిమే సఖా చేతి" - నువ్వు నా భక్తుడివి, సఖుడివి అని గీతలో (4:3) చెప్పబడింది.
11. విష్ణుసహస్రనామం ఈ విధంగా ప్రకటించింది:
వాసుదేవ శ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః ।
సర్వపాప విశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥ (130)

# పింగళి సూరన

తెలుగులో పింగళిసూరన సంస్కృతాంధ్ర భాషాపాండిత్యం, వేదవేదాంగ వ్యాకరణాది శాస్త్ర ప్రజ్ఞ, చిత్రకవితారీతులు చాలా పేరుపొందాయి. వ్యాసుని 'ఆఖ్యానపరిష్కతా' లక్షణాన్ని తెలుగులో సూరనపండితుడు ఆకళింపుచేసుకున్నాడు. తెలుగులో కళాపూర్ణోదయం ఉన్నతమైన రచనావిధానానికి, స్వతంత్రతకి, ఆఖ్యాన పరిష్కతకి చక్కని ఉదాహరణ. కథాకథన శిల్పంలో ఈనాటి పాశ్చాత్య రచయితలకూ అంతు చిక్కని అనేక రహస్యాలను కళాపూర్ణోదయం తనలో ఇముడ్చుకుంది. 16వ శతాబ్దం ఉత్తరార్థంలో రాయలసీమలోని కర్నూలులో పుట్టిన సూరన ఈ కళాపూర్ణోదయం కథాకావ్యం ద్వారా తెలుగుసాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. వీరు రాఘవపాండవీయము అనే ద్వ్యర్థికావ్యాన్ని కూడా రచించారు. ప్రభావతీప్రద్యుమ్నము అనే ప్రబంధాన్ని కూడా సూరనగారే రచించారు.

కళాపూర్ణోదయం ముఖ్యంగా కథాప్రధానమైన కావ్యమే అయినా ఇతర కావ్యాలకు తీసిపోని వర్ణనలు, కల్పనలు, జీవకళ ఉట్టిపడే మనోహర దృశ్యాలు మొదలైనవన్నీ కనిపిస్తాయి. అలంకారిక రచనకు చెందిన అనేక ఉదాహరణలు వెలుగుకిరణాల్లా ఈ కావ్యం నిండా ఉన్నాయి. ఇది తబ్బిబ్బుల ప్రహసనం (comedy of errors) కు మంచి ఉదాహరణ. వివిధ సన్నివేశాల్లో కవి సందర్భోచితంగా ప్రతిపద్యాన్ని తీర్చిదిద్దిన నేర్పరితనం మనల్ని తప్పక ఆకర్షిస్తుంది. మూడు జంటల భిన్నప్రవృత్తులను వారి ప్రణయాన్ని సూరన అతి లాఘవంగా చిత్రించారు. అనేక సందర్భాల్లో అవ్యక్త మనస్సు గురించి కూడ సూరన కావ్యం ఎన్నో విషయాలను వివరించింది. సుగాత్రీశాలీనుల వింత ప్రణయాన్ని సూరన సవిస్తారంగా వర్ణించారు. పాఠకులకి భ్రాంతి కలిగించే ఎన్నో ఒడుపులను సూరన తన కావ్యంలో ప్రవేశపెట్టారు. ఎక్కువభాగం దృశ్యాలతోనూ, స్వల్పంగా సంభాషణలతోనూ సాగే ఈ ఎనిమిది అశ్వాసాల కావ్యం నాలుగువందల సంవత్సరాలు దాటినా ఈనాటికీ పలువురిని ఆకర్షిస్తూనే ఉంది.

సంస్కృత సాహిత్యంలోని కాదంబరి కావ్య ఖ్యాతిని కళాపూర్ణోదయము పొందింది. సూరనకవి తన కావ్యానికి సంపాదించాలనుకున్న ముఖ్యలక్షణం పుణ్యవస్తు వర్ణనాకర్ణనీయత. కళాపూర్ణోదయం చదివిన పాఠకులకు సూరన తన లక్ష్యాన్ని సాధించాడని అర్థం అవుతుంది. సూరన చిత్రకవితలోనూ అగ్రగణ్యుడే. ఒకే పద్యంలో సంస్కృతాంధ్ర భాషార్థాలు వచ్చేటట్టు సూరన రచించారు. రెండు హల్లులతోనే నడిచే ద్వ్యక్షరి సూరన విశేష ప్రతిభకు నిదర్శనం. దానిలోని విశేషాలవల్ల కళాపూర్ణోదయం ఒక అద్భుతకావ్యంగా మిగిలిపోయింది. సూరన గొప్ప కథకుడు.

# 13. పింగళిసూరన - కళాపూర్ణోదయం - సుగాత్రీశాలీనుల విలక్షణ దాంపత్యం

కళాపూర్ణోదయం తెలుగుభాష కథారచనలో సాధించిన పరిపూర్ణత్వానికి చక్కని ఉదాహరణ. పింగళిసూరన విస్మయ కథాశిల్పంతో పాఠకులని ఆశ్చర్యచకితులని చేసిన గొప్ప కథకుడు. కళాపూర్ణోదయంలో సూరన నామౌచిత్యం పాటించాడు. కళాపూర్ణుడిని సరస్వతీదేవి ప్రతిబింబంగా, బ్రహ్మను సకల విజ్ఞానానికి ప్రతీకగా తీసుకొని చూస్తే శాస్త్ర కళాదృష్టుల సంయోగం వల్ల కళయొక్క పరిపూర్ణోదయం ఏ విధంగా జరిగేది ఈ కావ్యంలో వివరించబడింది. ఎనిమిది అశ్వాసాల ఈ మహాకథలో కొద్దిభాగమే కవి స్వయంగా వక్తగా ఉండగా ఎక్కువ భాగాలకు పాత్రలే వక్తలు. ఆయా భాగాలకు పాత్రలే సూత్రధారులుగా వ్యవహరించగా అనంతరం నారదుడు సూత్రధారునిగా పనిచేస్తాడు. సరస్వతీ చతుర్ముఖుల సరసాలాపం పునాదిగా సూరన నిర్మించిన ఈ కథాసౌధంలో వివిధ కథలు అనే గదులు చదివేవారిని సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తాయి. ఒక కథనించి మరోకథకు తిరిగి మొదటికథకు తిప్పుతూ చక్కని కథాకల్పన, పాత్రచిత్రణ, మనస్తత్వ విశ్లేషణ, వర్ణన ఉపమానాదులు, శబ్దచమత్కారం మొదలైన లక్షణాలతో పింగళిసూరన నిర్మించిన ఈ సాహితీసౌధం ఈనాటికీ పాఠకులని ఆకర్షిస్తూనే ఉంది.

సూరనకవి అవతారికలోనే తన కవిత్వతత్వాన్ని వివరించే ప్రయత్నం చేసారు. కవికీ, పాలుపితికేవారికీ సామ్యం చూపిస్తూ కవియు దోహకరుడును యశము, దుగ్ధము పొందటానికి తీసుకోవాల్సిన జాగ్రత్తలు వివరించారు:

*విశ్రామ విహతి గావింపక సారవత్సాహిత్య సౌమనస్యంబు లెరిగి*
*సమయంబు దప్పక శ్రవణ కఠోరంబులైన శబ్దముల త్యాకులాత్మc*
*జేయక సత్పరిచిత సుకుమార వాక్సరళితాభిప్రాయగా నొనర్చి*
*పదబంధ శిథిలత వాటిల్లగానీక యే చందముల యందు నే దురిలక*

పద్యంలో తగిన విరుపులూ, సమయం తప్పకుండా ఉండటం, శబ్ద మాధుర్యాన్ని, పదబంధ శిథిలత లేకుండా, ఏమరుపాటులేకుండా ఉండటం మొదలైన వాటి గురించి జాగ్రత్తలు తీసుకోవాలి. గొల్లవాడు పాలు పితికేటప్పుడు ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి. అప్పుడే అరటిపండు వల్చి చేతికి ఇచ్చినట్లు కావ్యం పాఠకునికి అనిపిస్తుంది.

ప్రథమాశ్వాసంలోని మణికంథరుడి కవిత్వాన్ని మెచ్చుకుంటూ కలభాషిణి అన్న మాటలు కూడా సత్కవిత్వానికి నిర్వచనంలాగా ఉన్నాయి. ఇవి సూరన కవిత్వతత్వాన్ని వివరిస్తాయి.[1]

ముత్యాలదండగా కూర్చిన శబ్దాలతో వాచ్య, లక్ష్య, వ్యంగ్య భేదాల నెరిగి, నిర్దిష్టంగా ప్రతిపాదించిన అర్థాలతో రసభావాలకు 'అనుగుణమైన 'వైదర్భి' మొదలైన రీతులతో, ఆ రీతులకు తగిన ప్రాణాలతో, ఉపమా యమకాది అలంకారాలతో కవిత్వం చెప్పటం సూరనలాంటి సత్కవీశ్వరునికే చెల్లుతుంది.

సూరన అభిప్రాయంలో అపూర్వ కథాసంవిధాన వైచిత్రీమహనీయత, శృంగారప్రాయత, చిత్రకవితా విదగ్ధత మొదలైనవన్నీ ముఖ్యమైనవి. కళాపూర్ణోదయంలో ఇవన్నీ చాలా ఔచిత్యవంతంగా పోషించబడ్డాయి. ఈ కథలో భక్తి ప్రాశస్త్యాన్ని గురించిన ప్రసంగాలూ, విష్ణుక్షేత్ర వర్ణనం, రమానారాయణ సంవాదం కూడా వస్తాయి. కొందరి దృష్టిలో ఈ కథ అన్యాపదేశకథ. బ్రహ్మ ఉద్యానవనంలోని కాసారం మధ్యన సరస్వతీ ప్రతిబింబం పడటం, ఆమె అధరమణి, మందహాసం, కనుబొమ్మలు, చూపులు, బ్రహ్మ ఆమెను నాలుగుముఖాలతో చుంబించగా అతని ప్రతిబింబం పడటం మొదలైన వాటితో నడిచిన ఛాయారూపకం. ఈ మౌలికకథనే పలుపాత్రలను ప్రతీకలుగా చేసి సృష్టికర్త ఆయన కల్పించిన జగత్తు అనే కథను గురించి కవి అన్యాపదేశంగా చెప్పాడు. కళాపూర్ణుడి కథలోని వివిధ పాత్రల పేర్లు పై ఊహకు వీలు కల్పిస్తున్నాయి.(2)

ప్రణయ విజ్ఞాన సర్వస్వం అయిన కళాపూర్ణోదయంలోని పూర్వభాగంలో మొత్తం మూడుజంటల ప్రణయ వృత్తాంతాలు వస్తాయి. రంభానలకూబరులు, కలభాషిణీ మణికంధరులు, సుగాత్రీ శాలీనులు వీరు ముగ్గురు. రంభానలకూబరులది ఆదర్శ ప్రణయం. కలభాషిణీ మణికంధరుల ప్రణయం భయదూషితమైంది. ద్వితీయాశ్వాసంలో సుముఖాసత్తా మణిస్తంభులుగా పరిచయం అయ్యే వారిరువురూ పూర్వాశ్రమంలో సుగాత్రీ శాలీనులు. వీరిది విలక్షణ దాంపత్యం.

నంద్యాల కృష్ణభూవిభుడు ఒకరోజున 'ఒడ్డోలగంబై కూర్చుండి కావ్య ప్రసంగవశంబున' పింగళిసూరనకి ఒక మహాప్రబంధమును రచించమని అభ్యర్థిస్తాడు. సూరన తన శక్త్యానుసారంబు విచారించి అత్యపూర్వ కథా సంవిధాన వైచిత్రీ మహనీయంబును, శృంగార రసప్రాయంబును, బుణ్య వస్తు వర్ణనా కర్ణనీయంబును, నగు 'కళాపూర్ణోదయం' బను మహాకావ్యంబును నిర్మించటానికి పూనుకొన్నాడు. ఆంధ్ర ఆఖ్యాన వరిష్ఠుడు పింగళిసూరన చేతిలో కళాపూర్ణోదయం మొదటినుంచీ చివరిదాకా ఏకబిగిన చదవాలనిపించే విధంగా నిర్మితమైంది.(3) ఈ పెద్దకథ మధ్యలో మొదలయ్యి, పూర్వకథా ప్రకాశన శిల్పంతో వెనుకటి కథ రావటం, తిరిగి వర్తమాన కథకు రావటం అనే విధానం వల్ల పాఠకుల్లో ఉత్కంఠని కలిగిస్తుంది.

సుగాత్రీశాలీనుల విలక్షణ దాంపత్యగాథ ఒక గురుశిష్యుల సంభాషణలో దొర్లుతుంది. కలభాషిణీ, మణికంధరులు అంతకుముందు మాట్లాడుకుంటూ లోకంలో సర్వపాప వినాశనకరమైన కథలు చాలా ఉన్నాయని అనుకుంటారు. మణికంధరుడు ఒకప్పుడు శక్తి ఆలయానికి వెళ్ళి కవితాశక్తిని సంపాదిస్తాడు. తన కవితా శక్తి కాశ్మీరంలోని శారదాపీఠంలో గుర్తించబడితే తప్ప సార్థకం కాదని అక్కడకి వెళతాడు. శిష్యులకు వేదపాఠాలు బోధిస్తున్న పండితుడు అతన్ని చూసి పాఠం ఆపుతాడు. అక్కడకి వచ్చిన ఒక బ్రహ్మచారి శాలీనుడు, సుగాత్రీల గురించి చెపుతాడు. వారిరువురూ శతతాళదఘ్నం అనే చెరువులో దూకారని బ్రహ్మచారి చెప్పగానే గురువు అయ్యో వారికి ఇలాంటి దుర్గతి సంభవించిందా అంటాడు. మణికంధరుడు వారి కథను చెప్పమని ప్రార్థిస్తాడు. నిజానికి కథ పూర్వభాగం చెప్పటం వల్ల శ్రోతలకు దాన్ని వినాలనే ఆసక్తి, అనురక్తులు ఎక్కువవుతాయి.

కాశ్మీరదేశంలోని శారదాపీఠం పూజారి కుమార్తె సుగాత్రి. ఆమె భర్త శాలీనుడు. శాలీనుడు ఇల్లరికపు అల్లుడు. ప్రథమ సంగమవేళ సుగాత్రిని సర్వాభరణాలతో అలంకరించి భర్త వద్దకు పంపుతారు. కానీ, శాలీనుడు 'దద్వి భూషణాది మహిమఁదలఁకి పట్ట మదిని సంకోచించి' ఉంటాడు. పైపై మెరుగులకు శాలీనుడు విలువనిచ్చేవాడు కాడని ఈ విషయం స్పష్టం చేస్తోంది.[4] చాలాసేపు వేచి ఉండి సుగాత్రి వెనుతిరుగుతుంది. ఈ విషయాన్ని చెప్పగా చెలులు 'భూమిలో నేయెడ లేని చంద మిది యేమి నిమిత్తమొ'? అని నవ్వుతారు. 'మంచి లే బ్రాయపువాఁడు గల్గె బళిరా యితఁ!' దంచు వేళాకోళం చేస్తారు.

*ఆయన వినఁ బ్రేలెదరు సుఁ*
*డీ యిట్లు గయాళులారా! దిగవిడుతురు ల*
*జ్జా యుతులు సర్వమును, దము*
*నే యెడ హాస్యాస్పదం బొకింత వొరసినన్*

అని తల్లి సుగాత్రి చెలులని వారిస్తుంది. రెండు మూడు రోజులపాటు సుగాత్రిని సర్వాలంకార భూషితురాల్ని చేసి అల్లుడి వద్దకు పంపినా అతను మొదట్లో ఏ భావంతో భార్యను చూసాడో అలానే చూస్తాడు. దాంతో సుగాత్రి వట్టి రాకపోకలే చేస్తుంది.

సుగాత్రికి నెచ్చెలులు ప్రణయోపదేశం చేస్తారు. అమ్మాయీ 'అలి మగని పోఁడుము' లేమియుఁ గలిగినట్టి చొపుగానరాదు' అని అంటారు. స్త్రీకి సిగ్గుపడటం చెల్లుతుంది కానీ కాంతుడు సిగ్గుపడటం విడ్డూరమని అంటారు. నళిన వదన ఎన్ని రోజులైనా చిన్నకూతురువి కావు అని చెలులు ఆమెని ఆట పట్టిస్తారు. అతడు ఏమీ అనటం లేదని నీవు ఊరక ఎలా ఉంటావని, 'తొడగి పతికిఁ దగిన సేవ సేయకగునె యూరక యుండ?' అని ప్రశ్నిస్తారు. మగువకు మానపుబిగి గట్టిగ దాల్ప ఒప్పుకాదని అంటారు. గారాబంగా తోడుతోడుగా రా రామ్మని పిలిస్తే భర్త రాడా అని అడుగుతారు. ఆకులు మడిచి కర్పూరంతో ఈయరాదా అని చెపుతారు. భోగముల పంట యామని యగు నీ బంగారు వంటి పాయము సంగతియే యకట! రిత్త శయ్యకు నొసగన్? అని పరియాచకాలాడుతారు. యౌవనము ఉన్నప్పుడే సుఖాలను అనుభవించాలని విషయం వివరిస్తారు.

*యౌవనము గలిగి నప్పుడు*
*పూవుం బోఁ దులకుఁ బతుల భోగంబులు గా,*
*కా విభవములకుఁ గొఱయే*
*యో వనజాక్షి! ప్రాయముడిగిన వెనుకన్?*

వాళ్ళు పై విధంగా చెప్పగా విని సుగాత్రి యీ యెడమాటల నను నేటికిఁ జంపెదరు? అంటుంది. అటువంటి మాటలు విన బుద్ధి కాదని సిగ్గుతో బదులిస్తుంది. అయినా 'నాఁ డొనరిచి చూచెను దదీయ యుక్తుల తెఱఁగున్' కానీ ఫలితం లేదు.

చివరకు తన ప్రయత్నాలన్నీ విఫలంకాగా 'నాకును మంగళసూత్రం బీ పాటి శుభస్థితి నుండటయు పదివేలు' అని తీర్మానించుకుంటుంది. భర్తకు ఆయురభివృద్ధికరంబులని వివిధమైన అలంకారాలు అన్నివేళలా ధరిస్తూ, తన తల్లి అతనిని ఏమీ మాటలు అనకుండా ఉండాలని ప్రార్థిస్తూ ఉంటుంది. కొన్ని రోజులు గడుస్తాయి.

అల్లుడు నిరర్థకుడని, అటువంటివాడిని ఎక్కడా చూడలేదని, కూతురుకి కొడుకు పుడితే తన సంపదకు దిక్కు అవుతాడని అంతకాలం భావించానని, 'వట్టి గొడ్డు తా కట్టితఁ డెంత యున్న నినుఁ గాఱియపెట్టుట వెళ్ళఁగొట్టినన్' అని సుగాత్రి తల్లి కోపంగా చెపుతుంది. ఇంటి దగ్గర అటువంటి అల్లుడు ఉండటం దండగని చెప్పి 'పూవుల తోటకైన నటుపోయి విచారము చేసి రమ్మనంగా వలయుం గదా! యనుచు గారవ మొప్పగనట్లు' పిల్చి అల్లుని శారదాదేవి పుష్పవనంలో పనులు చేయమని పంపింది. శాలీనుడు అధికమోదంబుతో శారదాదేవి పూజకు ఉపకరించే కార్యం కాబట్టి దాన్ని నిర్వర్తిస్తాడు.

సమధిక మధు మద గరిమా
సమ చంచల చంచరీక సంచయ సంచా
ర మనోరమ సు మనోరమ
సమరఁగ, నా పూవుఁదోఁట ననిశముఁ బెంచెన్.

చాలా ఉత్సాహంతో వివిధ తోట పనుల్లో శాలీనుడు నిమగ్నమవుతాడు. 'నీరెత్తు వేళల నీరెత్తుఁ బాదుపాదునకు గాలువలు పొందగ' అమర్చుతాడు. 'త్రవ్వటంబుల తఱిఁ ద్రవ్వటంబులు వెట్టుఁ దగినట్టి కఱ్ఱు గుద్దలి గడించి!' శ్రమిస్తాడు. ఎరువుచల్లే వేళ గంపలతో తెచ్చి ఎరువు చల్లుతాడు. అంట్లు కట్టాల్సివచ్చినపుడు కొమ్మలు వంచి వంచి అంట్లు కట్టేవాడు. విసుగు చెందకుండా శాలీనుడు నిరంతరం నారు పోయటం, కొమ్మలు నాటటం మొదలైన పనులలో నిమగ్నమవుతాడు. ఈ పనులన్నీ అతని శ్రద్ధాసక్తులని, నిబద్ధతని వెల్లడిస్తున్నాయి. ఏ విషయంపైనైనా శ్రద్ధపెట్టటం సత్ఫలితాలను ఇస్తుంది. ఈ శ్రద్ధ వ్యక్తిత్వాన్ని వెల్లడిస్తుంది.

'అంగ పరిఖేదము నెఱుంగక' శాలీనుడు తులసీ, చెంగల్వలు, చంపకాలు మొదలైన ఎన్నో పుష్పజాతులని పెంచాడు. ఈ వృత్తి తత్వవైఖరి శాలీనుడి విశిష్టతని వెల్లడిస్తోంది. ఈ వసుంధరా దివిజకుల ప్రసూతుడు తన కృషివల్ల సమృద్ధిగా పెరిగిన వనాన్ని చూసుకొని మనసులో ఎంతగానో సంతోషించేవాడు.

రవి కిరణాళి కెందును జొరంగ నగోచరమైన నీడచే
నవిరళ పుష్పరేణుయుతమై పొలుపొందు మరంద వృష్టిచే
నివము గొనంగఁ, ద ద్వన సమృద్ధిఁ గనుంగొని, యవ్వసుంధరా
దివిజకుల ప్రసూతుడు మదిం బరితోషము నొంది యత్తఱిన్

వసుంధర కొడుకు తల్లిలాగానే ఓర్పుగలవాడు. వసుంధరా దివిజ కుల ప్రసూతుడు అంటే బ్రాహ్మణుడు. ఈ విధంగా బ్రాహ్మణుడైన శాలీనుడు కర్మయోగిగా పూతోట పనుల్లో నిమగ్నమయ్యాడు. ప్రొద్దునే లేచి 'నితాంతా చరిత స్వేజాతి ధర్ముడగుచు' తన కార్యకలాపాలు నిర్వర్తించేవాడు. గురుపరంపరని మనసులో స్మరించుకొనేవాడు. జపం చేసుకునేవాడు.

శాలీనుడికి సకల విద్యలకూ తల్లి అయిన సరస్వతీదేవీ ఆరాధన చాలా ఇష్టమైన పని. నియమంగా పుష్పములని కోసి, తన నేర్పరితనముతో వింతవింతలుగా మాలికలను, బొందులు, కందుకంబులు రచించి వాగ్దేవికి భక్తిగా సమర్పించుకునేవాడు.

పింగళి సూరన వ్యక్తిత్వాన్ని కూడా మనం శాలీనుడిలో దర్శించవచ్చు. సూరన కూడా సరస్వతీ ఉపాసకుడే. ఆ తల్లి దయతోనే కళలో పరిపూర్ణత్వం సాధించి 'కళాపూర్ణోదయం లాంటి గొప్ప కావ్యాన్ని ఆంధ్రులకు అందించగలిగాడు. 'మాలికలను, బొందులు, కందుకంబులు రచించి అనటంలో ఎంతో గూఢార్థం ఉంది. పుష్పాలను మాలలుగా కట్టి అనకుండా రచించి అనటంలోనే సరస్వతీదేవికి ఉత్పలమాల, చంపకమాల, కందం మొదలైన పద్యాలతో సారస్వతపూజ నిర్వహిస్తున్నాడన్న విశిష్టార్థం వస్తోంది. ఇది నిజానికి పింగళి సూరన శాలీనుడి ద్వారా నిర్వహిస్తున్న సరస్వతీదేవి పూజ అవుతోంది.

సుగాత్రి పాతివ్రత్యధర్మానికి మారుపేరు. తల్లి మాటలకు తన విభుడు శరీరశ్రమకు ఓర్చి పూదోటలో పనులు చేయటాన్ని ఆమె చూసి తట్టుకొనలేకపోయినది. భర్త తోడిదే జీవితము అని నిశ్చయించుకొని ఆమె తాను కూడా భర్త దగ్గరకు వెళ్ళి తోటపనిలో అతనికి సహాయపడాలని నిర్ణయించుకుంటుంది. ఇది ఆమె ఉన్నత వ్యక్తిత్వాన్ని నిరూపిస్తోంది.

కలిసిమెలిసి పనిచేయటంలోనే స్త్రీ పురుషులు ఒండొరుల ప్రేమానురాగాలు గ్రహించగలుగుతారు. శారీరకశ్రమలో పాలుపంచుకోవటం భార్యాభర్తలని మానసికంగా సన్నిహితం చేస్తుంది. దాంపత్యధర్మాన్ని పాటిస్తున్న భార్యాభర్తలైనా ఒకరికి ఒకరు వివిధ పనుల్లో సహాయపడుతూ, తోడునీడగా ఉండటం ఒక చక్కని విషయం.

మనం ఈనాడు ఆలోచిస్తున్న ఎన్నో 'గొప్ప' ఆలోచనలని ఆనాడే పింగళి సూరన లాంటి తాత్వికులు చేసారు. అందుకే స్త్రీపురుష సంబంధాలలో ఆధిక్యతకన్నా అనురాగం ముఖ్యం అనీ, కావాల్సింది ఒకరినొకరు అర్థం చేసుకొని నడుచుకోవటం అనీ సూచించారు.

శాలీనుడు తోటలో ఒకరోజు పనిచేస్తూ ఉండగా పెద్ద వర్షం వస్తుంది. ఈ విధమైన ప్రకృతి మార్పు శాలీనుడి ప్రవృత్తిలోని మార్పుని సూచిస్తుంది. రెండు అద్భుతమైన పద్యాలతో సూరనగారు ప్రకృతివర్ణనని చేసారు. వర్షం ముందు నెమ్మదిగా ప్రారంభమై తర్వాత వేగం పుంజుకుంటుంది. దీనికోసమే మొదట కంద పద్యాన్ని తర్వాత చంపకమాల, సీసాన్ని ప్రయోగించారు. చంపకసీసాదుల కన్నా కందం కొంచెం లఘువేగం కలది. ఈ పద్యాల్లో ధ్వన్యనుకరణ పదాలను సూరన ప్రయోగించిన విధానం చాలా గొప్పది.

తళతళ మెఱుములు మెఱయగఁ,
బెళ పెళ నుఱుముచుఁ బెరెల్లు పెఠిలనఁ బిడుగుల్
నలు గడఁ బడ బెడిదపు ధా
రలు గల బలు వాన జలధరంబులు గురిసెన్

మెరుపులు ముందూ, ఉరుములు వెనక వచ్చాయని సూరన చెప్పటం శాస్త్రీయ విజ్ఞానానికి అనుగుణంగానే ఉండటం గమనార్హం. ధారలుగా వర్షం కురిసింది.

మిగుల జగంబు బెగ్గడిల మించెఁ ద దుద్ధత వృష్టి యద్భుతం
బగుచు ఘనా ఘనౌఘ సముదగ్ర నిరర్గళ ఘర్ఘరార్భటీ
లగన ఘనోచ్ఛల జ్జల ఝుళంఝుళ నిర్ఝర జర్జరీ భవ
న్నగ విగళచ్ఛిలాగణ ఘణం ఘణ ఘోషణ భీషణంబుగన్

వర్షం కురుస్తున్న దృశ్యాన్ని, ఆ సందర్భంలో ఏర్పడే వివిధ ధ్వనులను పై పద్యంలో సూరన్న వివరించారు. ఝుళఝుళ, ఘణంఘణ మొదలైన పదాలు వాన తీవ్రతని వివరిస్తున్నాయి.

ఈ విధమైన హోరుతోవాన కురవటం వల్ల భూనభోంతరములు చీకట్లతో నిండిపోయాయి. లోకమంతా నీళ్ళతో నిండిపోయింది. అక్కడ సుగాత్రి చిటపట చినుకులు మొదలు అయినప్పటినుంచీ 'తన పెనిమిటి తడియనొయని' అని ఆదుర్దా పడుతుంటుంది. మనసులో భర్త శుభాన్ని కోరుకుంటుంది. ఇటువంటి ఘోరమైనవానలో తన ప్రాణవిభుడు ఏ ఇబ్బందులు పడుతున్నాడో అని ఆలోచిస్తుంది. నీకుఁదోఁట బాపపుఁ బువుఁట పాట్లెచటఁ బ్రాప్తములయ్యో' అని భర్త గురించి దుఃఖిస్తుంది. ఆకాశం వేపు అనేకసార్లు మార్చి మార్చి చూస్తుంది. ఓ శారద! ఓ పరమదయాశాలిని! అని వాగ్దేవిని శరణువేడుకొంటుంది. తన భర్త యోగక్షేమాలకై దేవిని ప్రార్థిస్తుంది.

'ఈ దేహంబునఁ బూర్వదేహములయం దేనిన్ వ్రత ధ్యాన దానాది ప్రోద్భవమేమి యేమి గల, దా యా పుణ్య, మీ వర్షపీడా దోషంబును మత్పతిం బొరయకుండన్ మానుపున్ గాత!' అని సరస్వతీదేవిని ప్రార్థిస్తుంది. మంచి మనసుతో సుగాత్రి చేసిన ప్రార్థన ఫలిస్తుంది. ఆమెకి భర్త క్షేమం గురించిన ఆదుర్దాతో ఇంక అక్కడ ఉండబుద్ధి కాదు. ఎంతో సాహసంగా భర్త దగ్గరకు బయలుదేరి వెళుతుంది. తను వెళుతున్న విషయాన్ని తల్లికి తెలీకుండా జాగ్రత్తపడుతుంది. తన పాతివ్రత్య ధర్మంబుచే వృష్టి బాధ తెలీకుండా వెళుతూ ఉంటుంది. 'జలపూరంబు పాయ యిచ్చుచుఁ దెరువు విడువఁ' సుగాత్రి తన ప్రాణవల్లభుడు శాలీనుడు ఉన్న వనం దగ్గరికి వెళుతుంది. ఆ వనంలో మాత్రం 'అప్పటి యవ్వాత వర్షోపద్రవం బొక్కించుకయు లేక' సుగాత్రి అదంతా సరస్వతీదేవి భక్తవాత్సల్యంగా భావించి ఆ దేవికి కృతజ్ఞతలు వెల్లడిస్తుంది. శుభవర్తనంబున ఉన్న తన భర్తను చూసి సంతోషించి తిరిగి ఇల్లు చేరుతుంది. తను వచ్చినది, పోయినది ఎవ్వరికీ తెలీకుండా యథాపూర్వస్థితితో ప్రవర్తిల్లుతూ ఉంటుంది.

ప్రజలు కూడా ఆ పువ్వులతోట గాలివానవల్ల పాడవకుండా ఉండటం చూసి విస్మితులవుతారు.

సుగాత్రి కొన్నిరోజులు 'లజ్జపెంపున వల్లభుని యిదువు పాట్ల కోర్చి చివరికి తల్లిమాట యొక్కింతయుఁ దాను గైకొనక, యెప్పటియట్ల యలంకృతాంగియై భర్త ఉన్న పూదోటలోకి వెళుతుంది. అక్కడకి వెళ్ళి 'తన సొమ్ములెల్ల నొక మఱుగున నిడి పిరి చుట్టు చుట్టు కొనిన వలువతోన్' భర్తకు తోటపనిలో సహాయపడదామని అనుకుంటుంది. ఇప్పుడు సుగాత్రి నిరాభరణ సుందరి. నిజమైన సౌందర్యం ఆభరణాలలో కన్నా వ్యక్తిత్వంలోనే ఉంటుంది.

ఎటువంటి ఆభరణాలు లేకుండా తోటపనిలోకి దిగిన సుగాత్రి 'తోరంపుఁ జనుదోయి త్రుళ్ళింతల విడంగఁ దగు చోట్లు గుద్దంటఁ ద్రవ్విత్రవ్వి' శాలీనుడిని ఆకర్షిస్తుంది. అప్పుడు 'వ్రేగైన పిఱుఁదు బల్విడిఁ జలింపంగను' అటు ఇటు నడుస్తుంది. అలా ఆమె మళ్ళకు మడమలు మార్చి మార్చి, మోపులు మోసిమోసి అలసిపోతుంది. దీనితో 'చిఱు చెమటఁ బేర్చు వింత క్రొమ్మెఱుఁగు తోడఁగొమరు యే నొప్ప, సారెకుఁ గొప్పు కదల ఎల్ల పనులను నింపెసక మెసగ ఒనర్చుతుంది.

పడతి సంభ్రమించుచు ఈ విధంగా పనులు చేయగా పిఱుదుఁ బాలిండ్లుఁ గొప్పుఁ గంపించు చొప్పు' సమయం చూసి మన్మథుడు తన బాణాలను ప్రయోగిస్తాడు. దీంతో శాలీనుడు 'అట్లు పేర్చు కుసుమాస్త్రుని యుద్ధతి యాఁపలేక' పోతాడు. భార్యని ప్రేమగా వెఱ్ఱిపడుచ అని సంబోధించి "యెంత మాన్చిన నెఱింగెదు దానవుగావు, నీకుఁ దోఁట పనుల కెంత దూర మకటా!" అంటాడు. భార్య శ్రమపడటాన్ని ఏమాత్రం సహించలేకపోతాడు. కపోలపు ఘర్మబిందువులని తన ఉత్తరీయ వస్త్రపు మునికొంగున తుడుస్తాడు. కానీ ఆ చెమటబిందువులు తుడిచినా పోవు. 'మన్మథుని దుర్జనతా మహిమన్ బొరింబొరింబడతి మెఱుంగు చెక్కిళులఁ బర్వెడు ఘర్మము' చూసి శాలీనుడు ఆమె బడలిక చూడలేకపోతాడు. ఎంతో తమకంతో ఆమెను కౌగిట్లోకి చేరుస్తాడు. సుగాత్రీశాలీనుల మనోజకేళి శారీరక శ్రమ నుంచి జన్మించిన ప్రేమ పరాకాష్టకు చేరిన ఫలితం.

తదనంతరంబ, మిక్కిలి
పొదిగొన్న చిగుళ్ళ జొంపముల సొంపగు పూఁ
బొదరింటికిఁ దార్చి, సతిన్
మదన మహా రాజ్య భోగ మహిమందేర్చెన్

శాలీనుడిది వింత ప్రణయ శీలం. అతను మణిస్తంభుడుగా మారిన అటు తరువాతి జీవితంలోనూ ఈ విచిత్ర ప్రణయ ప్రవృత్తి కనిపిస్తుంది. ప్రియురాలైన కలభాషిణి వీణ వాయిస్తున్నప్పుడుగానీ లేదా భక్తిప్రవత్తులతో తనను సేవిస్తున్నప్పుడుగానీ అతనికి ఆకర్షణ కలగదు. తన సింహవాహనం మీద ఆమెను ఎక్కించుకొని పోవటానికి కూడా సందేహిస్తాడు. 'నన్ను తాకకుండా సింహం కటి విభాగంబు నెక్కి రాగలవె,

అబల!" అని ఆమెను ప్రశ్నిస్తాడు. తోడి సిద్ధులు ఆమెను తాను సింహవాహనం మీద తీసుకొని పోవటాన్ని 'వేరొకలాగుగా నెంతురు, నీ బోంట్ల సంస్పర్శ మాత్రంబు నస్మదాదులకు సమ్మతింప నుచితంబుగాదు' అని ఆమెకు చెపుతాడు. అయితే శక్తి చేత విసిరివేయబడి తాను కలభాషిణితో సహా మెత్తని పాన్పు మీద పడ్డప్పుడు ఆమె భయంతో గజగజవణుకుతూ ఉంటే ప్రేమతో ఆ సుందరిని దగ్గరకు తీసుకుంటాడు. గజగజవణికి పోతూ, ముఖం వెలవెలబోతూ, కళ్ళు బెదురు చూపులతో నిండి, చెమటపట్టి జారిన ముంగురులు ముఖానికీ అంటుకొని ఉంటే, 'వలిగుబ్బ పాలిండ్లు నిలువ కిట్టట్టు' ఆమె సంక్షోభిస్తూ ఉంటే 'వింత విలసములతో కూడిన' కలభాషిణి సౌందర్యం మణిస్తంభుడిని ఆకర్షిస్తుంది.

శాలీనుడి వింత ప్రణయ ప్రవృత్తి నాలుగో అశ్వాసంలో చివర ఒక సన్నివేశంలో కనిపిస్తుంది. పునః యౌవనం పొందిన సుముఖాసత్తి (సుగాత్రి) పక్కనే ఉన్నా అష్టాంగయోగ విద్యాభ్యాసం చేస్తూ మణిస్తంభుడు నిగ్రహంతోనే ఉంటాడు. కానీ సింహ వాహనం మీద ఆకాశమార్గంలో ప్రయాణిస్తున్నప్పుడు సముద్ర సౌందర్యాన్ని వర్ణించిన మాటల్లో అతని మన్మథ వికారం, వింత ప్రణయ ప్రవృత్తి కనిపిస్తున్నాయి.[5]

సుగాత్రీ శాలీనుల వింత మనోజకేళి ద్వారా సూరన స్త్రీపురుషుల ప్రణయం అభరణ, అలంకారాల ద్వారా సిద్ధించదని ఇద్దరూ కలిసిమెలిసి ఉన్నప్పుడే శృంగారకాంక్ష ఏర్పడుతుందని వివరించారు.

భర్తతో మదన మహారాజ్య భోగాలను పొందిన తర్వాత సుగాత్రి 'మఱుంగున నిడిన తనదు భూషణంబు లెల్లను బ్రేమన్' తొడుగుకొని, 'పతిచరిత్ర భావనల మన మలరన్' ఇంటికి వెళుతుంది. కామకేళివల్ల అలిసిన ఆమె శరీరం 'వసంత సమయంపు టెండవలనన్ నెఱి వోc గసుగందులు గందిన నవ కుసుమ లతిక వోలె' ఒప్పిందని సూరన వర్ణించారు. వసంత అన్న పదం ఋతువును, శృంగార సుఖాన్ని రెంటిని సూచిస్తోంది.

ఇంటికి వెళ్ళిన సుగాత్రిని సఖులు చూసి ముఖ వికాసాదుల వలన ఆమె మనోరథసిద్ధిని తెలుసుకుంటారు. తల్లి, చెలులు సంతోషిస్తారు. మళ్ళీ రాత్రికాగానే సుగాత్రికి చెలులంతా కలిసి 'కౌతుకాతిశయంబున నెప్పటికంటె మిగుల నలంకరించి' కేళికా భవనము దగ్గర ఉన్న ప్రియుని దగ్గరకు పంపుతారు.

*గతి సంభ్రమంబునc గరము బెడంకుచు నకనకల్ గుదుచు నెన్నడుము సొబగుc;*
*గుఱుమాపు దడిమంపుc గోకలోc దొలcకెడు కంపమాన నితంబకాంతి సొంపు;*
*బిగువు పయ్యెదలోనc బిక్కటిల్లుచుc జాలc ద్రుళ్ళు చన్నుల నొప్పు ముళ్ళ పేరు;*
*జెమట చిత్తడిc జిట్లి యమరు కస్తురిచుక్క బొట్టుతోడి పసుపు బొట్టు సిరియు*

సుగాత్రి భర్తకు తోటలో 'బఱువులు వాఱుచుc దోcట పనులు సేయు రూపు మదిన్ హత్తి' సాయపడుతుంది. అయినా 'తద్విలేపన పటా భరణాదుల వైభవోన్నతుల్' రెప్పలు విప్పి కూడా శాలీనుడు చూడడు. ఎప్పటి లాగానే పరాకుతో ఉంటాడు. సుగాత్రి

పతి హృదయము తెలీక పరితపిస్తుంది. "నా యెప్పటి యేమి సంఘటిలె నొక్కొ!" అని విషాద మనస్సుతో ఉంటుంది.

మొదట భర్త తనని ప్రేమగా చూసాదని కానీ 'ఘన విభూషాదులపు డింపు గామి యరుచె' అని తర్కించుకుంటుంది. భర్తకు ఆభరణాలు ధరించి వెళితే శృంగారేచ్ఛ కలగదని అతను కేవలం శారీరక సౌందర్యంవల్లే ఆకర్షితుడవుతాడని ఆమెకు పూర్తిగా అర్థం కాలేదు. భర్త దగ్గరకు వెళ్ళినా అతను అనాదరిస్తున్నాడని భావిస్తుంది. 'అరిగి యే నచట నెవ్వారిదాన? అని అనుకొని తాను అక్కడనే ఉందామనుకుంటుంది. దైవం 'ఎద్ది యొనరించె నది యగుఁ గాక' అనుకొని 'దలుపుకడన యుండె' అని సూరన వివరించారు. తలుపు దగ్గర ఉంది అనటం ఈ సందర్భంలో మనోహరమైన అర్థాలనెన్నో ఇస్తోంది. స్త్రీ కాబట్టి ఇంటి తలుపుచాటునే ఉంది అనటం సామాన్య అర్థం. భర్తతో దాంపత్య జీవితం అనే గృహానికి ఇవతలనే అంటే ఆమె తలుపువద్దే ఉందని మరో అర్థం. శబ్దసామ్యం వల్ల 'తలపు' స్ఫురిస్తోంది. గతంలో భర్త వద్ద పొందిన శృంగారకేళి తలపులలోనే ఉండిపోయిందని మరో విశిష్టార్థం వస్తోంది. ఇదంతా 'ఆంధ్ర ఆఖ్యాన వరిష్ఠుని' రచనా చమత్కారాన్ని నిరూపిస్తోంది.

ఆ లలితాంగి చాలా సేపు అలానే ఉండి. మళ్ళీ శాలీనుడు వద్దకు వెళుతుంది. 'కదు ద్రిమ్మటచే శ్రమ మొందినారు గాఁ బోలును!' అని భర్తతో సరససల్లాపాలు చేయబోతుంది. పోమంటారా, నిదురపోతారా అని ప్రేమగా మాట్లాడుతుంది. "కప్పురంపుఁ దాంబూలము తావి బుగ్గరని ముంచుకొనం, జెవి దండ" పల్కుతుంది. శాలీనుదు వెంటనే' 'ఏ కోర్కిని వచ్చి'? అని పరాకున ప్రశ్నిస్తాడు. దీనికి సుగాత్రి లోకంలో పతి దగ్గరకు సతులు ఏమి కోరి వస్తారని బదులిస్తుంది. భర్తతో 'నా మానసములోని కోర్కుల పూనిక యడిగితిరి' అని మిగతా విషయాలన్నీ పోనిమ్మని అంటుంది. ఏమని అడుగుతాను నాథా వేగుజామయింది కనీసం పాదాలు వత్తమని కూడా అడగరు ప్రేమగా కన్నులు విచ్చి చూడటం కూడా లేదు అని నిష్ఠూరాలాడుతుంది.

ఆనాడు తోటలో నిబ్బరమైన మదీయ భాగ్యపుం బోఁడిమి యేమి పాకమునఁ బొందెనో? అని అడుగుతుంది. చనువుతో ఈ ప్రశ్నలనన్నీ అడుగుతున్నాగానీ సాధ్వికి ఇది తగినది కాదని తిరిగి తనే అంటుంది. పతివ్రత ధర్మాలు తెల్సినది కాబట్టి అంత శాంతంగా, ఓపికగా ఉండగలుగుతుంది. కానీ అంతరంగంలో అంతకంతకూ ప్రబలుతున్న బాధకు ఓర్చుకోలేక కొంత చింతిస్తుంది.

భర్తతో మాట్లాడుతూ అతని ప్రవర్తన గురించి చెపుతుంది. అతని మనసుకన్నా బండరాయి కొంత మేలు అని చెప్పి శాలీనుడి పాదాలను ఒత్తుతూ పతి సేవాభాగ్యమును అర్థిస్తుంది.

'రా యైనఁ గొంత మేల్, నా
రాయణ! మీ మనసుకంటె;రహిఁ నిఁక నెపుడున్
మీ యంతఁ దడ వెదరె?' యని,
యా యంగన యతని పాద మల్లనఁ బట్టెన్

భర్త పాదాలను ఎత్తి పాన్పుదగ్గర 'హాం బట్టున నొప్ప నూరువులపై నిడి యొత్తి త దంఘ్రి యంతఁ జన్కట్టు పయిన్ ఘటించుచును' సుగాత్రి శృంగారాభిలాషను వ్యక్తం చేస్తుంది. అయినా అతనిలో చలనం ఉండదు. ఆమె భర్త పాదాలను కళ్ళకు హత్తుకొని, చెక్కిట గట్టిగా హత్తుకొని భర్త పరాకుకు కారణం తెలుసుకుందా మనుకుంటుంది.

భర్తకు వేరే స్త్రీ పైన మనసు ఉంది అది మరల్చుకోలేక ఆ విధంగా ప్రవర్తిస్తున్నాడా అని అడుగుతుంది. 'మీర త్తరళాక్షిఁ దెచ్చుకొనిఁ దాయక నా వశమైనఁ బంపుఁ దేఁ దెత్తు నవశ్యమున్' అని ఆ మహాసాధ్వి ప్రశ్నిస్తుంది. భర్తకు ఆ నవవధువుకి పనులు చేస్తానని దైవసాక్షిగా నిజం చెపుతున్నానని అంటుంది. అసలు అంత బాధకి కారణం ఏమిటని పాదసేవ చేస్తూ శాలీనుడిని విషయం చెప్పమని ప్రార్థిస్తుంది. శాలీనుడు ఈ విషయాలేవీ పట్టించుకోకుండా ఉండిపోతాడు.

చివరకు సుగాత్రి సొంపులకే గానీ భూషణాలపై తన భర్తకు మన్నన లేదని తెలుసుకుంటుంది. గతంలోలాగానే పూదోట పనులలో భర్తకు సహాయపడి 'ప్రాణవిభుని నట్ల యిష్టరతుల' అలరిస్తుంది. ఈ విషయాన్ని మొత్తం సుగాత్రి తల్లి తెలుసుకొంటుంది. కూతురితో ఈ విధంగా అంటుంది.

అమ్మ! సరస్వతీ వరమహత్త్వమనన్ జనియించి తీవు, నా
కిమ్ముగ సర్వధర్మములు నీవు యెఱుంగుదు, వంశమెల్లఁ బూ
తమ్ముగ నీదుచర్య, నని ధాత వడంతియె యానతిచ్చె స్వ
ప్నమ్మున వచ్చి, తావక గుణంబులు చూచినయట్ల గట్టిగాన్

సరస్వతీదేవి వరమహాత్మ్యాన సుగాత్రి జన్మించిందని ఆమె వల్ల వంశం అంతా తరిస్తుందని అంటుంది. తన భర్త దేశాంతరమున వెళ్ళినా కూతురి ద్వారా మనమడు పుడితే సంతోషిస్తానని అంటుంది. సుగాత్రిని భర్త ఆదరించనపుడు అలిగి శాలీనుడిని పూలతోటలో పనికి పెట్టానని అయినా సుగాత్రి సహించిందని చెపుతుంది. 'నిందు కడవరీతి' ఆమె గంభీరంగా ఎప్పుడూ ఉండేదనీ, పతివ్రతాధర్మాలని ఆచరించి భారతి కృపవల్ల ఆమెకు అన్నివేళలా శుభం కలుగుతుందని వివరిస్తుంది. సుగాత్రి చర్యలకు తల్లి విషాదం కూడా పొందుతుంది. 'అకాల సురత క్రియలన్ గుణాన్వితుండు గాని సుతుడు ప్రసూతుండగునఁట' అని అంటుంది. పూఁ దోటకు జీతగాండ్రు మన తొల్లిటివారలు లేరె? అని ప్రశ్నిస్తుంది. పూలతోట పనులలో సుగాత్రిశాలీనులు ఎందుకు కష్టపడాలని ప్రశ్నిస్తుంది. కూతురు వయసుకి చిన్నదైనా గుణానికి మిక్కిలి పెద్ద అని అంటుంది. 'నీకుం దెలియని యట్టి విధి నిషేధమ్ము లెక్కడివి తలపోయన్' అని కూతురితో చెపుతుంది.

తల్లి మాటలకు బదులిస్తూ సుగాత్రి 'యీశ్వరుడున్ వేదమున్ గురుఁడు సర్వము భర్తయు' అని చెప్పి అతని ఆజ్ఞకు కట్టుబడి ఉంటానని భర్త' యొల్లనిది విడుతుఁ బ్రియ మొనరింతున్' అని అంటుంది.

సరస్వతీదేవి సుగాత్రి పాతివ్రత్యాన్ని మెచ్చి ప్రత్యక్షమవుతుంది. సుగాత్రి తల్లివంక చూసి వాణి 'యీ సాధ్వి వర్తన కిట్టట్టు వంకలు దిద్దఁ జూడకుము' అని అంటుంది. సుగాత్రి వల్ల ఉభయవంశాల వారి పాపాలు నశిస్తాయని ముందుముందు పవిత్రమైన ఈమె కథ విఖ్యాతం కాగలదని అంటుంది.

పై వృత్తాంతాన్ని అంతా చెప్పి గురువు శిష్యునితో సుగాత్రిశాలీనులంటే శారదకి ఎంతో ప్రీతి అని, ఆ వృత్తాంతాన్ని వివరించే పుస్తకాన్ని ఇచ్చిందని అంటాడు. ఆ రాత్రే ఈ ఊళ్ళో ఇంకా చాలా మందికి ఆ గ్రంథ ప్రతులని ఇచ్చిందని చెపుతాడు. ఆ దంపతుల దర్శనం చేసుకొని వస్తూ పుస్తకం అక్కడ మర్చిపోయానని దానికోసం శిష్యుని పంపితే సుగాత్రి శాలీనుల మరణవార్త తెలిసిందని అంటాడు.

కథ విని వెంటనే సుముఖాసత్తి తానే సుగాత్రినని అంటుంది. మణిస్తంభుడు తానే శాలీనుడనని చెపుతాడు. శతతాళదఘ్నహ్రదంలో దూకిన తనను మొసలి మ్రింగిందని కానీ అరిగించుకోలేక తీరానపడి దొర్లుతూ తనని కక్కివేసిందని సుముఖాసత్తి వివరిస్తుంది. 'పతిఁ దిరుగఁ గూర్చ'మని శారదామాతని ప్రార్థిస్తూ రోజులు గడపగా వార్ధక్యం ఏర్పడిందని విరక్తితో సుముఖుల అంటే శాస్త్రవిదుల సమీపాన వర్తించానని అందుకే తనకు ఆ పేరు వచ్చిందని వెల్లడిస్తుంది. తీర్థయాత్రలు చేస్తూ ఈ దేవి ప్రసిద్ధి విని వచ్చానని మొత్తం వృత్తాంతాన్ని వివరిస్తుంది.

సిద్ధుడు కూడా వెంటనే తన వృత్తాంతాన్ని చెపుతాడు. శాలీనుడిగా ఉన్న తాను చెరువులో దూకగా జలస్తంభన విద్యావిలాస గుప్తుడైన సిద్ధుడు అనుగ్రహించితే వయస్తంభన మణినీ, సింహవాహనాన్ని, కత్తిని పొందానని విషయం చెపుతాడు. అయితే సిద్ధుడు సుముఖాసత్తులు వారేననటానికి తిరుగులేని నిదర్శనం కావాలి. తోటలో ఆనాడు రహస్యంగా సుగాత్రి, శాలీనుడికి ఏం చెప్పిందో చెప్పటం ద్వారా అలానే శాలీనుడు ఆమె చెవిలో చెప్పిన రహస్యం తెలుసుకోవటం ద్వారా వారు వారేనని నిర్ధారించుకోవచ్చు.

సుముఖాసత్తి 'నీకు గర్భం కలగకుండా శారద వల్ల నేను వరం పొందానని' శాలీనుడి మాటలు చెపుతుంది. సిద్ధుడు 'నా సంగమం వల్ల నీకు కుమారుడు కలిగేటట్లు మరి నాకు శారద వరం ఇచ్చిందే' అని సుగాత్రి చెప్పిన మాటలను చెపుతుంది. శారద ఇచ్చిన విరుద్ధవరాలు అలా ఉన్నాయి. దానివల్లే సుగాత్రీశాలీనుల విలక్షణ దాంపత్యం ఆ విధంగా సాగింది. చివరకు శాలీనుడు సుగాత్రి తిరిగి ఒకటి అయ్యారు.

పింగళిసూరన కళాపూర్ణోదయం కథాకథన శిల్పానికీ, వర్ణనలకీ, ఉపమానాలకీ నిలువుటద్దంగా ఉంటూ పలువురిని ఆకర్షిస్తూనే ఉంది. కథాశిల్ప రహస్యాలకు పింగళిసూరన కళాపూర్ణోదయం ఆలవాలంగా నిలుస్తుంది. ఇది చాలా అద్భుతమైన కథ. సూరన చాలా గొప్ప రచయిత అని అతని కళాపూర్ణోదయం నిరూపిస్తుంది.

## వివరణలు:

1. ఉత్తమకవితా నిర్వచనము ఈ విధంగా ఉంది:

సీ॥ పొసగ ముత్తెపు సరుల్ పోహళించిన లీలఁ దమలోన దొరయు శబ్దముల గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్య వ్యంగ్య భేదంబు లెఱిఁగి, నిర్దోషత నెసఁగఁ జేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి మొదలైన రీతులిమ్ముగ నమర్చి,
రీతుల కుచితంబు లై తన రారెడు ప్రాణంబులింపుగాఁ బాదుకొల్పి

తే॥ యమర, నుపమాదులను యమకాదులునగు
నట్టి యర్థ శబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసంగనివారు, గలరె?

2. ఈ కథలోని కళాపూర్ణుడు, అభినవకౌముది, మధురలాలస, స్వభావసిద్ధుడు, మదాశయుడు, రూపానుభూతి, సత్వదాత్ముడు మొదలైన పాత్రల పేర్లన్నీ ఔచిత్యంగా ఉన్నాయి. ఇది సద్విమర్శకులు కల్పన కాదు. కళాపూర్ణుడి కథలో వచ్చే పేర్లలోని సూక్ష్మార్థాలని వివరిస్తూ పంచమాశ్వాసంలో సరస్వతీదేవి వివరించినట్లుగా గ్రంథంలోనే ఉంది.

3. విఖ్యాత విమర్శకులు కట్టమంచి రామలింగారెడ్డిగారు "కళాపూర్ణోదయం మాత్రంబున నద్వితీయమైన గ్రంథము, ఏ జాతికిం జేరినది కాదు. తనంతట నొక క్రొత్త రకము" అని అన్నారు.

4. జవరాంధ్ర స్వభావసిద్ధమైన భూషణముల గురించి భర్తృహరి శృంగారశతకం ఈ విధంగా వివరిస్తోంది.

వక్త్రం చన్ద్రవికాసి, పఙ్కజపరీహాసక్షమే లోచనే,
వర్ణ: స్వర్ణమపాకరిష్ణు, రతి జిష్ణు: కచానాం చయ:
వక్షోజా విభకుమ్భ విభ్రమహరౌ గుర్వీ నితుమ్బస్థలీ,
వాచాం హారి చ మార్దవం, యువతిషు స్వాభావికం మర్దనమ్

5. మణిస్తంభుడు సముద్రవర్ణన వ్యాజమున తన అనురాగాన్ని ఈ విధంగా వివరించాడు.

*ఓ లలితాంగి!* చూడు, కడు నొప్పెడు నీరము నోరు నిండఁగాఁ
గ్రోలి, తిమి ప్రకాండము శిరోవివరంబున వెల్వరించు ను
ద్వేలపు టూర్ధ్వధార యల వేలుపు టేటిపయిం గుతూహల
శ్రీ లమరన్ నదీవిభుడు చిమ్మెడు చిమ్మనగ్రోవి నీరనన్.

# విశ్వనాథ సత్యనారాయణ

శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఆంధ్రుల కొంగుబంగారంగా కవిసమ్రాట్టుల కృషి ఫలితంగా సమకూరింది. సంపూర్ణ మూర్తిమత్తం కలిగిన రసజగత్తు రామాయణ కావ్యంలో దర్శనమిస్తుంది. విశ్వనాథవారి కవితా విరాట్ స్వరూపం, వ్యక్తిత్వ హిమాలయ ఉన్నతి కల్పవృక్షంలో కానవస్తాయి.

ఆధునిక సాహిత్య యుగంలో విశ్వనాథసత్యనారాయణ బహుముఖ ప్రజ్ఞ తెలుగు సాహితీవనాన్ని సుసంపన్నం చేసింది. సహస్ర వృత్తాలుగా ఉన్న విశ్వనాథ శిల్పసృష్టి అనన్య సామాన్యమైంది. వివిధ ప్రక్రియల్లో పరాకాష్ఠకు చేరిన సత్యనారాయణ శిల్పం కథ, నవల, వ్యాసం, కావ్యం, నాటకం లాంటి ఎన్నో ప్రక్రియల్లో గోచరమవుతుంది. ఈ శిల్పాచార్యుడిని జ్ఞానపీఠతో సత్కరించింది. తెలుగుసాహితీ పీఠాన్నే ఈ కవి అధిరోహించాడు.

వేయిపడగలు, ఏకవీర, విష్ణుశర్మ ఇంగ్లీష్ చదువు, చెలియలికట్ట, జేబుదొంగలు, అంతరాత్మ, దేవతల యుద్ధము, దిండు క్రింది పోకచెక్క మొదలైనవి వీరి ముఖ్య రచనలు.

విశ్వనాథ సాహితీ విమర్శలోనూ ప్రఖ్యాతులే. నిర్భీకులు, మంచి ఉపన్యాసకులు అయిన వీరి ప్రతిమాట వెలకట్టలేని ముత్యం. తెలుగు సాహిత్యానికి వీరు చేసిన సేవ చిరస్మరణీయం.

ప్రాచీన సంస్కృతి, పురాణ వృత్తాంతాలు, నీతి ధర్మబోధనలు వీరి రచనల్లో ఇతివృత్తంగా వస్తాయి. కొందరు వీరిని సంప్రదాయవాదిగా, ఛాందసుడిగా ముద్రవేసి విమర్శించారు. పాశ్చాత్యవిష సంస్కృతిలో పడి కొట్టుకొనిపోతున్న జాతిని సన్మార్గంవేపు మళ్ళించాలని చేసిన తీవ్ర ప్రయత్నాల విమర్శించటం ఒక దౌర్భాగ్యం. అపారమైన పాండిత్యంతో, నవీనతతో చేసిన రచనల ఆకర్షణ నుంచి తెలుగుజాతి తప్పించుకొన పోలేకపోయింది. ఈనాటికీ వీరి రచనలు అందరికీ ఆదరణీయంగా ఉండటమే దీనికి నిదర్శనం.

లక్షణగ్రంథాల్లో తప్ప మరెక్కడా కానరాని అపురూప ఛందస్సులతో సాగిన రామాయణ కల్పవృక్షాన్ని పరిహసించటం సంస్కార విహీనం. విశ్వనాథవారిది ఏమీ ఆశించక రచన చేసిన పోతన మార్గం. కల్పవృక్ష రచనా విధానంలో విశ్వనాథవారిది స్వతంత్ర మార్గమైనా, పూర్వకవుల రచనా అనుకరణలు కనిపిస్తాయి. జీవుని వేదన, తండ్రి ఆజ్ఞని పాలించటం వారి రామాయణ రచనకి వెనక ఉన్న కారణాలు. అనుభూతి స్థాయి ఆకాశాన్ని అంటిన ఈ కావ్యం మంచివారిని నిరంతర చింతనకు ప్రేరేపిస్తుంది. తెలుగు రామాయణాల్లో ఇలా 'ఆత్మను తాకే రచన' వేరొకటి లేదు. మనసుపెట్టి చదివినవారు ఆనందాంబుధిలో ఓలలాడుతారు.

విశ్వనాథ ఒక కవిబ్రహ్మ. వారి కావ్య సృష్టి అనంతం.

# 14. శ్రీమద్రామాయణ కల్పవృక్షం - కావ్యకళా దృక్పథం

శ్రీమద్రామాయణ కల్పవృక్షం విశ్వనాథ కళావైభవానికి నిదర్శనం. రామాయణం భారతదేశంలో నిత్యపారాయణ .గ్రంథం. రామాయణం కథానాయకులైన శ్రీరాముడు, సీతమ్మలు దేశవాసులకు తల్లిదండ్రులుగా మనస్సులో నిల్చి ఉన్నారు. భారతదేశంలోనే కాక బయటకూడా రామాయణం ఒక అద్భుత కావ్యంగా ఉంది. ప్రపంచ సాహిత్యంలోనే అతి తక్కువగా ఉన్న పురాణాల్లో అత్యంత ప్రాచుర్యం పొందింది ఈ కావ్యమే. ఇది కల్పితగాథ కాదనీ, నిజంగానే జరిగిందని అనేక మేధావులు నిరూపించారు.(1) ఒకవేళ కల్పితగాథే అయినా, సామాన్యులు కూడా రామాయణ కావ్యాన్ని వాస్తవమైందిగా నమ్మటం, సీతారాములని దేవతలుగా పూజించటం, రామనామాన్ని అనుక్షణం జపించటం మొదలైన విషయాలను గమనిస్తే దీని ప్రాముఖ్యత తెలుస్తుంది. తెలుగు భాషలో రంగనాథ, గోపినాథ, మొల్ల, భాస్కర రామాయణాలు మొదలైనవి ఉన్నాయి. విశ్వనాథగారి రామాయణం విశిష్టమైన ఛందోవస్తు శిల్పానికి, తెలుగుతనానికి, సంభాషణా రీతులకు, అమూలక రచనా రీతులకు, మానవ మనస్తత్వ నిరూపణకు పేరుపొందింది. రామాయణ కల్పవృక్షంలోని ప్రతికాండం ఒక పూర్ణంలోని పూర్ణభాగంగా ఉంటుందని వాటిలో ఖండంగా కనపడే కావ్యభాగం కూడా ఒక పూర్ణకళామూర్తిగా గోచరిస్తుందని విమర్శకులు వివరించారు.(2) ఈ కావ్యం ఆధునిక యుగానికి చెందిన నవ్య సంప్రదాయ మహాకావ్యం.

రామాయణం తెలుగు అనువాదాల పట్ల విశ్వనాథకు అసంతృప్తి ఉంది. అందుకే తన అనువాద కావ్యం అత్యున్నతంగా ఉండాలని తీర్మానించుకున్నారు. అనుకున్న లక్ష్యం స్థాయిని బట్టి పరిశ్రమ, సాధనలు ఉంటాయి. దేవ, పితృ, ముని ఋణాలను తీర్చుకోవటం కోసం విశ్వనాథ వారి రచన సాగింది.

మారుమూల ఎక్కడో చెప్పబడ్డ వృత్తాలకు ప్రయోగగతి కల్పించిన విశ్వనాథ వారి కల్పవృక్షం తెలుగు సాహితీవనంలో ఒక అపూర్వ వటవృక్షం. కల్పవృక్షంలోని ప్రతికాండని అయిదేసి ఖండాలుగా విభజించి సాగిన రచనా ప్రణాళిక విశ్వనాథ వారిది. కావ్యనామంలోనే వృక్ష శబ్దం ఉండటం వల్ల ఖండవిభజన వెనక ఉన్న అర్థం సూచితం. ఆధ్యాత్మ దృష్టితో చూస్తే పంచభూత, పంచేంద్రియాల సూచన కూడా ఈ ఖండ విభజనని బట్టి తెలుస్తోంది. వివిధ ఖండాలకు పెట్టిన పేర్లు కూడా సంస్కృత నాటక సంప్రదాయాలను పోలి ఉంది. ప్రతికాండంలోనూ లెక్కప్రకారం అయిదు ఖండాలు ఉండేటట్లుగా విశ్వనాథ రచనా ప్రణాళిక సాగింది.

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో చక్కని నాటకీయత కూడా కనిపిస్తుంది. అర్థవంతమైన సంబోధనా విధానాలతో, అభినయన రీతులతోనూ నిండిన కల్పవృక్షం చదువరులకు అనేక సందర్భాల్లో నాటకాన్ని చూస్తున్న అనుభూతి కలిగిస్తుంది. వ్యవహారిక పదప్రయోగాల ద్వారా నాటకీయత రక్తి కట్టింది.

బాలకాండలోని అనేక పద్యాలు చక్కని కథాకథన దృక్పథానికి ఉదాహరణగా నిలుస్తాయి. కౌశికుడు చెప్పిన 'అనగనగ సగరుడన్నట్టి రాజు' విధానం తెలుగువాళ్ళ

మామూలుగా ఇంట్లో పిల్లలకు చెప్పే విధానంగానే ఉంది. శ్రోతలో ఏది ఉత్కంఠత కలిగిస్తుందో దాన్ని చివర చెప్పటం గడుసరి కథనమని కవి చెపుతారు. గంగావతరణ కథ ముగించి 'అది కథ' అని విశ్వామిత్రుని ద్వారా చెప్పించటం గమనించాలి.

పూర్వ రామాయణ కర్తల్లాగా కాకుండా విశ్వనాథ 'అహల్య' పాత్రని సానుభూతితో చిత్రించారు. వేయిపడగలులో 'మంగమ్మ' పాత్రను ఎంతో సానుభుతితో వర్ణించిన విశ్వనాథ తన కల్పవృక్షంలోనూ పతిత పాత్ర అహల్యను స్త్రీ సానుభూతితో చిత్రించారు. స్త్రీవాది అంటే మాటలు చెప్పేవారు కాదని పాత్రచిత్రణ ద్వారా స్త్రీజనపక్షపాత ధోరణి బహిర్గతమవుతుంది అని విశ్వనాథ ఋజువుచేసారు.

మానవసంబంధాల ప్రాధాన్యతని విశ్వనాథ ఆనాడే గుర్తించారు. పరశురాముడు శ్రీరామునితో మాట్లాడుతూ 'అపుడు మా అమ్మ ఏడ్చింది. నాకెంత కోపం రావచ్చో నీవే చెప్పు' అని ఒక సన్నిహితునితో మాట్లాడినట్లు మాట్లాడతాడు. రామాయణంలోని విభిన్నపాత్రలు మాట్లాడిన విధానంలోనే మానవసంబంధాల ప్రాముఖ్యత కనిపిస్తోంది.

వృత్త ప్రయోగం చేత కూడా వృత్తౌచిత్యం పోషించబడవచ్చు నన్న దృష్టి విశ్వనాథవారికి ఉందని రామాయణ పద్యాలు నిరూపిస్తాయి. ఉదాహరణకి వెన్నెల వర్ణనకై చంద్రికను, గజవర్ణనకై 'గజవిలసితం', తెల్లవారటం గురించి చెప్పటానికై 'ప్రభావితం' మొదలైన వృత్తాలను ప్రయోగించారు. అలానే గేయగతిలో నడిచే 'తన్వీ' వృత్తంలో జోలపాట, రెండు సమానభాగాలు ఏకీకృతమయ్యే 'క్ష్మాహార' వృత్తం ద్వారా రాముని మనస్సు సమన్వయం చెందటాన్ని వర్ణించారు. తిక్కన స్త్రీపర్వంలో విశేష ఛందస్సుల ప్రయోగం తర్వాత మళ్ళీ ఆ స్థాయిలో, సరిగా చెప్పాలంటే అంతకన్నా దీటుగా ఛందో ప్రయోగాలు విశ్వనాథవారు చేసారు.

తత్వపరిపూర్ణత విశ్వనాథవారి కల్పవృక్షంలో కనిపిస్తుంది. హైందవ సంప్రదాయబద్ధమైన తాత్విక విధానాలను కూడా సందర్భానుసారంగా తన రచనలో కవి ప్రస్తావించారు. ఋష్యశృంగుని కథ, పరశురాముని వృత్తాంతంలో వైదిక వివరణ ఉంది. రామునిలోని విష్ణుంశ గురించి కూడా తగినవిధంగా ప్రస్తావించారు.

శ్రీకారంతోనే ప్రారంభించి మంగళప్రదంగా తన కావ్య అవతారికలో శివస్తుతి చేయటం విశ్వనాథరచనా విధానాన్ని చూపిస్తోంది. శివకేశవాద్వైత రూపాన్ని విశ్వసించిన విశ్వనాథ 'పంచభూతములు, దివాకరుండును, నిశాకరుడు నీ తనుసప్తకంబయేని యీ శరీరంబు నీదే!' అంటాడు. శివుని అష్టమూర్తి తత్వాన్ని కీర్తించారు. విశ్వేశ్వరుని ఆజ్ఞతోనే లోకం అంతా వర్తిస్తుంది. అందుకే రామకథ ప్రారంభించినా పార్వతీపతి పాదాబ్జములని మనసులో నిల్పి విశ్వనాథ నిరాటంకంగా తన రచనని పూర్తిచేసారు.

"పావునెఱుంగు బ్రహ్మ సగపాలును మాత్ర మెఱుంగుఁ బార్వతీ
దేవియు నీ వెఱుంగుదువు తెల్లము రామమహత్తు కృత్స్న మా
దేవున కేను నీ యనుమతిం బడి నంకిత మిత్తు జానకీ
దేవి మనోహరుండు రఘుదేవుని సాధు కథా ప్రపంచమున్"

శ్రీరాముని మహత్తు దేవాదిదేవుడైన శివునికే తెలుసని విశ్వనాథ మాట. మహేశ్వరుని అనుమతితో తన కావ్యాన్ని రామునికే అంకితమిస్తానని చెపుతారు.

రామాయణాన్ని ఎందరో ఆత్మజ్ఞానులు రచించారు. "మఱల నిదేల రామాయణంబన్నచో" అన్న ప్రశ్నకు విశ్వనాథ సమాధానం ఇస్తారు. 'నా భక్తి రచనలు, నావిగాన' అని సమాధానమిస్తూ 'తలఁచిన రామునే తలఁచెద నేనును' అంటారు. రోజూ అన్నం తింటాం. అయితే తిన్న అన్నాన్నే మరింత రుచిగా తిన్నట్లు, చేసిన సంసారమే మరింత రసానుభూతి కోసం చేసినట్లు తను రామాయణం రచిస్తున్నానని చెపుతారు. కవి ప్రతిభను బట్టి, రచనానైపుణ్యం ఉంటుందని వారు భావిస్తారు. అందుకే "కవి ప్రతిభలోన నుండును గావ్యగత శతాంశముల యందుఁ తొంబదియైన పాళ్ళు ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది నవ కథాధృతిని మించి" అన్నారు.

సర్వకాల సర్వావస్థలలోనూ రామనామమే విశ్వనాథవారి రసనపై సాగేది. తన మనాశ్వానికి శివుడే సారథి అని విశ్వనాథ భావన. అంటే తాను నిమిత్తమాత్రుడనని సర్వమైన శివుడి అభీష్టం మేరకు రామకార్యం సాగుతోందని వారి ప్రగాఢ విశ్వాసం.

విశ్వనాథవారిని చిన్నప్పుడే తండ్రి రామాయణ రచన చేయమని శాసించాడు. 'తండ్రియాజ్ఞయును జీవుని వేదన రెండు నేకమై నా సకలోహవైభవ సనాథము నాథ కథన్ రచించెదన్' అని ప్రతినబూనారు. ఇహపరాలను రెంటినీ సాధించే రామకథను రాయాలని పల్లవావస్థనుంచే విశ్వనాథ కవితాపిపాసికి ఉండేది. ఈ జీవితాశయం ఆయనలోని సాహిత్యదాహాన్ని తీవ్రం చేసింది. సాహితీ సముద్రాన్ని ఈ అగస్త్యుడు అలవోకగా ఆపోశనపట్టాడు.

విశ్వనాథవారి తండ్రిగారు మహాదాత. గొప్ప శివభక్తులైన వీరు కాశీనుంచి లింగం తెప్పించి స్వగ్రామం నందమూరులో ప్రతిష్ఠించారు. తన తండ్రిని విశ్వనాథవారు దధీచి, శిబి, కర్ణుడు మొదలైన మహాదాతలతో సమానమన్నారు. 'సితచంద్ర ప్రౌఢ కాంతిచ్ఛటా స్నానం బాడిన స్వచ్ఛలింగమయు నిన్ సాధించి' అనటం తండ్రి శివైక్యం పొందిన పుణ్యాత్ముడు అని చెప్పటం అవుతోంది.

విశ్వనాథవారి తండ్రి శోభనాద్రి వారు అన్నార్తులని సంతృప్తిచేసి పంపేవారు. 'నకనక లాడునట్టి కడుపులన్ వచ్చి త్రేచుచుఁ బోయెదు తెరువరులును,' "చినిగిన గుడ్డలఁ జనుదెంచి నూతన పరిధానములఁ దాల్చి యరుగు జనులు", "పరిదీనవదనులై యరుదెంచి యుత్సాహకృత మందహాసులై యేగువారు" అని ఎందరో వ్యక్తులు సంతోషపడేవారని వివరించారు. దానధర్మాలకై తన తండ్రి వంశపారంపర్యంగా వచ్చిన సుక్షేత్రాలను అమ్మివేసారని నిత్య దానశీలతయే తన తండ్రి లక్షణమని చెప్పారు. శోభనాద్రి ఒక ఆశ్రితుని కోసం తాను ధరించిన దోవతినిచ్చి అంగవస్త్రంతో నిల్చిన ఉదారుడు. 'అట్టి తండ్రికిఁ బరమభక్తాగ్రగణ్యుఁడైన పుత్రుండ' అని చెప్పుకున్నారు. విశ్వనాథ వారు నేను రామాయణాన్ని నీకు తండ్రికి భేదం లేకుండా పరమనిశ్చలబుద్ధితో అర్పణం చేస్తానని ప్రకటించారు. తండ్రిని మించిన దైవం లేదని సత్యనారాయణగారి మాట. సప్తసంతానాల్లోనూ ప్రశస్తమైనది కృతి అనీ 'అట్టి కృతిశత నిర్మాతనైన బిడ్డఁ బడసె నా తండ్రి కృతిలోక పారిషదుడు' అని చెప్తారు.

విశ్వనాథవారికి ఇద్దరు తమ్ముళ్ళు. శ్రీరామునికి, ధర్మరాజుకి తమ్ముళ్ళు ఎలాగో 'నా తమ్ములు' అట్టివారు అని వారు అంటారు. పెద్ద తమ్ముడైన వేంకటేశ్వర్లు పండిత కీర్తనీయుడు, సంస్కృతాంధ్ర భాషలలో దిట్ట, రసజ్ఞమౌళి. విశ్వనాథ వారి కవిత్వాన్ని పరిశీలించి, పరిష్కరించేవాడు. ఆ తర్వాతనే అది శంఖంలో పోసిన తీర్థం అయ్యేది. చిన్నతమ్ముడైన రామ్మూర్తికి మనసులో విశ్వనాథ దైవసమానుడు. వేదవ్యాసునికి గణనాథుడు, తిక్కన సోమయాజికి గురునాథుడు ఏ విధంగా మంచి లేఖకులో అలానే విశ్వనాథకి వేంకటేశ్వర్లు లేఖకుడు.

విశ్వనాథకు తిరుపతి వేంకటకవులు గురువులు. ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించిన కవనపటిమ వారిది. గురువుని స్మరించటం ఉత్తమ రచయిత వ్యక్తిత్వ నిరూపణ. "తన యెదయెల్ల మెత్తన కృత ప్రతి పద్యము" అని కవి గురువుని స్మరిస్తారు. చెళ్ళపిళ్ళ వారిది నవనీతం లాంటి మనసు. శిష్యవాత్సల్యం మెండు. శిష్యులపై అమృతవర్షం, శత్రువులపై పిడుగులవర్షం కురిపించే చెళ్ళపిళ్ళ వారిది ఎవరికీ భయపడని మనస్తత్వం. అయన వ్యర్థవాదాలకు తావివ్వరు. పరమసత్యవ్రతాచారుడు, సత్యసంగరుండు అని గురువుని విశ్వనాథ స్తుతిస్తారు. చెళ్ళపిళ్ళవారికి శిష్యుడనని చెప్పుకోవటమే తెలుగునాడులో గొప్ప.

అల నన్నయకు లేదు తిక్కనకు లే దా భోగ మస్మాదృశుం
డలఘు స్వాదురసావతార ధిషణాహంకార సంభారదో
హలబ్రాహ్మీమయమూర్తి శిష్యుఁడయినా డన్నట్టి దావ్యోమ పే
శలచాంద్రీ మృదుకీర్తి చెళ్ళపిళ వంశస్వామి కున్నట్టుగన్

ఆనాడు నన్నయకుగానీ తిక్కనకుగానీ ఆ భాగ్యం లేదని తనవంటి శిష్యునివల్ల గురువుగారి కీర్తిచంద్రిక ఆంధ్రదేశం నలుదిశలా ప్రకాశించిందని చెప్పారు. మంచి శిష్యుడివల్ల గురువుగారికి పేరువస్తుంది. వాస్తవంగానే తన కావ్యం ద్వారా విశ్వనాథ గురువుకి ఎనలేని ఖ్యాతి అందించాడు.

గురువులైన దివాకర్ల, చెళ్ళపిళ్ళలు జంటకవులుగా శతావధానాలు చేసి పేరుపొందారు. విశ్వనాథ, కొడాలి ఆంజనేయులు ఇద్దరూ కూడా జంట కవిత్వం చెప్పేవారు. కొడాలి అకాలమరణం విశ్వనాథని కలచివేసింది. వీరిరువురి కవిత్వం 'మధు ఝరీ భ్రమరిరుతిన్' ఉండేదని అది అచ్చంగా పోతన విధానంలోనే కలకండ అచ్చులు పోతలు పోసినట్లు ఉండేదని విశ్వనాథ చెపుతారు. ఈ సందర్భంలోనే తన కవిత్వ లక్షణం చెప్తూ 'నిత్యవేగి' అంటారు. ఈ వేగంలో ఎక్కువగా వ్యవహారపదాలు వస్తుంటాయి.

సర్వకళలకూ తల్లి సరస్వతిని పోతనలాగానే విశ్వనాథ కూడా కీర్తిస్తారు. 'కఠిన స్తనోపరి గ్రైవేయ మణికాంతి కర్ణతాటంకంబు' అని సాగే ఈ పద్యరత్నం ద్వారా ఆ దేవి కంఠసీమని అలంకరించారు. శారదాదేవి వర్ణన ఎవరో గొప్ప శిల్పాచార్యుడు చెక్కిన శిల్పంలాగా మన కన్నులపండువగా ఉంది.

నన్నయ తిక్కనాదులని స్మరిస్తూ వారిరువురూ 'నన్నావేశించిరి' అంటారు. 'వారలు పోయిన తెన్నున మెఱుఁగులను దీర్చి దిద్దుచుఁ బోదున్' అని ఆత్మవిశ్వాసం వ్యక్తం చేసారు. అంతో, ఇంతో తెలిసిన విమర్శకులైనా కావ్యసిద్ధాంతులని మెప్పిస్తానన్న నమ్మకం కూడా వారికి ఉంది. ఈ విధంగా 'మహాకావ్య రచనా ప్రసూన వనబంభరాయమాణ చిత్తుండనై సర్వధర్మ మూలబీజంబుగా నవిచ్ఛిన్న సంప్రదాయార్థినై' రచన చేస్తానని చెప్పటం తాను తలపెట్టిన కావ్యరచనాయజ్ఞ పవిత్రతను గ్రహించటం.

పూర్వకవులైన ఋషి నన్నయ, రెండవ వాల్మీకి తిక్కన, ఎర్రన, పోతన, శ్రీనాథుడు, పెద్దన, రామక్రిష్ణుడు, నాచన సోమన మొదలైన అందరినీ స్మరించటం విశేషం. సంస్కృత కవులైన భాస, కాళిదాస, భవభూతి, మురారిభట్టులని కూడా కీర్తిస్తాడు. ప్రాచీన సంస్కృత కవుల్లో మురారిది విలక్షణమైన మార్గం.

పూర్వకవులందరూ అచ్ఛమైన అమృతం తాగారనీ కానీ దానికి తను అసూయపడనని అంటారు. 'పరమమౌనియైన వాల్మీకికృత రామసత్కథా సుధారసంబు' త్రాగటం దీనికి కారణం. సర్వకావ్యవాక్కు వాల్మీకి నోటివెంట జన్మించిందని తాను ఎన్ని జన్మలు ఎత్తితే సత్కావ్యనిర్మాణ రేఖాసామగ్రి ఋణం తీర్చగలనో అని యోచిస్తారు. 'వాల్మీకి తప్ప వేరొక్కడెవడు సుకవిశబ్ద వాచ్యుండు' అని ప్రశ్నిస్తాడు. సామాన్యంగా సుకవి, కుకవినింద ఒక కావ్యరచనాసంప్రదాయం. అయితే వాల్మీకిని ప్రస్తావించానని అందుకని సుకవిప్రస్తావన అలానే కుకవి నింద వేరుగా రాయనవసరం లేదని చెపుతారు.

శాస్త్రానికి కావ్యపక్షం, శాస్త్రపక్షం అని రెండు పక్షాలు ఉంటాయని కావ్యపక్షాన ప్రయోగాలు చేయటం సమర్థనీయమని, అది కవి ప్రతిభను సూచిస్తుందని వివరిస్తారు. తనది వ్యవహారభాష అనీ, రసధ్వనులకి ప్రాధాన్యమిస్తానని ప్రకటిస్తారు. 'రసము పుట్టింపగ వ్యవహారము నెఱుంగ జనును లోకమ్ము వీడి రసమ్ములేదు' అని తన అభిప్రాయం చెపుతారు. విశ్వనాథ రామాయణ కావ్యంలోని కవితావిశేషాలు వారే స్వయంగా ఈ విధంగా చెప్పారు.

*తొడవుల్ వృత్తులునున్ గుణంబులును రీతుల్ వ్యంగ్యముల్ దీప్తి యే*
*ర్పడగాఁ గావ్యత, సంస్కృతం బొలసి యాంధ్రం బయ్యె నీ తెల్గుమేల్*
*నుడికారమ్ములు దేశ్యముల్ పలుకుబళ్ళును జాతిమాట్లాడు కై*
*వడి సత్కావ్యములొప్పు నాంధ్రమున, నా రామాయణం బట్టిదే*

విశ్వనాథ బాలకాండ పూర్తిచేసి అయోధ్య మొదలుపెట్టిన దశలో గ్రంథ ప్రకటన ఎలా చెయ్యాలా అన్న శంక వచ్చింది. వాసిరెడ్డి రాజా రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాద్ విశ్వనాథను స్వభాను విజయదశమినాడు పిలిపించి నర్తనశాల నాటకం ఆడించారు. కవిసమ్రాట్టులని ఆ రాజు సత్కరించారు. కల్పవృక్షాన్ని తనకు అంకితమివ్వాల్సిందిగా కోరారు. కానీ విశ్వనాథ దాన్ని ఈశ్వరాంకితంగా చేసారు. అయినా 'వైశంపాయనుండు భారతంబు జనమేజయునకు జెప్పినట్లు' చెప్పవచ్చునని ఆలోచించి కల్పవృక్ష కావ్యానికి వారిని శ్రోతలుగా చేసారు. మీరేమి కోరుదురని రాజు

ప్రశ్నిస్తే ఈ మనస్సున్న్యాసి విశ్వనాథ 'నేనిది యిమ్మంచు నడుగ నెవ్వరి నెపుడున్ దా నెదియేనియుఁ బ్రాప్తమ్మైనన్ వలదంచు జెప్ప' అని సమాధానం ఇచ్చారు. ఆయన కోరుకునే స్వర్గఫలం వాసిరెడ్డి వంశానికి దక్కుతుందని రామాయణ కావ్యాన్ని ఏడుకాండలు అచ్చువేయమని అడిగారు. ఈ విధంగా వాసిరెడ్డి వంశం కావ్య శ్రోతలుగా మిగిలారు.

విశ్వనాథ తన చిన్ననాటి స్నేహితులైన కొడాలి, కొల్లిపర సూరయ్యచౌదరి, గొట్టిపాటి బ్రహ్మయ్య, నాయని సుబ్బారావు మొదలైన వారందరినీ తన కావ్యశ్రోతలుగా చేసారు. విమలానంద భారతస్వామి, శృంగేరీ విరూపాక్ష పీఠాధిపతులు, జగద్గురు కళ్యాణానంద భారతీమంతాచార్యులు వారిని సాక్షాద్బ్రహ్మలుగా భావించి రచన చేసారు.

ఈ విధంగా అవతారిక పద్యాలలో కావ్యహేతువు, కావ్యకళాద్భుక్పథం వివరించిన విశ్వనాథ మిత్రత్వము, గురుభక్తి, వ్యక్తిత్వం కనిపిస్తున్నాయి.

బాలకాండ శ్రీరాముని జన్మ వృత్తాంతాన్ని వివరించే ఉజ్వల ఘట్టం. దీనిలో ఇష్టిఖండం, అవతారఖండం, అహల్యాఖండం, ధనుస్సుఖండం, కళ్యాణఖండం అనే అయిదు ఖండాలున్నాయి. పుత్రకామేష్టి ప్రధానాంశంగా కలది ఇష్టిఖండం. 'ఇష్టి' కి ఫలంగా భగవానుడు భూమిపై అవతరించాడన్న సూచన ఇక్కడ ఉంది. అవతారఖండంలో రాముడు విష్ణ్వంశ అనీ, దైవం అవతరించాడని వివరించబడి ఉంది. లోకదృష్టిలో జారిణి అయినా అహల్య యోగినే అని తర్వాత అహల్యఖండం చెపుతుంది. ఈ ఖండం ఆరంభంలోనే 'వింటికోసల విజయమగుత' అన్న సూచన భావికథను వెల్లడిస్తోంది. రాముడు శివధనుస్సు విరిచిన సందర్భంలో వచ్చిన ధనుర్ధ్వని ద్వైతీయ లోకాల్లో వినిపించింది అనటం అనంతర కాలంలో రాముడు రాక్షస సంహారం చేస్తాడని, అతను అజేయుడని చెప్పటం అవుతోంది. తర్వాత కళ్యాణఖండంలో శ్రీరాముని వైరాగ్య శృంగార భావాలు వశిష్ఠ గీతోపదేశంతో సమన్వయం అయ్యాయని ఉంది. అయోధ్యకాండలో మొదటగా వచ్చేది అభిషేకఖండం. ఇక్కడ రాముని పట్టాభిషిక్త యోగ్యత సూచితం. ఈ విధంగా ప్రతి ఖండం తర్వాతి ఖండంలోనికి దారితీసేలా నిర్మాణమైంది. ఈ నిర్మాణవైచిత్రి విశ్వనాథ కళాసృష్టి.

బాలకాండంలో ఇక్ష్వాకుల వంశ ప్రస్తావన వస్తుంది. దశరథుడు ముప్పురు రాణులతోటీ అమృత సౌఖ్యానుభూతి, అధ్యయన సుఖము, దీర్ఘభోగసుఖమ్ము పొందుతున్నాడని వివరణ ఉంది. భూమిని న్యాయమార్గంగా పరిపాలిస్తున్నాడని, శత్రువులని జయించాడని అయినా దశరథుడికి ఇసుమంతయినా తృప్తి లేదని తెలుస్తుంది. 'సతుల మొగంబుల దొక విషాదపు రేఖను గాంచి' దశరథుడు కూడా దీనవక్త్రుడై శోకించాడని అతనికి సంతానం లేదన్న కారణంగా చింత ఎక్కువైందని తెలుస్తుంది.

దశరథునికి పిల్లలపై ఉన్న ప్రేమని 'అంగళ్ళలోనఁ గ్రయ్యంబులై యిడిన శిశు శ్రేణి యాటవస్తువులు చూచి' అన్న పద్యం వివరిస్తోంది. దారిలో కనిపించే ఊయలతొట్లు చూసి, చిత్రపటాలలో చిన్నపిల్లలు నవ్వుతూ ఉన్న దృశ్యాలు చూసి, ఎక్కడైనా చిన్నపిల్లలు ఏడుస్తున్నట్లు వినిపిస్తే చెవిపెట్టి విని చలించిపోయే దశరథుని గురించి విశ్వనాథ

వర్ణించారు. దశరథుని మనోవాంఛ సర్వం సంతానమయం కాబట్టి పరధ్యానంలో ఉండేవాడు.

సభలోకి ఎవరైనా తండ్రులు బిడ్డలతో వస్తే రాచకార్యాలు వదిలిపెట్టి వారితో కలిసి కాలక్షేపం చేసేవాడు రాజు దశరథుడు. అలానే అయోధ్యాపురిలో వెళ్తున్నపుడు ఏ వర్ణపు శిశువు కన్పించినా నిలిచి, వానిని చూసి మురిసిపోయేవాడని, ప్రేమతో ఎత్తుకునేవాడని, ఏ భక్ష్యాలో తెచ్చి ఇచ్చేవాడని చివరలో దీర్ఘనిశ్వాసం చేసేవాడని చెప్పటం అతనికి పిల్లలులేరన్న దిగులు ఎంత ఉండేదో వివరిస్తుంది.

వాల్మీకి రామాయణం కన్నా భిన్నంగా విశ్వనాథ రామాయణం సాగింది. మూలంలో అశ్వమేధయాగం చేసే ఘట్టం వచ్చేవరకూ కౌసల్య ప్రస్తావన రాదు. కల్పవృక్షంలో దశరథుని వర్ణిస్తున్నప్పుడే ముగ్గురు రాణులని వర్ణించటం జరిగింది. 'తన కడుపు విష్ణుఁ బండించుకొనుట చేత' అన్న సందర్భంలో రాముడు విష్ణువు అవతారం అన్న విశిష్టార్థం ఉంది. 'అరయనెందరేని కల రాయన' అన్న అమూలక పద్యం అలానే 'కౌసల్య ముక్తికాంతాసమానాకార నలి సుమిత్ర' అన్న అమూలక పద్యం విశ్వనాథ రమణీయ అలంకారికశైలికి నిదర్శనం. కౌసల్యని ఒక్కసారి, సుమిత్రని రెండుసార్లు, కైకేయిని ఒకసారి వర్ణించటం ద్వారా వారికి వరుసగా శ్రీరాముడు, లక్ష్మణశతృఘ్నులు, భరతుడు జన్మిస్తారన్న వివరణ వస్తోంది.

కౌసల్యని 'ముక్తికాంతాసమానాకార నలి' అనటం ద్వారా భగవంతునికి మాతృమూర్తి అయ్యే భాగ్యం ఉందని సూచన. శాంతచిత్తులైన వారికి మోక్షప్రాప్తి తథ్యం. మహావిష్ణువే ఆమెకు జన్మిస్తున్నప్పుడు ఆమె ముక్తిస్వరూపిణి కాకుండా ఎలా ఉంటుంది? లక్ష్మణ శతృఘ్నులని కన్నతల్లి సుమిత్రాదేవి. ఆమె ఉపాసనా స్వరూపి, విజయ రమాకార వినయాంబుధి. ఇక్కడ ఈ రెండు ఉపమానాలు లక్ష్మణ, శతృఘ్నులని సూచిస్తున్నాయి. లక్ష్మణస్వామి ఆదిశేషుని ప్రతిరూపం. శతృఘ్నుడు రాముని సైన్యాలని ఎన్నో యుద్ధాల్లో విజయం వేపు నడిపించినవాడు. కైకేయి మధుసామగానమూర్తి అనటం భరతుని వ్యక్తిత్వాన్ని సూచిస్తోంది. అన్నగారి పాదుకలని శిరస్సున ధరించిన పుణ్యాత్ముడు భరతుడు.

విశ్వనాథ కౌసల్యని 'నవశరత్కాల మందాకినీ సితపుండరీకంబు' అని వర్ణించారు. ఇది కూడా రాముని శీలాన్ని వివరిస్తోంది. పుండరీకంబు శబ్దం రాముని విష్ణుతత్వాన్ని వెల్లడిస్తోంది. సుమిత్రని మందారపుష్పంబుతో పోల్చటం, మహిళామణి అనటం కూడా భరతశతృఘ్నుల వ్యక్తిత్వ ప్రకటనే అవుతుంది. అరుణవర్ణంలో ఉండే మందారం ద్వారా ఆదిశేషుని అవతారమైన లక్ష్మణస్వామి కోపతీవ్రత స్ఫురిస్తోంది. మహిళామణి అనటం ద్వారా శతృఘ్నుడు ప్రకాశవంతమైన తేజస్సు, యుద్ధోద్రేకం ఉన్నవాడని అర్థం. కైకేయి నును నల్లకల్వపూవు అనటం భరతునికి అన్వయిస్తే తనను తాను భగవంతుని సేవకు అర్పించుకునే కలువపూవు భరతుని అచంచల భక్తిని నిరూపిస్తోంది.

భూపతి కోర్కె గ్రహించినప్పటి నుంచీ రాణులు కూడా లోపలి వాంఛలను బయటకి ప్రకటించటం ప్రారంభించారు. రాజు పుత్ర వాంఛ క్రమక్రమంగా పెరగగా సభాముఖమే చూడకుండా ఉండసాగాడు. రాజు దైన్యంబు మాన్పే విధానం తెలీక

మంత్రులందరూ అది వారి దోషంగా భావిస్తుంటారు. అప్పుడు సుమంత్రుడు వారందరూ మంత్రజ్ఞులనీ, రాజుకి ప్రియహితరతులని, పండితులని, నీతిమంతులని చెప్పి వారిలో దోషం లేదని చెపుతాడు. వారి గుణగణాలని వర్ణించే సందర్భంలోని ఈ పద్యం మంత్రికుండాల్సిన లక్షణాలని కూడా వివరిస్తోంది.

బలమును గోశమున్ జెడక పట్టుదు రెంతయుఁ బ్రాప్తకాలదం
డుల రిపుఁడైన నిష్కలుష నొవ్వఁగఁ జేయదు శౌచవంతులన్
దలపయి బెట్టుకొంద్రు వసుధా దివిష న్నరపాలవంశ్యులన్
గలఁపక కోశవృద్ధికగు కార్యములన్ నిపుణుల్ ప్రియంవదుల్

మిగతా మంత్రులందరూ సుమంత్రుడు తమకు సారథని, రాజుగారి శోకాన్ని తీర్చే ఉపాయం సూచించమని అడుగుతారు. మదిలో సుమంత్రుడు మొదట సందిగ్ధపడినా చివరికి అది ఒక నిర్ణయంగా మారుతుంది. ఇక్కడ విశ్వనాథ ద్రుతవిలంబితము అనే వృత్తాన్ని వాడారు.[5]

పుత్రసంతానంలేని దశరథరాజు దుఃఖాన్ని పోగొట్టటానికి సుమంత్రుడు అశ్వంపై వెళతాడు. 'పోయెదనంచు వచించి విభుం గన నశ్వముపైఁ' అన్న సందర్భంలో అశ్వగతి వృత్తాన్ని ప్రయోగించటం వల్ల కదం తొక్కే పంచకళ్యాణి వేగం సిద్ధించింది.[6] సౌధ సోపానాలను మంత్రి చెంగుచెంగున ఎగురుతూ ఎక్కిన దృశ్యం కళ్ళముందు కనిపించేలా వృత్తం నడిచింది.

ఈ రాత్రేల వచ్చితివి అన్న రాజు ప్రశ్నకు 'మీరు దానఘనులు నేది కావలసినన్ జనుదెంతుము మిమ్ముఁజూడగన్' అని సుమంత్రుని సమాధానం. 'నీకేది కావలయునో అది కైకొమ్మని' రాజు అనగా మంత్రి దశరథుని శోకానికి కారణం ఏమని ప్రశ్నిస్తాడు. నిద్రాహారాలు మాని మిగతా మంత్రులందరూ దుఃఖిస్తున్నారని సెలవిస్తాడు. దశరథుడు 'నేత్రంబుల బాష్పంబులురల' మంత్రీ అని సంబోధించి పొత్తికల భార్య నడికట్టుతో వచ్చి అందిస్తే పసిపాపను అందుకోవాలని, చిటికతో పల్కరిస్తే తొట్టెలోని బిడ్డ బోసినవ్వులు కురిపిస్తే చూడాలని ఉందని, రా బాబు అని తను నవ్వుతూ చేయిజాపితే తిరిగి బిడ్డ నవ్వులు కురిపిస్తే పరవశించాలని ఉందని, ఇల్లు చేరగానే బిడ్డ కాళ్ళకు అడ్డం పడితే ఆనందించాలని ఉందనీ చెపుతాడు. ఇదంతా చక్కని నాటకీయ శైలితో ఉండి మనలను ఆకర్షిస్తుంది. రాజు "మసలి మరల వంగి కూర్చోటం", "కపోలమ్ము కేల నూదటం," "నేత్రంబుల బాష్పంబుల ఊరటం" ఇవన్నీ అంగికాభినయాలు. మంత్రీ అని పిలవటం వాచికాభినయం.

దశరథుడు, సుమంత్రుడు మాట్లాడిన విధానం రాజు - మంత్రుల మధ్య సాగిన దానిలా లేకుండా ఆత్మీయుల మధ్య సాగిన సంభాషణలా ఉంది. దశరథుడు తన మనోవ్యాకులతని వివరిస్తూ బిడ్డలకోసం తల్లడిల్లటం ఎంతో వాస్తవంగా మనోవిశ్లేషణ రీతిలో ఉండటం విశేషం. ఇక్కడ కరుణరసం అద్భుతంగా పోషించబడింది. దశరథుడు ఎంత రాజైనా కొడుకు కోసం మామూలు మనిషిలాగానే పరితపించటం చాలా వాస్తవంగా ఉంది.

మర్నాడు అయోధ్య నగరాన్ని చూసి వద్దామని రాజు, సుమంత్రునికి వీడ్కోలు పలుకుతాడు. మర్నాడు ఇరువురూ అయోధ్యవీధులన్నీ కలియతిరుగుతారు. ఇక్కడ అయోధ్య నగర వర్ణన కల్పవృక్షకారుడు చాలా శ్రద్ధగా చేసాడు.

దశరథుడి పాత్రచిత్రణ పరిపుష్టమైంది. ఇతనిది సుతిమెత్తని మనస్తత్వం. ఆదర్శరాజు మంత్రులతోనూ, ప్రజలతోనూ సన్నిహితంగా వర్తించాలని విశ్వనాథ భావన. అందుకే ఈ పాత్రను బహుజాగ్రత్తగా తీర్చిదిద్దారు. పుత్రసంతానం లేదన్న అతని దిగులు, బహుశా ఎవరినో జీవితంలో వాస్తవంగా చూసి విశ్వనాథగారు సరిగా వివరించగలిగారు.

సుమంత్రుడు పేరుకు తగినట్లుగానే మంచి మంత్రి. ప్రభువు పడుతున్న మానసిక వేదనని ఇతను సరిగా అర్థంచేసుకున్నాడు. ఇతని మాటలు అతని మానసిక పరిస్థితిని వెల్లడిస్తున్నాయి. సుమంత్రుడు ఋష్యశృంగ మహాత్మ్యం చెప్పేటప్పుడు ఒక సన్నిహితుడిలా కాక మంత్రిగానే మాట్లాడతాడు. ఇలా సందర్భోచిత రచన చేసిన ధీశాలి విశ్వనాథ.

ఇష్టిఖండంలో వృథాశోకి, పృథ్వీరాజ ప్రియకేకి, ధరణీవరాహ, ధూతఘమతీ, అమృతాంశముఖమండలా, మత్స్యపుచ్ఛాభిరామ విలోచనాంచల, సాద్భుతమంత్రి వినిర్ణయాకృతీ, త్రయీశిఖాబుద్ధిధునీ, క్ష్మాయోషా హృదయనాథ అనే విభిన్న సంబోధనలు ప్రయోగించబడ్డాయి.(7)

వచన రచనలోనూ విశ్వనాథది విశిష్టమార్గం. 'అన్న మంత్రి మాటలకు రాజు కించిదధరి విస్తారమాత్రగోచరంబైన చిఱునవ్వుతో' అని సాగే వచనం వీరి రచనా విధానాన్ని చూపిస్తోంది. విశ్వనాథ సంబోధనలు కూడా కొన్ని చోట్ల అతి దీర్ఘంగా సాగి ఉంటాయి. సమాస రచనలోనూ, క్రియాపదాలను ప్రయోగించటంలోనూ విశ్వనాథ సవ్యసాచి.

విశ్వనాథ కవిసమ్రాట్టుగా విశ్వరూపదర్శనం కావించిన మహాకావ్యం రామాయణ కల్పవృక్షం. ఐహిక సుఖాలకోసం కాకుండా పారమార్థిక చింతతో చేసిన ఈ రచన విశ్వనాథ వ్యక్తిత్వాన్ని వెల్లడిస్తోంది. శ్రీమద్రామాయణ కల్పవృక్షం రచనా విధానానికి, భక్తి భావనా వెల్లడికి పేరుపొందింది. అముష్మిక ధర్మ మార్గాన్ని ప్రవచించే కావ్యంగా కల్పవృక్షం తెలుగు సాహితీనందనవనంలో నిత్యవసంత శోభతో అలరారుతూ భక్తుల కోర్కెలను తీరుస్తుంది. విశ్వనాథ గొప్ప సాహితీకృషీవలుడు. వీరి పేరు తెలుగుసాహిత్యం ఉన్నంత వరకూ ఉంటుంది.

## వివరణలు:

1. 'South Asian politics' పత్రికలో (మార్చి, 2003 సంచిక) ఎస్.గురుమూర్తి, (ఐ.ఎ.ఎస్) రాముని ఆరాధన ఇండోనేషియా, థాయ్‌లాండ్ దేశాల్లో ఉందని వివరించారు. థాయ్‌లాండ్‌లో రాముని పేరు మీద అయోధ్య (Ayutthya) అనే ప్రావిన్స్ ఉంది. ఇండోనేషియాలో వానరనృత్యం (Ape Dance) ను అక్కడి ప్రజలు రాముడు తోకమూకతో రావణునిపై జయించిన వైనాన్ని స్మరించేందుకు

ఈనాటికీ చేస్తుంటారు. ప్రాచీన గ్రంథమైన పాత నిబంధనల గ్రంథం (old Testament) లో రామ, సీత, లవ, కుశల పేర్లు అనేకమార్లు ప్రస్తావించబడ్డాయి. థాయ్‌లాండ్‌లో 400కి పైగా సీతారాముల దేవాలయాలు ఉన్నాయి. ఈ వ్యాసంలో రచయిత ఇలా పేర్కొన్నారు-

(A) "Prof. Kanuga has drawn attention to the fact that the museam at Rome has gold coins of both the continents of Rama's days. The remains of the great war of lanka, the mixture of monkeys and human forces and the place where the war took place are still available as archaeological evidence in Srilanka"

(B) Prof. H. Daniel Smith of syracuse university has drawn up a route map of Sri Rama from Ayodhya to Srilanka.

2. ప్రొఫెసర్ జి.వి.సుబ్రమణ్యంగారి అభిప్రాయంలో "ఖండంగా కనపడే కావ్యభాగం కూడా ఒక పూర్ణకళామూర్తిగా గోచరిస్తుంది. ఇటువంటి అనుభూతి కలిగించే శక్తి వాల్మీకి రామాయణానికి వ్యాసభారతానికి, శ్రీమద్భాగవతానికి, కవిత్రయ భారతానికి ఇదివరలో ఉండేది. ఇప్పుడు శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి ఈ ఖ్యాతి దక్కుతుంది. అందులోని ఏ ఖండమైనా స్వయంసంపూర్ణం. ఒక పూర్ణంలో నుండి పుట్టి ఆ పూర్ణంలో లయించే ఒక పూర్ణభాగం."

3. సంస్కృత నాటకకర్తలైన శూద్రకుడు, విశాఖ దత్తుడు మొదలైన వారి రచనల్లో ఇది కనిపిస్తుంది. ముద్రారాక్షసం, మృచ్ఛకటికం నాటకాల్లో ఖండ నామకరణ చాలా ఔచిత్యవంతంగా సాగింది.

4. విశ్వనాథగారు తన ఆత్మకథలో ఈ విధంగా చెప్పారు. చిన్నప్పుడు విశ్వనాథ కవిత్వం వ్రాస్తుండగా వాళ్ళనాన్నగారు కొట్టినంత పని చేసారు. 'ఏదో ఇంగ్లీషు చదువు చదివి పెద్ద ఉద్యోగివవుతావని నేను ఆశపడుతుంటే, ఈ పిచ్చి కవిత్వం దేనికిరా నీకు?'. విశ్వనాథతో తండ్రి 'నీవు ఏ క్లాసు తప్పితే ఆ క్లాసుతో నీ చదువు పూర్తి. రెండవది నీవు వ్రాస్తే రామాయణమే రాయి, ఈ పిచ్చి కవిత్వం వద్దు'... అని అన్నారు.

5. ద్రుతవిలంబితము. అనేది జగతీ ఛందోజనితమైన వృత్తం. పాదానికి 12 అక్షరాలు ఉంటాయి. గణాలు వరుసగా న-భ-భ-ర అని వస్తాయి. ప్రాస నియమముంది. 7వ అక్షరం ప్రాస.

భరతుడీ వృత్తాన్ని 'హరిణపుత' అని వ్యవహరించాడు. దీనికి 'సుందరి' అనే వ్యవహారనామం కూడా ఉంది. ద్రుతవిలంబిత నిర్మాణ రహస్యాన్ని క్షేమేంద్రుడు ఈ విధంగా పేర్కొన్నాడు:

"ప్రారంభేద్రుత విన్యాసం పర్యంతేషు, విలంబితం
విచ్ఛిత్యా సర్వపాదానాం భాతి ద్రుత విలంబితం"

6. అశ్వగతి వృత్తం బాలకాండలో ఒక్కసారి మాత్రమే వస్తుంది. ఇది అష్టిచ్ఛందో జనితమైన వృత్తం. దీనిలో పాదానికి 16 అక్షరాలు ఉంటాయి. ఐదు గణాలు ఉంటాయి. భగణాల మీద ఒక గురువు (భ-భ-భ-భ-భ-భ) వస్తుంది. యతిస్థానం 10వ అక్షరం. లక్షణరీత్యా ఒక్క జగణం ఉండటానికి వీలులేని ఈ వృత్తంలో విశ్వనాథ 'జ' గణాన్ని ప్రయోగించి లక్ష్యాన్ని సాధించారు.
7. "శ్రీమద్రామాయణ కల్పవృక్షము - బాలకాండ ఛందోవస్తు శిల్పము" అనే గ్రంథంలో డా॥ పవని హరినాథ్‌గారు వీటినన్నింటినీ వివరిస్తూ 'ఇవి అభినయసూచకంగానూ, ఆహార్యసూచకంగానూ, వర్తక చిత్తప్రవృత్తిని తెల్పేవిగానూ ఉన్నాయని వివరించారు.

# 15. ఆంధ్రప్రశస్తి కవితా రసఝరి

విశ్వనాథ సత్యనారాయణ కావ్యం ఆంధ్రప్రశస్తి తెలుగువారికి సంబంధించిన కొన్ని ఉజ్వల చారిత్రక ఘట్టాలను ప్రతిబింబిస్తుంది. తెలుగుసాహిత్యానికి చెందిన అన్ని ప్రధాన ప్రక్రియలలో ప్రయోగాలు చేసి తన రచనాశక్తిని నిరూపించుకున్న విశ్వనాథ సాహితీప్రమాణాలు ఆకాశమంత ఉన్నతమైనవి. అసంఖ్యాకంగా నవలలను రచించి, సాహితీ విమర్శనా వ్యాసాలను పుంఖానుపుంఖాలుగా వెలువరించి, ఉపన్యాసాలు చేసినా తృప్తిపడని విశ్వనాథ సాహితీ ప్రజ్ఞ - తెలుగుభాషకి అనన్యసామాన్యమైన సేవలను అందించింది. తెలుగుపై వీరి అధికారం తిరుగులేనిది. విమర్శకుల నోళ్ళు వీరి పాండిత్యాన్ని చూసి మూతపడ్డాయి. తెలుగు సాహితీసామ్రాజ్యానికి విశ్వనాథ కవి సమ్రాట్టులే.

విశ్వనాథ 'ఆంధ్రప్రశస్తి' కావ్యాన్ని మల్లంపల్లి సోమశేఖరశర్మకు అంకితమిచ్చారు. ఈ కావ్యంలో ఆంధ్రమహావిష్ణువు, శాతవాహనుడు, గౌతమీపుత్ర శాతకర్ణి, మాధవవర్మ, వేంగి క్షేత్రము, ముఖలింగము, నన్నయభట్టు, ప్రోలరాజు, ప్రోలరాజు వధ, కొండవీటి పొగమబ్బులు, చంద్రవంక యుద్ధము, యమ దంష్ట్రిక అనే వేర్వేరు కవితలు ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని అనేక క్షేత్రాల గురించి, చారిత్రక విషయాల గురించి, సాంస్కృతిక ఔన్నత్యం గురించి ఈ కావ్యంలో విశ్వనాథ ప్రస్తావించారు. ఒకవిధంగా చూస్తే ఈ కావ్యం రాష్ట్రారాధన కావ్యం లాగా అనిపిస్తుంది. విశ్వనాథ వారి స్వీయరాష్ట్రాభిమానం వారి కవితారస ఝరిలో మిళితమై కనిపిస్తుంది. చదువరులకు కళ్ళకు కట్టినట్లుగా ఆంధ్రరాష్ట్రంలోని విభిన్న క్షేత్రాలను విశ్వనాథ వర్ణించారు. స్వర్గతుల్యమైన ఆంధ్రరాష్ట్ర ప్రాశస్త్యాన్ని, ప్రఖ్యాతిని చదివి పాఠకులు తాము ఈ రాష్ట్రానికి చెందినవారు అయినందుకు గర్వపడతారు. వారి హృదయాలు ఆనందంతో నిండిపోతాయి.

మగధను జయించి భారతదేశ చక్రవర్తులైన పూర్వాంధ్ర రాజవంశాల వారందరిలోకీ ఆంధ్రమహావిష్ణువే పూర్వుడు. శ్రీకాకుళం రాజధానిగా పాలించిన ఇతని వల్లనే ఈ ప్రాంతానికి ఆంధ్రదేశమనే పేరు వచ్చినది. అనంతరం ఇతను దేవునిగా పరిగణించబడ్డాడు. ఇతని పేర శ్రీకాకుళమున ఆంధ్రవిష్ణువు ఆలయం కట్టించబడింది. కాసుల పురుషోత్తంకవి ఇతని మీదనే తన శతకాన్ని రచించాడు. శ్రీకృష్ణదేవరాయలు స్వప్నంలో ఈ దేవుడు ఆనతిచ్చిన ప్రకారం ఆముక్తమాల్యదను రచించాడు.(1)

"ఆంధ్రవిష్ణుని ముఖాగతమయ్యెనొ లేదొ దాని వించునె సరదార్లు దైత్యుడు నిశుంభుడు చచ్చెను" అన్న పదాలు ఆంధ్రమహావిష్ణువు నిశుంభుడనే రాజును సంహరించాడని చెపుతున్నాయి.

'కాళేశ్వరంబు, శ్రీశైలమ్ము, భీమేశ్వరమ్మును గలిపి యాంధ్రము త్రిలింగ చిహ్నితమ్ముగజేసె' అన్న పదాలు ఆంధ్రమహావిష్ణువు ఈ మూడు క్షేత్రాల చుట్టూ

పెద్దగోడ కట్టించి ఆంధ్రకు త్రిలింగమనే పేరును కల్పించాడని వివరిస్తున్నాయి. 'ఉభయ సంధ్యా ప్రశాంత సమయరోచుల స్వచ్ఛార్ధచంద్ర మకుట మూఁడు లింగమ్ములకు భక్తిఁ బూజసేయఁ బవనచలితాంశు కాంతలై ప్రతిదినమ్ము' అని విశ్వనాథ రాస్తారు. నిజానికి ఈ పదాలు విశ్వనాథవారికే వర్తిస్తాయి. విశ్వనాథ గొప్ప శివభక్తుడు.

*విప్రాశీః ఫలభాజనుం డతఁడు తన్పెన్ భూసురశ్రేణి "బ*
*హ్మప్రీత" మ్మనుచున్, ద్రిలింగముల సంధ్యల్మూఁ టసేవించె, వే*
*దప్రామాణ్యముగాఁగ నాంధ్రపతి, యే తద్దివ్యయోగాతి ని*
*ష్ఠా ప్రీతుం డయినాఁడు త్రైపురసతీ సౌభాగ్యనిర్ణీతయున్*

త్రిపురాసుర భార్యల సౌభాగ్యాన్ని నిర్ణయించిన శివుని అనునిత్యం ఆంధ్రమహావిష్ణువు పూజించేవాడని తెలుస్తోంది.

నిశుంభుని సంహరించమని పలువురు విష్ణువుని వేడుకుంటారు 'ఆంధ్రభూధవుని సైన్యము' బయలుదేరి 'దైత్యుడు నివసించు తావుచుట్టును మహాగజ యూథముల నిల్పఁ గాపువెట్టి' ఉంటారు. 'రోషదష్టాధరుండయి రుద్రువోలె' దితిజుడు వైరిబలాన్ని తెల్సుకొని వెలికివస్తాడు. శ్రీకాకుళాధినేత నిశుంభుని తన బాణంతో సంహరిస్తాడు. 'అంచించంగల యాంధ్రనాయకుఁడు బాణాగ్రంబునం దగ్ని సంధించెం గావల' అని విశ్వనాథ వర్ణిస్తారు. అలా కాకపోతే "దైతేయేంద్రదేహోద్గత ప్రాంచత్పావకకీల భగ్గు రని యీ ప్రాంతాటవుల్ కాలిపోఁ బంచారించిన పల్లెలుం బురములున్ ప్రారంభమే లయ్యెడున్? అని కవి ప్రశ్నిస్తారు.

శ్రీకాకుళం క్షేత్ర ప్రాధాన్యతని కూడా విశ్వనాథ పరిచయం చేసారు. 'బురుజుల దితిజ సమూహరక్తముఁ గ్రోలు నాల్కవోలు పతాక నాటినదియు' పూర్వాంధ్ర శిల్పాచార్యులకు తల్లివంటిది అయిన శ్రీకాకుళ క్షేత్రం గురించి ఒక చారిత్రక పరిశోధకుని రీతిలో విశ్వనాథ సమాచారం అందించారు. వీరి చారిత్రక దృష్టి సమగ్రమైంది.

*రాజరాజాంధ్రవిష్ణుని రాజధాని*
*కలుషములకెల్ల పిడుగు శ్రీకాకుళంబు*
*కన్నులకుఁ గట్టినట్లుగాఁ గానఁ బడెడు*
*వేదకాలమునాఁటి ముత్తైదువట్లు*

మన సంప్రదాయాన్ని అనుసరించి పండు ముత్తైదువను చాలా గౌరవించి, ఆదరిస్తారు. నిండుగా కనపడే శ్రీకాకుళ క్షేత్రాన్ని ఇలా ముత్తైదువతో పోల్చటం విశ్వనాథవారికి సంప్రదాయంపై ఉన్న గౌరవాభిమానాన్ని వెల్లడిస్తోంది.

ఆంధ్ర చక్రవర్తుల వంశానికి శాతవాహనుల వంశమని పేరు. విశ్వనాథ వీరిగురించి కూడా తన కావ్యంలో చెప్పారు. 'అమిత లావణ్య నీలాకాశ పశ్చిమాశాచరత్సిత నూత్న జలద శకల యొక్క ఋషికన్య' 'కృష్ణానదీ తీరాన ఒక్క

యక్షుని కలుసుకుంటుంది. వారి 'అమృత లజ్జాతి మధుర నేత్రాంచలములు' మరుక్షణంలోనే కలుస్తాయి. ఆ మధుర కలయిక తర్వాత ఒక కుమారుడు ఉదయిస్తాడు. ఆ కుమారుని దివ్య అమృతవాహినీ మధురమైన పసినవ్వులే తనను భూమి మీదనిల్పాయని, కన్య కొడుకుని కన్న వెంటనే గతించిందని, మునులు తనకు మృగరాజ రూపాన్ని పొందమని శాపమిచ్చినట్లు యక్షుడు తన మీద బాణం వేయబోయిన రాజు దీపకర్ణికి చెపుతాడు.

'నీ నలినాక్షి శక్తిమతి నిద్రితశయ్యెను సర్పదష్టయై' మరణించెనని యక్షుడు రాజుతో అంటాడు. నిజానికి భార్యావియోగంతో దుఃఖిస్తూ రాజు పెళ్ళి చేసుకోకుండా ఉంటాడు. స్వప్నంలో దేవత కనిపించి మర్నాడు వేటకి వెళితే సింహం మీద ఒక బాలుడు కనిపిస్తాడని, అతడిని తెచ్చి పెంచుకోమని రాజుకి చెపుతుంది. ఈ విధంగానే రాజువచ్చి సింహంపై బాణం వేయగా అది గంధర్వుడై నిజ వృత్తాంతాన్ని వివరిస్తుంది. బాలుడిని 'సమస్త రాజ్య పదవీస్థితి జేయుము, జీవితాంత సంధ్యానవవేళ నీ ముసలియంశము కొంచెము విశ్రమించుతన్' అని యక్షుడు రాజుతో అంటాడు. బాలుడుని చూసి రాజు ఎంతో సంతోషిస్తాడు.

*కనుగొనలందు భాష్పములుగ్రమ్మఁగ, కంఠము రుద్ధమౌచు నా*
*యన! చనుదెమ్ము నీ చిఱుతలైన కరమ్ములు నా గళమ్మునం*
*దున బిగియింపు! శక్తిమతి తొంగలిఱెప్పలఁ బోలియున్న నీ*
*కనులకు నాంధ్రదేశ మది కైవసమయ్యెనురా! కుమారకా!*

పితృవాత్సల్యంతో బాలుడిని దగ్గరకు తీసుకొని "భవన్ముఖ చంద్రదర్శన ప్రీతులఁ జేసి నా కులము పెంపు గడింపుము తండ్రి" అని రాజు ఆనందంగా అంటాడు. వంశకర్త కావటం సామాన్య విషయం కాదని చెప్తూ నిఖిలాంధ్రరాజ్యరమకు ఏలికవవుదావని, రాజ్యవంశం ఇంక శాలివాహన వంశంగా పిలువబడుతుందని చెపుతాడు. శ్రీరామచంద్రుని వల్ల రఘువంశానికి కీర్తి వచ్చినట్లుగా ఆ బాలుని వల్ల శాతవాహన వంశానికి పేరు వస్తుందని ఆశిస్తాడు. ఆ రాజన్యుని మీద "మందపవన వ్యాధూత పాథోలవ శ్రీరమ్యాకృతి కృష్ణవేణి స్వీయాంబు ధారా ప్లవన్నీరేజామృత వాసనాలహరిని" వెదజల్లుతుంది. దీపకర్ణి మహారాజు కొడుకైన ఆ బాలుడే ఆంధ్రసామ్రాజ్యాన్ని విస్తరించి నూతన వంశాన్ని స్థాపించి చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతాడు.

ఈ వృత్తాంతంలో విశ్వనాథవారికి బిడ్డలపై ఉన్న ప్రేమ కూడా కనిపిస్తుంది. వీరి పితృప్రేమ, చిన్నపిల్లలపై ఉన్న వాత్సల్యం చాలా గాఢమైనవి. 'నీ మందహాస నవజ్యోత్స్నలు చూడ', 'నీ కర్పూరపు ఖండముల్ భుజము లందింపంగదో' అన్న వాక్యాలు విశ్వనాథవారి పితృప్రేమకు చక్కని ఉదాహరణలు. కల్పవృక్షంలోని బాలకాండలో కూడా ఈ విధమైన ఉదాహరణలు కనిపిస్తాయి.(2)

గౌతమీపుత్ర శాతకర్ణి రాజాధిరాజు. తల్లిపేరు గౌతమి మీదుగా ఇతని పేరు ఏర్పడింది. ఒక విభాగంలో విశ్వనాథ ఈ చక్రవర్తి గురించి చాలా విపులంగా వర్ణించారు.

సౌరాష్ట్రమును జయించి వారి వంశాన్ని నిర్మూలించిన వైనాన్ని కవి అద్భుతంగా కళ్ళముందు నిలిపారు. ఈ విభాగంలో వీర రసాన్ని పోషించిన విధానం ప్రశంసనీయం.

శాతకర్ణి యుద్ధానికి వెళుతున్న సందర్భాన్ని విశ్వనాథ తన కావ్య విభాగంలో పాఠకుల నయనానందంగా వివరించారు. ముందు 'రణ నిస్సహణ భేరికా శంఖ సకల వాద్యాలు' మోగుతుండగా, ఆ వెనుక 'వారకాంతాలి నాట్యమ్ములు గీతికా మాధుర్యరీతిఁ జూప', తెలుగు వీరులు సమరకాంక్షతో ముందుకు అడుగు వేస్తున్నారట. తురగపదాతి దళాలు, సమదగజయూధికా సహస్రములు నడుస్తున్నారని కవి వర్ణిస్తారు.

భూమండలం అల్లల్లాడుతుండగా తెలుగు సైన్యాలు దండయాత్రలో ఉత్సాహంగా పాల్గొన్నాయి. ఆంధ్రచక్రవర్తికి ఎదురువచ్చిన ఆడపడుచులు వారిలోవారు రాజుని చూసి "అతఁడు కాదటవె ఓ అక్క! మాలవనాథు కుత్తుక బల్లెమ్ముగ్రుచ్చినతడు" అంటూ మాట్లాడుకున్నారట. నగరంలోని మహిళలకు రాజు వినమ్రతతో నమస్కరించి నిలుస్తాడు. ఒక ముసలి ముత్తైదువ 'తండ్రి! నీ శూరతారేఖ ప్రధాన బాహువులు యుద్ధమునయందు శత్రువక్షోభాగ జనితాసృగుదిత నీ రావతారమ్ములై యమరుగాత' అని దీవిస్తుంది. వీటినిబట్టి రాజ్యంలోని ప్రజలందరికి రాజు పట్ల ప్రేమ, భక్తి విశ్వాసాలు మెండు అని స్పష్టమవుతోంది.

సైన్యాగ్రభాగమందు ఉత్తమాశ్వంపై వెళుతున్న రాజు తన పౌరులు అందించే కుంకుమాదివస్తువులని స్వీకరించి వారిని ఆనందింపచేస్తాడు.

"తన యరదంబు నుండి పతి ధాత్రికి డిగ్గి కృతప్రణాముఁ డ
య్యెను దల నేల దాఁకు గతి, వృద్ధ సువాసిను లిచ్చు కుంకుమం
బును బ్రసవంబులున్‌గొని నమోనమయంచు రథంబు నెక్కినం
తన జయ మంత సిద్ధమయనన్ దన సైన్యములెల్ల నార్వఁగన్"

ప్రజలను గౌరవించే రాజే ప్రజల నుంచి గౌరవాభిమానాలను పొందగలడని విశ్వనాథ అభిప్రాయం. రాజు ఏ విధంగా నడుచుకోవాలో, ప్రజలతో ఏ విధంగా ప్రవర్తించాలో ఈ ఖండికలో చక్కగా వివరించారు. తెలుగువీరులు యుద్ధరంగంలో తమ పరాక్రమాన్నీ, పౌరుషాన్ని నిలబెట్టుకొన్నారు. వారు 'ధరిత్రీతలంబు పగిలిపోవగ' యుద్ధం చేసారు. ఆ సందర్భంలో లేచిన వారి కాలి దుమ్ము ఆకాశాన్ని కప్పివేసినట్లుగా ఉంది. ఆంధ్రసైన్యమనే అగ్నిలో శత్రువుల దుర్గాలు, సైన్యాలు, గజబలం మొదలైనవన్నీ నశించాయి. సౌరాష్ట్రపై తెలుగువీరుల పతాకం రెపరెపలాడింది.

మాధవవర్మ పల్లవరాజు. నేటి బెజవాడ రాజధానిగా రాజ్యం చేసిన ఈ రాజు నీతికి, ధర్మానికి మారుపేరు. ఒక శాసనం ద్వారా వెల్లడైన కథను విశ్వనాథ తన కావ్యంలో పొందుపర్చారు. చరిత్రకారులు కేవలం విషయాలను వివరిస్తారు. కానీ విశ్వనాథ ప్రతివిషయాన్ని ఒక ధర్మాన్ని ప్రతిష్ఠించటానికి, నీతిని బోధించటానికి వివరించారు. మనకు తెలియని మన చరిత్రను బోధిస్తూ బంధుత్వం కన్నా, రక్తసంబంధం కన్నా ధర్మం చాలా గొప్పదని దాన్ని అతిక్రమించరాదని ఈ ఘట్టం ద్వారా సూచించారు.

విజయవాటిక కోటవీధిలో ఒకనాడు రాజుగారి ఏకైక కుమారుడు, శ్వేత మత్తాశ్వాలు పూన్చిన రథాన్ని ఆరోహణచేసి పురములో వాహ్యాళికి వెళుతుంటాడు. ఆ రథచక్రాల కింద పడి ఒకరు మరణిస్తారు. పరిగెత్తే రథం వెంబడి కొందరు గుంపులు గుంపులుగా వెళతారు. ఎక్కడి ప్రజలంతా అక్కడ మూగి జరిగిన ఘోరాన్ని చూస్తారు. "ధూళి ధూసరితమై వ్రాలిపోయినయట్టి శవమును గనుఁ గొని" ప్రజలంతా జాలిపడతారు. లోకబాంధవుడు అస్తమిస్తాడు.

మరునాడు మాధవశర్మ ధర్మాసనం మీద కూర్చొని ఉండగా, ఒక వృద్ధ పేదరాలు వచ్చి 'నెత్తురట్టలు కట్టిన నిజకుమారు శవము దిగజార్చి' సభలో తన బాధ చెప్పుకుంటుంది. ఆమెను చూడగానే 'కాబోలు నీమె శోకంబుకట్టిన మూర్తి అతి భూమిదుఃఖభారానతాంగి' అన్నట్లుగా తోస్తోంది. 'కాబోలు నీ వృద్ధకాంత నాయార్థిని బహుళ కృథాభుగ్న ఫాలభాగ' అన్నట్లుగా ఆమెను చూసి పలువురు భావించారు.

ఓ నృపాల! ఈ పిల్లవాడు ఒక్కడు నా కులాన్ని ఉద్ధరించేవాడు, నీవు ధర్మరాజు లాంటి వాడవు అని వృద్ధురాలు సంభాషిస్తుంది.

*"ఇంతకుమించి యాపద లిఁకేమనికల్గు, రథంబుచేతఁ ద్రొ*
*క్కింతురటయ్య భూప్రజల, నెంతగనున్న సిరుల్ భుజింత్రు పా*
*లింతురు, రాజులైన వదలింతురు, తప్పులు కల్గినన్ విచా*
*రింతురు కాక, చంపుట సరే ప్రజ నిట్టు లకారణంబుగన్?"*

మాతృమూర్తి శోకం, ఆవేశం పై పద్యంలో కన్పిస్తాయి. ఆ వృద్ధురాలు "నీ యిష్టము న్యాయ్యమో మఱియు నన్యాయంబొ నీ చేతిమీఁదనె కాని మ్మిదె పోవుచుంటిని" అంటూ బాధాపూర్ణ నేత్రద్వయంబున ఏవో వికృత స్వరూప ఘటనంబుల్ గలిగి, కుమారుడు మరణించిన దుఃఖానికి తట్టుకోలేక ఆ సభాప్రాంగణంలోనే పడిపోతుంది.

రాజు సభలోని విజ్ఞులని ధర్మనిర్ణయం చేయమని కోరతాడు. ప్రాడ్వివాకులు దీర్ఘముగా యోజించి 'మత్తాశ్వములుపూన్చి మనుజనాథసుతుడు పురవీధులందున బోవరాదు' అంటారు. 'పసిపాపలుందురు పంగ్వంధులుందురు ప్రాణమ్ము ప్రాణమ్ము బదులుగోరు' అని నిర్ద్వంద్వంగా చెపుతారు. స్మృతికి రాజుగారి కొడుకని, సామాన్యుడని ఉండదని వివరిస్తారు. న్యాయం, ధర్మం అనేవి అందరికీ సమానంగా వర్తిస్తాయని సభలోని పెద్దల అభిప్రాయం. ప్రాడ్వివాకులు తమ తీర్పు విన్పించగానే రాజుకి పిడుగుపాటులా అన్పిస్తుంది. అయినా తీర్పు వినిపించినంతసేపు రాజుగారి మోములో "కనతుదలనైనఁ గదలిక కాంచలేదు". ఆసనం మీద ఎంత గంభీరంగా ఉన్నా, దిగిన వెంటనే దుఃఖపూరితుడవుతాడు. ప్రధానసఖులు రాజును అంతఃపురానికి తీసుకొనివస్తారు.

సచివులు పుత్రశోకంతో తల్లడిల్లుతున్న భూపతిని చూసి వారు ఇచ్చిన తీర్పును రాజు సవరించవచ్చు అని వివరిస్తారు. అయితే వివేకవంతుడైన ఆ మహారాజు "పుత్రవిరహోగ్రభరాత్ముఁడఁగాని న్యాయ కార్యాచరణభార దుఃఖ వివశాత్ముఁడఁగా" నని

తనకు ధర్మం ఆచరించటమే ప్రధానమని వివరిస్తాడు. రాజుగారి ధర్మపాలనను చూసి, మెచ్చి దేవతలు విజయవాటికా పట్టణములో కనకవర్షాన్ని కురిపిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో గొప్ప క్షేత్రాలు ఉన్నాయి. విశ్వనాథవారు వీటిలో ఒకటైన వేఁగి క్షేత్రము ప్రాధాన్యతని చాలా సహజధోరణిలో వర్ణించారు. ఇక్కడ విశ్వనాథ ప్రాంతారాధనతత్వం కనిపిస్తుంది. తెలుగువారి కట్టుబాట్లు, సంప్రదాయాలు, ఆటపాటలు మొదలైనవాటిని చెపుతూ కవి తెలుగుప్రజల పూర్వవైభవాన్ని గుర్తుచేస్తాడు.

నాగుల చవితినాడు శౌర్యపు పాయసాలను ఏ రాజు ఇక్కడ పంచాడోనని, ఎఱ్ఱటి సంజలో పల్లవరాజరమణులు కాళ్ళకు పారాణి పెట్టుకున్నారోనని, చిత్రరథస్వామి శ్రీరథోత్సవములో తెలుగు పిల్లలు కత్తితిప్పుతూ యుద్ధ విద్యలను నేర్చుకున్నారోనని కవి చెపుతారు.

"వేఁగిరాజ్యపు పల్లెవీధులఁ జెడుగుళ్ళ రిపులఁ గవ్వించు నేరువులు తెలిసి", అంటూ తెలుగుబాలలు చిన్ననాటి నుంచే ఆటపాటలలో శత్రువులను ఎలా ఎదుర్కోవాలో నేర్చుకున్నారని విశ్వనాథ వివరిస్తారు. గోటీబిళ్ళ ఆడుతూ శత్రువుల శిరస్సులతో ఎలా బంతులాడాలో నేర్చుకున్నారని, ఉప్పు తెచ్చుట అనే ఆట ఆడుతూ శత్రువుల వ్యూహాలను ఎలా ఛేదించాలో తెలుసుకున్నారని, కోతికొమ్మచ్చిలు ఆడుతూ కోటగోడలని ఎగబాకటంలో నేర్పరులయ్యారని కవి వెల్లడిస్తున్నారు.

తెలుగుతల్లులు శౌర్యరసాన్ని ఉగ్గుపాలతో రంగరించి 'బొడ్డుకోయని కూనకే పోయిదురట' అనటంతో తెలుగు బాలలు పుట్టుకనించే శౌర్యవంతులని, పరాక్రమవంతులని భావం స్ఫురిస్తోంది.

తెలుగు నేల రత్నగర్భవంటిదని, ఇక్కడ ఏ ప్రాంతంలో తవ్వినా బంగారమేనని కవి వర్ణిస్తారు. ఏ దివ్య పురుషులో పచ్చికపట్టుతో నిండిన ఈ భూభాగాన్ని సృజించారని, ఏ అప్సరసలో ఇక్కడి గాలిలో గీతిసముదయంబు నింపారని, ఏ దివ్యశిల్పులో రోదసీ కుహరాన ఇన్ని దివ్యశిల్పాలను సృష్టించారని, ఈ మార్గంలో పురాణమునీంద్ర సంతతులు ప్రశంసలు చేసారని కవి వేఁగి క్షేత్ర ప్రాశస్త్యాన్ని పరిపరి విధాలుగా వర్ణిస్తారు. శ్రీకాకుళం నుంచి ఈ ప్రాంతం వరకూ గల 'ఆంధ్ర పూర్వ రాజ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలో చలించిపోవు' అని వివరిస్తూ ఎన్ని జన్మలకైనా తన శరీరంలో ఆంధ్రరక్తమే ప్రవహించాలన్న ఆకాంక్షని వ్యక్తం చేస్తారు.

ఈ ఖండికలో విశ్వనాథవారి కాల్పనికవాదదృక్పథం కనిపిస్తుంది. పల్లీయుల జీవితాన్ని చిత్రించటం, పూర్వ చరిత్రను సంస్మరించుకోవటం, ప్రజాజీవితాన్ని కావ్యవస్తువుగా స్వీకరించటం విషయంలో కాల్పనికవాద లక్షణాలు ప్రస్ఫుటంగా గోచరిస్తున్నాయి. ఆంధ్రాభిమానాన్ని వెల్లడించే ఈ కావ్యంలో విశ్వనాథ చరిత్ర, సంస్కృతి, క్రీడా వినోదాలు, క్షేత్ర మహిమ మొదలైన అనేక అంశాలను కూడా కలిపి ఒక నూతనత్వాన్ని, ఆకర్షణని సాధించారు. ఆంగ్లసాహిత్యంలో బైరన్ కవి రచించిన 'ఛైల్డ్ హారాల్డ్స్ పిలిగ్రిమేజ్' కావ్యంలో ఈ విధంగా క్షేత్ర ప్రశస్తి, చారిత్రక స్థలాల వర్ణన కన్పిస్తుంది.[3] విశ్వనాథవారి 'ఆంధ్రపౌరుషములో కూడా ఆంధ్రజాత్యభిమానము వెల్లివిరిసింది. ఆంధ్రయువకుల పౌరుషం, పరాక్రమాలు ఈ కవిని కదిలించాయి.

నిజానికి రాయప్రోలు వారిలో ఆంధ్రరాష్ట్రోద్యమ కవిత్వము, రాష్ట్రారాధన కవిత్వము ఆకృతి దాల్చగా విశ్వనాథ, తుమ్మల, కొడాలి మొదలైనవారితో నిండుతనాన్ని సంతరించుకుంది.

ముఖలింగము గంజాం మండలంలోని ఒక మహాక్షేత్రము. కళింగగంగులకు రాజధాని అయిన ఈ ప్రాంతంలో రాజులు శివాలయాన్ని ప్రతిష్ఠించారు. ఒకనాడు ఆ ప్రాంతం 'నిశితానురాగమగు కళాశిల్పములను విద్యలను' పోషించింది. అటువంటిది ఈనాడు 'ఆ దేవదేవు దేవాలయంబున నేఁడు గబ్బిలంబులు తిరుగాడఁజొచ్చె' అని విశ్వనాథ దుఃఖిస్తారు. దేవాలయ ద్వారబంధాలపై వ్రాయబడిన తొలి తెలుగులిపిని పోల్చుకుని కూడబలుక్కొని చదివిన కవికి తన 'మహామాతృదేశ బద్ధానురాగులెవరో గుండెనెత్తురులు కదిపినట్లు' అనిపించిందట. ఆ ప్రాంతాన్ని సందర్శించటం విశ్వనాథకు ఎంతో భావోద్వేగాన్ని కల్గించింది. "ఏ పరజన్మలోఁ గలసి యే మొక తల్లియు బిడ్డయైతిమో నా పయి నీ ధరాస్థలికి నాటిన ప్రేమయదెంతయోకదా" అని భావిస్తారు.

తన జాతి పూర్వప్రథా జీవరహితమై శక్తినాడులలో చచ్చిపోయిందని, తన మాతృభూమి బ్రహ్మ క్షేత్రకాతేజంబు మంటగలిసిందని, తన మాతృభాష నానా దుష్టభాషల వల్ల పూర్వ ఔన్నత్యాన్ని పోగొట్టుకుందని, తన 'తల్లినేల నే నాఁటి వాచరముల్ మెఱుంగులు చూచి భ్రమసిపోయిందని' చెపుతూ శోకిస్తారు. విశ్వనాథవారికి స్వీయ సంస్కృతి అన్నా, భాష అన్నా, చరిత్ర అన్నా చాలా గౌరవం. దాస్యం కారణంగా తన మాతృభూమి సర్వాన్నీ పోగొట్టుకుందని కవి వివరిస్తున్నారు.

'అస్వతంత్ర్యతా నియతమైన యీ బ్రతుకును తెన్గువారు భరించలేరు'... అని కవి ప్రకటిస్తారు.

> *"పాడిన గీతమే మఱలఁ బాడెదఁ గూడిన భావమే మఱిం*
> *గూడెద నేమి సేయవలె గుండియ శోషిలి దుఃఖ వేదనన్*
> *గాడిన నా హృదంతరముఖంబున మా తొలినాఁటి కీర్తి రా*
> *పాడిన నాదు వాక్కు తెగఁబాఱదు నూత్నపథాల వెంబడిన్"*

సున్నితమైన కవి హృదయం వర్తమాన పరిస్థితులను చూసి ద్రవించి పై విధంగా అభిప్రాయాలను వ్యక్తీకరించింది.

తెలుగులో ఆదికవి నన్నయభట్టారకుడు భారతరచనకు ఉపక్రమించిన ఉజ్వల ఘట్టాన్ని విశ్వనాథ రమణీయ కవితా శిల్పంగా తీర్చిదిద్దారు. రాజమహేంద్రవరంలో ఒకనాడు సైన్యాధిపతులు, సచివులు సభలో ఉన్నతమైన పీఠాలపై ఆసీనులై ఉంటారు. 'అజానులంబ మానాంభోజనాళ బాహాదండముల నందమైన వాని' వచ్చుకవి నన్నయభట్టుని సచివాదులు నమస్కరించి ఆహ్వానిస్తారు. సముచిత ఆసనంపై శబ్దశాసనుడు ఉదయశిఖరిపై మార్తాండునిలా ఆసీనులవుతారు. రాజరాజ కొలువులోని పండితులందరూ వేద వేదాంగ విద్యావేత్తలు, సకల శాస్త్రాలకు మూలకంబములు. వారిలో 'అఖిలభాషా, కవితాధినాధుండు నారాయణభట్టు', 'గణితశాస్త్రాంబోధి ఘనుఁ

డాతఁడే పావులూరి మల్లన'ల గురించి విశ్వనాథ చెపుతారు. భారత రచనలో నన్నయకు నారాయణభట్టు చేదోడువాదోడుగా నిలిచారు. వారినందరినీ చూసి నన్నపార్యుడు మందహాసం చేస్తాడు.

వందిమాగధులు జయకుండవాంబాప్రజా! జయ మార్తాండ! త్రిభువనాంకుశ! జయశ్రీ మనోజ్ఞ అంటూ జయజయధ్వానాలు చేస్తూ ఉండగా ఉత్తమ చాణుక్యుడు రాజరాజ నరేంద్ర నృపాలుడు 'సకల ఋషిసేవ్యుడగు శచీజానివోలె ప్రౌఢి మెఱసె చింతామణీ భద్రపీఠి' అని విశ్వనాథ ఆనాటి వైభవాన్ని సాక్షాత్కరింపచేసారు.

రాజరాజు సర్వకవితాధిపుడైన నన్నయని భారత రచన చేయమని కోరతాడు. ఈ సందర్భంగా విశ్వనాథ ఆంధ్ర మహాభారతంలోని 'ఇవి యేనును సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండు' అనే పద్యాన్ని అలానే 'హిమకరుదొట్టి పూరుభరతేశ కురుప్రభు పాండు భూపతుల్' అనే మరో పద్యాన్ని యథాతథంగా ప్రయోగించారు. వీటివల్ల ప్రస్తుత కవితాఖండికను చదువుతున్నవారు నన్నయ కవితా మాధుర్యాన్ని కూడా ఆస్వాదించగలుగుతారు.

"ధారుణి నీకు మిన్న కవితా నవపట్టము కట్టుకొన్నవారే?" అని రాజు నన్నయను ఉద్దేశించి అంటారు. నన్నయ ఎంతో వినయంగా ప్రభువు కోర్కెను తీరుస్తానని బదులిస్తాడు. నన్నయ ఆంధ్ర మహాభారత సంహితా రచన ప్రారంభించిన ఆ శుభ ఘడియలలో సర్వదేవతలు ప్రీతిచెంది పుష్పవృష్టి కురిపిస్తారు.

> *"శ్రీవాణీగిరిజాశ్చిరాయ" యను నాశీః పూర్వకారంభ వా*
> *ణీవైదగ్ధ్యమునందు మ్రోగినది తంత్రీనిస్వనం బొందు గీ*
> *తావర్యాపగలోని భంగములయం దావృత్తులం జూపి గీ*
> *తా వేశంబునఁ దెన్గునేల తనుదానై ముక్తిచూఱాడగన్.*

కాకతి బేతరాజునకు ప్రోలరాజు కుమారుడు. రాజ్యతంత్రంలో ఆరితేరిన మహాయోధుని గురించి విశ్వనాథ ఒక కవితాఖండికను రచించారు. ఆ కాలంలో శక యవన, హూణుల దాడులు ఎక్కువగా జరిగేవి. తెలుగు రాజులందరూ ఐకమత్యంతో ఉండి, తమ సైన్యాలతో ఉమ్మడిగా యుద్ధం చేసిన బాగుండునని ప్రోలరాజు భావన. దీనికోసం ప్రోలరాజు సభ చేస్తాడు. ఈ సభను భగ్నపరచిన గుండరాజు అనే వాని శిరస్సు తెచ్చి ప్రోలరాజు తన కోటగుమ్మానికి వేలాడగడతాడు.

హన్మకొండ నగరంలో ఒక క్షత్రియోత్తముడు ఒక సాయం సంధ్యాసమయంలో చింతాక్రాంతుడై 'ఔరా! గుండరాజెంత యాటాడెను' అని ఆలోచిస్తుంటాడు. 'తెలుగు చాణుక్య రాజుల ప్రతిష్ఠలతో సరిగాఁ గ వారి దోర్బలమును సన్నగిల్లినది' అని ప్రోలరాజు వాపోతాడు. ఉత్తర భూములలో యవన, హూణులు మందలుగా చెలరేగి దండెత్తుతున్నారని, నేడు ఇక్కడ వారిని ఎదుర్కోగల వారెవ్వరని తలపోస్తాడు. "కాలహరణం బొనరింపమి యేల యౌను, చే గాలిన వెన్క నాకులని గంతులు వైచుట పాడిలేమికిన్" అని తక్షణమే శత్రువులని ఎదుర్కోవాలని లేని పక్షంలో సూర్యవంశరాజులకు అపకీర్తి వస్తుందని అనుకుంటాడు.

గుండరాజు ఆలోచనలు సాగనివ్వకూడదని ఆత్మాభిమానంతో ప్రోలరాజు నిశ్చయించుకుంటాడు.

*తన శౌర్యం బది యెంత? రాజుల సభన్ దానెంత? యెంతెంత యో*
*చనకున్ బారలు చాచె? తద్విపుల వక్షంబున్ ప్రభేదింపకుం*
*డిన శ్రీ కాకతిదేవి పాదములంయందే మోపలే దీ శిర*
*స్సును, ఊపే శుభలగ్న మాంధ్ర విషయేంశు డెవ్వఁడో, తేల్చెదన్*

కాకతీయ నవరాజ్య నిర్మాణానికి కంకణం కట్టుకున్న ప్రోలరాజు ఆ ఉద్రేకము చేత అంగములు ఉష్ణంబులై చంద్రోదయం తర్వాత సౌఖ్యం పొందుతాడు.

ఈ విధంగా విశ్వనాథవారు ప్రోలరాజు దేశభక్తిని, యుద్ధ తంత్రశక్తిని, ఆలోచనలని తన కవిత ద్వారా వెల్లడించారు. ఈ కవిత చక్కని నాటకీయతతో ఉండి చదువరులని అలరిస్తుంది. ప్రోలరాజు చేసిన సంభాషణలు, స్వగతాలు, దీర్ఘాలోచనలు దీనిలో కనిపిస్తాయి.

విశ్వనాథ మరో కవిత 'ప్రోలరాజువధ' ఆ రాజు గురించి వివరిస్తుంది. ప్రోలరాజు కొడుకు మొదటి ప్రతాపరుద్రుడు. ఇతను వీరశైవములో చాలా తీక్షణస్వభావుడై ఉండెను. ఇతని కాలములో కాకతీయ రాజ్యము మహోన్నత స్థానము పొందెను. ఇతను శివాయతనంబున ధ్యానమగ్నుడై ఈ విధంగా అన్నాడు.

*చెడుతలఁపుల్ ఫలించె శశిశేఖర! వేదములెల్ల మిధ్య టే*
*మృడ! నిగమాంత గోచరుఁ డు వీ వొకరుండవ, యెంతమంది యే*
*ర్పడిరి మతప్రవక్తలు శివా! ఋతమార్గము పొంత వోవఁ డొ*
*క్కఁడు, నిఁక నేమి కావలె నకాలపు మౌనము నీక యబ్బెపో!*

ప్రోలరాజు ఆ సమయంలో శివ సాన్నిధ్యము చేరబోవగా ఉత్తరీయపు కొనలు జీరాడ, 'తద్వస్త్ర విస్ఫారీ భూత సమీరస హతులఁ గోపజ్వాల పేర్చున్ మహాక్రూరాభ్యుత్థిత తెలిహాస మన సంరూఢోగ్ర రోషాత్ముడై' అని విశ్వనాథ కథనం. అయితే ప్రతాపరుద్రుడు "హుతాశన దృజ్మృతంబుపైఁ పగ గల యెవ్వడో దనుముట్టవచ్చెనని, యాగ్రహా ఘూర్ణితలా కాక్షుఁడై" భగభగ మండిపోయి కోపావేశంతో పితృవక్షాన బాకుతో గుచ్చుతాడు.

పితృహంతకుడైన ప్రతాపరుద్రుడు తన అకారణ కోపపావకోజ్వల పరిణామాలను తెలుసుకుంటాడు. తల తిరగగా తండ్రి పాదాల వద్ద పడి రోదిస్తాడు. విషయం గ్రహించి వృధానితాంత పరిదేవనం బొనరిస్తాడు. 'నీ బాహాధనురగ్రయాయులయి తండ్రీ!' అని శోకిస్తూ "నా బాకు కట్టాబాధంబుగ నాటి నీ యెదద ఘంటా మార్గముల్ శత్రురాట్ప్రా బల్యంబులనింకఁ గట్టుపడవో రాజన్య చూడామణీ" అని పరిపరి విధాలుగా చెపుతాడు. తండ్రి రుధిరంతో తన చేతులు తడిసాయని, తాను ఇంక రాజ్యపాలన చేయలేనని విలపిస్తాడు. లక్ష్మీదేవివంటి తన తల్లి శోకామంగళమూర్తిని ఇంక ఏ విధంగా చూస్తానని తల్లడిల్లుతాడు. తాను మహాపాపం

చేశానని, వధ్యస్థానయోగ్యుడనని భావిస్తాడు. తను చేసిన మహాపాపానికి ప్రళయ పావకకీలలు తనను మింగివేస్తాయని ఎంతో ఆవేదనతో పశ్చాత్తాప హృదయంతో చెపుతాడు.

శోకావేశాన్ని తట్టుకోలేక మూర్ఛిల్లిన ప్రతాపరుద్రుడిని అమాత్యులు ఓదారుస్తారు. మహారాజు భౌతికకాయానికి దహన సంస్కారాలు చేస్తారు.

ఆయా సన్నివేశాలని వర్ణిస్తున్నప్పుడు విశ్వనాథ ఇతరులకి ఏ మాత్రం సాధ్యంకాని రీతిలో, తన లేఖినితో ఇంద్రజాలం చేసారు. ఈ విభాగంలో తండ్రి మరణానికి శోకించిన ప్రతాపరుద్రుని భావోద్వేగాలని స్మృతి కావ్య లక్షణాలతో విశ్వనాథ రచించారు.

'కొండవీటి పొగమబ్బులు అనే ఖండికలో విశ్వనాథ ఒకనాటి ఆ ప్రాంత వైభవాన్ని స్మరిస్తారు. దువ్వూరి రామిరెడ్డిగారు కూడా కొండవీడు అనే పేరుతో రాసిన పద్యాలలో గతవైభవాన్ని, ప్రస్తుత దుస్థితిని స్మరించారు.[(4)]. రెడ్డిరాజులు కొండవీడు రాజధానిగా పాలించారు.

ఒకసారి వలిపమ్ము చికిలి ముత్యాల యం
 చుల వోలిక నుపత్యకలఁ జరించు
ఒకసారి జఘనభాగోపరిస్రస్త చే
 ల విధాన గిరి మొదళ్ళఁ బడిపోవు
ఒకసారి గిరిలక్ష్మి మొదముపై మొగలి పు
 ప్పొ ఱ్ఱూఁ దు కొన్నట్లు చెల్లరేఁగు
ఒకసారి స్వేద బిందుకములు రత్యంత
 వేళా కుచావృత్తి విస్తరించు

ఉజ్వలమైన కొండవీటి సామ్రాజ్య వైభవం ఈనాడు అంతరించిపోవటం విశ్వనాథకు తీరని దుఃఖాన్ని కలిగిస్తుంది. కొండవీటి ప్రాభవం పలుచబడి, విశీర్ణమై, ధూతమై, తడిసి రాచసిరి సర్వం ఉడిగిపోయి దుర్గం శిథిలావస్థకి చేరిందని కవి బాధపడతారు. ఒకనాడు రాజులు కొలువు తీరినచోట, రాచకన్నెలు తిరిగిన చోట యదేచ్ఛగా సంచరించవచ్చని, రమ్మని పొగమబ్బులని పిలుస్తాడు.

ఈ పొగమబ్బు పురాతనమైన రెడ్ల ఆంధ్ర ప్రశస్తిని త్రవ్వుచున్నదని చెపుతారు. "పిచ్చి పొగమబ్బులార! కోపించిరేని చెడ్డవారు సుమీ" అంటూ అద్దంకి రెడ్లు అడ్డంకి లేని వారని, 'మిమ్ము చించి, ఱొమ్ము తాఁచి చెండాడిపోదుర' ని పొగమబ్బులను ఉద్దేశించి అంటారు.

శ్రీనాథుని, ఎఱ్ఱాప్రెగడను కవి తన గేయంలో స్మరిస్తారు. వైశ్యకులంలో శ్రేష్ఠుడైన అవచి తిప్పయ్య చెట్టి గురించి కూడా ప్రస్తావిస్తారు. కొండవీటి పొలాలను వీడలేక ఆశగా తిరిగే ప్రేతాత్మల లాగా వారంతా ఈ విధంగా పొగమబ్బులై భ్రమిస్తున్నారేమోనని అంటారు. తిరిగి "నా ప్రాణములకును నీ పొగమబ్బుల కేమి సంబంధమో!" అని

విస్మయం ప్రకటిస్తారు. తాను గూడా ఏదో నాడు పొగమబ్బు అయి కొండ చిగురు కోసమలపైన, బురుజుల పైనా వ్రాలిపోనో, మధ్య వ్రాలిపోనో, నేల రాలిపోనో, గాలి తేలిపోనో అని తన్మయత్వంతో, తాత్వికతతో మాట్లాడతారు.[5]

'చంద్రవంక యుద్ధము' అనే ఖండికలో కవి పల్నాటి చరిత్రలోని ఒక అంశాన్ని గురించి వివరిస్తారు. పల్నాటికి రాజు అనుగురాజు. అతని మంత్రి దొడ్డనాయనికి బాదన్న, బ్రహ్మనాయుడు కొడుకులు. బాదన్నకు పెద్దన్న అని కూడా పేరు. బాదన్నను అనుగురాజు పెంచుకున్నాడు. బ్రహ్మనాయుడుకి బాదన్ననలరాజునకు మామా అల్లుళ్ళ వరుసలు.

ఒకనాడు బ్రహ్మనాయుడు నిలువుటద్దం ముందు నిలుచుని తిరుచూర్ణాన్ని దిద్దుకుంటూ ఉంటాడు. 'నిలువుటద్దాన ధగధగ్గై నిగనిగ్గై నిమేషపరికల్పితోద్దీప్తి మెఱుపు' చూసి తన కొడుకైన కన్నమదాసుని ఎవరో ద్వంద్వయుద్ధం చేస్తున్నారు, చూసి రమ్మని బ్రహ్మనాయుడు పంపుతాడు. అతడు వెళ్ళి వచ్చి బాదనాయుడు, నలరాజు గుఱ్ఱాలపై పోరాడుతున్నారని చెపుతాడు. వారిరువురూ ఎంత వారించినా వినక యుద్ధం చేస్తూనే ఉంటారు. అల్లుడా? ఆగ రాదయ్యా అంటే రాచబిడ్డ నలరాజు "మామా! నా కత్తి యొఱవీడి మఱలిపోదు బలి యెఱుంగక" అంటాడు. సవరాల గోడిగ, కారుబొల్లడు అనే గుఱ్ఱాలపై ఉండి వారిరువురూ యుద్ధం చేస్తారు. బ్రహ్మనాయుడు తన సేవకునితో అరటిగడ్డలు, దవ్వలు తెమ్మని ఆనతిస్తాడు. వాటిని భూమిపై పాతి 'అల్లుడా నీ కత్తికి వీటిని బలివేయమని' నలరాజుతో అంటాడు. పెద్దవారుండగా ముందు నేను వేయనని రాచమల్లు (నలరాజు) అంటే, బ్రహ్మనాయుడు అన్నా నీవు బలివేయమని బాదనాయునితో అంటాడు. బ్రహ్మనాయుని పేరిటి బాదనాయుడు అరటి దవ్వలనన్నింటినీ తరిగివేస్తాడు. ఒక అరటి దవ్వపై నలరాజు తనకత్తి సూర్యభేతాళాన్ని విసరగా అది తునాతునకలవుతుంది.

సూర్య భేతాళమ్ము క్షోణిలో పిడిదాక
దిగఁ బడి, బాదన్న మొగము చివర
యెఱ్ఱనై పండిన యెఱుపు రేకలు తీర్చె,
బ్రహ్మనాయుఁ డు మోము వాల్చుకొనియె

రాచమల్లు బ్రహ్మన్నను చూసి 'మామ! భేతాళమ్ము మహిలోన దిగఁ బడె కొంచెము తీసిపెట్టంచు' అడుగుతాడు. రాచవారి కత్తులు రాచవారికే తప్ప అన్యులకి తీయటానికి రావని బ్రహ్మనాయుడు బదులిస్తాడు. నలరాజు గుఱ్ఱాన్ని ఆపి కత్తి పిడి ఎడమకాలితో లాగుతాడు. వెంటనే చంద్ర వంక పచ్చ పెళ్ళలు పెళ్ళలుగా అచ్చులు అచ్చులుగా భూభాగమంతా పగిలి బయటికి వస్తుంది. రాజులందరూ ఎవరివంక ఎవరూ చూడకుండా వెళ్ళిపోతారు.

ఈ విధంగా విశ్వనాథ ఆనాటి పల్నాటి వీరుల శౌర్యం గురించి వర్ణించారు. మనకు ఈనాడు నమ్మశక్యంగా లేకపోయినా తెలుగు వీరుల పరాక్రమం, రణప్రీతి, పట్టుదలలు ఒకనాడు ఆ విధంగా ఉండేవి.

'యమదంష్ట్రిక' అనే ఖండికలో విశ్వనాథ అళియరామరాయలు ఉత్సాహశక్తి గురించి వర్ణించారు. ఇతను ఒకసారి కళ్యాణిదుర్గాన్ని ముట్టడించినపుడు జరిగిన సంగతులను దీనిలో కవి వివరించారు. ఈ మహావీరుని కాలంలో తెలుగువారు తళ్ళికోట యుద్ధంలో ఓడిపోవటం ఒక చిత్రం.

'నెలనాళ్ళయినది కోట పట్టుబడనేలేదు' అన్న మొదటి వాక్యం రామరాయలు-కి నిశ్చయించుకున్న కార్యాన్ని సాధించిన దాకా అన్నపానీయాలు సహించవని చెపుతున్నాయి. తెలుగు సైనికులు కోట చుట్టూ ముసిరి, బురుజులమీదకు నిచ్చెనలు ఎత్తుతారు. లోపలికి వెళ్ళిన రాజు సకల దిశలవేపూ పరిశీలనగా చూస్తాడు. 'మృత్యు దేవత చాచి మెఱపించు నాలుక పోలిక కోట తల్పులను' రాజు చూస్తాడు. కోటగోడ అతనికి శత్రువులకు మధ్య రక్షోమూర్తిలాగా ఉందని భావిస్తాడు.

చూచి యేఁ మార్గమును గూడఁదో చరామి
పరమ సాహసియో ధరఫాలమౌళి
పార్శ్వమున వ్రేలు తన కఱవాల మొఱను
దూసి కోటలోపలఁ బాఱవేసి విసిరి

రామరాయలు ఎంతో సాహసంగా చేసిన ఈ పనితో సైన్యాలు నివ్వెరపోయి నిలుస్తాయి. దండనాయకులు ప్రతిమలై నిలుస్తారు. కోటలోపలి శత్రుసైన్యాలు పై నుంచి ఏదో పడటం, అది మెరవటం గమనించి నిశ్చేష్టులవుతారు.

రామరాయలు తన సైన్యాన్ని ఉద్దేశించి 'అదె యమదంష్ట్రిక శత్రుల సదనంబున బోయి వ్రాలె' అని గంభీరంగా ప్రసంగిస్తారు. సైనికులలో ఎవరైతే సాహసులో వారు కదలాలని, వారి ప్రతాపాగ్నిలో శత్రువులను దహించివేయాలని పిలుపునిస్తాడు. ఈ ప్రసంగంతో స్ఫూర్తిచెంది ఒక నాయకుడు రాయలుతో కళ్యాణదుర్గాన్ని మాత్రమే కాదు త్రిలోకాలనైనా జయిస్తానని పౌరుషంగా అంటాడు.

తెలుగుసేన గుడారాలు వేసుకొని ఓపికగా తగిన అవకాశం కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. రాత్రి బాగా పోయాక చంద్రబింబం అస్తమించిన తర్వాత కాగడాల వెలుగులో కోటగోడల వద్ద కొందరు చేరతారు. ఏనుగులతో గుద్దించటంవల్ల కోట తలుపులు విరిగిపోతాయి. నిద్రిస్తున్న శత్రుసైనికులు ఆయుధాలని అందుకునే వ్యవధి లేక సతమతమవుతారు. తెలుగువీరులు ఎక్కడి వారిని అక్కడే చంపి బురుజుల పైకి ఎగబ్రాకి చివరకు కోటను స్వాధీనపర్చుకుంటారు.

కోట యెల్లడ తామయై ఘూర్ణమాన
వారిరాశి విధంబున వఱలునంత
ఉదయ పర్వత శిఖర సానూపలుములు
ధగధగని ప్రజ్వరిల్లె మార్తాండరోచి

మరునాడు రాయలు సభచేసి 'యమదంష్ట్రి'ని తెచ్చి ఇచ్చిన సైనికుని అభినందిస్తూ, కోటను స్వాధీనపర్చుకున్నందుకు ఎంతో గర్విస్తాడు. మహారాజు కూడా ఈ విజయానికి దేహం తోటి స్వర్గప్రాప్తి పొందినట్లుగా సంతోషిస్తాడు. 'కోటి కోలాహల రామనాయక బలా! అని బిరుదులిచ్చి రాయలుని గౌరవిస్తాడు.

విశ్వనాథ సత్యనారాయణ ఈ ప్రకారంగా ఆంధ్ర చరిత్రలోని కొందరు యోధుల గురించి వివరించాడు. వీరరసాన్ని చాలా చక్కగా ఇక్కడ పోషించారు.

ఆంధ్ర ప్రశస్తి తెలుగువారి పూర్వ వైభవాన్ని సాక్షాత్కరింపచేసే ఒక గొప్ప కావ్యం. సాహితీ కేదారంలో ఇది ఒక అపురూపమైన వృక్షంలా మిగిలిపోతుంది. విశ్వనాథ వారి కవితా కిరీటంలో ఇది ఒక తురాయివంటిది. ఆంధ్రప్రశస్తి కావ్యం ఎన్నటికీ, ఎప్పటికీ ఆంధ్రుల వారసత్వసంపద.

## వివరణలు:

1. శ్రీకృష్ణదేవరాయలు అముక్తమాల్యదలో 'శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్ర మధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామంబున' స్వప్నమున తెనుఁగు వల్లభరాయని వర్ణించాడు. ఆ ప్రభువు ఈ విధంగా రాయలుని ఆదేశించాడు:

   మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
   రచన మెప్పించికొంటి గీర్వాణభాష,
   నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
   కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁ గ.

2. విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షంలోని బాలకాండ – ఇష్టిఖండంలో ఈ విధంగా ఉంది.

   ఆత్మజుఁడన్న తీయఁదనం బెఱుంగని చిత్తంబు ఔరూపు చేఁదుకట్టె
   ప్రియసుతుఁడన్న జాబిల్లిఁ జూడని కన్నులవి యప్రసన్నతాంధ్యంపు గూండ్లు
   కొడుకన్న చిన్నారి పడవ చేరనివాని బ్రతుకు ఝుంఝూమరు త్ప్రళయవీధి
   కొమరుఁడవ్ పుణ్యకర్మముఁ గాంచనేరని కట్టిఁడి పున్నరకంపుఁ ద్రోవ.

3. లార్డ్ బైరన్ లండన్ నగరంలో జనవరి, 1788లో జన్మించాడు. ట్రినిటీ కాలేజ్‌లో విద్యాభ్యాసం. ఛైల్డ్ హారాల్డ్స్ పిలిగ్రిమేజ్ మొత్తం నాలుగు కాండలుగా విభజించబడింది. దీనిలోని ఛైల్డ్ బైరన్ కవే. 1824లో బైరన్ కవి శాశ్వతంగా నిద్రించారు.

   రోమ్ నగరాన్ని దర్శించిన ఛైల్డ్ ఆ శిధిలాలని చూసి ఎవరో యోధుడు ప్రేక్షకుల్ని ఆనందింపచేస్తూ తన జీవితాన్ని బలి చేసాడోనని భావిస్తాడు.

   *'Butcher'd to make a Roman holiday'* (Canto - IV. CXLI)

4. దువ్వూరి రామిరెడ్డిగారు 'కొండవీడు' అనే శీర్షికతో రాసిన పద్యాలలో ఈ విధంగా అంటారు.

"దురమందున్ మెఱుపట్లు శోభిలిన కత్తుల్ నేడు రూపాంతర స్ఫురణన్ సీరములందుఁ గఱ్ఱులగ నేపున్ సొంపు వోనాడి యీ ధరణీగర్భము జీల్చుచున్నవి – ".

5. బైరన్ కవి 'ద టియర్' అనే గేయంలో ఇటువంటి భావాలనే ఈ విధంగా చెప్పాడు.

*When my soul wings her flight*
*To the regions of night*
*And my corpse shall recline on its bier*
*As ye pass by the tomb*
*Where my ashes consume*
*Oh! moisten their dust with a tear.*

# కాసుల పురుషోత్తం కవి

శ్రీకాసుల పురుషోత్తం కవి దేవరకోట ప్రభువైన రాజా అంకినీడు ప్రభువుల ఆస్థానకవి. రమణమాంబ, అప్పలరాజులు వీరికి జన్మనిచ్చిన పుణ్యదంపతులు. అద్దంకి తిరుమలాచార్యులు వీరికి గురువు. ఈ కవి మహాభక్తుడై ఆంధ్రనాయక శతకము, వేణుగోపాల శతకము లాంటి మనోహర శతకాల్ని రచించాడు. సరళమైన భాష, మృదుమధురమైన భావం వీరి కవితలోని ముఖ్యలక్షణం. పురుషోత్తమకవి కావ్యజ్ఞత, రసజ్ఞత, తత్వజ్ఞతలను సంపూర్ణంగా తెలుసుకున్న పండితుడు.

ఆంధ్రసాహితీ చరిత్రలో మహాకావ్యం రచించకపోయినా కేవలం తన శతక రచన ద్వారానే మహాకవీంద్రుల స్థాయికి చేరిన వారిలో ధూర్జటి తర్వాత ఈ కవి పేరే వినిపిస్తుంది. పోతన భాగవత రచన చేయకపోతే ఆ మహాకావ్యాన్ని తెనిగించగల ప్రతిభావంతుడు పురుషోత్తం కవి తప్ప అన్యులు కారని తిరుపతి వేంకటకవులు వివరించారు. ఆంధ్రనాయక శతకాన్ని అలవోకగా రచించిన వీరి ప్రతిభ పోతన, శ్రీనాథుడు లాంటి వ్యక్తులతో పోల్చదగినది అని పలువురు పండితులు చెపుతారు. కాసులవారు మనసా హరి 'పాదములాశ్రయింపవే' అనే మకుటంలో ఒక శతకాన్ని 'భక్త కల్పద్రుమా' అనే మకుటంతో వేరొక శతకాన్ని కూడా రచించారు. తెలుగు సాహిత్యంలో శతక ప్రక్రియ వీరి చేతుల్లో పరిపుష్టమైంది.

తెలుగులో అనేక శతకాలు ఉన్నాయి. వేమన, సుమతీ, దాశరథీ, భాస్కర, శ్రీకాళహస్తీశ్వర లాంటి శతకాల్లోని పద్యాలు తెలుగు ప్రజలకు ఈనాటికీ జ్ఞానబోధ కలిగిస్తున్నాయి. పండిత పామరులందరికీ ఈ పద్యాలు నోటిలో ఆడుతున్నాయంటే వీటి శక్తి అర్థమవుతోంది. లోకాచరణ మార్గాన్ని, విజ్ఞానాన్ని అందించటంలో శతకసాహిత్యం విజయం పొందింది. అయితే ఆంధ్రనాయక శతకంలో సీస పద్యాల ద్వారా కాసులకవి శ్రీ మహావిష్ణువు అనంత వైభవ ప్రాభవాదుల్ని వర్ణించారు. సర్వాంతర్యామి శ్రీమన్నారాయణుని లీలలను, పురాణ విషయాలను ఈ కవి చాలా చక్కగా చిత్రించారు.

కాసుల కవితా వైభవం పండిత, పామర, బడుగు వర్గాల వారందర్నీ ఉర్రూతలూగించింది. గీత కార్మికుడు ఆంధ్రనాయక శతకములోని పద్యాల్ని లయబద్ధంగా, మధురాతిమధురంగా గానంచేయటాన్ని విని పురుషోత్తమ కవి తనకు రాజుగారు బహూకరించిన రత్నాల హారాన్ని ఆ కార్మికుని మెడలో వేసి తన కవిత్వం సార్థకమైందని సంతోషించారని ప్రతీతి.

పురుషోత్తమ కవి పురుషోత్తముడైన నారాయణుని వర్ణించి, తాను తరించటమే కాక పాతకులని కూడా తరింపచేసారు.

# 16. శ్రీ ఆంధ్రనాయక ప్రశస్తి - శతక సాహిత్యమర్మాలు

శతక సాహిత్య ప్రక్రియ తెలుగులో చాలా పేరుపొందిన ప్రక్రియ. ఆదికవి నన్నయ తన భారతంలోనే మకుట సంప్రదాయాన్ని ప్రవేశపెట్టారు. ఎందరో కవులు అనంతర కాలంలో శతకాల్ని రచించారు. శతకంలో నూట ఎనిమిది పద్యాలు ఉండేటట్లుగా రాయటం ఒక పద్ధతి. తెలుగు శతక కవులు అందరూ మకుట నియమాన్ని పాటిస్తూ రచనలు చేసారు. వస్త్వైక్యం లేని కారణంగా వాటిలో రసపోషణకి అవకాశం లేదు అని భావించనవసరం లేదు. కవి ప్రతిభావంతుడైతే అతని చేతుల్లో ఏ ప్రక్రియ అయినా సర్వాంగసుందరంగా మలచబడుతుంది. నీతి, శృంగార, భక్తి, వైరాగ్య రసపరిపోషణ తెలుగు శతకాల్లో సంపూర్ణంగా ఉంది. విభిన్న అంశాలకు చెందినవైనప్పటికీ దాదాపుగా అన్ని శతకాలూ ఆత్మాశ్రయమైనవే. శతకంలోని పద్యాలు కవి స్వతంత్రాలు కాబట్టి వీటిని కొందరు ముక్తక కావ్యాలుగా పరిగణిస్తారు. కొన్ని శతకాల్లో దృశ్యకావ్య లక్షణాలు ఉన్నాయని కొందరు విమర్శకులు భావించారు.

ఎక్కువమంది తెలిసినవాళ్ళు చెప్పిన ప్రకారం శతక సాహిత్యంలో స్వీయ హృదయ వేదన, ఆత్మాశ్రయ భావ ప్రకటన, మకుటం, ప్రబోధాత్మక విషయాలు, దేనికదే విలక్షణమైన పద్యంగా ఉండటం మొదలైన లక్షణాలు కన్పిస్తాయి.

శతకాలను వాటిలోని వస్తువు ఆధారంగా అనేక విధాలుగా వర్గీకరించే వీలు ఉంది. భక్తిశతకాలు వీటిలో చాలా ముఖ్యమైనవి. వీటిలో తిరిగి శైవభక్తి శతకాలు, వైష్ణవ భక్తి శతకాలు, దేవీ భక్తి శతకాలు, ఇతర క్షేత్రాల్లోని దేవతలపై రాసిన శతకాలు మొదలైనవి ఉన్నాయి. కొందరు ప్రసిద్ధ వ్యక్తులపై కూడా తెలుగులో శతకాలు వచ్చాయి. భారతమాతను కీర్తిస్తూ దేశభక్తి ప్రబోధకమైన శతకాల్ని కూడా తెలుగు కవులు వెలువరించారు. వ్యాజస్తుతి శతకాలు, వేదాంతపరమైన శతకాలు, నీతి శతకాలు, అధిక్షేప శతకాలు, శృంగార శతకాలు, హాస్య శతకాలు, ప్రకీర్ణశతకాలు, కథాత్మక శతకాలు లాంటి విభిన్న శతకాలను తెలుగు సాహితీవేత్తలు రచించి, ఈ ప్రక్రియతో ప్రయోగాలు చేసారు. వీటన్నింటివల్లా తెలుగు సాహిత్యానికి ఒక నిండుదనం, ఒక ఆకర్షణ ఏర్పడ్డాయి.

శ్రీ ఆంధ్రనాయక శతకం వ్యాజస్తుతి ప్రధానమైన శతకరాజము. నిందచేత స్తుతిగానీ, స్తుతి చేత నిందగానీ వచ్చేటట్లు చెప్పితే అది వ్యాజస్తుతి అవుతుంది.(1)

ఈ శతకం నిండా ఎత్తిపొడుపులు, కమ్మనిహాస్యం, చిత్రవిచిత్ర సమాసాల పదగుంభనం, వక్రోక్తి కనిపిస్తాయి. ఇవన్నీ రసజ్ఞులకు మంచి విందు భోజనం సమకూరుస్తాయి.

పురుషోత్తమకవి వైష్ణవ మతానుయాయుడు కాబట్టి దశావతారాలను వినూత్న రీతిలో వర్ణించాడు. ఈ విధమైన వర్ణన శతకసాహిత్యంలో చాలా అరుదు. తెలుగు పలుకుబడి పరిపూర్ణంగా తెలుసుకొని, రచనలో ప్రయోగించిన వారిలో ఈ కవి అగ్రగణ్యుడు.

భక్తి శాఖలైన శాంత, దాస్య, వాత్సల్య, సఖ్య ఇత్యాదులన్నీ ఈ కావ్యంలో వివరించిన విధానం గొప్పది. ఈ వివరించటం కూడా కృత్రిమంగా కాకుండా చాలా శ్రద్ధగా, లీనమై చేసిన వివరణలాగా ఉంటుంది.

పూర్వగాథలను కూడా కవి సందర్భానుసారంగా ప్రస్తావించి పాఠకులని రంజింపచేసారు. విదురుని విందు, ప్రలంబాసురుని కథ, కుబ్జ వృత్తాంతం, బలరామావతార వృత్తాంతం, కాకాసుర వృత్తాంతం మొదలైన వాటికి కవి ఈ శతకంలో తగినచోట సముచితరీతిలో ప్రస్తావించారు. వీటివల్ల చదువుతున్నంతసేపు ఆయా వృత్తాంతాలు గుర్తుకువచ్చి వాటిలోని విషయం రసానుభూతిని కలిగిస్తుంది.

శబ్దార్థాలకు అన్వయం చేకూర్చి కాసులకవి వాటి ద్వారా తన శతకపద్యాలకు విశిష్టత కల్పించారు. చెవిలో పడ్డ వెంటనే శబ్దం దాని శ్రావ్యతవల్ల సుఖానుభూతి కలిగిస్తుంది. పద్యం వివరించే అర్థం మనసుకి హత్తుకొనిపోతుంది. ఈ విధంగా శబ్దార్థాలచే చిత్రవిచిత్ర విన్యాసాన్ని ఈ సాహితీవేత్త చేయించారు. అలానే ప్రశ్నార్థకాలను సంధించటంలో కూడా ఈ శతకకర్తది తిరుగులేని చెయ్యి.

చిత్రచిత్ర ప్రభావ, దాక్షిణ్య భావ, హత విమతజీవ, శ్రీకాకుళాంధ్రదేవ – అన్న మకుటంతో ఈ శతకం సాగుతుంది. దీనికి చిత్రవిచిత్రమైన ప్రభావాలు చూపగలవాడా, దాక్షిణ్యమను భావము కలవాడా, కొట్టబడిన శత్రువుల యొక్క ప్రాణములు కలవాడా, శ్రీకాకుళ క్షేత్రాన వెలసిన ఆంధ్రనాయకుడన్న పేరుగల ఓ విష్ణుమూర్తీ అనే అర్థం వస్తుంది.

సంప్రదాయాన్ని విస్మరించకుండా కాసుల కవి శ్రీకారం చుట్టి తన శతకాన్ని ప్రారంభించాడు. మొదటి పద్యంలోనే నిఖిల వేదాంత వర్ణిత చరిత్ర, సకల పావన నదీ జనక పాదాంభోజ అంటూ మహావిష్ణువుని స్మరించారు. శుభప్రదమైన లక్ష్మీదేవిని రొమ్ముపై ధరిస్తావనీ, కడుపులో బ్రహ్మాండాన్ని కలిగి ఉంటావనీ, నాలుగు చేతులందూ చక్ర గదా ధనస్సులని ధరిస్తావనీ, ఉపనిషత్తులలో వర్ణింపబడ్డావనీ ఆ శ్రీమహావిష్ణువుని స్తుతిస్తాడు.

ఈ శతకంలో ప్రాంతారాధన కూడా కనిపిస్తుంది. శ్రీహరిని కీర్తిస్తూ కవి శ్రీకాకుళాన్ని కూడా కీర్తించాడు. మానవుల మనోవ్యాకులతని శ్రీకాకుళ క్షేత్రం పోగొట్టేదని చెపుతాడు.

శ్రీకాకుళము భక్తలోక చింతామణి
  శ్రీకాకుళము సుకృతాకరంబు
శ్రీకాకుళము ధరాలోక వైకుంఠంబు
  శ్రీకాకుళము మర్త్యసేవితంబు
శ్రీకాకుళము వేదసిద్ధాంత మహిమంబు
  శ్రీకాకుళము హత వ్యాకులంబు
శ్రీకాకుళము మహాక్షేత్రా వతంసంబు
  శ్రీకాకుళము సర్వసిద్ధికరము

"అంచితాఖండ దీపారాధనల చేత దీపించు నెపుడు దేవళంబు" అంటూ ఒకప్పుడు స్వామివారి దేవాలయము నిత్తదీపారాధనలతోనూ, నృత్తగీత వాద్యములతో ఒప్పేదని, వారి తిరు మేను షోడశోపచారములతో ప్రకాశించేదని కానీ ఇప్పుడు అవి కానరావని అంటారు. నీవు పిసినిగొట్టువైనట్లున్నావని స్వామినే అపహాస్యం చేస్తున్నాడు. ఈ కవి వ్యంగ్య రచనకి ఇది మంచి ఉదాహరణ. పిసినిగొట్టుగా మారినది భక్తకోటి కావచ్చు కానీ స్వామివారు కాదు.

"భక్తి చేసిన శిలాప్రతిమ కాని హరి యిందు గలుగునా యనెడువారు" అని ప్రజల్లో పెరిగిపోతున్న నాస్తికత్వాన్ని కవి ప్రస్తావిస్తున్నారు. బొమ్మలో విష్ణువు ఎలా ఉంటాడు ఉంటే మహిమలు చూపించి సేవలు చేయించుకోకుండా ఉంటాడా అంటాడు. మళ్ళీ విష్ణువుతో తిరిగి ప్రజల ఆలోచనలను గ్రహించి అందుకు తగినట్లుగానే పరాకు చిత్తగిస్తున్నావు అంటాడు. అంటే భగవంతుడు భక్తుల బాధలను తీర్చాలని, మహిమను ప్రదర్శించాలని విన్నపం చేస్తున్నాడని అర్థం.

శ్రీకాకుళక్షేత్రం 'ధర నూటయెనిమిది తిరుపలందు' ప్రఖ్యాతి చెందింది. 'స్వామిని వైకుంఠుడవు స్వయంవ్యక్తిగా నర్చావతార మొందిన మాట తథ్యమేని వివిధ పూజోత్సవములు నిర్విఘ్నములుగ జేసికొనకున్న నీకు బ్రసిద్ధిగలదె' అని స్వామికి ఉపదేశం చేస్తున్న ఘనుడు పురుషోత్తం కవి.

తిరునాళ్ళు మొదలైన ఆచారాలు కేవలం దేవతాప్రీతి కోసం కావు. ఆబాలగోపాలం ఈ సందర్భంగా ఆనందిస్తారు. ఎన్నో వస్తువుల క్రయవిక్రయాలు జరుగుతాయి. వివిధ వృత్తిపనులు చేసుకునేవాళ్ళు, వ్యవసాయదార్లు వీటిలో జరిగే నృత్తగానాది కార్యక్రమాల్లో పాల్గొని ఆనందిస్తారు. ఈ వేడుకలు అంతరించకూడదని కవి భావిస్తారు. అందుకే కవి 'నపకీర్తి గాదె లోకాలోకములయందు వత్సరోత్సములు వదలి యున్న?' అని ప్రశ్నిస్తారు. ఈ కవికి ప్రజాసమస్యల గురించి కూడా ఆలోచన ఉంది. ఆ ప్రాంతంలోని ఒక చెరువు ఎండిపోతుంది. కవి 'చక్రతీర్థము కృప సులువ నేమి' అని ఆ దేవుని ప్రార్థిస్తారు.

వ్యాజస్తుతి ఈ శతకంలోని చాలా పద్యాల్లో కన్పిస్తుంది. వ్రేపల్లెలో అమాయక గోపస్త్రీల శీలమును దోచుట న్యాయమా, దొంగచాటుగా ఉట్లెక్కి పాలువెన్నలను మెక్కుట తగునా అని కవి ప్రశ్నిస్తారు.

భిల్లాంగనా దంతపీడిత ఫలభుక్తి హేయంబు దోఁచలే దింత నీకు
సంక్రందనాత్మజ స్యందన సారథ్య మెరుసుగాఁ దోఁచలే దింత నీకు
గోపాలకానేక గోవత్సపాలనం బెగ్గుగాఁ దోఁచలే దింత నీకు
వ్రజబాలికా ముక్తవస్త్రాపహరణము హీనమై తోఁచలే దింత నీకు
నుచ్ఛలీచంబు లెఱుఁగక యిచ్ఛఁజేఁ యు చేష్టలివి భక్తహితమతి జేసి తండ్రు

శబరి ఎంగిలి చేసిన పళ్ళు తినటం, అర్జునుని రథ సారథ్యం వహించటం, గోపస్త్రీల చీరలను దొంగిలించటం ఇవన్నీ దేవుడు చేయదగిన కార్యములు కావని

అంటాడు. నీకు ఉచ్చనీచాలు తెలియవని అయినా కొందరు నీవు వాటిని భక్తుల మీది ప్రేమతో చేసావని సమర్థిస్తారని చెపుతున్నాడు. ఇది నిజమే అని నిందాముఖాన స్తుతి చేస్తున్నాడు.

కృష్ణావతారంలో విష్ణువు ఎన్నో లీలలను ప్రదర్శించాడు. వాటినన్నింటిని కవి వివరిస్తూ నీ పౌరుషం ఇటువంటిది, నీవు పిరికివాడవని తేలింది అంటాడు. కంసుడు జన్మించిన వెంటనే చంపుదామని ప్రయత్నిస్తే వ్రేపల్లెకు పారిపోయి నీ సోదరి యోగమాయని కంసుని బారికి విడిచిపెట్టావని శ్రీకృష్ణుని నిందిస్తాడు. యుద్ధంలో నరకుని సంహరింపలేక చేతివిల్లుని భార్యకిచ్చి ప్రాణాలను రక్షించుకున్నావని ఆక్షేపిస్తాడు. చుట్టములు యుద్ధంలో తిట్టినా, కొట్టినా సహించి రుక్మిణిని తెచ్చుకున్నాడన్న విషయం చెపుతున్నాడు. సత్యభామ పాదాలపై మదనతాపానికి ఓర్చుకోలేక పడిపోయావు అని అంటాడు. ఈ విధంగా భగవంతునితో సంభాషించినట్లు చెప్పటం ఈ కవికే చెల్లింది.

నీవేకాదు, నీ కుటుంబమంతా గొప్పదే అనే స్తుతిని ఒక నిందాపూర్వక పద్యంలో కవి చేస్తాడు. 'ఆలు నిర్వాహకురాలు భూదేవియై యఖిల భారకుఁడను నాఖ్యఁ దెచ్చె' అనటం సర్వాన్నీ మోసే భూదేవి అనే భార్య వల్ల అఖిల భారకుడని స్తుతించటం. 'ఇష్టసంపన్నురా లిందిర భార్యయై కామితార్థదుఁ డన్న ఘనతఁ దెచ్చె' అనటం గొప్ప సంపద కలిగిన లక్ష్మీదేవి భార్యగా ఉండటంవల్ల కామితార్థ ప్రదాయకుడని కీర్తించటం. "కమలగర్భుండు సృష్టికర్త తనూజుఁడై బహుకుటుంబకుడన్న బలిమిఁదెచ్చెఁ" అనటం వల్ల లోకంలోని వారందరికీ తండ్రి వంటివాడన్న విశేషార్థం వస్తోంది. బ్రహ్మ సృష్టికర్త కాబట్టి ఆ కొడుకు వల్ల విష్ణువు పెద్ద సంసారి అవుతున్నాడు. 'కలుష విధ్వంసిని గంగ కుమారియై' అంటూ లోకుల పాపాల్ని కడిగివేసే గంగ కూతురవటం వల్ల నీకు ప్రఖ్యాతి కలిగింది అంటాడు. అందరి వల్ల మాత్రమే నీకు ఖ్యాతి వచ్చింది అంటున్నాడు. వాస్తవానికి ఈ విధంగా విష్ణుమహత్త్యం వివరించాడు.

భగవానుని లోకాలకు తండ్రివంటివాడని చెప్తారు. ప్రజానీకం సర్వం విష్ణువుకి బంధువులే కదా. మరి ప్రళయం ద్వారా లోకాల్ని నాశనం చేయటం ఎందుకు? నిజంగా భగవంతుడు వారికి బంధువేనా అనే సందేహం ప్రజలకు కలగక మానదు. ఈ అంశంపై కాసులవారు ఒక పద్యాన్ని రచించారు. 'కవ్వడికెంత చక్కగ బోధ చేసిన నితర హింసాకర్మ మిష్టపఱుప' అని గీతాచార్యుని కౌరవపాండవులను యుద్ధానికి సిద్ధం చేయుటకే రాయబారాన్ని చాలా సంతోషంగా నడిపినట్లు నటించావని నిందిస్తాడు. "విశ్వరూపం బెంత విమలత జూపిన నోర్వని కురురాజు నులుకు పఱుప, విలుబట్టనని యెంత చెలిమిగ బలికిన నవల సుయోధను నాస పఱుప" అనటం పగ తగ్గించటానికి కృషి చేయలేదని బంధువులు యుద్ధంలో మరణించకుండా ఏమీ చేయలేదని నిందించటం. నీవు నిజంగా వారి బంధువువే అయితే అలా చేస్తావా అని ప్రశ్నిస్తున్నాడు.

'శ్రీమద్వికుంఠపురీ వరేశుడవయ్యు గొల్లపల్లెల నుండ గోరుటేమి' అని ప్రశ్నిస్తాడు. లక్ష్మీకటాక్షవీక్షుడవయ్యు ఇంటింటికి పోయి పాలువెన్న దొంగిలిస్తావేమిటయ్యా స్వామీ అని తర్కిస్తున్నాడు. ఇతరుల సొమ్ము అంటే అందరికీ ప్రీతి ఉంటుందేమో?[2]

గొప్పలో గొప్పవాడవు కొలదిలోన
గొలదివాడవు నిన్నెట్లు గొలువవచ్చు?

వైకుంఠపతికి అందరూ సమానమే. గొప్పవారిలో అతను గొప్పవాడు. కొద్దివారిలో కొద్దివాడు. సూత్రమున మణులు గుచ్చబడినట్లు ఈ లోకమంతా స్వామియందే ఉంది. భగవానుని అఖండత్వాన్ని, అద్వైత తత్వాన్ని కవి అద్భుతంగా వర్ణిస్తున్నాడు.

శ్రీకృష్ణుడు కంసుని నగరానికి వెళ్ళినపుడు కుబ్జని అనుగ్రహిస్తాడు. అందుకే కవి 'బంధువులెవ్వరు గంధ మీ కుండిన మువ్వంకలది పూయ మురియలేదో?' అంటాడు. భగవంతుని అనుగ్రహం భక్తులపై సదా పడుతుంది. శ్రీకృష్ణుడు 'రాజులెవ్వరు బంక్తి భోజనమిడకున్న' దాసుని ఇంట భుజించాడు. విదురుని విందు ఆ భక్త సులభుడిని సంతుష్ట పర్చింది. ప్రభువులెవ్వరు వలువలు కానుకగా ఇవ్వకపోతే ఇచ్చినవానినే కృష్ణుడు కరుణించాడు.[5] దైవానుగ్రహం ఓపికగా వేచి ఉన్నవారికి లభ్యమవుతుందేమోనని ఒక ఆంగ్లకవి అంటాడు.[4] పురుషోత్తంకవి అభిప్రాయం కూడా పాత్రత ఉన్నవారికి దైవకృప లభిస్తుంది అన్నదే.

ఈ శతకంలో దశావతారాల లీలలను కవి స్థూలంగా వర్ణించారు. ఒక పద్యంలో స్వామి వివిధ అవతారాలలో చేసిన కార్యాలను చెపుతూ నీవు ఏమి చేయలేదని నాకు అనిపిస్తోంది అంటాడు.

బొచ్చెచేపకు నైన మచ్చరం బున్నది తాబేటికైన సత్వంబు గలదు
డీకొన్న నడవిపందికి గల్గు రోసంబు తెఱనోటినరుడైన దెగువ సేయు
బొట్టివాసికైనెన దిట్టతనంబుండు బాపనికైన దర్పంబు గలదు
చుంచురాజుకైన శూరత్వమున్నది ముసలికి నైన జేపుష్టి కలదు
సిద్ధ మాభీరుడవు నీవె బుద్ధినెంచ గలికివై యేమి సేయంగ గలవొ కాని

శరణాగత వత్సలత, భక్తుల కష్టాలను తీర్చటం భగవానుని ప్రథమ కర్తవ్యం. అందుకే కవి "పక్షంబు గల దండ్రు పాండుపుత్రులయందు పాండవుల్ పడినట్టి పాటులేమి!" అని ఆశ్చర్యం ప్రకటిస్తున్నాడు. గజేంద్రుని, కుచేలుని, ప్రహ్లాదుని భక్తులుగా చెపుతారు. కానీ వీరందరూ ఎన్నిపాట్లు పడ్డారని ప్రశ్నిస్తున్నాడు. "యెంత యాలస్యమున వారి నేలినాడు విట్టిదే నీ దయారసం బెంచిచూడ"... అని వ్యంగ్యంగా అంటున్నాడు.

విష్ణుతత్వాన్ని తెల్సుకోవటం చాలా కష్టం. "వస్తునిర్దేశ మొనరింప వశముగాని నిన్ను వర్ణింపరాదయా నిశ్చయముగ" అని స్పష్టముగా భగవానుని రూపగుణగణాదుల్ని చెప్పటం వీలుపడదని ఇతని అభిప్రాయం. ధూర్జటి లాగానే ఈ కవి కూడా 'నిన్నే రూపంబుగా భజింతు మదిలో' అన్న ధోరణి వ్యక్తం చేస్తున్నాడు. పురుషాకృతిగ నిన్ను గుఱుతు బట్టగరాదు. స్త్రీమూర్తి వనుచును జెప్పరాదు అనటం విష్ణువు ధరించిన మోహినీ రూపాన్ని గుర్తుకుతెస్తున్నది. నీవు సగుణుడవో, నిర్గుణుడవో తెలియదు అంటాడు. పరమాత్మని వర్ణించటం కూడా కష్టం ఎందుకంటే అన్ని వర్ణనలకు అతను అతీతుడు.

బ్రహ్మ నీ అంతు తెల్సుకోవలెనని నీ నాభీపద్మములోనికి ప్రవేశించాడు కదా! నారదుడు శ్రీకృష్ణుని పెక్కు గోపస్త్రీల ఇళ్ళలో చూసాడు కాబట్టి అతనికి కూడా నీ మర్మం తెలియవచ్చు. అర్జునునికి కూడా నీ మాయ తెలియవచ్చు. "తన మనఃపీఠి నిన్ననిశ మారాధించు హరుడు భవ తత్వ మరయకున్న" అని జ్ఞానులకు విష్ణుతత్వం సులభంగా అర్థమవుతుందని జ్ఞానమార్గ శ్రేష్ఠతని వివరిస్తున్నాడు.

ఆధ్యాత్మవాదులు ఈ ప్రపంచమంతా గారడీవాని మంత్రజాలం లాగా పురుషోత్తముడైన నారాయణుని 'మాయ' అని భావిస్తారు. దీన్ని వివరిస్తూ 'ఆడించెదవు బొమ్మలాటవాఁడును బోలె సర్వచరాచర జంతువులను, కనుకట్టు గట్టెదు గారడీఁడును బోలె మిథ్యాప్రపంచంబు తథ్యము గను' అని కవి అంటున్నారు. ఈ మాయ కారణంగానే ప్రజలు సంపత్తి వేపు ఆకర్షించబడి అదే సర్వస్వంగా భావిస్తూ వివేక రహితులవుతున్నారు. దీనికంతటికీ నీవే కారణమని చెప్తూ 'ఇట్టివే కదా నీ విద్య లెన్నియైన' అన్న నింద వేస్తున్నారు. వ్యక్తి అవిద్యకారణంగానే జ్ఞానాన్ని, సత్యాన్ని తెలుసుకోలేకపోతాడు.

త్రిగుణాతీతుడు ఆ వాసుదేవుడు. .సత్వ, రజ, తమో గుణాలు మూడింటినీ విష్ణువులోనే చూసి, వీటన్నింటికీ అతీతంగా గుణశూన్యుడుగా వ్యాపించిన త్రిగుణాత్మక స్వరూపాన్ని కవి స్మరిస్తున్నాడు. 'ఒక గుణంబుగ నీవె సకల ప్రపంచంబుఁ గల్పించితివి నభూత కల్పనముగ' అనటం సమస్త మాయా ప్రపంచానికి సృష్టికర్తగా ప్రాణంపోసిన ప్రభువుని గుర్తుకు తెచ్చుకోవటం. సృష్టించిన తర్వాత దాని స్థితి కూడా అతని బాధ్యతే. అందుకే వేరొక గుణముచే విశ్వ విశ్వప్రాణ రక్షణం బొనరింతు వక్షయముగ' అంటున్నాడు. ఇక్కడ రజోగుణం గురించి ప్రస్తావన. "మండలంబులు గూడఁ జెఱిపి వేయుదువు నిశ్శేషముగను" అనటంలో తమోగుణం వివరణ. అయినా కవి దృష్టిలో-

*'గుణ మొకటిగాదు తెలిసిన గుణములేదు*
*చేరి నినుఁ గొల్వరాదు, వచింపరాదు"*

విష్ణువు గుణాలని గ్రహించటం దుర్లభం. అతన్ని సేవించుట కానీ వర్ణించుటకానీ శక్యం కాదు. సమస్త విశ్వంలో ఎవరికీ విష్ణువు గురించి తెలియదు.

దశావతారాల్లో మొదటిది మత్స్యావతారం. శ్రీమహావిష్ణువు, ఆద్యంతమూ ఉదాత్త అనుదాత్త స్వరాలతో ఉచ్చరింపదగిన వేదాలను సోమకాసురుడు బ్రహ్మ నుంచి హరించగా, వానిని సంహరించి చతుర్ముఖునకు తిరిగి వేదాలను అందిస్తాడు. కాస్త అటూఇటూగా ఈ కథ బైబిల్‌లోని ఆదికాండములో వస్తుంది.(5)

"వెంబడిగఁ బెద్ద కోఱమీనంబువై యాఱొందు సంద్రముల్ నిముసంబులో నీది నెమకి వాని దొక్కవక్కలుగాఁ గఱుకున్న బరిఁగోసి" అంటూ కవి మత్స్యావతార ప్రాశస్త్యాన్ని వివరిస్తున్నాడు. 'యింత పనికిని నవతార మెత్తితివి నీవు' అని ఇంత చిన్న పనికే అవతారమెత్తావా అని ఆ విష్ణువుని ఆక్షేపిస్తున్నాడు.

కూర్మావతారంలో విష్ణువు మందరపర్వతాన్ని వీపుపై మోసి అన్ని లోకాలకు ఉపకారం చేసాడు. మోహినీ రూపం దాల్చి దేవతలకు అమృతాన్ని పంచాడు.

"యమృతాభిలాష దేవాసురుల్ మధియింప గిరి మున్గఁ గచ్ఛపాకృతి వహించి
నిర్వహించుట గాని సర్వకాశ్యపులలోఁ బంక్తిబేధముఁ జేసి పల్మఱాను"

కాసులకవి విష్ణువుతో 'నీకు దేవతలంటే పక్షపాతం; మోసకారులైన రాక్షసులు నిన్ను ఎన్నటికీ విశ్వసింపరు' అని అంటున్నాడు.

వరాహావతారం ఎత్తి విష్ణువు హిరణ్యాక్షుని నిర్జించాడు. కవి ఈ వృత్తాంతాన్ని వ్యంగ్యం చేస్తున్నాడు. 'వాని డొక్క గఱుక్కునఁ జెక్కిపట్టి నొక్కి పుడమింత నీటిపై కెక్కదీయ మక్కువ దనర్ప నది యేమి రక్కరింపు?' అని దేవుని ప్రశ్నిస్తాడు.

మహాభక్తుడైన ప్రహ్లాదుని రక్షించటానికి, లోకకంటకుడైన హిరణ్యకశపుని సంహరించటానికి నరసింహావతారాన్ని ధరించి విష్ణువు దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసాడు.

'నృహరి రూపంబున స్తంభంబులోఁ బుట్టి చటులనేత్ర దంష్ట్రా నఖ ప్రభ దహన కేలలఁ బోలి భగ్గురనంగఁ బైఁ బడి హిరణ్యకశిపు దునుమాడి' అని కవి ఆ వృత్తాంతాన్ని మొత్తం వివరిస్తున్నాడు. కన్న తండ్రి కొడుకుని దండిస్తే మధ్య నీకెందుకయ్యా కోపం అని వేళాకోళం చేస్తున్నాడు.

అదితికశ్యపులకు జన్మించి, వామనావతారంతో బలిని పాతాళానికి అణగదొక్కిన విష్ణులీలను మరో పద్యంలో కవి విశదీకరించాడు. 'అట్టి దాతను దిగద్రొక్కి యతని సిరులు దెచ్చి కులగోత్ర భేదికీ నిచ్చకంబో' అంటూ కవి ఎకసెక్కం చేస్తున్నాడు.

"కశ్యపుఁడదితి నిన్గన్న వారలు గారె పెంచిరే మరుగుజ్జు బిడ్డ వనుచుఁ
గుండిక దండంబు గోఁచితో వచ్చిన కపటవటుండు నిక్కముగ భూమి
సురుడు గాఁడని యాత్మగురుఁడీయ వలదనఁ గరుణించి బలిదాత కామితార్థ"

పరశురామావతారం ఎత్తి క్షత్రియజాతిపై పరశువెత్తి రాజుల కుత్తుకలను కోసావని, రాజులరక్తంతో పితృతర్పణాలు చేసావని విష్ణువుని కవి నిందిస్తున్నాడు. 'వసుధపై రక్తప్రవాహంబు లొనరించి తజ్జలంబులఁ బితృతర్పణములు సేసి యిల విప్రులకు ధారపోసినట్టి కీర్తియే కాని బ్రాహ్మణ కృత్యమగునె?' అని ప్రశ్నిస్తున్నాడు.

రాముడు పుణ్యపురుషుడు. పితృవాక్యపాలనము, ఏకపత్నీవ్రతము, ఆర్తత్రాణపరాయణత్వం, ధర్మపాలన లాంటి విశిష్ట గుణాల ద్వారా అన్ని అవతారాల్లోనూ రామావతారమే శ్రేష్టమైందని పెద్దలు చెపుతారు. అందుకే కవి 'మంచి నడవడి నడచినా వెంచి చూడఁ గీర్తిగల మూర్తివే యిట్టి వార్తలరయ' అంటున్నాడు. నీ వంటి ధర్మాత్ముని ప్రశంసించే వారికి కోరినవన్నీ ప్రసాదిస్తావు, వారికి ఏ లోటు ఉండదు అని శ్రీరామభక్తులకు కైవల్య మెదుటవచ్చు అని కవి హామీ ఇస్తున్నారు. అనేక పద్యాల్లో శ్రీరామచంద్రుని అవతార విశేషాలను ప్రశంసించారు. ఏ యుగానికైనా, ఏ ధర్మానికైనా శ్రీరాముడు ముక్తి ప్రసాదించే దేవుడని ఈ కవిగారి అభిప్రాయం. అయినా–

"భవ భయంబున నిన్నెంత ప్రస్తుతింపఁ
గరుణఁ జేపట్టలేని నీ ఘనత యేమి?"

భవసాగరాన్ని దాటించమని భక్తులు వేడుకుంటే వారిని కరుణించి జన్మరాహిత్యాన్ని అనుగ్రహిస్తేనే అది గొప్ప కానీ అనేక అవతారాలు ఎత్తి ఏవేవో పనులు చేయటం కాదని అంటున్నాడు.

హిందూ సంప్రదాయంలోని దశావతారాల కథలు నిజానికి జీవ పరిణామక్రమాన్ని వివరిస్తున్నాయి. మత్స్య, కూర్మ, వరాహ, నరసింహావతారాలు అంటే చేప - తాబేలు - పంది - ఆదిమమానవుడు (సగం మనిషి - సగం జంతువు) అని అర్థం చెప్పకుంటే డార్విన్ వివరించిన పరిణామవాద క్రమాన్ని ఇది బలపరుస్తున్నది. జలచరాలు, ఉభయచరాలు, భూచరాలు ఈ వరసక్రమంలోనే భూమిపై ఆవిర్భవించాయని దశావతారాల కథలు వెల్లడిస్తున్నాయి.

వ్యంగ్యరచనా విధానానికి ఈ శతకం సరైన ఉదాహరణ. విష్ణువుని మామ ఇంటికి వెళ్ళవద్దని అక్కడ మంచినీరు కూడా పుట్టదని చెపుతున్నాడు ఈ పురుషోత్తం కవి. మిత్రుడైన ముక్కంటి ఇంటికి కూడా వెళ్ళవద్దని అతను నిత్య దరిద్రుడని చెపుతాడు. కన్నకొడుకైన మన్మథుని ఇంటికి కూడా వెళ్ళవద్దని అతని భార్య రతి నోటికి అడ్డులేదని వివరిస్తున్నాడు. ఇంద్రుడు యాచించటం వృథా ప్రయాసని అంటున్నాడు. చుట్టాల్లో ఎవరింటికి వెళ్ళినా ఆదరణ ఉండదనీ బోధ చేస్తున్నాడు. స్వామిని శ్రీకాకుళక్షేత్రంలోనే నిత్యం వశించమని ఈ క్రింది విధంగా ప్రార్థిస్తున్నాడు.

*మామ యింటికిఁ బోవ మంచి తీర్థము పుట్ట దతఁడంత కారువాఁ డతడె సుమ్ము*
*పునుక కంచము తోలుపుట్టంబు గల మిత్రుఁడెందు నన్నముఁబెట్టు నేమి గప్పు?*
*మాటమాత్రం బైన మగువ నోరాఁపదు కొడుకు పెట్టునె తలకోట్ల మారి*
*యన్నది మేషాదమున్న దిచ్చేదొక్క తొఁక్లిగొడ్డది నీకుఁ దోలునేమి?*
*ఎవ్వరింటికి బోయిన నేమి ఫలము ఉన్నచో నుండి సిరుల బెంపొందమయ్య*

సమస్త జగముల స్థితికి విష్ణుమూర్తి హేతుభూతుడని అయినా భక్తుడినే గురువుగా మన్నిస్తావు అని చెపుతున్నాడు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన నీవు లోకాలనన్నీ నీ ఉదరంలో ఉంచుకొని భరిస్తావు. అయినా చిన్న గుడిలో నివసిస్తావు. భక్తులిచ్చే కానుకలని స్వీకరిస్తావు. 'హరచతుర్ముఖ దేవతా గోచరుడవయ్యు నెప్పుడు దర్శనం బిచ్చుచున్న నిన్ను సేవింపనెవ్వరో' అని జనులు ఎట్టఎదుట ఉన్న దైవాన్ని చూడకుండా వెళ్ళిపోతున్నారని కవి వెల్లడిస్తున్నాడు. కొండంత గరుడునిపై విహరించే దేవునికి మానవులు భూలోకంలో చేసే రథోత్సవములు ఏ పాటి? వీటిని భక్తులు ఏదో వారి ఆనందం కోసం చేసుకుంటూ ఉంటున్నారు తప్ప వీటిపైన ఆ పరంధామునికి మోజులేదని కవి అభిప్రాయం.

కాసుల పురుషోత్తం కవి తన శతకాన్ని ఆ దేవదేవునికే అంకితం చేసాడు. "శబరి యెంగిలి పండ్లు చవిఁ జూచు" అంటూ ఆ దేవుని కృప భక్తులపై అన్నివేళలా ఉంటుందని తన ప్రగాఢ విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నాడు. భక్తులైన కుబ్జ, ద్రౌపది, యశోద, సుదాముడు, గుహుడు, అల్పప్రాణి ఉడత మొదలైనవారందరూ ఆ

పురుషోత్తముని కరుణకి పాత్రులయ్యారు. అలానే తన శతకాన్ని కూడా స్వీకరించమని దేవుని ప్రార్థిస్తున్నాడు.

"శతక మంగీకరింపుము జగతి జనకుఁ దర్భకా వ్యక్త భాషల నలరినట్లు"

ఈ విధంగా ఆంధ్రనాయక శతకం తెలుగు సాహిత్యంలో ఒక విలక్షణ శతకంగా పేరుపొందింది. కాసుల పురుషోత్తం కవి వ్యాజస్తుతికే కాక భక్త ప్రవృత్తికి కూడా చాలా గొప్పవాడు. నిందాస్తుతికి ఇంతకంటే అద్భుతరచన మరొకటి చూపటం వీలుపడదని. అనేకమంది పెద్దలు భావిస్తారు. తెలుగు సాహిత్యంలో శతక ప్రక్రియను ఇంత చక్కగా తీర్చిదిద్దిన రచయితల్లో పురుషోత్తం కవి పేరు ఎక్కువగా వినిపిస్తుంది. ఈ శతకం తెలుగు సాహిత్యంలో ఒక చక్కని శతకంగా అనేక కాలాలు నిలిచిపోతుంది.

## వివరణలు:

1. వ్యాజస్తుతి అలంకారానికి చంద్రాలోకంలో ఇవ్వబడిన లక్ష్యలక్షణాలు ఇవి:
   ఉక్తి: వ్యాజస్తుతిః నిన్దాస్తుతిభ్యాం స్తుతి నిందయోః।
   కః స్వర్ధుని। వివేకస్తే నయసే పాపినో దివమ్॥
   
   కావ్యాలంకార సంగ్రహంలో కూడా నిందా వ్యాజముచే స్తుతియు, స్తోత్ర వ్యాజముచే నిందయును చేయుట వ్యాజస్తుతి అగునని ఉంది.
2. ప్రజాకవి వేమన పద్యాల్లో ఒకదానిలో ఇలా ఉంది.

   పాలసముద్రమున పవ్వళించిన స్వామి
   గొల్ల ఇండ్ల పాలు కోరుటేల
   మంది సొమ్ము మీద ఎల్లవారికి తీపి
   విశ్వదాభిరామ వినుర వేమ
3. ఆంధ్రనాయక శతకంలోని 35వ పద్యంలో ఇలా ఉంది:
   "ప్రభువు లెవ్వరు వస్త్రబహుమాన మీకున్న
   దెచ్చి యిచ్చిన చాకి మెచ్చలేదొ?"

   బలరామకృష్ణులకు వలువలిచ్చినవాడు సాలెవాడు. అంతే కానీ రజకుడు కాదు. రజకుడు ఇవ్వనిచో అతన్ని సంహరించారు. ఈ విధంగా భాగవతంలో (దశమస్కంధం) ఉంది. కవి పొరపాటు పడ్డాడు.
4. ఆంగ్లకవి మిల్టన్ తన పద్యం 'on his blindness' లో ఇలా అన్నారు.``They also serve who stand up and wait."
5. బైబిల్ ఆదికాండ (Genesis) లో నోవా వృత్తాంతం వస్తుంది. ప్రళయం వచ్చి లోకం యావత్తూ జలరాశిలో ఉండగా నోవా ఒక పెద్దపడవలో జీవుల్లో ప్రతి వర్గాన్నించి ఒకదాన్ని తీసుకుని దేవుడు మహోమత్స్యమై పడవ ముందుండి దారి చూపగా ఒడ్డు చేరతాడు.



# రాయప్రోలు సుబ్బారావు

రాయప్రోలు సుబ్బారావుగారు 1892లో గుంటూరు జిల్లా గార్లపాడులో జన్మించారు. మహాపండితుల ఇంట జన్మించిన వీరికి చిన్నతనంనుంచే కవిత్వంపై ప్రేమ ఏర్పడింది. ప్రకృతి ఆరాధన, అందచందాలకు పరవశమవటం మొదట్నుంచి ఇష్టమైన విషయం. రాజమహేంద్రవరంలో విద్యాభ్యాసం చేసారు. గంటిలక్ష్మన్న, చిలుకూరి వీరభద్రరావు, అత్తిలి సూర్యనారాయణగార్లతో స్నేహం ఏర్పడింది. ఇంగ్లీష్ సాహిత్య పోకడలను నిశితంగా అధ్యయనం చేసి తన సాహితీ అభిలాషని, అభిరుచిని పెంపొందించుకున్నారు. అలివర్ గోల్డ్‌స్మిత్, టెన్నిసన్, వర్డ్స్‌వర్త్ కవిత్వతత్వాన్ని ఆకళింపు చేసుకున్నారు. విశ్వకవి రవీంద్రుని వ్యక్తిత్వాన్ని, కవిత్వాన్ని చాలా ఇష్టపడేవారు.

సుబ్బారావుగారు సంప్రదాయాన్ని పునాదిగా చేసుకొని తన సాహితీ సౌధాన్ని నిర్మించుకున్నారు. మితిమీరిన శృంగారాన్ని కవిత్వంలో జొప్పించటాన్ని ఇష్టపడక 'అమలినశృంగారం' అనే భావనని ప్రవేశపెట్టారు. సుబ్బారావు భావనారీతుల్లోని విప్లవానికి వారి పిన్నిగారు కారణం.

తృణకంకణం, కష్టకమల, స్నేహలత, తెలుగుతోట, స్వప్నకుమారం, ఆంధ్రావళి, జడకుచ్చులు, రమ్యాలోకము, మాధురీ దర్శనము, మధుకలశము లాంటి అనేక రచనలు చేసారు. గోల్డ్‌స్మిత్ 'హెర్మిట్'ను చదివి లలిత పేరిట తెలుగులోకి తెచ్చారు. టెన్నిసన్ కావ్యాన్ని చదివి దాన్ని అనుమతి పేరిట అనువదించారు. ఈ రెండు కావ్యాలు వీరికి మంచి పేరుప్రతిష్ఠలను సంపాదించిపెట్టాయి.

1914 నుంచి 1916 దాకా శాంతినికేతన్‌లో గడిపిన రాయప్రోలువారు విశ్వకవి సాన్నిధ్యంలో కళాప్రయోజనాన్ని తెలుసుకున్నారు. జాతిని మహత్కార్యాలకు సన్నద్ధం చేయటానికి కవిత్వం ఉపయోగపడుతుందని నిరూపించారు. తెలుగులో మొదటగా దేశభక్తి కవిత్వం పేరిట రచనలు చేసిన ఘనత వీరికే దక్కుతుంది.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1922 నుంచి 1948 వరకూ తెలుగు అధ్యాపకులుగా పనిచేసారు. 1956 నుంచి 1959 వరకూ శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధ్యక్షులుగా ఉండి ఎందరికో భవిష్యత్ నిర్మించారు. దేశంలోని అత్యుత్తమ విద్యావేత్తలు ఎనిమిదిమందిలో ఒకరిగా ఎన్నిక అవటం వీరి పాండిత్యానికి సన్మానం. అనేక విశ్వవిద్యాలయాలు గౌరవపట్టాలను ఇచ్చి తెలుగు సాహిత్యాన్ని గౌరవించాయి. 1962లో మిశ్రమంజరికి కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం లభించింది.

భావకవితాపితామహులు రాయప్రోలు సుబ్బారావుగారు 1984 జూన్ 30న సికింద్రాబాదులో శాశ్వత నిద్రపోయారు. వీరు మరణించినా రాసిన కవిత్వం మాత్రం ఆంధ్రావళిని ఆనందసాగరంలో ఓలలాడిస్తూనే ఉంది. సుబ్బారావుగారు ఆదర్శవ్యక్తులు.

# 17. ఆంధ్రావళి - కవితా రీతులు, దేశభక్తి సాహిత్య విజయాలు

రాయప్రోలు సుబ్బారావుగారి కవిత్వం రసగుళికలవంటిది. వీరిని అధునికాంధ్ర కవిత్వ యుగకర్తలలో ఒకరిగా అనేక మంది చెపుతారు. అర్థశతాబ్దిపాటు రాయప్రోలు లేఖిని అలుపు లేకుండా కథాకావ్యము, ఖండ కవిత, గేయకవిత, ప్రేమగాథ, ప్రబోధకవిత, సంఘసంస్కరణకవిత్వము, స్మృతికావ్యం, పల్లీయకవిత్వం, అభ్యుదయ గీతము, దేశభక్తి కవిత్వము మొదలైన వివిధ ప్రక్రియల్లో అమూల్య రచనలని జాతికి అందించింది. ప్రాచీన కావ్యాలపట్ల గౌరవం పెట్టి ఎన్నో వర్ణనలను, శబ్దచిత్రాలను తెలుగు కవితా ప్రాంగణంలో వీరు ప్రవేశపెట్టారు. శృంగార కరుణరసములను రెంటినే కాకుండా వీరరస ప్రధానంగా జాతీయవీరుల పౌరుషకీర్తనములను గానం చేసారు. కవిత్వం రాయటమే కాదు రమ్యాలోకము, మాధురీదర్శనము వంటి సిద్ధాంత గ్రంథాలను రాసి తన పాండిత్యానికి తానే పరీక్షపెట్టుకున్నారు. రాయప్రోలువారి కవిత్వం తెలుగుభాష తీయదనాన్ని వెల్లడించేది. ప్రకృతిని వీరు శక్తిరూపిణిగా భావించి, ఆరాధించారు.

శృంగారం భౌతికమైంది కాదనీ అది శరీరయుక్తమైన ఆత్మసౌందర్య వర్ణనమేనని వీరి అభిప్రాయం. సౌందర్యంవల్ల, శృంగారంవల్ల అమలిన ఆనందం పొందవచ్చని భావించిన రాయప్రోలు లౌకిక విషయాలకతీతమైన రసానందాన్ని గురించి వివరించారు. ఉపాధిని ఆశ్రయించని శృంగారము విశ్వ శ్రేయఃకారి అని వీరి వాదన. సౌందర్యలహరిలో ప్రతిపాదించబడిన విషయాన్ని, ఉపనిషత్తుల సారాంశాన్ని, పాశ్చాత్యతత్వాన్ని పూర్తిగా అధ్యయనం చేసి రాయప్రోలు తన 'అమలినశృంగారము' సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఆనందోబ్రహ్మేతి వ్యజనాత్ అన్న ఉపనిషత్సూక్తి ప్రాతిపదికగా పూర్ణానందాస్వాదనమునకు శృంగారరసము, మనోకల్మషశుద్ధికి కరుణరసం ఉపయుక్తమని రాయప్రోలు వివరించారు.(1) వీరి అమలిన శృంగార సిద్ధాంతం ప్లేటో ప్రతిపాదించిన ప్రేమసిద్ధాంతముతో పోల్చతగింది.

ఆశ్రమములన్నింటిలో గృహస్థాశ్రమమే ఉత్తమమైందని రాయప్రోలు అభిప్రాయపడ్డారు. శృంగారాన్ని గృహస్థాశ్రమంలో సంతానంకోసం నిర్వర్తించటాన్ని వీరు బలపరిచి శృంగారమునకు పరమార్థము సంయోగం అన్న భావాన్ని అంగీకరించలేదు. చిన్నతనంలో చదువుకున్న ఉత్తరరామ చరిత్రలోని భావాలు, అభిజ్ఞాన శాకుంతలములోని విషయాలు వీరిపై ప్రగాఢ ముద్ర వేశాయి. ఉత్తమ సంస్కారులైన దంపతులు శరీరవిముక్తమైన సౌందర్యమును అర్చించవలెనని వీరి భావన.(2)

ప్రబంధ సాహిత్యంలో స్త్రీని అంగాంగవర్ణనం చేసిన విధానాన్ని గర్హించి స్త్రీని ఉన్నతపీఠంపై నిల్పిన ఘనత రాయప్రోలువారిది. వీరి అనేక కావ్యాలు నాయికా ప్రధానమైనవి. వినతల్లి 'అనసూయ' కథకు నూతన వ్యాఖ్యానం చెప్పి రాయప్రోలువారిలో స్త్రీని తల్లిగా, దేవతా మూర్తిగా, వాత్సల్యమూర్తిగా దర్శించే తత్వానికి కారణమయ్యారు. 'వకుళ' వృత్తాంతము ద్వారా అస్ఖలితమైన తన శీలాన్ని పరపురుషునికి దానం చేయటాన్ని స్తన్యాన్ని ఇవ్వటంగా రాయప్రోలు చిత్రించారు. అహల్యా వృత్తాంతములో కూడా ఇదే విధముగా ఇంద్రుడు యాచించగా శీలదానం చేసి అహల్య

శిలయైపోయిందని సృష్టించారు. తృణకంకణములో కూడా భగ్నమనోరథుడైన పూర్వ ప్రియునికి సాంత్వనమందించిన ధీరవనిత వృత్తాంతం ఉంది. స్నేహలతలోని నాయిక గృహరక్షణార్థము ప్రాణత్యాగం చేసిన త్యాగశీలి. అనుమతిలోని పాత్ర కూడా తనకు భర్త కావాల్సినవాడు వేరొకరిని పెళ్ళిచేసుకున్నా అతని మరణానంతరం అతని భార్యాపుత్రుల కోసం త్యాగం చేసిన పెద్దమనస్సు ఉన్న నాయిక. ఈ విధంగా ఆధునికాంధ్ర కవిత్వంలో స్త్రీ సమారాధన రాయప్రోలు వారిలో ప్రముఖంగా కన్పిస్తుంది.[3]

రాయప్రోలువారు జాతీయాభిమానాన్ని ప్రభోదిస్తూ రాసిన గేయములు 'ఆంధ్రావళి' సంపుటిలో మకుటాయమానముగా నిలిచిపోయాయి.

ఆంధ్రావళి గేయసంపుటిలో ఉగాదివందనము, ప్రబోధము, ప్రతిభాచక్రము, సాధుశోధన, గేయగుచ్ఛము అనే విభాగాలు ఉన్నాయి. ఈ గేయాల్లో ప్రకృతి ఆరాధన, స్వాతంత్ర్య ప్రబోధము, గత వైభవ స్మరణము, ప్రేయసీ ఆరాధన, ధర్మనిరూపణ, మహాపురుషుల జీవితాదర్శాలు మొదలైన ఎన్నో అంశాలపై వెలార్చిన కవితాకుసుమాలు ఉన్నాయి.

'మాతృగీతం' అన్న మొదటిగేయంలోనే రాయప్రోలువారి వ్యక్తిత్వం, ఆదర్శాలు కనిపిస్తున్నాయి. 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అన్న సూక్తితో సమానార్థమిచ్చేటట్లు – 'నమో మంగళశ్రీ మహామాతృభూమే!" అన్న రాయప్రోలు మాటలు వారికి మాతృభూమి పట్ల ఉన్న ఆదరాభిమానాల్ని నిరూపిస్తున్నాయి. ఆంధ్రావళిని 'అంబా! స్వీకరింపంగదే!' అంటూ ఆ తల్లికే అంకితమిచ్చారు.

తెలుగువారికి ఉగాది నూతనసంవత్సరం. కొత్త ఆశలకు, ఆశయాలకు ఈ పండగే నాంది పలుకుతుంది. ప్రకృతిని శక్తిస్వరూపిణిగా, సృష్టికర్తగా గ్రహించి పూజించటమే తెలుగువారి 'ఉగాది' లోని ఆంతర్యం. మనదేశీయుల సంప్రదాయాన్నిబట్టి ప్రకృతి ఆరాధన అతిముఖ్యమైనది. శ్రీముఖ సంవత్సరంలో ఉగాది వందనము చేస్తూ రాయప్రోలు వారు–

నవకము పుక్కిలించెను వనస్పతులెల్లెడ, పుల్కరించె ప
ల్లవకుల రాగరంజన మెలర్పగ కొమ్మలు, కన్నెతీగ లు
త్సవ రతినవ్వినట్లు వనథామములన్ కుసుమించె కుల్కుచున్
కవి సెకిలార్చుచున్ వయసుకావరమే ప్రకృతి సమస్తమున్

ప్రకృతిలోని అందచందాలను వర్ణించారు. "మిసమిసల చిగురుటాకులు పసుపారెడు ఎఱుపు మెఱయు వట వృక్షములన్" అంటూ అత్యంత రమణీయంగా కవిత్వం చెప్పారు.

రాయప్రోలువారికి సృష్టిలో అనేక పదార్థములు వాత్సల్య స్ఫూర్తితో కనిపించగా, కొన్ని సౌందర్యంగా గోచరించాయి. ధాత సంవత్సరంలో 'చెఱకు పాలీయ', 'పికము శ్రుతులు అభ్యసించ' వచ్చు ఉగాది ప్రజలందరికీ శుభాలను తెచ్చుగాక అని ఆశీర్వదించారు. ప్రకృతి 'మామిడి చూలు మోయిచున్నట్లుగా' వారికి అనిపించింది.

'నవమల్లిక పుష్పిణిగా' భాసించింది. ప్రకృతిని స్త్రీరూపిణిగా చిత్రిస్తూ 'కొమ్మల సిగపూలు కుప్పింతలిడ వన ప్రియగీతికల' అభినయం చూపిందని చెప్పారు. గేయాన్ని ముగిస్తూ 'పాటవమున నీ షష్టాంకనాటకంబు నాడి భరతవాక్యంబు పాడవయ్య ధాత' అంటారు.

బహుధాన్య సంవత్సరంలో ఉగాది లక్ష్మికి స్వాగతమిస్తూ "బహుధాన్య సూచనాసుఖయగు నీ యుగాది దిన శోభనలక్ష్మికి డోయిలింపుమీ"! అని ఆశాభావం వ్యక్తం చేస్తారు. తెలుగు సంవత్సరాలపేర్లన్నీ సూచనాత్మకంగా ఉంటాయి. ఉగాదితల్లిని "అతి చిరంతనా విచ్ఛిన్నమయిన ఆంధ్రజాతి. భూత చరిత్రను సంస్మరించి, తద్భవిష్యదభ్యుదయ సంధానమెంచి కలుపవమ్మ" అని అర్థిస్తారు. ఉగాది పండుగ సందర్భంగా ప్రజలందరికీ రాయప్రోలువారు అందించిన సందేశం–

*గతము విస్మరించి పురోభిహితమునెంచి*
*పచ్చబడిన వాకిండ్లతో సర్వశుభము*
*లయిన ఆశాముఖాలతో, నా మతింపు*
*డీ! యుగాది పండుగతల్లి నెల్లజనులు!*

ఈనాటికీ వర్తించేది.

గురజాడవారి దేశభక్తి గేయము తర్వాత రాయప్రోలువారి గీతాలే ప్రతి తెలుగువారి మనసులో మెదలుతాయి. రాయప్రోలువారి గేయం తెలుగువారి గుండెల్లో తల్లిభారతిపై నిండు గౌరవాన్ని నింపుతూ వారిని "ఏ దేశమేగినా ఎందుకాలిడిన, ఏ పీఠమెక్కిన ఎవ్వరేమనిన" జాతిగౌరవాన్ని నిలపాలని ప్రబోధించే గేయం. భారతదేశ ప్రాచీనవైభవాన్ని, ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని ఎంతో చైతన్యవంతంగా రాయప్రోలువారు తన గేయంలో ఆలాపించారు. ఈ గేయముపై వర్డ్స్‌వర్త్, స్కాట్, టెన్నీసన్, రవీంద్రులు మొదలైనవారి కవిత్వ ప్రభావము కనిపిస్తున్నది.

*"ఏ పూర్వపుణ్యమో, ఏ యోగబలమొ,*
*జనియించినాడవీ స్వర్గ ఖండమున;*
*ఏ మంచిపూవులన్ ప్రేమించినావొ,*
*నిను మోచె ఈ తల్లి కనక గర్భమున."*

మాతృభూమి గొప్పతనాన్ని గానం చేసిన ఈ విధానమే అపూర్వం. ఏదోగొప్ప పుణ్యం చేసుకోబట్టే ఈ స్వర్గంలో జన్మించావని చెప్పటం వ్యక్తికి ఒక అద్భుతానుభూతిని, ఆత్మగౌరవాన్ని కలిగిస్తోంది. 'లేదురా ఇటువంటి భూదేవి యెందు' అన్నమాటలో మాతృదేశాభిమానం శిఖరాలకు చేరింది. 'లేరురా మనవంటి పౌరులింకెందు' అనగానే ఈ గడ్డపై పుట్టిన అదృష్టవంతులు మీరే అన్న విశిష్టార్థం ఏర్పడుతుంది. 'సూర్యుని వెలుతురుల్ సోకునందాక, ఓడల జండాలు ఆడునందాక అందాకగల ఈ యనంత భూతలిని మన భూమివంటి చల్లని తల్లిలేదు' అన్న సందర్భంలో విశాలమైన భారతభూభాగం కళ్ళముందు ప్రత్యక్షమవుతోంది. ఈ పంక్తులలలోని భావం టెన్నీసన్

కవితలోని భావంతో సరిపోతోంది.[4] పొలముల రత్నాలు మొలిచాయని, వార్ధిలో ముత్యాలు పండినాయని, పృధ్వి మనకోసం దివ్యౌషధుల్ని పితికిందని, కానల కస్తూరి కాచిందని రాయప్రోలు చెప్పే విషయాలు భారతీయులకి ఆత్మగౌరవాన్ని, దేశప్రేమని అధికం చేస్తున్నాయి.

అవమానమేలరా అనుమాన మేల
భారతీయుడ నంచు భక్తితో పాడ

పరాధీనతలో ఉన్న భారతీయులకు ఆత్మవిశ్వాస సూర్యోదయం, 'నేను భారతీయుడ' నన్న పౌరుషం, మాతృదేశంపట్ల భక్తిభావం ఈ కవిత కలిగిస్తోంది.

'ప్రబోధము' అన్న గేయంలో రాయప్రోలు ఆంధ్రజాతి విజయాల్ని ప్రస్తావించాడు. పౌరుషానికి, కళలకు, సాహిత్యానికి, వ్యాపారానికి ఆంధ్రదేశం చాలా పేరు పొందింది. గతవైభవాన్ని గుర్తుచేస్తూ సాగే ఈ కవిత ద్వారా కవి ఆంధ్రులని వేనోళ్ళ శ్లాఘించారు. అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. ఓరుగల్లులో తెలుగు తేజం రాజవీరలాంఛనముగా పలుశస్త్రశాలలు నడిపింది. విద్యానగర రాజవీధులలో తెలుగు కవితకు పెళ్ళిపందిళ్ళు వెలసాయి. పొట్నూరికి సమీపాన ఆంధ్రసామ్రాజ్య దిగ్విజయ స్తంభాన్ని ఎత్తించారు. ఈ ఘనవిజయాల్ని ప్రస్తుతిస్తూ కవి 'తన వేణికలు వసుంధరను సస్యశ్యామలను జేయ జెలగిన తెనుగుభూమి' స్వర్గసమానమని వివరిస్తున్నారు. వర్డ్స్‌వర్త్ భావావేశం ఇక్కడ కనిపిస్తోంది.[5]

అస్మదార్ద్రమనోవీధి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాడ! చావలేదు
చావలే దాంధ్ర జన మహోజ్వల చరిత్ర
హృదయములు చీల్చి చదువుడో సదయులార!

ఆంధ్రుల ప్రాచీనచరిత్రను, ఉజ్వలమైన వారసత్వాన్ని, ఘనమైన కీర్తిని స్మరిస్తూ సాగిన గేయం ఆంధ్రులందరికీ ఉత్తేజాన్నిస్తుంది.

పుస్తకము అనే గేయం 'నిండాఱ బాఱు నఖండగోదావరిన్ దాగిన చాళుక్య నాగరికత'తో ప్రారంభించి 'తుంగభద్ర కెరటాల మణగిన ప్రాజ్య సామ్రాజ్యభరము' గురించి వివరించేది. దీనిలో కవి ఆంధ్రుల శిల్ప విన్యాసంబు, నాగరిక కళ్యాణ చిహ్నములు మొదలైనవన్నీ ప్రస్తావించారు.

ఆంధ్రమాత అనే గేయం కూడా జన్మభూమిని పూజిస్తూ రాయప్రోలువారు చేసిన సారస్వతోపాసన. "నీ యాశీర్వాదము లిమ్ము పుత్రకుల కంబా! యాంధ్రదేవీమణీ!" అంటూ తెలుగుతల్లికి కవి వేడుకుంటున్నారు. ఎన్నో రాజవంశాలు తెలుగునేలను పాలించాయి. చాళుక్యులు, కాకతీయులు, విజయనగరరాజులు తమ పాలనతో ఆంధ్రజాతికి పేరు సంపాదించి పెట్టారు. అయితే ఆనాటి వైభవం, యశోవీర్య ప్రభావం గతకాలంలోనే అని చెప్పుకోవటం రాయప్రోలుకి దుఃఖం తెప్పిస్తోంది. ఆంధ్రుల

ప్రాభవం 'పాడయి శిలావశిష్టమై' పోవటం 'బ్రతికి చెడ్డ యాంధ్రుల పూర్వ వైభవములె చాటుచున్న' అనాల్సిన స్థితిని తెస్తోంది. రాయప్రోలువారిది ఆశావాద దృక్పథం. రానున్న కాలంలో ఆంధ్రులు తిరిగి వారి పూర్వవైభవాన్ని సాధిస్తారన్న నమ్మకాన్ని వారు వ్యక్తం చేస్తున్నారు. తెలుగువారినందరినీ ఆంధ్రమాతను పూజింపమని వారు చెపుతున్నారు.

*సంతోషింపగదమ్మ! ఆంధ్రజననీ! సారస్వతస్నాన వి*
*శ్రాంతిప్రీతుల, నీదు పుత్రకుల, దీక్షాబద్ధులం జూచి; ని*
*శ్చింతన్ సోదరులార! ఈ జనని పూజింపుండు, బ్రహ్మోర్వణో*
*దంత వ్యక్తమనో బలమ్మున తాథాస్తంచున్ ఋషులు పల్కగన్*

ఆంధ్రులకి సంబంధించినంత వరకూ జన్మభూమి అన్నిటికన్నా మిన్న అనీ, దీక్షాబద్ధులైన ఆంధ్రులు విజయాన్ని సాధించటం తథ్యం అనీ ఈ వాక్యాల్లో కవి చెపుతున్నారు.

భారతీయులనందరినీ 'దేశగర్వము దీప్తిచెందగ' భక్తితో మాతృదేశాన్ని కీర్తించమని కోరుతూ సాగే 'తమ్ముడా' అన్న గేయం ఎంతో స్ఫూర్తిదాయకమైనది. శ్రీలు పొంగిన జీవగడ్డ, పాలుపారిన భాగ్యసీమ భారతావని. వేదశాఖలు ఇక్కడే విస్తరించాయి. ఆదికావ్యమైన రామాయణం ఇక్కడే వెల్లివిరిసింది. 'బాదరాయణాది పరమఋషులకు' ఈ నేల ఆశ్రయమైంది. 'విపినబంధుర వృక్షవాటిక ఉపనిషన్మధువొలికె నిచ్చట' అంటూ రాయప్రోలు ఆధ్యాత్మికంగా భారతీయులు సాధించిన ఉన్నత విలువలను గుర్తు చేస్తున్నారు. పాండవేయుల మహిత రణకథ, కాకతీయుల కథనపాండితి, శౌర్యచండిమలను గొంతెత్తి గానం చేయమని ఉద్బోధిస్తున్నారు.

*మేలికిన్నెర మేళవించీ,*
*రాలు కరగగ రాగమెత్తీ,*
*పాలతీయని బాలభారత*
*పదము పాడర తమ్ముడా!*

నవరసాలు నాట్యమాడేటట్లుగా కవితలల్లిన కాంత హృదయుల గౌరవింపమని చెపుతున్నారు.

ఐతరేయ బ్రాహ్మణంలో 'ఆంధ్ర' శబ్దం తొలిసారిగా కనిపిస్తుంది. రాయప్రోలు 'ఆంధ్ర' గేయంలో "యవన ధాటీ ప్రవాహమును బంధించి ఆర్యావర్త మరసిన ఆంధ్రజాతి" గురించి విస్తారంగా చెప్పారు. కర్నాట రాజ్యరంగముల ఆంధ్రకవులు ఎన్నో గౌరవాల్ని పొందారు. హాలుడు గాథా సప్తశతి పేరిట 'ప్రాకృతపదమంజరీ కంఠముల' అమృతకావ్య ప్రసాదాన్ని పంచాడు. 'బౌద్ధ సూత్రార్థముల్ ప్రవచించి' నాగార్జునుడు అహింసా ధర్మకాండని నిలిపాడు. తెలుగువాడైన పంపడు 'కన్నడ నుడికి వంకలు తీర్చి తొలకరి రచనకు త్రోవదీసిన కవి. అన్నంభట్టు అనే మహాపండితుడు తర్కసముద్రాన్ని పుక్కిటపట్టిన అగస్త్యుడు. బసవరాజు అనే ఆయుర్వేదాచార్యుడు జీవితాన్ని

అంకితం చేసాడు. 'జందెము తెగద్రెంచి క్షాత్రమ్ము నెగియించె అనపోతశర్మ దేశాభిమాన'. అక్కన్నమాదన్నలు గోలకొండ కిరీట కోటి కాంతులు దిద్దినవారు. వీరందరినీ పేరుపేరునా స్తుతిస్తూ సాగే రాయప్రోలు కిన్నెరరాగం ఆంధ్రుల ఆత్మగౌరవాన్ని, ఖ్యాతిని పెంపొందించి తీరుతుంది.

నాదధేనువుని పిండి నవనీతం అందించిన త్యాగరాజస్వామి గురించి, క్షేత్రయ్య ముద్దుపలుకుల గురించి, 'లీలాతరంగణీ కూల తీర్థానందుడయ్యె నారాయణుడ మృతమూర్తి' గురించి కూడా కవి చెపుతున్నారు. ఇటువంటి మహాపురుషుల స్పర్శతో ఈ గడ్డ పులకించిపోయింది.

ప్రస్తుతం 'పెనుజడల్ విరబోసికొని తాండవం బాడు ఈర్ష్యాపిశాచి నట్టింటలోన' అంటూ రాయప్రోలు వాస్తవాలని ఎత్తి చూపిస్తున్నారు. విశ్వవిద్యాలయవీధుల్లో తల్లి తెలుగు సవతి బిడ్డ లాగా అయిపోయిందని విచారం వ్యక్తీకరిస్తున్నారు. 'చావుబ్రదుకులు తేలు నీ సంధియందు' ఈ అభావ వేదాంతం ఏమీ ఇవ్వలేదని అంటున్నారు.

*"పిన్నలూర్ధ్వ ముఖంబు పెద్ద లధో దృష్టి*
*ఉభయ భాగ్యోపాస్తి నుత్త చూపు"*

అందరూ కలిసి కృషిచేస్తేనే పరిస్థితులు చక్కబడతాయని, దేశాన్నిగానీ రాష్ట్రాన్నిగానీ అభివృద్ధి చేయటం వీలవుతుందని సూచిస్తున్నారు.

తెనుగుతల్లి అన్న గేయం ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధాన ప్రాంతాలని స్వస్తి వాక్యాలతో సంధానిస్తూ సాగినతీరు అద్భుతం. మోటుపల్లీ తీరాన విదేశీ వ్యాపారులు లంగరేసి సుంకాలు చెల్లించేవారు. పాకాల చెరువు చెంపలపండు ధాన్యాలను అన్యదేశాధీశులు అడిగి పొందేవారు. అద్దంకి కోడెల ఆబోతులను దూరతీరాలనుంచి వచ్చి కొనుగోళ్ళు చేసేవారు. గోదావరీ ముఖాన కోనసీమ 'నందనోద్యానసౌందర్యమ్ము నెగబోయి', గుంటూరు సీమ సుఫలసంపత్సస్య సురభియై మెఱయు కృష్ణారసశ్యామ, రాయలసీమ రతనాల అంగడి, నెల్లూరి సీమ 'ధవుని పోరి కదల్చి కవిని నేరిమి గెల్చి మీరిన జాణ', 'నేల నాలుగు చెఱగుల నిగ్గుదేలె రాణసూయాణమై తెలంగాణ రేఖ' అంటూ ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య ప్రాంతాలను, వాటి ప్రాధాన్యతని వివరించారు.

*గంగ తలనుండి కావేరి కాళ్ళదాక*
*వెలిగె దిఙ్మోహనమ్ముగా తెలుగుతీవి,*
*తమ్ముడా! మాయనిత్తువె తల్లివన్నె?*
*చెల్లెలా! చిన్నబుత్తువే తల్లి చిన్నె?*

అంత్యప్రాసల ద్వారా, సంబోధనల ద్వారా రాయప్రోలువారి కవిత్వానికి మాధుర్యం, విశిష్టత ఏర్పడ్డాయి.

ఆచారము అనే గేయంలో తెలుగువారి కళావేశాన్ని, చాతుర్యాన్ని రాయప్రోలు విశదీకరించారు. కళలకు కాణాచి ఆంధ్రప్రదేశ్. తీరుతీరుల అలంకారాలు ముగ్గులు

చిత్రించటంలోనూ, పూసలతో అనేక విధాల కుట్టుపనులు అల్లే కౌశలంలోనూ, రాట్నం నుంచి సన్నదారము తీయటంలోనూ, కైవారములు లేకయే వలయము లష్టదళరేఖల నమర్చు కలికితనము' లోనూ ఆంధ్రులతో పోటీపడగల వాళ్ళు లేరు. కళారూపాల్ని ప్రదర్శించటంలో కూడా తెలుగువాళ్ళు తమ ప్రజ్ఞను నిరూపించుకున్నారు.

వెట్టిగొల్లడు గూడ నుయ్యూతలూగంగ
వీధి భాగవతాలు వేసివేసి
ముసలివాండ్రును మీసములు త్రిప్పి కా కెక్క
వీరబొబ్బిలి కథలు వినిచి వినిచి
ఆబాలగోపాల మావేశమున తృళ్ళ
పల్నాటియుద్ధాలు పాడిపాడి

ఆధునికకాలంలో యువతీయువకులు స్వీయసంస్కృతిని అల్పమైందిగా భావించటం మన కళారూపాల్ని, సంప్రదాయాల్ని విడనాడటం కవికి కంటతడి తెప్పిస్తోంది. 'బొమ్మలపెండ్లిడ్లు బాలలు విడిచినారు', అట్లతద్ది పండుగనాడు ఊయలలూగటం మోటుగా ఉందని ముగ్ధలు తలవటం, 'బువ్వమ్మ బంతులన్ కవ్వించి వయసు కావర మబ్బ పండితులు' పాడకపోవటం, 'గొబ్బి తట్టెడు వేళ' కన్యలు పాటలు పాడటాన్ని విస్మరించటం గురించి చెపుతూ ఎంతో ఆవేదన చెందారు. మన సంస్కృతిని మనమే కించపర్చటం, నిరాకరించటం దురదృష్టమని వారి అభిప్రాయం. సంస్కృతిని దూరం చేసుకునే జాతి ఏనాటికీ విలువలని సాధించలేదు.

దేశభాషల న్నింటిలోనూ తెలుగు తీయనైనది. 'కమ్మని మకరంద కణములు స్నేహించి చిన్నారిపలుకులై చిక్కెనేమొ' అని రాయప్రోలు తెలుగు మాటలను ప్రశంసించారు. ఎందరో కవులు తెలుగు ముద్దుపలుకులతో తమ కావ్యగీతాలను తీర్చిదిద్దుకున్నారు. నన్నయభట్టు తన భారతాన్ని 'సంస్కృతంబుతో కొన్ని తెనుంగు లేరి తన కూర్పున కొప్పినయంత' రచించాడు. తిక్కన 'సస్వరమ యాడెడి వేదికబోలు నీ తెలంగాణమునం దనంత సుముఖ స్వరజీవనమైన' శబ్దసంతానాన్ని ఏలాడు. తిమ్మన, సూరనలాంటి కవులు కూడా తెలుగు మాధుర్యాన్ని తమ కవిత్వంలో ఇమడ్చారు. కవి ఇవన్నీ చెపుతూ పూర్వకవుల మాదిరిగానే తానూ తెలుగుసాహితీవనాన్ని పెంచి పోషిస్తానని ప్రతిజ్ఞ చేస్తారు. 'తెలుగు మాన్యము'లో కవి–

పరిణత వాక్కు లస్మదనవద్యకలా కవితా పితామహుల్
స్థిరముగ నిచ్చిరీ తెనుగు దీయని మాన్యము, నిందు నూత్న వ
ల్లరులను, క్రొత్తయంట్లను, ఫలద్రుమజాతులనాటి పెంతు సం
బరమున నే వనప్రియులు మంచెలపై నెలుగెత్తి పాడగన్

తన సాహితీవ్యవసాయం ద్వారా 'మా తెలుగుతల్లి మెడ కిదే మల్లెదండ' అంటూ ఆంధ్రసాహితీ మాతను-అర్చించారు.

జానపద బాణీలో సాగే మరో గేయం 'కీలకము'. ఇందులో కవి ప్రేయసికి తన సందేశాన్ని పంపబోవటం ఇతివృత్తం. కాళిదాసుని యక్షుడు మేఘ సందేశాన్ని పంపగా నలునికై కలహంస కదిలింది. చైతన్యమయమైన జగతిలో దూతకై వెతికానని' కవి చెపుతారు. గేయ ప్రారంభంలో "ఎన్నాళ్ళ కొచ్చావె చిన్నారి చిలుక కన్నారి చూచినట్లున్నాది చిలుక" అనటం ప్రేయసి గురించి కవి ఎంత తపిస్తున్నాడో సూచిస్తోంది.

గువ్వజంటలు చూచి గునిశానె చిలుక
సందెరాగము గాంచి జంకానె చిలుక
అడవిపూవుల తావి కలిశానె చిలుక
గందంపు నీడలన్ కాగానె చిలుక!

ప్రేయసి మీద అనురాగాన్ని రాయప్రోలువారు వెల్లడించిన విధానం చదువరులని కూడా ఆకర్షించి, ఆ అనుభూతిని అందిస్తోంది. 'కవికి దౌత్యము చేదు కాబోలు చిలుక, సుదతి ప్రార్థనమెంత చులకనో చిలుక' అన్న మాటల్లో వారి సుతిమెత్తని మనసు సవ్వడి విన్పిస్తోంది. చిన్నిచిన్ని పదాలతో, తీయని పరవాన్నం వంటి కవిత్వాన్ని చెప్పగల నేర్పు ఒక వరం. నిజంగానే రాయప్రోలువారు 'లలితపుం బరంజముల చిక్కనిపాలను కాచి శర్కరోపలములు' నింపి తన కవితామృతాన్ని రసజ్ఞులకు అందించారు.

ప్రతిభాచక్రము అనే ఖండికలోని శ్రీ రవీంద్రకవి, శ్రీ శివశంకరశాస్త్రి, సరోజనీదేవి, ఆచార్య రాధాకృష్ణ, కృష్ణరాయనాగేశ్వరులు, రామలింగారెడ్డి, కలియుగార్జునుడు అనే గేయాల్లో ప్రతిభావంతులైన వారందరి గురించి రాయప్రోలు గానం చేసారు.

రవీంద్ర కవీంద్రులు భారతీయ సాహితీ మర్యాదల్ని ప్రపంచానికి ఎలుగెత్తి చాటినవారు. రవీంద్రులు మహాపండితులు, తాత్వికులు, ఆలోచనావాది. 'సకల మానవలోక శాంతికై కోయిలవలె ప్రేమ కూజితంబులొనర్చు' సుకవీశ్వరులు కాబట్టి వీరి ప్రభావం ఆనాటి కవులందరిపైనా పడింది. గురుదేవుల ఆవేశ మధుకోశమైన గీతాంజలి గేయాలన్నీ ప్రేమతత్వాన్ని వెల్లడించేవే.

జ్ఞానయోగులు గోరు ఆనంద సంసిద్ధి
కర్మయోగులు పొందగల స్వర్గసౌఖ్యంబు
భక్తియోగులు ఆసపడెడు కైవల్యంబు

రవీంద్రనాథ్ టాగోర్ 'శాంతినికేతనాశ్రమ సాలముల నీడ' పైవన్నీ సాధించారని రాయప్రోలు వివరిస్తున్నారు.

బహుభాషా పండితులు శ్రీశివశంకరశాస్త్రి సాహితీసేవలోనే "తన జీవితాన్ని గడపిన పండితులు.' నీ స్వప్న నగరాల నీ పచ్చ వాకిండ్ల సవదరించుత రుచుల్ శివశంకరీ కవీంద్ర' అంటూ కవి వారిని కీర్తిస్తున్నారు. శాస్త్రిగారి నాదధారలో నేలతల్లి

సంతోషపడుతుందని 'సఫలపుష్ప క్షీర సరసాన్న భోగాలు' దినదినాన ప్రసాదిస్తుందనే విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నారు.

*ఈ తెలంగాణంబు ఈ తేనె మాగాణి*
*నీ మృదూపాసనన్ నిలువనిమ్ము, కవీంద్ర!*

శాస్త్రిగారి కవిత్వం 'వేద ఋక్కులన్ ఆ మంత్రవాక్కులన్ అందియందక యున్న యజ్ఞపూరుషరేఖ' వంటిదనే అంటారు.

'స్వాదుపదావళి సామ్రాజ్యమునకు రాణి' సరోజినీదేవి కవిత్వం విశ్వవ్యాప్తంగా పలువురి మేధావుల ప్రశంసలని అందుకుంది. తామరతూండ్లలో ధవళతల్పము మీద హాయిగా ఆడుతూపాడుతూ విహరించే కలహంస సరోజినిదేవికి ముద్దులమాటలతో సాగే నడకని నేర్పిందేమోనని కవి భావిస్తారు. ఆమె కవిత్వం పన్నీటి సెలయేళ్ళు ప్రవహించినట్లుగా, సన్నతంతుల వీణ సవరించినట్లుగా ఉంటుందని చెపుతారు. స్వాతంత్ర్య సంగ్రామంలో కూడా ఆమె పాల్గొంది. సరోజినీదేవిని 'కామాక్షివై, మహాకాళివై' కదలిరమ్మని రాయప్రోలు ఆవేశంగా అంటారు.

*దౌర్భాగ్య భారత తంత్రతంతులు తెంప*
*సౌభాగ్య భారత జాతకమ్ము రచింప*

స్వచ్ఛందదూతివై, సౌందర్యమాతవై కదిలిరమ్మని, భారతజాతిని దాస్యశృంఖలాల నుంచి విముక్తి చేయమని కోరతారు. భారతకోకిల గురించి తన కవిత్వం ద్వారా వివరించారు.

సర్వేపల్లి రాధాకృష్ణన్ గొప్ప పండితుడు. ప్రాచీన భారతీయ తాత్విక చింతనను సంపూర్ణంగా అధ్యయనం చేసి విదేశాల్లో భారత ఖ్యాతిని ఇనుమడింపచేసిన తత్వవేత్త. వీరి బహుముఖ ప్రజ్ఞ ఖండాంతరాలలోనూ భారతీయులకి గర్వకారణం. అనేక గ్రంథాలను రచించారు. ఎందరో విద్యార్థులకి విద్యాదానం చేసారు. తన పదవీకాలంలో రాష్ట్రపతి పదవికి గౌరవాన్ని తెచ్చారు. 'క్రైస్తవ ధర్మవాఙ్మయ మహోదధిబోవు పడవకు చుక్కాని పట్టినావు' అంటూ రాధాకృష్ణని రాయప్రోలు గౌరవిస్తారు.

*ఏ యవిచ్ఛిన్న ధారాప్రమేయరాగ*
*మం దభిన్న శృతులయి లయించు*
*నా యతీత విజ్ఞాన సమన్వయమును*
*తెలిపినావు రాధాకృష్ణ ధీవతంస!*

వర్తమాన కాలంలో పాశ్చాత్య విషసంస్కృతి పీడలా వచ్చి పడిందని "ఈ వికృతియందు దారి చూపగలవాడొక్క తాత్వికుండె!" రాయప్రోలు ఆశాభావం వ్యక్తం చేస్తున్నారు.

ముట్నూరి కృష్ణారావుగారు, కాశీనాథుని నాగేశ్వరరావుగారు తెలుగు పత్రికారంగానికి ఎంతో సేవలందించారు. ప్రజలను స్వాతంత్ర్య సంగ్రామానికి సిద్ధంచేసిన 'కృష్ణా' ఆంధ్ర పత్రికలను వీరిరువురూ చాలా సమర్థవంతంగా నిర్వహించారు. 'ఈశ్వరుని సొత్తయిన జ్ఞానమెల్ల ప్రజల కెల్ల యెడల సేవ్యమే యను నెఱుక కలిమి' అని నమ్మి ప్రజాసేవకే జీవితాన్ని అంకితం చేసిన వారిని రాయప్రోలు భక్తిగా స్మరించారు.

*ఆర్థిక ప్రణాళికను పరమార్థతత్త్వ*
*మాలికనుగూడ నేక ప్రమాణదృష్టి*
*నారయిచు భక్తపరిభాష ననువదించు*
*శ్రద్ధ తొలక నాగేశ్వర రాయ కలము*

కట్టమంచి రామలింగారెడ్డి గొప్ప విద్వాంసులు. ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనలో వీరు చొరవ తీసుకున్నారు. ఉత్తమాధ్యాపకునిగా వీరు పేరుపొందారు. ఎందరో శిష్యులు దేశదేశాల్లో వీరి పేరుని నిలబెట్టారు.

*లక్ష్యలక్షణ రూపకల్పనల యందు*
*ద్యోతమగు నుదాత్తుల సంప్రయోగరేఖ;*
*అట్లె బింబించెదవు భవదాత్మ సురభి*
*శ్యామల వచోముకురమందు రామలింగ!*

రెడ్డిగారు 'కావ్యసౌభాగ్యరేఖలను మీమాంసించి' నూతన ద్వారాలను తెర్చారు. నవీనతతో తెలుగు నుడికారపు గొప్పతనాన్ని ఇనుమడింపచేసారు.

ఈ గేయంలోనే రాయప్రోలు కొన్ని విలక్షణ ప్రయోగాలు చేసారు. దానిమ్మ పూత వీరికి 'పగడాలు కానుపు'గా కనిపించింది. 'పండువెన్నెల జున్నుబాలు చేసిన రేల' అని మరో సందర్భంలో కవి అంటారు. ప్రకృతిలో సౌందర్యాన్ని దర్శించటం, ఆ సౌందర్యాన్ని మనసునిండా నింపుకోవటం ఇక్కడ గమనించవచ్చు.

అప్పయ్య అనే విలుకాడికి కలియుగార్జునుడు అనే బిరుదు ఉండేది. చిన్నతనంలో భారత రణరంగచరితను విన్నామని, రామాయణ కావ్యంలో రామాదుల విలువిద్య కౌశలాన్ని గురించి తెల్సుకున్నామని, పల్నాటి వీరుల గండ్రగొడ్డళ్ళ రోషాన్ని గురించి, రాజపుత్రుల అల్లెత్రాళ్ళ మ్రోత గురించి ఆలకించామని కవి చెపుతారు. వీటిని వినటమే కానీ చూడటానికి నోచుకోలేదని అంటారు.

*నేటికి ధనుస్సునెత్తి సంధించినావు*
*మా యదృష్టం బిదియె అప్పరాయధన్వి!*

బ్రాహ్మణుడైనా ధనస్సుపట్టిన అప్పయ్యని రాయప్రోలువారు తన కవితద్వారా చిర స్మరణీయుడిని చేసారు.

సాధుశోధన ఖండికలోని గేయాలన్నింటిలోనూ అహింస, శాంతి గురించే ప్రస్తావించారు. బౌద్ధం ఏ జీవిని హింసించరాదని, క్షమాగుణం గొప్పదని చాటి చెప్పింది. 'రెండు వేలేండ్ల కవల నీ ఋషుల భూమి నెత్తి నా వహింసాధ్వజమెత్తుగాను' అంటూ రాయప్రోలు గౌతమబుద్ధుని బోధనలని గుర్తు చేస్తున్నారు.

కాళ్ళు చేతులు నెత్తురు కాఱ శిలువ
మీద 'అపరాధజనుల క్షమింపు' మనుచు
ఈశ్వరుని వేడుకొన్న ఆ యేసుక్రీస్తు
కీర్తి తనవారి కింత దక్కెనె మహాత్మ!

క్రీస్తు, బుద్ధుడు అహింస ప్రాధాన్యతనే నొక్కి చెప్పారు.

బుద్ధభిక్ష అనే గేయం పరోపకారం పరమధర్మమన్న ఆర్యోక్తిని వెల్లడించేది. అనాదిగా ఈ నేలమీద పుట్టినవారు సకల చరాచర ప్రపంచంలోని జీవకోటిని సమానంగా చూడటమే ఉత్కృష్టమైన ధర్మమని నమ్ముతూ వచ్చారు. ఊరికి నాలుగు పక్కలలోనూ చీమల పుట్టల్లో మంచి బియ్యము చల్లేవారు, వేసవిదినాల్లో పక్షుల దాహాన్ని తీర్చటంకోసం ప్రమిదలలో మంచినీరుపోసి ఉంచే బ్రాహ్మణులు ఇప్పుడు ఎందుకు దయావిహీనులయ్యారోనని కవి బాధ పడతాడు. 'రాళ్ళ నిలువున ప్రియదర్శి వ్రాసినట్టి ధర్మపంక్తులు ధూళిలో దాగెనేడు' అని కవి విలపిస్తారు. లేవలేని ముసలిగోవు దగ్గర 'చలికి కప్పుదమన్న వస్త్రంబులే' దని సన్యాసి ఒకరు విలపిస్తున్నాడు. అతను మేత తేలేదు. వృద్ధ గోమాత బాధ చూడలేదు. కొరికివేయుచున్న చలికి ఆ గోవు కదలలేక వణుకుతూ ఉంది. ఏమి చేయాలో తోచక చేయి ఎత్తి గోమాతను కౌగిలించుకున్నాడట ఆ సన్యాసి. ఋంగతో నీళ్ళు మోసుకునిపోవుచున్న ఒక స్త్రీ వెంటనే తోటిజీవులని ఆదుకోవటానికి ముందుకువచ్చింది.

ముందు వెనుకల వచ్చుచున్ పోవుచున్న
పౌరులను జూడలేదామె, వారి మీద
చినిగిపోయిన తన మేని చీర విప్పి
బుద్ధభగవానుని పేరు చెప్పుచును కప్పె

ప్రతిబింబము అనే గేయంలో ప్రేయసిని ఆక్షేపించటం ఉంది. తన హృదయాన్ని ప్రేయసి ఆమె ప్రేమరాహిత్యంతో తూట్లుపొడుస్తున్నట్లు కవి నవ్యవిధానంలో చెప్పాడు.

ఎందుకింత క్రూరంగా నెడల పెడల
చీల్చి చిందరవందర చేసి వైతు
వ్రేలబడిన యీా కుటిల తమాల శిఖల
నిలువుటద్దాన కెదురుగా నిలిచి నెలత?

విరాటపర్వంలోని ఇతివృత్తం ఆధారంగా ఉత్తరాశ్వాసము అనే గేయాన్ని రచించినారు. "చావన్నన్ భయమేల క్షత్రియుల?" అంటూ రాయప్రోలు ఈ గేయం ద్వారా అంతర్లీనంగా భారతస్వాతంత్ర్య సంగ్రామంలో ఉత్సాహంగా పాల్గొనమని సూచించారు.

రవీంద్రుని గీతి అనువాదము 'వసంతము' రాయప్రోలువారి కవన పటిమకు ఉదాహరణ. రవీంద్రుని భావఝురిని తెలుగులో స్వేచ్ఛగా ప్రవహింప చేయటంలో రాయప్రోలు కృతకృత్యులయ్యారు.

నిన్నెఱుంగక ముందె నిన్ను భావించి
ప్రేమించినానోయి బేలనై స్వామి
మావికొమ్మను నేను మన్మథాకార
నిలుపజాలని రక్తి నిన్ను పిల్చేను

ప్రేమప్రకటనలో రవీంద్రుని బాణీని తెలుగులోకి తేవటంలో వీరి ప్రతిభ కనిపిస్తోంది.

తెలుగువారి పెద్ద పండుగ సంక్రాంతి. పండిన పంటలను ఇంటికి తెచ్చుకొని రైతులు సంతోషపడే కాలం. రాయప్రోలు గ్రామీణ వాతావరణాన్ని వెల్లివిరిసేటట్లుగా 'సంక్రాంతి' గేయాన్ని రచించారు. 'వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి, వచ్చింది వచ్చింది లచ్చి సంక్రాంతి' అంటూ సాగే ఈ గేయంలో తెలుగులోగిళ్ళలో సంక్రాంతి సంబరాలను గురించి హృద్యంగా వర్ణించారు. కీట్స్ మహాకవి లాగానే రాయప్రోలు ప్రకృతికి మానవీయత కల్పించారు.[6]

ప్రభాతము అనే గేయంలో 'ప్రథమ పుత్రోదయము వేళ సంతోషంతో భాసిల్లే సంపన్నగృహంలాగా సూర్యోదయం ఉందని వర్ణించారు. 'వెండిగొలుసులు లంకెవేసి ప్రచండమగు నీలితెరలను తూర్పువాకిలి తలుపురెక్కలు తొలిగేటట్లు లాగేది' ఎవ్వరోనని ప్రశ్నిస్తారు. ప్రకృతి వర్ణనలో కవి కొత్త పుంతలు తొక్కారు. సూర్యోదయ వేళలోని కిరణాలు పండు కుంకుమ కలిపి తీర్చిన పచ్చి ముగ్గుల అల్లికలాగా ఉన్నాయని అత్యంత నూతన విధానంలో వర్ణించారు. కాలం అనే నాటకంలోని ప్రథమ అంకంలో సుకవి ప్రవేశించినట్లు ఉషస్సు ప్రవేశము ఉందని చెపుతారు. ఈ గేయంలోనే ప్రేయసి పెదవులని అంటీఅంటని రీతిలో ఆరిపోయే ముద్దులాటల లాగా సమీరములు వీస్తున్నాయని రాయటం కవి భావుకతకి పరాకాష్ఠ.

అబల అధరము నంటి యంటక
ఆఱిపోయెడి ముద్దులట్టుల
తాకి తాకక ఒడలు పులకల
తడియు నొలయు సమీరముల్

యాత్ర అన్న గేయంలో కవి జీవితంలో ఎన్ని ఒడిదుడికులు వచ్చినా తట్టుకొని నిలబడాలని సూచించారు. జీవితమనే నౌకాప్రయాణాన్ని నావికుడు తెలివిగా చుక్కాని

తిప్పుతూ సాగించాలని వివరించారు. బుసలు కొడుతున్న నదీ ప్రవాహాన్ని నల్లత్రాచుతో పోల్చటం నూతనంగా ఉంది. 'ఏటి తల్లికి ఈ మహోత్సవ మధురసంధ్యల ఏటి కోపమని' కవి ప్రశ్నిస్తారు. తల్లి నది చేతులమీదుగా దాటిపోదుము రండి పధికులు అని ఆహ్వానిస్తారు. ఈ గేయంలో రాయప్రోలు వారికి జీవితంపట్ల ఉన్న విశ్వాసం కనిపిస్తోంది. జీవితయాత్రలో విధి ఎవరికీ కీడు తలపెట్టదని చెప్పటం జీవితం మీద ఉన్న గంభీరమైన దృక్పథాన్ని చూపిస్తోంది. ఎమిలీ బ్రాంటీ తన గేయంలో ఇలానే చెపుతుంది.[7]

నమ్మనందుకు ఏమి హేతువు
నావికుని ప్రియమైన పిలుపును
నమ్మి చెడిరే యాత్రికులు వలను
ఇమ్మహీ వలయమ్మునన్

విశ్వాసం జీవితంలో చాలా ముఖ్యమని వివరిస్తున్నారు.

అత్యంత సుకుమారి గురించిన చిత్రణ 'పాలబాన' అనే గేయంలో కన్పిస్తుంది. పాలు అమ్మటానికి వచ్చిన స్త్రీని 'ఏ తల్లి నేర్పెనో ఈ ఇంద్రజాలమ్ము? ఎవరి యింటిని ఆలు? ఎవరు పిండిరి పాలు?' అంటూ ప్రశ్నిస్తారు "పాలమ్ము వ్రత మంత పరమభగవద్వ్రతమె!" అంటారు. 'చిల్క' అనే గేయం కూడా చాలా ఉల్లాసంగా ఉంటుంది. ఇది జానపద బాణీలో సాగుతుంది. తెలుగు సాహిత్యాన్ని చిల్కగా పోలుస్తూ 'పాడితే ఆ చిల్క పారవశ్యము పొంగు' అని కవి అంటారు. 'పరతంత్రతనే మొక్కె' అంటూ దాస్యం కారణంగా ఆ చిల్క కవిత్వాన్ని వినువారులేరైరి అంటారు. ఇంకో విధంగా చూస్తే 'నన్నయభట్టు భారతారణ్యాన పడిపోయె' అనటం ఆదికవి నన్నయను గుర్తు చేస్తోంది. మళ్ళీ చిల్క 'దానిమ్మపండ్లలో తరుణ మాణిక్యాల' తీసిందని కానీ తినబోయి తినలేక తన నోట బిగియించిందని చెపుతారు. దీన్ని తిక్కన అందుకున్నాదని చివర్లో వివరించారు. నన్నయ భారతరచనని తిక్కన కొనసాగించాడు.

సుబ్బారావుగారు రానున్న కాలంలో జాతి ఎదుర్కోబోయే వివిధ సమస్యలని సవాళ్ళను ముందుగానే ఊహించిన దార్శనికులు. 'సత్తాకజయంతి'లో నరుని స్వాతంత్ర్యమై, నారీ స్వాతంత్ర్యమై, అర్థస్వతంత్రమై వ్యక్తి స్వతంత్రమై అందరూ సుఖపడటమే మన స్వాతంత్ర్యానికి అర్థం అని వెల్లడించారు. మహిళా స్వాతంత్ర్యం చాలా అవసరమని, ఆర్థిక స్వాతంత్ర్యం కీలకమని వారి భావన.

రాయప్రోలు వారి కవిత్వము 'ఆంధ్రావళి'కి అన్ని కాలాల్లోనూ ప్రేరణనిస్తూ జీవితంలో మార్గదర్శకత్వం వహిస్తుంది. ఆంధ్రులలో ఆత్మగౌరవాన్ని నింపి వారిని జాతి పునర్నిర్మాణ దిశగా నడిపే విధంగా కవిత్వాన్ని అందించిన రాయప్రోలు చాలా గొప్ప విజయం సాధించారు. 'ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురైనా' రాయప్రోలు వారి ప్రబోధాన్ని విస్మరించకుండా ప్రవర్తించటమే వారికి మన నివాళి.

రాయప్రోలు సుబ్బారావుగారు తెలుగులోని గొప్పకవుల్లో ఒకరు.

## వివరణలు:

1. ఆనందం చాలా ప్రాధాన్యత కలదని తైత్తిరీయోపనిషత్తు వివరిస్తోంది.

ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్
ఆనందాద్ధ్యేవ ఖలిమాని భూతాని జాయంతే
ఆనందేన జాతాని జీవంతి
ఆనందం ప్రయం త్యభిసంవిశంతి

2. భవభూతి ఉత్తరరామ చరిత్రములో ఈ విధంగా ప్రతిపాదించారు.

కాలేనా వరణాత్యయూత్ పరిణతే యత్ స్నేహసారేస్థితం
భద్రం తస్య సుమామషస్య కథ మప్యేకంహి తత్. ప్రాప్యతే.

3. వ్యాసభారతంలో స్త్రీని ఉన్నతపదవిపై అధిష్టింప చేయటానికి ధృతి, సహనము, దయ, శుచిత్వము; కారుణ్యము, ప్రసన్నవాక్కు, మిత్రులపట్ల అనభిద్రోహము అనే ఏడు గుణాలు ముఖ్యమైనవని పేర్కొన్నారు.

ధృతిః క్షమా దయాశౌచం
కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం దానభిద్రోహం
సప్తైతాః సమిధః స్త్రీయః

4. టెన్నీసన్ తన గేయం నేషనల్ సాంగ్‌లో ఇలా పేర్కొన్నాడు.

*There is no land like England*
*where'er the light of day be*

5. వర్డ్స్‌వర్త్ ఒక కవితలో ఇలా పేర్కొన్నాడు -

*travelled among the I unknown men*
*in lands beyond the sea*
*nor England did I know till then*
*what love I bore to thee*

6. కీట్స్ తన కవిత 'టు ఆటమ్' లో ఈ విధంగా చిత్రించారు.

*To bend with apples the moss'd cottage - trees*
*And fill all fruit with ripeness to the core.*

7. 'ద ఓల్డ్ స్టాయిక్' అనే గేయంలో ఎమిలీ బ్రాంటీ ఇలా రచించారు.

*"Yes, as my swift days near their goal,*
*'Tis all that I implore;*
*In life and death a chainless soul*
*with courage to endure"*

# దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి ఆంధ్రభావకవులలో అగ్రశ్రేణికి చెందిన కవి. కృష్ణశాస్త్రి పిఠాపురానికి సమీపాన ఉన్న చంద్రపాలెం అనే గ్రామంలో 1897 సంవత్సరంలో జన్మించారు. వీరి పూర్వీకులందరూ పండితులు కావటం వల్ల సత్సాంగత్యం, సదాభ్యాసం, సాహిత్యాభినివేశం చిన్నతనంలోనే లభ్యమయ్యాయి. పదాలపై వీరికి పసిప్రాయంలోనే పట్టు లభించింది. కూచి నరసింహం, రఘుపతి వెంకటరత్నంనాయుడు గార్ల ప్రేమాదరణల వల్ల ఆంగ్లసాహిత్యంపై అభిరుచి కలిగింది. బసవరాజు, చింతా, వేదుల, రాయప్రోలు మొదలైన వారితో స్నేహం కలిసింది. ఆరంభంలో సామ్యవాద ఉద్యమ ప్రభావం వీరిపై పడింది. బ్రహ్మసమాజ కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొనేవారు. ఆ తర్వాత హరీంద్రనాథ ఛటోపాధ్యాయ, శివశంకరస్వామి లాంటి వారితో సాహితీ బంధుత్వం ఏర్పడి కృష్ణశాస్త్రిగారి జిజ్ఞాస, కవితాశక్తి అభివృద్ధి చెందాయి. ఎన్ని అవాంతరాలు ఏర్పడినా వెనకంజవేయక సంఘసంస్కరణోద్యమానికి నడుంకట్టారు. హరిజనుల అభ్యున్నతికి కృషిచేయటం వీరి నిబద్ధతకి నిదర్శనం.

కృష్ణశాస్త్రిగారి భావతరంగిణి ఆంధ్రప్రదేశ్‌లోని సాహితీప్రియులని ఎంతగానో ప్రభావం చేసింది. కృష్ణపక్షం, అమృతవీణ, మంగళకాహళి, పుష్పలావికలు, అరుణరథం, ధనుర్దాసు, శ్రీవిద్యాపతి, పల్లకీ, బహుకాల దర్శనం మొదలైన రచనలు వీరి భావుకతను, ప్రేమతత్వాన్ని వివరిస్తున్నాయి. వీరి కవితాశక్తికి ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదు లభించింది. ఈ కవితాచంద్రునికి ఎన్ని నూలుపోగులిచ్చి గౌరవం, భక్తి చూపించాల్సి ఉంటుంది!

కృష్ణశాస్త్రి అనేక సినిమాలకు పాటలు రాసారు. యక్షగానాలను, భక్తినాటకాలను, వ్యాసాలను రాసారు. రేడియోలో అనేక కార్యక్రమాలను రూపొందించారు. ఆంధ్ర అభ్యుదయరచయితల సంఘానికి, నవ్య సాహిత్య పరిషత్‌కు అధ్యక్షులుగా పనిచేసారు.

కృష్ణశాస్త్రి స్వేచ్ఛాప్రియత్వం వీరి రచనల్లో కనిపిస్తుంది. సంప్రదాయగతమైన ఛందస్సులనే కాక నూతన ఛందస్సులను కూడా గ్రహించి తమ ప్రతిభతో వాటికి పేరుతెచ్చారు. దుఃఖము లోతు గ్రహించిన ఈ కవి దుఃఖానికి అతీతమైన స్థాయికి చేరుకొన్నారు. ఈ కవి హృదయంలో ప్రీతి అంకురించి, ప్రేమతత్వం పెరిగింది. కృష్ణపక్షం లాంటి రచనల్లో వీరి ప్రేమతత్వం కనిపిస్తుంది. ఎందరో రచయితలకు ఆదర్శమయ్యారు.

1963లో ఆయన గళం పోయింది. "గొంతు మూగపోయినా గుండె మ్రోగుతూనే ఉంది" అంటూ వీరు తమ కలాన్ని కదలిస్తూనే ఉండేవారు. 1980 ఫిబ్రవరి, 24 నాడు దేవులపల్లివారు 'ఆనంద తేజోంబునిధులకు' నాలపించటానికై సుదూర తీరాలకు సాగిపోయారు.

# 18. కృష్ణపక్షంలోని భావకవిత్వ ధోరణులు, ప్రేమతత్వం

ఆంగ్ల కాల్పనికోద్యమ ప్రభావంతో తెలుగులో మొదలైన ఒక కవితోద్యమాన్ని భావకవిత్వంగా పిలుస్తున్నారు. వాస్తవానికి ఆంగ్లసాహిత్యంలో ఎలిజిబెత్ యుగానికి చెందిన కవులు మొదటి కాల్పనికకవులు అని విమర్శకుల అభిప్రాయం. అనంతరం 1798లో విలియం వర్డ్స్‌వర్త్, కాల్‌రిడ్జ్ కవులు ఇద్దరూ కలిసి 'లిరికల్ బాలడ్స్' ప్రచురించారు. దీనితో కాల్పనికోద్యమం ప్రారంభమైంది. ఈ కవితోద్యమంలో స్వేచ్ఛగా కవితాగానం చేసిన అగ్రశ్రేణి కవుల్లో విలియం వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్స్, బర్న్స్, బైరన్ మొదలైన పేర్లు వినిపిస్తాయి. ఆంగ్ల సాహితీ విమర్శకులు కాల్పనికోద్యమాన్ని అనేక విధాలుగా నిర్వచించారు. వాల్టర్ పాటర్ సౌందర్యానికి నూతనత్వాన్ని చేర్చటం కాల్పనికోద్యమమని నిర్వచించారు. ఆంగ్లకాల్పనికోద్యమ ప్రధాన లక్షణాలలో ఆత్మాశ్రయత, విషాదం, ప్రకృతి ప్రీతి, మానవతావాదం, ఆడంబర నిరసనం మొదలైనవి కనిపిస్తాయి.

తెలుగులో కూడా నన్నయభట్టు భారతంలోనే భావకవితా రీతులు ఉన్నాయి. ప్రకృతి వర్ణన, ఆత్మాశ్రయత మొదలైన లక్షణాలు నన్నయపద్యాల్లో అనేకచోట్ల కనిపిస్తాయి. పారిజాతాపహరణం, మనుచరిత్ర, పోతన భాగవతం, శ్రీనాథుని కాశీఖండము లాంటి కావ్యాల్లో హృదయాహ్లాదాన్ని కలిగించే కవిత్వం ఉంది. వీటన్నింటిలోనూ భావకవితా లక్షణాలు గోచరిస్తాయి. భావ కవిత్వము అనే పదం మొదట ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహములో కనిపిస్తుంది.[1] అయితే, ఆధునిక కాలంలో 'భావకవిత్వం అనుపదం గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు సృష్టించారని గిడుగువారు తమ గ్రంథంలో వివరించారు. ఆధునిక తెలుగు కవులలో రాయప్రోలు వారి కావ్యంలోనే భావపదము, భావగీతము అనే పదాలు కనిపిస్తున్నాయి. వీరి ఆంధ్రావళి కావ్యంలో భావకవితా యుగ లక్షణాలు ఎక్కువగా కన్పిస్తాయి. విశ్వనాథవారి మాటల్లో "కవి యొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురము, ఒక అంతర్నిగూఢతాపము, ఒక చిన్న కావ్యములో ఊదబడినచో" అది భావ కవిత్వము. శ్రీశ్రీ, కవికొండల, పంచాగ్నుల మొదలైనవారు వివిధ విధాలుగా భావకవిత్వాన్ని నిర్వచించారు.

ఈ వాక్యాలు రాస్తున్న రచయిత అభిప్రాయంలో "ఆకాశంలో స్వేచ్ఛగా ఎగిరే పక్షిలా కవి తన భావాన్ని సహజధోరణిలో భావ ప్రధానంగా చెపుతున్నప్పుడు చదువరుల గుండెల్లో అవి ప్రతిధ్వనించితే" దాన్ని భావకవిత్వంగా పేర్కొనవచ్చు.

భావకవిత్వంలో విభిన్న శాఖలు ఉన్నాయి. వీటిలో ప్రణయ కవిత్వము, ప్రకృతి కవిత్వము, భక్తి కవిత్వము, దేశభక్తి కవిత్వము, సంస్కరణ కవిత్వము, స్మృతికావ్యాలు మొదలైనవి ముఖ్యమైనవి.

దేవులపల్లిని ఆంధ్రాషెల్లీగా పలువురు కీర్తిస్తారు. వీరిపై పాశ్చాత్య సాహితీమూర్తులైన వర్డ్స్‌వర్త్, కాల్‌రిడ్జ్, షెల్లీ, కీట్స్, బైరన్ మొదలైనవారి ప్రభావం పడింది. బ్లేక్ మానవతావాద దృక్పథం కూడా కృష్ణశాస్త్రి రచనలని ప్రభావం చేసింది. మాల్మార్మ్, క్రోచ్ కవిత్వం కూడా వీరి కవిత్వాన్ని ప్రభావం చేసింది. ప్రఖ్యాత భారతీయ

కవి టాగోర్ భావధార కృష్ణశాస్త్రిని ఆకర్షించింది. టాగోర్ ప్రేమతత్వం, భావలాలిత్యం, మధురభక్తి కృష్ణశాస్త్రి రచనల్లో అనేకచోట్ల కనిపిస్తాయి. విశ్వనాథవారు ఈ కారణంవల్లనే కృష్ణశాస్త్రిని తెలుగు టాగోర్ అన్నారు.

ప్రఖ్యాత హిందీ కవి సుమిత్రానందన్ పంత్ రచనావిధానానికి కృష్ణశాస్త్రి రచనావిధానానికి చాలా సారూప్యాలు కనిపిస్తాయి. గురజాడ, వేంకట పార్వతీశ్వర కవులు, దువ్వూరి, బసవరాజు మొదలైన వారి రచనలు కృష్ణశాస్త్రికి మార్గదర్శకత్వం వహించాయి. సూఫీ కవిత్వంలోని మార్మికత, చైతన్యుల మధుర భక్తి సిద్ధాంతం, వైష్ణవ భక్తి సాహిత్యం కృష్ణశాస్త్రిగారి సాహిత్యపుటవగాహనను అధికం చేసాయి.

కొంతవరకూ ఆంగ్లసాహిత్య ప్రభావం వల్ల, చాలావరకూ దేశంలోనూ, సాహితీక్షేత్రంలోనూ నెలకొన్న పరిస్థితులవల్ల మొదలైన కాల్పనిక వాదంలో స్వేచ్ఛావాదిగా రచనలు చేసిన కృష్ణశాస్త్రి ఎందరో కవులను ప్రభావం చేసాడు.

నిజమైన ప్రేమ భౌతికమైనది కాదు. విశ్వమానవ ప్రేమ వ్యక్తిలోని స్వార్థప్రవృత్తిని తగ్గించి సర్వజీవకోటిలోనూ దైవత్వాన్ని దర్శించే మహోన్నతస్థాయికి చెందింది. ప్రేమస్వరూపం అవగతమైననాడు పరమేశ్వరుని ప్రేమకు పాత్రులవుతారు. కృష్ణశాస్త్రిగారి రచనలన్నింటిలోనూ వారి వ్యక్తిత్వం కనిపిస్తుంది.

అద్భుతమైన పదబంధాలను ప్రయోగించటంలోనూ, ఊహాచిత్రముల ఉపయోగములోనూ, పదచిత్రములు కల్పించటంలోనూ కృష్ణశాస్త్రిగారి కవిత్వం ప్రథమశ్రేణికి చెందింది. అసలు తన శైలి ద్వారానే అఖిలాంధ్ర పాఠకుల హృదయాలలో కృష్ణశాస్త్రిగారు చెరగని ముద్రవేసారని భావించవచ్చు.[2] వీరి ఆత్మాశ్రయ కవితారీతులు కృష్ణపక్షం, ప్రవాసము, ఊర్వశిలలో కనిపిస్తాయి. కృష్ణపక్షం కవితా సంపుటిని 1925లో మొదటిసారిగా ప్రచురించారు.

కృష్ణశాస్త్రి భావతరంగిణి చతుర్విధముల ప్రవహిస్తుందని, అందులో స్వతంత్ర బుద్ధి, దుఃఖము, ప్రేమాంకుర వర్ణనము, ఈశ్వరారాధన ముఖ్య వేణులని శివశంకరశాస్త్రి వివరించారు.

కృష్ణపక్షంలోని తొలి గీతం 'ఆకులో ఆకునై' భావకవి అనంతస్వేచ్ఛాతత్వాన్ని, ప్రకృతి ప్రేమను నిరూపిస్తుంది. ప్రకృతిని చూసి పరవశించిన కవికి కూడా ప్రకృతిలో లీనమైపోవాలని ఉంది. మానవ సహజమైన అనుభూతులను కవి వెల్లడిస్తున్నారు.

ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా
ఎటులైన
నిచటనే యాగిపోనా?

ప్రకృతి అందాలను చూసి మైమరిచిపోయిన కవి తాను అణువణువునా ప్రకృతిలో మమేకమవ్వాలని కోరుకుంటున్నారు. అందుకే ఆకులో ఆకుగా, పూవులో

పూవుగా ఉండాలన్న ఆకాంక్ష. అదవి అంటే జీవితం. బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్న ఆ క్షణంలోనే అంతా స్తంభించిపోవాలని, ఎలాగో ఒకవిధంగా ఆ క్షణికానందాన్ని శాశ్వతం చేసుకోవాలని కవి తలపు.

చైతన్యమే పరమాత్మ. దీనికి చిరుగాలిని, సెలఏటిని ప్రతీకలుగా గ్రహించారు. అఖండమైన పరమాత్మను చేరాలి అన్నదే జీవాత్మ సంవేదం.

*పగడాల చిగురాకు తెరచాటు తేటినై*
*పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గునై*

సామాన్య దృష్టికి జడపదార్థమైన 'విరి' ఈ కవి దృష్టిని పరువంపు చేడె. దానికి చిన్నారి సిగ్గు ఉంది. ఇలా ప్రకృతిని రమణీయంగా వర్ణించటం ఈ భావకవికే చెల్లింది. బాహ్యమైన ప్రకృతిని కాక దాని అంతఃసౌందర్యాన్ని దర్శించటమే ఇతనికి ఇష్టం. ప్రకృతిలోని అంతఃసౌందర్యం కవి హృదయాన్ని స్పృశించింది. కృష్ణశాస్త్రి ప్రకృతికి మానవత్వాన్ని ఆపాదించి దానిలో ఒక ఊహా సౌందర్యమూర్తిని దర్శించాడు.

కవి తన గేయసంపుటికి కృష్ణపక్షం అని పేరుపెట్టటం చాలా అర్థవంతమైంది. కృష్ణపక్షం విషాదానికి సంకేతం. ఈ గేయాలు అంతటా విషాదఛాయలు అలముకొని ఉన్నాయి. కృష్ణపక్షం తర్వాత వెలువడిన కవితాసంపుటి ప్రవాసం. దీన్లో కవి విరహం వర్ణించబడింది. ప్రేయసి సాన్నిధ్యాన్ని అందుకోవటం దీనిలోని ఇతివృత్తం. కృష్ణశాస్త్రి విరహవేదన అంతా ప్రవాసంలోని వివిధ గేయాల్లో కనిపిస్తుంది. దీని తర్వాత కృష్ణశాస్త్రి ఊర్వశి సంపుటిని వెలువరించాడు. ఊహాసుందరిగా ఊర్వశిని భావించుకొని తన సౌందర్యతృష్ణకు ఆమెను ఆలంబనగా చేసుకొని తీవ్ర భావోద్వేగంతో అనేక కవితలను రచించాడు. నిజానికి ఈ ఊర్వశి విశ్వసౌందర్యానికి ప్రతీక. స్వేచ్ఛాగానముపై జాన్‌కీట్స్ ప్రభావం చాలా కన్పిస్తుంది. కీట్స్‌కవి "ఓడ్ టు నైటింగేల్" కవితా విధానం ఇక్కడా ఉంది. కృష్ణశాస్త్రి గేయం వ్యక్తిస్వేచ్ఛను, నవచైతన్యాన్ని ప్రతిపాదిస్తుంది.

*నవ్వివోదురు గాక నా కేటి సిగ్గు*
*నా యిచ్ఛయే గాక నా కేటి వెరపు?*

సామాజికమైన స్వేచ్ఛ అనివార్యతను, సాహిత్యపరంగా చైతన్యాన్ని పై పదాలు వెల్లడిస్తున్నాయి.

కల విహంగముల పక్షముల తేలియాడి అనటం కీట్స్ But on the viewless wings of poesy మాటలను స్ఫురిస్తున్నాయి. నైటింగేల్ గానంతో మైమరచిన కీట్స్ కవిత్వ దీర్ఘదృష్టి పక్షాలపై నైటింగేల్ వద్దకు పయనమవ్వాలని ఆశిస్తాడు. సింహాసనాన్ని అధిరోహించి ఉన్న జాబిలి రాణి వద్దకు కవిత్వ రెక్కలు అల్లాడిస్తూ చేరానని కీట్స్ చెపుతాడు[(3)] ఈ భావాన్నే వివరిస్తూ కృష్ణశాస్త్రిగారు ఇలా అంటున్నారు.

'పక్షి నయ్యేద చిన్ని ఋక్షమయ్యేదను
మధుప మయ్యేద చందమామనయ్యేదను
మేఘ మయ్యేద వింత మెరుపు నయ్యేదను"

ప్రకృతిలోని ప్రతి విషయంలోనూ తనని చూసుకుంటూ తాదాత్మ్యం చెందటం గమనించాలి.

తెలిమబ్బు తెరచాటు చెలి చందమామ
జతగూడ దోబూచి సరసాలనాడి
దిగిరాను దిగిరాను దివినుంచి భువికి
నవ్విపోదురు గాక నాకేటి సిగ్గు

పై పదాల్లో కీట్స్ భావాలు ప్రతిబింబించటం చూడాలి. కృష్ణశాస్త్రి మరో సందర్భంలో 'క్రౌర్యకౌటిల్య కల్పిత దాస్య శృంఖలములు తమంతనె చెదరిపోవ' అంటారు. వీరి స్వేచ్ఛాగానం పరాధీనత పోయి జాతి స్వేచ్ఛావాయువుల్ని పీల్చిన బంగారు గడియల్ని స్మరిస్తూ సాగిన గేయం. "గగన తలము మార్మోగగ కంఠమెత్తి జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు" అని వీరు ఆలాపించారు. జాతి స్వేచ్ఛకై ప్రాణ సుమములర్పించు ఈశ్వర యోధులని స్మరిస్తారు. దేశభక్తి వీరి కవితల్లో అనేకచోట్ల ప్రకటితమైంది.

'నేను' అనే కవితలో కూడా కృష్ణశాస్త్రి తన స్వేచ్ఛాప్రియత్వాన్ని వెల్లడించారు. తాను స్వేచ్ఛా కుమారుడనని, ఆకాశమార్గానసాగే విహంగాన్నని చెప్పుకున్నారు. ఇక్కడ కవి స్వేచ్ఛ పరమార్థం దైవాన్ని గ్రహించటమని చెపుతారు. రాజవీధుల రతనాల రథమునెక్కి వెడలు నిర్జీవ పాషాణ విగ్రహంబ, క్షుద్ర మందిరాంతర జీర్ణకుడ్య తలములందు కన్నులు మూసి ఒడలు మరిచి కులికే దివాంధమా అంటూ వీరికి బానిసలకి తేడాలేదని అంటారు. స్వేచ్ఛగా ప్రకృతిలో లీనం కాని వారిని కవి నిరసిస్తున్నట్లుగా ఉంది.

బ్లేక్ గేయం 'రీడ్స్ ఆఫ్ ఇన్నోసెన్స్' చదివాక ఆ స్ఫూర్తితో కృష్ణశాస్త్రి 'వెర్రిపాట' రాసారు. ఈ గేయం ఒక అనువాదంలా కాక కవి ఎంతో భావపూరితంగా రాసినట్టు కనిపిస్తుంది.

సందె కెంపులు లోక మెల్లెడ
చిందులాడగ పొలముగట్టున
సందె మబ్బుల వింతలేవో
వెదకికొను చుంటిన్

బ్లేక్ ముగింపులా కాకుండా కృష్ణశాస్త్రి మార్చి రాసారు. 'మరచి విశ్వము మరచి మేనే మరిచి సర్వము నన్ను నేనె' అంటూ సాగే ఈ పాటలోని స్పందన అద్భుతం. ఈ గేయం ద్వారా కవి తన గేయాలు పరమాత్మని సంతృప్తి చేయటం కోసం ఉద్దేశించినవని

వెల్లడించారు. ఆంగ్ల కవిత్వంలోని మార్మికతని తెలుగులో వివరించిన వైనం చాలా చక్కగా ఉంది. బ్లేక్ మానవతావాదమే కృష్ణశాస్త్రికి ఆదర్శమైంది.

మరణవేదన కృష్ణశాస్త్రిగారి గేయాలలో అనేకచోట్ల కన్పిస్తుంది. ఏను మరణించుచున్నాను అన్న గేయంలో జీవుని పరివేదన కన్పిస్తుంది. భౌతికమైన శరీరం కృశించిన తర్వాత బంధుమిత్రులెవ్వరూ ఆ జీవి గురించి శోకించరు. ఏదో ఒకనాడు ఒక్కపెట్టున జీవితం ఆగిపోతుందనే కఠోర వాస్తవం వ్యక్తిని చాలా బాధపెడుతుంది. అందుకే కృష్ణశాస్త్రి 'ఏను మరణించుచున్నాను ఇటు నశించు నా కొరకు చెమ్మగిల నయనమ్ము లేదు' అంటారు. మరణం గురించిన ఒక విధమైన తాత్వికచింతన ఇక్కడ కనిపిస్తుంది. పి.బి.షెల్లీ తన గేయం 'డెత్'లో కూడా ఇదే విధమైన భావాల్ని వివరించాడు. "మొదట మన సంతోషాలు పోతాయి, ఆ తర్వాత మన ఆశయాలు, అనంతరం మన భయాలు...[4] మట్టి మట్టిలో కలుస్తుంది! అని షెల్లీ మరణవేదనని వెల్లడించారు. కృష్ణశాస్త్రి ఈ విధంగా చెప్పారు-

*నా మరణశయ్య పరచుకొన్నాను నేనె!*
*నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను*
*నేనె నా పయి వాలినా, నేనె జాలి*
*నెదనెద గదించినాను, రోదించినాను.*

వర్డ్స్‌వర్త్ కవి 'డాఫోడిల్స్' గురించి మధురకవిత్వం చెప్తే కృష్ణశాస్త్రి తన కవితావస్తువుగా 'విరిచేడె'ను స్వీకరించి భావాలను ప్రకటించారు. రంగురంగుల రేకలను సొగసైన చీరలలాగ, మంచుబిందువులని ముత్యాలుగాను వర్ణించాడు. వాడీవాడని ఈ పుష్పాలను స్త్రీలగా చెప్పటం చూడాలి.

*రంగురంగుల సొగసుచీరల ధరించి*
*నవ్వు వెన్నెల గాయు క్రొన్ననల నడుమ*
*వాడివాడని యీ విరిచేడె తాల్చు*
*మంచుముత్తియముల గన మది కరంగు*

సౌందర్యంపై తన అభిమానాన్ని కృష్ణశాస్త్రి పై పద్యాల్లో నిక్షిప్తం చేసారు. వర్డ్స్‌వర్త్ దృష్టిలో ప్రకృతియే పరమోత్తమమైన పాఠశాల. నాగరిక జీవితంలోని అశాంతిని ప్రకృతి దూరం చేయగల శక్తివంతమైందని వీరి విశ్వాసం. 'అమల మోహన సంగీతమందు హృదయ దళన దారుణ రోదన ధ్వనులవిందు' అన్న కృష్ణశాస్త్రి భావాలు వర్డ్స్‌వర్త్ భావాలతో పోల్చదగినవి. వర్డ్స్‌వర్త్ లూసీగేయాలు కృష్ణశాస్త్రి ఊర్వశిలాంటివి. వర్డ్స్‌వర్త్ తన ప్రకృతివర్ణన ద్వారా వెల్లడించిన ఆధ్యాత్మిక భావాలు చాలా నిగూఢమైనవి. ఈ కవి గేయాలలో ముఖ్యంగా "ఇమ్మోర్టాలిటీ ఓడ్," "టింటర్న్ ఎబ్బీ" మొదలైన వాటిలో ఆయన జీవన తాత్వికత కనిపిస్తుంది. కృష్ణశాస్త్రి మహతిగీతాలు, నిగమశర్మ మొదలైనవి ఆయన ఆధ్యాత్మిక దృక్పథాన్ని నిరూపిస్తాయి.

కృష్ణశాస్త్రి 'నిశాలోచనము' అనే గేయం చాలా ప్రత్యేకమైంది. దుఃఖంతో తనకు ఎడబాటు కలిగిస్తుందనే ఆలోచనతో కవి మరణాన్ని వలదంటాడు. జీవితానికి, దుఃఖానికి మధ్య ఉన్న సంబంధాన్ని తెల్సుకున్న కృష్ణశాస్త్రి మరణాన్ని కూడా ఒక గాఢనిద్రగానే పరిగణించినట్లు అనిపిస్తోంది. సౌందర్య నైరాశ్యాలు రెండూ ఒకో చోట వహిస్తాయని కీట్స్ అంటాడు.

ఎద కరుగునట్లు సన్నని యెలుగుతోడ
నట్టి తలలెత్తి పాట కూకొట్టు చేద్దు

కృష్ణశాస్త్రి పై విధంగా నిశిని 'రెక్కలం దాల్చి పరతెంచు రేల తొంగి కారు కాటుక చీర సింగార మొదవ' వ్యవహరించాడు. దుఃఖమే తనకు తోడునీడగాగ రాత్రిలో కళ్ళు తెరచి కాలం గడుపుతూ ఉన్నానని అంటాడు. ఇది షెల్లీ కవి 'టు నైట్' అనే గేయంలో చీకటిని రాత్రియొక్క కురులుగా వర్ణించిన విధానంగా ఉంది.

కృష్ణశాస్త్రి అనంత ప్రేమతత్వం 'ఏల ప్రేమింతును?' అన్న గేయంలో కన్పిస్తుంది. అనంత ప్రేమమూర్తి పరమేశ్వరునిపై కలిగే గాఢమైన ప్రేమకు కారణాలు కనపడవు. పుష్పం సౌరభాన్ని వెదజల్లటం ఎంత సహజమో, చందమామకు చంద్రికలను వెదజల్లటం ఎంత సహజమో ఈ ప్రేమభావన కలగటం కూడా అంతే సహజమని వీరి విశ్వాసం. ఈ గేయంలోని రెండో భాగంలో కవిత్వం చెప్పటానికి కారణాల్ని కూడా కవి చెపుతున్నారు.

మావిగొన్న కొమ్మను మధుమాసవేళ
పల్లవము మెక్కి కోయిల పాడుటేల?

కవిత్వం ఎందుకు రాస్తున్నావన్న ప్రశ్నకు కృష్ణశాస్త్రి సమాధానాన్ని ఇక్కడ చూడవచ్చు. కవిత్వం ఇతరుల ఆనందానికా, తన బాగు కొరకా లేదా 'గాన మొనరింపక బ్రతుకు గవడబోకొ' అని కవి చెపుతున్నాడు. దీనిలో కవిత్వం కవిత్వం కోసమే అన్న వైఖరి కనిపిస్తోంది. కాల్పనిక కవుల దృష్టిలో కవిత్వం లతకు కొత్త తీగలు వచ్చినంత సహజంగా రాకపోతే అట్టి కవిత్వం రాకపోవటమే మంచిది. ఇదే దృక్పథంతో కృష్ణశాస్త్రి కవితాగానం చేసారు.

షెల్లీ తన గేయం 'లవ్స్ ఫిలాసఫీ'లో భౌతిక ప్రేమతత్వాన్ని ప్రకృతి ఎలా ఆవిష్కరిస్తుందో తెలిపారు.[5] కృష్ణశాస్త్రి 'ఏల ప్రేమింతును'. గేయంలో దాన్ని పరిపూర్ణమైన ప్రేమతత్వంగా రూపొందించాడు.

మరణించినవారి మీద రచించే శోకగీతాన్ని 'ఎలిజీ'గా ఆంగ్లసాహిత్యంలో వ్యవహరిస్తారు. షెల్లీ తన మిత్రుడైన కీట్స్ మృతికి చింతిస్తూ 'అడోనియస్' అన్న స్మృతికావ్యాన్ని రచించాడు. కృష్ణశాస్త్రిగారు తన మిత్రుడైన రామమూర్తి మరణానికి తీవ్రబాధకు లోనయి ప్రవాసము పేరుతో ఒక కావ్యఖండికను రచించి అంకితమిచ్చారు.

మహాకవి గురజాడ తెలుగు ఆధునిక కవిత్వంలో ఒక గొప్ప పేరు. వీరి కన్యాశుల్కం తెలుగులో చాలా పేరుపొందిన నాటకం. కృష్ణశాస్త్రి ఈ అభ్యుదయవాదికి అక్షరనీరాజనం అందించారు.

"గుత్తునా యని జాతి ముత్యాల్
గుచ్చినాడే మేలి సరముల
ఇత్తునా యని తెలుగుతల్లికి
ఇచ్చినాడే భక్తితో!"

కారుచీకటి క్రమ్మిన కాలంలో, చదల మబ్బులు కమ్మినపుడే గురజాడ తన కవితా కాంతిరేఖలతో జాతికి దారి చూపించిన వైతాళికుడు. వీరి మరణంతో రంగవల్లిక మాయమైందని, చండతేజం మాసిపోయిందని కవి వివరణ. 'సందెకెంపులు సాగిపోయెను వెదుకుచున్నారా' అని కృష్ణశాస్త్రి ప్రశ్నిస్తున్నారు. గురజాడ చూపించిన ఆదర్శమార్గంలోనే నడవాలన్న ఆకాంక్ష ఇక్కడ కన్పిస్తుంది.

'నా జీవితము' అనే గేయంలో కవి జీవనవైరుధ్యాన్ని గురించి చెపుతున్నాడు. తన జీవితము తనకే వింతగా తోస్తోందని జిలుగు వెన్నెలతో, చిమ్మచీకటులతో నిండి ఉందని అంటాడు. చీకటివెలుగుల సంగమమే భౌతిక జీవనం. ఆశనిరాశలు ఒకవేపు, మంచిచెడులు మరొకవేపు' ఉండి మనిషిని విభిన్నదిశలవేపు లాగుతుంటాయి. 'అమలమోహన సంగీతమందు హృదయ దళన దారుణ రోదన ధ్వనులు విందు' అనటంలో కృష్ణశాస్త్రి విషాదం కనిపిస్తోంది. నైటింగేల్ గీతంలో కీట్స్ మహాకవి 'నా హృదయం వేదన పడుతోంది, హేమ్లాక్ విషం తాగిన వాడిలా నా ఇంద్రియాలన్నీ వశం తప్పిపోతున్నాయని' అంటాడు.[(6)] కృష్ణశాస్త్రి ఇదే పద్ధతిలో 'గరళమే తిందు కడుపార నెరిగియెరిగి; ఆవల ద్రోతు చేతులార నమృతరసము' అంటారు. కవి సుఖదుఃఖాలకు ద్వంద్వాతీతమైన స్థితికి చేరుకున్నవానిగా ఈ గేయంలో కన్పిస్తారు. విషం అమృతంలాగా, అమృతం విషంలాగా కన్పిస్తోందని ఆయన భావం.

చిన్న గేయాల్లో కూడా కృష్ణశాస్త్రి తన భావాలను మధురాతిమధురమైన మాటల్లో చెపుతారు. స్వేచ్ఛగా తిరిగే పక్షిని పట్టి పంజరంలో బంధించితే అది పాడదని, ఆకాశంలో స్వేచ్ఛావిహారం చేస్తున్నప్పుడు మాత్రమే దాని గానం బయటికి వెడలుతుందని వీరి స్థిర భావం. కవి కూడా ఎవరో నిర్దేశిస్తే కవితాగానం చేయదని, తనకు తానుగానే ప్రేరేపితుడై కవిత్వం చెపుతాడని కృష్ణశాస్త్రి వివరిస్తున్నారు.

పక్షినని పాడగలనని ప్రణయవీధి
నిత్య లీలావిహారముల్ నెరపుదునని
పక్షముల దూల్చి, బంధించి పంజరాన
గానమును బ్రాణము హరింపబూనినారు.

విలియం బ్లేక్ తన 'స్కూల్‌బాయ్' గేయంలో స్వేచ్ఛకోసం జన్మించిన పక్షి పంజరంలో కూర్చొని ఎలా పాడుతుంది అని ప్రశ్నించారు.[7]

'ఆరనిదివ్వె' అనే గేయం కృష్ణశాస్త్రి విరహవేదనని వెల్లడిస్తుంది. తన 'వలపె విషమైన తుచ్ఛ జీవనము విషము' అని కృష్ణశాస్త్రి ఆవేదన వ్యక్తం చేసారు. ప్రేయసి తిరస్కారంతో ప్రియుడు శోక తప్తుడవటం సాధారణం. నవనీత మృదులమైన మనసుని గాయపర్చిన జవరాలి తలపుతో ఎన్నో రేలు, పవళ్ళు దుఃఖించటం గమనించాలి. అసలు తన ప్రేమ పుష్పించకుండానే అంతమవటం ప్రియుడిని ఘోరదుఃఖానికి గురిచేసింది. తన జీవితమే వృథా అన్న భావానికి కవి వచ్చాడు.

*హృదయనాళము తెగియె, నా హృదయ ధనము*
*తొలగిపోయెను, జీవిత ఫలము స్రుక్కి*
*నేలబడె నింక జీవింప నేల సఖుడ?*

తన ప్రేమ విఫలం అయ్యేసరికి జీవితంపైనే 'ఆశ కోల్పోయి నిరాశచే జిక్కిచిక్కి' ప్రాణమే పోయి నాప్రేయసిని పొందలేనేమోనని అనుకుంటాడు. 'ప్రణయభంగ ప్రభూత తాప జ్వరార్తి నెటులు భరియింతునో సఖా?' అని ప్రశ్నిస్తాడు. కోపాన ఉన్న ప్రేయసిని దరిచేరి, చిరునవ్వుతో హృదయ పుటము చీలుస్తానని, రక్తధారలు కారినప్పటికీ ఆమెను ఏమీ అనననని అంటాడు. ఇదంతా అంతరంగాలలో నిండుకున్న ప్రేమగురించి చెపుతున్న భావాలు. ప్రేయసిపై చెక్కుచెదరని ప్రేమ ఉందని దీన్నిబట్టి స్పష్టం. చివరగా ప్రేయసిని నిందిస్తాడు.

*అవిర తానందమునుం బొందు నపుడు నన్ను*
*మరచిపోదువు; సరె యట్టె మరచిపొమ్ము!*
*ఘోర దుఃఖ తమంబున కుందు నపుడు*
*తెరచి హృదయంబు, నారని దివ్వెనిత్తు!*

లార్డ్ బైరన్‌కవి కవితల్లో ఒకచోట "రహస్యంగా మనం కలిసాం, మౌనంగా నేను దుఃఖించాను, దీన్ని నీ హృదయం విస్మరిస్తుంది, నీ ఆత్మ వంచిస్తుంది"... అంటాడు.[8] ఇదే భావం కృష్ణశాస్త్రి కవితలోనూ వెల్లడయింది.

'విరిసివిరియని' అన్న ఖండంలో కవి సౌందర్యాన్ని వర్ణించినతీరు అద్భుతం. క్రొవ్విరిని స్పృశించటానికి బుద్ధి పుట్టక పోవటం అంటే భౌతిక వాంఛని కాదనటమే. నూత్న వికసిత యవ్వనాన్ని భౌతికానుభవంతో కలుషితం చేయరాదని కవి భావం. అందుకే

*"విరిసివిరియని క్రొవ్విరి నరయుటకును*
*ఎంతొ సందియపడ, స్పృశియింపగలమె?*
*వలపుల హరింపగలమె? యౌవనము నూత్న*
*వికసితము; కలుష హృదయము వెరపుజెందు"*

పవిత్ర ప్రణయభావన కలుష హృదయాన్ని నిష్కల్మషంగా చేస్తుందని విశ్వసిస్తున్నారు. పవిత్ర ప్రణయం మానసికమైనది. కవి 'వలపుల హరింపగలమె' అన్న ప్రశ్న వేయటం గమనించాలి. అంటే కవి ఇక్కడ అమలిన శృంగారతత్వం వివరిస్తున్నాడు.

'నా ప్రేమ' అన్న గేయంలో కవి ప్రేమ ఏ విధంగా హృదయ కలుషపంకాన్ని దూరం చేస్తుందో వివరించారు. 'క్రౌర్య కౌటిల్య కలుషపంకము' అనటంతో మాలిన్యం గాఢత తెలుస్తోంది. పాపపంకిలమైన హృదయంలోనుంచి పవిత్రమైన ప్రేమ ఎలా ఉద్భవిస్తుందో కవి ఉపమానాల ద్వారా చెప్పాడు.

*ప్రేయసీ! శర్వరీ తమోవీధుల బడి*
*చందురుడు రాడె పూర్ణ తేజస్వి యగుచు?*

శర్వరీ తమోవీధులు అఘవిదూషితహృదయానికి; చంద్రుడు ప్రణయానికి ఉపమానాలుగా ఈ కవితలో కవి చిత్రించాడు. పవిత్ర ప్రేమ ఉదాత్తత ఇక్కడ వ్యక్తీకరించబడింది.

'దివ్య భాగ్యము' అనే కవితలో కూడా ప్రేమనే సర్వసంపదల కన్నా విలువైనదిగా, మహద్భాగ్యంగా కృష్ణశాస్త్రి వివరించారు. హేమ మణిరత్నగణ మేల లేవు మనకు? అన్న ప్రశ్నతో మొదలయ్యే ఈ గీతంలో "ముత్తియంపు సరము లేల ముదిత మనకు?" "సార్వభౌమభోగము లేల చాన, మనకు?" అనటం ద్వారా ఆడంబర పూర్ణమైన ఆభరణాదులకన్నా ప్రకృతి సౌందర్యము ఉత్తమమన్న అభిప్రాయాన్ని ప్రకటించారు. ప్రవిమల ప్రేమసామ్రాజ్య పట్టభద్ర భాగ్యము ముందు సార్వభౌమ భోగాలైనా సరే లెక్కకురావని అవి చిఱుతసంపదలుగా తృణీకరించబడతాయని కవి చెప్పారు.

*సాంధ్యసమయ సువర్ణితచ్ఛాయ లరసి*
*తారూకా శోభితాంబర తలము గాంచి*
*చింతలను బాయుదుము చేయి జేయి కలిపి!*

'ప్రాణకాంత' అన్న గేయంలో ప్రేమభావోద్వేగి అయిన కవి మనోనిర్మలత్వం, ప్రేయసిపై నున్న గాఢ ప్రేమ ఆవిష్కరించబడ్డాయి. ఈ గేయంలో ప్రబంధ సాహిత్యంలోని ప్రణయోద్దీపాలని విరహంలో ఉపాలంభించే పద్ధతి కనిపిస్తుంది. ప్రాణమునకు ప్రాణమైన ప్రణయ కాంత అనటం వల్ల కవికి ప్రియురాలిపైనున్న అపార ప్రేమ గోచరిస్తోంది. సౌరభమా, గానమా, హిమకణమ, తేనెచినుక, నీరదమ, నీలమా, తేటిమ్రోత, కోయిల కూత అంటూ కవి వీటినన్నింటిని 'తెందు శాంతి' అని అభ్యర్థిస్తాడు. ప్రేమని మలయానిలంతోనూ, నీరజంతోనూ, విమల అంబరాబ్ధితోనూ, వన తరు శాఖతోనూ పోల్చటం ప్రాచీన సాహిత్య విధానంలో లాగానే ఉంది. ఇక్కడ ఈ పోలిక కారణంగా ప్రణయలాలిత్యం, సౌకుమార్యం, సహజత్వం స్ఫురిస్తున్నాయి.

"ప్రాణమునకు బ్రాణమౌ ప్రాణకాంత
యూర్పు తరగల నోలాడి యున్నవారె?"

తన విరహం కన్నా ఆమె వియోగవ్యధాకుల కావటమే ఈ భావ కవికి వేదనాజనకమని తోస్తోంది.

ఇలాంటి అనేక గేయాల్లో ప్రేమ విఫలమై, నైరాశ్య వాదంలో పడిన కవి మరణాసక్తిని వెల్లడిస్తాడు. చక్కని ప్రతీకల ద్వారా కవి సౌందర్యతృష్ణని, విరహతాపాన్ని చిత్రించారు. అయితే ఇక్కడ చిత్రించింది అలౌకిక ప్రణయాన్ని కానీ భౌతిక ప్రేమకాదు. కృష్ణశాస్త్రిగారి ప్రేమ సామాన్య మానవుల ప్రేమకాదు. అది ఫలాపేక్షరహితమైన ప్రణయతత్వం. అచేతనాలకు చేతనాన్ని కల్పించటం, ప్రకృతి తమతో సానుభూతి వ్యక్తం చేసినట్లు రాయటం, వివిధ ప్రకృతిరూపులుగా సాక్షాత్కరించిన ప్రేయసిని వర్ణించటం మొదలైనవాటి ద్వారా కవి తన భావాలను మనసుకి హత్తుకొనిపోయేటట్లుగా వివరించారు.

'నా విరులతోట' అన్న గేయంలో కరుణరసం వెల్లివిరిసిన విధానం చాలా గొప్పది. విరులతోట అంటే జీవన వనమే. ఇందులో గులాబిమొక్క ప్రేయసికి సంకేతం. గులాబి అనటం ద్వారా ప్రణయిని సౌందర్యం వర్ణితమైంది. ఒక క్రూరార్క కిరణంతో గులాబి నేలరాలటం అంటే విధి కారణంగా ఆ ప్రణయిని శాశ్వతంగా దూరమవటం.. ప్రియురాలి మరణంతో కవి శాశ్వత దుఃఖానికి లోనయ్యారు. 'శూన్యమౌ మోడు మ్రాకుని జూచి ఒక్క కోకిలమ్మ కో యని యేడ్చె గొంతునెత్తి' అనటం అతని విషాదస్థాయిని సూచిస్తోంది. ప్రణయిని మరణంతో తన జీవితం మోడువారిందని కవి భావన. కోకిలమ్మ గొంతునెత్తి ఏడవటం కవిలోని ప్రేమికుడు దుఃఖాన్ని వెల్లడించటం అవుతోంది. ప్రేమికునికి జరిగిన నష్టాన్ని చూసి, అతని విషాదానికి మొత్తం ప్రకృతియే చలించింది అని చెప్పటానికి కోయిల యేడ్పు, మందపవనం నిట్టూర్పు అంటాడు కవి. ఆత్మాశ్రయ కవిత్వానికి ఇది చక్కని ఉదాహరణ.

మత్తిలిన యొక్క చంచల మధుపమునకు
కోలుపోయితి మకరందజాల మెల్ల

'అయ్యో' అన్న గేయంలో వచ్చే పై పంక్తులు కూడా శాస్త్రిగారి భగ్నప్రణయ వేదనావర్ణనకి ఉదాహరణగా నిలుస్తాయి. ఆశలు, ఆశయాలు నశించి జీవన మకరందాన్ని, ఆనందాన్ని, ప్రణయ సౌరభాన్ని కోల్పోయే ప్రేమికులపరంగా ఈ గేయాన్ని చెప్పారు. 'హృదయశోణిత ధార నెదుగు జీవితవల్లి'ని మొదలంటా దూర్చినారే, భయదాగ్ని కీలలను వ్రేల్చినారే అని మరోచోట కవి చెపుతాడు.

'కిలకిలని' అనే గేయంలో ప్రేయసి పువ్వుగా, మబ్బుగా, చిన్నపుల్లుగా, లావణ్యమూర్తిగా కవికి సాక్షాత్కరిస్తుంది. ప్రేయసి ప్రేమ గురించిన తలపులలో తనను తాను దీనుడుగా భావిస్తాడు. ఆమెను కన్నుల పండుగగా చూడాలని అతని ఆకాంక్ష. కానీ, దుఃఖాశ్రుసలిల మౌక్తికంచే అవరోధింపబడి కవి ప్రేయసిని కన్నులార కాంచ

లేకపోతాడు. ఈ ఖండికలో ఉద్విగ్నత, ప్రణయభావన కనిపిస్తాయి. నిరాశతో కవి 'మ్రోడునై ఱాయినై నిలిచిపో' అంటాడు.

'మాటిమాటికి' అన్న గేయంలో కవి వియోగదుఃఖాన్ని ప్రకటిస్తాడు. సర్వప్రకృతిలోనూ ప్రేయసి గోచరిస్తుంది. వియోగదుఃఖంతో గుండె బరువెక్కుతుంది. కవి 'అతి భయంకర సాంద్ర నీలాభ్ర పటలి'గా తన హృదయాన్నివర్ణిస్తాడు. వేడి కన్నీరు తాపాన్ని పోగొట్టుతుందేమో అని భావిస్తారు. తన వేడినిట్టూర్పులను ప్రియురాలి చెంతకు తీసుకొని వెళ్ళమని కవి మలయపవనాన్ని అర్థిస్తాడు. ప్రకృతి తన బాధకు సానుభూతి వ్యక్తం చేస్తున్నట్లు చిత్రిస్తారు.

కృష్ణశాస్త్రిగారి నాన్నగారు, బాబాయిలు మంచి సాహితీ వేత్తలు. చిన్ననాటి నుంచీ అనురాగ బంధముచే వీరిరువురూ కట్టుపడినారని, ఆఖరికి స్వప్నాలలో కూడా ఎన్నడైనా, ఏచోటనైనా, ఏ నిమిషమైనా ఎడబాటు సహింపలేరని కవి వివరిస్తారు. వీరిపై కవి శోకహృదయంతో ఏడు గేయ ఖండికలను రచించారు.

"ఏ మనోహరసీమలం, దే పవిత్ర
విమల తేజోమయ విశాల వీధులందు
అక్ష రామోద సంభరి తాంతరంగు
లగుచు విహరించుచున్నారొ?"

తన తండ్రి, బాబాయిల పట్ల కృష్ణశాస్త్రి భక్తిభావాన్ని వెల్లడించారు. వారి 'పవిత్ర యశో నిర్మలాపగాతి శీతల తరంగజల సుధాసేచనమున' కొడుకు జీవితము కూడా పూతమయిందని అంటారు. వారు గొంతెత్తి గానమ్ము జేసినపుడు, 'భువనాలు తమ శ్రవణాలు విచ్చి' ఆలకిస్తాయని వివరిస్తారు. వారి 'దరహాసరేఖలు మింట మిలమిల చుక్కలై మెరయునేమోనని అనటం కృష్ణశాస్త్రి భక్తిప్రపత్తులని వెల్లడిస్తున్నాయి.

'మీరు మనసారగ నేద్పనీరు నన్ను' అన్న ఖండికలో కవి శోకప్రియత్వం కనిపిస్తుంది. ఈ శోకం లోంచే గేయాలు వెలువడతాయని కవి సూచిస్తాడు. విషాదం అధికమయి బ్రతుకు మీద విరక్తిచెంది కవి మృత్యువాంఛ ప్రకటిస్తాడు. ప్రణయకేళికా మోద భారమింక వహింపలేనని అంటాడు.

"ఈ మహానంద వీచికా స్తోమ డోళి
కాగ్రముల నింక నే నాట్య మాడ లేను
నేను చిరునవ్వు పెదవుల నిలపలేను"

దీర్ఘ సమాసబంధాలు కృష్ణశాస్త్రి కవితలో ఎక్కువగా కనిపిస్తుంటాయి. వీటివల్ల కవితలో సాంద్రత పెరిగింది. కృష్ణశాస్త్రి కవితావైభవానికి, ఉదాత్తతకూ ఈ సమాసాలు తోడ్పడ్డాయి.

కృష్ణశాస్త్రికి ప్రేమకవుల్లో అగ్రతాంబూలం అందుతుంది. మధురప్రేమ భావనకి వీరి కవితలు ఆలంబనగా ఉండటమే దీనికి కారణం. కృష్ణపక్షము పేరుతోసాగిన ఈ

సంపుటిలో 59 పద్య,గద్యాలు ఉన్నాయి. 'తుది మొదలు కాని కానరానిది మహాంధకార కలుషిత కృష్ణపక్షంపు వీధి' అన్న మాటలు అక్షరసత్యాలు. తన సహధర్మచారిణి, మధురమధురమూర్తి ప్రియురాలు, సఖురాలు, పూర్ణరాగకలిత దూరమై పోతున్నదన్న బాధతో చీకటిరాత్రులున్న 'కృష్ణపక్షాన్ని' ఒక విషాదానికి సంకేతంగా కవి ప్రకటించారు. ఆలోచించి స్పందించే ప్రతివారికీ కృష్ణపక్షంలోని గీతాలు శుక్లపక్షంలా కనిపించి తీరతాయి.

సంప్రదాయ నిగళాలు తెంచుకొని కృష్ణశాస్త్రి స్వేచ్ఛ కోసం పరితపిస్తూ, ఆత్మాశ్రయరీతిలో సాగిన వీరి గేయాలు పాఠకులపై ఆనంద చంద్రకిరణాలను వెదజల్లుతాయి. కృష్ణశాస్త్రిగారి మాటల్లోనే చెప్పాలంటే 'ఎన్నడో మీరు పాడి నదీవసంత మధుర జీవనగీతి' నేడు ఈ గేయాలు చదివితే యెద తృళ్ళింతలాడుచుండు. కృష్ణశాస్త్రి గేయాలు చాలా ఉన్నతమైనవి.

"కనులు విచ్చి మనసు విప్పి కాంచగలుగు
వారు తల యూంచి మెచ్చుచున్నారువాని."

## వివరణలు:

1. జమ్ములమడక మాధవరాయశర్మగారు తన వ్యాసం 'సాహిత్యదార్శనికత'లో భావకవిత్వం అన్న పదం ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహములో ఉందని వివరిస్తూ, దానికి లఘువృత్తి రాసిన ప్రతీహారేందురాజు వాక్యాలను ఉదహరించారు.

   "ఏషాం రత్యాదికానాం భావానాం పంచాశత్సంఖ్యానా యాన్యనుభావాదిభిః చతుస్సంఖ్యైః సమస్తత్వేన వ్యస్తత్వేనచ యధాయోగం సూచనాని స్వలక్షణ స్వరూపాణాం సామాన్యావస్థాపాదితానాం ప్రతిపాదనాని తైఃకావ్యమ పనిబధ్యమానం ప్రేయస్వత్."

   సమస్తముగాగానీ లేదా వ్యస్తముగాగానీ రత్యాదిపంచాశద్భావములు ఆలంబనంగా ఉండి ప్రకటితమయ్యేది భావకావ్యమని ప్రతీహారేందురాజు సిద్ధాంతము.
2. అమృతం కురిసిన రాత్రి గేయ సంపుటికి రాసిన ముందుమాటలో కుందుర్తి "కవిత్వం కొద్దిగా రాసినా, ఎక్కువగా రాసినా తన సొంతమని చెప్పుకోదగ్గ శైలిని స్థాపించుకోలేనివాడు సాహిత్య చరిత్రలో నిలదొక్కుకోలేడు... ప్రేమకవుల్లో కృష్ణశాస్త్రిగారికి అగ్రతాంబూలం ఇవ్వటం కూడా ఇందుకే." అని అన్నారు.
3. జాన్ కీట్స్ కవిత ఇలా సాగుతుంది.

   *Away, away for I will fly to thee*
   *Not charioted by Bacchus and his pards·*
   *But on the viewless wings of poesy*
   *Though the dull brain perplexes and retards*
   *Already with thee! tender is the Night*

*And happily the queen - moon is on her throne*
*cluster'd around by all her stray fays*
*But here there is no light. (Ode to Nightingale - III stanza)*

4. పి.బి.షెల్లీ కవితలో ఇలా చెప్తాడు.
*First our pleasures die - and then*
*our hopes and then our fears - and when*
These are dead the debt is due,
Dust Claims dust - and we die too (Death - stanza III)
ఈ చివరి వాక్యం బైబిల్‌లోని "For dust thou art, and to Dust thou shalt return" సూక్తితో పోల్చతగింది.

5. షెల్లీ తన గేయం "లవ్స్ ఫిలాసఫీ" లో ఈ విధంగా చెప్పారు:
*Nothing in the world is single*
*All things by a law divine*
*In one another's being mingle*
*why not I with thee?*

6. కీట్స్ మహాకవి గేయం "ఓడ్ టు ది నైటింగేల్" ఈ విధంగా మొదలవుతుంది.
*``My heart aches, and a drowsy numbness pains*
*My sense as though of hemlock I had drunk*
*of emptied some dull opiate to the drains*
*one minute past, and lethe - wards had sunk."*

7. బ్లేక్ కవిత 'ద స్కూల్ బాయ్' విద్యావిధానంలోని వ్యవస్థాపరమైన లోపాలపై సాగిన విమర్శ. దీనిలో కవి ఇలా ప్రశ్నిస్తారు.
*How can the bird that is born for joy*
*Sit in a cage and sing?*

8. బైరన్ కవి 'వెన్ వియ్ టు పార్టెడ్' లో శోకతప్త హృదయంతో ఇలా చెప్పారు:
*In secret we met*
*In silence I grieve,*
*That thy heart could forget*
*Thy spirit deceive.*
*If I should meet thee*
*After long long years*
*How should I greet thee -?*
*with silence and tears.*

# కనుపర్తి వరలక్ష్మమ్మ

కనుపర్తి వరలక్ష్మమ్మగారు 1896లో బాపట్లలో జన్మించారు. బడిలో చదివింది ఐదో తరగతే అయినా జీవితాన్ని అర్థం చేసుకున్న విదుషీమణి. సోదరుల ప్రోత్సాహంతో రచనకి కావల్సిన ప్రాథమిక నైపుణ్యాన్ని సంపాదించి, నిరంతర సాధనతో తన రచనకి మెరుగులు దిద్దుకున్నారు. భర్త హనుమంతరావుగారి అభిమానాదరాలతో బహుముఖ ప్రజ్ఞాసంపత్తి సాధించి రచయితగా, ఉపన్యాసకురాలిగా, జాతీయోద్యమ సేవకురాలుగా, సమాజ సేవకురాలిగా రాణించారు. ఆమె ఆకాశవాణి ప్రసంగాలు కూడా స్త్రీలను ఉత్తేజపరిచేవి.

అపరాధి అనే నవలను స్వేచ్ఛాప్రణయమువల్ల కలిగే అనర్థాలను వివరిస్తూ రాసారు. బ్రిటీష్ పాలనలో, మూఢాచారాల కారణంగా ఆనాటి స్త్రీలు అనుభవిస్తున్న వేదనని వరలక్ష్మమ్మగారు అర్థం చేసుకున్నారు. స్త్రీలలో సామాజికార్థిక రాజకీయ చైతన్యం వస్తేగానీ వారి సమస్యలకు పరిష్కారమార్గాలు కనుగొనటం వీలుకాదని గ్రహించిన ఆమె స్త్రీ విద్యకు విశిష్ట ప్రాధాన్యతనిచ్చారు. బాపట్లలో 1931లో స్త్రీ హితైషిణీ మండలిని స్థాపించి వారి హితము కొరకు పెక్కు కార్యక్రమాలను నిర్వర్తించారు. సీతా పుస్తక సదనము అన్న గ్రంథాలయాన్ని స్థాపించి ఆ ఉద్యమానికి చేదోడు వాదోడుగా నిలిచారు. స్త్రీలకు ఓటింగ్ హక్కు రాగానే ఇల్లిల్లు తిరిగి వారిని చైతన్యపరిచి ఓటర్లుగా నమోదు చేయించారు. వివిధ ప్రకృతి వైపరీత్యాల్లో తనవంతు బాధ్యతగా ధనం, వస్త్రాలు సేకరించి బాధితులకు పంపించారు.

గాంధీనాయకత్వాన్ని త్రికరణదీక్షగా అంగీకరించి ఆయన చూపిన బాటలో నడిచిన ఆదర్శమహిళ. స్వయంగా ఖద్దరు చీరలు నేసి ధరించిన యోగ్యురాలు. యోగ్యత అంటే మాటలకు చేతలకు అభేద్యమని విజ్ఞులు చెప్పే మాటలు వీరికి తప్పక వర్తిస్తాయి. సరోజినీదేవి, దుర్గాబాయి దేశ్‌ముఖ్ లాంటి ప్రముఖుల మన్ననకి, ప్రశంసకి పాత్రులయ్యారు.

ఆడవారిని వివిధ విషయాల పట్ల స్పందించే రీతిలో గృహలక్ష్మి పత్రికలో వీరు రాసిన శారద లేఖలు ఎంతో ప్రాచుర్యంపొందాయి. తెలుగు సాహిత్యంలో, లేఖా రచనా ప్రక్రియలో వరలక్ష్మమ్మగారు ఒక నూతన అధ్యాయానికి శ్రీకారం చుట్టారు. వాటిలోని అంశాల కారణంగా లేఖలు ఈనాటికీ పలువురిని ఆకర్షిస్తున్నాయి.

ఎన్నో సన్మానాలు పొంది, పదవులని చేపట్టినా వీరిలోని నిరాడంబరత్వం, దేశభక్తి మరిన్ని సత్కార్యాలకి జీవితాన్ని అంకితం చేయించి మరెందరికో మార్గదర్శకత్వం వహించాయి. వారి నిండు జీవితం తెలుగు సాహితీ ప్రపంచాన్ని దీవించి, వెలుగుతో నింపింది.

# 19. శారద లేఖలు - మహిళోద్యమానికి పునాదిరాళ్ళు

"నా జీవము ధర్మము, నా మతము నీతి, నా లక్ష్యము సతీశ్రేయము - ఈ మూటిని సమర్థించుటకే నేను చేత కలము బూనితిని."

స్త్రీ జాతికి గర్వకారణమైన కనుపర్తి వరలక్ష్మమ్మగారు శారద లేఖలు పేరుతో తెలుగుసాహితీ లోకంలో పదికాలాలపాటు నిలిచే రచనలు చేసారు. వీరి రచనలు నిజమైన సాహితీ విలువలకు, ఉన్నతమైన జీవితాశయాలకు నిలువెత్తు అద్దం పడతాయి. నెమలికి నాట్యం వచ్చినంత సహజంగా వీరికి రచనా విధానం పట్టుపడింది. చదివింది ఐదో తరగతే అయినా వీరి రచనలు తెలుగు నారీమణులని చైతన్యవంతం చేయటం మేధావులని సైతం ఆలోచనలకు గురిచేయటం మొదలైన విషయాలు గమనిస్తే ఆమె పాండిత్యం అర్థమవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లోని స్త్రీలు వివిధ రాజకీయ సామాజిక విషయాలని అర్థం చేసుకోవటంలోనూ, వారి జీవితాలను ఉదాత్తంగా తీర్చిదిద్దుకునేలా చైతన్యవంతమవటంలోనూ వరలక్ష్మమ్మగారి రచనలు ఎంతో తోడ్పడ్డాయి. ముఖ్యంగా శారద లేఖలు ఈ విషయంలో చాలా ఉపయోగపడ్డాయి.

గ్రాంథిక భాషలో రాసినా ఈ లేఖలు అందరినీ బాగా ఆకర్షించాయి. వరలక్ష్మమ్మగారి శైలి గొప్పది. సులభమైన పదాలను ఉపయోగించటం, విషయాన్ని నిరూపితమయ్యేటట్లుగా సాగిన వాక్యాల అమరిక, సందర్భానుసారంగా వాడిన సూక్తులు, ప్రజానీకం అపార్థం చేసుకోరాదని ఏరికోరి పదాలను ప్రయోగించటం, ఆలోచనా ప్రవాహంలాంటి వాక్యప్రవాహం వీరి శైలిలోని ముఖ్యలక్షణాలు. లేఖాసాహిత్యం లాంటి సాహిత్యప్రక్రియను వీరు ఎంతో చక్కగా అభివృద్ధి చేసారు. మొదట్లో ఈ లేఖలు సామాన్య లేఖల విధానంలోనే సాగినా వివిధ దేశవిదేశీ వ్యవహారాలను, రాజకీయాలు, స్త్రీల సమస్యలను, ముఖ్యమైన తీర్థయాత్రలను, ఉపయోగమైన గ్రంథ పరిచయాలను, సుప్రసిద్ధ నాయకుల అభిప్రాయాలను వివరించిన విధానం చాలా గొప్పది. వీరి లేఖా సాహిత్యం ప్రజల్లో పఠనాభివృద్ధిని అధికం చేసింది.[(1)] ఈనాటికీ అవి పఠనాభివృద్ధిని పెంపొందింపచేసేలా ఉండటం విశేషం.

ఆనాటి స్త్రీలలో, అలానే మొత్తం సమాజంలోనూ వివిధ సామాజికాంశాలపై చర్చించే అలవాటు కొంచెం తక్కువగానే ఉండేది. విద్యావకాశాలు పెద్దగా లేకపోవటం దీనికొక కారణం. వార్తాపత్రికను ప్రజలు అభిప్రాయవేదికగా భావించటం దానిద్వారా అనేక అంశాలపై వారి స్పందనని వెల్లడించే అవకాశాల్ని అర్థం చేసుకున్న రచయిత్రి, గాంధీగారి ఖద్దరు ప్రచారం, అస్పృశ్యతా నివారణ, హరిజన సమస్య, శారదాచట్టం, విడాకుచట్టం, మద్యపాననిషేధం లాంటి విభిన్న అంశాలపై స్త్రీలోకం దృక్పథాన్ని ఈ లేఖా సాహిత్యం ద్వారా వెల్లడించారు. ప్రజాస్వామ్యానికి ఆయువుపట్టు ప్రజాచైతన్యమే. దీనికి సాహిత్యం ఉపయోగపడుతుందని ఆమె నిరూపించారు. సాహిత్యం ద్వారా సంస్కారవంతమైన సమాజ నిర్మాణానికి కృషి చేసినందుకు పలువురు ప్రముఖులు ఆమెని ప్రశంసించారు.[(2)]

వరలక్ష్మమ్మగారి రచనాశక్తిని ప్రారంభంలోనే గ్రహించి ప్రోత్సాహించింది అన్నగారు శ్రీ ఆంజనేయులుగారు. 'భారతి' కి సుధ, దీర్ఘ సుమంగళీభవ, రెండు కోర్కెలు, నేనే అపరాధిని, ఒట్టు, మూడు తీర్మానాలు, పెంచిన ప్రేమ లాంటి ఎన్నో కథలను రాసారు. 'వినోదిని' లో ప్రచురింపబడిన కథలన్నీ హాస్యరసంతో నిండి ప్రత్యేకత సంతరించుకున్నాయి. ఆనాటి మాసపత్రికలు శారద, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, ఆంధ్రవాణి, ఆంధ్రమహిళ, ఆంధ్రపత్రిక అన్నింటిలోనూ ఆమె రచనలు చేసారు.

చిన్నతనంలో బాపట్లలో వారి ఇంటి పక్కన ఉన్న అవ్వలకు ఉత్తరాలు రాసిపెట్టేవారు. ఆంధ్రపత్రికానుబంధంలో వారంవారం ప్రచురింపబడే 'వసంతలేఖలు' చదివి తాను అలాంటి రచనలు చేయాలని సంకల్పించారు. 1928లో కె.యస్. కేసరిగారు స్థాపించిన గృహలక్ష్మి పత్రికలో స్త్రీలకుచెందిన విభిన్న విషయాలపై 'కల్పలత' అనే స్నేహితురాలుకు 'శారద' వ్రాసినట్లుగా వీటిని మొదలుపెట్టారు.[3]

'రమారమి మూడు దశాబ్దుల ఆంధ్రజీవితరేఖలు ఈ గ్రంథమున కానబడుచున్నవని స్వామి శివశంకరులచే ప్రశంసలందిన ఈ లేఖలు చదివి ఆంధ్రస్త్రీలు జాగృతులయ్యారు. నిజానికి ప్రతి లేఖ కూడా ఈ మణిహారంలోని విశిష్టమణి అనిపించుకుంది. ఒక లేఖలో మూఢవిశ్వాసాల ఖండన ఉంటే వేరేదానిలో రామాయణాది పురాణపాత్రలపై ఉన్న అపవాదులపై సమాధానం ఉంది. బాలవితంతువుల బాధలని మరోలేఖ కళ్ళకు కట్టినట్లుగా చూపించేది. వరకట్న సమస్య, పురుషాధిక్య సమాజంలోని స్త్రీల జీవితం మరో ఉత్తరం వెల్లడించేది. ఇలా ఈ ఉత్తరాలు మనకాలంలోనూ కొనసాగుతున్న కొన్ని సామాజిక జాడ్యాలపై ఆనాటి స్త్రీశక్తి నిరసనని చూపిస్తున్నాయి. స్వీయ ఆలోచనలు, పలుకోణాల్లోంచి సమస్యని విశ్లేషించిన విధానాలు ఈ లేఖాసాహిత్యానికి మంచి పేరు తెచ్చాయి.

1922 ప్రాంతంలో 'మా చెట్టునీడ ముచ్చటలు' అనే శీర్షికన వరలక్ష్మమ్మగారు సోదరి 'లీలాదేవి' అనే కలం పేరుతో ఆంధ్రపత్రికకు పంపారు. నారింజచెట్టు క్రింద కొందరు స్త్రీలు చేసిన చర్చలు దీనిలోని విషయం. ఇది ప్రాంతీయభాషలో (యాస) సాగటం మరో గొప్ప విషయం. ఈ చెట్టునీడ ముచ్చట్లే ఆ తరువాత శారద లేఖలుకి ప్రాతిపదికలయ్యాయి.

1921లో మహాత్ముని దర్శించిన వరలక్ష్మమ్మగారు ఆ మహనీయుని ఆదర్శాలను, వ్యక్తిత్వాన్ని అన్ని విధాలుగా శ్రేష్టమైనవిగా గ్రహించి, జీవితంలో ఆచరించారు. మహాత్మాగాంధీపై దండకాన్ని రచించటం ఆయన జీవితగాథని క్లుప్తంగా రాయటం కేవలం గాంధీగారిపై అభిమానంతో కాదని మహాత్ముని ఆదర్శాలని జాతి అనుసరించాలనే ఆకాంక్షతోనని వెల్లడవుతోంది.

నాటికలు రచించటంలో కూడా వీరిది అందెవేసిన చేయి. మహిళామహోదయము, పునఃప్రతిష్ఠ, లేడీస్‌క్లబ్ మొదలైనవి రాసారు. ఇవి స్త్రీలను చాలా ఆకర్షించాయి. 'రాణిమల్లమ్మ' మొదలైన స్వగతాలను కూడా రచించారు. జీవితగాథలు

రచించారు. వీరి రచనలు, ముఖ్యంగా కథలు హిందీ, కన్నడము, తమిళము మొదలైన భాషల్లో అనువాదితములయ్యాయి.

మహనీయులగువారికి వారి నామాక్షరములే వేయి బిరుదులు పెట్టు అని విశ్వసించిన వరలక్ష్మమ్మగారి జీవితం ఏనాటికైనా ఆదర్శప్రాయమైందే.(4) వారి లేఖలు వారి ఆదర్శాలను, జీవన వైఖరిని వెల్లడిస్తాయి.

ఆనాటి దేశవ్యవహారములను, సాంఘిక పరిస్థితులను తెలుసుకొనుటకు శారదలేఖలు ఎంతో తోడ్పడతాయి. భారతస్త్రీలు వివిధ అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొని, ఉన్నత పదవులు అధిరోహిస్తున్నారని, సంఘసంస్కరణ సభల్లో ఇతర ప్రభుత్వ సభల్లో స్త్రీలు వారి హక్కులకై ఉద్యమిస్తున్నారని మొదటి లేఖలోనే వివరిస్తారు. మద్రాసులో జరిగిన సంఘసంస్కార సభలో ప్రస్తావనకి వచ్చిన వివిధ అంశాలను ప్రస్తావించి వాటిని వార్తా పత్రికల్లో చదవమని తర్వాత ఇతరులతో కూడా చదివించమని శారద కోరుతుంది. ఈ విషయం శారద లేఖల ప్రధాన ఆశయాన్ని సూచిస్తోంది. స్త్రీలు వర్తమాన అంశాలను గ్రహించి చైతన్యవంతులవ్వాలని, ప్రజాస్వామ్య విధానాల్ని అర్థం చేసుకోవాలని, వివిధ విషయాలపై స్పందించాలని లేఖలు ప్రబోధిస్తున్నాయి.

ఈ లేఖలు ప్రచురితమవుతున్న కాలంలోనే ఆంధ్రప్రదేశ్‌లో గ్రాంథిక వ్యవహారిక భాషా ఉద్యమాలు ఊపందుకున్నాయి. అందుకనే 'కథగాదు, కావ్యముగాదు, ఈ యుత్తరములలో మధురమైన వ్యవహారభాష మనమేల యుపయోగింపరాదు?'(5) అని కల్పలత శారదని ప్రశ్నిస్తుంది. ఆంధ్రప్రదేశములో నలుగురు తిరుగుతున్న కొలది వాడుక భాషలో రాయటం వలన అధిక ఇబ్బందులు కలుగుతాయేమోనని వరలక్ష్మమ్మ సందేహాలు వెలుబుచ్చినా "వ్యవహారభాష యందు వ్రాయుట నీకు ప్రీతికరమగుచో నీవటులనే వ్రాయుము" అనటాన్ని పరిశీలిస్తే వ్యవహారికభాషని వారు అంగీకరించినట్లు కన్పిస్తుంది.

శ్రీకాళహస్తీశ్వర క్షేత్రంలోని వివిధ విశేషాలను ఈమె వర్ణించిన తీరు అద్భుతం. భక్తకన్నప్ప గురించి పరమేశ్వరుడు 'అతడు మహాభక్తుడుకాన యతని హృదయమే నాకాలయము. వాని పలుకులే నాకు స్తుతివాక్యములు' అన్నట్లుగా రాయటం నిజానికి ఆమె భక్తితత్వాన్ని వెల్లడిస్తోంది. దీనిద్వారా భగవంతుని పట్ల మనకు ఉండవల్సిన భక్తివిశ్వాసాలను ఆమె వెల్లడించారు.

శ్రీకాళహస్తి చక్కని నాణ్యమైన కొయ్యదువ్వెనలు, నల్లగాజులకి చాలా ప్రసిద్ధి. కానీ ఆనాటి ప్రజలు విదేశాల నుంచి దిగుమతియైన దువ్వెనలని ఇష్టపడటంతో, ఆదరణలేక స్థానిక సంస్కృతి నాశనమవుతోందని ఆమె వాదన. "దువ్వెనలకు మెరుగు, గాజులకు మెరుగు, గుడ్డలకు మెరుగు, మొగములకు మెరుగు! అన్నింటను మెరుగే నవనాగరికులకు కావలసినది"... అన్న మాటలతో ఆనాటి ప్రజల ఆలోచనా విధానంలోని లోపాలను ఎత్తిచూపించినట్లయింది. గాంధీజీ ప్రారంభించిన విదేశీవస్తు బహిష్కరణ స్ఫూర్తి ఇక్కడ కన్పిస్తోంది. ఏది చెపుతామో అదే చేయాలి అన్న గాంధీజీ ఆదర్శంతో వరలక్ష్మమ్మగారు స్వదేశీ వస్త్రాలతోపాటు స్వదేశీ గాజులు ధరిస్తానని వ్రతం పూనటం ఆమె వ్యక్తిత్వ నిదర్శనం. ఎంతో ముందుచూపుతో "కాని మన స్త్రీలకు వన్నె

చిన్నెలపై వ్యామోహము నశింపనివరకు మన దేశపు పరిశ్రమలభివృద్ధిజెందవు. దేశీయ పరిశ్రమ అభివృద్ధి చెందినగాని మనదేశ మభివృద్ధిజెందదు"... అనటం గమనార్హం. ఆమెకు దేశ సర్వతోముఖాభివృద్ధి ఆశయమని, దానికై స్త్రీలు సౌందర్యకాంక్షని తగ్గించుకొని దేశాభివృద్ధికై పాటుపడాల్సిన ఆవశ్యకత ఉందని తెలుస్తోంది. స్త్రీని భోగవస్తువుగా చూసే, చేసే బ్రిటీష్ రాజకీయ సంస్కృతిని, ఆనాటి సామాజిక విధానాల్ని ఆమె నిరసిస్తున్నారని తెలుస్తోంది. ఒక మహనీయుడు చెప్పినట్లు విదేశీ వస్తువుల మోజుతో కొన్ని కోట్లరూపాయలు వారి పాలవుతున్నాయని ఆమె ఆనాడు చెప్పిన మాటలు ఈనాటికీ వర్తిస్తాయి.

స్వాతంత్ర్యోద్యమంలో జాతి, మత భేదం ప్రసక్తి కూడదని ఆనాటి నాయకుల హితవు. దీనిని వివరిస్తూ "ఈ మధ్య ఢిల్లీ యందు భారతమహిళాసభ జరిగింది. దానికి అధ్యక్షురాలు భోపాలు బేగముగారు. ఆమె మహమ్మదీయ స్త్రీ. ఆ సభకు పూర్వము జరిగిన సభ కధ్యక్షురాలు బరోడా మహారాణిగారు. ఆమె హిందూ యువతి..." అంటారు. అంటే ఆశయం ఒకటే అయినప్పుడు జాతిమత భేదములేవీ అడ్డుకోవు అని అర్థం.

స్త్రీవిద్యా ప్రాధాన్యతని వీరి కలం గుర్తించింది. ఆమె జీవితంలోని ప్రతిశక్తినీ దానికై వెచ్చించారు. ఢిల్లీ మహిళాసభలో బాలికలకు విధిగా విద్యనేర్పాలని తీర్మానించారు. అలానే, స్త్రీలకు నియోజక, నియోజిత స్వాతంత్ర్యము కావాలని, అతిబాల్య వివాహాలు అనర్థకమని చెప్పారు. స్వాతంత్ర్యపు హక్కులు సమర్థతతో నిర్వహించటానికి స్త్రీలు మంచి విద్యావంతులుగా ఉండాల్సిన అవసరాన్ని ఆమె గ్రహించారు. ఈ ఆశయసిద్ధికై తన కలాన్ని కదిలించారు. "స్త్రీ శక్తి స్వరూపము. కానీ స్వశక్తిచే స్త్రీ లక్ష్మియు, సరస్వతియు కావచ్చును"... అన్న సరోజినీ మాటలను గుర్తుకు చేస్తారు. భారతకోకిల చెప్పినట్లు భూతదయా పశ్చాత్తాపాలచేత, జాతికులమత భేదములులేని విశ్వమానవ సోదరభావం చేత శరీరాన్ని పుణ్యక్షేత్రం చేసుకోవచ్చని అలానే అన్నిటికి మనసే ప్రధానము కాబట్టి చిత్తసంస్కారమువలన యాత్రాఫలాన్ని అస్పృశ్యులుగా భావించటం తప్పు అని మానవులందరు ఒకటేనని ఉద్బోధిస్తారు.

ఖద్దరు గాంధీగారి జీవిత సందేశం. ఇది నిరాడంబరతకి, స్వావలంబనకి, నిర్మలతకి గుర్తు. అఫ్ఘన్‌రాజు బొంబాయి వచ్చి ఎక్కువ ముతకచీర కట్టిన ఆ స్త్రీయే గాంధీగారి భార్య అని మహాత్ముని జీవిత భాగస్వామిగురించి అన్నాడట. వారి దేశంలో అందరూ స్వయంగా చేతులతో వడికిన గుడ్డలనే ధరిస్తారని ఆయన సంతోషంగా చెప్పారు. ఖద్దరు వస్త్రాలు ధరించటం అంటే నిరుపేదలకి అన్నం పెట్టటం అని అర్థం. ఈ గొప్ప సందేశాన్ని సామాన్యులకి చేరవేయటంలో శారద లేఖలు విజయం సాధించాయి. సరోజినీదేవి ఉపన్యాస సారాంశాన్ని వరలక్ష్మమ్మగారు ఆంధ్రప్రదేశ్‌లోని స్త్రీలోకానికి ఇంత విపులంగా అందించటం ఒక గొప్ప విషయం.

విభిన్న మత, కుల, ప్రాంత, భాషలకు చెందిన భారతీయులు రైలుపెట్టెలో ప్రయాణిస్తున్నపుడు వారి మధ్య సంభాషణలో ఎన్నో సమకాలీన అంశాలు దొర్లుతుంటాయి. రైలు ప్రయాణం మనకు భారతీయ జీవన విధానాన్ని చెపుతుంది. గాంధీజీ రైలు ప్రయాణాల ద్వారానే భారతీయుల ఆలోచనా విధానాన్ని ఆకాంక్షని

తెల్సుకున్నారు. వరలక్ష్మమ్మగారు తన రైలు ప్రయాణాలలో నిశితంగా ప్రజలను పరిశీలించి వారి నాడిని తెల్సుకున్నారు. స్త్రీల మధ్య జరిగిన సంభాషణ ద్వారా ఆనాటి స్త్రీలోకం ఏ విధంగా సామాజికాంశాలపై స్పందించిందీ వివరించారు. విద్యార్హతలు, వయస్సు అంతస్థులతో నిమిత్తం లేకుండా ఆనాటి స్త్రీలు తమ మనోభావాల్ని తోటివారితో పంచుకోవటాన్ని చూస్తే స్త్రీ చైతన్యం అంటే ఏమిటో అర్థమవుతోంది. ఆడపిల్లలకి చిన్నవయస్సులోనే పెళ్ళిచేయటం ఆనాటి ఆచారం. ఈ దురాచారాన్ని కాదని పద్నాలుగేండ్లు నిండితేగానీ ఆడపిల్లకు పెళ్ళిచేయరాదని ఒక శాసనాన్ని తెచ్చి ఆనాటి ప్రగతి శీల దృక్పథం కలవారు సామాజిక మార్పుకి కృషి చేసారు రైలుపెట్టెలో దీన్ని గురించిన లోకాభిరామాయణంలో "దేవుని దయవల్ల ఆ శాసనము రావలసినదే, అపుడుగాని యీ తల్లిదండ్రులు ఆటలు కట్టువడవు. రామ! రామ! తల్లిదండ్రులు ఆడపిల్లనెంత అన్యాయము చేస్తున్నారు? అమ్ముకోవడము, అప్రయోజకుడి కియ్యడము. బదులుకి బదులిచ్చి చేసుకోవడము. ఒకటా అకృత్యము? ఆడపిల్లంటే అమ్మానాయనల చేతి చెలామణి నాణెము"... దొర్లిన ఈ మాటలు స్త్రీల స్పందనని, ఆలోచనారీతిని వెళ్ళడిస్తున్నాయి.

రైలు పెట్టెలో వేర్వేరు స్త్రీలు తమ జీవితానుభవాలని, బాధలని చెపుతుంటే మనకు కూడా బాధ అనిపిస్తుంది. చిన్నపిల్లలను ముసలివాళ్ళకిచ్చి పెళ్ళిచేసే దురాచారాన్ని ఖండిస్తూ పైకి చెప్పే మాటలు వేరు. ఆ దారుణానికి బలైన ఆడవాళ్ళు స్వయంగా వారి కథ చెప్పటం వేరు. వేదన అనుభవించిన వారికేగానీ ఒడ్డున కూర్చుని ఉన్నవారికి ఏమి తెలుస్తుంది? అందుకే వరలక్ష్మమ్మగారు తమ లేఖల్లో ఈ దురాచారాన్ని ఖండిస్తూ శారదా బాల్య వివాహం నిషేధచట్టాన్ని ఆహ్వానిస్తున్నానని పేర్కొన్నారు. రైలు బండిలోని స్త్రీలు మాట్లాడుకున్న మాటలు ఏవో ఉబుసుపోక మాట్లాడినమాటలు కావని అవి ప్రజాభిప్రాయానికి దర్పణం వహిస్తున్నాయని నిరూపించారు. అంతేకాదు వారి అభిప్రాయాలకు సాహిత్యంలో శాశ్వతస్థానం ఇచ్చారు.

వివాహం అంటే రెండు జీవితాల సంగమం అని మనం అర్థం చెప్పుకున్నట్లయితే ఆనాటి వివాహవ్యవస్థ స్త్రీలకు ఎన్నో కడగండ్లను కలగచేస్తున్నదని ఆ విధంగా వివాహవ్యవస్థ ఒకరి జీవితానికి పెద్ద శిక్షలాగా ఉంటోందని తెలుస్తోంది. "అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య నా విద్యాధికుడెంత సులువుగా పరిత్యజించెనో చూడుడు. ఆ కాయగూరలపాటి గౌరవమున కర్హగాదా? అగ్నిసాక్షిగా వివాహమాడిన కళత్రము!...." అన్న మాటలు వరలక్ష్మమ్మగారి స్పష్టమైన అభిప్రాయాలని వివరిస్తున్నాయి. డబ్బుపిచ్చితో భార్యలకు అన్యాయము చేసే పురుష ప్రవృత్తుని ఆమె తీవ్రంగా నిరసించారు.

శారదాబిల్లు విషయంగా ఆనాటి స్త్రీలు విభిన్నకోణాల్లో వెలువరించిన అభిప్రాయాలను చూస్తే ఆనాటి స్త్రీలోకం చైతన్యం కళ్ళ ముందు కదలాడుతుంది. వధూవరులకి కొంచెం యుక్తవయస్సు వచ్చిన తర్వాత వారి సమ్మతితో వివాహాలు జరిపించటం క్షేమకరమని రచయిత్రి వ్యాఖ్యానిస్తారు. శాస్త్రములు దీనికి అనుకూలంగా ఉన్నాయని ఆమె ఎన్నో ప్రమాణాలు చూపించారు. ప్రభుత్వం కూడా అనుకూలంగా ఉంది. యువతీయువకులు అనుకూలముగా ఉన్నారు. ఇది కేవలం ఆచారం కోసం

చావబోతున్న ముసలివాళ్ళు స్త్రీలకు ప్రతికూలముగా ఉండి చేజేతుల ఆడపిల్లలకు అన్యాయం చేయబోవటమేనని ఆమె వాదిస్తారు. సంఘసంస్కరణ పట్ల వరలక్ష్మమ్మగార్కి నిబద్ధత మెండు.

ఆనాటి పత్రికలలో ప్రకటనలు ఉండేవి. కానీ పత్రికలలో గంభీర ప్రకటనలు చూడబోతే, ఏమీ కనపడకపోవటం, లేకపోవటం దేశభక్తులకిది పరిపాటిగానున్నట్లున్నది అని రచయిత్రి ఆనాటి పత్రికలు విలువలకి తిలోదకాలు ఇచ్చే పరిస్థితులని చెపుతున్నారు. ప్రజాస్వామ్య సంస్థలు నిలదొక్కుకోవటానికి పత్రికలు చాలా ముఖ్యం. ప్రకటనల పేరిట దోపిడీ విధానాలు ప్రోత్సాహించటం శోచనీయం. ప్రజలకి చేదోడుగా ఉండాల్సిన పత్రికలు వ్యాపార ప్రయోజనాలకు పెద్దపీట వేస్తే వచ్చే విపరీత పరిణామాలని వరలక్ష్మమ్మగారు గుర్తించారు. వర్తమానకాలంలోని కొన్ని అవాంఛనీయ పరిస్థితులను పట్టి చూస్తే వరలక్ష్మమ్మగారు ఎంత దార్శనికులో అన్పించకమానదు.

గుంటూరులో శారదానికేతన్ అనే బాలికల పాఠశాలని ఆదర్శవంతులు కొందరు స్థాపించారు. స్త్రీవిద్య ప్రాధాన్యతని రచయిత్రి మరోసారి ప్రస్తావిస్తారు. "స్త్రీల పాలిట ఇది కల్పతరువువంటి ప్రతిష్ఠాపన మనియు, ఎవరు స్త్రీ విద్యాభివృద్ధిని కాంక్షింతురో, ఎవరికి దేశభక్తియు జాతీయతాభిమానమును గలదో అట్టివారెల్లరూ విద్యాప్రతిష్ఠాపనమును నాదరించి పోషింపవలయుననియు నా తలంపు కాన పలుమారులా పాఠశాలను దర్శించవచ్చు చుందును... అని ఆ పాఠశాలను దాని సేవావిధానాన్ని ఆమె శ్లాఘించారు.

శారదానికేతన్‌లో జరిగిన ఒక సభలో ధర్మవీర్ వామన రామచంద్రనాయక్‌గారు స్త్రీపురుషుల విద్యావిధానము గూడా వేర్వేరుగా ఉండాలని వాదించారు. అయితే వరలక్ష్మమ్మగారు ఎంతో సౌమ్యమైన మాటలను ఉపయోగిస్తూ వారి ఆలోచనా విధానంలోని లోపాలను ఎత్తి చూపించారు. "కార్య క్షేత్రములు భిన్నములు కావచ్చును కాని స్త్రీపురుషులెల్లరు జాతిసామ్యమున ఏకమానవజాతికే చెందియున్నారని" చెపుతూ రచయిత్రి లింగవివక్షకి సమాధానమిచ్చారు. ఎటువంటి పరిస్థితులలోనూ పరుషపద ప్రయోగాలు చేయకుండా జాగ్రత్తగా అవతలివారి అభిప్రాయాలలోని లోపాలను వివరించటంలో వరలక్ష్మమ్మగారు చాలా నేర్పరి. శారదలేఖలు దీన్ని నిరూపిస్తున్నాయి.

వరలక్ష్మమ్మగారు, భర్త శ్రీహనుమంతరావుతో కలసి దక్షిణదేశయాత్రలు చేసారు. ఆ యాత్రానుభవాలని పూసగుచ్చినట్లు, చాలా హృద్యంగా శారదలేఖల ద్వారా వెల్లడించారు. ఈ విధంగా లేఖాసాహిత్యంలో యాత్రాసాహిత్యాన్ని కలిపి రాసే ఒక నూతన ఒరవడికి వరలక్ష్మమ్మగారు ఆద్యులు.[6] భర్త చెప్పిన ప్రకారము రామేశ్వరం వద్ద వారిని కలిసి సోదరుడు ఆడబిడ్డలతో కలిసి దక్షిణ దేశయాత్రలు చేసారు. కంచిలో వరదరాజస్వామి దేవాలయాన్ని దర్శించి చిదంబరం, కుంభకోణం, మధుర, తంజావూరు తదితర క్షేత్రాలను చూసి వారు రామేశ్వరం చేరుకున్నారు. మధుర నుంచి తెంకాశి మీదుగా అనంతశయన క్షేత్రాన్ని దర్శించారు. దారిలో రాజరాజేశ్వరి అమ్మవారి పీఠాన్ని దర్శించారు. ఆ తర్వాత జనార్దన క్షేత్రాన్ని దర్శించారు. అనంతరం తిరువనంతపురంలో శుచీంద్రము, కన్యాకుమారి అగ్రంలను చూసారు. తిరుచినాపల్లిలో శ్రీరంగనాథస్వామి వారి దర్శనం చేసుకొని మద్రాసు చేరుకున్నారు.

యాత్రలు ముక్తిప్రదాలేకాకుండా విజ్ఞానదాయకాలని ఆమె తెలుసుకున్నారు. ఈ విధమైన యాత్రల వల్ల లోకజ్ఞానం పెరుగుతుంది. విభిన్నప్రాంతాల్లోని ప్రజల వేషభాషలు, కట్టుబాట్లు తెలుస్తాయి. భారతదేశపు భిన్నత్వంలోని ఏకత్వ భావనని అర్థం చేసుకునే వీలు ఉంది. వీటితోపాటు చారిత్రిక విశేషాలు, ప్రకృతి రమణీయత, శిల్పకళాసంపదలు మరపురాని అనుభూతులను మిగులుస్తాయి. వరలక్ష్మమ్మగారు తమ యాత్రానుభవాలని చాలా చక్కగా వర్ణించారు. అక్కడి లోటుపాట్లని కూడా ఆమె వివరించారు. "సమస్త హైందవులును సాధారణముగా దర్శించి పూజించి పరితృప్తినందవలసిన దేవాలయములు ఆధునిక నాగరికమర్యాదలను బట్టి ప్రదర్శనములవంటి శాలలుగా మారిపోయినవి. అనగా సంపత్తి గలవారికే స్వామిదర్శనమన్నమాట...." అని దేవాలయాల దుస్థితిని ఆమె వివరించారు. డబ్బున్నవారికే దైవ దర్శనం అని అక్కడి నిజ పరిస్థితిని కళ్ళముందుంచుతున్నారు.

దేవాలయాల్లోని అర్చకుల నీచవిధానాలని కూడా ఆమె కలం నిరసించింది. "ఈ విధమున దేవతలు నేడు దౌర్జన్యపరులగు మానవుల చేతిలోజిక్కి భక్తజన సులభులు గాకున్నారు"... అని వారి ఆవేదన. ఈ తీర్థయాత్రల ద్వారా వరలక్ష్మమ్మగారు "ఆకృతులలో భేదమున్నను, ఆచారములలో మార్పులున్నను, భాషలలో భిన్నత్వములున్నను, వేషములో వ్యత్యాసమున్నను, ఆసేతుశీతనగ పర్యంతము గల యావద్భారతీయుల నైక్యపరుచుచున్నదేది? మత సూత్రమేగదా!! మతము మానవునకు ప్రాణముకంటె నుత్కృష్టమైనది"... అని చెప్తారు.

ప్రకృతి రమణీయతని ఆమె ఎంతగానో ఇష్టపడ్డారు. ప్రకృతిలో పరమాత్మని చూసే బ్రహ్మవేత్తలకు పడమటి కనుమల సొంపు ఎంత ఆత్మానందమందిస్తుందోనని చెపుతారు. ఆ కనుమలు చివరికి మూఢులకే జ్ఞానోదయమును కలిగించునట్లుగా ఉందని అంటారు. ఈ విధంగా ప్రకృతియే పరమోత్తమమైన పాఠశాల అని వారు అభిప్రాయపడ్డారు.

కొన్ని ప్రాంతాల్లో ఆచారం పేరిట స్త్రీలకు ఎన్నో బాధలను కలిగిస్తుంటారు. అలంకారంకోసం తమిళ స్త్రీలకు వారి చిన్నతనంలోనే చెవులు కుట్టి కంచుమెట్టెలని, సీసపు మెట్టెలని రెండు మూడు గుదిగుచ్చి చెవులకి తగిలిస్తారు. ఇది వారికి చాలా బాధకలిగించింది.

ఆనాటి ప్రభుత్వం ఐరోపాయుద్ధం సందర్భాన భారతదేశంలోని ప్రజలు ఎక్కువగా ఉపయోగించే కార్డు ధరని పెంచి అర్ధణా చేసింది. "ప్రజాసౌకర్యము కన్నా ప్రభుత్వకోశమును నింపించుకొనుటయే యుత్కృష్టముగా దలంచెడి ప్రభుత్వములో ప్రజల కింతకంటె సౌకర్యమెట్లు గలుగును...? అని ఆమె ప్రశ్నిస్తారు. ప్రజలకి అసౌకర్యం కలగచేసి వారిపై ఆర్థిక భారాన్ని మోపే ధోరణులని ఆమె అపహాస్యం చేసారు. బీదప్రజలు ఎక్కువగావాడే కార్డు ధరని పెంచిన ప్రభుత్వ విధానాన్ని ఆమె ఉద్యమధోరణితో వ్యతిరేకిస్తున్న విధానం చూస్తే మహాత్ముని ఉప్పుసత్యాగ్రహ స్ఫూర్తి కనిపిస్తోంది. వరలక్ష్మమ్మగారిది గాంధీమార్గం. చివరికి వారి రచనాపద్ధతిని పరిశీలించినా ఎటువంటి ఆడంబరాలకు పోని మహాత్ముని వ్యక్తిత్వాన్ని వెల్లడించిన శైలి

కనిపిస్తున్నది. గాంధీ తన ఆత్మకథలో కాశీవిశ్వనాథుని కోవెలలోని పూజారుల అకృత్యాలని, ధనాపేక్షని చెపుతారు. అక్కడి అపరిశుభ్ర వాతావరణాన్ని వివరించి దాన్ని తొలగించాల్సిన అవసరాన్ని గుర్తుచేస్తారు. వరలక్ష్మమ్మగారి రచనలలోనూ ఇవే అభిప్రాయాలు వ్యక్తం అవుతున్నాయి.

శారద లేఖలలో వరలక్ష్మమ్మగారు "వేశ్యజాతి మూలకముగా స్త్రీ సంఘమునకు చెందిన యపఖ్యాతి అపారము కాని యీ జాతిని సృష్టించినవారు పురుషులే. దూషించుచున్న వారును పురుషులే"... అంటారు. వేశ్యావ్యవస్థ ఒక సామాజిక నేరం అనీ, దీనికి తగిన పరిష్కారం వెదకాలి తప్ప ఆ వృత్తిలోని వారిని అసహ్యించుకోరాదనీ వారి వాదన. మరో లేఖలో తోలుబొమ్మలాటల్లాంటివి గొప్ప కళారూపాలైనా "ప్రసిద్ధవ్యక్తులకు కృత్రిమ రూపములను కల్పించుటచే చిత్తైకాగ్రత నశించినది..." అని అంటారు.

ఆనాటి పద్ధతి ప్రకారం నాటకాలను చూడటానికి వచ్చిన పేదలకు, ధనికులకు వేర్వేరు స్థానాలను ఇవ్వటం వారికి నచ్చలేదు. దానికి కారణం ఆ విధానం ధనికులని, పేదలని విడదీయటమే. విభజించి పాలించిన బ్రిటీష్ కుటిలనీతిని ఆమె గర్హించారు. సమానత్వ భావనని వ్యాప్తి చేసారు. అదే విధంగా నాటకాలలో స్త్రీల ప్రవేశాన్ని వ్యతిరేకించారు. స్త్రీని ఆటబొమ్మగా చూసే విష సంస్కృతిని మొగ్గలోనే తుంపాల్సిన ఆవశ్యకతని చాటి చెప్పారు.

వివిధ సాహిత్య ప్రక్రియల్లో కథ ఒకటి. చదవగానే అర్థం అయ్యేవి, చదివినంతనే ఆనందాన్ని గూర్చేవి కథలని ఆమె చెప్తారు. అన్ని విషయాల్లోనూ కథలంటే ప్రజలకి మక్కువ ఎక్కువ కాబట్టి కథల ద్వారా మహిళాశక్తిని జాగృతం చేయాలని సూచించారు. "కథలు యెట్లా ఉండాలి?" అని నేను మా సోదరుడినడిగితిని. "తన వాళ్ళని నలుగురిని దగ్గర కూచోపెట్టుకొని చదివేటట్లుండాలె" అని ఆయన అనెను. వరలక్ష్మమ్మగారు ఈ మాటల ద్వారా ఉత్తమ సాహిత్యాన్ని నిర్వచించారు.

ఆనాటి సమాజంలో, ఈనాటి సమాజంలో కూడా బిరుదులు ఒక అవాంఛనీయ వాతావరణాన్ని కలిగిస్తున్నాయి. జాతీయోద్యమం ఉధృతంగా సాగుతున్న రోజులలో దొరతనపు బిరుదులని విసర్జించమని జాతీయాత్మగల కవులు గానం చేసేవారు. కృషికి ఫలాపేక్ష కోరటం ఉత్తమగుణం కాజాలదని వరలక్ష్మమ్మగారు వివరిస్తారు. ఈ కారణాన బిరుదులపిచ్చి తగదని హితవు చెప్పారు.

వరలక్ష్మమ్మగారి అభిప్రాయంలో నిష్కారణంగా భార్యను దుఃఖపెట్టెడి దుర్జనుడు అలానే భర్త నల్లాడబెట్టెడి స్త్రీకూడా శత్రురాలు. "యుక్తాయుక్త విచక్షణములేక మతమును నిరసించెడు దురాచారులు నాకెట్లహితులో మతము పేరిట ప్రజలను పీడించెడి దుండగీంద్రులును నాకట్లే అహితులు...." అన్న మాటలు వారి సమధర్మ భావనని హృదయ ఔన్నత్యాన్ని నిరూపిస్తున్నాయి.

వరలక్ష్మమ్మగారు తమ అపార పాండిత్యంతో ఇతరులు అవగాహనారాహిత్యంతో చేసే విమర్శలకు సహేతుక సమాధానాలను ఇచ్చారు. శ్రీరామచంద్రుని గుణశీలములు నిందించబడుట, భారత గాథని దూష్యమనుట వీరికి బాధ కలిగించింది. పై విధంగా

విమర్శించేవారికి పరిపూర్ణ సమాచారం లేకపోవటం, తత్వజ్ఞానం లేకపోవటం కారణాలు. అందుకే రచయిత్రి రాముడు సీతని పరిత్యజించటాన్ని బాహ్యదృష్టితో చూసి నిందించరాదని అంటారు. రాముని ధర్మలక్ష్యాన్ని వివరిస్తారు. రాముడు ధర్మజీవి. సత్యము, ధర్మము, నీతి, త్యాగము ఈ నాలుగు సూత్రాల సారమే రాముడు. సీతపై రామునికి అపారప్రేమ ఉంది. ఏకపత్నీవ్రతుడైన రాముడు అశ్వమేథ యాగం సందర్భంలో స్వర్ణసీత విగ్రహాన్ని పక్కన పెట్టుకోవటాన్ని చూస్తే మనకు అతని ప్రేమ తెలుస్తుంది. పరిపాలనా ధర్మాన్ని అనుసరించి, ప్రజల ఇష్టాన్ని గ్రహించి తనకు బాధాకరమైనా సీతను రాముడు పరిత్యజించాడు. ఈ విషయంలో అతను పరతంత్రుడు, ప్రజాభీష్టానువర్తి. మహాత్ముల ధర్మలక్ష్యాన్ని విశ్లేషించిన రచయిత్రి గాంధీజీ జీవితచరిత్రలోని వాక్యాలని ఉదహరించి ఆమె వాదనని సమర్థించుకున్నారు.(7) అదే విధంగా భారత భాగవత రామాయణాది పురాణేతిహాసాలను నింద్యములని నిషేధిస్తే నాటక కళాపోషణకై కథలేవని ఆమె ప్రశ్నిస్తారు. వాటిలోని విశిష్టతవల్లే అవి ఈనాటికీ నిలిచి ఉన్నాయి.

విడాకుల చట్టాన్ని ఆమోదిస్తే వచ్చే విపరీత పరిస్థితులని కూడా ఆమె మనకు వివరించారు. మనం ఈనాడు ఉన్న సామాజిక వాతావరణాన్ని బట్టి వరలక్ష్మమ్మగారిని సనాతనులని అపార్థం చేసుకునే ప్రమాదం ఉంది. నేడు విడాకుల చట్టము నామోదించినచో బిడ్డలకు సవతి తండ్రులు గూడా వచ్చెదరు..." అని వారు చెప్పిన మాటలను పరిశీలించాలి. ఈనాటికీ భారతీయ సమాజం ప్రపంచమంతటా కూడా వివాహవ్యవస్థ కారణంగానే గౌరవించబడుతోంది.

బాలికలకు పునర్వివాహాలు చేయవచ్చునని ఆమె శాస్త్ర ప్రమాణాలు చూపించారు. యాజ్ఞవల్క్యస్మృతిలోని ధర్మసూత్రాలని చెపుతూ కొన్ని ప్రత్యేక పరిస్థితులలో బాలికలకు పునర్వివాహాలు చేయవచ్చని నిరూపించారు.(8) వారు చెప్పినట్లు "అందువలననే భూతకాలమును పరిశీలించుము, భవిష్యమునాలోచించుము. వర్తమానమును గుర్తింపుమని నిన్ను హెచ్చరించుట..." స్త్రీలోకం అతి జాగరూకతతో ముందుకు నడవాలి.

మద్య నిషేధ ప్రచారాన్ని మనకాలంలోని స్త్రీశక్తి చేపట్టింది. వరలక్ష్మమ్మగారు ఆనాడే శారద లేఖలలో మద్యపాన నిషేధచట్టం అవశ్యకతని చెప్పారు. వారి ముందుచూపు, ఆదర్శసమాజ నిర్మాణ కార్యక్రమదక్షత చాలా గొప్పది. "నిజముగా త్రాగుబోతులు త్రాగుచున్నది భార్య, బిడ్డల రక్తముగాని మద్యముగాదు. దొరతనమువారి మహౌదార్యమువలనగాని మహాత్ములైన వారి నిరంతర కృషివలనగాని మద్యమును నిషేధించు భాగ్యము మన భారతదేశమునకు గల్గెనేని మన స్త్రీల పుణ్యము ఫలించినదనియే చెప్పవలయును..." అని మద్యపాననిషేధానికై ఉద్యమించిన గొప్ప వనిత వరలక్ష్మమ్మగారు.

ఈ విధంగా శారదలేఖలు అటు సాహిత్యంలోనూ ఇటు సమాజంలోనూ వాటి ప్రభావాన్ని చూపించాయి. వీటి ద్వారా స్త్రీలను కేవలం వంట ఇంటికే పరిమితమవ్వకుండా సామాజిక ఆర్థిక రాజకీయ విషయాలపై చైతన్యులని చేయటంలో

ఆమె విజయం సాధించారు. శారదలేఖలు ఎందరో స్త్రీలకు మార్గదర్శకత్వం వహించాయి. ఉన్నతమైన ఆశయాల సాధనకు తమ జీవితాన్ని అంకితం చేసిన వరలక్ష్మమ్మగారు స్త్రీలోకానికి గర్వకారణం. వారి చిరస్మరణీయమైన సూక్తులు నారీలోకానికి శ్రీరామరక్షగా నిలుస్తాయి. లేఖాసాహిత్య ప్రక్రియను ఇంత చాకచక్యంగా పెంచి పెద్ద చేసిన తల్లి శ్రీమతి వరలక్ష్మమ్మగారు. ఆమె ఈనాటి స్త్రీలకే కాదు ఏనాటి స్త్రీలకైనా ఆదర్శురాలు. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి జీవితం తెలుగు సాహిత్యంలోని మహిళారచనలలో ఒక ఉజ్వలశకం.

## వివరణలు:

1. సాహిత్యంలోని విభిన్న ప్రక్రియల్లో లేఖా సాహిత్యం కూడా ఒకటి. దీన్ని ఆంగ్లంలో Epistolary అంటారు. 18వ శతాబ్దికి చెందిన నవలారచయిత Samual Richardson (1689-1761) తన రెండు నవలలని Pamela, Clarissa ఇంగ్లీష్‌లో లేఖల రూపంలోనే రాసారు. జాన్ కీట్స్, బ్రౌనింగ్, డా॥ శామ్యూల్ జాన్సన్‌లు ఈ ప్రక్రియలో ఎంతో నిష్ణాతులు.
2. శ్రీమతి వరలక్ష్మమ్మగారి జీవితము సాహిత్యము సంస్కారవంతమైన ఒక తరాన్ని రూపొందించి తెలుగువారు మరచిపోలేని మహోపకారాన్ని చేశాయి అని కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రశంసించారు.
3. "దేవతావల్లరియైన కల్పలతవలెనే నా లేఖలును చిరకాలము వర్ధిల్లవలయునను తలంపుతోడను, కల్పలతవలెనే నా లేఖలును స్త్రీల యభీష్ట ప్రదాయినులుగా నుండవలయునను తలంపుతోడను, నాలతకు నెల్లప్పుడు పూచిన పూవులుగా నా లేఖలు ప్రచురింపబడుచుండెడి తలంపుతోడను నేను జాబులు వ్రాసెడి కల్పితవ్యక్తియైన నెచ్చెలికి కల్పలతయని యభిధేయమిడితిని...." అని వరలక్ష్మమ్మగారు వివరించారు.
4. శారదలేఖలలో "కృషికి ఫలము కోరుట యుత్తమగుణము కాజాలదు: ప్రతి ఫలాకాంక్షలేని సేవాపరాయణులను లోకమే గుర్తించి మన్నించును. బాలగంగాధరతిలకునకు లోకమాన్య బిరుదమునేసభ వారొసంగిరి మోహనదాసు కరంచందు గాంధీకి మహాత్మ బిరుదమే సన్మాన సభ యొసంగెను..." అని రాసారు.
5. తెలుగులో ఆధునికయుగంలో గ్రాంథిక, వ్యావహారిక వాదాలు బయల్దేరాయి. వేదం వెంకట్రాయశాస్త్రిగారి నాగానందం (1895) అనే తెలుగు నాటకంలో పాత్రోచితభాష ఉపయోగించటం వ్యవహారిక భాషోద్యమానికి దారి తీసింది. దీన్ని గిడుగు, గురజాడ, పి.టి. శ్రీనివాసయ్యంగార్లు సమర్థించారు. జయంతి రామయ్య వావిలకొలను సుబ్బారావు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగార్లు గ్రాంథిక భాషని సమర్థించారు.
6. తెలుగులో ఏనుగుల వీరాస్వామి కాశీయాత్రా చరిత్ర పేరిట యాత్రా రచనలు చేసారు. ఇంగ్లీష్ సాహిత్యపు ఆదికవి జెఫ్రీ ఛాసర్ కూడా తన "prologue to the

Canterberry Tales" తో యాత్రా సాహిత్యాన్ని ప్రారంభించారు. అయితే లేఖా సాహిత్యంలో యాత్రారచనని కలిపే నూతన ప్రక్రియతో తెలుగులో రచనలు చేసినవారి సంఖ్య బహుస్వల్పం అనే చెప్పాలి.

7. మహాత్మాగాంధీ తన జీవితచరిత్రలో "ఈ శోధనమున నేను నా ప్రియతమ వస్తువులు గూడా విడనాడగలను. మరియు నేనీ శోధన యజ్ఞమున నా శరీరమును గూడ హోమము చేయ సంసిద్ధుడను...." అని రాసుకొన్నారు.

8. శారదలేఖలలో "కాన ప్రత్యేక పరిస్థితులలో అనగా బాలిక గర్భాదానము కానట్టిదియు లేదా సంతానము లేనట్టిదియునై యుండి భర్త షండుడు, పిచ్చివాడు, కుష్ఠురోగి, దేశాంతరగతుడునైనచో నట్టి బాలికకు పునర్వివాహ మొనర్పనగును"... అని ఉంది.

# గుఱ్ఱం జాషువా

నాల్గు పడగల హైందవ నాగరాజు పీచమణిచిన ధైర్యశాలి జాషువా గుంటూరు జిల్లా వినుకొండలో జన్మించాడు. 1895లో జన్మించిన ఈ నవయుగ కవి చక్రవర్తి తన కవితాశక్తితో తెలుగుసాహిత్యంలో దళిత సాహిత్యయుగానికి శ్రీకారం చుట్టాడు. ఈయన కవితాశక్తి ముందు అస్పృశ్యత, ఆర్థిక బాధలు నిలబడలేక పారిపోయాయి. వివిధ వృత్తులు చేసినా జాషువా ప్రవృత్తి తెలుగుసాహిత్యాన్ని ఒక వెలుగు వెలిగించింది. 'గబ్బిలము' క్రీస్తుచరిత్ర, పిరదౌసి, బాపూజి, కొత్తలోకం మొదలైన రచనలన్నీ తెలుగు సాహిత్యంలో తారలుగా వెలుగొందాయి.

భారత ప్రభుత్వ పద్మభూషణ పురస్కారం, వీరి 'క్రీస్తు చరిత్ర' కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించాయి. గజారోహణం, పౌరసన్మానాలు ఈ కవిదిగ్గజాన్ని మరిన్ని రచనలు చేసేందుకు ప్రోత్సాహించాయి. అసలు ఇది తెలుగుసాహితీ కన్యకు జరిగిన సన్మానం. ఈ సన్మానాలు, పురస్కారాలు జాషువా సారస్వత సేవకు గుర్తింపు. కృషితో నాస్తి దుర్భిక్షం అన్న సూక్తి నిజమైంది.

వీరేశలింగం, చిలకమర్తుల ఆశీర్వాదం పొందిన జాషువా తన సాహితీ తపస్సుని అణగారిన వర్గాల శ్రేయస్సుకై ఉపయోగించాడు. వారు కోల్పోయిన విలువైన జీవితాన్ని తిరిగి పొందేలా కృషి చేసారు. మనిషిని మనిషినుంచి విడదీసే సాధనాలను గర్హించిన గబ్బిలము నరుడిని కష్టపెట్టి నారాయణుని కొల్చే అధర్మాన్ని ఖండించింది. కాళిదాసు మేఘసందేశాన్ని దృష్టిలో ఉంచుకొని వీరి రచన సాగింది. గాంధీ విధానాన్ని పూర్తిగా విశ్వసించిన ఈ విశ్వకవిసామ్రాట్ గబ్బిలము ద్వారా 'తుకతుక ఉడికే అశ్రుసందేశాన్ని' పంపించాడు.

తిరుపతి వేంకటకవుల ప్రోత్సాహాన్ని ప్రేరణగా చేసుకొని జాషువా తన కవితాపరిధిని విస్తృతం చేసుకున్నాడు. గబ్బిలము కావ్యంలో దేశారాధన, రాష్ట్రారాధనలు కనిపిస్తాయి. ఆంధ్రప్రదేశ్‌లోని ఎన్నో ప్రాంతాల్ని వీరు వర్ణించారు. ప్రధానంగా హరిజనసమస్య చర్చింపబడింది.

గబ్బిలం రచన అంతా అభ్యుదయ మార్గంలోనే నడిచింది. నిజానికి జాషువా రచనలన్నింటిలోనూ సంప్రదాయ, భావకవిత, అభ్యుదయ కవితా మార్గాలు మూడూ కన్పిస్తాయి. జాషువాని 'మార్గత్రయ సమన్వయి' అని విమర్శకులు నిరూపించారు. ఆయన రచనల్లో ఎన్నో సామాజిక అంశాలు, విశాలదృష్టి కనిపిస్తాయి.

ముప్పదికి పైగా రచనలు చేసిన జాషువా తెలుగు సాహిత్యంలో ఒక ఉజ్వలశకాన్ని దేదీప్యమానంగా వెలిగించాడు. 1971 జూలై 24న వీరి మరణంతో ఒక సాహితీశకం పరిసమాప్తమైంది.

# 20. గబ్బిలము ప్రగతి ధోరణులు

"మధురసమును గడుపున మాటుకొన్న
ద్రాక్షఫల గుచ్ఛముల యందముల తూగు"

రవీంద్రకవీంద్రుని గురించి గుఱ్ఱం జాషువా చెప్పిన పై మాటలు ఆయన కవితాలక్షణాలని సూచిస్తున్నాయి. అరుంధతీపుత్రుని బాష్ప సందేశాన్ని కరుణారసపూరితంగా రచించిన జాషువా హృదయావేదనకి అక్షరరూపం గబ్బిలము. ఉక్తి వైచిత్రిలోనూ, ప్రగతి చింతనలోనూ జాషువా కవిత్వం పేరుపొందింది. జాషువాగారు తన కవిత్వం అంతటా తెలుగు మాధుర్యాన్ని చవిచూపించే సూక్తులను, సామెతలను, జాతీయాలను ఆలంకారిక పదాలను విరివిగా ప్రయోగించారు. అన్యదేశ్యాలను కూడా అద్భుతంగా ప్రయోగించారు. గడుసుదనంగా భావాలని వెల్లడించటానికి సొగసుదనంగా రచనలు చేసిన జాషువాగారు చిన్నతనంలో సమాధులపై కూర్చుని తన కవితాశక్తిని అభివృద్ధిచేసుకునేందుకు పద్యాలను నిర్మించేవారు. ఎన్నో అవమానాలను, తిరస్కారాలను పొందినా ఆయన పద్య నిర్మాణశక్తి వాడి తగ్గలేదు. విత్తనంలో చేవ ఉంటే అది భూమిని చీల్చుకుని పైకి వస్తుంది మరి!

కాళిదాసు మేఘసందేశాన్ని పోలి జాషువా 'గబ్బిలము' ఉంటుంది. కానీ, కాళిదాసు కావ్యంలో యక్షుడు ప్రణయ సందేశాన్ని పంపుతాడు. ఇక్కడ తరతరాలుగా అణచివేతకి గురవుతున్న వర్గానికి ప్రతినిధి తన మనోవేదనను సృష్టికర్తకు పంపటానికి గబ్బిలాన్ని నియోగిస్తాడు. గబ్బిలము ఖండకావ్యం పూర్వభాగంలో సందేశం పంపటం ఉత్తరభాగంలో సమాధానం అందుకోవటం ఉంటుంది. నిజానికి సమాజంలోని అసమానతలు మనల్ని ఆలోచనలకి పురికొల్పితే, అస్పృశ్యతా రాచకురుపు సమాజాన్ని ఏ విధంగా పీడిస్తోందో గ్రహిస్తే, మీదే కులమన్న ప్రశ్న వెలయించి చివుక్కున లేచిపోయినప్పుడు సాటి మనిషికి కలిగే బాధను తెల్సుకోగలిగితే అప్పుడు 'గబ్బిలం' గుర్తుకు వస్తుంది. గుఱ్ఱం జాషువా గారి ఆలోచనా విధానం అర్థం అవుతుంది.

జాషువా 'గబ్బిలము'లో వక్రోక్తి, ప్రౌఢి, మార్దవం, మాధుర్యం, ఆత్మాశ్రయత మొదలైనవన్నీ కనిపిస్తాయి. జాషువా సరిగ్గా ఆ శ్రీనాథుని వంటి కవి. కవితాశక్తిలో ఇద్దరికీ సామ్యం ఉంది.(1) ఈ మధుర శ్రీనాథుని కవితాంబుధిలో వెలకట్టలేని రత్నాలు సహృదయులకు లభ్యమవుతాయి.

ఈ కావ్యంలో నాయకుడు అవధిలేని, ఆజన్మాంతమైన అస్పృశ్యతా శిక్షను అనుభవిస్తున్న అభాగ్యుడు. తన బాధను సాటిమనుషులు ఎవరూ అర్థం చేసుకోరు. కాబట్టి ఈశ్వరునితో తన బాధ విన్నవించుకుందామని ప్రయత్నిస్తాడు. క్షుదాగ్ని పీడితుడైన ఈ అరుంధతీ సుతుని హృదయాగ్ని వేదనకి అతని కన్నీటిగాథను సమన్వయం చేయటానికి 'కొంత' ఆర్ద్రహృదయం కూడా అవసరం. కులీనులగు రాజులకు వలె హంసలు చిలుకలు మొదలైన ఉత్తమపక్షులు దూతలుగా ఇతనికి దొరుకుట అసంభవం కాబట్టి జీర్ణకుటీరాలలో నిరంతరం దర్శనం ఇచ్చే గబ్బిలమే

ఇతనికి సందేశహారి. గబ్బిలము తలక్రిందులుగా వేలాడుతుంది. అది జీర్ణాలయాలలో, అడవులలో, కొండలలో ఎక్కడికైనా వెళ్ళగలదు. తలకిందులుగా వేలాడే గబ్బిలము ద్వారా తలకిందులుగా ఉన్న సమాజస్వభావాన్ని కవి వివరిస్తారు. కర్మ సిద్ధాంతాన్ని చెప్పి మనిషిని మనిషిని విడదీసే విధానాలని అవహేళన చేస్తూ వారి సైద్ధాంతిక భావజాలం "ఊర్ధ్వమూల మధశ్శాఖం" లాగానే తలకిందులుగా ఉంది అని వివరించారు.[2] అయితే జాషువా సమాజ అసమానతలని ప్రశ్నించటమే గానీ వ్యవస్థ మొత్తాన్ని తప్పు పట్టటం లేదు. కర్మ సిద్ధాంతం నిజానికి మనిషికి కొంత వైరాగ్యంతో ఉండి దుఃఖానికి లోనవకుండా చూడటానికి ఉద్దేశించింది. దీని సాకుతో అన్నదమ్ములైనవారిని వేరుచేసి ఒకరిని అసలు మనిషిగానే గుర్తించని దుర్నీతిని, సదరు మనుషులను జాషువా ప్రశ్నిస్తున్నారు.

గబ్బిలము ప్రధానంగా వర్ణవ్యవస్థని నిరసించిన కావ్యం. వడ్డించిన విస్తరి జీవితం కాక పుట్టు నిరుపేదగా జీవితంలో ఇబ్బందులు పడుతున్న ఒక అస్పృశ్యుని జీవితాన్ని వర్ణించిన ఈ ఖండకావ్యంలో జాషువా స్వీయ జీవితానుభవాలు అనేకం కనిపిస్తాయి. రైలులో ప్రయాణిస్తున్న జాషువా కవిత్వాన్ని ఎంతో బాగుందని మెచ్చుకున్న ఒక తోటి ప్రయాణీకుడు, కులం అడిగి వెంటనే వెళ్ళిపోతాడు. ఇలాంటి ఎన్నో అవమానాలను ఆయన విషం మింగినట్లు దిగమింగారు.

గబ్బిలము కావ్యం 'చిక్కిన కాసుచేఁ దనివిఁ జెందు నమాయకుఁ డెల్ల కష్టముల్' అని మొదలవుతుంది. ఈ కావ్యనాయకుడు తనకు లభ్యమైన ఒక్క కాసులోనే సమస్తమైన కష్టాలను మర్చిపోతాడు. బొక్కెడు బువ్వతోనే సర్వం మరిచిపోయే క్షుదానల దగ్ధమూర్తి. నాలుగు దిక్కులున్న లోకంలో ఏ దిక్కులేనివాడు ఈ అరుంధతీ సుతుడు. 'భరతోర్వరకుం గడగొట్టు బిడ్డఁడై' జన్మించాడు. ఈ పరమ గర్భదరిద్రుడు నీతిమంతుడై జీవిస్తున్నాడు తప్ప ఇతరుల సొమ్ము కోరుకోవటం లేదు.

జాషువా వర్ణనా విధానమంతా వ్యంగ్యంగా ఉండి ఎన్నో ఆలోచనలను రేకెత్తిస్తోంది. అమాయకుడు అన్నప్పుడు అతని అస్పృశ్యతాశాప కారణం అతనికి తెలీదని స్పష్టం. ఏ దిక్కూ లేనివాడు అంటే సమాజంలోని ఏ ఒక్కరూ అతనిని ఓదార్చటం లేదని, నీతుల రెండు నాల్కలు సాచి బుసలు కొట్టే నిర్హేతుక కులసర్పాలు అతన్ని పట్టి పీడిస్తున్నాయని తెలుస్తోంది. అరుంధతీ సుతుండొక్కడు కడగొట్టు బిడ్డడై జన్మించాడు అనటంలో పంచములు పేరుతో ఒక వర్గాన్ని దూరంగా ఉంచిన సమాజవైఖరి కనిపిస్తోంది.[3] అరుంధతిని మహాపతివ్రతగా పూజించే హిందూసమాజం, తత్వమసి అని ప్రబోధించిన మతం అరుంధతీసుతులని మాత్రం సాటివారుగా భావించకపోవటం అమానుషం.

భరతావని ఈ సేవకుని చెప్పులు కుట్టి జీవనం చేయమనే ఆజ్ఞాపించింది. ఈ 'కర్మయోగి' నిరాకరించకుండా అగ్రజన్ముల పాదాలు కందిపోకుండా తన పని నిర్వర్తిస్తూనే ఉన్నాడు. ఇతని రెక్కల కష్టం లేనినాడు పంట పండి నేల పులకించే అవకాశం లేదు. వాడు చెమటోడ్చి ప్రపంచానికి భోజనం పెడతాడు. కానీ వానికి

భుక్తిలేదు. హరిజనుల తలమీద పులిమిన పంకలాన్ని కడిగి కరుణించటం గగనగంగకు కూడా సాధ్యంకాని పని. అసలు గగనగంగ ఎక్కడ! కనీసం ఒకే బావినుండి నీళ్ళు తోడుకోవటానికి కూడా వీరికి అవకాశం లేదు. పామునకు పాలు, చీమకు పంచదార మేపుకొనుచున్న కర్మభూమి ఇతనికి ఏ భూమి లేదని చెప్పింది. ధర్మదేవతకు గూడా వీని పేరు చెపితే ఉలిక్కిపడిపోయే జబ్బు ఉందట. వానిని ఉద్ధరించు భగవంతుడే లేనప్పుడు అసలు మనిషి వాడిని ఎట్లా కనికరిస్తాడని వ్యంగ్యంగా కవి ప్రశ్నిస్తారు. దేమునికి నైవేద్యం తీసుకొనివెళుతున్న రోజు ఇతను కనిపిస్తే అంటు అయి మూలమూర్తులకు గూడc కూడు ఉండదు. అయితే అతను చేసుకున్న పాపానికి కారణమేమిటో ఇంత వరకూ వానికి తెలీదు.

*ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి*
*యినుపగజ్జెల తల్లి జీవనము సేయుc*
*గసరి బుసకొట్టు నాతని గాలిసోcక*
*నాల్గు పడగల హైందవ నాగరాజు*

చాతుర్వర్ణాలని ప్రకటించిన హిందూ సమాజాన్ని జాషువా నాలుగు పడగల నాగరాజుతో పోలుస్తున్నాడు. హరిజనుడు కనిపిస్తే చాలు ఈ నాగరాజు కసిరి బుస కొడతాడు. అన్ని దిక్కులా మాటువేసి ఉన్న ఈ కులసర్పాన్ని ఒంటరివాడైన అభాగ్యుడు ఎలా ఎదుర్కొంటాడు? ఎక్కడికి వెళ్ళినా ఈ నాగుపాములు కులం అడిగి కాటు వేస్తున్న సంఘటనలే.

ఈ దీనుడిని దరిద్రదేవత కావలించుకుంది. అతని రక్తాన్ని పీల్చిపిప్పి చేస్తోంది. ఈ బాధలను భరించలేక, కులమే లేని తను మళ్ళీ కొడుకులను పుట్టించి ఆ అఖాతంలో మళ్ళీ పడవేయటం ఎందుకని అతను 'భార్యయేలc బుట్టుబానిసకని' బ్రహ్మచర్యదీక్ష సాగిస్తున్నాడు.

ఉదయం నుంచీ సాయంకాలం దాకా రక్తమోడ్చి కష్టము జేసి ఇల్లు చేరిన ఈ కష్టజీవి గంజి దాగి ఒకనాడు పక్క మీద మేను వాలుస్తాడు. 'ఇనుడిని సాగనంపి' అన్న పదం ఇతని కష్టాన్ని గుర్తుకు తెస్తోంది. సంధ్యానాట్యకేళి మాని మహానటుడు శివారవములను ఆరంభించాడని జాషువా అంటారు. ఈ సందర్భంలోనే ముక్కు మొగమున్న చీకటి ముద్దవోలె గబ్బిలం ఒకటి అతని ఇంట ప్రవేశించి విహరణము చేయసాగింది. దాని రెక్కల ఊపుకి ఆ అభాగ్యుని ఇంట దీపం కూడా ఆరిపోయింది. దయ్యపు బిల్ల వలెం తిరుగుచున్న గబ్బిలాన్ని చూడగానే వానికి దుఃఖం పొంగుకొని వచ్చింది. అతని మనసులో క్రొత్తక్రొత్త ఊహలు అంకురిస్తాయి. మదోన్మత్త ప్రపంచంలో పురుగు పుట్రాగాక పేదలకు ఆప్తులు, చుట్టపక్కంబులు కలరే? అని మళ్ళీ తనని తాను సంభాళించుకుంటాడు. చెలిమితో ఆ పక్షికి తన స్వీయ వృత్తాంతాన్ని విన్నవించుకుంటాడు.

ప్రవిమల దేవతా భవన వాసము చేయుచు మమ్మువంటి మా
నవులకు లేని గౌరవమునం దులదూఁగెదు గబ్బిలాల రా
జీవిగద నీవు స్వాగతము నీకు శుభంబుకదమ్మ నీతనూ
భవులకుఁ దల్లక్రిందుల తపంబులకున్ గుడిగోపురాలకున్

మానవులకే లేని దేవాలయం ప్రవేశం గబ్బిలానికి ఉంది అనటంలో ఎంతో చక్కని వ్యంగ్యం ఉట్టిపడుతోంది. గబ్బిలాన్ని తనతో పోల్చుకుని సహోదరీ అంటాడు. 'చుట్టాలేగద వాలఖిల్యు లిన తేజుల్ యోగవిద్యానిధుల్' అనటంలో గబ్బిలాన్ని, తనని బహిష్కరించిన సమాజంలోని దుర్నీతి కనిపిస్తోంది. వాలఖిల్యమునులు మహాతపశ్శక్తి సంపన్నులు వారు తలక్రిందులుగా వ్రేలాడుతూ తపోనిష్ఠలో ఉండగా గరుడిని కోర్కెను మన్నించి చెట్టుకొమ్మ తమకు ఆధారంగా ఉన్నప్పటికీ దాన్ని పరశ్రేయశ్శుభాకాంక్షలై దాన్ని వదిలివేస్తారు.[4] గబ్బిలాన్ని వాలఖిల్యమునులతో పోల్చటం అంతకు ముందు గబ్బిలాన్ని తనతో పోల్చుకొని సహోదరీ అనటం అన్వయించిచూస్తే జాషువాగారి వ్యంగ్యరచనా శక్తి ఎంత గొప్పదో తెలుస్తుంది. తలక్రిందులుగా తపస్సు చేస్తున్న వారిని మహామునులని స్తుతించే హిందూ మతస్థులు వారి విధానాల ద్వారా తలక్రిందులైన హరిజన సోదరుని ఏమాత్రం పట్టించుకోకుండా అతను సమానత్వం కోసం చేస్తున్న తపస్సుని అర్థం చేసుకోకుండా ఉండటం అర్థరహితం.

గబ్బిలము సమస్తదేవతా సన్నిధిన ఆరగిస్తుంది. అది ఎంతో పుణ్యాత్మురాలు. 'మరి అన్నములేని పేదల గృహంబులు సొచ్చితివేల బేలవై' అని జాషువా ప్రశ్నిస్తారు. 'సనాతన ధర్మధేనువుల్ పిదికిన పాలు పేదలకు లభింపవు శ్రీగలవాని యాజ్ఞలో' అని హృదయం లేని లోకం తీరును వివరిస్తున్నారు. ప్రతి సంవత్సరం శ్రీరామనవమి అంటూ ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుగాని బీదవారికి ఒక్క మెతుకైనా రాల్చని మూర్ఖులు ఉన్నంతకాలం ఆకలికేకలు అస్పృశ్యత కొనసాగుతాయనే జాషువా చెపుతున్నారు. ముప్పదిమూడు కోట్ల దేవతలు ఉన్న ఈ దేశంలో దుఃఖితులైన ఎందరో పేదలు, పకీరులు కనీసం గంజినీళ్ళు దొరకక అలమటిస్తున్నారని నిజం చూపిస్తున్నారు. అందరికీ సరిపోయేటంత ఉందిగానీ ఆశని సంతృప్తి పర్చటానికి లేదు.

జాషువా క్రైస్తవమతం స్వీకరించినా హిందూమతంపై విశ్వాసాన్ని కోల్పోలేదు. కేవలం హిందూమతంలోని లోపాలని విమర్శించారు తప్ప మొత్తం హిందూమతాన్ని దుయ్యబట్టలేదు. అలానే క్రైస్తవమతంలోని లోపాలని ఎత్తిచూపకుండానూ లేరు. అకారణంగా తనను దూరం చేసుకున్న క్రైస్తవ మత పెద్దలు "పరమార్థంబులు బోధ సేయుదురు" కానీ "ముక్కుకు సూటిగాదగులు యుక్తుల్ పన్ని కైవల్యపుం దెరువుల్మాపి మహాపరాధివనుచున్ దీర్మానముల్ సేయుచుందురు" అని విమర్శించారు. హరిజనులు హిందూమతంలోని పీడనని భరించలేక మతమార్పిడి చేసుకున్నారనేది నిర్వివాదాంశం. అయితే క్రైస్తవమతంలోకి మారినా వారి బాధలు అంతం కాలేదు. అక్కడా వారు అనేక అవమానాలు ఎదుర్కొన్నారు. జాషువా స్వీయానుభవాలు ఈ విషయాలని వెల్లడిస్తున్నాయి.

ప్రతి రాత్రి, ప్రతి పగలు ఇతనికి తన చేజారిపోయిన జీవితం గురించిన ఆలోచనలే. లోకమంతా ప్రశాంతంగా నిద్రిస్తున్న రాత్రి సమయంలో ఔషధమే లేని అస్పృశ్యతారోగపీడితునికి మాత్రం నిద్రపట్టక కాళరాత్రి అవుతుంది. అందుకే గబ్బిలంతో "నా గృహంబున వెదుకుచున్నావదేమి దొరకవిచ్చట నానందకిరణ లవము' అని అంటాడు.

ఈ ప్రశాంతరాత్రి యెల్లలోకంబును
బుజ్జగించి నిద్రc బుచ్చుకొనియె
నౌషధంబులేని యస్పృశ్యతాజాడ్య
మందభాగ్యు నన్ను మరచిపోయె

గబ్బిలానికి "పిట్టా! నీకు నమస్కరించెదను నా విజ్ఞప్తి నాలింపవే' అని లోకమంతా తనను మర్చిపోయిందనీ కర్మసిద్ధాంతం పేరు చెప్పి స్వార్థపరులు తన నోరు కట్టివేసారని అంటాడు. ఏదో కర్మ కావచ్చు అందుకే లోకానికి తన మీద ఆ కక్ష ఉందని, విషయాన్ని 'ఈశ్వరుని చేతనే ఋజువు చేయింపవమ్మ' అని అర్థిస్తాడు. ఆలయంలో గబ్బిలము వేలాడే వేళలో శివుని చెవి కొంత చేరువలో ఉండే అవకాశం ఉందనీ అంటాడు. కానీ శివునికి తన ప్రార్థన వినిపించేటప్పుడు పూజారి మాత్రం సమీపంలో ఉండకుండా ఉండాలి. దేముడు అందరికీ దేముడేగానీ పూజారులు మాత్రం అడ్డంపడి తనను ఈ స్థితికి నెట్టివేసారని చెపుతున్నాడు. ఆ పూజారులు వింటే 'నీకగున్ బ్రాయశ్చిత్త మీశానుడన్ గోపించున్' అని విషయం చెపుతున్నాడు. పవిత్ర గ్రంథాల్లోని మాటలను వక్రీకరించి, సమాజంలో వర్గభావాలని అధికంచేసి తాము సుఖించాలని తాపత్రయపడే మత పెద్దలపై జాషువా తన కవితాస్త్రాన్ని సంధించాడు.

గబ్బిలాన్ని పరిపరివిధాలుగా కవి సంబోధిస్తాడు. సహోదరీ, ఖగసన్యాసినీ, ఖగసతి, ఖగరాజ్ఞి, ఖగవధూటి, ఖగాంగన అని ఎన్ని విధాలుగా పిల్చినా ఆ పక్షిని తన పక్షాన సందేశాన్ని అందించమని కోరటమే జాషువా ప్రధాన ఉద్దేశ్యం. తనకు సహాయం చేయటానికి గబ్బిలాన్ని నమస్కారాలతో సంతోషపెట్టలేనని, దోషములు చూపించి నీతులు వచించలేనని, స్వార్థమున గొఱముట్టువలె గణింపలేననీ విన్నవిస్తాడు. గబ్బిలము కళాశక్తిని ఉచ్చరింపలేనని వివరిస్తాడు. ఈ విధంగా చేయటానికి తనకు ఉద్యోగ బలంకానీ, కులం యోగ్యతలు కానీ లేవు. తాను కడుపునిండిన భాగ్యవంతుడు కాడు, దొరతనం చేయటానికి మతస్థుడు కాడు. ఈ విధంగా సమాజ తీరుతెన్నులని, ద్వంద్వ ప్రమాణాలని, దేముని పేరు చెప్పుకొని ఆత్మవంచన చేసుకునేవారి దుర్వ్యాపారాలని ఆయన కలం వెలుగులోకి తెచ్చింది. స్వార్థపరుల విధానాలు, వారి దేవుళ్ళు వారి ప్రతిరూపాలే గదా!

'మృగ పక్షిత్వ విచిత్ర ధర్మములు' కల్గిన గబ్బిలాన్ని లోకం మొగమైనా చూడదని, దుశ్శకునంగా భావిస్తుందని అయినా తాను దానికి సాంత్వన కలగచేస్తానని జాషువా హామీ ఇస్తున్నాడు. తాను సమాజ క్రౌర్యానికి బలైనా, తనకి ఎవరూ సాంత్వన కలిగించకపోయినా ఇతరుల బాధలకు స్పందించి తనవంతుగా సహాయం అందిస్తానని

ముందుకు రావటం జాషువాగారి హృదయ ఔన్నత్యాన్ని చూపిస్తోంది. తన సందేశాన్ని పినాకపాణికి అందించమని గబ్బిలాన్ని కోరతాడు.

జాషువా సత్యవాది. ఆయనది ధార్మికదృష్టి. పిరికితనం అనేది ఆయనకి తెలీదు. అందుకే నిర్భయంగా విశ్వనాథుని ముందు నిలబడి గబ్బిలాన్ని మాట్లాడమంటాడు. సృష్టికర్తకి అతని సృష్టికి మధ్య ఉన్న అంతరాన్ని వివరిస్తున్నాడు.

ధర్మమునకుఁ బిరికితన మెన్నఁడును లేదు
సత్యవాక్యమునకుఁ జావు లేదు
వెఱవనేల నీకు విశ్వనాథు మ్రోల
సృష్టికర్త తాను సృష్టి వీవు

పక్షిసుందరీ అంటూ గబ్బిలాన్ని సంబోధించి అది చెయ్యవలసిన ప్రయాణ మార్గాన్ని వివరిస్తాడు. ఇక్కడ జాషువా ఆంధ్రదేశంలోని అన్ని ముఖ్యప్రాంతాలను ప్రస్తావిస్తాడు. జాషువా గారి కవితా ఉద్దేశ్యము దేశారాధన. ఈ విషయాన్ని వారే స్వయంగా విజ్ఞప్తిలో సూచించారు.[5] కావ్యనాయకుని నివాసం భారతదేశంలోని మధ్యస్థానం. ప్రారంభంలో 'రఘునాథ నృపాలుదేలియున్న తంజాపురి మండలంబునకు జక్కగ దక్షిణభాగ భూములన్' అని కవి అన్నారు. తంజానగరం నుంచి ప్రారంభించిన గబ్బిలం దారిలో ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాలను తడిమింది. అన్ని ప్రాంతీయగాథలను వినిపించింది. 'కృష్ణరాయలవారి యెదఁబాటు చీకట్లు ముసిరి' అని ఆ ఆంధ్రభోజుని ప్రస్తావించాడు. వేంకటకవి, ముద్దుపళని, క్షేత్రయ్య కవుల సాహితీశక్తిని స్మరించాడు. సరస్వతీ మహలు దర్శించిన అనంతరం పదిహేను పర్వాల భారతాన్ని తెలుగువారికి అందించిన తిక్కన సోమయాజి, నెల్లూరి పట్టణాన్ని చూడమని అంటాడు. హంపీ క్షేత్రంలో తెలుగు కళ వెలుగు వెలిగిందని అక్కడి రాయరగండడు మహేంద్రవైభవంతో పాలించాడని వివరిస్తాడు. విద్యానగరంలోని శిల్ప రమణీయతని కూడా ప్రస్తావిస్తాడు. కృష్ణభూవిభుని సామర్థ్యాన్ని, అతను పారసీ గుర్రాలను తెప్పించుకున్న విశేషాలను ప్రస్తావించాడు. ఆ తర్వాత ఆనాటి దేశపరిస్థితులు, మరఫిరంగులు, తెల్లదొరల దండులను కళ్ళకు కట్టినట్లుగా వర్ణించాడు. పల్నాటి రాజుల చరిత్రను, కోడిపందాలను కూడా గబ్బిలం దారిలో సమగ్రంగా వర్ణన చేసాడు. 'విసిరి విరక్తిచేఁ దెలుగు వీధులలో నొక పిచ్చివానిగా మసలిన వేమనను' అతని భావసంపదను, పద్యాలను గుర్తు చేస్తాడు. వేమన పద్యాలు తెలుగుభాష ఉన్నంతవరకూ ఉంటాయి. రాజమండ్రిలో పుట్టి తెలుగులో ఆదికావ్యాన్ని అనన్యసామాన్యంగా రచించిన నన్నయని స్తుతిస్తాడు. సారంగధరుని వృత్తాంతాన్ని వివరంగా చెప్పి నీతికి బలైపోయాడని ఆ రాజనందనుని దౌర్భాగ్యాన్ని ఊహించమంటాడు. ద్రాక్షారామ భీమేశ్వరులని దర్శించిపొమ్మని అలా చేస్తే 'మజ్జాత్యుద్ధరణమ్ము గల్గగలదమ్మా' అని ప్రశ్నిస్తాడు. బొబ్బిలి పౌరుషానికి పెట్టింది పేరు. బొబ్బిలి పేరు తల్చగానే కోడికూసింది. ఆ కోడికూత గూడా 'నా యెడ జాలి లేక చరణంబున గత్తులు గట్టి ప్రాణముల్ దీయదొడంగు రాజవితతిం జలవార్చితిఁ దెల్లవారునే' అంటాడు. ఆంధ్రుల పూర్వచరిత్రను తల్చుకుంటే జాషువాకే

కాక అతని పాఠకులకి కూడా ఒళ్ళు పులకరిస్తుంది. తెలుగువారి చరిత్ర, సంస్కృతులని 'గబ్బిలము' అద్భుతంగా వర్ణించింది.

బౌద్ధం వర్ధిల్లిన నలందా, పాటలీపుత్రాలని స్మరించి 'అహింసా సూక్తుల' పట్ల విశ్వాసాన్ని ప్రకటిస్తాడు. 'అన్నపూర్ణ సేయు నాహారభిక్షతో ముక్తిభిక్ష నీకు ముట్టగలదని' చెప్తాడు. వ్యాసుని వృత్తాంతాన్ని వివరించి మొగలాయి చక్రవర్తుల సామ్రాజ్యలక్ష్మీ ఢిల్లీనగరాన్ని దాని గత చరిత్రను చెప్పి 'ఢిల్లి నగరంబు నందంబు తరుగులేదు శిరము నెరియ లేదు' అని అంటాడు. రెండువేలేండ్ల క్రింద నిద్రించుచున్న మౌర్యరాజ్యాల విపుల సామ్రాజ్య చరితను కూడా తల్చుకుంటాడు. హిమాలయాల సౌందర్యాన్ని చెపుతాడు. 'అస్పృశ్యతా క్రూరవ్యాఘ్రము సంచరించుటకు సంకోచంబు లేదైన బౌద్ధారామంబులు సాగనీయవు గదమ్మా!"... అని అంటాడు. ఎన్ని ప్రాంతాలు తిరిగినా అస్పృశ్యతా పిశాచి ఉంటూనే ఉందనటం గమనార్హం. గబ్బిలం చివరకు వాని యిష్టార్థములు కూర్చుదానివలె విశ్వనాథుని గుడికి వెళ్ళింది. భారతదేశంలో ఆనాటికి కొన్ని మార్పులు వచ్చాయి. 'నిద్దుర మేల్కొని యల్లన ఖద్దరు రాట్నంబు పౌరకాంత వహించెన్' అనటం దేశస్వాతంత్ర్యం గాంధీమహాత్ముని సారథ్యంలో రావటాన్ని సూచిస్తోంది.

'గబ్బిలము' రెండవ భాగం తొలిపలుకులో 'దేవాలయ ప్రవేశం, హరిజనోద్ధరణమని గాంధీజీ చరకా ఝూంకరణము శ్రవణ శుభ గంగాగానము చేసినది'... అని జాషువాగారే స్వయంగా తెలిపారు. 'తిరువానుకూరు దేవుడు తెఱచెం గుడి తలుపు లితర దేవుండ్లును' అని హరిజనుల దేవాలయప్రవేశాన్ని చెప్పారు. భారత రాజ్యాంగ శిల్పి అంబేద్కర్ స్వాతంత్ర్యభారతంలో అస్పృశ్యతని శాసనం ద్వారా నిషేధించాడు. నిస్సందేహంగా హరిజనోద్ధరణకి చిత్తశుద్ధితో గాంధీ అంబేద్కరులు కృషి చేసారని జాషువా అభిప్రాయం. ఈనాటి దళిత సాహిత్యం పేరుతో గాంధీని నిందిస్తూ, అంబేద్కర్ కృషిని అర్థం చేసుకోలేక రాజకీయ ఆలోచనలతో వృధాకాలయాపన చేస్తున్నవారు తొలి తెలుగు దళితవాది గుఱ్ఱం జాషువా ఆలోచనా విధానాన్ని అర్థం చేసుకోవటం మంచిది. కొందరు 'దళితకవుల' మాస్కులో జాషువాకవిత్వాన్ని ఆయన వ్యక్తిత్వాన్ని శంకించి తెలుగు కవిత్వానికి అన్యాయం చేసారు.[6]

వెఱపువలదు నీకు హరిజన సోదరా
స్వీయరాజ్య రథము వెడలివచ్చె
లాగిపొమ్ము నీకు భాగంబు గలదంచు
బాడుచుండె రత్న భరతమాత

మరింత ఆలోచనతో స్వాతంత్ర్యానంతర భారతంలో హరిజనులు అవలంబించాల్సిన మార్గాన్ని కవి వివరిస్తున్నారు. జాతి నిర్మాణంలో తనవంతు పాత్ర నిర్వర్తించమని జాషువా పిలుపునిచ్చారు. 'సత్కవీంద్రుల యూహల్ విహగంబులై తిరుగుచుండెన్' అని ఆదర్శకవితా లక్షణాలను వివరిస్తున్నారు.

జాషువాగారు గొప్ప దార్శనికులు. రానున్న కాలంలో 'ఎవరికి వారై బ్రతుకుచు నవీనధర్మములు పిచ్చినమ్మకములతో సవరించి ప్రజల తలలో ప్రవేశ మొనరించు

స్వార్థపరులంగంటే' అని భవిష్యత్ దర్శనం చేస్తున్నారు. జాషువా నిర్మాణాత్మక కవి. ఆకాశం వంటి గాంధీ వ్యక్తిత్వాన్ని అనవసరంగా అవహేళన చేయటం, అసభ్య పదజాలాన్ని ప్రయోగించటం, బాధ్యత మరచిపోయి వ్యాఖ్యానాలు చేయటం మొదలైనవి ఈనాటి దళిత సాహిత్యం పేరుతో వస్తున్న కొన్ని రచనలలోని వైఖరి.[7] కానీ జాషువా గాంధీమహాత్ముని గురించి ఈ విధంగా అంటారు.

మఱచితి నాదిదేవుని సమానుఁడు బుద్ధునియంతవాడు భా
సుర దరహాస చంద్రికల శుభ్రతలోన గట్టివాఁడు య
ద్ధారలకుగాదు వారి చెవిదూరిన వారిస లక్ష్యపెట్టఁడ
ప్పరమమునిన్ సబర్మతి నివాసిని జూచితివే తపస్వినీ

మాటలకు, చేతలకు అభేద్యమే గాంధీవాదం. ఈనాటి దళితవాద కవులు గాంధీని, అంబేద్కర్‌ని ఎంత విశాల దృక్పథంతో జాషువా అర్థం చేసుకున్నాడో తెలుసుకోవాలి.

"కలడంబేద్కరు నా సహోదరుడు మాకై యష్టకష్టాలకుం
బలియై సీమకుపోయి క్రమ్మతిన విద్వాంసుండు"

అని అంబేద్కర్ సేవలను స్మరిస్తాడు. సహృదయతే మరో దెబ్బతిన్న జీవి బాధను అర్థం చేసుకుంటుందనే జాషువాగారి మాట పరమసత్యం.

వేమన్న బ్రతికి ఉన్నప్పుడు పిడికెండన్నము బెట్టలేదపుడు అని లోకం తీరుని విమర్శిస్తారు. చావు, బ్రతుకు మధ్య తేడాని ఇలా చెపుతున్నారు.

బ్రతికియున్న సాయిబాబెన్నడును గాడు
చావకున్న వట్టి సాయిబయ్య
తిరుమలేశుడైన తెలియడీ యర్థంబు
చావు బ్రతుకులోని సారమిదియ

తెలుగు సాహితీమర్మాలని క్షుణ్ణంగా తెలుసుకున్న జాషువా వ్యాకరణ శాస్త్రకారులకి 'పాకము రసమింపు సొంపుఁ బరికించెదరే' అని భావం ప్రాధాన్యతని వెల్లడించారు.[8] కందుకూరి తన కవుల చరిత్రలో వేమన పేరు విస్మరించటాన్ని ఈ కవి ఆక్షేపించారు. జాషువాకి కులమత భేదాలను ఖండించిన వేమన్న అంటే ఎంతో గౌరవం.

తెలుగువారిలో ఐకమత్యం లేదని 'కలుపుంగోలుతనంబు లేదది కళంకంబంద్రు మా జాతికిన్' అని వివరించారు. రవీంద్రుని రచనా విధానాన్ని అనుసరిస్తూ 'ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వా విశ్వసత్యము నాలపింపగలదో' అని ఆ శుభవేళకై కొంగుబట్టి నిలచి నలిగి వాపోవుచున్నది నా మనస్సు అంటారు.[9] వీరిది రాష్ట్రాభిమానం, దేశాభిమానం మాత్రమే కాకుండా మానవతావాదం కూడా. జాషువాకి ఆగ్రహావేశాలు లేవు గానీ కవితావేశాన్ని ప్రతిభను స్మరించటానికి వెచ్చించారు.

'అనఘుండ్రశు మహీజలంబున వివేకానందసన్యాసి వ్రాసిన వ్రాతల్ దడి యారలేదిపుడు' అని భారతజాతి పునరుజ్జీవానికి వివేకానందుడు చేసిన సేవలను గుర్తుకు తెస్తారు. ప్రాచీన అజ్ఞానబంధన విచ్ఛేదమొనర్చి యే ఘనుడు విద్యాభిక్ష వేస్తాడో అని వివేకానందుని ప్రబోధాల్ని జాతి విస్మరించరాదని సూచిస్తున్నారు.[10] 'బుట్టిగల గాంధీ యుగంలో కట్టిలు ఖడ్గంబు లేలలా లేవు ప్రజన్' అని మరొక్కసారి ఆనాటి హరిజన నాయకులకు, ప్రజలకు గాంధీ మార్గంపై ఉన్న విశ్వాసాన్ని తన నోటి ద్వారా వెల్లడిస్తున్నారు.

జాషువాగారికి తన పర బేధం లేదు. "యిండియా పొలమందుంగల మాలమాదిగలకున్ భూతేశుడే కాదు కృష్ణలు కృష్ణన్నిరసించు దైవముల్ క్రీస్తుల్ మస్తుగా బుట్టినన్ కలపన్నేరరు రెండుజాతులను" వక్కాణింప సిగ్గయ్యెడిన్ అని స్పష్టం చేసారు.

అన్ని జాతులు అన్నదమ్ములుగా కలసిమెలసి ఉండాలన్నదే జాషువాగారి అభిమతం. మాలమాదిగలు తమలోతాము కొట్లాడుకోవటం ఎంతమాత్రం కూడదని, ఐదువేళ్ళు కలిస్తేనే పిడికిలి అవుతుందని ఆయనగారు ఆనాడే వివరించారు. అందుకే 'జగముల్ మెచ్చు బియేలెమేలు బిరుదుల్ సాధించినామంచు మా మాలలు మాదిగల్ గుల మహా లోభంబు రెట్టింపగన్ తెగలం గట్టి తగాద లెంచెదరు గానీ సంధి గావింపరో' అని ఆనాడే భవిష్యత్ దర్శించారు.

జాషువాగారి గబ్బిలము సామాజిక జీవితంలోని ప్రతి విషయాన్ని తడుముతోంది. జాషువా తన కవితా పరిధినివిస్తృతం చేసి ఆదర్శసమాజానికై కృషి చేస్తాడు. జీవితం నేర్పిన పాఠాలను జీవనసారాన్ని గ్రహించేందుకు ఆయన ఉపయోగించారు.[11] గబ్బిలము కాళిదాసు మేఘసందేశంలాగా సాహితీ ఆకాశంలో మిగిలి ఉంటుంది. సమాజాన్ని చిత్రించటంలో కూడా గబ్బిలము విజయం సాధించింది. అనేక కోణాలనుంచి సమాజాన్ని పరిశీలించి దానిపై కక్ష కట్టకుండా నిర్మాణాత్మక వైఖరితో సమాజ పునర్నిర్మాణానికి కృషి చేసిన సాహితీవేత్త జాషువా. సహజమైన పదాలు, శైలి, మాధుర్యం వల్ల ఈ కావ్యం చిరస్థాయిగా నిల్చిపోయి సహృదయులను ఆలోచింపచేస్తూనే ఉంటుంది.

## వివరణలు:

1. పొట్లపల్లి సీతారామారావుగారు "కవితాశక్తి ఎప్పుడూ ఉక్తివైచిత్రం మీదనే సాగుతుంది. పూర్వకవులలో శ్రీనాథుడు కవితాశక్తి కలిగిన కవి. జాషువా సరిగ్గా ఆ శ్రీనాథుని వంటి కవి" అని వివరించారు.

2. కర్మసిద్ధాంతానికి ప్రాతిపదికగా మిగిలిన భగవద్గీతలో ఇలా ఉంది.
ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥

3. ఒక జాతిని తక్కువదిగా ముద్రవేసి మరోజాతిని ఎక్కువదిగా చెప్పే విధానం మానవచరిత్రలో అనేక జాతుల్లో, సమూహాల్లో కనిపిస్తుంది. హిందూమతానికి చెందిన పురుష సూక్తం శూద్రులు యజ్ఞపురుషుని పాదాలనించి జన్మించారని చెప్పి పంచముల గురించిన ప్రస్తావనే చేయలేదు. మానవ విజ్ఞానశాస్త్రంలో పురాణగాథల ప్రకారం జాతులని వర్గశ్రేణిలో ఉంచిన విధానం వివరించబడింది. ట్రోబ్రియాండ్ సమాజంలో ప్రజలు మొదట పాతాళంలో నివసించేవారని, ఒక్కోజాతి పైకి వచ్చిందని చెపుతారు. లుకూబా తెగ టోటెం కుక్క కాగా మలాశి తెగ టోటెం పంది. కుక్క బయటకి వచ్చినపుడు నిషిద్ధపండు తిన్న కారణంగా మిగతా తెగలకన్నా కుక్క టోటెంగా ఉన్న తెగ నీచజాతి అయింది. మలినోస్కి దీన్ని వివరిస్తూ పౌరాణికగాథల ఆధారంగా కొన్నిజాతులని హీనంగా చూసే విధానాన్ని చెప్పారు.

4. మహాభారతం, ఆదిపర్వం - ద్వితీయాశ్వాసం (72-73)లో ఈ విధంగా ఉంది: "అమ్మహాశాఖ నవలంబించి తలక్రిందై యాదిత్యకిరణంబులు తమ కాహారంబుగాఁ దపంబుసేయుచున్న వాలఖిల్య మహాముని గణంబులం జూచి యిది భూమి పయింబడిన నిమ్మునులకు బాధయగునని..."

5. "ఇంట ప్రవేశించి దీపమార్పిన గబ్బిలమును జూచి తన కన్నీటిగాథ నీశ్వరునితో చెప్పుమని వీడు ప్రార్థించెగాని నిజమున కతని యుద్దేశ్యము దేశారాధన. కైలాసయానమునకు నా పన్నిన త్రోవ కొంత వక్రతకు గుఱియైనది. ఇది దోషము కాదనుకొందును"... అని గబ్బిలము మొదటిభాగము జాషువాగారు వివరించారు.

6. 'రచనాశైలిలో పదునైన కత్తిలాంటి కలం కల్గిన జాషువా కలం నుండి సరైన దళిత దృక్పథంతో రచనలు ఇంకా కొనసాగుంటే, అవి ఎంతగా నేటి దళిత ఉద్యమాలను మరింతగా పదునుపెట్టేవో అర్థం చేసుకోవచ్చు. జాషువాగారి 'గబ్బిలము' గాంధేయ హరిజనోద్ధరణ మార్గంలోనే ఎగిరిపోయింది. కనీసం అంబేద్కర్ హరిజనోద్ధరణ మార్గంవైపుకు కూడా పోలేకపోయిందనేది కూడా విస్మరించకూడని విషయమే"... (పుట 42 - జాషువా కవితాతత్వం)

7. 'చిత్తరువు' అనే దళితవాద కవితా సంకలనంలోని అల్లం - బెల్లం అనే కవితలో 'ఈ... దేవుళ్ళ మొఖాన కాండ్రించి ఉమ్ముతా' లాంటి ప్రయోగాలు ఏ ప్రస్థానానికి? అసభ్యమైన పదాలతో ఒక వర్గాన్ని టార్గెట్ చేసి దూషించటం వారి ఆశయ సాధనకు దారితీస్తుందా? దళితులంటే కేవలం మాల మాదిగలు మాత్రమేనా? మాలపల్లి, కన్యాశుల్కం, సంస్కార లాంటి రచనలు చేసిన బ్రాహ్మలు ఉన్నత వ్యక్తిత్వం ఆదర్శాలు ఉన్నవారేగా!? దళిత బ్రాహ్మల, దొంగదళితుల కన్నా "కొందరు" నిజంగా స్పందించి రచనలు చేసారనటం అవాస్తవమా?

8. జాషువా కవి స్వయంగా... "నీనాడు రచింతు రిద్ధకరుణా పరిణద్ధరస ప్రబంధముల్" అని తన రచనలో కరుణరసం ప్రధానమైందని వివరించారు.

9. రవీంద్రుని గీతం where the mind is without fear and the head is held high జాషువాని ఆకర్షించింది.

10. వివేకానందుడు గుణత్రయ వర్గవిభాగం ఆధారంగానే వ్యక్తి బ్రాహ్మణుడు అవుతాడు తప్ప జన్మతః కాదని వివరణలతో చెప్పారు. ఆదర్శవ్యక్తిత్వం బ్రాహ్మణ లక్షణమైతే జాషువా ఒక సద్బ్రాహ్మణుడు.

11. Poetry is the criticism of life అని Mathew Arnold అంటారు. జాషువా కవితాతత్వం కూడా ఇదే.

# గుడిపాటి వెంకటాచలం

1894 లో జన్మించిన చలం తన కాలానికన్నా ముందున్న గొప్ప ఆలోచనాపరుడు. చలం వైఖరి ఎందరో రచయితలను, చదువరులను ఆకర్షించి, ఆలోచింపచేసింది. 1994లో ఆంధ్రదేశం చలం శతజయంతి ఉత్సవాలను ఘనంగా జరుపుకొంది. అయితే చలం ఆనాటికీ, ఈనాటికీ వివాదాస్పద రచయితగానే ఉండిపోయాడు తప్ప అతని స్థానం, ప్రాముఖ్యత తెలుగు సాహిత్యచరిత్రలో ఇంకా సరిగా నిర్ధారించబడలేదు.

గుడిపాటి వెంకటాచలం శైలి చాలా గొప్పదని విమర్శకులందరూ అంగీకరించారు. శ్రీశ్రీగారి మహాప్రస్థానానికి చలం రాసిన యోగ్యతాపత్రం చలం శైలిని నిరూపించే యోగ్యతాపత్రం. మ్యూజింగ్స్, అమీనా, అరుణ, దైవమిచ్చిన భార్య, సావిత్రి, స్త్రీ, బుజ్జిగాడు, బిడ్డలశిక్షణ, ఆ రాత్రి, బ్రాహ్మణీకం, మైదానం లాంటి ఎన్నో రచనలు చేసారు. వారి రచనలన్నింటిలో స్త్రీ కేంద్రంగా ఉంటుంది. ఆధునికకాలంలో విమర్శకులు చలం స్త్రీవాద దృష్టితో రచనలు చేసారని భావిస్తున్నారు.

అనాదిగా సంప్రదాయపు గుదిబండలతో స్త్రీ సతమతమవుతోందని గ్రహించిన చలం స్త్రీలలో చైతన్యాన్ని కలిగించాలని, వారు శక్తిరూపిణిలుగా రూపొందాలని తహతహలాడాడు. 'అన్నిటికన్నా విద్యకన్నా ముఖ్యం స్త్రీ స్వతంత్ర ఆర్జన'... అని చెప్పిన చలం ఫ్యూడల్ సమాజంలో స్త్రీ ఎంత హీనంగా బతుకుతోందో అర్థం చేసుకున్నారు. ఈ పరిస్థితులు మార్చటానికి చలం సాహిత్యాన్ని సాధనంగా చేసుకున్నారు. చలం రచనలు సంప్రదాయవాదులకు కంటకప్రాయమయ్యాయి. విమర్శకులు చలానికి నిలువనీడ లేకుండా చేయాలని ప్రయత్నించారు. సమాజాన్ని భ్రష్టు పట్టిస్తున్నాడని, అందరినీ చెడగొడుతున్నాడని అనేక విధాలుగా నిందించారు. చలం రచనలు చదివితే ఇంక అంతే సంగతులు అని ప్రచారం చేసేవారు.

సమాజం విధించిన ఆంక్షలకు, చేసిన అవమానాలకు తట్టుకొని నిలబడ్డ చలానికి తోడుగా ఏ రాజకీయపార్టీ లేదు. ఏ సంస్థా చలానికి మద్ధతుగా నిలబడలేదు. అయినా సరే చలం ఏమీ తడబడకుండా, వెనకంజ వేయకుండా తన అక్షరాలను బుల్లెట్లగా చేసి సమాజ లోపాల్ని ఎదుర్కొన్నాడు. గురి తప్పకుండా నిప్పులు చెరిగే చలం కలం తన ఆశయసాధనలో నిమగ్నతకీ, నిబద్ధతకీ పేరుపొందింది.

చలం చివరిదశలో రమణ మహర్షిని ఆశ్రయించి సాంత్వన పొందాలని ప్రయత్నించాడు. 4 మే, 1979లో చలం తిరువణ్ణామలైలో స్వర్గస్తులయ్యారు. తెలుగుసాహితీ చరిత్రలో చలం ఆకర్షణ మాత్రం అలానే కొనసాగుతోంది.

## 21. సావిత్రి నాటకం - సంప్రదాయ భావాలపై తిరుగుబాటు

సావిత్రి కథ మహాభారతంలోని అరణ్యపర్వంలో వస్తుంది. సత్యవంతుని వివాహం చేసుకోవటం, అతను చనిపోవటం, యముడు వచ్చి అతని ప్రాణాలు తీసుకొనిపోతుండగా సావిత్రి వెంబడించటం, యముడు ఆమె భర్త ప్రాణాలు తప్ప ఏదైనా వరం కోరుకోమంటే తెలివిగా సావిత్రి భర్త ప్రాణాలను తిరిగిపొందటం దీనిలోని ఇతివృత్తం. ప్రసిద్ధిచెందిన ఈ పురాణకథని మార్చి నాటకంగా రాయటం ద్వారా చలం సంప్రదాయ భావజాలంపై ఎదురుదాడి చేసారు. పురాణకథలో సాంఘిక అంశాలను జొనిపి రాయటం తెలుగుసాహిత్యంలో చలం రచనల ద్వారా మరింత ప్రాచుర్యం పొందింది. ఆధునిక తెలుగు సాహిత్యంలో మొదటిసారిగా 'స్త్రీ' కి సంబంధించిన వస్తువుని తీసుకొని ఉదాత్త ఆశయంతో రచనలు చేసిన చలం ఒక విధంగా ఈనాడు స్త్రీవాద సాహిత్యంగా చెప్పుకునే ఉద్యమాన్ని ఆనాడే ప్రారంభించాడని చెప్పుకోవచ్చు.

మూలకథలో అశ్వపతి కుమార్తె సావిత్రి "సత్యవంతుండు రూపవంతుడనియు, గుణవంతుండనియును విని వాని యందుఁ జిత్తంబు దగిలి యున్నను సిగ్గుపెంపున నెవ్వరికి నెఱింగింపకుండె" అని ఉంది. స్త్రీకి సిగ్గు ఆభరణమని, ఆమె తన మనసులోనే కోర్కెల్ని దాచుకోవాలని సంప్రదాయం నిర్దేశిస్తూ వస్తోంది. ఇది అసమానతకు, ద్వంద్వ ప్రమాణాలకు నెలవుగా ఉందని భావించిన చలం దీన్ని విస్మరించారు. వర్తమాన సమాజంలో స్త్రీకి ప్రేమ మనసులో అంకురించటానికి, ఒకవేళ అలా అంకురించినా దాన్ని స్వేచ్ఛగా వ్యక్తీకరించటానికి అవకాశం లేదు. ఆడవారికైనా, మగవారికైనా వారి జీవితాలపై స్వీయ నిర్ణయాధికారం ఉండాలని చలం వాదన. అందుకే సావిత్రి, సత్యవంతులు ఒకరినొకరు చూసుకోగానే పరస్పరం ఇష్టపడతారు. సత్యవంతుడు సావిత్రిని చూడగానే "సావిత్రి!... యెంత ముద్దుగా, ఉంది పేరు! నాకు తెలుసే యిదివరకు! సావిత్రి... యీ పేరు నా హృదయంలో గానం చేస్తోంది" అంటాడు.

నేటి సమాజంలో స్త్రీకి వివాహ విషయంలో ఎటువంటి స్వేచ్ఛ ఉండదు. తండ్రి తన కూతురు ఎవరిని ఇష్టపడుతోందో తెల్సుకోవటం లాంటివి చేయకుండా బంధుమిత్రుల సలహా మేరకే వివాహాన్ని నిర్ణయించటం సరికాదని చలం అభిప్రాయం. అందుకే మూలకథకి భిన్నంగా రాయాలని ప్రయత్నించాడు.[1] చలం సావిత్రి కథలో ఈ సందర్భంలో సావిత్రి "ఈ రాజు కూతుర్ని. అదే మా నాన్నగారి హర్మ్యము. అతన్ని కలుసుకోమని ఆయన పంపితే యీ ఉదయకాంతిలో కాళ్ళీడ్చుకుంటూ వచ్చాను" అని సత్యవంతునితో అంటుంది. ఉదయకాంతిలో కాళ్ళీడ్చుకుంటూ అనటం వల్ల ఒక సాధారణ స్త్రీ జీవితం ఎంత నిస్తేజంగా ఉంటోందో, ఎల్లప్పుడూ ఒకరి చెప్పుచేతల్లోనే స్త్రీ ఉండాల్సిరావటం ఎంత అమానుషమో తెలుస్తోంది. జీవితంలో కీలకమైన వివాహ విషయంలో స్త్రీకి నిర్ణయాధికారం ఉండాలి అని చెప్పటానికి సావిత్రి తన తండ్రి వద్దని చెప్పినప్పటికీ సత్యవంతుడిని కలుసుకోవటానకి వెళ్ళినట్లు చలం చిత్రించారు. చలం సావిత్రి పాత్ర ఏ కట్టుబాట్లకి లొంగని చైతన్యానికి సంకేతం. తండ్రి అశ్వపతి ఒక

సగటు తండ్రి. పితృస్వామ్య భావజాలానికి ఇతను గుర్తు. యముడు లోకంలోని పురుషప్రవృత్తికి, ద్వంద్వ ప్రమాణాలకు ప్రతీక. ఈ విధంగా చూస్తే చలం నాటకంలోని వివిధ పాత్రలు ప్రతీకాత్మకమైనవి. వీటి ద్వారా చలం తన ప్రేమతత్వాన్ని, స్త్రీవాద ధోరణిని వెల్లడించాలని ప్రయత్నించాడు.

సావిత్రి నాటకం ఒకటోరంగంలోని వర్ణన ద్వారా చలం తన అభిప్రాయాలను, వ్యక్తీకరించాలని చూసారు. "అశ్వపతి మందిరము పక్కన ఉన్న ఉద్యానవనం. కొత్తగా పూసిన పారిజాతం. మందారపువ్వుల మీద మంచుబొట్లలో యెండ ప్రకాశిస్తోంది. చిన్నగాలి చెట్లను ఊగిస్తోంది. పువ్వులు కింద రాలుతున్నాయి." అశ్వపతి మందిరం పక్కన ఉన్న ఉద్యానవనంలో కొత్తగా పూసిన పారిజాతం సావిత్రే. ఈ ఉద్యానవనంలోని పుష్పం తోటమాలి తండ్రి చెప్పుచేతుల్లోనే ఉండాలి. పితృస్వామ్యం అంటే ఇదే. దీన్ని సమూలంగా పెకిలించివేయటమే చలం ఆశయం.

మూలంలో అలా లేకపోయినా చలం తన నాటకంలో అశ్వపతి సత్యవంతుడిని దుర్భాషలాడినట్లు, ఖైదులో బంధించాలని ప్రయత్నించినట్లు రాసాడు. ఈ నాటకీయ సన్నివేశాలన్నీ ప్రేమించుకున్న వాళ్ళను విడదీయటానికి పెద్దవాళ్ళు అన్ని విధాలుగా ప్రయత్నిస్తారని వివరించటానికే. తల్లిదండ్రుల చేతుల్లో కీలుబొమ్మలై, సంఘం క్రౌర్యానికి బలైపోయే ప్రేమికులపట్ల చలానికి సానుభూతి. ప్రేమకోసం ఎన్ని కష్టాలనైనా ఎదుర్కోవాలని, అవసరమైతే తల్లిదండ్రులను ధిక్కరించైనా సరే ప్రేమని నిలబెట్టుకోవాలని సూచించటానికి చలం తన స్త్రీ పాత్రలకు తిరుగుబాటు నేర్పారు.

ప్రేమ ప్రాతిపదికగా జరిగే వివాహాలు రెండు మనసుల సంగమం అవుతాయని అలా లేని పక్షంలో ఆ వివాహాలు వాటి అర్థాన్ని కోల్పోతాయని చలం భావన. సావిత్రీసత్యవంతులు ప్రేమ ఎంత గాఢమైందో ఇరువురికి ఉన్న ప్రేమానురాగాలు ఎంత తీవ్రమైనవో చెప్పే ప్రయత్నం చేసారు. సత్యవంతుడు "నాపై నీకు ప్రేమ ఉందని తెలుసు అయినా సగం తెరిచిన గులాబిపువ్వులోంచి పరిమళం వల్లే నీ పెదవుల్లోంచి, నిర్మల జలప్రవాహం వల్లే గలగలలాడే నీ కంఠంలోంచి రావాలని - హృదయరంజకమైన త్రిభువన శోభకరమైన ప్రేమ ఉంది అన్నమాట" అంటాడు. స్త్రీ పురుషులు ప్రేమ ద్వారా ఒకరినొకరు తెల్సుకుంటారని చలం మాట. "నీ నుంచి తప్పించుకోవటానికి కాదు కదులుతోంది. నీకు ఇంకా దగ్గరగా రావటానికి" అన్న సావిత్రి మాటలు దీన్ని నిరూపిస్తాయి.

సావిత్రి యముడిని మెప్పించి సత్యవంతుడిని దక్కించుకుంటుందనే లక్ష్యం మూలకథలో, చలం నాటకంలో ఒకటే అయినా సాధించిన తీర్లు వేర్వేరుగా ఉన్నాయి.

ఎర్రన రచించిన అరణ్యపర్వంలోని కథలో యమధర్మరాజు వచ్చి భర్త ప్రాణాలను తీసుకొని వెళుతున్నప్పుడు సావిత్రి అది పతివ్రతా ధర్మం కాబట్టి అతని వెంట వెళ్ళినట్లు ఉంది.(2) చక్కని వాక్చాతుర్యంతో భర్త ప్రాణాలను కాపాడుకొని, అంధులైన అత్తమామలకు దృష్టిని, రాజ్యాన్ని అలానే పుత్ర సంతానంలేని తల్లిదండ్రులకు పుత్రులు కలిగేటట్లు వరాల్ని సాధించిన ఘనత ఆనాటి సావిత్రిది.

భర్త ప్రాణాలను రక్షించుకోవటం తప్ప మిగతా విషయాలు ఆధునికం కావని అనుకొన్న చలం పై విషయాల్ని వదిలిపెట్టాడు. పురాణ సావిత్రి ఒక ప్రతీకగా ఈనాటికీ స్త్రీల జీవితాల్ని ప్రభావితం చేస్తూ వస్తోందని ఆడజన్మ అంటే పుట్టినింటికి మెట్టినింటికి విధేయురాలై ఉండాలి, అదే ఆమె జీవితానికి సార్ధకత అని బోధిస్తోందని భావించిన చలం తన నాటకంలో అమూలకంగా మార్పులు చేసారు.

యముడు సావిత్రి ప్రేమను పరీక్షించటానికి ఒక ఉద్యానవనాన్ని కల్పించి సత్యవంతుడు సావిత్రిముందే వేరే స్త్రీతో సన్నిహితంగా ఉన్నట్లు 'మాయ' చేసారు. చంద్రిక అందానికి ముగ్ధుడై సత్యవంతుడు "ఇంతకాలం కనపడకుండా యే సుందరాకాశంలో నీలజలదాంధకారంలో దాచావు అద్భుతమైన ఈ సౌందర్యాన్ని, ఈ మెరుపు తీగెను, కాంతిరేఖను జీవనపు పరిమళాన్ని" అంటూ చంద్రికను ముద్దుపెట్టుకుంటాడు. సావిత్రి ఈ దృశ్యాన్ని చూసి కేక వేస్తుంది. ఆమె ప్రశ్నకు సత్యవంతుడు అబద్ధం చెప్పపోతాడు. సావిత్రి వెన్వెంటనే "నాకు అర్థం కావటం లేదు. ఎప్పుడన్నా అవుతుందేమో? ఏమయితేనేం క్షమించాను..." అంటుంది. 'మన చేతుల్లోనే ఉంది మన జీవనమాధుర్యం.' అంటూ సరిపెట్టుకుంటుంది. ఈ "మాయాసన్నివేశం" చలం ఆదర్శాల్ని నిరూపించటానికి ఏవిధంగా ఉపయోగపడుతోంది? అందరు స్త్రీలలాగానే మగవాడు ఏ తప్పులు చేసినా అలా క్షమించాలని చలం చెపుతున్నాడా అన్న ఆలోచన వస్తోంది. స్త్రీవాదపక్షాన ఆలోచించినా, హేతుబద్ధంగా చూసినా సావిత్రి సత్యవంతుడిని క్షమించటానికి కారణాలు కనపడవు.

యముడు కల్పించిన మాయాసన్నివేశం, అందులోని సత్యవంతుడు, సావిత్రి మొదలైనవన్నీ చలం మనసులోంచి వచ్చినవే. మాయాసత్యవంతుడు అవకాశం కనిపెట్టి, దాంపత్యధర్మాన్ని వెనక్కినెట్టి ఇతరస్త్రీలతో కులకాలనే ప్రవృత్తిని సూచించే ప్రతీకాత్మకపాత్ర. వ్యక్తి వ్యక్తిత్వం అతను సాహిత్యంలో చిత్రించిన పాత్రలలో ప్రకటితమవుతుంది అనేది వాస్తవం. ఇలా చూస్తే మాయాసత్యవంతుడు చలమేనా అనిపించక మానదు.

మూలకథలోనైనా ఆనాటి రచయితలు ఆదర్శవంతంగానే రచించారు తప్ప ఎక్కడా కట్టుబాట్లు విధించినట్టుగానీ, స్త్రీని శాసించినట్లుగాని లేదు. సత్యవంతుడిని ప్రేమించానని సావిత్రి నిక్కచ్చిగా తండ్రితో చెపుతుంది. "తల్లీ నీ గుణరూపవృత్తముల కెందుఁ దగినవారు నీవయిమ్ముగఁ దదని నెమ్మి నీ మనస్సున కెక్కిన నృపకుమారుఁ గోరి వరియింపు మిదియు నీకును బ్రియంబు" అని అశ్వపతి కూతురుతో అంటాడు. సత్యవంతునికే తనని ఇచ్చి పెళ్ళి చేయమని సావిత్రి తండ్రిని అడుగుతుంది.[3] తర్వాత నారదుడు వచ్చి 'సావిత్రి చేత వరియింపఁబడిన కుమారుం డెట్టివాడు' అని అశ్వపతిని ప్రశ్నిస్తాడు. వీటిని బట్టి చూస్తే ప్రాచీనకవులు కూడా కొంచెం స్త్రీవాదులే అని తోస్తోంది.

సావిత్రి పాత్ర అనేక ఆధ్యాత్మిక రహస్యాలకు ప్రతీక అని శ్రీ అరవిందులు లాంటి యోగులు నిరూపించారు.[4]

చలం సావిత్రి నాటకంలో యముడు మారువేషంలో వచ్చి సావిత్రి నుదుటిని చుంబించినట్లు ఉంది. సావిత్రి వెంటనే ఆ స్పర్శలోని తేడాను గుర్తిస్తుంది. "ఇరవైవేలమంది అతని రకంగా వేషాలు వేసుకున్నా అందరినీ వదిలి అతన్ని యేరుకుంటాను. అతన్ని గుర్తుపట్టేది నా కళ్ళు కాదు; పొరపాటునెరగని నిర్మలమైన నా ఆత్మ" అన్న సావిత్రి నమ్మకం చలం నమ్మకమే. చలం ప్రేమకు చాలా ప్రాముఖ్యతని ఇచ్చాడని, నిర్మలమైన ప్రేమని ఎవరూ ఏమీ చేయలేరని విశ్వసించాడని తెలుస్తోంది.

సావిత్రి పాత్రను మానవత్వానికి మారుపేరుగా తీర్చిదిద్దాలని చలం ఆలోచన. నాటకం అయిదో రంగంలో సత్యవంతుడు పశ్చాత్తాపపడతాడు. తనని తాకవద్దని, తాను ప్రేమని మోసంచేసానని సావిత్రితో అంటాడు. "కొంచెం అలిసిపోయావు. అంతే ఇంకేం లేదు"... అంటుందే తప్ప సావిత్రి అతడిని ఏమీ అనదు. మరో సందర్భంలో "ఉండు ఒక్కసారి ఉండు నా రొమ్ము మీద వేళ్ళాడుతున్నావు" అని పూర్తి ప్రేమతో అంటుందే తప్ప సత్యవంతుడిని నిందించదు. ప్రేమికులు ఇతరుల మాటలకు విలువ నివ్వరాదని పరస్పర విశ్వాసంతో ప్రవర్తించాలని చలం చెపుతారు.

స్త్రీపురుషుల మధ్య ఉండాల్సిన ప్రేమానురాగాల్ని గురించి కొన్ని నిర్దిష్ట అభిప్రాయాలను కలిగిఉన్న రచయిత చలం ఏ ప్రభావానికి లొంగని, ఏ ప్రలోభాలకు పడిపోని వ్యక్తిత్వం సముపార్జించుకోవటం స్త్రీపురుషులకు అత్యావశ్యకం అని సావిత్రి నాటకం ద్వారా నిరూపించాలని ప్రయత్నించారు. "ప్రేమిస్తున్న హృదయం ఒకటి యెండి శూన్యమయిందంటే ప్రేమవల్ల జనియించి, వృద్ధిపొంది, ప్రేమే ఆధారంగా నిలిచి ఉండే చండతేజ శోభితమైన బ్రహ్మాండాలతో సహా ఈ ప్రపంచమంతా శూన్యమవుతుంది"... అన్న వాక్యాల ద్వారా చలం ప్రేమ గురించిన తన అభిప్రాయాలను వెల్లడిస్తున్నారు.

లారెన్స్ లాంటి రచయితల ప్రభావానికి లోనైన చలం తన రచనల్లో వాంఛా సఫలత చాలా ముఖ్యమని నిరూపించటానికి కృషిచేసారు.(5) నాటకంలోని మూడోరంగంలో "అడవిలో గురివిందా జూకామల్లె అల్లుకున్న పొదరిల్లు, తుమ్మెదలు పువ్వుల మీద వాలి నిద్రపోతున్నాయి" అన్న వర్ణన ద్వారా దీన్ని సాధించారు. సమాజం స్త్రీపురుషుల శారీరక సంబంధాలపై అనేక విధాలుగా నియంత్రణ చేస్తుంది. ఈ విధమైన కట్టడివల్ల వ్యక్తులు జీవన మకరందాన్ని కోల్పోతున్నారు. జీవితం అంటే స్వేచ్ఛగా శృంగారానందాన్ని గ్రోలటమే అని నమ్మిన చలం స్వేచ్ఛా సమాజంలో స్వేచ్ఛా ప్రణయం ద్వారా ఆడమగలిరువురూ సుఖపడాలని చెప్పారు. చలం స్వేచ్ఛావాదం చాలామందికి మింగుడుపడక ఆయన రచనలు సమాజాన్ని విచ్ఛిన్నం చేస్తాయని భయపడ్డారు. అయితే చలం స్త్రీలు విశృంఖలంగా ప్రవర్తించాలని ఎక్కడా ప్రత్యేకించి చెప్పలేదు. వర్తమాన సమాజంలో పురుషునికో నీతి, స్త్రీకో నీతి ఉంది. "ఎంతమందితో తిరిగినా నేను మగాణ్ణి నాకేం తప్పు లేదు" అనే పురుషప్రవృత్తి స్త్రీకి మాత్రం పాతివ్రత్యం ఉండాలని ఒత్తిడి తెస్తుంది. స్త్రీకి మాత్రం శృంగారపరమైన కోర్కెలను ఇష్టం వచ్చినట్లు తీర్చుకునే హక్కు లేదా, ఆ అవకాశం ఎందుకు ఉండకూడదు అని చలం సూటిగా ప్రశ్నిస్తున్నారు. చలం తన కథల్లోని స్త్రీ పాత్రలు ఉద్వేగంతో ప్రవర్తించినట్లు, వాంఛా సఫలతకి

ప్రయత్నిస్తున్నట్లు రచించాడు.[6] ఈ పోకడలను చాలామంది సనాతనవాదులు జీర్ణించుకోలేకపోయారు.

యముడు సత్యవంతుడిని బతికించటానికి ప్రతిఫలంగా సావిత్రి శీలాన్ని కోరతాడు. సత్యవంతుడికి అర్పితమైన మనస్సు, శరీరం వేరొకరికి అర్పించలేక ఆత్మహత్యకు పాల్పడటం లాంటి పనులు చేయకుండా సావిత్రి తన శీలాన్ని అర్పించటానికే సిద్ధపడుతుంది. శీలం అంటే శారీరకమైంది కాదని అది ఒక మానసికభావన అని చలం ప్రగాఢంగా నమ్మాడు. పాతివ్రత్యాన్ని నిర్వచించటంలో చలం శీలానికి ప్రాధాన్యత నివ్వక ప్రేమకే అగ్రస్థానాన్ని ఇచ్చాడు.

మూలంలో భర్తలు ఎక్కడికి వెళితే భార్యలు అక్కడికే వెళ్ళాలి కదా అని సావిత్రి అన్నట్లుగా ఉంది. ఇది లింగవివక్షకి అనుకూలంగా ఉందని భావించే చలం సావిత్రి "సమస్త జీవనోద్రేకాన్ని వెలిగించే ప్రేమజ్వాలలతో నీ శరీరానికి కాంతినిస్తాను. నా కొన వూపిరితోనైనా సరే నీలో ప్రాణం ప్రతిష్ఠిస్తాను" అన్నట్లుగా రచించారు. యముడు సావిత్రిలో 'పతివ్రతా ధర్మం సహగమనము" అంటే సావిత్రి సహగమనమే చేస్తాను పదండి అంటుంది. ఇక్కడ సహగమనము అంటే కలిసినడుస్తాను అన్న అర్థంలో చలం ప్రయోగించాడు. పౌరాణిక కథలోని సావిత్రి అది పాతివ్రత్య ధర్మం కాబట్టి వెళితే చలం సావిత్రి అనురాగం ప్రేమలతో, వేరే దేన్నీ పట్టించుకోక తన ప్రేమికుడిని దక్కించుకోవాలని వెళ్ళింది.

యమునితో మాట్లాడుతూ సావిత్రి సత్యవంతుని పునరుజ్జీవన వ్యాపారంలో నాకూ భాగం వుండొద్దూ? అంటుంది. ఈనాటి వైవాహికబంధం ప్రేమప్రాతిపదికంగా లేక, డబ్బు ప్రాతిపదికంగా ఉంది. ఇటువంటి పరిస్థితుల్లో ఆలుమగల మధ్య ప్రేమానురాగాలు పరస్పరగౌరవ భావనలు ఎలా వెల్లివిరుస్తాయి. పెళ్ళి పేరుతో సమాజం ఇద్దరు మనుషులని ఒకటి చేయాలని చూస్తోందే తప్ప వారు ఒకరినొకరు అర్థం చేసుకొని మానసికంగా, శారీరకంగా సన్నిహితులవటానికి వీలు కల్పించటం లేదు. చలం వీటన్నింటి పట్లా వ్యతిరేకత ఉన్నవాడు.

వివాహబంధానికి కేవలం ప్రేమ ప్రాతిపదికగా ఉండాలని ఈనాటి స్త్రీవాదులు చెపుతున్నారు. రెండు జీవితాలు కలిసే ఈ అపురూప ప్రక్రియ ప్రేమరాహిత్యంతో ఉండకూడదని, డబ్బు - జీవితాలని ఎట్టి పరిస్థితులలోనూ శాసించరాదని చలం లాంటి మేధావులు భావించారు. వివాహం పేరుతో స్త్రీని బానిస చేస్తున్నారని, పాతివ్రత్యం పేరుతో ఆమె జీవితాన్ని నియంత్రిస్తున్నారని స్త్రీవాదం విమర్శిస్తోంది. చలం రచనలో ఈ ధోరణులు కనిపిస్తున్నాయి.

స్త్రీ మనసులో ఎవరిమీద ప్రేమకలిగి ఉంటుందో అతనికి తన సౌందర్యాన్ని ఇష్టంగా, ఆదరంగా అందించవచ్చని చలం అభిప్రాయం. భర్త అంటే మెడలో మూడుముళ్ళు వేసినవాడుకాదని, అతనికి స్త్రీ తన జీవితాన్ని అర్పించవల్సిన అవసరం లేదని కూడా చలం విశ్వసించాడు. మనసులో ఎవరిమీద ఇష్టం ఏర్పడితే అతడినే భర్తగా స్వీకరించాలని అతనికే తన సౌందర్యాన్ని కానుకగా ఇవ్వాలని చలం స్పష్టం చేసాడు.

అయితే మూలకథలో కూడా సావిత్రి మనసావాచాకర్మణా స్త్రీ ఎవరిని ఇష్టపడుతుందో అతనినే భర్తగా స్వీకరిస్తుందని చెప్పినట్లుగా ఉంది.[7]

చలం సావిత్రి చాలాసేపు తర్కించుకుని, తన శీలాన్ని ప్రతిఫలంగా కోరిన యముడిని చంపటానికి నిశ్చయించుకుంటుంది. కృతఘ్నత అయినా తప్పదు, మహాపాతకమైనా తప్పదు అని కత్తితో యముడిని చంపబోతుంది. సావిత్రి ప్రేమలోని ఔన్నత్యాన్ని చిత్రించటంలో చలం విజయం సాధించారు. "గతం, భవిష్యం, సర్వకాలం ప్రపంచం నింపే ఈ ప్రేమను కదిలించటానికి ఎవరి శక్యం" అని చంద్రిక ముగ్ధురాలవుతుంది. ఈ మాటలు సావిత్రి వ్యక్తిత్వాన్ని వెల్లడిస్తున్నాయి. నిజంగానే సావిత్రి చంద్రిక అన్నట్లు "జాగ్రత్త తాకితే నలిగిపోయే చిన్న పువ్వు, నలిపితే లోపల కాలాగ్ని" వంటిది. ఇక్కడ చలం స్త్రీ పైకి చూస్తే సుతిమెత్తని పూవులాంటిదని కానీ ఆమె ప్రేమని పరీక్షిస్తే, శారీరకంగా అవమానిస్తే కాలాగ్నిలాగా ఆ అవమానించిన వ్యక్తిని దహిస్తుందని వివరిస్తున్నారు.

సావిత్రి యముడిని చంపబోయేటప్పుడు మథనపడటం ధర్మానికి, ప్రేమకు మధ్య ఘర్షణ. నిస్వార్థమైన, నిష్కల్మషమైన ప్రేమ విజయం సాధిస్తుంది అనే రచయిత గట్టిగా నమ్మారు.

సావిత్రి ముందు శీలాన్ని ఇవ్వటానికి అంగీకరించినా తర్వాత యముడిని చంపటానికి నిశ్చయించుకోవటం యముని మీద ప్రేమ లేని కారణంగా– "మీ మీద అనురాగం లేని నన్ను అనుభవిస్తే మీకేం లాభం" అని సావిత్రి యముడిని ప్రశ్నించటానికి కారణం ఇదే. అంటే స్త్రీపురుషుల శారీరకసంబంధాలు ప్రేమానురాగాలు సాక్షిగా జరగాలి తప్ప ధర్మాలకు, చట్టాలకు లొంగిపోయి కాదు. ప్రేమ ఉంటే పాపచింతనల పట్టింపు అవసరం లేదని స్త్రీపురుషులు ఎటువంటి మానసిక వికారాలకు తావివ్వక స్వేచ్ఛగా శృంగారమధువును గ్రోలవచ్చునని చలం వాదన. యముడు సావిత్రితో మాట్లాడుతూ "మన ఆలోచనలని చుట్టి వుండే చీకట్లోంచి అప్పుడప్పుడు ప్రకాశించే జ్ఞాన శకలాలనుంచి, చట్టాలను నిర్ధారణ చెయ్యబోవటం సాహసం" అంటాడు. మానవుని స్వేచ్ఛా ప్రణయతత్వాన్ని ఆ ఆలోచనలని నియంత్రిస్తూ, అతని మనస్సుని శాసించే ధర్మాన్ని తిరిగి హేతువుతో ఎదుర్కోవాలని చలం పిలుపునిచ్చాడు. ధర్మం, అధర్మం అంటూ ఎవరో చెప్పే మాటలకు తలఊపక, గుడ్డిగా వాటిని ఆచరించక వివేకంతో నిర్ణయం తీసుకోవటం ఉత్తమమని చలంగారు చెపుతున్నారు.

మానసికవ్యభిచారం అత్యంత హేయమని, శరీరపవిత్రత వ్యక్తుల ఇష్టాయిష్టాలకు సంబంధించిందని అభిప్రాయపడ్డ చలం నాటకంలో యముని నోటి ద్వారా ఇలా పలికించారు– "సావిత్రి తనను తాను త్యాగం చేసుకొని తన పవిత్రమైన ప్రేమను మలినం చేసుకోవటానికి నిశ్చయించుకొని వుండవచ్చును. అప్పుడు అద్భుతమైన సావిత్రి యెట్లా అయ్యేది?"... సావిత్రి అచంచల ప్రేమ సమవర్తినే కదిలించటం గమనించాలి. భర్త సరిగా చెప్పాలంటే మనసుకి మనసైనవాడు ప్రాణాపాయంలో పడినప్పుడు ప్రేమమూర్తి స్త్రీ శీలాన్ని పోగొట్టుకోవటానికి సైతం సిద్ధపడటం నిజంగానే అద్భుత

విషయం. చలం దృష్టిలో ఇది పాతివ్రత్యం అవుతుంది. ఈ విధంగా పాతివ్రత్యానికి ఉన్న గతంలోని సంకుచిత వక్రబాష్యాలను తోసిపుచ్చి నూతన అర్థాన్ని ఇచ్చిన ఘనత చలానికి దక్కింది.

యముడిని లోకంలో పురుష ప్రవృత్తికి, ద్వంద్వ ప్రమాణాలకు ప్రతీకగా తీసుకుని చూస్తే చలం ఆదర్శాలు తెలుస్తాయి. ఈ పాత్ర కూడా రచయిత చలం అంతరంగంలోంచి ఉన్మీలనమైన ఒక భావనే. గతంలో చెప్పుకున్నట్లు మాయాసత్యవంతుడు కూడా చలం అంతరంగానికి చెందిన భావనే. అయితే ఈ అన్ని భావాల సంఘర్షణలో సావిత్రికే విజయం లభించింది. ప్రేమకు - పురుష ప్రవృత్తికి అలానే ప్రేమకు - ధర్మానికి మధ్య జరిగిన సంఘర్షణలో చలం భావాలకు సంపూర్ణ సజీవ తార్కాణమైన సావిత్రి గెలుపొందటం అంటే విజయుడు చలమే.[8]

మొదట్లో సావిత్రి "నా ఆనందమూ, ఇతని ఆనందమూ నన్ను ప్రేమించే అందరి ఆనందమూ నా కళ్ళముందు శాశ్వతంగా నశించినా సరే యితని దగ్గరి నుంచి దూరం కాను" అంటుంది. నిజంగానే సావిత్రి ఎన్ని ఆటంకాలు ఎదురైనా నిలబడి తనప్రేమ విషయంలో రాజీపడకుండా వ్యవహరించింది. సత్యవంతుడిని వివాహమాడే ఆలోచన మానుకోమని చెప్పిన తండ్రితో వివాహం ఏనాడో జరిగిందని ఇంక మరణమే మిగిలిందని బదులివ్వటం ఆమె కృతనిశ్చయాన్నే కాక రాబోయే సంఘటనలను కూడా చూచాయిగా వెల్లడించినట్లు ఉంది.

మూలకథలో సావిత్రి కేవలం సత్యవంతుడిని గురించి విని అతన్ని ప్రేమిస్తుంది. ప్రేమకు శారీరక ఆకర్షణ ప్రధానమని చలం నొక్కి చెప్పాడు. ఏదో విని ప్రేమించటం అసమంజసంగా ఉందని భావించిన చలం తన నాటకంలో సావిత్రీ సత్యవంతులు ఇరువురు ఒకరినొకరు చూసుకొని తొలిచూపులోనే ప్రేమలో పడ్డట్లు చిత్రించారు. చలం ప్రేమ ఏ తర్కానికీ లోబడని, ఉదాత్తమైన భావన. సన్నగా నాజూగ్గా పొడుగ్గా ఉండి, ప్రణయపూరిత చూపులతో మధురమైన కంఠంతో వంపు తిరిగి లోతైన వక్షంతో మూర్తీభవించిన శృంగారదేవతలా ఉన్న సావిత్రి సత్యవంతుడిని ఆకర్షిస్తుంది. శారీరకసౌందర్యం మనసుమీద అదుపు సాధిస్తుందని చెప్పే చలం అమూలకంగా సావిత్రి సౌందర్యవర్ణన చేసాడు. స్త్రీ సౌందర్యం పట్ల చలానికి చాలా ఆరాధన ఉంది. అనేక సందర్భాల్లో చలం ఈ విధంగా స్త్రీల సౌందర్యవర్ణన చేసాడు.

సావిత్రికి ప్రేమపట్ల ఉన్న నిబద్ధత ఏ విధమైన ద్వంద్వం, రాగద్వేషాలు లేని యముడినే కరిగిస్తుంది. యముడు ఆమెకు పరీక్షపెడుతూ "ప్రేమమూర్తి నా బిడ్డ నలిగిపోతోంది" అని విలవిలలాడిపోతాడు. నిజమైన ప్రేమ పాషాణ హృదయులని కూడా చలింప చేస్తుందని, ఆలోచింప చేస్తుందని చలం చిత్రించారు.

సావిత్రి - ప్రేమశక్తిపై అచంచల విశ్వాసాన్ని ఉంచి దాని ద్వారానే 'విధి' ని కూడా జయించిన ప్రణయిని. ఆమె ప్రేమశక్తి ముందు తలదించుకొని యముడు "ప్రేమజ్యోతిని శిరస్సున ధరించి విధిని జయించింది సావిత్రి" అని ఆమెను ప్రశంసిస్తాడు. ఆఖరుకి విధి కూడా ప్రేమముందు ఓడిపోక తప్పదని చలం

రుజువుచేసారు. అంతకుముందు యముడు సావిత్రి శీలాన్ని కోరిన సందర్భంలో 'నేను సురక్షితంగా ఉండి మిమ్మల్ని అంత గొప్ప త్యాగం చేయమనటం న్యాయం కాదు' అని యమునితో అనటం ఆమె శీలనిదర్శనం. సావిత్రి వ్యక్తిత్వ ఉన్నతి ఇక్కడ కనిపిస్తుంది. సందర్భం వచ్చినప్పుడు స్వార్థాన్ని చూసుకోకుండా ఎటువంటి త్యాగానికైనా వెనుతిరగక పోవటం ఉత్తమ ఆదర్శం.

చలం సావిత్రి నాటకంలో మనోవైజ్ఞానిక విషయాలు కూడా ఆవిష్కరించబడ్డాయని విమర్శకులు నిరూపించారు. ఫ్రాయిడ్ వివరించినట్లు మనిషి మనసులో ఇద్, ఈగో, సూపర్ ఈగోలు ఉంటాయి. సావిత్రి నాటకంలో సావిత్రి తండ్రి మాటలను లక్ష్యపెట్టకపోవటం సందర్భంలో ఆమెలోని ఇద్ ఎంత బలవంతమైందో గ్రహించవచ్చు. సత్యవంతునితో మాట్లాడిన మాటలు కూడా ఆమెలోని కోరిక, వాంఛ ఎంత ప్రభావమైందో వివరిస్తున్నాయి. యముడు తన కోర్కె తీర్చమని అడిగినపుడు సావిత్రి మనసులో జరిగిన సంఘర్షణలో కూడా ఆమెలోని సూపర్ఈగో సమతుల్యానికి దోహదం చేసింది.

సావిత్రి నాటకం ద్వారా చలం సామాజిక పరిస్థితులని విశ్లేషించిన విధానం కూడా చాలా బాగుంది. పురుషాధిక్య సమాజంలో స్త్రీలు వందల సంవత్సరాలుగా అణచివేతకి, అసమానతలకి గురి అయ్యారు. ప్రేమబంధానికి కట్టుబడి ఉండి, వైవాహిక బంధానికి విలువనిచ్చి స్త్రీలు ఉండగా దీన్ని అవకాశంగా తీసుకొని వైవాహికేతర సంబంధాలను ఏర్పరుచుకోవటం మగవాళ్ళకి మామూలు అయిపోయింది. స్త్రీ శరీరం మీదనే పురుషునికి కోరిక తప్ప ఆమె మనసు గురించి పట్టించుకునేదే లేదు. స్త్రీ సుకుమారత్వాన్ని లావణ్యాన్ని తన స్వార్థానికి వినియోగించుకోవటం చాలామంది మగవాళ్ళకి ఒక సాధారణ విషయంగా పరిణమించింది. స్త్రీ ఏదైనా విపత్కర పరిస్థితుల్లో చిక్కుకున్నా, మానవత్వం అన్నదే లేకుండా ఆమె శరీరాన్ని కోరటం సగటు మగవారి నైజం. తన వైవాహికేతర, ప్రేమేతర సంబంధాన్ని గురించి అబద్ధాలు చెప్పటం లేదా బుకాయించటం మగవాళ్ళు సహజంగా చేసే పని. తన తప్పుని ఎత్తి చూపితే ఆ స్త్రీని పతితగా ముద్రవేసి, వక్రీకరించి మాట్లాడటం కూడా పురుషుడు చేస్తున్నాడు. ఈ జంతు ప్రవృత్తిని చలం చాలా నిర్ద్వంద్వంగా ప్రశ్నించాడు.

మానవసంబంధాలలో ఉత్కృష్టమైన స్త్రీపురుషుల ప్రేమబంధాన్ని గురించి చలం చాలా స్పందనతో రచనలు చేసాడు. పితృస్వామ్య భావజాలాన్ని తన రచనల ద్వారా ఎదుర్కొన్నాడు. స్త్రీపురుషులు ఇద్దరికీ లైంగిక విషయాల్లో సమాన స్వేచ్ఛ ఉండాలని, దాన్ని ప్రకటించటానికి ఇరువురికీ సమాన అవకాశాలు ఉన్నాయని చలం వాదించాడు.

చలం నాటకరచనలో కూడా కొన్ని రచనా ప్రమాణాలను పాటించి ప్రతి సన్నివేశాన్ని రక్తికట్టించాడు. చలం ప్రయోగించిన వాక్యాలు చిన్నవిగా ఉన్నా వాటిలో అంతులేని అర్థం ఉండేలా చూసారు. ప్రశ్నలను వెంటవెంటనే ప్రయోగించటం ద్వారా చలం తన పాత్రల ఉద్వేగాన్ని చూపించారు. స్పందనాపూరితమైన వాక్యాలను ప్రయోగించి చలం పాత్రల మానసిక పరిస్థితిని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు. ఒక

పెద్ద వాక్యాన్ని ప్రయోగించి తన భావజాలాన్ని బలంగా ప్రకటించటం చలం విధానం. కొన్ని సందర్భాల్లో వర్ణన ద్వారా కూడా చలం తన ఆదర్శాలను వెల్లడించారు.

స్త్రీపురుషుల అనుబంధాన్ని గురించి అంత దీర్ఘంగా, గాఢంగా ఆలోచించటం చలం లాంటి రచయితలకే చెల్లింది. ఈనాటి స్త్రీలు కనీసం ఈ మాత్రంగానైనా ఆలోచిస్తున్నారంటే, అభిప్రాయాలను వ్యక్తీకరిస్తున్నారంటే ధైర్యంగా ముందుకు నడుస్తున్నారంటే ఆనాడు చలం లాంటి రచయితలు చేసిన రచనలే కారణమని చెప్పవచ్చు. చలం జీవితం ఒక ఆదర్శవంతుని జీవితం. ఆయన రచనలు ఆయన సాధించిన విజయాలకు గుర్తు.

## వివరణలు:

1. మూలకథలో సావిత్రి తండ్రి "మద్రేశ్వరుండు నారదుం జూచి మునీంద్రా మీ యెఱుంగనివారు లేరు సావిత్రి చేత వరియింపఁ బడిన కుమారుండెట్టివాడు వాని గుణరూపశీలంబు లెఱింగింపుఁ" అన్నట్లు ఉంది. నారదుడి సలహా విని "నీవు మాకుం పరమ గురుండవు నీయానతిచ్చినట్లు చేసెద" అని కూడా సావిత్రి తండ్రి చెపుతాడు.

2. మూలంలో ఈ విధంగా ఉంది:
పతులెందుఁజనిన నచటికి, సతులకుఁ జన వలదె నీ ప్రసాదమునను మ
త్పతి భక్తి కతమునను సం, స్తుతగుణ నా కరుగరాని చోటులుఁ గలవె.
(అరణ్య - సప్తమ 221)

3. మూలకథలో ఈ విధంగా ఉంది:
వినుము మనోవాక్కాయము, లన మూఁడుదెఱంగు లందు నంతః కరణం
బనఘ ప్రధానము గావున, మనమునఁ గైకొన్న భర్త మానం దగునే
(అరణ్య - సప్తమ 182)

4. శ్రీఅరవిందులు సావిత్రి కథను ఇంగ్లీష్‌లో పౌరాణిక గేయకావ్యంగా రచించారు. వారి అభిప్రాయాలను ఈ విధంగా కావ్య ప్రారంభంలో వెల్లడించారు.
"Satyavan is the soul carrying the divine truth of being within itself but descended into the grip of death and ignorance. Savitri is the divine word, daughter of the Sun, goddess of the supreme truth who comes down and is born to save, Aswapati the lord of the horse, her human father, is the lord of tapasya, the concentrated energy of spiritual endeavour that helps us to rise from the mortal to the immortal planes; Dyumatsena Lord of the shining Hosts, father of Satyavan, is the divine mind here father, blind, losing its celestial kingdom of glory."

5. డేవిడ్ హెర్బర్ట్ లారెన్స్ ఆంగ్ల సాహిత్యంలో చాలా పేరుపొందిన రచయిత. సన్స్ అండ్ లవర్స్, ద ట్రెస్‌పాసర్, ద రైన్‌బో లాంటి రచనలు చేసారు. సన్స్ అండ్ లవర్స్ నవలలో లారెన్స్ 'ఈడిపస్ కాంప్లెక్స్' గురించి విశ్లేషించారు. పాల్ - మిరియం సంబంధం గురించి ఈ నవలలో వివరించిన లారెన్స్ వాంఛా సఫలత ప్రధానమని వాదించారు.
6. చలం రచనల్లో అమీనా, అరుణ, మైదానం లాంటి వాటిలో స్త్రీ పాత్రలు చాలా ఉద్వేగంగా ప్రవర్తిస్తున్నట్లు రచించారు. ఆర్.ఎస్. సుదర్శనంగారు "చలం తాత్వికుడు కాదు. దార్శనికుడిగా పరిణితి చెందిన కాల్పనిక వాది. ఆయన దార్శనికము స్త్రీకి సంబంధించినది. స్త్రీ ఆయన ఆరాధ్య దేవత" అని అభిప్రాయపడ్డారు.
7. మూలకథలో ఈ విధంగా సావిత్రి అన్నట్లుగా ఉంది: "సత్యవంతుం దెట్టివాఁడైన నగుంగాని యే నింక నొరుల వరియింపనొల్ల"
8. చలం తన రచన 'స్త్రీ' లో ఈ విధంగా రాసాడు:

"బాలికకు సరైన విద్యనూ, అనుభవాన్నీ, లోకజ్ఞానాన్ని, నీతిని, మోహసంబంధమైన విద్యనూ యిచ్చినట్లయితే, ఇప్పటి వెర్రి బాలికలవలె తనకు కనపడ్డ పురుషుడల్లా దేవుడనీ, అతడు చెప్పినవన్నీ నిజమేనని నమ్మి లోబడదు".

# శ్రీశ్రీ

శ్రీరంగం శ్రీనివాసరావు తెలుగు కవిత్వాన్ని ఖండించి, దీవించి, ఊగించి, శాసించి, రక్షించిన మహాకవి. శ్రీశ్రీగా అందరికీ తెల్సిన ఈ కవికి సాహిత్యం ఒక తపస్సు. ఈ తపస్సు అంతా అణగారిన వర్గాల వారిని అక్కున చేర్చుకొని వారు కోల్పోయిన విలువైన జీవితాన్ని తిరిగి ఇప్పించటానికి ఉద్దేశించింది. 2 జనవరి, 1910లో జన్మించిన శ్రీశ్రీ ఏడున్నర్థమునకే కంద పద్యాన్ని రాసిన ప్రతిభావంతుడు. ఈ ప్రతిభ కారణంగానే శ్రీశ్రీ రచనలు ఈనాటికీ అందరినీ ఆకర్షిస్తున్నాయి.

భావకవిత్వానికి విరుద్ధంగా శ్రామికవర్గచైతన్యం ఆశయంగా రచనలు చేసిన శ్రీశ్రీ దగాపడిన వాళ్ళంతా ఏకమై పీడనని ఎదుర్కోవాలని పిలుపునిచ్చారు. బ్రదుకుకాలి పనికిమాలి శనిదేవత రథచక్రపు టిరుసులలో పడి నలిగినవారిని ఓదార్చి వారికోసం జగన్నాథ రథచక్రాలను భూమార్గం పట్టించిన భగీరథుడు - శ్రీశ్రీ

మార్క్సిజాన్ని త్రికరణశుద్ధిగా నమ్మి దాని వెలుగులో రచనలు చేసిన శ్రీశ్రీ మహాప్రస్థానం 1926-40 మధ్య జరిగిన అనేక జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులకు దర్పణం. రష్యావిప్లవం కూడా శ్రీశ్రీని చాలా ఆకర్షించి, ఆలోచింపచేసింది. గురజాడ అభ్యుదయతత్వాన్ని శ్రీశ్రీ తన రచనలకు ప్రాతిపదికగా చేసుకున్నారు. 1950లో పుస్తకరూపం ధరించిన మహాప్రస్థానం ఈనాటికీ తెలుగు 'వాడి'ని ఆకర్షిస్తూనే ఉంది. శ్రీశ్రీ కృషి వల్ల వచన గీతానికి ఎనలేని ఖ్యాతి వచ్చింది.

శ్రీశ్రీ చక్కని అనువాదకుడు కూడా. రష్యన్ సాహిత్యాన్ని శ్రీశ్రీ అలవోకగా అనువదించిన విధానం చాలా గొప్పది. శ్రీశ్రీపై మెస్ఫీల్డ్, స్విన్‌బర్న్, మాకోవిస్కీ, ఖాజీ నజ్రులిస్లాం, రవీంద్రుడు, లెవోపోవ్ లాంటి రచయితల ప్రభావం చాలా పడింది. ఎన్ని ప్రభావాలు పడినా శ్రీశ్రీ రచనా విధానం దాని సహజత్వాన్ని పోగొట్టుకోలేదు. శ్రీశ్రీ భావనవ్యత, శబ్దశక్తి తెలుగుసాహిత్యంపై గాఢమైన ప్రభావం చూపాయి.

1955లో శ్రీశ్రీ అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షునిగా పనిచేసారు. ఈయన రచనలన్నింటిలోనూ అనర్గళం, అనితరసాధ్యం అయిన అభ్యుదయశక్తుల భుగభుగలు కనిపిస్తాయి. మహాప్రస్థానం, ఖడ్గసృష్టి కవితాసంపుటాలు తెలుగువాళ్ళకి రామాయణ, భారతాలుగా నిల్చిపోయాయి. 1973లో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు శ్రీశ్రీకి లభించింది.

సామ్యవాద సమాజసాధనకి సాహిత్యాన్ని ఒక సాధనంగా ఉపయోగించిన శ్రీశ్రీ 1983లో భౌతికశరీరాన్ని విడిచారు. వీరి మరణంతో తెలుగు సాహిత్యంలో ఒక అరుణతార నేలరాలింది. ఒక ఉజ్వల శకం పరిసమాప్తమైంది.

# 22. మహాప్రస్థానం - అంతర్జాతీయ మానవుని అంతర్మథనం

శ్రీశ్రీ రచనలు ఎంతో గొప్పవి. ఎటువంటి ఆర్భాటాల జోలికి పోకుండా, మామూలు పదాలతో గొప్ప అర్థం స్ఫురించే విధంగా రచనలు చేయటం శ్రీశ్రీ ప్రతిభా నిదర్శనం. మొదట్లో భావకవితావేశంతో రచనలు చేసిన శ్రీశ్రీ తన సమకాలీన కవులైన విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభావానికి గురయ్యాడు. 1928లో శ్రీశ్రీ రచించిన 'ప్రభవ' లోని కవితలు భావకవిత్వ ప్రధాన లక్షణాలైన ఆత్మాశ్రయత, వర్ణన, ప్రకృతిప్రీతి, లలితత్వం మొదలైనవాటికి ఆలంబనంగా ఉన్నాయి. శ్రీశ్రీ సాహితీ ప్రస్థానంలోని మొదటిదశలో భావకవిగానే ఉన్నారు.[1] మహాప్రస్థానంలో కొన్ని గేయాలలో కూడా ఈ విధమైన భావకవితా లక్షణాలు, పురాణప్రతీకలు కనిపిస్తాయి.

శ్రీశ్రీ పాశ్చాత్య సాహితీ సిద్ధాంతాలను, మర్మాలను కూలంకషంగా పరిశీలించి మన చుట్టూ ఉన్న ప్రకృతిలోని సుందరమైన కవితా వస్తువులను తెలుసుకున్నాడు. అమాయక ప్రజలు పాడుకునే పాటలలోని లయబద్ధతని విన్నాడు. మన ప్రాచీన సాహిత్య విధానాలను, కవుల ప్రయోగ విధానాలని అర్థం చేసుకున్నాడు. అప్పకవీయంలోని వృత్తాలను, ఛందోరీతులని సంపూర్ణంగా జీర్ణం చేసుకున్నాడు. దీనికి తోడుగా గతితార్కిక భౌతికవాదాన్ని, మనోవైజ్ఞానిక శాస్త్ర సిద్ధాంతాలను నేర్చుకున్నాడు. సమాజ చలనసూత్రాలని, చారిత్రక విషయాలని అన్వయించుకొని సామాజిక శాస్త్రవేత్తగా విరాట్‌స్వరూపంతో ఆనాటి సాంఘిక జీవితాన్ని చాలా శ్రద్ధగా పరిశీలించి, అర్థం చేసుకున్నాడు. ఇంతటి విజ్ఞానాన్ని ఆసరాగా తీసుకొని చెక్కుచెదరని ఆత్మవిశ్వాసంతో శ్రామికలోకం కళ్యాణానికి కృషి చేసాడు.

నూతన సమాజ నిర్మాణం ఆశయంగా సాగే రచనలు ప్రజల బాధలను ప్రతిబింబిస్తాయి. ప్రజలను కర్తవ్యబద్ధులను చేసి వారిని నూతన వ్యవస్థ నిర్మాణానికై ఉద్యమింపచేసేటపుడు వీరరసం రచనలలో తొణికిసలాడుతుంది. శ్రీశ్రీ మహాప్రస్థాన గేయాలలో కరుణరసం, వీరరసం రెండూ కనిపిస్తాయి.

మహాప్రస్థానం సంపుటిలో మార్క్సిస్టు తాత్విక దృక్పథం, భారతీయ కర్మ సిద్ధాంతంపై విమర్శ, పెట్టుబడిదారీ విధాన నిరసన, వర్గసంఘర్షణ విధానం, శ్రామికవర్గ చైతన్యం మొదలైనవన్నీ కనిపిస్తాయి. భావనవ్యతకి, శబ్దశక్తికి, వస్తునవ్యతకి, నూతన ఛందోరీతులకు, సంప్రదాయ ముద్రకు, ప్రతీకాత్మక రచనకి మహాప్రస్థానంలో అసంఖ్యాకమైన ఉదాహరణలు కనిపిస్తాయి. అనేక ప్రభావాలకు లోనైన అంతర్జాతీయ మానవుని అంతర్మథనం శ్రీశ్రీగారి కవితలలో కనిపిస్తుంది.

శ్రీశ్రీ కవితా పరిధి చాలా విస్తృతమైంది. ఆయన కవిత్వతత్వం చాలా ఆదర్శవంతమైంది. ఋక్కులు అన్న గీతంలో శ్రీశ్రీ తన కవితాతత్వాన్ని వివరించేందుకు ప్రయత్నించాడు. వేదంలోని మంత్రాలనే ఋక్కులు అంటారు. ఈ పేరుతో సాగిన కవితలో కవితావస్తువుగా దేన్నయినా గ్రహించవచ్చని శ్రీశ్రీ ప్రకటించారు. సంప్రదాయాన్ని అనుసరించి కవులు కేవలం కొన్ని వస్తువులనే స్వీకరించేవారు. కానీ శ్రీశ్రీ సాధారణ వస్తువులైన కుక్కపిల్ల, సబ్బుబిళ్ళ, అగ్గిపుల్ల, రొట్టె ముక్క, అరటితొక్క,

బల్లచెక్క మొదలైనవాటిని కావ్యవస్తువులుగా గ్రహించవచ్చని చెప్పాడు. పండితులు అన్ని వస్తువులపట్ల, వ్యక్తులపట్ల సమభావాన్ని కలిగి ఉంటారు. సమసమాజ స్థాపన ఆశయంగా పనిచేస్తున్న కవి ఏ విషయాన్ని హీనంగా చూడకూడదు అని అర్థం చేసుకున్నారు. 'కాదేదీ కవిత కనర్హం ఔనౌను శిల్ప మనర్ఘం' అని చాటి చెప్పిన శ్రీశ్రీ కవితావేశానికి, రసనిర్దేశానికి అన్నీ అర్హమేనని వివరించారు. లాక్షణికులు కూడా నిజానికి ఇదే విధంగా భావించారు.[2] 'కళ్ళంటూ ఉంటే చూసి వాక్కుంటే వ్రాసి' తీరని దాహమైన కవిత్వాన్ని పద్మవ్యూహం లాంటి లోకాన్ని అర్థం చేసుకోవటానికి ఉపయోగిస్తానని శ్రీశ్రీ చెప్పారు. తను ఎందుకోసం రాస్తున్నాడో, ఏమి కోరి రాస్తున్నాడో కవికి స్పష్టంగా తెల్సినప్పుడు అతని కవిత్వం లక్ష్యాత్మకమైంది అవుతుంది. నన్నయ భావించినట్లు 'విశ్వశ్రేయఃకావ్యమ్' అనే శ్రీశ్రీ భావించాడు. అయితే మార్క్సిస్టు చింతనతో శ్రీశ్రీ భౌతికశ్రేయస్సును కోరి తన కవితాశయాలను వివరించారు.

దేశచరిత్రలు అన్నగీతం గతితార్కిక భౌతికవాదం నేపథ్యంలో సాగిన గేయం. ఈ గేయం చదువుతుంటే కళ్ళముందు ప్రపంచచరిత్రలోని వివిధ ఘట్టాలు కనిపిస్తాయి.

ఏ దేశచరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం

వర్గసంఘర్షణ మార్క్సిస్టు సిద్ధాంతంలో ప్రాథమిక సూత్రం[3] అయితే ఏ దేశ చరిత్ర పరిశీలించినా అందులో గర్వకారణమైన విషయం ఏదీ కనపడదు. మానవాళి చరిత్ర అంతా ఒకరిపై మరొకరు పెత్తనం చేయటం, అణగదొక్కటం, కాల్చుకు తినటమే ప్రధానంగా ఉన్నది. ఈ నరజాతి చరిత్ర సమస్తం రణరక్త ప్రవాహసిక్తం. చాలామంది చరిత్రకారులు దేశాలమధ్య జరిగిన యుద్ధాలను చిలవలు పలవలుగా వర్ణించారు. ఏ యుద్ధం ఎందుకు జరిగిందో, ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో అని వివరించటం అలానే వివిధ తారీఖులు, దస్తావేజులు ప్రామాణికంగా తీసుకోవటం, రాణీ ప్రేమపురాణాలు ముట్టడికైన ఖర్చులు మొదలైనవాటివన్నీ చరిత్రలో ప్రధానమైనవిగా చూపించటం సరికాదని శ్రీశ్రీ చెపుతారు. చరిత్ర నిర్మాణంలో ప్రజలే ప్రధానమైన శక్తి అని ఎన్నో విప్లవాలు, ప్రజాపోరాటాలు నిరూపించాయి.

ప్రపంచచరిత్రను నిశితంగా పరిశీలిస్తే రాజరికానికి, జమీందారీకి వ్యతిరేకంగా ప్రజలు సాగించిన క్రమం తెలుస్తుంది. వీరి పాత్రను, ఉద్యమస్ఫూర్తిని చరిత్రకారులు విస్మరించకూడదు. అందుకే శ్రీశ్రీ ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పించని కథలన్నీ కావాలని, సత్యం బహిర్గతమవాలని కోరారు. రణరంగం కాని చోటు భూస్థలంలో ఎక్కడా దొరకదని, గతమంతా రక్తంతోనూ లేదా కన్నీళ్ళతోనే తడిసిందని అంటారు. ప్రపంచ విజేతలుగా ఛంఘిజ్‌ఖాన్, తామర్లేను, నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ, సికందరు లాంటి హంతకులని చరిత్రపుటల కెక్కించిన చరిత్రకారులని శ్రీశ్రీ తప్పుపట్టారు.

అంతా తమ ప్రయోజకత్వం
తామే భువి కధినాధులమని
స్థాపించిన సామ్రాజ్యాలూ
నిర్మించిన కృత్రిమచట్టాల్
ఇతరేతర శక్తులు లేస్తే
పడిపోయెను పేక మేడలై
పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్రపుట్టెను.

అని గతితార్కిక భౌతిక వాదాన్ని వెల్లడించారు.

పెట్టుబడిదారీ విధానం పైకి అందంగా కనిపించే పెద్ద ఊబి. దీని ముఖ్య విధానాలు ఆకర్షణ, ప్రలోభాలు. ఈ విధానం కొన్ని వర్గాలకు చాలా ప్రయోజనకారిగా ఉండి ఇతరులని అనేక విధాలుగా ఇబ్బందులపాలు చేస్తూ ఉంటుంది. 'సంధ్యాసమస్యలు' అనే గేయంలో బ్రిటీష్ వలస విధానాల వల్ల ఏర్పడిన మధ్యతరగతివర్గం ఏ విధంగా పెట్టుబడిదారీ విష సంస్కృతికి లోబడుతోందో కవి చిత్రించారు. ఒక విద్యార్థి సినీమత్తులో జోగుతుంటాడు. మరో ఉద్యోగి హోటల్‌లో భోజనపదార్థాల వెంపర్లాటలో పడిపోతాడు. వీరు ఏ విధంగా వస్తీకరణ (Commodification) కావించపడ్డారో ఇక్కడ తెలుస్తుంది. కానీ ఒక సాధారణ సంసారి ఆర్థిక బాధలతో సతమతమవుతుంటాడు. అయినా వ్యవస్థ వీటిని ఏ మాత్రం పట్టించుకోకుండా ప్రగతి పథాన ప్రయాణిస్తూనే ఉంటుంది!

మార్క్సిజం వివరించే విరోధవైరుధ్య సూత్రం ప్రకారం పెట్టుబడీదారీ వ్యవస్థ అభివృద్ధి అయినకొద్దీ, కార్మికవ్యవస్థ కూడా దానితో సమానంగా బలపడి అంతిమంగా పెట్టుబడిదారీ సమాజం విచ్ఛిన్నమవుతుంది. దీనికి ముందు ప్రపంచ కార్మికులంతా ఏకం కావాలి. అందుకే శ్రీశ్రీ చీనాలో రిక్షావాలా, చెక్‌దేశపు గనిపనిమనిషి, ఐర్లాండున ఓడ కళాసీ అణగారిన ఆర్తులంతా ఏకం కావాలని ఆకాంక్షించారు.[4]

'ప్రతిజ్ఞ' గేయంలో శ్రామిక వర్గచైతన్యానికి కవిత్వాన్ని ఒక సాధనంగా చేయాలని ప్రయత్నించారు. శ్రామికులు రెక్కలుముక్కలు చేసుకొని కష్టపడితే ఆ లాభాలను స్వంతం చేసుకునే యాజమాన్యం వారి కష్టానికి తగిన ప్రతిఫలం అందించదు. ఈ దోపిడీ నిరాటంకంగా సాగిపోతూనే ఉంది. దీన్ని వర్గచైతన్యం పొందిన కార్మికశక్తి విప్లవం ద్వారా ఎదుర్కొంటుంది. శ్రమశక్తికి పెట్టుబడిదార్లు కట్టే విలువ సక్రమంగా లేదని శ్రీశ్రీ భావన. అందుకే శ్రామికవీరుల ఘర్మజలానికి, ధర్మజలానికి ఖరీదుకట్టే షరాబులేదోయ్ అని ఉద్వేగంగా అన్నారు. మార్క్సిస్టుల దృక్పథంలో అన్ని కళలు, కవిత్వము, తత్వం సర్వమూ శ్రామికలోకపు కళ్యాణానికి, కార్మికలోకపు సౌభాగ్యానికి అంకితం కావాలి. శ్రీశ్రీ ఈ దృక్పథంతోనే తనలో కదిలే నవ్యకవిత్వాన్ని నవసమాజ స్థాపనకై వెచ్చిస్తానని ప్రతిజ్ఞ చేసారు. తన భావాల్ని ఈ విధంగా వెల్లడించారు.

కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం,
జాలరి పగ్గం,
సాలెల మగ్గం,
శరీరకష్టం స్ఫురింపచేసే,
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి,
సమస్త వృత్తుల సమస్తచిహ్నాలు-

కవితావస్తువులుగా చెప్పుకున్నారు. తను వినిపించే నవీన గీతికి పైవన్నీ భాగ్యం, ప్రాణం, ప్రణవం అని అన్నారు. శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనే లేదని చాటి చెప్పారు. ఈ 'కర్మయోగులకు' నిత్యమంగళం నిర్దేశిస్తూ, స్వస్తివాక్యముల సంధానిస్తూ, స్వర్ణవాద్యముల సంరావిస్తూ తాను వారికి తన కవిత్వాన్ని సమర్పణం చేస్తానని చెప్పారు. ఇక ముందు వ్యథార్త జీవిత యదార్థదృశ్యం పునాదిగానే రచనలు సాగుతాయనే ఆశాభావం వ్యక్తం చేసారు. తన కావ్యంలో శ్రామికుడే నాయకుడు, అతని కళ్యాణమే తన కావ్యప్రయోజనం అని ఉద్ఘాటించారు.(5) పెట్టుబడీదారీ సమాజంలో ధనమే సుందరమైందిగా కనిపిస్తుంది తప్ప శ్రమజీవన సౌందర్యం కాదు.

నవకవితలో శ్రీశ్రీ తిరిగి నవ్యకవిత్వం ఎలా ఉండాలో చెప్పాడు. ఈ గేయం అంతటా శ్రీశ్రీ మార్క్సిస్టు దృక్పథం కనిపిస్తుంది. నవ్యకవిత్వానికి సింధూరం, రక్తచందనం, బందూకం, సంధ్యారాగం, పులిచంపిన లేడినెత్తురు, ఎగరేసిన ఎర్రని జండా, రుద్రాలిక నయనజ్వాలిక, కలకత్తా కాళికనాలిక మొదలైనవన్నీ కావాలంటాడు. నిజానికి ఇవన్నీ విప్లవచైతన్యానికి, కమ్యూనిస్ట్ ఉద్యమాలకు ప్రతీకలు. పాలకవర్గానికి వ్యతిరేకంగా ఉద్యమాలు చేసే అభ్యుదయ శక్తులకు ఉత్తేజాన్ని అందించే కవిత్వం కదిలేది, కదిలించేదిగా ఉండాలి. ఘాటెక్కిన గంధక ధూమం, పోటెత్తిన సప్తసముద్రాల్, రగులుకొనే రాక్షసబొగ్గు, బుగులుకునే బుక్కాగుండా, వికసించిన విద్యుత్తేజం... ఇవన్నీ కదిలేవి. గంధకధూమం అన్నప్పుడు కర్మాగారాల్లో పనిచేసే కార్మికవర్గ ఉద్యమాలు స్ఫురిస్తాయి. పోటెత్తిన అన్నప్పుడు కార్మికశక్తి చైతన్యం తెలుస్తుంది. పోటెత్తిన సప్త సముద్రాల్ అనటంతో. ప్రపంచమంతటా విస్తరిస్తున్న అనేక కార్మిక పోరాటాలు గుర్తుకువస్తాయి. రాక్షసిబొగ్గు రగులుకొంది. అని సూచించటం గని కార్మికుల సమైక్యతను వెల్లడిస్తోంది. వికసించిన విద్యుత్తేజం కార్మికశక్తి సామర్థ్యాన్ని వెల్లడిస్తుంది. ఈ విధంగా వివిధ కార్మికోద్యమాలను వివరించి అవి ప్రజలను ఏ విధంగా కదిలిస్తాయో చెపుతున్నారు. రాబందుల రెక్కలచప్పుడు, పొగగొట్టపు ఘూంకారధ్వని, అరణ్యమున హరీంద్ర గర్జన మొదలైనవన్నీ కదిలించేవి. ఈ వస్తువుల ద్వారా కదిలేదీ, కదిలించేదీ మారేదీ, మార్పించేదీ ముఖ్యమని నవ కవనానికి కావాల్సింది పెనునిద్దర వదిలించేదీ, మునుముందుకు సాగించేదీ, పరిపూర్ణపు బ్రదుకిచ్చేది అని వెల్లడించారు.

మిథ్యావాది అనే గేయంలో శ్రీశ్రీ కర్మసిద్ధాంతం పేరిట సాగుతున్న దోపిడీనీ, దాన్ని సాగిస్తున్న వ్యక్తులను కవ్వించి, సవాలు చేసారు. జమీందారు రోల్సురాయ్‌కారు

మాయంటావూ? బాబూ ఏమంటావు? అని నిలదీస్తారు. మహారాజు మనీపర్సు మాయంటావూ? అన్న ప్రశ్నకి మిధ్యావాదుల మధ్య నుంచి ఏ సమాధానం రాదు. రోల్సురాయ్‌కారు, మనీ పర్సు వారి పూర్వజన్మ సుకృతంగా లభించినవి కావు. దోపిడీ మార్గాల ద్వారా సంపాదించుకున్నవే. పేదలకి అనాదిగా వారి కర్మ అలా ఉందని చెప్పి నోరుమూయించటం భూస్వామ్య సమాజంలో ఒక విధానం. వీరి సిద్ధాంతాన్ని విమర్శిస్తూ శ్రీశ్రీ మరఫిరంగి, విషవాయువులు మాయంటావూ? అంటారు. తుపానులు, భూకంపం, తిరుగుబాట్లు, సంగ్రామం ఇవేవీ మాయ, కర్మ కావు. వివిధ భౌతిక కారణాలవల్లే ఇవన్నీ జరుగుతున్నాయి.

*పాలికాపు నుదుటి చెమట*
*కూలివాని గుండె చెరువు*
*బిచ్చగాని కడుపు కరువు*
*మాయంటావూ?*

కళ్ళముందు కనిపిస్తున్న వాస్తవాన్ని అర్థం చేసుకోమని, పై లోకం భావనని పక్కనపెట్టి భూమి మీదనే సుందరమైన ప్రపంచాన్ని నిర్మించటానికి కృషి చేయటం మంచిదని, కర్మ పేరుతో దోపిడీ కాండను నిరాటంకంగా కొనసాగించటం తప్పని శ్రీశ్రీ వివరించారు. రానున్నవి అందరూ సుఖపడే మంచిరోజులేనన్న విశ్వాసం ప్రకటిస్తాడు.

'ది సోవియట్ ఎయిర్ ఫోర్స్ హాజ్ గాన్ ఇంటూ యాక్షన్' అన్న వార్తను చదివి ఉత్తేజితుడైన మహాకవి కవితావేశం 'గర్జించు రష్యా' అన్న గీతంలో కనిపిస్తుంది. మార్క్స్, ఎంగెల్స్ మహా ప్రవక్తలై మానవ పురోగమన మార్గాలు తెరిచారని చెపుతాడు. రష్యా సేనలు సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ విధానాల్ని బద్దలు కొడతాయని అంతిమంగా వర్గ రహిత సమాజం ఏర్పడుతుందని శ్రీశ్రీ నమ్మారు. కార్మిక స్వర్గాన్ని కలగన్న రష్యా స్వతంత్రత, సమానత సాధిస్తుందని సామ్యవాద సమాజం తప్పక ఏర్పడుతుందని అంటారు.

*ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచింది*
*కార్మికులు, కర్షకులు, తాడితులు, పీడితులు-*
*కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారు*
*ప్రపంచం నీ కోసం పరిపక్వంగా వుంది.*

అభ్యుదయ శక్తులు ఐకమత్యంతో పోరాడతారని, రష్యా నాయకత్వంలో ప్రపంచం అంతా సమానత్వ సాధనకై కృషి చేస్తుందని వివరిస్తారు. రష్యా పోరాట స్ఫూర్తి, విజయం అనంత ప్రపంచమంతా గొడుగునీడల్ని సాగిస్తుందని భావిస్తారు.

సోషలిస్టు శక్తుల విజయాన్ని ఓర్వలేక పెట్టుబడి కూటాలు కట్టకడుతున్నాయని, కుట్రలు కూహకం చెలరేగుతున్నాయని వివరించారు. పెట్టుబడిదారీ శక్తులు రేడియోలో అసత్య ప్రచారపు బాకా ఊదుతున్నాయని వీటిపట్ల జాగ్రత్తగా ఉండాల్సిన అవసరాన్ని

వెల్లడిస్తున్నారు.[6] వీటన్నింటి కుట్రలు ఫలించక యునియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ ఆవిర్భవించి స్వాతంత్ర్య శత్రువుల గుండెల్లో బల్లెంగా నిలిచింది. ఇది ప్రపంచ చరిత్రలోనే ఒక ఉజ్వల ఘట్టం.

అవతారం గేయంలో రష్యన్ విప్లవం దాని ఫలితంగా ఏర్పడిన సామ్యవాద సమాజ ఆవిర్భావాన్ని వివరించే ప్రతీకలను ఉపయోగించారు. దీనిలో పాలకులకు వ్యతిరేకముగా పాలితులు చేసిన తిరుగుబాటును వ్యంగ్య విధానంలో చిత్రించారు.

యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బు చాటున
ఖణేల్ మన్నాయి!

లోహం అన్నది పెట్టుబడిదారీ విధానానికి గుర్తు. యముడు నరకలోకానికి అధిపతి. ఇతని వాహనమైన మహిషం లోహఘంటలు ఖణేల్‌మన్నాయి అన్నప్పుడు పాలితులలో వచ్చిన చైతన్యం గుర్తుకు వస్తోంది. తరతరాలుగా సేవక వృత్తుల్లో ఉన్నవారు యజమానిపై తిరుగుబాటు చేయటం ఇక్కడ ఇతివృత్తం. దీన్ని వివరించటానికే నరకలోకపు జాగిలమ్ములు గొలుసు తెంచుకొని ఉరికి పడ్డాయని శ్రీశ్రీ వివరించారు. ఉదయ సూర్యుని సప్తహయములు నరక లోకంలోని చీకటిని కూడా పారద్రోల శక్తిగలవే! ఈ సూర్యుడు విప్లవ సూరీడు. వివిధ దేవతలపై వారివారి వాహనాలే తిరుగుబాటు చేసాయని తరువాత పదాలతో శ్రీశ్రీ చెప్పారు. కనకదుర్గా చండసింహం, ఇంద్రదేవుని మదపుటేనుగు తరతరాల దాస్యాన్ని తిరస్కరించి యజమానులపై ఎదురు తిరిగాయని అన్నారు. శివుని వాహనమైన నందికేశుడు కూడా రంకె వేస్తూ గెంతాడట. ప్రపంచమంతా విప్లవాలు జరుగుతున్నాయి. అందుకే పుడమితల్లికి పురిటినొప్పులు కొత్త సృష్టిని స్ఫురింపచేసాయని శ్రీశ్రీ చెప్పారు. ఇది భగవంతుని మరో అవతారం కాదు, నూతన సామాజికార్థిక వ్యవస్థ ఏర్పడుతున్న సందర్భం. ఈ గీతంలో సూచిస్తున్నాయి.[7] పెట్టుబడిదారీ వ్యవస్థ నాశనమై విప్లవశక్తులచేత సామ్యవాద సమాజం ఏర్పడుతోందని శ్రీశ్రీ తన విశ్వాసాన్ని వెల్లడించారు.

చాలామంది వ్యక్తులు మార్పును కోరుకోరు. ఏది ఎక్కడ ఉన్నది అక్కడ అలా ఉండటమే వారికి చాలు. వీరు ఒక విధంగా మానసికంగా శిలాజాలుగా మిగిలిపోయారు. ఈ అదృష్టవంతులకి 'వ్యత్యాసం' గీతంలో కనువిప్పు, కలిగించేందుకు ప్రయత్నించారు. వారు మంచికీ, చెడ్డకీ నడుమ కంచుగోడలను ఏర్పరుచుకొని నివసించేవారు.

వీరు మంచీ, చెడ్డా మాట్లాడుతారు. ధర్మం, అధర్మం అంటారు. దేముని మీద భక్తి అంటారు కానీ కళ్ళముందు జరిగే ఆక్రమాలని ప్రశ్నించరు. వారి ఊహలన్నీ మంచిగదిలోనే సంచరిస్తాయి. ఇదివరకే ఆ గది ఏర్పడింది కాబట్టి వారికి ప్రగతి అన్నా, విప్లవం అన్నా పడదు. వారి జీవితం వడ్డించిన విస్తరి. పట్టుదిళ్ళలో తలదూర్చి లోకం అంతా బాగానే ఉంద్ధి, స్వర్గంలో దేముడు ఉన్నాడు అని గొణుగుతుంటారు. కానీ వాస్తవ మేమిటంటే జీవితం వారికే బాగుంది కానీ చాలామంది పేదలకు కాదు. అందరూ

మంచిగా ఉండాలని కోరుకోవటం వీరికి రుచించదు. అందుకే ఈ పుణ్యాత్ములని ఒక్కొక్కసారి విస్తరీ దొరకని, వారి వంట వారే వండుకోవాల్సిన అభాగ్యుల గురించి ఆలోచించమని ప్రశ్నిస్తాడు.

మాకు గోడలు లేవు
గోడలను పగులగొట్టటమే మా పని

ఇది అభ్యుదయమంటే! మనిషికి మనిషికి మధ్య ఎటువంటి అడ్డుగోడలు లేకుండా సమానత్వం రాజ్యమేలుతుండగా చూడాలని అభ్యుదయశక్తులు కోరుకుంటాయి.

అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం
ముళ్ళూ, రాళ్ళూ అవంతరాలెన్ని ఉన్నా
మూడుదారి మాది

అభ్యుదయవాదులకు భౌతికవాద దృష్టి ఎక్కువ. కర్మసిద్ధాంతం, మాయావాదం, స్వర్గనరకాలు వీటిపై వీరికి నమ్మకం లేదు. వీరికి తిరుగుబాటు వేదాంతం. ఎన్ని అడ్డంకులు ఏర్పడినా వీరు ముందుకే ప్రయాణిస్తారు, లక్ష్యాన్ని సాధిస్తారు. అదే సమయంలో సంప్రదాయవాదులకు ఉన్న చోటు చాలు. వీరిలో కొందరు వెనక్కి పోదామని కూడా చూస్తుంటారు.

ప్రగతిశీల వాదులకు, సంప్రదాయులకు మధ్య ప్రధాన తేడ మొదటి రకం వాళ్ళు అభిప్రాయాల కోసం బాధలు లక్ష్యపెట్టని వాళ్ళు. మిగిలిన వాళ్లు అభిప్రాయాలు మార్చుకొని సుఖాలు కామించేవాళ్ళు. సుఖాలు తీరిగ్గా అనుభవించి పరలోకంలో సుఖాల కోసం అప్పటి నుంచీ ప్రణాళికలు చేసుకునేవాళ్ళు తృప్తిగా చచ్చిపోతారు. ప్రపంచం వారిని మరిచిపోతుంది. అభ్యుదయవాదులు ముందుకు పోతారు. ప్రపంచం వారి వెంట వస్తుంది. ఈ విధంగా శ్రీశ్రీ తిండితులు, పీడితులు నా వాళ్ళు అని ఎలుగెత్తి చాటారు.

శ్రీశ్రీ రాజ్యహింస గురించి ముందుగానే హెచ్చరించిన మహాదార్శనికుడు. వ్యవస్థగా ఏర్పడిన రాజ్యం కేవలం ధనికవర్గాల కొమ్ముకాస్తుంది. దాని మిలిటరీ, పోలీసు బలంతో తన విధానాల్ని ప్రశ్నించేవారిని కసితో కాలరాస్తుందని వివరిస్తున్నారు. రాజ్యం వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని హరిస్తుందని, ప్రగతిశీల శక్తులపై రాజ్యం దౌర్జన్యకాండ చేస్తుందని ప్రజాస్వామ్యవాదులని అందరినీ కోరుతున్నారు.

'నిరపరాధులై దురదృష్టంచే
చెరలసాలలో చిక్కేవాళ్ళూ-
లోహరాక్షసుల పదఘట్టనచే
కొన ప్రాణంతో కనలేవాళ్ళూ"

రాజ్యదమనకాండని ఎదుర్కొని, విప్లవ శక్తులకు అండగా నిలబడటం ప్రతి ఒక్కరి బాధ్యత.

ఫాసిజం, ఇంపీరియలిజం ప్రగతి వాదానికి బద్ధశత్రువులు. మానవ సౌభ్రాతత్వానికి, సమాజత్వానికీ ఫాసిజం అడ్డుగోడవంటిది. దీన్ని నిరసిస్తూ శ్రీశ్రీ 'కేక' అన్న గీతం రచించారు.

ఇరవై కోరల
అరవై కొమ్ముల
క్రూర ఘోర కర్కోటకులో

లోకమంతా ఫాసిస్టు శక్తులవల్ల విషపూరితమైందని చెపుతారు. నేను ఒంటరినై, నిద్రకు వెలియై బాధపడుతున్నానని అంటారు. 'నేను' అన్న పదం అంతర్జాతీయ మానవుని, అవిభక్త మానవ కుటుంబానికి చెందిన వ్యక్తికి సంకేతం. ఫాసిస్టు విధానాల వల్ల మానవులు విడివిడి అయిపోతున్నారని బాధపడ్డారు. నాలుగు దిక్కుల బాకులతో...బాకుల తోటల బాటలతో అని అన్ని వేపులా ఈ ఫాసిస్టు శక్తులు మాటువేసి ఉన్నాయని దీనివల్ల లోకం అంతా బాకుల బాటలతో నిండిపోయిందని చెపుతారు. నా గది అంటే నా ప్రపంచం అని అర్థం చెప్పుకుంటే ఫాసిస్టుల విధానాల వల్ల లోకం అంతా చీకటి అలుముకుందని చెప్పినట్లుగా ఉంది.

అభ్యుదయం గేయంలో కూడా కవి అప్రజాస్వామిక, ఆటవిక ఫాసిస్టు విధానాలని గర్హించారు. ఏవేవో ఘోషలు వినబడుతున్నాయని, గుండెలు విడిపోతున్నాయని శ్రీశ్రీ ఆవేదన వ్యక్తం చేసారు. అంటే ఫాసిస్టు విధానాలు మానవాళిని ఎంతగా వేదనకి గురి చేస్తున్నాయో చూడవచ్చు. వీరి ఊసే మానవతావాదులకి గిట్టదు. ఎవరెవరో వస్తున్నారని, మనిషిని మనిషిని విడదీస్తున్నారని శ్రీశ్రీ చెపుతారు.

ఎవరో
ఎవరెవరో, ఎవరెవరో
తల విరబోసుకు
నగ్నంగా వర్తిస్తున్నారు! భయో
ద్విగ్నంగా వర్తిస్తున్నారు.

తల విరబోసుకు నగ్నంగా వర్తిస్తున్నారు. అప్పుడు ఫాసిస్టు భయానక భూతం స్ఫురిస్తుంది. దీన్ని తుదముట్టించిననాడే ప్రపంచానికి మంచి రోజులు వస్తాయని వివరిస్తున్నారు. ఇంకిన, తెగిపోయిన, మరణించిన క్రొన్నెత్తురు. విపంచికలు, యువ యోధులు అని చెప్తూ ఫాసిజంపై పోరు చేసి ప్రాణత్యాగం చేసినవారిని జ్ఞప్తిచేస్తున్నాడు.

శ్రీశ్రీ కవిత్వం ఎల్లలులేనిది. విశ్వమానవ సౌభ్రాతృత్వం శ్రీశ్రీ కవిత్వ లక్ష్యం. మానవ సమూహాలు అంతా ఐకమత్యంతో, ఎటువంటి వైషమ్యాలు లేకుండా ముందడుగు వేస్తారని ఆ బంగారపు ఘడియలకోసం, ఎదురు చూసారు. ఆయన నిరీక్షణ ఫలిస్తుందనే నమ్మకం కూడా ఉంది. విశ్వకవి రవీంద్రుని లాగానే శ్రీశ్రీ

'అంతర్జాతీయత'ను విశ్వసించారు. కొన్ని శతాబ్దాలుగా మానవుడు మతం, జాతి, వర్ణం, దేశం, భాష మొదలైన అడ్డుగోడల వల్ల ఒంటరిగానే ఉండిపోతున్నాడని బాధపడతారు. వసుధైక కుటుంబం అనే భారతీయ భావనని వివరించారు.

అవిభక్త కుటుంబీ
ఏక రక్త బంధూ
మానవుడా, మానవుడా

భూతలం మీద వివిధ ప్రాంతాల్లో ఉన్నప్పటికీ మానవులంతా ఒకే జాతి అనీ బంధుత్వం అనేది మానవునికి, మానవునికి మధ్య ఉండే సంబంధమనీ చెపుతున్నారు.

మానవునిలో రెండు పార్శ్వాలు ఉన్నాయనీ ఒకటి అతనిలోని మంచికి చెందినదనీ, రెండవది అతని చెడు అనే వివరిస్తున్నారు. ఊర్ధ్వదృష్టి, మహామహుడా అని మానవుని సమష్టి విజయాలని పొగొడుతాడు. అదే సమయంలో కొట్లాడుకునే బుద్ధిని, ఓర్వలేనితనాన్ని, సంకుచిత స్వభావాన్ని చెప్పి మానవుని కపటత్వం, వంచనల్ అతనికి ప్రధాన శత్రువులని అంటాడు. సామ్యవాద సమాజం స్థాపించటానికి, దాన్ని నిలువుకోవటానికి ముందుగానే మానవుడు తన అంతఃశత్రువులని జయించాల్సిన ఆవశ్యకత ఉంది. భారతీయ వేదాంతులు నిజానికి చెప్పేది ఈ విషయమే. శాస్త్ర విజ్ఞానాన్ని సాధించి, వివిధ కళల్లో ఘనతవహించి అన్నిటినీ శోధించి సాధించాలని చూసే మానవుడు బుద్ధమూర్తిగా, జీసస్‌గా, గాంధీగా ఎంతో ఎత్తుకు ఎదిగాడని శ్రీశ్రీ ఆనందం వ్యక్తం చేస్తున్నారు. సమాజమంతా ఇటువంటి ఉదాత్త ఆలోచనలతో ప్రేరణపొందినప్పుడు భూమిమీదనే స్వర్గం సాధించుకోవచ్చు.

శ్రీశ్రీ తన కవిత్వాన్ని పేదల బాధలను వెల్లడించటానికి, వారి కన్నీళ్ళను తుడవటానికి ఉద్దేశించాడు. అనేక గేయాల్లో వీరి సామాజిక స్పృహ కన్పిస్తుంది. నిజంగానే పీడితుల కష్టాలకు కరగిపోయి వారి బాధలను తన బాధగా భావించి కలం పట్టిన ఆదర్శ వ్యక్తి. శ్రీశ్రీ ఏది చెప్పాడో దాన్ని తన కవిత్వంలో చూపించాడు. అంతకుముందు 'ఐ' అనే గీతంలో తాను భూతాన్ని, యజ్ఞోపవీతాన్ని, విప్లవగీతాన్ని అని ప్రకటించుకున్నాడు. ఇక్కడ భూతం అంటే అహంకారరాహిత్యమైన, నిర్వికారమైన జీవాత్మ అనే భావన వస్తోంది. తన్ను ఇతరుల యందు, ఇతరులని తనయందు చూసుకునేవాడు సమదర్శి అవుతాడు. యజ్ఞోపవీతం పవిత్రతకు గుర్తు కానీ కులసూచికం కాదు. శ్రీశ్రీ ఆధునికార్థంలో అరిషడ్వార్గాలను జయించి వైప్లవ్యగీతంగా తననుతాను అభివర్ణించుకున్నాడు. ఈ అద్వైతి తన మేధాతపస్సుని నూతన సమాజ నిర్మాణానికై వెచ్చించారు.

నేనొక దుర్గం
నాదొక స్వర్గం
అనర్గళం, అనితరసాధ్యం నా మార్గం

ఈ మార్గం అభ్యుదయమార్గమ్. రాబర్ట్ ఫ్రాస్ట్ ప్రభావం పై పంక్తుల మీద ఉన్నట్లుగా అనిపిస్తుంది.[7] శ్రీశ్రీ కూడా తాను ఎంచుకున్న మార్గం వల్లే తన జీవితపంథా వేరుగా ఉందని ఆత్మవిశ్వాసం ప్రకటించారు.

బాటసారి పూర్తిగా కరుణరసపూరితమైన గేయం. శ్రీశ్రీగారి వస్తునవ్యతకు ఈ పద్యాన్ని ఒక ఉదాహరణగా పేర్కొనవచ్చు. కూటికోసం, కూలికోసం పట్టణంలో బ్రతుకుదామని– అని ప్రారంభమయ్యే ఈ గీతం చదివేవాళ్ళలో బాటసారిపట్ల సానుభూతి కలిగిస్తుంది. అతని జీవితం ఎలా అవుతుందో అనే శంక కలుగుతుంది. బాటసారి లక్షలాది బీదాబిక్కీ ప్రజలకు ప్రతినిధి. పట్టణం అనేది పల్లె పెరిగి ఆదిమ కమ్యూనిజం స్థానే ఏర్పడిన పెట్టుబడిదారీ సమాజాన్ని సూచిస్తోందన్నమాట. ఈ వ్యవస్థలో బాటసారి ఎదుర్కొనే ఇబ్బందులని శ్రీశ్రీ వాస్తవదృష్టితో చిత్రించారు. తల్లిమాటలు చెవిన పెట్టక బయలుదేరిన బాటసారికి దిక్కు తెలియక బాధపడ్డాడని చెపుతాడు. నడి సముద్రపు నావ రీతిగ అన్నప్పుడు బాటసారి పరిస్థితి సూచితం. చండ చండం తీవ్రతీవ్రం జ్వరం కాస్తే, భయం వేస్తే, ప్రలాపిస్తే – అన్నప్పుడు ఆరోగ్యం దెబ్బతిని, భయంవల్ల ఖిన్నుడై ప్రలాపిస్తున్న బాటసారి స్థితికి బాధవేస్తుంది. అయ్యో పాపం అని వెంటనే అన్పిస్తుంది. పదాలను వెంటవెంటనే ప్రయోగించిన విధానంలో ఈ విధమైన భావాలు స్ఫురిస్తున్నాయి. మబ్బుపట్టీ, గాలి కొట్టీ, వాన వస్తే, వరదవస్తే, చిమ్మచీకటి కమ్ముకొస్తే అన్నప్పుడు వరుసగా ప్రకృతిలో జరిగిన వివిధ పరిణామాలు కనిపిస్తున్నాయి. దీనివల్ల ఇతివృత్తానికి తగిన వాతావరణం సృష్టించబడింది. ఆ వెంటనే దారి తప్పిన బాటసారికి ఎంత కష్టం అన్న ప్రశ్న వస్తోంది. దీంతో చదివేవారిలో ఎన్నో భావోద్వేగాలు కలుగుతున్నాయి. ఇదంతా శ్రీశ్రీ రచనా విధానాన్ని నిరూపిస్తోంది.

కళ్ళు వాకిట నిలిపి చూచే
పల్లెటూళ్ళో తల్లి ఏమని
పలవరిస్తుందో...?

బిడ్డ యోగక్షేమాలపైనే తల్లికి అహర్నిశలు ఆదుర్దా ఉంటుంది. బాటసారి గురించిన ఆలోచనలతో తల్లి పల్లెటూళ్ళో వాకిట్లో ఎదురుచూస్తుంది. ఆమె ఏమని పలవరిస్తుందో అనటంతో తల్లి గురించిన ఆలోచన వస్తోంది. తల్లీ, బిడ్డల క్షేమం వారిద్దరి మధ్య పెనవేసుకున్న ప్రేమానురాగాలు గుర్తుకువస్తాయి. బాటసారికి శిరోవేదన అతిశయించిందని, రాత్రి నల్లని రాతి పోలికగా గుండె మీదనే కూర్చుందని చెప్పటం, అతనికి తల్లి పిల్చే కల్లదృశ్యం కళ్ళముందట కనిపించిందని అనటం తిరిగి మనకు అతని మానసిక స్థితిని, శారీరక బాధలనీ వివరిస్తుంది.[9]

అతని బ్రతుకున కదే ఆఖరు అనటంతో బాటసారి ఇంక లేడన్న కఠోరసత్యం మనకు తెలుస్తోంది. బాటసారి కళేబరంతో శీతవాయువు ఆడుకుంటోంది అనటం ప్రకృతికూడా అతనిపై పగబట్టిందా అన్న ఆలోచనలను కల్గిస్తోంది. బాటసారి మరణవార్త తల్లికి తెలిసిందా అనే శంక చదివేవాళ్ళకు వస్తుంది.

పల్లెటూళ్ళో తల్లి కేదో
పాడుకలలో పేగు కదిలింది

పేగుబంధం ఉంది కాబట్టి తల్లికి కలలో పేగు కదిలింది అని శ్రీశ్రీ భారతీయ సమాజంలోని విశ్వాసాన్ని వివరించాడు.

భిక్షువర్షీయసి గేయంలో ఒక ఒంటరి ముసలి అవ్వ జీవితం చిత్రించబడింది. దారిపక్క చెట్టుక్రింద ఆరిన కుంపటి విధాన అనటం ఆ అవ్వకు ఎవరూలేరని, శక్తిహీనురాలని వివరిస్తోంది. దారిపక్క అనటం జీవన ప్రయాణంలో చివరి మజిలీకి చేరిందని సూచిస్తోంది. ఆమె మూలుగుతూ, ముసురుతున్న ఈగలతో వేగలేక ఉందని అనటంతోనే ఆమె దుస్థితి తెలుస్తోంది.

పడిపోయెను జబ్బుచేసి;
అడుక్కునే శక్తి లేదు;
రానున్నది చలికాలం
దిక్కులేని దీనురాలు

వృద్ధాప్యంలో ఎవరూ పట్టించుకోని సమాజనీతికి బలైపోయిన ఈ దీనురాలు భిక్షాటన చేసే పరిస్థితిలో కూడా లేదు. ఆమెకు బతకాలని కూడా లేదు. సామర్థ్యాన్ని మాత్రమే అంగీకరించే పెట్టుబడీదారీ సంస్కృతికి అశక్తుల, అభాగ్యుల, అసహాయుల ఆక్రందనలు విన్పించవు. 'ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వరి' దని వెర్రిగాలి ప్రశ్నిస్తూ వెళ్ళిపోయింది. కనీసం గాలికి కూడా ఆగి, తిరిగ్గా వెళ్ళే ఓపిక లేదు. ఎవరిదారిన వాళ్ళు త్వరత్వరగా కదిలిపోయే యంత్రనాగరికతలో ప్రకృతి కూడా అలానే ప్రవర్తించటంలో ఏమీ విచిత్రం లేదు. ఎముక ముక్క కొరుక్కుంటూ ఏమీ అనని కుక్క, ఈగను పడవేసుకు తొందరగా తొలగిన తొండలు కూడా - వాటి లాభం అవి చూసుకునే స్వార్థశక్తులని సూచిస్తున్నారు. చివరకు ఒక ఎంగిలాకు ఎగిరివచ్చి ఇది నా పాపం కాదు అని అన్నదట. ఎవరో ధనికుడు తృప్తిగా భోజనం చేసిన ఆకుని చిత్రించి శ్రీశ్రీ ధన ఆధారిత ఆర్థిక వ్యవస్థలోని వివిధ వర్గాలు ఆలోచించే విధానాన్ని అవహేళన చేసారు. సంపద అంతా తమవద్దే ప్రోగుపడాలని చూసే వీరికి పేదలమరణం పట్టని విషయం. అది వారి పాపం కానే కాదు!

ఆకాశదీపం గేయం కూడా శ్రీశ్రీ కరుణరస పోషణని వివరించేది. ఉదయం ఆరున్నరకి ఒక దురదృష్టజీవి మరణించటం దీనిలోని ఇతివృత్తం. గదిలో ఎవరూ లేరు, గదినిండా నిశ్శబ్దం అన్న మొదటి మాటలే ఏదో కీడును సూచిస్తున్నాయి. గదిలోపల చినుకులవలె చీకట్లు అనటం విచిత్ర భావుకతని సూచిస్తోంది. దురదృష్ట జీవితం ఆరిపోయింది అన్నప్పుడే ఒక జీవితం ఆరిపోయినట్లు అనిపిస్తోంది. అతని దీపం ఆ గదిలో ప్రమిదలో చమురు త్రాగుతూ పలుదిక్కులు చూస్తున్నది అని చెప్పటం ఇతరుల జీవితాన్ని ఉపయోగించుకొని తాము వెలుగు చిమ్మాలన్న స్వార్థపూరిత వ్యక్తులని గుర్తుకుతెస్తున్నది. అతని గదిలోని దీపము

చీకటి బోనులో
సింహములా నిలుచున్నది.

గదిలో బందీ అయిన చీకటిని బోనుతోనూ, దీపాన్ని సింహంతోనూ పోల్చారు. దీపానికి చీకటిని చెండాడటం తెల్సుగానీ ప్రస్తుతం అది బోనులోని సింహంలాగా నిస్సహాయంగా ఉంది. చీకటిని కత్తిగంటుమీది నెత్తుటిబొట్లతోనూ పోల్చాడు. ఇది చక్కని ఉపమానము. నల్లని కత్తిమీద ఎర్రని రక్తపుబొట్లు నల్లని చీకటిని చీల్చే ఎర్రని దీపకాంతులవలే ఉన్నాయి. ఈ రెండింటి సామ్యంవల్లా గదిలోని వాతావరణం తెలుస్తోంది. దీపం ఆకాశతారను చూడటం, ఆరిపోయి తారగా మారిపోవటం మరణించిన వ్యక్తి ఆత్మ ప్రకృతిలో కలిసిపోవటాన్ని సూచిస్తోంది.

మహాప్రస్థానంలోని గేయాలన్నింటిలోకీ 'మహాప్రస్థానం' తలమానికం. నూతన సామాజిక వ్యవస్థ నిర్మాణం కోసం బయలుదేరిన సైన్యశక్తిని ఈ గేయంలో శ్రీశ్రీ వివరించారు. ఐదు నిమిషాల్లోనే రచించిన ఈ గేయంలో వీరరసం ప్రధానమైంది. ఈ గేయంపై ఫ్రెంచివారి జాతీయగీతం, హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ పాట, నజ్రుల్ ఇస్లాం విప్లవగీతాలు, పో గేయాలు, గురజాడ, కవికొండల రచనలు మొదలైనవి ప్రభావం చూపించాయి. ఇన్ని ప్రభావాలు ఉన్నప్పటికీ దీనిలోని స్వతంత్రత, వేగం దిక్కులను ఊపివేసే శక్తి కలది. ఈ గేయం ఓజోగుణ ప్రధానమైంది. చైతన్యాన్ని కలిగించి ప్రజలను కార్యోన్ముఖులని చేసే ఈ సమరగీతిని చదువుతున్నంతసేపు సైన్యం చేస్తున్న కవాతు, వారి నినాదాలు, పరుగులెత్తుతున్న ప్రజ కళ్ళముందు కనిపిస్తాయి. ఈ సైనికులు వీరరక్తము పొంగిపొరలుతున్న విశ్వశ్రామికులు తప్ప యుద్ధరంగంలోనివారు కాదు. వారి పోరాటం పెట్టుబడిదారీ విధానంపై చేసే తిరుగుబాటు. వారి ఆశయం శ్రామికవర్గ ప్రభుత్వం ఏర్పరిచి పీడితులు సుఖపడే మంచి రోజులని సాధించటం. ఈ గేయంలోని ప్రతి పదం వ్యక్తి గుండెల్లో కార్యాన్ని సాధించాలన్న ఆవేశాన్ని కలిగిస్తుంది.

*మరోప్రపంచం,*
*మరో ప్రపంచం,*
*మరో ప్రపంచం పిలిచింది!*
*పదండి ముందుకు,*
*పదండి ముందుకు?*
*పదండి త్రోసుకు!*
*పోదాం, పోదాం పైపైకి!*

మరోప్రపంచం మార్క్సిస్టులు కలలుకనే సోషలిస్టు వ్యవస్థ. మరో ప్రపంచం పిలిచింది అన్నప్పుడు ప్రతి ఒక్కరిలో చైతన్యం మొదలవుతోంది.[10] పదండి ముందుకు, పదండి త్రోసుకు అన్నప్పుడు ఒక పెద్ద సమూహం అందులోని వ్యక్తులు ఒకరిని ఒకరు నెట్టుకుంటూ త్రోసుకుంటూ సాగుతున్న దృశ్యం కనిపిస్తుంది. కదం తొక్కుతూ, పదం

పాడుతూ బయలుదేరిన ఈ పటాలము హృదంతరాళం గర్జించే బెబ్బులిలాగా ఉంది. వెంటనే వినబడలేదా మరో ప్రపంచపు జలపాతం అన్న ప్రశ్న వస్తుంది. ఉద్యమస్ఫూర్తిని అందుకోలేక, నీరసంగా ఉన్నవారిని ఉద్దేశించి 'వినబడలేదా అని కేక వేసినపుడు జలపాతం' సవ్వడి చెవిలో మారుమ్రోగుతుంది. శ్రామికసైనికుల శక్తిని ఎల్లప్పుడూ చైతన్యంగా ఉండే, స్ఫూర్తి సందేశాన్నందించే జలపాతంతో పోల్చారు. వర్గచైతన్యంతో ముందుకు సాగుతోన్న ఈ శక్తులు దారిపొడుగునా గుండె నెత్తురులు తర్పణచేస్తూ ఉన్నారనటం సామ్యవాద సమాజస్థాపనకై శ్రామికవర్గం చేసిన త్యాగాలను వెల్లడిస్తోంది.

*బాటలు నడిచీ*
*పేటల కడిచీ*
*కోటలన్నిటిని దాటండి*

బాటలు అంటే సామ్యవాద వ్యవస్థకు మేథోపరమైన సేవ చేసిన మహానీయుల మార్గాలు. పేటలు కుల, వర్గ, మత ప్రాతిపదికగా ఉన్న సమాజం. కోట భూస్వామ్య, రాచరిక సంస్కృతిని సూచిస్తోంది. ఈ పేటలనీ, కోటలనీ వీరసైనికులు నిర్మూలిస్తారనే ఆశ వెల్లడవుతోంది. వెనకపడిపోయి, వెనకెనకే బాగుందని చెప్పే సంప్రదాయ గబ్బిలాయిలని కవి తీవ్రంగా నిరసిస్తున్నాడు. ఎముకలు కుళ్ళిన, వయస్సు మళ్ళిన సోమరులారా చావండి అని వారిని ఈసడించుకుంటున్నారు. నెత్తురు మండే, శక్తులు నిండే సైనికులని రారమ్మని ఆహ్వానం పలుకుతున్నారు. మరోప్రపంచం పిలిచిందనీ, ఆ శక్తి ధరిత్రినిండా నిండిందని కాబట్టి ప్రభంజనం వలె హోరెత్తండీ అంటారు. భావవేగమున ప్రసరించండీ వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె పెళపెళ విరుచుకుపడండి అంటారు. అనుభూతి ప్రధానంగా సాగే ఈ గేయంలో హోరు అంటే వెంటనే సముద్రపు అలల చప్పుడు, పెళపెళ అనగానే పోటెత్తిన జనసముద్రం ఒక్కసారిగా ఆవేశం గట్టు తెగితే విరిగిపడిన శబ్దం వినిపిస్తాయి. పదండి అనగానే ముందుకు నడవటం, వేగంగా కదిలిన దృశ్యం కనిపిస్తాయి. ఉరకండీ అనగానే జనసమూహం ఉరుకులెత్తటం, ఆ ధ్వనీ స్ఫురిస్తాయి.

*ఎగిరి, ఎగిరి, ఎగిరి పడుతున్నవి*
*ఎనభై లక్షల మేరువులు*
*తిరిగి, తిరిగి, తిరిగి సముద్రాల్*
*జలప్రళయ నాట్యం చేస్తున్నవి*

ఉష్ణరక్తకాసారం లాంటి ప్రజాసమూహం దెబ్బకి మహా మేరుపర్వతాలే కూలిపోతున్నాయని సముద్రాలే నాట్యం చేస్తున్నాయని శ్రీశ్రీ వర్ణించారు. ఇది జలప్రళయం లాగానే ఉంది. వెంటనే జరిగే నూతన సృష్టి సామ్యవాద సమాజస్థాపన.

మరోప్రపంచపు కంచు నగారా విరామమెరుగక మ్రోగింది అని సోషలిస్టు శక్తుల జైత్రయాత్రని వెల్లడిస్తున్నారు. ధనుంజయునిలా సాగండి అనటం ధనాన్ని జయించిన సామ్యవాద విజయశక్తులని వివరిస్తోంది. ఎర్రబావుటా కమ్యూనిస్ట్ విజయపతాక

రెపరెపల్ని చూపిస్తోంది. అగ్నికిరీటం సామ్యవాదసమాజ పవిత్రతని, సదాశయాలని వివరిస్తోంది. హోమజ్వాలల భుగభుగలు జ్ఞానానికి, రష్యన్ విప్లవ కవుల ఉన్నతాదర్శాలకు గుర్తు.

జయభేరి గేయంలో శ్రీశ్రీ తనను తాను సామ్యవాద సమాజస్థాపనాశయంతో జరుగుతున్న మహాయజ్ఞంలో సమిధగా చెప్పుకున్నారు. మహాప్రళయం జగం నిండా ప్రగల్భిస్తుంది అని ప్రకటిస్తారు. తాను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చానని, విశ్వవృష్టికి అశ్రువొక్కటి ధారపోశానని చెపుతారు. నేను అనేది లోకకళ్యాణానికై బలిదానం చేసిన కార్మికుల ప్రతినిధిని గుర్తుచేస్తుంది. నవ్యసమాజంలో తాను ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తానని భావావేశంతో చెపుతారు.

నేను సైతం
విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను
నేను సైతం
భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను

నూతన సమాజానికి తనవంతు సేవలనందిస్తాననే వాగ్దానం పై పదాల్లో అంతర్లీనంగా ఉంది. సామ్యవాద సమాజం ఏర్పడితే దాని వేడుకలలో తాను ఉత్సాహంగా పాల్గొంటానని, విశ్వమంతా ఒక్కటైతే తనకు సంబరమనీ శ్రీశ్రీ భావన.

వాడు అన్న గేయంలో కూడా ధనికవర్గాల ద్వంద్వనీతులని శ్రీశ్రీ పరిహాసం చేసారు. భౌతికవాద దృష్టితో కర్మసిద్ధాంత పునాదిని ముక్కలు చేసేందుకు ప్రయత్నించాడు. అందరం కలిసిచేసిన ఈ అందమైన వస్తుసముదాయాన్ని ఎవడో ఒక్కడే అనుభవించటాన్ని తప్పుపట్టారు. సంపద సమిష్టిదని అందరూ సమానంగా దాన్ని అనుభవించాలని సామ్యవాద సిద్ధాంతాలు చెపుతాయి. ఒక్కడే దాన్ని మొత్తం అనుభవించటాన్ని అన్యాయం అంటే అనుభవించాలి మీ కర్మం అని వాడు అంటాడు. ఇలా కర్మ పేరు చెప్పి కడుపుకొట్టే విధానాలను కవి విమర్శిస్తున్నారు.

పొద్దుపొడిచి పొద్దు గడిచేదాకా
ఎద్దుల్లాగు పనిచేసే మమ్మల్ని
మొద్దుల్నీ మొరటుల్నీ చేసి
ముద్దకి కూడా దూరం చేశాడు

శ్రమజీవులు పగలూరాత్రి అన్న తేడా లేకుండా కాయకష్టం చేసుకునేవారు. వాళ్ళకి విద్యావకాశాలు లేక అలా మొద్దుగా తయారయ్యారు. దారుణం అని అంటే ఆచారమనీ, అడుగుదాటరాదనీ అగ్రవర్ణాలవారు అంటారు. చివరగా కడుపుమంటలు భరించలేక తెగించి సమ్మెకి సిద్ధపడితే నోరుమూసి, జోడు తీసి కొట్టి దౌర్జన్యానికి

దౌర్జన్యమే మందు అని పెత్తందార్లు అంటారు. ఇలా అన్నిచోట్లా కష్టజీవులపై సాగుతున్న దౌర్జన్యకాండలను శ్రీశ్రీ ఎదుర్కొంటున్నారు.

ఉన్మాది గేయంలో బొమికలన్నీ ప్రోవుపట్టిన కుర్రవాడు - వెర్రివాడు నాయకుడు. కాగితం వలే పలుచబారిన కుర్రవాడా అన్న సంబోధనంలో విద్యావకాశాలను దూరం చేసిన సమాజ రీతి కనిపిస్తోంది. అతను వీధికంతకు వెక్కిరింతగా, దిష్టిబొమ్మగా, తూము పక్కన ధూళిలోన తూలుతున్నాడనటం దుర్భరదారిద్ర్యంలో ఉన్నాడని చెపుతోంది. అతని వెకిలిచూపూ, తీసే కూనిరాగం మాకు తెలియని నీ ప్రపంచపు మహారణ్యపు చిక్కుదారులు అని శ్రీశ్రీ వర్ణించారు. సంఘక్రౌర్యానికి బలైపోయాడని క్షమిస్తావా, సహిస్తావా బుద్ధిమంతులు నీకు చేసిన దురన్యాయాన్ని అనటం తెలుపుతోంది.

*వెర్రివాడా! కుర్రవాడా!*
*నిన్ను చూసీ చూడనట్లే*
*తెలివిమీరిన పెద్దమనుషులు*
*తొలగిపోతారు.*

అతనికి జరిగిన అన్యాయాన్ని ప్రశ్నించి అట్లు చూడకు, మమ్ము వేళాకోళమాడకు అని సంఘం తరఫున వేడుకుంటాడు. ఈ ఉన్మాది డబ్బు పిచ్చిపట్టిన వ్యక్తుల చర్యల మూలాన ఆ విధంగా అయినవాడు.

శైశవగీతి బాల్యం గురించిన అపురూపగీతం. ఈ గేయంలో పాపం, పుణ్యం ప్రపంచమార్గం ఏమీ ఎరుగని అయిదారేడుల పాపలని శ్రీశ్రీ సంబోధించాడు. ప్రకృతిలోని చిన్నచిన్న విషయాలే వీరిని అమితంగా ఆకర్షించే విషయాలు. కల్లాకపటం తెలీని లేత వయసులో ఈలలు వేస్తూ ఎగిరిపోయే పిట్టల్లారా అని అమాయక చిన్నారులని ఉద్దేశించి అంటారు.

*మెరుపు మెరిస్తే*
*వాన కురిస్తే*
*ఆకసమున హరివిల్లు విరిస్తే*
*అవి మీకే అని ఆనందించే*
*కూనల్లారా!*

పోయిన బాల్యపు చెరిగిన పదముల చిహ్నాలకోసం ఉద్దేశించిన ఈ గేయం శ్రీశ్రీ భావుకతని వివరిస్తోంది. విశ్వరూపమున విహరిస్తుండే పరమాత్మలు అంటూ చిన్నపిల్లలని పరవశంతో పిలుస్తారు శ్రీశ్రీ. శ్రీశ్రీ బోసినవ్వుల పసివారిలో పరమాత్మని దర్శించిన పుణ్యాత్ముడు. వీరికోసమే ప్రకృతిలో వివిధ ఋతువులు దాగుడుమూతల క్రీడలాడుతవని చెపుతారు. ఇక్కడ ప్రయోగించిన కంచు వృషభముల అగ్నిశ్వాసం కక్కే గ్రీష్మం అన్న పదం విలక్షణమైంది. ఎండాకాలంలోని వేడికి కంచు బాగా కాగుతుంది. వృషభాలనోటినుంచి వెడలే శ్వాస చాలా వేడిగా ఉండటం ఇక్కడ తెలుస్తోంది.

ఒకరాత్రి అన్న గేయంలో శ్రీశ్రీగారి భావనాశక్తి విరాట్స్వరూపాన్ని చూడవచ్చు. బహుళపంచమినాటి వెన్నెల గగనమంతా నిండి, పొగలాగ క్రమ్మి కవిని భయపెట్టింది. జ్యోత్స్న హృదయాహ్లాదంగా ఉంటుంది. కానీ భయంకలిగించటానికి కారణం - పొగ లాంటి వెన్నెల భూమిమీది కర్మాగారాలు సృష్టించే పొగలను గుర్తు చేస్తున్నాయి. ఆకాశపు ఎడారి అంతటా ఇసుక తుఫాను చెలరేగిందట. గాలిలో కానరాని గడుసుదయ్యాలు ఈదుతున్నాయని కవి వర్ణన.

ఇటువంటి భయానకవర్ణన శ్రీశ్రీ కే చెల్లింది. ఈ స్థితిలో కొండ కరికళేబరములా కన్పించింది అనటం ఒక చక్కని ప్రయోగం. కళేబరం అనటంతో తిరిగి భయానక రసం సూచితం. అప్పుడు ఆకాశంలోని చంద్రబింబం ఆహ్లాదంగా లేక-

*ఆకాశపుటెడారిలో కాళ్ళుతెగిన*
*ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి*

విశ్వమంతా నిండి వెలిబూదిలాగా బహుళపంచమి రాత్రి వెన్నెల కవిని భయపెట్టింది.

గంటలు గేయం పో గేయానికి అనువాదం కాకపోయినా ఆ కవి ప్రభావం కొంతమేరకు కన్పిస్తుంది. అన్ని ప్రాంతాల్లోనూ, అన్ని కాలాల్లోనూ మ్రోగే గంటల శబ్దం ప్రాణము మోగే ప్రతిస్థలములో నీ హృదయములో, నా హృదయములో మార్మోగ్రుతున్నాయని శ్రీశ్రీ చెప్పారు. ఈ గేయంలో పదాలను మార్చిమార్చి ప్రయోగించటంతో గంటలు మ్రోగుతున్న శబ్దాలు, ఆ ధ్వనులు ప్రతిధ్వనించటం మొదలైనవన్నీ వినిపిస్తాయి.

*గంటలు: గంటలు: గంటలు: గంటలు:*
*గంటలు: గంటలు: గంటలు: గంటలు:*
*గణగణ గణగణ గంటలు: గంటలు*
*గణగణ గంటలు:*
*గంటలు: గంటలు:*

మొదటి పాదంలో గంటలు అన్న పదాన్ని నిర్దిష్ట విరామం తర్వాత ఉచ్చరిస్తే అవి మ్రోగుతున్న ధ్వని చెవిని చేరుతుంది. గణగణ అన్నప్పుడు ఆ శబ్దం ఎక్కువకావటం తెలుస్తోంది. శబ్దాలను ఉపయోగించుకోవటంలో శ్రీశ్రీ నేర్పు చాలా ప్రశంసనీయమైంది.

స్విన్‌బర్న్ అంటే శ్రీశ్రీకి చాలా ప్రేమ. అతని పాటలు విషం కక్కే భుజంగాలో, కదం తొక్కే తురంగాలో, మదం పట్టిన మాతంగాలో అని అంటారు. ఇవన్నీ వేగాన్ని సూచిస్తున్నాయి. షెల్లీ కవనపు హల్లీసకము, ఫ్రెంచి గీతుల మంచి రీతులు మోహినీ గంధర్వగానం లాంటిదని అతని కవిత్వాన్ని శ్లాఘిస్తాడు. అతనితో ఎంతో ఆత్మీయంగా మాట్లాడుతూ అతని కవితాగానంలో సర్వం మర్చిపోయి, కరిగిపోయానని చెపుతాడు.

కవీ: నీ గళగళన్మంగళ
కళా కాహళ హళాహళిలో
కలిసిపోతిని కరిగిపోతిని
కానరాకే కదిలిపోతిని

అంత్యప్రాసలను ప్రయోగించటంలో, ఆదిప్రాసని వాడటంలో శ్రీశ్రీది చాలా గొప్పవిధానం. గేయ ఛ్ఛందస్సున నవ్యభావాలని ప్రకటించటంలోనే శ్రీశ్రీ శబ్దశక్తి గోచరమవుతోంది. పై పదంలో 'ళ' శబ్దం వెంటవెంటనే రావటంతో శ్రావ్యత ఏర్పడింది.

శ్రీశ్రీ అంత్యప్రాస ప్రయోగదక్షత 'నా విసరిన రస విస్మమర కుసుమ పరాగం, 'దారుణమానవదానవభాషలు', 'సఖులవలన పరిచ్యుతులు జనుల వలన తిరస్కృతు'లు లాంటి అనేక చోట్ల కన్పిస్తుంది. శ్రీశ్రీకి శబ్దం పట్ల ప్రీతి అధికం అని చెప్పటానికి 'సంచరిస్తూ, సంచరిస్తూ' లాంటి జంటపదాలను ప్రయోగించటాన్ని చెప్పవచ్చు. శ్రీశ్రీగారి మాత్రాఛందస్సులని నిశితంగా పరిశీలిస్తే తెలుగు కావ్యాల్లోని ముఖ్యంగా అశ్వాసాంత పద్యాల్లోని తోటకము, పృధ్వి, మాలిని, కవిరాజ విరాజితము మొదలైన వృత్తాల ప్రభావము కన్పిస్తుంది.

గేయరచనా విధానంలో శ్రీశ్రీది నూతనమార్గం. వచన గేయాలకి భావోద్వేగాన్ని, అక్షర రమ్యతను సాధించిన విధానం చాలా కొత్తది. అనేకచోట్ల విరామచిహ్నాలు కూడా భావానికి ప్రాణం పోస్తాయి. 'ఆ' అన్న గేయంలో మూడుమూడు పాదములు ఒక భాగంగా, ప్రత్యేక విధానంలో కన్పిస్తాయి. నిప్పులు చిమ్ముకుంటూ అని మొదలయ్యే మొదటిభాగం వీరు అని విరామచిహ్నంతో అంతమవుతుంది. రెండోపాదం నెత్తురు క్రక్కుకుంటూ అని మొదలయి వీరె... అని వ్యంగ్యాన్ని సూచిస్తూ ముగుస్తుంది.

మానవుడా అన్న గేయంలో సంబోధనా ప్రథమ విభక్తులను వాడి ఒక విధమైన చమత్కారాన్ని సాధించారు. మానవుని మంచిగురించి మాట్లాడుతూ రసైకజీవీ! కవీ! లాంటి సంబోధనల్ని ఉపయోగించి అలానే ఖైదీ! రౌడీ! లాంటి సంబోధనల్ని అతనిలోని చెడుగురించి సూచించటానికి వాడి వాక్యవిన్యాసాన్ని సాధించాడు.

కవితా ఓ కవితా అన్న గేయంలో తన నాడుల తీగలపై సాగిన నాదబ్రహ్మపు పరిచుంబనలో సుఖదుఃఖాతిక ద్వంద్వాతీతం గురించి వివరించాడు. బ్రహ్మానుభవం కలిగించిన నను కరిగించిన కవనఘృణీ! రమణీ! అని కవితను సంబోధిస్తాడు. వైదిక సంప్రదాయాన్ని జీర్ణించుకొని అనంతమైన విప్లవచైతన్యానికి తాను కూడా ప్రతినిధినని జయభేరిలో చెప్పారు. అద్వైతంలోని చాలా పంక్తులు శ్రీశ్రీపై పడిన సంప్రదాయముద్రని వివరిస్తాయి. ఈ గేయంలో స్విన్‌బర్న్ కవి ప్రభావం కన్పిస్తుంది. నీ కంకణ నిక్వాణంలో, నా జీవన నిర్వాణంలో– అనటం అలానే 'నీ మోవికి కావిని నేనై నా భావికి దేవివి నీవై' అనటం దీన్ని నిరూపిస్తున్నాయి.

నీడలు అన్న గేయంలో చూడు, చూడు నీడలు అనటం కూడా సంబోధనతో ఉత్సుకత కలిగిస్తున్నాయి. నరనరాల వేదనలో, తరతరాల రోదనలో బక్క చిక్కి, బిక్క చచ్చి అన్న మాటలు దగాపడిన పేదల జీవితాలని కళ్ళకు కడుతున్నాయి. ఈ

గేయంలోని ప్రతిభాగం ముందూ చూడు చూడు అనటంతో వస్తుసాక్షాత్కారం కలుగుతోంది.

కళారవి గేయంలో పోనీ పోనీ లాంటి క్రియపదాలని వెంట వెంటనే ప్రయోగించటం వల్ల ఒక చక్కని సౌష్టవం ఏర్పడుతోంది.రానీ, రానీ కానీ, కానీ అనే చిన్న పదాలని తిప్పితిప్పి ప్రయోగించటం వల్ల రచనకి చమత్కారం ఏర్పడింది.

నిజంగానే అనే గేయంలో కూడా ప్రతిపదం వెనక నిజంగానే అని ప్రశ్నించటం వల్ల చమత్కారం ఏర్పడుతోంది. ఇలా ప్రశ్నలు వేసి చదువరులలో ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని కల్గించటం శ్రీశ్రీ కళాశక్తిని చూపిస్తోంది. చేదుపాటలో కూడా ఔను నిజం ఔను నిజం అనటం ఆ వెంటనే లేదు సుఖం అనటం ఆ తర్వాత అనేక ప్రశ్నలు వేయటం తిరిగి నిజం సుమీ అనటం ఒక విధమైన ఆలోచనని చదువరులలో కల్గిస్తోంది.

చేదు విషం జీవ ఫలం
జీవ ఫలం చేదు విషం

చివరగా తన కవితా దృక్పథాన్ని వెల్లడించాడు.

శ్రీశ్రీ కవితలు తెలుగువారి గుండెల్లో ప్రతిధ్వనిస్తాయి. శ్రీశ్రీ సామ్యవాదసమాజం ఏర్పడుతుందని ముందుగానే గ్రహించి దానికి స్వాగతమిచ్చిన వైతాళికుడు. కవిత్వాన్ని ప్రజల కష్టాలుతీర్చే సాధనంగా మార్చి, వారి కష్టాలకు స్పందించి రచనలు చేసిన శ్రీశ్రీగారు దిక్కులేని వాళ్ళ గుండెల్లో దీపంలాగా నిలిచిపోయాడు. సంప్రదాయాన్ని పునాదిగా చేసుకొని తన ప్రతిభావ్యుత్పత్తులతో తెలుగుసాహితీ భవనాన్ని సుందరంగా తీర్చిదిద్దాడు. వేలాదిమంది శ్రీశ్రీ కవితానదిలో రసానందం అనుభవించి సమాజంలో వారి బాధ్యతని తెలుసుకున్నారు. మహాప్రస్థానం గేయాలు ప్రబోధ కవిత్వము అవుతాయి. ఇవి నిస్సందేహంగా అభ్యుదయవాదులందరికీ ఆసరాగా ఉండి నూతనసామాజిక మార్గాలను అన్వేషించేవారికి ప్రేరణాత్మకంగా నిల్చిపోతాయి. శ్రీశ్రీ ఆధునిక తెలుగు సాహిత్యానికి చేసిన సేవ చిరస్మరణీయమైంది. ఆయన తెలుగువారందరికీ గురుతుల్యుడు.

## వివరణలు:

1. డా॥ సి.నారాయణరెడ్డి - ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగాలు (పేజీ: 510) - లో 'ప్రభవ'లోని కవితా ఖండికలను పరిశీలించినచో శ్రీశ్రీ భావకవిత్వ ధోరణి స్పష్టముగా బోధపడును అని అన్నారు.
2. ధనంజయుడు తన దశరూపకములో ఈ విధంగా పేర్కొన్నారు:
   "రమ్యం జుగుప్సిత ముదార మధాపినీచం
   ఉగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు
   యద్వాప్యవస్తు కవి భావ క భావ్యమానం
   తన్నాస్తి యన్న రసభావ ముపైతిలోకే"

3. మార్క్సు గతితార్కిక భౌతికవాదములో మూడు సూత్రాలను ప్రతిపాదించాడు. అవి (1) పరస్పర విరుద్ధ శక్తుల మధ్య సంఘర్షణ (2) విరోధ వైరుధ్యము (3) పరిమాణము గుణముగా మారటం.

4. ఇంగ్లీష్ కవి మేస్‌ఫీల్డ్ ఈ విధంగా అంటారు:
*"The sailor, the stoker of steamers, the man with the clout"*

5. రష్యన్ రచయిత మక్సింగోర్కీ అభిప్రాయంలో శ్రామికుడే అన్ని రచనలలోనూ 'నాయకుడు' కావాలి.

   "We must make labour the principal hero of our books i.e.: Man as organized by labour process"

6. యుద్ధోన్మాది హిట్లర్ గోబెల్ అనే పేరుగల వ్యక్తిని సామ్యవాద శక్తులపై ఆధారాలతో నిమిత్తంలేని అపవాదులు మోపటానికి, వారిని విమర్శించటానికి నియమించాడు.

7. కనకదుర్గ జారీనా అలెగ్జాండ్రాకి, చండసింహం మతగురువు రెస్పూటిన్‌కి, ఇంద్రుడు జార్ నికోలాస్ - 2 కి సంకేతాలుగా పలువురు భాష్యం చెప్పారు. ఆదిసూకర వేదవేద్యుడు వర్గ సంఘర్షణలో జన్మించిన కార్మిక నాయకునికి సంకేతం.

8. రాబర్ట్ ఫ్రాస్ట్ తన గేయం The Road not taken లో ఈ విధంగా అన్నారు.
   I have choosen the one less travelled by
   And that made all the difference
   తాను ఎంచుకున్న మార్గం వల్లే తనది అనితరసాధ్యమైన మార్గం అయిందని శ్రీశ్రీ భావన. తేడా అంతా తాను ఎంచుకున్న మార్గం వల్లే ఏర్పడిందని ఫ్రాస్ట్ అంటారు.

9. రవీంద్రుని గీతం 'ఝరఝరబరిషే బారిధారా' లోని కొన్ని పంక్తుల ప్రభావం బాటసారి గేయంపై పడినట్లు అనిపిస్తుంది.
   రవీంద్రుని గేయం ఈ విధంగా సాగింది
   "ceaseless is the welter of rain that wearies the sky. Alas for the forsaken. Alas for the homeless wanderer. The shrieks of the wind die away in sobs and sighs"

10. ఆదిశంకరాచార్యులవారి భజగోవిందం గేయము ప్రభావంతోనే తన ఛందోరీతి సాగిందని శ్రీశ్రీ స్వయంగా చెప్పారు.

    *భజగోవిందం భజగోవిందం*
    *గోవిందం భజ మూఢమతే*

# గురజాడ అప్పారావు

తెలుగుసాహిత్యంలో ఆదికవి నన్నయ తెచ్చిన మార్పు తర్వాత గురజాడ అప్పారావు తెచ్చిన మార్పు చాలా ముఖ్యమైనది. యదార్థ జీవితాన్ని ప్రతిబింబిస్తూ, పురోగతికి దారి చూపుతూ, విస్తృత ప్రజానీకంతో పెనవేసుకొని ఉండేటట్లుగా వాడుకభాషలో రచనలు చేయటం ద్వారా గురజాడ ఈ మార్పు తెచ్చారు. వీరు వెంకటరామదాసు, కౌశలమ్మ పుణ్యదంపతులకు 1862లో జన్మించారు. విశాఖజిల్లాలో జన్మించిన గురజాడ బాల్యం పేదరికంలోనే సాగింది. గిడుగు రామమూర్తితో చిన్ననాటి నుంచీ ప్రాణస్నేహం. విజయనగరం మహారాజ కాలేజీ హైస్కూల్‌లో ఉపాధ్యాయ పదవిని చేపట్టారు. లెక్చరరుగా పనిచేస్తూ ఇంగ్లీష్, వ్యాకరణం, సంస్కృత సారస్వతం, తర్జుమా, గ్రీక్, రోమన్ చరిత్రలు బోధించేవారు.

1892లో కన్యాశుల్కం మొదటి కూర్పుని ప్రదర్శించారు. 1897లో కన్యాశుల్కం తొలికూర్పుని ప్రభువైన ఆనంద గజపతిరాజుకి అంకితం చేసారు. వాడుక భాష వ్యాపించటానికి కన్యాశుల్కం అంకురార్పణ చేసింది. పండిత పామరులందరినీ ఈ నాటకం ఆనందింపచేసి, ఆలోచింపచేసింది. ఈనాటికీ ఈ నాటకం ఆకర్షణ చెక్కు చెదరలేదు.

కొండు భట్టీయం, నీలగిరి పాటలు, కాసులు, ముత్యాలసరాలు, లవణరాజు కల, కన్యక, బిల్హణీయం, దించులంగరు, లంగరెత్తుము మొదలైన రచనలు చేసారు. కథలను రాయటం తెలుగులో మొట్టమెదటగా వీరితోనే ప్రారంభమైంది. వీరి రచనలన్నింటిలోనూ ఆధునిక ధోరణులు, ప్రగతి చింతన, మానవతావాదం కనిపిస్తాయి.

చెప్పేదాన్ని చేసిచూపించిన ఆదర్శమూర్తి గురజాడ. సకల కులాలవారితోనూ సహపంక్తి భోజనం చేసారు. 1914లో మద్రాసు విశ్వవిద్యాలయం పాఠ్యక్రమంలో వాడుకభాషను చేర్చరాదన్న నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ రాజీనామా చేసారు.

సాహిత్యం సమాజ రుగ్మతలకు చికిత్సవంటిదని ప్రగాఢంగా విశ్వసించారు. తన రచనల ద్వారా ఆశించిన అభ్యుదయాన్ని సాధించారు.

మాతృభాషాభిమాని గురజాడ భావప్రకటనలో దానికి ఉన్న అపార అవకాశాల్ని గ్రహించి తన రచనల్లో పూర్తిగా వినియోగించుకున్నారు. ఒక భాషోద్యమాన్ని, సాహిత్యోద్యమాన్ని ప్రారంభించిన 'కన్యాశుల్కం' ఆధునిక తెలుగు సాహిత్యానికి పర్యాయపదం అనటం – అతిశయోక్తి కాదు.

1915 నవంబరు 30 నాడు ఈ లోకాన్ని వీడిన గురజాడ ప్రభావం ఈనాటికీ కొనసాగుతోంది. భౌతికంగా మహాకవి లేకున్నా వారి ఆదర్శాలు రచనల్లోనుంచి సమాజం మీద ప్రసరించి మంచిని పెంచుతున్నాయి. గురజాడ అప్పారావుగారు చిరస్మరణీయులు.

## 23. కన్యాశుల్కం - మానవ సంబంధాల చిత్రీకరణ

గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం నాటకం తెలుగుసాహిత్యంలో చాలా పేరుపొందిన నాటకం. సమాజాన్ని విశ్లేషించిన విధానాన్ని ఆధారంగా చేసుకుంటే ఈ నాటకం అధునిక కాలంలో అత్యుత్తమమైందని అర్థం అవుతుంది. వివిధ వృత్తులు చేసుకుంటూ జీవనం సాగిస్తున్న అనేకమందిని గురించి వివరించటం ద్వారా నాటకకర్త సమాజస్వభావాన్ని కళ్ళకు కట్టినట్లుగా చిత్రించగలిగారు. ఈ చిత్రణ వెనక మానవసంబంధాల గురించిన అవగాహన, ఆలోచన కనిపిస్తాయి. వ్యక్తులు ఒకరినొకరు ఎలా ఉపయోగించుకోవాలనుకుంటారో, తమ స్వార్థం కోసం ఇతరుల జీవితాలను ఎలా బలిచేస్తారో 'కన్యాశుల్కం' వివరిస్తుంది. చదువుపేరుతో శిష్యులని స్వకార్యాలకు వినియోగించుకునే గురువులు, దావాల పేరుతో ఆస్తులను అమ్ముకుంటూ వంచనకి పాల్పడుతూ బతికే కోర్టుపక్షులు, ఆచారాల పేరిట బిడ్డల జీవితాలను నాశనం చేసే తల్లిదండ్రులు, హ్రస్వదృష్టితో ఆలోచించే సంస్కర్తలు....: వీరి చుట్టూ అల్లిన ఈ నాటకంలోని పాత్రలన్నీ వాస్తవజీవితంలోని వ్యక్తులుగానే కనిపిస్తాయి. కొంతమంది విమర్శకులు అందుకే కన్యాశుల్క నాటకాన్ని జీవితం అంత గొప్పదానిగా గుర్తిస్తారు.

మనదేశంలో అనాదిగా ప్రేమకీ, బాంధవ్యానికి ప్రాధాన్యతని ఇస్తూ వచ్చారు. పల్లెటూళ్ళలో ప్రజలందరూ దేనికీ లోటులేకుండా సుఖంగా జీవించేవారు. కానీ బ్రిటీష్‌పాలన పుణ్యమా అని పల్లెటూళ్ళ స్వయం సమృద్ధ అర్థికవ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. వలసపాలకులు వారి అవసరాల కోసమే ఇంగ్లీష్ విద్యాబోధనని, వారి వస్తువులని అమ్ముకోవటానికి ప్రజలకి అలవాటు చేయటానికే పెట్టుబడిదారీ విధానాన్ని ప్రవేశపెట్టారు. వస్తు సంస్కృతి పెరిగి వ్యక్తులకన్నా వస్తువులకే ప్రాధాన్యత నివ్వటం మొదలయింది. కాళిదాసుకి తెలియని వడ్డీ, వాశీ కట్టటం ప్రజలకి బాగా అబ్బింది. స్వీయ సంస్కృతిని హీనంగా చూడటం, విదేశీ సంస్కృతికి దాస్యం చేయటం గొప్పవిషయం అయింది. చీటికీ మాటికీ జగడాలాడటం, పెరటిగోడల కోసం కూడా దావాలు వేయటం సాధారణమైంది. ఇటువంటి పరిస్థితుల్లో మానవ సంబంధాలు క్షీణించటం సహజం. విలువల గురించిన ఆలోచనలు లుప్తం అవుతాయి. అందుకే నాటకకర్త వీటినన్నింటినీ తన నాటకంలో పొందుపరిచాడు.

జీవితమే ఒక నాటకరంగం అనుకుంటే ఆ నాటకాన్ని ఈ రచయిత ఒక సూత్రధారిగా నడిపించాడు.[1] నాటకంలోని పాత్రలన్నీ ప్రతీకాత్మకమైనవే. ఇది కన్యాశుల్క నాటక నిర్మాణంలోని విధానం. వ్యక్తిలోని అంతఃశత్రువులు అతని యుక్తాయుక్తవిచక్షణ కోల్పోయేటట్లు చేస్తాయి. దీని ద్వారా రచయిత మానవసంబంధాల ప్రాధాన్యతని వివరించాడు. అంటే వ్యక్తి అంతరాత్మ ప్రబోధాన్ని విస్మరించి ప్రవర్తించటాన్ని ఎప్పుడైతే ప్రారంభిస్తాడో అప్పుడే నైతికత నశిస్తుంది. సాటిమానవుడిని అవమానించటం, అమానుషంగా ప్రవర్తించటంతో మొదలుపెట్టి అతని జీవితాన్ని ఏ విధంగా తమ అభివృద్ధికి సోపానంగా చేసుకోవాలో అనే ఆలోచనలు వ్యక్తి చేస్తాడు. దీనివల్ల మానవజాతిలో సమభావం, సౌభ్రాతృత్వం అనేవే పోయి వంచన, దోపిడీ,

స్వార్థం స్వైర విహారం చేస్తాయి. మొత్తం సమాజమే దిగజారి, మానవత మృగ్యమై భ్రష్టుపడుతుంది. ఈ పరిస్థితులన్నింటినీ బయటికి తేవాలని, సాహిత్యం ద్వారా ఆదర్శ సమాజ నిర్మాణానికి తనవంతు కృషి చేయాలని గురజాడ ప్రయత్నించారు.

మధురవాణి పాత్రను వ్యక్తిలోని అంతరాత్మకు సంకేతంగా, గిరీశం పాత్రను వ్యక్తిలోని అంతఃశత్రువులకు ఉదాహరణగా భావించి విశ్లేషిస్తే ఈ నాటకం వ్యక్తిత్వ నిర్మాణానికి ఉపయోగపడుతుందని తెలుస్తుంది. నాటకంలో ప్రతి ఒక్కరూ మధురవాణిని ఉపయోగించుకుందామని ప్రయత్నించినవారే. అంటే వ్యక్తిలోని వివిధ ప్రవృత్తులు, ప్రలోభాలు అంతరాత్మని ఖాతరు చెయ్యకుండా, పైపెచ్చు దాన్ని మోసం చేయటానికి, చంపుకోవటానికి చూస్తాయి. వ్యక్తి తాను చేసే అనేక పనులను ఏదో విధంగా సమర్థించుకోవాలని చూసే విషయంగా అంతరాత్మని తనకు అనువైన రీతిలో మలచుకుందామనుకుంటాడు. నిజానికి ఇది అంతరాత్మను స్వార్థప్రయోజనాలకి బలిచేయటమే.

సౌజన్యారావు పంతులులాంటి వాళ్ళు ఈ నాటకంలో ప్రతీకాత్మకంగా చూస్తే మనిషిలోని సౌజన్యానికి, సంస్కారానికి గుర్తు. కానీ అంతఃశత్రువులు సంస్కారాన్ని, మంచితనాన్ని కూడా మోసంచేస్తాయి, పక్కదారి పట్టిస్తాయి. ఈ నాటకంలో గిరీశం చివరికి సౌజన్యారావు పంతులునే బోల్తా కొట్టించాలని ప్రయత్నిస్తాడు. ఆదర్శాల కొలబద్దలతో జీవితాన్ని పరిగణిస్తూ అపరిపక్వత కారణంగా సమగ్ర దృక్పథాన్ని ఏర్పరచుకోలేకపోయిన సంస్కారానికి దారి చూపి, కావల్సిన ఆలోచనా విధానాన్ని ఏర్పరచటం అంతరాత్మ చేయగలిగిన పని. నాటకంలో సౌజన్యారావు పంతులు కూడా తనకున్న హ్రస్వ దృష్టిని మధురవాణి ప్రబోధం ద్వారానే పోగొట్టుకుంటాడు.

మనుషుల మధ్య మమతానురాగాలు వృద్ధి చెందాలంటే, చక్కని మానవ సంబంధాలు ఏర్పడాలంటే దానికోసం మొదటగా ప్రతివ్యక్తి అంతరాత్మ (Conscience) ప్రబోధాన్ని మన్నించాలి. అంతః శత్రువులని జయించాలి. అప్పారావుగారు దాన్ని తన నాటకంలో సూచించారు.

కథాపరంగా చూస్తే ఈ నాటకంలో అనేక విషయాలు కనిపిస్తాయి. ఆనాటి సమాజంలోని వివిధ లోపాల్ని కన్యాశుల్కం బహిర్గతపరిచింది.[2] బాల్యవివాహాలు ఆనాటి సమాజ రుగ్మత. ఈ విషయంపై ప్రజాభిప్రాయాన్ని ఉద్దీప్తం చేసేందుకు నాటకకర్త ప్రయత్నించారు.

వేశ్యా సమస్య ఆనాటి మరో ప్రధాన విషయం. ఆనాటి సమాజంలో కొందరు సంస్కర్తలు వేశ్యలపై అసమంజసమైన రీతిలో వ్యతిరేకత పెంచుకుని ఉండేవారు తప్ప సమస్యకు మూలకారణం తెలుసుకుని నడిచేవారు కారు. ఆ వృత్తిలో మగ్గిపోతూ, గత్యంతరంలేక హైన్యమైన జీవితాలని గడిపేవారిని అర్థం చేసుకొని వారి పరిస్థితులని మెరుగుపరచటానికి ఎవరూ ప్రయత్నించేవారు కాదు. వీటినన్నింటినీ గురజాడ కలం వెలుగులోకి తెచ్చింది.

నాటకంలో రామప్పంతులు అనే పాత్ర అయిదునిమిషాల్లో కొత్త జాతకం బనాయించగల సమర్థుడు. మైనార్టీ తీరిన పిల్లవాడిని మైనరని వాదించగలడు.

'పాపపుసొమ్ము మా దగ్గరకి రాగానే పవిత్రమైపోతుంది' అంటూ ఎటువంటి విషయంలోనైనా గ్రంథం నడిపించగలడు. వాళ్ళకీ వీళ్ళకీ జుట్టు ముళ్ళేసి జీవనం సాగిస్తుంటాడు. తాను నియోగి ప్రభువునని ఇతని నమ్మకం. రామప్పంతులు కరటకశాస్త్రితో మాట్లాడుతూ "యీ యింగిలీషు చదువులు లావైన కొద్దీ వైదీకులే అన్నమాటేవిటి అడ్డమైన జాతుల వాళ్ళకీ ఉద్యోగాలవుతున్నాయిగానీ, మా లౌక్యం మాతో స్వతహాగా పుట్టినది. మీరు తెచ్చిపెట్టుకున్నది" అంటాడు. పంతులు మధురవాణిని ఉంచుకుంటాడు. ఆమెని అనేక విధాలుగా కట్టడి చేస్తుంటాడు. శిష్యుడికి ఆడపిల్ల వేషం వేసి లుబ్ధావధాన్లకి తన అమ్మాయిని అమ్ముకుంటానని, ఆ పెళ్ళి విషయంలో సాయం చేయమని కరటకశాస్త్రి రామప్పంతులుని అడుగుతాడు. దీనికి అంగీకరించిన పంతులు ఏ పని చేయటానికైనా తాను వెనుదీయనని నిరూపిస్తాడు.

ఇంగ్లీష్ చదువులంటే పంతులుకీ ఇష్టమే. 'నేనే చిన్నతనంలో యింగిలీషు చదివి వుంటే జడ్జీల ఎదట ఫెళఫెళ లాడించుదును. నాకు వాక్ స్థానమందు బృహస్పతి వున్నాడు. అందుచాతనే యింగిలీషు రాకపోయినా నా ప్రభ యిలా వెలుగుతుంది' అంటాడు. తనకు ఇంగిలీషు వస్తే దొరసాన్లు వెంట పరిగెత్తుతారని అనుకుంటాడు.

దొంగసాక్ష్యాలు చెప్పటం, కోర్టు పనులంటూ వాళ్ళనీ వీళ్ళనీ బెదిరించటం, అధికార్ల పేరు చెప్పి వేరే వాళ్ళ దగ్గర డబ్బు కొట్టేయటం మొదలైన వాటినన్నింటిలోనూ పంతులు ఆరితేరినవాడు.

అగ్నిహోత్రావధాన్ల సంబంధాన్ని తప్పించటానికి పంతులు ఒక ఆకాశరామన్న ఉత్తరాన్ని రాస్తాడు. డబ్బు కోసం ఏ గడ్డి తినటానికైనా ఇతను సిద్ధమే. లుబ్ధావధాన్ల కూతురు విధవరాలైన మీనాక్షిని అనేక విధాలుగా ఉపయోగించుకుంటూ ఉంటాడు. మీనాక్షితో ఇతనికి అక్రమసంబంధం ఉంటుంది. మధురవాణి పంతులుతో మాట్లాడుతూ 'ద్రవ్యాకర్షణ యలాగో నాకు బోధపడ్డది. పెళ్లికూతుర్ని యిలాకా చేసుకొని, దాంద్వారా ముసలాడి మూటా ముల్లూ లాగేస్తారు" అంటుంది.

ఇతనికీ తన వ్యర్థమైన జీవితం గురించి హేయమైన నడవడిక గురించీ తెలుసు. "నేను పిత్రార్జితం అంతా కరరావుడు చుట్టేశాను. యిక పరానికా? నేను శాక్తేయుణ్ణి; యోగసాధనం చేస్తాను"... అని ఏడుపు గొంతుతో అవధాన్లతో అంటాడు.

దొంగసాక్ష్యాలను చెప్పించటంలోనూ పంతులుదే ప్రథమస్థానం. 'ఉర్లాం బసవరాజుగారి సంభావన్లరేటే సాక్ష్యాలక్కూడా గేజటార్డర్ చేశాం. కుండలాలు వేసుకున్నవారికి ఒక రూపాయి జాస్తా' అని శాస్త్రులతో చెపుతాడు. లుబ్ధావధాన్లకి సంబంధం కుదర్చటం కోసం సిద్ధాంతిని దువ్వి, అతని జాతకంలో పెళ్ళి చేసుకుంటే విశేషంగా ధనం లభిస్తుందని బనాయిస్తాడు. పెళ్ళికి సప్లై కోసం పోలిసెట్టిని పెడదామనుకుంటాడు. ప్రతి పనిలోనూ ఇతనికి ద్రవ్యాకర్షణే. ప్రతివారిని ఏదో విధంగా ఉపయోగించుకోవాలనుకోవటం ఇతని ప్రవృత్తి. నిజానికి ఈ పాత్ర ద్వారా దిగజారిన మానవసంబంధాల గురించి గురజాడ వివరించారు.

లుబ్ధావధాన్ల మీద కూనీ కేసు అని బెదిరించి తను ఇచ్చిన మధురవాణి తాలూకూ కంటెను స్వాధీనపర్చుకోవాలని పంతులు శతవిధాలా ప్రయత్నిస్తాడు. హెడ్డుకానిస్టేబులిని, సాక్ష్యులిని సిద్ధపరుస్తాడు.

మీనాక్షిని పెళ్ళి చేసుకుంటానని వాగ్దానం చేసి, ఆమె నగలను తెచ్చుకోమని చెప్పి చివరకు ఆమె మీద చేయి చేసుకుంటాడు. మధురవాణి వెంటనే "ఆడదాని మీదా చెయి జేసుకుంటారు? యేమి పౌరుషం! అబద్ధవాఁడక అన్న మాట నిలబెట్టుకోండి. యే కులం తక్కువా? రూపం తక్కువా? ఆమె బతుకు భ్రష్టు చెయ్యనే చేశారు; పెళ్ళాడి తప్పుదిద్దుకోండి...." అని గడ్డి పెడుతుంది.

ఇటువంటి బుద్ధిహీనుడి కోసం, మధురవాణి మహేశంతో పాట కట్టించి పాడిస్తుంది. ఇక్కడ వ్యక్తిలోని స్వార్థ ప్రవృత్తిని, వంచనని అంతరాత్మ నియంత్రిస్తోందని బుద్ధిగా మసలుకోమని సూచిస్తోందని గ్రహించాలి.

*"యిల్లు యిల్లనియేవు! యిల్లు నాదనియేవు!*
*నీ యిల్లు యెక్కడే చిలుకా?*
*ఊరికి ఉత్తరాన సమాధి పురములో కట్టె యిల్లున్నదే చిలుకా!*
*మూన్నాళ్ళ*
*బతుకునకు మురిసేవు త్రుళ్ళేవు*
*ముందుగతి కానవే చిలుకా"*

అంతరాన్ని ప్రబోధాన్ని విస్మరించి రామప్పంతులు రామచంద్రాపురం అగ్రహారానికి వెళ్ళి అగ్నిహోత్రావధాన్లతో అవధాని పెళ్ళి అయిపోయిందని చెపుతాడు. వెంటనే కేసు తగిలించేయమని పోలిశెట్టి దగ్గర ఏద్దైనా తాకట్టు పెట్టమని అగ్నిహోత్రావధాన్లని ప్రోత్సహిస్తాడు. తిరిగి లుబ్ధావధాన్ల దగ్గరికి వెళ్ళి "రెండు సంచులతో కూనీ కేసంతా మంచు విడిపోయినట్లు విడిపోతుంది. ఒక్క యినస్పెక్టరుతో కుదరలేదు. డిప్టీ కలక్టరికి కూడా చెయ్యి తడిచెయ్యాలి... ప్రాంసరీ నోటు మీద యెన్ని రూపాయలు కావలిస్తే అన్ని రూపాయలిస్తారు" అని అంటాడు. సౌజన్యారావు పంతులు అవతలకి నడువు అని చీదరించుకుంటాడు. సంస్కారం చివరకు వ్యక్తిలోని అంతఃశత్రువుని తిరస్కరిస్తుంది. కరటకశాస్త్రి అనే ఒక అంతఃశత్రువును వ్యక్తిలోని సౌజన్యం, సంస్కారం తరిమివేయగలిగాయని నాటకకర్త చూపించారు.

గిరీశం కూడా వ్యక్తిలోని అంతఃశత్రువుకి ఉదాహరణ. నాటకంలో గిరీశం మొదటినుంచీ అందరినీ ఉపయోగించుకోవాలని చూస్తుంటాడు. పూట కూళ్ళమ్మ దగ్గర చేరి ఆమె డబ్బులను డాన్సింగర్లు కింద ఖర్చుపెడతాడు. అందరి దగ్గరా అప్పులు చేసి తిరిగి చెల్లించడు. మధురవాణిని దగా చేస్తాడు. వెంకటేశానికి చదువుచెప్పే మిషతో బొంకులదిబ్బ నుంచి మకాం మార్చి అగ్రహారానికి వెళతాడు. అసలు గిరీశం పాత్ర ఇంగ్లీష్ విద్యమూలంగా బయలుదేరిన ఆనాటి కుహనా విద్యావంతులకి ఉదాహరణ. పుస్తకాల పేర్లు చెప్పి డబ్బు గుంజటం బాగా తెల్సిన గిరీశాలకి, చదువు మీద అసలు

ధ్యాసేలేని వెంకటేశంలాంటి వాళ్ళు శిష్యులైతే ఇంక చెప్పేదేముంది. విద్యారంగం విలువలకి నెలవుగా ఉండాలి. బ్రిటిష్ విద్యావిధానంలోని ప్రధాన లోపాల్ని గురజాడ ఈ పాత్రల ద్వారా బట్టబయలు చేసారు. విలువలకి దోహదం చేయని విద్యారంగం నుంచి బయటకి వచ్చే గిరీశాలు సభ్యసమాజానికి చీడపురుగులుగా పరిణమిస్తారు. వీరు మానవ సంబంధాల్లో ఉత్కృష్టమైన ప్రేమ, గౌరవం, సభ్యత మొదలైన వాటిని విస్మరించి ప్రవర్తిస్తారు. అవకాశవాదానికీ, స్వార్థ ప్రవృత్తికీ మారుపేరుగా ఉంటారు.

పోటిగరాపుల పంతులు. బంట్రోతును ఏమార్చి డబ్బులివ్వకుండానే తప్పించుకోగల సమర్థుడు గిరీశం. అగ్రహారంలో మాంచి గేదె పెరుగు, నెయ్యి, పొగాకులతో సుఖంగా కాలం గడుపుతూ బుచ్చమ్మని లేవదీసుకొనిపోవటానికి అనేకవిధాలుగా ప్రయత్నిస్తాడు. అమాయకురాలైన బుచ్చమ్మని చూసి మదనకామరాజు కథలు, కాశీమజిలీలు, అరబ్బీనైట్లు అన్నీ చెప్పి, కొంచెం లవ్‌స్టోరీజ్ బుర్రకెక్కించి గ్రౌండ్ ప్రిపేర్ చేస్తాడు. వెంకటేశానికి పాఠం చెప్పే నెపం మీద విధవా వివాహం మంచిదనే భావం ఆమె గ్రహించేలా మానసికంగా ప్రభావం చేస్తాడు. వదినగారు అంటూ వరసలు కలుపుతాడు. ఆమెని వివాహం ఆడతానని ఆ తర్వాత "మీరు బీరపువ్వుల్లాగా వంటినిండా సరుకులు పెట్టుకుని చక్కగా పసుపూ, కుంకం పెట్టుకొని మహాలక్ష్మిలాగా యింట్లో పెత్తనం చేస్తూవుంటే ఒక పిల్ల యిటువేపు వచ్చి మెడ కౌగలించుకొని 'అమ్మా యిది కావాలి, అమ్మా అది కావాలని అడుగుతారు'. వాళ్లకి సరుకూ, జప్పరా చేయించాలి"... అంటూ ఊహల్లోకి తీసుకొని వెళతాడు. చివరి ప్రయత్నంగా సుబ్బిపెళ్ళి తప్పిస్తానని అలా చేయటానికి బుచ్చమ్మ తనతో లేచిపోయిరావటం తప్ప వేరే దారిలేదని గట్టిగా చెప్పి ఆమెను ఒప్పిస్తాడు.

గిరీశంలాంటి వాళ్ళు మాటలగారడీతో పబ్బం గడుపుకోవాలని చూస్తారు. అగ్నిహోత్రావధాన్లతో తనకు కోర్టు విషయాలన్నీ కూలంకషంగా తెలుసునని, అవసరమైతే స్టీమరుమీద కాకినాడ వెళ్ళి విషయాల్ని చక్కదిద్దుకొస్తానని చెప్పటం డబ్బు గుంజటానికే. ఏమీ తెలియకపోయినా అన్ని తెలిసినట్లు మాట్లాడటం వేదం, బృహన్నారదీయం, నేషనల్ కాంగ్రెస్ అంటూ ఇతరులని ఏమార్చటంలాంటి విషయాలన్నింటిలోనూ గిరీశానికి తిరుగులేదు. తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టిన ఘనుడు గిరీశం.

వరుసకి అన్న అయ్యే లుబ్ధావధాన్ల పెళ్ళి తప్పించటానికి గిరీశం ఒక ఉత్తరం రాస్తాడు. "బ్రాహ్మలు ఇల్లు గుల్ల చేస్తారు, అంతకన్నా పోలీసువాళ్ళు నయం" అని ఏడుస్తున్న లుబ్ధావధాన్లతో తనకి ఒక పవరాఫ్ అటార్నీని గిలికి ఇమ్మని వేధిస్తాడు. సహాయం చెయ్యటం అన్నదే గిరీశానికి తెలీదు. తెలిసిందల్లా ప్రతి ఒక్క విషయంలోనూ డెబిట్ క్రెడిట్ లెక్కలు వేసుకోవటం మాత్రమే.

నాటకం చివర్లో సౌజన్యారావు పంతులుని కలిసి తాను నెపోలియన్ ఆఫ్ యాంటీనాచ్‌నని, బుచ్చమ్మ మీద ఉన్న ప్రేమాతిశయం మీదనే ఆమెను వివాహం ఆడాలని నిశ్చయించానని చెపుతాడు. కానీ మధురవాణి ఆ సరికే అక్కడికి చేరుకుని సౌజన్యారావుని కలుస్తుంది. సౌజన్యారావుకి విషయం తెల్సిపోయి "రిఫారము అయితినని

గదా నీవు చెప్పితివి. నిజమైతే, కాలేజీలో ప్రవేశించి, పై పరీక్షలకి చదువుకో, నీ ప్రవర్తన బాగున్నంతవరకూ ద్రవ్యసహాయం చేస్తాను. బుద్ధితెచ్చుకొని బతుకు, మధురవాణిని డెవిలంటివే? నీవే డెవిల్. ఆమె నీ అయోగ్యత అయినా నొక్కి అడిగితేగానీ చెప్పింది కాదు"... అంటాడు.

'డామిట్! కథ అడ్డంగా తిరిగింది' అంటాడు గిరీశం.

పై సన్నివేశాన్ని చిత్రించటంలో గురజాడ అనన్యసామాన్యమైన ప్రతిభ కన్పిస్తోంది. మనిషిలోని చెడుని మనిషి నియంత్రించుకోవాలి. అంతరాత్మ ఈ చెడుపై ఒక రక్షా కవచంగా పనిచేస్తుంది. అంతరాత్మ ప్రబోధాన్ని వింటూ వ్యక్తి తనలోని సౌజన్యం ద్వారా అంతఃశత్రువుని దూరంగా నెట్టివేయగలడు. జాన్‌మిల్టన్ కవి తన మహాకావ్యం 'పారడైజ్ లాస్ట్'లో సూచించిన విషయాన్ని గురజాడ నాటకం కూడా వెల్లడిస్తోంది.[3]

సౌజన్యారావు పంతులు, మధురవాణిల ముఖాముఖి నిజానికి వ్యక్తి మంచితనానికి, అంతరాత్మకు మధ్య జరిగే సంఘర్షణ. అంతరాత్మ మంచితనానికి మంచి అంటే ఏంటో వివరించే శక్తి కలది. వ్యక్తిలోని సహృదయత అంతరాత్మ ప్రబోధాలతో జాగృతమై తనని పక్కదారి పట్టిస్తున్న ప్రలోభాలను, చెడును గ్రహించి దాన్ని దూరంగా నెట్టివేస్తుంది. మధురవాణితో మాట్లాడి సౌజన్యారావు, తనని మోసం చేయబోయిన గిరీశాన్ని నిందిస్తాడు. అంటే జాగరూకతతో ఉన్న సహృదయత అంతః శత్రువుని నియంత్రించి, దాన్ని విసర్జించగలిగింది.

సౌజన్యారావు గిరీశాన్ని పై పరీక్షలకి చదువుకొమ్మనటం అంటే అర్థం సహృదయత చెడ్డతనానికి మారటానికి అవకాశం ఇవ్వటం. ప్రవర్తన బాగున్నంతవరకూ ద్రవ్యసహాయం చేస్తాననటాన్ని చెడ్డతనం మారి మంచిగా అవ్వటానికి సహృదయత సహాయం చేస్తుందని గ్రహించాలి.

లుబ్ధావధాన్లు పేరుకి తగ్గట్టుగానే పిసినిగొట్టు.[4] ఇంట్లో విధవరాలైన కూతురుని పెట్టుకుని అవధాని సుబ్బిలాంటి చిన్నపిల్లతో పెళ్ళికి సిద్ధపడతాడు. "నేను ముసలివాణ్ణా వీడి సిగ తరగా! యాభైయేళ్ళకే ముసలిటండీ? కొంచెం దగ్గు వుండటమేఁ కాగట్టండీ (దగ్గును) నిలవెడు ధనంపోసి పిల్లని కొనుక్కున్న తరువాత, మరి దాని ఘోషా, నా ఘోషా వాడికెందుకయ్యా? డబ్బుచ్చుకున్న తరువాత చచ్చిన శవానికైనా కట్టకతీరదు. మాటాడ్రేం?" అంటూ రామప్పంతులుతో ఏకరువు పెడతాడు. ఇతని దృష్టిలో బాల్యవివాహాలు తప్పుకాదు. అగ్నిహోత్రావధాన్లతో సంబంధం తప్పిపోగానే వెంటనే గుంటూరిశాస్త్రులు పిల్లను కొనుక్కుందామనుకుంటాడు.

రామప్పంతులుని చూసి, తను కూడా రంగువేసుకుంటే యవ్వనంతో ఉంటానని అనుకుంటాడు. మధురవాణి దగ్గరకి వస్తేనే చాలు పొంగిపోతాడు.

హత్యాభియోగంలో ఇరుక్కుని సౌజన్యారావుని ఆశ్రయిస్తాడు. అంతకుముందు దయ్యం ఇంట్లో ఉందని కంగారుపడి, హడావుడి చేసి పూజారి గవరయ్యని ఆశ్రయిస్తాడు. తన తప్పు తెల్సుకుని వెధవలకోసం కట్టిన మఠంలో మీనాక్షికి నచ్చితే చేర్పించాలని నిర్ణయించుకుంటాడు. తాను కాశీకి వెళ్ళాలని అనుకుంటాడు.

లుబ్ధావధాన్లు వ్యక్తిలోని లోభత్వానికి సంకేతం. సౌజన్యారావు పంతులు అవధాన్లని కాపాడతాడు. అవధాన్లు బుద్ధి తెచ్చుకుని, మారతాడు. మంచితనం లోభాన్ని జయించగలదని ఈ విధంగా గురజాడ సూచించారు.

అగ్నిహోత్రావధాన్లు వ్యక్తిలోని క్రోధానికి సంకేతం. నాటకంలో ఈ పాత్ర కోపధారిగా కనపడతాడు. తండ్రి పెయ్యకట్టు తాడుతో కొట్టే దెబ్బలంటే వెంకటేశానికి హడల్. అగ్నిహోత్రావధాన్లు గిరీశంతో మాట్లాడుతూ ఓం ప్రథమంగా "మానా? మానులా వుంచానంఛావూ? గూబ్బగల గొడతాను" అంటాడు. ఇతనికి భార్యాపిల్లల మీద ప్రేమాభిమానాలు శూన్యం. ఎంతసేపూ భూవులకి దావాలు తేవటమూ, కోర్టులచుట్టూ తిరగటంలోనే ఇతనికి కాలక్షేపం. పిల్లవాడికి చదువు చెప్పించటానికి ముందూ, వెనకా ఆలోచిస్తూ ఉంటాడు. పెద్దకూతురు బుచ్చమ్మకి డబ్బుకోసం మంచం మీంచి దించెయ్యటానికి సిద్ధంగా ఉన్న వాడితో పెళ్ళి చేస్తాడు. ఇంత జరిగినా మళ్ళీ చిన్నబిడ్డ సుబ్బిని లుబ్ధావధాన్లలాంటి ముసలివాడికి ఇచ్చి చేయాలని ప్రయత్నాలు చేస్తుంటాడు. సంబంధం తప్పించమని అడిగిన చెల్లెలుతో కరటకశాస్త్రి "వట్టి మూర్ఖపుగాడెద కొడుకు. యెదురు చెప్పిన కొద్దీ మరింత కొఱ్ఱెక్కుతాడు"... అన్న మాటలు అవధాన్ల నైజాన్ని వివరిస్తాయి.

బుచ్చమ్మ తండ్రితో మాట్లాడుతూ సుబ్బిని లుబ్ధావధాన్లకి ఇచ్చి పెళ్ళి చేయవద్దని చెప్పగానే అగ్నిహోత్రావధాన్లు వెఱ్ఱి కోపం వచ్చి వుత్తరాపోసనం పట్టకుండానే పెరుగూ అన్నంతో విస్తరి తీసికెళ్ళి దాన్నెత్తిన రుద్దేస్తాడు. ఇటువంటి తండ్రులు బిడ్డలతో ఎలా ప్రేమగా ప్రవర్తించగలుగుతారు?

తాంబూలాలిచ్చేశాను ఇక తన్నుకు చావండి అంటూ, తలపెట్టిన పెళ్ళిని చేయాలనే అగ్నిహోత్రావధాన్లు నిశ్చయిస్తాడు. సంబంధం తప్పిపోయిందని తెలీగానే కోపంపట్టలేక దావా వేయాలని చూస్తాడు. ఇంగ్లీషు తెల్సిన వకీలుని పెట్టుకుంటాడు. చివర్లో గిరీశం పక్కనుంచి మీదపడి అగ్నిహోత్రావధాన్ల కాళ్ళు పట్టి క్రిందలాగుతాడు. వెధవని చంపేస్తానంటూ రంకెలు వేయటమేగానీ మరేం చేయలేకపోతాడు. క్రోధం వ్యక్తిని యుక్తాయుక్త విచక్షణ కోల్పోయేలా చేస్తుంది. దీని ఫలితంగానే మనిషి బుద్ధిహీనుడయి చివరకు అధోగతిపాలవుతున్నాడు. భగవద్గీతలో వివరించినట్లు క్రోధాన్ని అదుపుచేసుకోలేని వ్యక్తి అంతఃశత్రువులని జయించలేడు.(5)

అగ్నిహోత్రావధాన్లు, సౌజన్యారావుని కలిసినా తన ప్రవృత్తిని మార్చుకోవటానికి ఏ ప్రయత్నమూచేయడు. ఉత్తమ సంస్కారం, మంచితనం కూడా క్రోధాన్ని జయించలేకపోయింది.

సంప్రదాయ విద్యగరిపే గురువైనా, కరటకశాస్త్రి కూడా శిష్యుడైన మహేశాన్ని స్వంతపనులకి ఉపయోగించుకుంటూ ఉంటాడు. నాటకాల్లో వేషాలు కట్టిస్తూ ముండలిళ్ళు తిప్పుతూ శిష్యుడిని చెడగొడుతుంటాడు. గురు - శిష్య సంబంధాలు ఏ విధంగా భ్రష్టుపట్టాయో ఇతని పాత్ర ద్వారా వెల్లడవుతుంది. శిష్యుడికి వేషం కట్టించి లుబ్ధావధాన్లతో పెళ్ళి జరిపిస్తాడు. రూపాయలు తీసుకొని చక్కా పోతాడు. చెల్లెలి కూతురి

పెళ్ళి చెడగొట్టేందుకే పని చేసినా ఇతనికీ జీతృలు, ఎత్తులు బాగానే వచ్చని ఈ ఉదంతం తెలుపుతోంది.

మధురవాణి దగ్గరకు వెళ్ళి తనను కాపాడమని వేడుకుంటాడు. ఇతనితో మాట్లాడుతూ "హెడ్డుని నౌకరులా తిప్పుకున్నాను కానీ అధికం లేదు? ఆ నాలుగురోజులూ, సర్కారు కొలువు మాని అతడు నా కొలువు చేశాడు. అతడి సాయం లేకపోతే, మీరు ఆ వూరి పొలిమేర దాటుదురా? యీ దాసరి దాటునా? లోకం అంతా యేమి స్వప్రయోజకపరులూ?".... అంటుంది. తన స్వార్థం కోసం బ్రాహ్మడు మధురవాణిని డిప్టీ కలక్టరు వద్దకి వెళ్ళమని కోరతాడు. మధురవాణి అందుకు ఏం చిత్రగుప్తుడికి లంచం యివ్వగలరా అని ప్రశ్నిస్తుంది. తన మూలంగా ఒక ముసలి బ్రాహ్మడికి ముప్పువస్తూ వుంటే తన శరీరం దాచుకుంటున్నాడని మధురవాణి అతడిని నిందిస్తుంది. శిష్యునితో 'యెన్నాళ్ళు బ్రతికినా' అని పాడించి శాస్త్రికి బుద్ధి చెపుతుంది.

ఆనాటి అధికార్లు అలసత్వంతో, ఉదాసీనతతో ఉండేవారు. పోలీసులు, రెవిన్యూ అధికార్లు ప్రజలని అనేక విధాలుగా పీడిస్తూ ఉండేవారు. సాక్ష్యం చెప్పటానికి పోలిశెట్టి ససేమిరా అంటాడు. ఆసిరిగాడు వాళ్ళ ముసలిదానికి బాగాలేదని కబురు వచ్చిందని చెప్పి వెళ్ళిపోవాలనుకుంటాడు. ఎవరూ లుబ్ధావధాన్లని కాపాడటానికి ముందుకు రారు.

డబ్బులు లాగటానికి, కేసులు బనాయించటానికి పోలీసులు ముందు ఉండేవారు. వీరికన్నా బ్రాహ్మలు మరీ పీడించేవారు. అందుకే లుబ్ధావధాన్లు "శంకరాచారి పాదకట్నం పెట్టమంటాడు. బ్రాహ్మలు ఇల్లు గుల్ల చేస్తారు. అంతకన్నా పోలీసువాళ్ళు నయం"... అని వాపోతాడు.

న్యాయవాదులూ అంతేలా ప్రవర్తించేవారు. అగ్నిహోత్రావధాన్లని వకీళ్ళు చాలా ఏడిపిస్తారు. సౌజన్యారావు చెప్పినట్లు పెద్దవకీళ్ళు కూడా దొంగసాక్ష్యాలను పెట్టేవారు. పోలిశెట్టి మాటల్లో "బ్రాహ్మలు సచ్చాపసచ్చలు. కొంచెం చెయి తడిచేస్తే చాలు".

ఖేచరీగమనాలు, తిరస్కరణీ విద్యలూ చూపించి ప్రజలని ఏమార్చి బతకాలని చూసే గురూజీలు, వారు యోగినులతో చేసే పాపపు కృత్యాలు మొదలైన వాటినన్నింటినీ ఈ నాటకంలో గురజాడ వివరించారు. పూజారి గవరయ్యలాంటి వాళ్ళు దయ్యాల పేర్లు చెప్పి ప్రజల నోళ్ళు కొట్టాలని చూసేవాళ్ళు.

ఆనాటి సమాజం పరివర్తన చెందుతున్న సమాజానికి ఉదాహరణ.[6] దానిలో మానవసంబంధాలు చాలా క్షీణించాయని నాటకకర్త మనకు చూపించారు. వ్యక్తులందరూ నిర్మలమైన అంతఃకరణతో ప్రవర్తించాలనీ మానవ సంబంధాల ప్రాధాన్యతని విస్మరించకూడదని వివరించారు. తన ఆదర్శాలని వెల్లడించటానికి నాటకాన్ని ఒక యానకంగా చేసుకొని దాని ద్వారా మంచితనమే ముఖ్యమని నిరూపించారు. ఈ కారణాల వల్లనే 'కన్యాశుల్కం' ఈనాటికీ పండితులనీ, పామరులని సమానంగా ఆకర్షిస్తూనే ఉంది.

గురజాడ అప్పారావుగారు యుగకర్త. వారి రచనలు తెలుగు సాహిత్యంలో శాశ్వతస్థానం పొందాయి.

## వివరణలు:

1. "All the world is a stage and all men and women are merely players"

*-Shakespeare*

2. "మన స్త్రీ జాతిలోని నిస్సహాయమైన విభాగాన్ని సమాజ అవినీతి క్రిములతో నిండి ఉన్న బాధాకరమైన దాస్యం నుంచి రక్షించే సమస్య, ఘనతవహించిన మీ దృష్టిని పదేళ్ళక్రితం ఆకర్షించినప్పుడు, ఈ చెడుగును ఒక జనరంజకమైన నాటకంలో వెల్లడి చేసి ఈ విషయంపై ప్రజాభిప్రాయాన్ని వృద్ధిప్తం చేసేందుకు మీ భృత్యుడొకడు ఒక దుర్బల ప్రయత్నం చేశాడు...." అని కన్యాశుల్కం - అంకితంలో గురజాడ రచించారు.

3. "Within him lies the danger

And yet lies within his power

Against his will he will receive no harm

But God left free the will" *-Paradise Lost*

4. ఈ నాటకంలోని పాత్రల పేర్లన్నీ నామౌచిత్యానికి ఉదాహరణలే. సౌజన్యారావు పేరుకు తగ్గట్టు సౌజన్యమూర్తి. అగ్నిహోత్రావధాన్లు తీవ్రమైన కోపం ఉన్నవాడు. కరటకశాస్త్రి పంచతంత్రంలోని కరటక, దమనకులను గుర్తుచేసుకున్నాడు. ఇతనివి నక్కజిత్తులే. మధురవాణిది మధురమైన 'వాణి'. బుచ్చమ్మ పేరుకు తగ్గట్టే అమాయకురాలు. లుబ్ధావధాన్లు పరమ పిసినిగొట్టు. మీనాక్షి వితంతువైనా సొగసరి. గిరీశం అనగానే ఏదో దుష్టపాత్ర అనే ఊహ కలుగుతుంది. ఆయన శిష్యుడే వెంకటేశం.

5. *ధ్యాతో విషయాన్పుంస:సంగస్తే షూపజాయత్*

*సంగత్సంజాయత్ కామ: కామాత్ర్కోధో భి జాయతే*

*క్రోధాద్భవతి సమ్మోహ: సమ్మోహాత్స్మృతి విభ్రమ:*

*స్మృతి భ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ర్పణశ్యతి.*

(భగవద్గీత - రెండవ అధ్యాయం - 62/63)

6. ఫ్రెడ్‌రిగ్స్ అనే పండితుడు ఈ భావన గురించి వివరించాడు. భూస్వామ్య యుగలక్షణాలనించీ సమాజం మారుతూ వచ్చి సంధి దశలో ఉంటుంది. అటు సంప్రదాయ విధానాలు ఇటు ఆధునిక భావాలు కలగలిసి ఈ సమాజంలో కన్పిస్తుంటాయి.

# 24. ఆణిముత్యాలు-కథానికలలోని అభ్యుదయకర విషయాలు

గురజాడ అప్పారావు ఆధునిక కథ 'దిద్దుబాటు'ను తెలుగుసాహిత్యంలోని మొదటి కథానికగా విమర్శకులు నిర్ధారించారు. అప్పారావుగారి కన్యాశుల్కం చదివి ఆయన ఎంత ప్రతిభావంతుడో అనుకునేవారు వీరి ఆణిముత్యాల్లాంటి కథానికలను చదివితే ఆయన వ్యక్తిత్వానికి అవి నిలువెత్తు అద్దం పడతాయని తెలుసుకుంటారు. ఈ కథానికలన్నింటిలోనూ సజీవమైన వాడుక తెలుగుభాషను గురజాడ ప్రయోగించారు. కథానికల లక్షణాలను విమర్శకులు పలువిధాలుగా వివరించారు. మొత్తం మీద చూస్తే సంక్షిప్తత, ఏకాగ్రత, సమగ్రత, నిర్భరతలాంటి లక్షణాలు ఉండాలని తెలుస్తోంది. సంక్షిప్తత లేదా క్లుప్తతవల్ల చెప్పదల్చుకున్న భావాల్ని సూటిగా, అనవసర ప్రస్తావనలు లేకుండా చెప్పటం వీలవుతుంది. సాధ్యమైనంత ఎక్కువ భావాల్ని వీలైనంత నేర్పుగా తక్కువ పదాలతో చెప్పటం రచయిత ప్రజ్ఞని సూచిస్తుంది. తక్కువ వ్యవధి కారణంగా రచయిత తన ఇతివృత్తాన్ని పాఠకుడు సులువుగా గ్రహించేలా మలచాల్సి ఉంటుంది.

ఏకాగ్రతనే కేంద్రీకరణగా మరికొందరు పేర్కొంటారు. దీన్ని లక్ష్యం అని కూడా అనుకోవచ్చు. కథానికలో మరిన్ని సన్నివేశాలు లేకుండా నిర్ధారించుకున్న లక్ష్యాన్ని చేరుకోవటానికి ముఖ్యమైన విషయాన్ని విస్మరించకుండా, స్పష్టతతో చెప్పదల్చుకున్న విషయాన్ని చెప్పాలి. కథానికలో ముఖ్యంగా ఏదో ఒక విషయాన్ని గురించే వివరిస్తారు. ఇతర అంశాలు ఏమైనా వచ్చినా అవి ముఖ్యవిషయానికి విరుద్ధంగానో లేదా దాని పరిధి దాటో ఉండకూడదు.

కథానికను ఒక పరిపూర్ణ సాహితీ ప్రక్రియగా భావిస్తే దీన్ని సాధించటానికి సమగ్రత చాలా అవసరం. దీనికోసం ఏకత్వం కావాలి. చదువుతున్న పాఠకునికి ముఖ్యమైన విషయం ఏదో లోపించినట్లు అనిపించకూడదు.

నిర్భరత అనేది శిల్పానికి సంబంధించిన విషయం. అనవసర విషయాలను, కథాగమనానికి లేదా లక్ష్యసాధనకి ఎంతమాత్రం ఉపయోగపడని అంశాలను పరిహరించటం చాలా ముఖ్యం.

కొన్ని సందర్భాల్లో ప్రధాన ఇతివృత్తానికి తోడుగా మరికొన్ని ఉప ఇతివృత్తాలను కూడా రచయిత ప్రస్తావించవచ్చు. అయితే దీనివల్ల సమగ్రతకి, కేంద్రీకరణకి విఘాతం కలగకుండా జాగ్రత్త వహించాలి.

చక్కని ప్రారంభం, తగిన కథాక్రమవికాసం, ఆసక్తి కలిగించే మలుపులు, సందర్భోచిత సన్నివేశాలు, మంచి ముగింపు ఉండే కథానికలు పాఠకులని ఆకర్షిస్తాయి.

కథానికలోని శైలి కథాగమనాన్ని క్రమబద్ధీకరిస్తూ, పాఠకులు రచనని చదివి ఆనందించేటందుకు ఉపకరిస్తుంది.

కథానికలోని వస్తువు చిన్నదైనా .అది జీవితంపై ఒక వ్యాఖ్యానంలాగా కనిపించగల శక్తి కలది. సాధారణంగా మానవునికి సంబంధించిన ఏదో ఒక అనుభవమో, విషయమో వస్తువుగా గ్రహించి రచయిత తన ప్రతిభ ద్వారా వాస్తవాన్ని వివరించే ప్రయత్నం చేస్తాడు. కొన్ని సందర్భాల్లో కవి భావావేశం, తత్వం, అభిప్రాయం ప్రధానపాత్ర రూపేణా బహిర్గతమవుతుంది. సామాజిక చైతన్యం ఉన్న వ్యక్తి చేతిలో కథానిక చక్కగా రూపుదిద్దుకుంటుంది. ముఖ్య పాత్రను రచయిత మానసిక సంఘర్షణ నుంచి ఉన్మీలనమైన ఒక చైతన్యానికి ప్రతీకగా భావిస్తే రచయిత ధోరణిని, మానసిక ఔన్నత్యాన్ని విశ్లేషణా సామర్థ్యాన్ని అంచనా వేయవచ్చు.

బొడ్డపాటి కుటుంబ రాయశర్మగారు "సాధారణముగా విస్తృత క్షేత్రము కల్గి, ఒకానొక సంవేదనముతో కూడి స్వయం సంపూర్ణమై దానిలోని విభిన్న తత్వములను ఏకోన్ముఖముగా చూపు ఇతివృత్తాత్మక గద్య కవితా శిల్ప ఖండము" అని కథానికను నిర్వచించారు.

అగ్నిపురాణములో కూడా కథానిక స్వరూప స్వభావాదుల్ని ప్రస్తావించారు.(1) ఇది దీర్ఘమైన సమాసాలు, వర్ణనలు లేకుండానే చదువరికి సంభ్రమాశ్చర్యాదులని కలిగించే సన్నివేశాలతో నిండినదై ఉండాలని వివరించారు. చక్కని ముగింపు కథానికకు చాలా అవసరమని పేర్కొన్నారు. కథలో కరుణరస ప్రధానమైన సన్నివేశాలు ఉంటే అది పాఠకులని బాగా ఆకర్షిస్తుందని కూడా వెల్లడించారు.

పాశ్చాత్య సాహితీ క్షేత్రంలో విరిసిన 'షార్ట్‌స్టోరీ'ని మన కథానిక ప్రక్రియగా చెప్పవచ్చు. ఆంగ్ల సాహితీ విమర్శకులు షార్ట్‌స్టోరీకి క్లుప్తత ప్రాణం అన్నారు. వీరి దృష్టిలో ఇది ఒక నాయకుడు ఒక సమయంలో, ఒక సన్నివేశంలో ఏ విధంగా ప్రవర్తించాడో అనే దాని చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది.

ఆధునిక కథానిక ప్రపంచంలోని వివిధ సాహిత్యాల్లో వేర్వేరు కాలాల్లో జన్మించింది. ప్రత్యేకించి ఆంగ్ల సాహితీవేత్తలు దీనితో ఎన్నో ప్రయోగాలు చేసి ఒక విశిష్టతను కల్పించారు. తెలుగు కథానిక గురజాడ వేసిన బాటమీదుగా ముందుకు నడుస్తోంది.

ఆణిముత్యాలు సంకలనంలో మీ పేరేమిటి?, దిద్దుబాటు, మెటిల్డా, సంస్కర్త హృదయం, మతము - విమతము మొదలైన కథానికలతోపాటుగా ఒక నవలకు స్థూలరూపమైన 'సౌదామిని' అనే రచన కూడా పొందుపర్చబడింది. వీటిలో గురజాడ ఆదర్శాలు, ఆయన దృక్పథం కనిపించటంతోపాటు రచయితగా ఆయన సాధించిన పరిణతి, విలువల పట్ల వారికి ఉన్న నిబద్ధత కూడా దర్శనమిస్తాయి.

'మీ పేరేమిటి?' అనే కథానిక 1910లో ఆంధ్రభారతి పత్రికలో ప్రచురించబడింది. ఈ కథానిక 'దేవుడు చేసిన మనుషుల్లారా: మనుషులు చేసిన దేవుళ్ళారా: మీ పేరేమిటి?' అనే వేరు పేరుతో ఉండి ఎంతో ఆలోచనతో రాసినట్లుగా అనిపిస్తుంది. తెలుగులో దీన్ని మించిన కథ వెలువడలేదని కొందరు

అభిప్రాయపడతారు. ఒక మతంలోని రెండు విభిన్న వర్గాల మధ్య జరిగే దగాకోరు తగాదాలు దీనిలోని ఇతివృత్తం. హిందూమతంలోని శైవ, వైష్ణవ వర్గాలకు చెందిన కొందరు వ్యక్తుల దగాబుద్ధులు, పోటీలుపడే తత్వం, గొప్పలు మరీ చెప్పుకునే విధానం ఈ కథలో గురజాడ చాలా విశ్లేషణాత్మకంగా వివరించారు. దొంగభక్తులు వారి బుద్ధిలేని చర్యలు ఈ కథానికలో తీవ్రంగా నిరసించబడ్డాయి.

ఈ కథ ద్వారా గురజాడ సమాజంలోని మతవిశ్వాసాల్ని తీవ్రంగా ఖండించారు. "ఆ వూరి నల్లకొండలంతటను శిథిలమైన బౌద్ధకట్టడములు కలవు. అక్కడివారు వాటిని పాండవుల పంచలంటారు. ఈ దేశంలో పాండవులు వుండని గుహలు, వారు స్నానమాడని గుంటలూ లేవు...." అనే మాటలు దీనికి ఉదాహరణ.

కథలో శైవమతానుయాయిలూ, వైష్ణవ భక్తులూ తాము గొప్పవారంటే తామని పోట్లాడుకుంటూ ఉంటారు. శివమతానికి జంగం శరభయ్య ప్రాతినిధ్యం వహించేవాడు. వైష్ణవ పక్షానికి సాతాని మనవాళ్లయ్య నాయకుడు. ఆ గ్రామంలో సారథి నాయుడు లక్షాధికారి. అతని బావమరిది గ్రామ మునసబు. దక్షిణదేశం నుంచి ఒక అయ్యంవార్లుగారు వచ్చి సారధినాయుడికి, ఇంకా కొందరికి చక్రాంకితం చేసి వైష్ణవాన్ని ఇస్తారు. ఆనాడు మునసబు రామినాయుడు రామస్వామి వారి ఆలయంలో పులిహోరా, వైష్ణవం ఏకకాలమందే గ్రహించాడు. ద్వాదశి పండగని వైభవంగా నిర్వహించేవారు. నాయుళ్ళంతా వైష్ణవం స్వీకరించి శివాలయం వేపు చూడకపోవటంతో శరభయ్యకు కంట్లో మిరపకాయలు రాసుకున్నట్లు ఉండేది.

హైద్రాబాద్ నుంచి కొందరు శివాచార్లు పీఠంతోనూ, ప్రభలతోనూ, రుంజలతోనూ వచ్చి అర్ధరాత్రి దాకా శివార్చన చేసేవారు. శంఖాలు, జయఘంటలు, డమామీలు మొదలైన వాటి ధ్వని పామరుల మనస్సుల్లో భయోత్పాతం పుట్టించేవని గురజాడ రాస్తారు. సామాన్యులకు కావల్సింది మతం, దాని విధానాలు కావని వారికి వాస్తవిక జీవితం మీదనే దృష్టి ఉంటుందని ఈ సందర్భంగా రచయిత వివరిస్తున్నట్లుగా ఉంది.

శైవులు, వైష్ణవులు పరస్పర స్పర్థలతో, పోరాటాలతో ఆధిక్యత కోసం ఇలా పోరాడుతూ ఉండగా సామాన్య ప్రజానీకం వారి పరిధిలో ఆనందంగా జీవిస్తూ ఉంటారు. దేముడిముందు గుండం తొక్కే విషయంగా రెండు వర్గాల మధ్య ప్రయత్నాలు అధికమవుతాయి. అయితే ఎవరూ ముందుకు నడవలేకపోతుంటారు. చివర్లో అల్లా - రామ్ అనే కేకతో ఒక మనుష్య ప్రవాహము గుండాన్ని దాటుకొనిపోతుంది. దానికి ముందు వెండి పీరు ఒకటి రెండు చేతులా పట్టి ఒక వీరుడు భీమునివలె నడుచుకుని వెళతాడు. ఆనాటి నుంచి ప్రతి సంవత్సరం ఆ పీరుని ఫండుగ చేస్తారు. ఊరు ఆబాలగోపాలం శైవవైష్ణవ భేదం లేకుండా మొక్కులు చెల్లిస్తారు. శివుడన్నా, విష్ణువన్నా, పీరన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్మమట్టుకు ఒక్కడే కదా అని ఒక పాత్ర ద్వారా రచయిత పలికించారు.

సమాజంలో భక్తి పేరుతో పచ్చి మోసాలకు పాల్పడేవారి గురించి ఈ కథ సవిస్తారంగా చర్చించింది. మతంకన్నా మనుషులకు మానవత్వమే ముఖ్యమని ఇది

చెపుతోంది. సన్నివేశాల ద్వారా రచయిత తన లక్ష్యాన్ని సాధించారు. ఈ కథలోని ఇతివృత్తం వందేళ్ళకు పైబడినదే అయినా ఈనాటికీ వర్తించేది. విభిన్న పాత్రల ద్వారా రచయిత తన అభిప్రాయాలను, ఆదర్శాలను వెల్లడించిన వైనం అద్భుతం.

1910లో దిద్దుబాటు కథని ప్రచురించాక గురజాడ దానిలో కొన్ని మార్పులు, చేర్పులు చేసాడు. గ్రాంధికాన్ని కాదని వాడుకభాషకు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చారు.(2) స్త్రీ సమస్యకు సంబంధించిన అనేక దృక్కోణాలను నిశితంగా పరిశీలించి కథానికలను రచించటం అనే విధానాన్ని గురజాడ అవలంబించారు. ఈ కథలో వేశ్యాకర్షణలో పడిన భర్తను మార్చిన స్త్రీరత్నం నాయిక. అయినా ఈ కథలో ఆమె పాత్ర ఎక్కువసేపు ఉండేది కాదు. స్త్రీ విద్యా ప్రాధాన్యత గురించి కూడా ఈ కథానిక ప్రస్తావిస్తుంది.

ఈ కథానిక ప్రారంభం, ఎత్తుగడ, క్రమవికాసం, ముగింపు మొదలైనవన్నీ చాలా అద్భుతంగా అమిరాయి. 'తలుపు! తలుపు' అన్న మొదటి వాక్యాలు చదువరుల్లో ఉత్కంఠని కలిగిస్తాయి. ఆ వెంటనే కథానికలోని ప్రధానపాత్ర గోపాలుడు "బుద్ధిగడ్డి తిన్నది. రేపటి నుంచి జాగ్రత్తగా వుంటాను. యాంటి నాచెల్లాపోయి సానిదాని పాట సరదాలో మనసు లగ్నమైపోయింది... ఇదిగో లెంపలు వేయించుకుంటున్నాను. రేపటి నుంచి మరి పాటకు వెళ్ళను" అనటంవల్ల ఇతివృత్తం పాఠకులకు తెలుస్తుంది. గోపాలుడు తన తప్పులు తెలుసుకుని సన్మార్గుడవుతాడనే ఊహ కూడా కలుగుతుంది. కేవలం మూడు పాత్రలే ఉన్న ఈ కథ సంక్షిప్తతకి మంచి ఉదాహరణ. ఎక్కడా అనవసర విషయాలు కానీ, ఇతివృత్తానికి భిన్నమైన అంశాలు కానీ లేవు. దీనివల్ల నిర్భరత, కేంద్రీకరణలు సాధించబడ్డాయి.

గురజాడ కథానికలోని ప్రతివాక్యం కూడా ఒక మణిపూసలాగా ఉంది. గోపాల్రావు మంచం మీద కమలిని లేకపోవటం చూసి నిశ్చేష్టుడవుతాడు. వెలిగించిన అగ్గిపుల్ల చేజారుతుంది. ఇక్కడ 'గదినీ అతని మనస్సునీ చీకటి కమ్మింది' అన్న వాక్యం సందర్భానికి తగినట్లుగా, ఔచిత్యవంతంగా ఉండి కథాక్రమవికాసానికి ఉపయోగపడుతుంది.

గోపాల్రావు, నౌఖరు రావుడుల మధ్య జరిగిన సంభాషణ హాస్యానికి ఆలవాలంగా ఉంది. మీ అమ్మేదిరా అన్న ప్రశ్నకు "మాయమ్మా బాబూ మా కొంపలున్నాది" అన్న నౌఖరు సమాధానం చదువరికి హాస్యంగా ఉండి ఆనందాన్ని కలిగిస్తుంది.

నౌఖరు ఆడోరు సదువుకుంటే ఏటౌతది బాబూ అనగానే విద్య విలువ నీకేం తెలుసురా అని గోపాల్రావు అంటాడు. కమలిని చేవ్రాలున ఉత్తరం కనిపించి దాన్ని చదువుతాడు. 'నేను పశువును' అని గోపాల్రావు అనుకుంటాడు. 'గుణవతి, విద్యావతి, వినయసంపన్నురాలు, నా చెడుబుద్ధికి తగిన శాస్తి చేసింది' అని తన తప్పు తెలుసుకుంటాడు. వెంటనే రావుడిని ఊరెళ్ళి కమలిని పిలుచుకురమ్మని చెప్పుతాడు! 'మరి ఎన్నడూ సానుల పాట వినరు... యిటుపైని ఎన్నడూ రాత్రిళ్ళు యిల్లు కదలరు. ఇది ఖరారు' అని తన మాటగా భార్యతో చెప్పమంటాడు.

అంతకుముందు 'భగవంతుడి సృష్టిలోకెల్లా ఉత్కృష్టమైన వస్తువు విద్యనేర్చిన స్త్రీ రత్నమే' అని గోపాలుడు అంటాడు. నౌఖరుతో 'నీ కూతుర్ని బడికి పంపిస్తూన్నాం కదా,

విద్య యొక్క విలువ నీకే బోధపడుతుంది' అంటాడు. ఈ విధంగా స్త్రీవిద్యా ప్రాధాన్యతని కథానిక వివరించింది.

ఈ కథానిక ముగింపు కూడా అద్భుతంగా ఉంది.'మంచంకిందనుంచి అమృతం వొలికే కలకల నవ్వూ, మనోహరియైన నూపురముల రొదవిననయ్యెను' అనే వాక్యాలు కమలిని ఇంట్లోనే ఉందని, భర్తను దిద్దుబాటు చేయటానికి పథకం రచించిందని వివరిస్తున్నాయి.

మొదట గ్రాంధికచ్ఛాయలు నిండేటట్లుగా రాసిన కథను గురజాడ స్వహస్తంతో దిద్దారు. ఈ లిఖిత ప్రతిలో కథపేరు 'దిద్దుబాటు'కాదు. దీని పేరు 'కమలిని'.

గురజాడ మరో కథానిక 'మెటిల్డా'కు ఆధారం కథకునికి ఒక వంటలక్క చెప్పిన ముచ్చట. ముసలిపులిగా పేరుపడిన వృద్ధ భర్త చేతిలో చిక్కుకున్న అందమైన పడుచుపెళ్ళాం పడేపాట్లు, ఆవిడ దైన్యస్థితి, అనుమానంతో ముసలి భర్త పెట్టే హింసలు, చేసే అవమానాలు మొదలైనవన్నీ 'మెటిల్డా' కథలో చిత్రించబడ్డాయి. కథ నిజానికి స్త్రీల సమస్యలను లోలోతుల నుంచి తీవ్రంగా ఆలోచించి, పరిశీలించి రచించింది. కథానిక పేరుకు, కథలోని వాతావరణానికి ఎటువంటి సంబంధం లేదు.

కథకుని మిత్రుడు రామారావు ఒకనాడు మెటిల్డాను చూడమని చెపుతాడు. "పసుపు రాసుకుని స్తానమాడి పైని బంగారు చాయలుదేరిన మేనిసొంపు నెమలి పింఛమువలె ఒడలును కమ్మి చెదరిన తలకట్టు, బావి నుంచి నీరు తోడుతూ వొక్కొక్కతరి తలయెత్తి యిటూ అటూ చూసిన కన్నుల తళుకూ, మోము అందమూ నా కన్నుల కట్టినట్టు వుండి మరుతునన్న మరుపురాకపోయెను"... అన్న వాక్యాలు మెటిల్డా సౌందర్యాన్ని వివరిస్తున్నాయి. కథకుడు అడిగి వారివల్లా, వీరివల్లా అలానే అడక్కుండా తన స్నేహితులవల్ల మెటిల్డా చరిత్ర గ్రహిస్తాడు. 'పులి' మెటిల్డాని ఎక్కువ కాయిదా పెట్టేవాడు. ఒకరోజు కథకుడు మల్లెపువ్వులాంటి బట్టలు కట్టి, మెటిల్డా యింటి ఎదుట నడుస్తూ గుమ్మం దగ్గరకు వచ్చి ఆమె వీపు చూస్తూ నిలిచిపోతాడు. 'పులి' వెంటనే గుహలోంచి పైకి దుమికి కథకుడిని రమ్మని పిలుస్తాడు. భార్యని కూడా అసభ్యంగా సంబోధించి రమ్మంటాడు. ఇంగ్లీష్‌లో కథకునితో "ఓ తెలివితక్కువ దద్దమ్మా! చూడు. ఎంతసేపు చూస్తావో, యీ ముండ మొహం వేపు! ఏం, నా వేపు చూస్తావేం, దాని వేపు చూడక? నా మొహం, దాని మొహంకన్న బాగుందనా?" అంటాడు. వేరే వాళ్ళముందు భార్యని అవమానించటం, నిందించటం ఇటువంటి ముసలి పులులకు మామూలే. కథకుడిని నిజాయితీగా సమాధానం ఇవ్వమని అంటూ తన భార్య అందంగా ఉందా అనీ, కథకుడు ఆమెను రోజూ చూస్తున్నాడా లేదా అనీ ప్రశ్నిస్తాడు. కోపంతో 'ఈ ముండని తీసుకుపో, నీకు దానం చేశాను. తీసుకో పో! నాకు శని విరగడై పోతుంది' అంటాడు. కథకుడు బయటకు నడుస్తాడు. ఆ ప్రాంతం నుంచి బస మారుద్దామనుకుంటాడు. అయితే మెటిల్డా "మీరు, మీ నేస్తులూ నా కాపురం మన్ననివ్వరా? మీకు నేనేం అపకారం చేశాను" అనే మాటలతో ఒక చీటీ కథకునికి పంపిస్తుంది.

మెటిల్డాను ఎలాగైనా కాపాడాలని కథకుడు నిర్ణయించుకుంటాడు. తన మిత్రుడు రామారావుని సాయం చెయ్యమని వేడుకుంటాడు. ఈ సందర్భంలో గురజాడ ప్రయోగించిన వాక్యాలు 'సొగసైన స్త్రీల పొందుకోరేవాడికి అవకాశం తటస్థించినప్పుడు చెడ్డతలంపు వస్తుందా, రాదా అని ఆలోచన. ఆ అవకాశానికి అవకాశం ఇవ్వనివాడే ప్రాజ్ఞుడు..." అక్షరసత్యాలు.

కొన్ని రోజుల తర్వాత 'పులి' కథకుడితో మాట్లాడుతూ "నాకు నీవూ నీ స్నేహితుడు రామారావూ మరొక గొప్ప వుపకారం చేశారు. మీ మాటలవల్లా చేష్టలవల్ల నా భార్య యోగ్యురాలని తెలుసుకున్నాను. ఆలోచించుకోగా ఆనాటి నుంచి కళ్ళెం వొదిలేశాను. నా పెళ్ళాం బహుబుద్ధిమంతురాలు, ఇచ్చిన స్వేచ్ఛనైనా పుచ్చుకోలేదు. ఎక్కడికి కావలిస్తే అక్కడికి వెళ్ళమన్నాను. ఎవరిని కావలిస్తే వారిని చూడమన్నాను. ఎక్కడికీ వెళ్ళకోరలేదు. ఎవర్నీ చూడకోరలేదు. నాకు నీతో లోకం మరి ఎవరితో ఏం పనంది. అలాగే సంచరించింది..." అంటాడు. భార్యతో కాఫీ ఇప్పిస్తాడు. కబుర్లు చెపుతాడు. భార్యాభర్తల సరాగానికి కథకుడు కూడా సంతోషిస్తాడు.

'మెటిల్డా' కథ నిజానికి స్త్రీ స్వేచ్ఛ ఆవశ్యకతని వివరించేది. సంప్రదాయ గుదిబండల్లో స్వేచ్ఛ అన్నదే లేక సతమతమయ్యే స్త్రీ జాతి దుస్థితిని చూసి స్పందించిన రచయిత స్వేచ్ఛ ఇచ్చినపుడే స్త్రీకి బాధ్యత తెలుస్తుందని ఈ కథ ద్వారా వెల్లడించారు. అనుమానంతో మసలుతూ, అడుగడుగునా భార్యని అవమానిస్తే అది అమానుషమవుతుందని, భార్యాభర్తలు ఇరువురూ పరస్పర అనురాగంతో, ప్రేమతో నడుచుకోవటమే మంచి వివాహబంధం, దాంపత్యధర్మం అవుతాయని నిరూపించారు. ఈ కథానికలో స్త్రీవాద రచనా ధోరణులు కనిపిస్తాయి.

'సంస్కర్త హృదయం' అనే మరో కథ సమాజంలోని వేశ్యావృత్తి గురించి, వేశ్యల్ని సంస్కరించాలనే ఆదర్శంతో మసలే ప్రొఫెసరు చుట్టూ పరిభ్రమిస్తుంది. ఆనాటి సమాజంలో వేశ్యావృత్తి పేరిట ఎందరో అభాగినుల జీవితాలు నాశనమవుతూ ఉండేవి. నాచ్ సమస్య గురించి ఎందరో ఉద్యమాలు లేవనెత్తేవారు. గురజాడ కన్యాశుల్కం కూడా ఈ వేశ్యా సమస్యని విశ్లేషించింది. యువకులంతా ఈ ఉద్యమం గురించే ఉద్రేకంతో చర్చించేవారు. ప్లీడర్లు ఈ వాదనపట్ల సుముఖత చూపించలేమని సెలవిచ్చారు. ఒకనాటి సాయంకాలం టెన్నిస్ క్లబ్‌లో బార్‌లీడర్ మాట్లాడుతూ పగలల్ల తాను యాంటీనాచ్‌నని, రాత్రిళ్ళుమటుకే ప్రోనాచ్‌ననీ, అరమరికలు లేక ఖండితంగా చెప్పేస్తాడు. కన్యాశుల్కంలోని పాత్ర ద్వారా కూడా ఇదే విషయాన్ని గురజాడ చెప్పిస్తారు.[3] అయితే ఈ కథానికలోని ప్రధానపాత్ర (Protaganist) మంచి సంస్కారి, ఉన్నత భావోద్రేకి సంఘ సంస్కరణోత్సాహి. మానవునిలో శారీరక మానసిక దౌర్బల్యాలు వున్నాయని వింటేనే అతనికి జుగుప్స. విద్యార్థికులు, ప్లీడర్లే ప్రోనాచివాదులని విని ప్రొఫెసరు రంగనాథయ్యర్‌గారు వెంటనే క్లాస్‌రూమ్‌లో వకీలు వృత్తిమీద విమర్శలు చేయటం మొదలెట్టారు. జిల్లా మునసబు మూఢాభిప్రాయాలంటూ మరో విమర్శనా వ్యాసాన్ని దినపత్రికలో ప్రచురిస్తాడు.

సమాజంలో భోగం పడుచులు 'సేఫ్టీవాల్వ్' వంటివారు. ప్లేగులా వ్యాపించిన యీ అవినీతి రూపుమాసిపోక తప్పదు. ఇందుకు యువకులు సంసిద్ధులు కావాలి అంటూ ఆయన చేసే ప్రబోధాన్ని భూస్వామి బిడ్డడైన చందర్ అనే విద్యార్థి అంగీకరించేవాడు కాదు. చందర్ ప్రయోగం, పరిశోధన, ఋజువు సాధ్యపడనిదే ఏదీ చెప్పరాదని భావిస్తూ సరళ అనే పిల్లను చేరదీస్తాడు. ఆమెతో మానవ పరిణామశాస్త్ర పరిశోధనకై ప్రయోగాలు చేస్తుంటాడు. చివరికి క్లాసులో రెండు వర్గాలు ఆరంభమయ్యాయి.

ఈ కథానికలోని విభిన్న పాత్రలు వాస్తవానికి సమాజంలోని వివిధ శక్తులకు, వర్గాలకు ప్రతీకలు. విద్యావంతులైనా వాస్తవిక పరిస్థితులని సరిగా అవగాహన చేసుకోక ఉద్యమాలంటూ ప్రయత్నాలు చేసే శక్తులనే ప్రొఫెసరుగా ప్రతీకాత్మకంగా రచయిత చిత్రించారు. వేశ్యా వృత్తి నిర్మూలనకన్నా దానివల్ల మన అవసరాలు తీరుతున్నాయి కదా అనుకుంటూ, దానివల్ల తమ వృత్తి నిలబడగలుగుతోందని భావిస్తూ బతికే 'న్యాయ' వాదులు కూడా ఈ కథానికలో కన్పిస్తారు. జన్మ కారణాన నీచవృత్తి చేపట్టిరావల్సిన దుస్థితికి బాధపడే వేశ్యల జీవితాలకు సరళ, తరళ ప్రాతినిధ్యం వహిస్తారు. భూస్వామ్య యుగ సంస్కృతి సమాజంలోని చెడు సంస్కృతిని పెంచి పోషించటానికి తప్ప దాని నిర్మూలనకు పాటుపడదు. వేశ్యావృత్తిని పెంపొందిస్తూ వచ్చింది భూస్వామ్య సంస్కృతే. వీటన్నింటినీ చందర్ పాత్ర ద్వారా రచయిత చూపించారు.

రంగనాథయ్యరు గ్రీకులవంటి సౌందర్యారాధకుడు. సరళ గురించి ఎన్నో ఆలోచనలు చేసేవాడు. 'తనకు సరళ సునాయాసంగా లభిస్తే!... అనే భావం అతనిలో జన్మించి క్రమేపీ జయిస్తున్నట్లు అతనికే తెలీదు. హృదయంలో సంఘర్షణ ప్రారంభమయేది. గతించిన తన పసితనపు రోజులు చదువుకునేవారి స్మృతులు జ్ఞప్తికి వచ్చాయి. ఎన్నో ఆంగ్లకవుల గీతాలను భావావేశంతో చదివేవాడు. ఒకనాడు సరళ తన చెల్లెలు ద్వారా ఉత్తరాన్ని పంపుతుంది. సరళ రాసిన రెండు సంస్కృత శ్లోకాలు, వానిలోని తాత్పర్యం శాశ్వతం? నిర్మలమైన ప్రేమ పవిత్రమైనది. ప్రేమికుల హృదయాల మధ్య తన క్రూర సంప్రదాయాలతో ప్రపంచం అడ్డుగా నిలబడుతోంది".... అంటూ అనేక ఆలోచనలు చేస్తాడు.

ఈ కథానికను నిజానికి తెలుగులో మొదటి మనస్తత్వశాస్త్ర విషయ కథానికగా భావించుకోవచ్చు.[4] రంగనాథయ్యరు, సంఘర్షణ, అతని ఆలోచనలను రచయిత చాలా ప్రతిభావంతంగా చూపించారు.

రంగనాథయ్యరు చివరకు సరళ ఇంటికి వెళతాడు. అక్కడి రెండు గదులు రెండు వేర్వేరు వాతావరణాలతో నిండి ఉంటాయి. సరళ అందాన్ని తాగేస్తున్నట్లు ఆమె వంక చూడసాగాడు. ఆమెను ముద్దుపెట్టుకోవాలనే కోరికతో చెలరేగిపోతాడు. సరళతో మాట్లాడుతూ "ప్రత్యక్ష జీవితంలో మనం ఎదుర్కొంటున్న విషమ సమస్యలను పరిష్కరించుకుందుకు యీ వేదవిజ్ఞానం ఒక్క పిసరు కూడా అక్కరరాదు రాదు"... అంటాడు. 'యుగయుగాల జీవితానుభవమే, ఆ విజ్ఞానమే మన దైనందిన జీవితానికి సహాయకారి; చీకటిలోంచి వెలుగులోకి తెస్తుంది' అని ఆమెకు వివరిస్తాడు.

సరళ "నా జీవితం మీద నాకే అసహ్యంగా వుంది. ఛీ, ఛీ! నన్నా మురికి కూపం నుంచి బయటకి తీసుకుపోరూ? నన్ను కనికరించి ప్రబోధించండి. మీతో ప్రపంచపు చివరికైనా పయనించివస్తాను. రక్షించండి" అంటుంది.

పుస్తకాలలోని సిద్ధాంతాలు వల్లెవేయటం తప్ప, అవి జీవితంలోకి పరివర్తింప చేయడమెలానో ఊహించుకోని సంస్కర్త హృదయం సరళకు ఏం చెప్పాలో తెలీక ఉండిపోతుంది.

ప్రొఫెసర్ చివరగా గబుక్కున లేచి వెళ్ళి సరళ పెదవులను ముద్దుపెట్టుకుంటాడు. బయటనించి 'సంస్కరణంటే ఇదే! ఒకరిని లేవనెత్తబోయి మనమే కిందబడ్డం' అనే మాటలు విన్పిస్తాయి. మోసం మోసం అంటూ రంగనాథయ్యర్‌గారు పారిపోతాడు. రాజీనామా చేసి, ఊరు వదిలి వెళ్ళిపోతాడు.

ఈ కథానిక ద్వారా గురజాడ కుహనా ఆదర్శవాదులను, సంస్కర్తలను గురించి వివరించాడు. వేశ్యావృత్తి గురించి ఆనాటి ఆలోచనాపరులు చేసిన ఆలోచనల సారాంశాన్ని రచయిత చిత్రించారు. అనంతరం కన్యాశుల్కం నాటకంలో కూడా సౌజన్యారావు పాత్ర ద్వారా తన అభిప్రాయాలను వెల్లడించారు.

మతము - విమతము అనే మరో కథానిక చాలా చిన్నది. శ్రీకాకుళం చాలా ప్రాచీనమైన పట్టణం. ఒకప్పుడు అక్కడ శ్రీకాకుళేశ్వరుని క్షేత్రం ఉండేది. దానిని పడగొట్టి షేర్‌మహమ్మదు పెద్ద మసీదుని కట్టాడు. ఒక సంవత్సరం ఇద్దరు బ్రాహ్మలు తూర్పున నుండి ఆ పట్టణం వేపుకి వస్తూ ఉంటారు. "మా ఊరొచ్చాంరా.... ఇది శ్రీకాకుళేశ్వరుని క్షేత్రం. ఎట్టి మహాక్షేత్రమని చెప్పను" అంటూ వారిలో ఒకరైన నారాయణభట్టు తోటివాడైన పుల్లంభొట్లుతో అంటాడు. కోవిల గోపురం మాయమైందని నారాయణ బాధపడతాడు. "శివ! శివ! ఒరే. మీ ఊరి గోపురం కూడా యీ మ్లేచ్ఛులు పడగొట్టి వుంటాళ్ళా!" అని మిత్రునితో అంటాడు. దానికి సమాధానంగా పుల్లంభొట్లు "మీకు ఏమి ఉపద్రవం వచ్చింది. పడగొడితే ఆ పాపం వాళ్లకే కొడుతుంది".... అంటాడు. భారతీయ సమాజంలో గతంలో ఎన్నో జరిగాయి. శైవం, వైష్ణవం స్వీకరించటం వాటిలోంచి తిరిగి వేరే మతంలోకి మారటం జరిగాయి. ఒక విశ్వాసం ప్రబలినప్పుడు వేరే విశ్వాసాలకు బద్ధులైనవారు ఇబ్బందులు పడ్డారు. ఎవరో చరిత్రలో ఏదో చేసారని, ఆ చారిత్రక తప్పిదాల్ని తిరిగి చేయకుండా సామరస్యంగా నడుచుకోవటమే ఉత్తమమని ఈ కథ ద్వారా గురజాడ సూచిస్తున్నట్లుగా ఉంది. వర్తమాన కాలంలోని కొన్ని ఘర్షణలను పరిశీలించి చూస్తే రచయిత ఎంత దార్శనికుడో, ఎంత ముందుచూపు ఉందో తెలుస్తుంది. కథకుని దృష్టికోణాన్ని పునస్కరించుకొని కథావస్తు వైవిధ్యం గోచరిస్తుంది అని దీన్ని బట్టి అర్థం అవుతుంది.[5]

నారాయణభట్టు కాకుళేశ్వరుడి గుడి పగులగొట్టి మ్లేచ్ఛుడు మసీదు కట్టాడు అనుకుంటాడు. దీనిపై దేవుడెందుకూరకున్నాడు అని పుల్లంభొట్లు ప్రశ్నిస్తాడు. ఆ మాటే యే శాస్త్రంలోనూ కనపడదురా అని నారాయణ చెపుతాడు. దేవుడి పేరు మీద, మతం పేరు మీద జరిగే దారుణాలని గురజాడ ఖండిస్తున్నారు.

"ఏం పాట్లొచ్చాయి దేవుఁళ్ళకి!"

"దేవుళ్ళకి యే పాట్లూ లేవు. మన సాపాటు ఆలోచించరేం?" అన్న వాక్యాలు కూడా మనిషి మతంకన్నా మానవతకు ప్రాధాన్యతనివ్వాలని సూచిస్తున్నాయి. గురజాడ అప్పారావుగారి అభిప్రాయంలో మానవుడు ముఖ్యంగా ఆహారసమస్య గురించి ఆలోచించాలిగానీ దేవుళ్ళ గురించి కాదు.

మసీదు దగ్గర ఉన్న ఒక సాయిబుతో 'యీ వూళ్ళో చేబ్రోలు వారుండాలి. వున్నారా' అని ప్రశ్నిస్తే తెలుగులో లేదంటాడు. నారాయణభట్టు వెంటనే 'అయ్యో మా పెదమావ రామావధాన్లు, చినమామ లక్ష్మణభట్టు దేశాంతర గతులైనారా? మృతులైనారా?' అని ఆదుర్దాగా అడుగుతాడు. సాయిబు చేతనుంచి చిలుము రాలుతుంది. అతడు 'నారాయణా' అని సఖేదముగా పిలుస్తాడు. నారాయణభట్టు "అయ్యో! నువ్వా మావాఁ!" అంటాడు.

ఈ కథ ముగింపు అద్భుతంగా ఉంది. కథా రచనలో గురజాడ ఒ. హెన్రీ తరహా అనూహ్య ముగింపును ఉపయోగించారు. ఈ కథానికలోని ఆఖరు సన్నివేశం గురజాడ అభిప్రాయాలకు వేదికలాంటిది. మతాలు మారినా మనిషి సాటిమనిషిని బంధువుగా గుర్తించాలని, దేవాలయం మసీదు ఏది కూల్చి ఏది కట్టినా దానిలోని దేవుడు మానవుని సృష్టే కాబట్టి మనుషులు మానవత్వంతో జీవించాలి అన్నదే రచయిత సందేశం.

'సౌదామిని' అనే మరో రచన స్త్రీల సమస్యల గురించి తీవ్రమైన ఆలోచనలతో రచించింది. ఇది ఒక నవలకు స్థూలరూపం. అసంపూర్ణంగానే లభ్యమైంది. కులవ్యవస్థపై, స్త్రీ జీవితంపై ఈ కథానికలో గురజాడ విపులంగా చర్చించాలని ప్రయత్నించారు.

రైలులో ప్రయాణిస్తున్న ఒక కవిగారు పిల్లల విద్య విషయంలో తనకు మిక్కిలి ఆసక్తి కలదనీ, విద్యాబోధనకు సంబంధించిన ఒక నూతన పద్ధతి గురించి మాట్లాడతాడు. నవల్లో ఈ అంశం గురించి కూడా వివరిద్దామని రచయిత భావించి ఉండవచ్చు.

బాగా పాతుకొనిపోయిన కులాచారాల గురించి కూడా ఈ రచనలో ప్రస్తావించారు. ఒక పాత్ర "కులం నియమాలు నీకెప్పుడూ బోధపడవు. నేను శూద్రుణ్ణే కాని దక్షిణాదిన కొన్ని పాలక కుటుంబాలకు చెందినవాణ్ణి. నా పూర్వీకులు బ్రాహ్మణుల పంక్తినే భోజనం చేసారు...." అనటాన్ని పరిశీలిస్తే సమాజంలోని కులప్రభావాన్ని రచయిత ఖండిస్తున్నారని, ఈ రచనలో కులకట్టుబాట్ల గురించిన తన భావాలను చెప్పాలని ఆశించారని అనిపిస్తుంది

ప్రేమ గురించిన భావాలు కూడా దీనిలో చోటుచేసుకున్నాయి. "ప్రేమ, తనకంటె అధికమైన దానితో మార్పిడి చెందుతుంది. అది తన ప్రమాదాలను గుర్తిస్తుంది" అనే వాక్యాలు పరిశీలిస్తే గురజాడ రచనాప్రణాళికలో ఈ అంశాన్ని పరిగణిస్తున్నారని స్పష్టం అవుతుంది.

కవి, ప్రవక్తా ఎల్లప్పుడూ కాలం కంటే ముందే ఉంటారని చెప్పిన వాక్యాలు నిజానికి గురజాడకు వర్తిస్తాయి. ఆనాడే స్త్రీ స్వాతంత్ర్యం గురించి సమాజంలో ఆమె పాత్ర గురించి గురజాడ దీర్ఘంగా ఆలోచించారు. అందుకే ఈ రచనల్లో కవి పాత్ర ద్వారా "స్త్రీ లేచి తిరగబడాలి. మనుషుల్లో మేలైనది. ఆమె అబల అని మీరంటారు. అర్థంలేని మాట. మన దేశంలోని రైతు కుటుంబం స్త్రీ, పొలంలో కునికుపాట్లుపడే పురుషుడికంటె బలమైంది, గట్టిది, ఓపిక గలదీని"... అని చెప్పించారు.

"నా దేశంలో ఎక్కువమంది స్త్రీలు ఏమీ అనుకునేటట్టు లేరు. అది తమ ఆచారం తాము పుట్టిందే అందుకని వారు అనుకుంటారు...." అంటూ సాగే వాక్యాలు గురజాడ స్త్రీల గురించి ఎంత లోతుగా ఆలోచించారో వివరిస్తాయి. ఈ కథానికలో వాస్తవానికి స్త్రీల సమస్యల గురించిన సంపూర్ణ అవగాహనతో గురజాడ తన అభిప్రాయాలు చెప్పటం ఉంది. ఉపాధికోల్పోయిన భర్తకుగానీ భార్యకుకానీ ప్రభుత్వమే ప్రత్యేక వనరులు కల్పించాలి అని కూడా రచయిత ఒక సందర్భంలో అంటారు. అంటే ఆయన సామాజిక దృక్పథం, ఆదర్శాలు ఎంత ఉన్నతంగా ఉన్నాయో చూడవచ్చు.

ఈ రచన అసంపూర్ణమైనా దీనిలోని ఇతివృత్తం గురజాడ సంపూర్ణ వ్యక్తిత్వాన్ని విశదీకరిస్తుంది. రచనా ప్రణాళికను ఇంత ప్రణాళికాబద్ధంగా, పరిపూర్ణంగా చేసుకోవటమే గురజాడ రచనా సామర్థ్యానికి చక్కని ఉదాహరణ. పురుషుడి దౌర్జన్యం నుంచి ఆత్మరక్షణకోసం స్త్రీ కత్తిసాము నేర్చుకోవాలన్న ప్రతిపాదన, వైవాహిక బంధంలో బిగుసుకుపోయి ఊపిరాడక గింజుకునే స్త్రీ జాతి విముక్తి గురించిన ఆలోచనలు దీనిలో కనిపిస్తున్నాయి. ఈనాటి స్త్రీవాద రచయితలు గురజాడ ఆనాడే చెప్పిన విషయాలని గ్రహించటం అవసరం.

కన్యాశుల్కం రచయితగా గురజాడ ప్రతిష్ఠను నిలిపే రచన కావచ్చు. అయితే 'ఆణిముత్యాలు'లోని కథానికలను పరిశీలిస్తే పరిపూర్ణమైన గురజాడ రచనా చమత్కారం తెలుస్తుంది. కథానిక ప్రక్రియతో ఇన్ని ప్రయోగాలు చేసి ఇన్ని విలక్షణమైన ప్రమాణాలను నెలకొల్పిన అప్పారావుగారి పాండిత్యానికి, అభ్యుదయభావాలకు విమర్శకులెవరైనా జోహారులర్పించక మానరు. తెలుగులో నవలా ప్రక్రియకు కూడా ప్రణాళిక వేసుకున్న గురజాడ దాన్ని పూర్తిచేయకుండానే మరణించిన సంఘటన సాహితీ ప్రేమికులకు తీవ్ర దుఃఖాన్ని కలిగిస్తుంది.

ఏ ప్రక్రియను స్వీకరించినా దానిద్వారా సమాజానికి మంచి అన్న దాన్నే ప్రచారం చేయటం గురజాడ విధానం. ఈ కథానికలన్నీ ఆయన ఆదర్శాలను, లక్ష్యాలను వెల్లడించేవే. నిస్సందేహంగా గురజాడ రచనా పరిధి చాలా విస్తృతమైంది. ఆయన చూపు సరిహద్దులు ఎరగనిది. ఆయన లక్ష్యం ఉత్తమ ఆదర్శాలను ప్రతిష్ఠించటం. సాహిత్యాన్ని, సమాజ నిర్మాణానికి, అభ్యుదయ భావాల వ్యాప్తికి ఉపయోగించిన గురజాడ రచయితలందరికి ఆదర్శుడు. భారతదేశ రచయితలలోనే ఆయన ఒక గొప్ప రచయిత.

వివరణలు:

1. అగ్నిపురాణములో కథానిక ప్రస్తావన ఇలా ఉంది:
*భయానకం సుఖతరం గర్భేచ కరుణోరస:*
*అద్భుతోఽ న్తేసు క్లుప్తార్థ నోదాత్తా సా కథానిక.*

2. గ్రాంథిక భాషావాదులతో జరిగిన వాదోపవాదాల్లో గిడుగు రామమూర్తితో కలిసి పత్రికల్లో, సభల్లో, మద్రాసు విశ్వవిద్యాలయంలో తలమునకలుగా నిమగ్నులయ్యారు. అతిప్రాచీనమైన బిల్హణుని కథని వాడుకభాషలో నాటకంగా చొప్పించిన ప్రజ్ఞ, వాడుక భాషను కవితా శిల్పంలో మలచిన దీక్ష గురజాడ స్వంతం. 'తెలుగు కావ్యభాష, సంప్రదాయం తెలుగువారి మీద రుద్దబడ్డిన పెద్ద ప్రతిబంధకాలు' అని ఆయన భావించారు.

3. కన్యాశుల్కం నాటకంలోని కరటకశాస్త్రి పాత్ర ద్వారా "కొందరు బంట్లు పొగలు యాంటీనాచి, రాత్రి ప్రోనాచి. కొందరు ఉన్న ఊళ్ళో యాంటీనాచీ, పరాయి ఊళ్ళో ప్రోనాచి. కొందరు శరీరధారుఢ్యం ఉన్నంతకాలం ప్రోనాచి, శరీరం చెడ్డ తర్వాత యాంటీనాచి. కొందరు బతికి ఉన్నంతకాలం ప్రోనాచి, చచ్చిపోయిన తరువాత యాంటీనాచి; కొందరు అదృష్టవంతులు చచ్చిన తర్వాత కూడా ప్రోనాచే. అనగా యజ్ఞం చేసి పరలోకంలో భోగాలకి టికెట్లు కొనుక్కుంటారు నాబోటి అల్ప ప్రజ్ఞ కలవాళ్ళు లభ్యం కానప్పుడల్లా యాంటీనాచి" అని గురజాడ చెప్పించారు.

4. ఈ కథానికలో Obsession, fixation, fantasies మొదలైన భావనలు కనిపిస్తాయి. **Obsession** అంటే a persistant and often irrational idea which may be accompanied by a compulsion to carry out an act. **Fixation** అంటే a strong and relatively enduring emotional attachment for another person. **fantasies** అంటే ఊహాగానాలు చేయటం.

5. "A Story in its broadest definition a personal, a direct impression of life, it is not clinical and scientific, since it depends upon the individual artist imaginative perceptions and it is direct not meditated through the formulae or general ideas about life.

- Encyclopaedia of world cultures

# ఆచార్య ఆత్రేయ

కిళాంబి వెంకట నరసింహాచార్యులు తెలుగువారి మనసులలో స్థిరమైన స్థానాన్ని పొందిన ఆచార్య ఆత్రేయ. 1921లో నెల్లూరు జిల్లా మంగళంపాడులో, జన్మించిన ఆత్రేయ తన రచనల ద్వారా తెలుగు సాహిత్యానికి విశిష్టమైన సేవలను అందించారు. మద్రాసులో స్థిరనివాసం ఏర్పాటు చేసుకొని తెలుగు సినిమారంగాన్ని ఏలారు. అందరికీ ఆత్రేయగా తెలిసిన ఈ మనసుకవి నిజానికి మన 'సుకవి'.

నాటకకర్తగా, నటుడిగా, నాటక ప్రయోక్తగా విస్తారమైన అనుభవం ఉన్న ఆత్రేయ రచనలన్నింటిలోనూ సాహితీ విలువలు పుష్కలంగా ఉన్నాయి. చదువుతుండగానే అర్థమవటం, చదివిన తర్వాత కూడా అనేక ఆలోచనలను, అనుభూతులను కలిగించటం అనే రెండు విషయాలు వీరి రచనలలోని ప్రధానాంశాలు. సాధారణంగా వీరి రచనల్లో పట్టణాలలోని మధ్యతరగతి ప్రజల జీవితంలోని సాధక బాధకాలు కనిపిస్తాయి. సమాజ స్వభావాన్ని, విభిన్న వర్గాలమధ్య ఘర్షణని ఇతివృత్తాలుగా స్వీకరించి సామాన్య ప్రజానీకం సమస్యలను, స్వభావాన్ని చాలా వాస్తవిక ధోరణిలో చిత్రించారు.

నీలిమేడ, పరివర్తన, ఎన్.జి.ఒ., కప్పలు, చస్తేనేం, కళకోసం, చావకూడదు, మాయ, వరప్రసాదం, ఈనాడు, ప్రగతి, విశ్వశాంతి, గౌతమబుద్ధ, ఎవరుదొంగ, అంత్యార్పణ, ఓటునీకే, భయం, అశోక్‌సామ్రాట్, ఒక రూపాయి, అశ్వఘోషుడు మొదలైన ఎన్నెన్నో రచనలు చేసి తెలుగుసాహితీ చరిత్రలో ఒక చక్కని రచయితగా పేరుపొందారు.

పదిహేనవ ఏటనుంచే కలాన్ని కదిలించే శక్తిని సాధించిన ఆత్రేయ నిరంతర సాధనతో తన ప్రతిభను పెంపొందించుకున్నారు. భావుకత, సౌందర్యం, తాత్విక భావాలు వీరి రచనల్లో వెల్లివిరిసాయి. అనువాద రచనల్లోనూ ఆత్రేయది అనితరసాధ్యమైన మార్గం. వామపక్ష భావజాలం కూడా అనేక రచనల్లో వ్యక్తీకరించబడింది. ఆత్రేయ రాసిన సినిమాపాటలు, మాటలు విశేష ప్రజాదరణను పొందాయి.

ఎన్. జి. ఒ. నాటకం ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలలో బహుమతి పొందింది. విభిన్న సామాజిక వర్గాలను పాత్రల ద్వారా ప్రతీకాత్మకంగా చూపిస్తూ వారి మధ్య సంఘర్షణని వివరించిన విధానం ఆత్రేయగారి ప్రతిభకు నిదర్శనం. సమాజంలోని పేదవారి బాధలని సానుభూతితో అర్థం చేసుకొని అసలు సమస్యలకు మూలకారణాలని ఈ నాటకంలో రచయిత అన్వేషించారు.

అన్ని రచనలలోనూ సామాన్యుల పక్షపాతం, మానవత్వం, అభ్యుదయ భావనలు తొణికిసలాడుతూ ఉంటాయి.

ఆచార్య ఆత్రేయ 1989లో శాశ్వత నిద్రలోకి జారుకున్నారు. వీరి రచనలు మాత్రం తెలుగువారిని ఆనందింపచేస్తూ, ఆలోచింపచేస్తూ నిలిచిపోయాయి.

## 25. ఆత్రేయ - ఎన్.జి.ఒ. నాటకం మధ్యతరగతి జీవన చిత్రణ

ఆచార్య ఆత్రేయగారి బహుముఖప్రజ్ఞ తెలుగు పాఠకులకి పాత పరిచయం. వీరు అనేక సాహితీ ప్రక్రియల ద్వారా తెలుగుకి ఎంతో సేవచేసారు. నాటకకర్తగా కూడా ఆత్రేయగారు మంచి పేరు పొందారు. ఎన్. జి. ఒ. నాటకానికి మొదట అద్దెకొంప అని పేరుపెట్టారు. ఆ తర్వాత నాటకంలో జరిగిన కొన్ని మార్పులని అనుసరించి పేరు మార్చారు.[(1)] ఈ నాటకంలో మధ్యతరగతి కుటుంబాల - అందులో పట్నవాసుల అగచాట్లు - మనస్తత్వం, ప్రెస్టేజ్ పేరిట పడుతూన్న ఆర్థిక సాంఘిక బాధలు చిత్రించటానికి ప్రయత్నించానని ఆయనే స్వయంగా చెప్పారు. ఈ విధంగా చిత్రించటంలో ఆయన చాలా నేర్పు చూపించారు. నాటకంలో రెండు రంగాలు మాత్రమే ఉన్నాయి. కాలం కూడా స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతే. అంటే అంతర్లీనంగా ఈ నాటకంలో స్వాతంత్ర్యానంతర భారతదేశంలోని వివిధ సామాజికాంశాలు చోటుచేసుకున్నాయని తెలుస్తోంది.

ఈ నాటకంలో రంగనాథం ఒక గుమస్తా. స్వాతంత్ర్యానంతర భారతంలో రూపుదిద్దుకుంటున్న మధ్యతరగతికి, ఉద్యోగవర్గానికి ప్రతినిధి. ముసలాయనగా నాటకంలో వచ్చే రంగనాథం తండ్రి ప్రాచీన విలువలకి, అభిప్రాయాలకు ప్రతీక. రంగనాథం తమ్ముడు సంప్రదాయ వాతావరణం నుంచే జన్మించినప్పటికీ వ్యవస్థపై కోపం పెట్టుకొని దానిపై తీవ్రమైన విరక్తితో ఉన్న శక్తులకు ప్రాతినిధ్యం వహిస్తున్నవాడు. నాటకంలో ఇతని మాటలు, అభిప్రాయాలు పరిశీలిస్తే నిరాశావాదం నుంచి, ఒక విధమైన సమానత్వ, అభ్యుదయ సమాజస్థాపనని ఆకాంక్షిస్తూ జన్మించిన సోషలిస్టు చింతనాపరులకి ప్రతీకగా కన్పిస్తాడు. గోపి స్నేహితుడు శేఖర్ ధనిక వర్గాలకు గుర్తు. అద్దెకొంప యజమాని గుప్త పెట్టుబడీదారి వర్గానికి, ప్రభుత్వానికి ప్రతినిధి కాగా; గుప్త గుమస్తా శర్మ పెట్టుబడీదారీ వర్గాల కొమ్ముకాసే ఉద్యోగ వర్గాలకు, సామాజిక శక్తులకు ప్రతినిధిగా కన్పిస్తాడు. నాటకంలోని మిగతా పాత్రలు అంటే బిచ్చగాడు, సబ్ - ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్, దఫేదార్, కాంపౌండర్, పాలమనిషి సమాజంలోని వివిధ వృత్తులు చేసుకుంటూ జీవించే జనజీవితాన్ని ప్రతిబింబిస్తాయి. రంగనాథం భార్య సీత వివిధ సామాజికార్థిక పరిస్థితుల మధ్యపడి నలిగిపోతున్న సగటు స్త్రీ జాతికి గుర్తు. నాటకం ముందుకు సాగుతున్న కొద్దీ ఈ శక్తుల నిత్య సంఘర్షణ ఫలితంగా రాబోయే మార్పులు తెలుస్తుంటాయి.

ఆర్థిక పరిస్థితులకు తలవంచి రంగనాథం లంచాలు తీసుకోవటం అవినీతి మూలంగా జైలుకి వెళ్ళటం ఈ నాటకంలోని చివరి సంఘటన. రంగనాథం తమ్ముడు గోపీ గుప్తగార్ని కొట్టినందుకు, పబ్లిక్ మీటింగ్‌లో అరాచకాన్ని రెచ్చగొట్టే ఉపన్యాసం ఇచ్చినందుకు అరెస్టు అవుతాడు. ఇది స్వతంత్ర భారతదేశంలో నిరుద్యోగం పేదరికం కారణంగా వ్యవస్థపై తీవ్రకోపంతో విప్లవ మార్గాన నడుస్తున్న శక్తులను, ప్రజాప్రభుత్వం అణగదొక్కే చర్యలను విశదీకరిస్తోంది. అంటే అటు ఉద్యోగస్వామ్యం, ఇటు యువశక్తి రెండూ ప్రభుత్వ చర్యల వల్ల అణగారిపోవటం దీనిద్వారా భావితరాలకు ఇబ్బందులు

కలగటం మొదలైన పరిస్థితులను రచయిత తన నాటకంలో వివరించారని అర్థమవుతోంది. ఈ విధంగా నాటకంలో ప్రతీకల ద్వారా సమాజ స్వరూపాన్ని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించటంలో రచయిత ప్రతిభ బయటపడుతోంది.

నాటకాన్ని ప్రదర్శించటంలో అక్కడక్కడ ఉన్న పాటల ముక్కలను ఏ మాత్రం వాద్యఘోషలు, సంగీతపు కసరత్తులు లేకుండా పాడుకోవాలని ఆత్రేయగారే స్వయంగా వివరించారు. ఇది సాంకేతికపరంగా ప్రత్యేకమైనది. నిజానికి కొన్ని నాటకాల్లో సంగీతం ద్వారా నాటక ప్రయోజనాన్ని సాధించాలని నాటకకర్తలు ప్రయత్నిస్తుంటారు.(2)

నాటకానికి ముందే ఆ స్థలానికి సంబంధించిన వాతావరణ వర్ణన వస్తుంది. ఇది నాటకంలోని వివిధ సన్నివేశాలను, పాత్రలను, పరిస్థితులని వివరిస్తుంది. ఈ సందర్భంలో "వంటింటి గోడ మీద బిచ్చగాడి బొమ్మ ఇంటికొచ్చిన అందరికీ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. తెర ఎత్తేసరికి ఇల్లంతా పొగ చుట్టుకుని ఉంది. ఆ పొగలో ఆ ఇంటి ఇల్లాలు కామోసు, దేవుని పటం ముందు నిలబడి వుంది. దూరం నుంచి రేడియోలో 'వందేమాతరం' జాతీయగీతం వినిపిస్తూంది..." అన్న మొదటి మాటలు పరిశీలించతగినవి. ఇవన్నీ నాటకంలోని ఇతివృత్తాన్ని వెల్లడిస్తున్నాయి. బిచ్చగాడి బొమ్మ ఆ ఇంటి ఆర్థిక పరిస్థితికి గుర్తు. ఇల్లంతా పొగచుట్టుకొని ఉండటమంటే ఆ ఇంటిలోని సభ్యులు చివరికి అంధకారంలో చిక్కుకొని వారి భవిష్యత్ ప్రశ్నార్థకంగా మారుతుందనే సూచన. రేడియోలో 'వందేమాతరం' రావటం వ్యంగ్య విధానంలో దేశపరిస్థితులని వివరిస్తున్నట్లు ఉంది.

ప్రారంభంలోనే కొత్త ఇల్లు చూసివచ్చినట్లు, దాన్ని అద్దెకు ఇవ్వటానికి బోలెడన్ని షరతులు ఉన్నాయని చెప్పిన గోపీ మాటలతో ఆ కుటుంబం ఇరుకైన మోటార్‌షెడ్‌లో నివసిస్తున్నదని తెలుస్తుంది. గోపీ, సీత మాటల్లో ఆ ఇంట్లోని మిగతావారి గురించిన విషయాలు తెలుస్తాయి. గోపీ తండ్రి ఆరోగ్యం బాగాలేదని, చిన్నవాళ్ళకి ఆరోగ్యం సరిగా లేదని, సీతకు కూడా బలహీనంగా ఉందని అర్థమవుతుంది. గోపీ చెప్పిన మాటలు "ప్రతి అద్దె కొంపా ఒక దయ్యం కొంపే, తెలుసా? అందులో ఎలాంటి దయ్యాలు? పట్టపగలు కనబడే దయ్యాలు! కార్లలో తిరిగే దయ్యాలు! లక్షలు కోట్లు బ్యాంకుల్లో దాచిపెట్టుకు చచ్చే దయ్యాలు! మాట్లాడే దయ్యాలు!" సమాజ అసమానతలని వివరిస్తున్నాయి.

ఈ కుటుంబం - ఇంటి ముందు మురుగు కాలువతో ఎన్నో అనారోగ్య పరిస్థితుల మధ్య నివసిస్తూ ఉంటుంది. ఇంటి ముందు వరండాలో గోపీ తండ్రి, పెరాలసిస్ పేషెంట్ ఉంటున్నాడు. ఆయన్ని చూడటానికి వచ్చిన డాక్టర్ వారిని ఉద్దేశించి మీరా ఇంట్లో కాపురం ఎలా ఉంటున్నారో తెలియడం లేదు అంటాడు. ఈ మాట ఆ ఇంటి వాతావరణాన్ని పరిస్థితులని వివరిస్తోంది. ఆ ఇంటి ఇల్లాలు బలహీనంగా ఉంటుంది. డాక్టర్, మందూ, టానిక్‌లు తీసుకుంటున్నారా అన్న ప్రశ్నకి ఆమె తన భర్త వచ్చేటప్పటికి ప్రతిరోజు తొమ్మిదీ, పదీ అవుతుందని ఆ వేళకి కొట్లన్నీ కట్టేస్తారని సమాధానమిచ్చి తప్పించుకోవాలని చూస్తుంది. ఈ సంభాషణంతా మధ్యతరగతి జీవనంలోని ఆటుపోట్లని వాటి మధ్య చిక్కుకున్నా తమ మధ్య

పెనవేసుకొని ఉన్న ప్రేమానురాగాలని పదిలంగా కాపాడుకుంటున్న భార్యా భర్తల సంబంధాన్ని చాలా సహజంగా ఉండేలా తీర్చిదిద్దిన రచయిత చాకచక్యాన్ని వెల్లడిస్తోంది.(3)

గోపీ అక్కయ్యకు పెండ్లీడు మించిపోతోందని, ఆమెకి పెళ్ళి అయితే చూడాలనుందని ముసలాయన దిగులుపెట్టుకుంటాడు. ఇది అతని మనోవేదనని చెపుతోంది.

రంగనాథం డాక్టరుతో ప్రారంభంలోనే "ఎంత క్లాసుమేట్లయినా నువ్వొక లీడింగ్ డాక్టర్‌వి. నేను గుమస్తానేగా!" అంటాడు. అతను డాక్టరుతో మాట్లాడిన మాటలు గుమస్తాల స్థితిగతులని వివరిస్తున్నాయి. చాలీచాలని జీతంతో దుర్భరమైన ఆర్థిక పరిస్థితుల మధ్య జీవితం సాగించే గుమస్తాలపై ప్రభుత్వం దృష్టిపడదు. నీతినిజాయితీలని వదిలిపెట్టలేక వచ్చే జీతంతో ఇళ్ళు గడుపుకోలేక ఎన్.జి.ఓ.లు ఎంత ఇబ్బంది పడుతుంటారో ఆత్రేయ చాలా వాస్తవదృష్టితో వివరించారు.

రంగనాథం డాక్టరుని బయటికి తీసికెళ్ళి "ఆ కోటీశ్వరుడి బంగ్లా చూచి అసూయపడతాను. ఈ పూరిపాకను చూసి గర్వపడతాను. ఆ కోటీశ్వరుడి స్థాయిలో బ్రతకాలని ఉబలాటపడతాను. ఈ పూరిగుడిసెలో వాడు నాలా బ్రతికితే ఓర్వలేను. బంగ్లా - ఈ పూరిపాక వీటి మధ్య అడకత్తెరలో పోకలా నలిగిపోతున్న బ్రతుకురా బాబూ! మనది" అని అంటాడు. భారతదేశంలోని మధ్యతరగతి వారి ఆలోచనలు వారి జీవనశైలి అంతా వీటి ద్వారా మనకు తెల్సివస్తోంది.

నిజాయితీగా ఆలోచిస్తే పై స్థాయిలో ఉన్నవారిని చూసి అసూయపడటం, క్రింది స్థాయి వారిని చూసి గర్వపడటం మధ్యతరగతిలో మామూలు విషయమని అర్థమవుతుంది. అటు ఆర్థికంగా కాస్త మెరుగ్గా ఉన్న వారిలా బ్రతకలేక, ఇటు నిరుపేదలుగా బ్రతకలేక సతమతమయ్యే మధ్యతరగతి ఆక్రోశం ఇక్కడ చూడవచ్చు.

ఆనాటి ప్రభుత్వం ప్రజాసంక్షేమానికి ప్రాధాన్యతనివ్వటం లేదని రచయిత భావన. దీన్ని వివరించటానికే డాక్టర్ - రంగనాథం మధ్య సంభాషణని అంత ఆవేశపూరితంగా, ఆలోచనాత్మకంగా కవి తీర్చిదిద్దారు. పోషించే తాహతులేనప్పుడు పిల్లల్ని కనడం మానెయ్యాలి అన్న డాక్టర్ మాటలు ప్రభుత్వ, పాలకవర్గ ఆలోచనా విధానాన్ని సూచిస్తున్నాయి. ఆధునిక కాలంలో రాజ్యం సంక్షేమ పథకాలకు ఎక్కువ ప్రాధాన్యతనివ్వాల్సిన అవసరం ఉంది. పిల్లల్ని కనటం అనేది ప్రతి జీవి లక్షణం. నేటి పిల్లలే రేపటి పౌరులు అవుతారు కాబట్టి ప్రభుత్వానికి బాధ్యత ఉంది. అందుకే పిల్లలు దేశాని కేవిధంగా ఉపయోగపడతారోయ్ అన్న డాక్టరు ప్రశ్నకు దేశాన్ని ఉద్ధరించాలని కంకణం కట్టుకున్నారే వాళ్ళనడుగు. దేశం కోసం కాదు నేను పిల్లల్ని కనటం అని రంగనాథం ద్వారా ఆత్రేయ సమాధానం చెప్పించారు.

భారతదేశానికి 1947 ఆగస్ట్ 15 అర్ధరాత్రి స్వాతంత్ర్యం వచ్చింది. ప్రజాస్వామ్యం మొదలయింది. ప్రజాస్వామ్యానికి వాక్స్వాతంత్ర్యం చాలా ముఖ్యమైంది. ప్రాథమిక హక్కులు ప్రజాస్వామ్యానికి ప్రాణంవంటివి. ప్రభుత్వం రాజ్యాంగ స్ఫూర్తిని పెడచెవినపెట్టి ఆర్డినెన్స్‌ల పేరిట ప్రజాస్వామ్యానికి విఘాతం కల్పించే ప్రమాదం ఉందని

ఆత్రేయలాంటి మేధావులు ఆనాడే ఊహించారు. 1948లోనే వెలువడిన ఆత్రేయ నాటకంలో రంగనాథం స్వతంత్ర భారతదేశంలో వాక్స్వాతంత్ర్యం సంపూర్ణంగా ఉంది అని అంటే వెంటనే డాక్టరు ఆర్డినెన్సులు కూడా ఉన్నాయ్ అన్న సంభాషణ రచించిన తీరు చూస్తే ఆయన ఎంత దార్శనికుడో అనిపిస్తుంది.[4]

గోపీ గురజాడ పాటని పాడుకుంటూ వస్తాడు. అతని చేతిలో ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఉంటుంది. ఆనాటి భారతంలో యువతరం ఏయే శక్తులతో ప్రేరేపితమవుతోందో ఈ అంశం వెల్లడిస్తుంది.

జీతం కట్టలేని కారణంగా గోపీ కాలేజీకి వెళ్ళటానికి వీలుపడదు. రంగనాథం భార్య మెడలోని బంగారు గొలుసుని తాకట్టుపెట్టి డబ్బు తెద్దామనుకుంటుంటాడు. కానీ ఆ గొలుసుని ఇంటి ఖర్చుల నిమిత్తం వదిన ఎక్కడో తాకట్టుపెట్టిందని గోపీ చెప్తాడు. దీంతో ఆ కుటుంబానికి ఎంత ఆర్థిక ఇబ్బంది ఉందో గ్రహించవచ్చు.

గోపీ చెల్లెలుకి సంబంధం చూస్తారు. వాళ్ళు కట్నంగా పదివేలు కట్నంగా అడుగుతారు. అది ఇచ్చుకోలేరు కాబట్టి ఆ పిల్లకి పెళ్ళి చేయటం చాలా కష్టం. గోపీ ఇక్కడ ఆడదాని ద్వారా డబ్బు సంపాదించేవాడు భోగంవాడు కాదూ అంటాడు. ఇవి అతని ఆవేశాన్ని మాత్రమే కాక సమాజరుగ్మత అయిన వరకట్న సమస్య తీవ్రతని కూడా సూచిస్తున్నాయి.

రంగనాథం బంధువు శాస్త్రి 'ఒక్క గుడ్డల వ్యాపారం లైసెన్స్‌లో వస్తుంది. నాలుగువేలు కావాలన్నా' అని లంచాలు తీసుకోమని ప్రోత్సహిస్తాడు. అవినీతిని ప్రోత్సహించేది మొదట అవినీతిదార్లేనని ఆత్రేయ స్పష్టంచేస్తున్నారు.

దీపావళిపండుగ వస్తుంది. కానీ వారి ఇంట్లో పప్పుగింజ ఉండదు. ఇన్ని కష్టాలకు తోడు గోపీ అక్కయ్య ఉత్తరంలో "నా విషయం గురించి మీరూర్కే కలవరపడకండి. కట్నాలకని ఋణాలు చేయకండి. నా కర్మం ఎలాగుంటే అలా జరుగుతుంది" అని రాస్తుంది. ఇది ఆ కుటుంబానికి సమ్మెటపోటువంటిది.

మధ్యతరగతికి ఇన్ని ఆర్థిక బాధలున్నా స్పందించే హృదయం భావుకతలు ఊరట కల్గిస్తుంటాయి. భార్యా భర్తల మధ్య నెలకొన్న ప్రేమ, ఆప్యాయతలను ఆత్రేయ మనసుకి హత్తుకునేటట్లు రచించారు. రంగనాథం భార్యతో వాళ్ళ పెళ్ళినాటి రోజులని గుర్తుతెచ్చుకొని "నువ్వారోజు కమ్మగా కష్టాలెరుగని కంఠంతో వీణ మీటుతూ పాడుతున్నావు. విన్నాను. నాకదోలా అనిపించింది ---- నీ కంఠంలో కమ్మదనం పోయింది. నా కవిత్వం నాశనమైంది. బ్రతుకే బండబారిపోయింది...." అని అంటాడు. ఇవి ఆ భార్యాభర్తలు జీవితం ప్రారంభించిన తొలినాళ్ళకి, ప్రస్తుతానికి మధ్య ఉన్న తేడాలని చూపిస్తున్నాయి. ప్రతి ఒక్కరికీ సంతోషంగా ఉండాలని జీవితంలోని ఆనందాన్ని అనుభవించాలని ఉంటుంది. కానీ ఆర్థిక బాధలు సాధారణ ప్రజల ఆనందాన్ని హరించివేస్తున్నాయి. హాయిగా ఒక్కరోజన్నా ఏ చీకూచింతా లేకుండా ఉండేకాలం వస్తుందా అన్న ఆశతోనే మధ్యతరగతి వాళ్ళు జీవిస్తుంటారు.

'కలెక్టరుగారు పిల్చుకురమ్మన్నారు అర్జెంటు పనుందట' అంటూ రంగనాథం ఇంటికి గుమస్తా రాత్రి ఎనిమిది గంటలకు వస్తాడు. సిమెంటు పర్మిట్ల అప్లికేషన్లు పట్టుకొని రంగనాథం వెంటనే బయలుదేరి వెళతాడు. దయాల్‌సేట్ మళ్ళీ పంపాడని, హోల్‌సేల్ వ్యాపారం లైసెన్స్ కోరుతున్నాడని, ఇటువంటి విషయాలలో మంచి చెయ్యి అనీ జవాను రంగనాథంతో చెపుతాడు. ఆర్థిక బాధల్లో చిక్కుకున్న రంగనాథం ఈ మాటలతో తీవ్రమైన ఆలోచనల్లో పడతాడు. 'లంచం తీసుకోవటం పాపం, చావటం అంతకన్నా పాపం' అని తీర్మానించుకుంటాడు. 'పిల్లా జల్లా గలవాణ్ణి, మడికట్టుకు కూర్చుంటే ఏం లాభం' అని అనుకుంటాడు. నీతిపై ఆర్థిక పరిస్థితులు గెలుపొందాయి.

గోపీ 'హాయి హాయి యీ సంసారం, అప్పుల కుప్పల సంసారం' అని పాడుకుంటూ ప్రవేశిస్తాడు. గోపీ స్నేహితుడైన ధనవంతుల అబ్బాయి ఇంటికి వచ్చి ఆ వాతావరణాన్ని. అసహ్యించుకుంటాడు. ఒక్క క్షణం నిలవాలంటేనే అతనికి అలా ఉన్నప్పుడు  సంసారమంతా ఆ అద్దె ఇంటిలోనే గడుపుతున్న గోపీవాళ్ళకి ఎలా ఉండాలని కవి ప్రశ్నిస్తారు. పేదరికంపట్ల, పేదలపట్ల అందరూ హేళన స్వభావంతోనే ఉంటారు. వారిని అసహ్యించుకోవటం అదో సాధారణ విషయమైపోయింది తప్ప వారి పరిస్థితిని సానుభూతితో ఎవరూ అర్థం చేసుకోరు. ఈ పరిస్థితులన్నింటినీ ఆత్రేయ వివరిస్తున్నారు.

లోకంలో ఉన్న రెండు వర్గాలు పేదవారు - ధనికులు ఆలోచించే విధానాన్ని ఈ నాటకంలో రచయిత చిత్రించారు. పేదలు అలా ఉండటానికి కారణమేమిటని ధనికులని ప్రశ్నిస్తే మిమ్మల్నెవరు సంపాయించవద్దు అన్నారు అన్న సమాధానం వెంటనే వస్తుంది. గోపీ, అతని స్నేహితుల మధ్య జరిగిన సంభాషణ అంతా ఈ నాటకకర్త అభ్యుదయభావాలను వెల్లడిస్తుంది. గోపీ నోటివెంట "డబ్బు. డబ్బు డబ్బుని సంపాయిస్తుందీ కాలంలో - అంతే - ఇప్పుడు నువ్వు సుఖపడుతున్నది నీ తెలివితేటలవల్లా, అర్హతవల్లా నీ కష్టమువల్లా కాదు. కేవలం డబ్బు గలవాడిగా పుట్టినందువల్ల తెలిసిందా?".... అని అందుకే రచయిత పలికించారు.

ఉన్నమాటని అన్న నేరానికి గోపీచెంప మీద అతని స్నేహితుడు కొడతాడు. ఇది ధనికవర్గం  పేదలమీద  చేసే భౌతిక, మానసిక దాడికి గుర్తు. గోపీ "ఆ కాలం వస్తుంది. పనిచేసే వాడికే తిండి - డబ్బూ సుఖం ఉంటుంది...." అని అంటాడు. సమసమాజం వస్తుందనే ఆనాటి మేధావులు ఆశించారు. దోపిడీ విధానం పోతుందనీ అందరూ సమానంగా ఉండే మంచిరోజులు వస్తాయనీ అభ్యుదయవాది ఆత్రేయ భావించారు.[5]

గోపీ కుటుంబంలో సమస్యలు ఎక్కువవుతాయి. ఇంటి యజమాని గుప్త వసారాని కూడా వేరేవారికి అద్దెకివ్వాలని నిర్ణయించుకుంటాడు. శర్మగారు బ్రోకరేజి పేరిట ఒక్క నెల అద్దె తీసుకొని వచ్చి గోపీ వాళ్ళని ఇల్లు ఖాళీ చేయాలని గట్టిగా చెపుతాడు.

గోపీ ఇల్లు ఖాళీ చేయనని చెప్తాడు. శర్మతో గోపీ వాగ్యుద్ధం చేస్తాడు. ఈ సమయంలో అదే వాకిట్లో బిచ్చగాడు-

"మేడల్లో కులికినా,
గుడిసెల్లో కులికినా,
కట్టెల్లో ఒకలాగా కాలిపోవాలి!
వున్న నాలుగునాళ్ళు వుబ్బిపోబోకురా!
కన్ను తెలియని రీతి గర్వపడబోకురా!"

అని పాడటం నాటకగమనంలో ఒక ప్రభావాన్ని తెస్తోంది. ఈ నాటకంలో సందర్భానుసారంగా వచ్చే పాటలు నాటకంలోని పరిణామాల మీద చక్కని వ్యాఖ్యానంలాగా కనిపిస్తాయి. దీనిద్వారా కవి తన అభిప్రాయాలని, తాత్వికతని వివరిస్తున్నారు.[6] నాటకకళ దృష్ట్యా చూస్తే ఇది చక్కని విధానం.

పాలమనిషి వచ్చి డబ్బులకోసం అడుగుతుంది. గోపీ రేపు, గీపు అంతా వట్టిదని ఆమెకి ఇప్పట్లో డబ్బులు రావని నిక్కచ్చిగా చెపుతాడు. గోపీ చాలా దుఃఖిస్తాడు. రంగనాథం వర్షంలో తడుస్తూ వస్తాడు. అందరికీ బట్టలు తెస్తాడు. "కరువుమాడి చస్తున్నా నైతిక బలంతో రొమ్ములు విరుచుకొని బ్రతికాను. ఇక బ్రతకలేను. చావాలేను. కాదు - బ్రతికీ చచ్చినట్టే...." అని లంచం తీసుకున్నందుకు చాలా బాధపడతాడు. అన్నయ్య అంతరాత్మను చంపుకున్నందుకు గోపీ చాలా శోకిస్తాడు. ఒక్క విషబిందువు రక్తంలోకి ప్రవేశించిందనీ అది తన తప్పు కాదనీ, వారి తప్పూ కాదనీ రంగనాథం బదులిస్తాడు. అవినీతి - సమాజంలో ఏయే పరిస్థితుల నేపథ్యంలో జన్మిస్తుందో సోదాహరణంగా నాటకకర్త వివరించారు. దీనికి ఆయా వ్యక్తులను తప్పు పట్టటం కాదనీ దానికి ప్రధాన కారణమైన ఆర్థిక అసమానతలను తొలగించాల్సిన అవసరం ఉందనీ ఆయన వాదన. ఎంత నైతిక బలమున్నా రంగనాథం చివరికి ఆర్థిక బాధల ఒత్తిడిలో తప్పటడుగు వేయక తప్పలేదు. ఈ సందర్భంలో రచయిత తన ప్రతిభను ప్రదర్శించిన తీరు అద్భుతం. తలుపు తెరిచేటప్పటికీ జల్లు జివ్వుమని కొట్టింది. ప్రకృతి ఆ కుటుంబ నైతిక పతనానికి సహాయపడింది అని రాసాడు ఆత్రేయ. ప్రకృతి అంటే బాహ్యప్రకృతి (Nature) అనీ ప్రవర్తన అనీ రెండు అర్థాలున్నాయి. శ్లేష ఉపయోగించి ఇలా సామాజికార్థిక కారణాలే ఆ కుటుంబ నైతిక పతనానికి దారి తీసాయనే అర్థంతో రాయటం ఆత్రేయలాంటి గొప్ప రచయితలకే చెల్లింది.[7] మొదటి రంగం చివరిలోని ఈ మాట మేరుపూస లాంటిది.

రెండవ రంగంలో గోపీ ప్రవేశించి వెంటనే భూమి అంటే ప్రపంచం పైసా చుట్టూ తిరుగుతోంది కాబట్టి ఆ పరమసత్యాన్ని వెంటనే అమల్లో పెట్టి ఆచరించపోతున్నానంటాడు. పండ్లపొడి పొట్లాలు, మినప్పప్పు పట్టుకొచ్చి దాంతో అప్పడాలు చేయమని, వాటితో వ్యాపారం చేస్తానని వాళ్ళ వదినతో అంటాడు. గోపీ వెళ్ళగానే రంగనాథం ప్రవేశిస్తాడు. పాలమనిషి ఇంటికి వస్తే ఆమెని ఆఫీసుకి పంపి తన పరువుతీసారని ఇంట్లో వాళ్ళ మీద కేకలు వేస్తాడు. రంగనాథం స్నేహితుడు డాక్టర్ వచ్చి గోపీ బస్‌స్టాండ్‌ల దగ్గర పండ్లపొడి పొట్లాలమ్ముతున్నాడే అని అంటాడు. దీంతో రంగనాథం కోపం తీవ్రస్థాయికి వెళుతుంది. రంగనాథం "ఏ డబ్బుగలవారో కట్టెలు

మోసుకొస్తే 'సింప్లిసిటీ' అంటారు. అదే మా బోటి వాళ్లయితే గతిలేదంటారు" అని డాక్టరుతో అంటాడు. ఇవి సమాజంలోని ద్వంద్వ ప్రమాణాలను వెల్లడిస్తున్నాయి.

గోపీని రంగనాథం తాగుబోతు వెధవతో స్నేహం ఏంటని మందలిస్తాడు. దీనికి గోపీ "నేనా పనులు చేయలేదింతవరకు, కానీ ఆ పనులు చేస్తున్న 'సోకాల్డు' పెద్దవాళ్ళందరూ నవనాగరిక సంఘంలో గౌరవనీయులుగానే ఉన్నారు"... అని సమాధానమిస్తాడు. సమాజంలో పేదలకో నీతి, ధనికులకో నీతి ఉంది. ఇది ప్రతి విషయంలోనూ కన్పిస్తుంది. ఈ ద్వంద్వ ప్రమాణాలను రచయిత తిరస్కరించారు.

గోపీని రంగనాథం కోపంతో కొడతాడు. తండ్రి వచ్చి గోపీకి హితవు చెప్తాడు. గోపీ వదినకు టానిక్, చీర తెస్తాడు. చదివి విజ్ఞానం గడించడం మానవుడైనవాడికి అవసరమే. కానీ, అంతకన్నా బ్రతకటం ముఖ్యం అని గోపీ భావన. విద్య ఉపాధికల్పనకి దారితీస్తుందనే ఎక్కువ మంది నమ్ముతారు. అలా కానప్పుడు విద్యావంతులు నిరుత్సాహానికి లోనవుతారు. ఆత్రేయ ఏనాడో భారతీయ సామాజిక సమస్యలని సహేతుకంగా విశ్లేషించిన మేధావి. స్వాతంత్ర్యం తర్వాత భారతదేశంలో విద్యావకాశాలు మెరుగయ్యాయి. దీనికి తగినట్లుగా ఉపాధికల్పనా అవకాశాలు మాత్రం పెరగలేదు. యువత నిరాశకి లోనయి పెడమార్గం తొక్కవచ్చని దీన్ని నివారించి ఉద్యోగ అవకాశాలు కల్పించాలని రచయిత సూచన.

ఇంటి యజమాని గుప్త వచ్చి ఇల్లు ఖాళీ చేయమని హెచ్చరిస్తాడు. ఇంట్లోకి చేరినప్పుడు ఎన్నో పనులు చేయిస్తానని వాగ్దానాలు చేసారని అవేవీ నెరవేర్చలేదని గోపీ యజమానిని నిలదీస్తాడు. ఈ విషయంగా "బావుంది మీక్కనక ఇండియా ప్రధానమంత్రి పదవిస్తే మీ పరిపాలన ఈ ఇంటి పరిపాలన లాగా ఉండి ప్రజలందరూ ఏడిస్తే మీకిష్టముంటే ఉండండి, లేకుంటే ఇండియాను ఖాళీ చెయ్యండని చెప్తారా ప్రజలకు?" అని గోపీ వ్యంగ్యంగా అంటాడు.

ఆత్రేయ భారతదేశ రాజకీయ పరిస్థితులపై ఎన్. జి. ఒ. అనే బాహ్య ఇతివృత్తాన్ని తీసుకొని వ్యంగ్య రచన చేసారని పై మాటలు నిరూపిస్తున్నాయి. ప్రజాస్వామ్యమంటే ప్రజలు వారి అధికారాన్ని రాజకీయాధికారానికి దత్తతచేయటం. అధికారంలోకి వచ్చేముందు రాజకీయనాయకులు ఎన్నో వాగ్దానాలు చేయటం తర్వాత ప్రజలను నిర్లక్ష్యం చేయటం మామూలే. నాటకంలో కూడా అద్దె ఇల్లు యజమాని ఎన్నో పనులు చేస్తానని చెప్పి చేయలేదు. పైపెచ్చు ఇళ్ళు ఖాళీ చేయమని అద్దెకున్నవాళ్లని బెదిరిస్తుంటాడు. ఇదంతా నిజానికి ప్రజాస్వామ్య విధానంలోని లోపాల్ని వివరిస్తోంది.

గుప్త గోపీ మీదికి కర్ర విసిరి గాయపరుస్తాడు. ఇది పెట్టుబడీదారీ రాజకీయాధికారం ప్రజలను పీడిస్తున్న విధానాన్ని సూచిస్తోంది.

రంగనాథం ఇంట్లోకి ప్రవేశించి పోలీసులు రావచ్చని, ఇల్లంతా తనిఖీ చేయవచ్చని చెపుతాడు. ఇల్లుగలాయన గుప్తాని కొడతాడు. రంగనాథం జేబులోంచి కొన్ని నోట్లు తీసి ఇస్తాడు. ఇంతలో డాక్టరు వచ్చి బాపూజీ పార్కు దగ్గర ఆహార సమస్యను గురించి యం. ఎల్. ఎ. మీటింగ్ పెడితే గోపీ అక్కడికి వెళ్ళి అడ్డదిడ్డపు ప్రశ్నలు వేసాడని చెప్తాడు. ప్లాటుఫారం మీదికెళ్ళి గోపీ నానా మాటలు మాట్లాడాడని,

ప్రభుత్వాన్ని విమర్శించాడని కూడా చెపుతాడు. నిరుద్యోగ సమస్యతో నీరసపడ్డ యువతరం తీవ్ర ఆవేశాన్ని ఈ సంఘటన వివరిస్తోంది.

రంగనాథం ఇంటికి పోలీసులు వస్తారు. అటకమీద ఉన్న కాగితాలు తెచ్చి ఒక పోలీసు ఎస్. ఐ. కి ఇస్తాడు. పల్లెపడుచు చేతిలో కొడవలి పెట్టడంలో నీ అభిప్రాయం ఏంటని బొమ్మ గీసిన గోపీని పోలీసులు ప్రశ్నిస్తారు. ఆనాటి ప్రభుత్వం ప్రగతిశీల దృక్పథం ఉన్న ప్రతివారిని అనుమానించి, ఆరా తీసేది. చేతిలో కొడవలి ఉన్న పల్లెపడుచు బొమ్మని విప్లవతత్వంగా పరిగణించటం దీన్ని నిరూపిస్తోంది.[8] ప్రజాస్వామ్యంలో వైవిధ్యం విభిన్న ఆలోచనారీతులు ఉంటాయి. ఉండాలి కూడా! దీనికి విరుద్ధంగా అధికారంలో ఉన్నవారు వారి అభిప్రాయాలతో ఏకీభవవించనివారిని అణగదొక్కాలని చూడటం ప్రజాస్వామ్య మౌలికసూత్రాలకే ముప్పుతెస్తోంది. ఈ పరిస్థితుల నన్నింటినీ ఆత్రేయగారు తన రచనలో విమర్శించారు.

రంగనాథం కోటు తెచ్చి పోలీసులు వెతికితే దాంట్లో కొన్ని నోట్లు కనిపిస్తాయి. అది లంచం సొమ్ము. కరప్షన్! చూడండి కలెక్టరుగారి సంతకం అని ఎస్. ఐ. అంటాడు.

కరప్షన్ పట్టుకోవటానికి అలాంటి నోట్లు కొన్ని పంపుతున్నారని పోలీసులు వివరిస్తారు. గుప్తాగార్ని కొట్టినందుకు పబ్లిక్ మీటింగులో ఆరాచకాన్ని రెచ్చగొట్టే ఉపన్యాసం ఇచ్చినందుకు దేశ శాంతిభద్రతలు కాపాడటానికి గోపీని అరెస్టు చేస్తారు. ఇది ప్రజాప్రభుత్వం. స్వరాజ్యం వచ్చిన తర్వాత మనవాళ్ళు లంచగొండితనాన్ని అణచివేస్తున్నారని ఎస్. ఐ. అంటాడు. దీంతో సమస్య మూలకారణాన్ని గుర్తించి దాన్ని నివారించాల్సింది పోయి అసలు ప్రజలనే అణచివేయటం ప్రజాస్వామ్యంలో ఎక్కువయిందని అర్థం అవుతోంది. సామాన్య ప్రజల జీవితాన్ని అద్దంపట్టి చూపించిన గొప్ప రచయిత ఆత్రేయ.

రంగనాథం వెళుతూ నా పిల్లలు జాగ్రత్త అని విలపిస్తాడు. బూటకపు ప్రజాస్వామ్యంలో ఒక తరం అణగారిపోయింది. కనీసం రెండోతరం అయినా ప్రజాస్వామ్య ఫలాలని అనుభవించాలనే ఆచార్య ఆత్రేయగారి ఆకాంక్ష ఈ మాటల ద్వారా వెల్లడవుతోంది.

ఈ నాటకంలో మధ్యతరగతి జీవితాన్ని, ప్రజాస్వామ్య నిజస్వరూపాన్ని రచయిత చాలా చక్కగా వర్ణించారు. ఆత్రేయ ఆదర్శాలను, ప్రజాస్వామ్య దృక్పథాన్ని ఈ నాటకంలో మనం చూడవచ్చు. నాటక ప్రక్రియలో ఆత్రేయగారు సాధించిన విజయమే ఈ నాటకం.

## వివరణలు:

1. అద్దెకొంప అన్న పేర ఈ నాటకం 10-12-48న చెన్నపురి మ్యూజియం హాలులో యల్.ఐ.యం కాలేజీ విద్యార్థులచే ప్రదర్శింపబడింది. ఆత్రేయగారి దృష్టిలో నాటకానికి పెట్టిన రెండు పేర్లు కూడా నాటకంలోని ముఖ్యోద్దేశాన్ని ప్రస్ఫుటం చేయటానికి చాలటంలేదు. అంటే ఈ నాటక పరిధి చాలా విస్తృతమైందని తెలుస్తోంది.

2. అమెరికన్ నాటకకర్త టెన్నీ విలియమ్స్ తన "గ్లాస్ మేనేజరీ" నాటకంలో సంగీతం ద్వారా ఎంతో ప్రభావం తెప్పించారు. టి.ఎస్. ఇలియట్ కూడా ఈ విధానాన్ని ప్రయోగించారు. ఇలా. కొన్ని నాటకాల్లో నేపథ్య సంగీతం ఇతివృత్తానికి తగినట్లుగా ఉండేలా చూస్తారు.

3. తెలుగు కథా రచయిత చాగంటి సోమయాజులు (చాసో) తన 'వాయులీనం' కథలో మధ్యతరగతి జీవితాల్లో ఆర్థిక సమస్యలెన్ని నెలకొని ఉన్నా వారి మధ్య పెనవేసుకున్న ప్రేమానురాగాలని చక్కగా చిత్రించారు. దానిపై ఆత్రేయ ప్రభావం కన్పిస్తుంది.

4. వివిధ ఆర్డినెన్స్‌ల ద్వారా, చట్టాల ద్వారా స్వాతంత్ర్య భారతంలో ప్రజాభిప్రాయాల్ని మన్నించకుండా పౌరహక్కులని కాలరాయాలనే ప్రయత్నాలెన్నో జరిగాయి. ఎమర్జెన్సీ కాలంలో ప్రాథమిక హక్కులని పరిరక్షించలేదు. ఇటువంటి పరిస్థితులు వస్తాయని ముందే చెప్పటం ఆత్రేయ ఊహాశక్తికి నిదర్శనం.

5. సోషలిస్టు సమాజ సాధనపై ఆత్రేయకి నమ్మకం ఉందని ఈ మాటలు చెపుతున్నాయి. ఈ ఆశయాన్ని సాహిత్యం ద్వారా సాధించాలని ఆయన ప్రయత్నించారు.

6. ఇది షేక్స్పియర్ నాటకశైలిని పోలి ఉంది. నాటకంలో 'ఫూల్' పాత్రద్వారా తన అభిప్రాయాలని 'కింగ్‌లియర్' లాంటి నాటకాల్లో ఆయన వెల్లడించారు. గ్రీకు నాటకాల్లో 'కోరస్' అనే గాయకుల బృందం నాటకంలోని కథాగమనంపై వ్యాఖ్యానం చేస్తుంటుంది.

7. షేక్స్పియర్ నాటకాల్లో కూడా ఇటువంటి పద్ధతి ఉంది. నాటకంలోని సన్నివేశానికి తగినట్లుగా ప్రకృతిని వర్ణించటం 'మెక్‌బెత్', 'కింగ్‌లియర్' నాటకాల్లో కనిపిస్తుంది. లియర్ నాటకంలో అతనికి పిచ్చి వచ్చినప్పుడు ఆ మానసిక స్థితికి తగినట్లుగా బయట తుపాను వాతావరణాన్ని చిత్రించారు.

8. కమ్యూనిస్ట్ ఉద్యమాలపై, అభిమానులపై ఆనాడు ప్రభుత్వం అవలంబించిన ధోరణిని ఈ సన్నివేశం వ్యంగ్యంగా చిత్రించింది.

# రాచకొండ విశ్వనాథశాస్త్రి

మధ్యతరగతి మానవ మనస్తత్వ అధ్యయనం, వివిధ సామాజిక శక్తుల సంఘర్షణని వివరిస్తూ చైతన్యవంతమైన రచనలు చేసిన రావిశాస్త్రి పూర్తి పేరు రాచకొండ విశ్వనాథశాస్త్రి. 1922 జులై 30న జన్మించిన శాస్త్రిగారు జీవితం పట్ల వారికి ఉన్న విశ్వాసాన్ని చివరిదాకా నిలబెట్టుకున్న గొప్పవాడు. సాహిత్యకారునిగా మారిన ఈ 'న్యాయ'వాది శాస్త్రిబాబుగా ప్రజలమనిషి అయ్యాడు. నవలలు, కథలు, నాటకాలు మొదలైన వివిధ సాహిత్య ప్రక్రియల్లో తన ప్రాపంచిక దృక్పథాన్ని, ప్రజాస్వామ్య సంస్కృతిని వెల్లివిరియచేసే వాతావరణాన్ని రచించారు.

ప్రపంచం గురించి తనకు బోధపడ్డ విషయాలను నలుగురితోనూ పంచుకోవాలన్న అకాంక్షతో, మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథంతో సాగిన వీరి రచనలు వ్యక్తిగతమైనవి కావు. అల్పజీవి, ఇల్లు గోవులొస్తున్నాయి జాగ్రత్త, రత్తాలు - రాంబాబు, రాజు - మహిషి, సొమ్ములు పోనాయండి లాంటి నవలలన్నింటిలో అధోలోకం పునాదులపై నిలబడ్డ పైపై సమాజపు చిత్రణ కనిపిస్తుంది. రావిశాస్త్రి సారాకథలు తెలుగుసాహిత్యంలో వేరొకరు రాయలేనివిగా ఉన్నాయి. ఛార్లెస్ డికెన్స్ నవలలకూ రావిశాస్త్రి నవలలకూ చాలా పోలికలు కనిపిస్తాయి.

శ్రీశ్రీ, గురజాడ, కొడవటిగంటి, గోపీచంద్‌ల ప్రభావం శాస్త్రిగారి రచనల్లో ప్రతిబింబిస్తుంది. కన్యాశుల్కం నాటకాన్ని అభిమానించి ఒంట బట్టించుకొన్న రావిశాస్త్రి నాటకాల్లో జీవితసారమంతా ఉంది. తిరస్కృతి, నిజం, విషాదం మొదలైన నాటకాలు వారి రాజకీయార్థిక దృక్పథాన్ని వ్యక్తం చేస్తాయి.

రావిశాస్త్రి - సాహిత్య వెండిరథాన్ని హాస్యకరుణాలనే జోడుగుర్రాలతో సామాన్యుడిని ఎక్కించుకొని ఆదర్శ సమాజ విశాల భవంతికి తోడ్కొని వెళ్ళిన రథసారథి. రావిశాస్త్రి శైలిలో ఉపమానాల పరికల్పనతో బొమ్మ కట్టించే పద్ధతి ముఖ్యం. తెలుగు పేర్లను ఆంగ్లీకరించి ఉపయోగించటంలో శాస్త్రిగారిది నూతన ఒరవడి.

జీవితపు మడతల్లోకి చూడటమనే పరిశీలనని రావిశాస్త్రి తన ప్రయోజనాల దృష్ట్యా "నిజాన్ని తెలుసుకోవటం" అంటాడు. మనుషుల్ని మంచికి మళ్ళించటానికి ప్రయత్నించటమే రచయితల కర్తవ్యం అని ఎలుగెత్తి చాటిన రావిశాస్త్రి ఒక ఆదర్శవంతుడు. ఆయన రచనలు ఆయన్ని మనకు చూపిస్తాయి.

## 26. 'అల్పజీవి' - మనోవైజ్ఞానిక విషయాలు

మంచిగా ఉండాలంటే గుండెనిబ్బరం చాలా ఉండాలి అని తెల్సుకొన్న రావిశాస్త్రిగారు ప్రతి రచయిత తాను రాస్తున్నది ఏ మంచికి హాని కల్గిస్తుందో, ఏ చెడ్డకి ఉపకారం చేస్తుందో అని ఆలోచించవల్సిన అవసరాన్ని గుర్తెరిగి మంచికి హాని, చెడ్డకి సహాయమూ చెయ్యకూడదని చెప్పిన గొప్ప రచయిత. సామాజిక - సాహిత్య సంబంధాలను సరిగా అర్థం చేసుకొన్న రచయిత జీవితంలోని కష్టాలకు, హింసకు, దుఃఖానికి కారణం ఏమిటా అని గౌతముని లాగానే తీవ్రంగా శోధించాడు. కన్యాశుల్కం నాటకాన్ని ఉగ్గుపాలతో జీర్ణం చేసుకొని దానిలో గురజాడకు తెల్సిపోయిన సామాజిక సారాన్ని ఆసరాగా చేసుకొని న్యాయాన్ని, రాజ్యాన్ని దాని చుట్టూ నేర ప్రవృత్తితో నిర్మాణమైన నాగరిక సౌధం క్రూరమైన సౌందర్యాన్ని విశ్లేషించాడు. ఈ విధమైన సామాజికార్థిక నేపథ్యంలో సాగిన రావిశాస్త్రి రచనలు మంచితనాన్ని దైవంగా భావించే వారందరినీ చాలా ప్రభావం చేసాయి.

భాష, నుడికారం, వాతావరణం, పాత్ర చిత్రణ, సంఘటనలు, వర్ణనలు, ఆదర్శాలు.... ఇలా అన్ని అంశాల్లోనూ తనకి తాను మాత్రమే సాటి అన్నట్లుగా రాసిన రావిశాస్త్రి తెలుగు సాహిత్యాభిమానులకు చిరస్మరణీయుడు. సృజనాత్మక, కల్పనాసాహిత్యం ద్వారా ఉన్నత వ్యక్తిత్వాన్ని, సమ సమాజాన్ని నిర్మాణం చేసే పద్ధతిలో గట్టివాడు అనిపించుకున్నాడు.

విద్యార్థిగా, మిలిటరీ గుమస్తాగా, న్యాయవాదిగా, రచయితగా జీవితానుభవాలను స్వంతం చేసుకొన్న రావిశాస్త్రి విరసం ఉపాధ్యక్షునిగా కొంతకాలం ఉండి సాంస్కృతిక సైన్యాధిపతి అయ్యాడు. ఈ విధంగా సాహిత్యాన్ని ప్రజలకు చేరువచేసి, వివిధ వర్గాల ద్వారా ఉన్నత సమాజ నిర్మాణానికి కృషిచేసాడు.

బ్రిటీష్ వలసపాలనలో భారతీయ భూస్వామ్య ఆర్థిక విధానం, పెట్టుబడిదారి విధానంగా మారుతున్న కాలంలో పుట్టి అంతర్జాతీయ మానవుడు అంటే ఏమిటో తెల్సుకొని సామ్యవాద సమాజ ఆవిర్భావానికి తాను సహితం సమిధగా అవ్వాలనుకుని, రచయితగా ఆ బాధ్యతలని చేపట్టాడు.

రచయితగా ఎదుగుతున్నకొద్దీ రావిశాస్త్రిలో మధ్యతరగతి జీవితంలోని ఆర్థిక దుస్థితిని, సామాజిక విషాదాన్ని వాస్తవంగా చూపించే శక్తి వచ్చింది. ఆర్థికంగా ఒడి దుడుకులకు లోనయి, చిన్నతనంలో ఎంతో వేదన అనుభవించి, తమ మంచితనాన్ని లోకం అంతా అసమర్థతగా చెప్పటాన్ని తల్చుకొని మానసికంగా కృంగిపోయి ఆత్మన్యూనతా భావంతో (Inferiority complex) ఇక్కట్లుపడే అల్పజీవుల మంచితనాన్ని చెపుతూ "ఓ మంచివాడి కథ" రాశారు రావిశాస్త్రి.

ఎన్నో రాజకీయార్థిక సామాజికశక్తుల సంఘర్షణలో జన్మించిన స్వాతంత్ర్య భారతంలో దేన్నిగురించీ ఆలోచించని, ప్రశ్నించలేని అసలు ఆ ఆలోచనలకే భయపడి నిత్యం అభద్రతా భావంతో జీవితాన్ని బల్లపరుపుగా చుట్టి బ్రతికినంతకాలం బ్రతుకుదాం

అని నిర్ణయించుకున్న - మధ్యతరగతి వర్గానికి ప్రతినిధి సుబ్బయ్య. ఇతని జీవితం అల్పజీవి నవలలో వస్తువు.[1]

ఈ నవల మొత్తం ఒక పదిరోజుల కథ. జరిగింది ఒక చిన్న సంఘటన. దీనికి ప్రతిస్పందించిన వ్యక్తి అంతరంగపుటాలోచనలు, భయాలు నవలలో వివరించబడ్డాయి. మానవ ప్రవృత్తికి ప్రవర్తనకు చాలావరకూ వారి ఆర్థిక పరిస్థితులు కారణమవుతాయని ఇది వివరిస్తోంది. తమ గురించి తాము ఆలోచిస్తూ, విశ్లేషించుకుంటూ తమ చుట్టూ ఉన్న సమాజపు చలనసూత్రాలు (dynamics) అర్థం చేసుకునే పరిణామక్రమంలో అల్పజీవులు పరిపూర్ణమానవులుగా తయారై సామాజిక మార్పు, మంచి కోసం పనిచేసేవాళ్ళుగా అవుతారని రచయిత చూపించారు. ఇది ఒక విధంగా రచయితలో అంతర్గతంగా జరిగిన సకారాత్మక మార్పునీ, విస్తృతమైన రచనా పరిధినీ వెల్లడిస్తుంది.

సుబ్బయ్య ఈ అల్పజీవి నవలలోని కథానాయకుడు.[2] మధ్యతరగతికి ప్రతినిధిగా రచయిత చిత్రించిన సుబ్బయ్యలోని మార్పులు రానున్న కాలంలో దేశస్థితిగతుల్లో సదరు వర్గం కారణంగా వచ్చే మార్పులని సూచిస్తున్నాయి. రచయితపరంగా ఇది అతను చేసిన సాహిత్య మజిలీలని, చివరకు మంచి చెడ్డల క్రాస్‌రోడ్స్‌కి వచ్చి తాను ఏ దారిని (రచయిత మంచి అనుకున్న దాన్ని) ఇతరులకి చూపించాలనుకుంటున్నాడో దాన్ని చెపుతుంది.

నవల ప్రారంభంలోనే సుబ్బయ్య గురించి మిగతావాళ్ళందరూ అనుకునే మాటలు చెప్పి "సుబ్బయ్య పాపం ఒట్టి భయస్తుడు...." అది అనేకమంది అనే మాట అని రచయిత అంటాడు. సామాజిక వ్యవస్థలో - వారి జీవితాలకు భద్రతలేని కారణాన్ని వివరించి - ఆత్మవంచనతో, పరవంచనతో, ఉంటూ భయాన్ని, కోపాన్ని, అసూయనీ పోగొట్టుకోలేక సతమతమయ్యే ఆధునిక మానవుని అంతర్మథనాన్ని సుబ్బయ్య పాత్ర ద్వారా చదువరులు తెల్సుకుంటారు.[3]

సుబ్బయ్యకి అధికారం అంటే హడల్. చట్టాన్ని ఎన్నడూ అతిక్రమించిన పాపాన పోలేదు. చిన్నప్పటినుంచే కష్టాలుపడాల్సి రావటం వల్ల, సవతితల్లి కారణంగా లేతవయసులో ఆమె ఉన్నన్నాళ్ళూ, సుబ్బయ్య పడ్డ మనోవేదన, యాతన అంతా ఇంతా అని చెప్ప వీలులేదు. చిన్నతనంలో తన తండ్రిని ఎవరో కొట్టిన సంఘటన అతనికి చాలాకాలంపాటు కళ్ళకి కట్టినట్లుండేది. అర్థరాత్రి అకస్మాత్తుగా నిద్రలేచి కూర్చుంటాడు, చీకట్లో కన్నీరు కారుస్తాడు. రాత్రివేళ చీకట్లో ఎక్కడికైనా వంటరిగా వెళ్ళటానికి భయపడతాడు. అంటే తనకు డబ్బులేకపోవటం అన్న ఒక్క కారణమే కాకుండా, సరిగా ఆదరణ లేకపోవటం లాంటి అనేక ఇతర కారణాలవల్ల తన భద్రతకు ఒక రక్షణ కవచంగా 'భయం' అలవర్చుకొన్నాడు. ఇది మామూలుగా అందరు మనుష్యులు వారి అభద్రతా భావాన్ని పోగొట్టుకోవటానికి చేసే వివిధ వ్యవహారాలలో ఒకటి.

భార్యకు తన మీద ప్రేమలేదన్న ఒక మానసిక సంక్షోభం అతన్ని పట్టి పీడిస్తుంటుంది. దీని నుంచి బయటపడటానికి అతను దారిన వచ్చేపోయే వారిని చూడటం, వారి గురించి ఎన్నో ఊహలు చేయటం లేదా కథలు అల్లటం లాంటి పనులు

చేస్తాడు. ఇతరులకి ఉన్న స్వేచ్ఛాయుతమైన, ఆనందమైన జీవితం తనకు లేదే అన్న మానసిక వ్యాకులతతో ఎర్రచీర మనిషి గురించి, ఆడపిల్లల గురించి, మనోరమ గురించి ఇలాంటి బోలెడన్ని ఆలోచనలు చేస్తాడు. అరవైయేళ్ళ వృద్ధుడిని చూసి అతణ్ణి "మునీశ్వర్లవారు" అంటాడు. అతన్ని తన జీవితంతో పోల్చుకోబట్టే ఏ దేవతామూర్తో అతన్ని వలచిందని, తిరస్కృతురాలై ఘోరశాపం ఇచ్చిందని ఊహించుకుంటాడు.

నిజానికి ఫ్రాయిడ్ సూత్రం వివరించినట్లు భవ్యభౌతిక జీవితాన్ని పొందాలన్న సుబ్బయ్య అకాంక్ష నుంచి అతని అచిత్తు ఇలాంటి మానసిక ప్రతిమలను కల్పించుకొని తనలోతాను ఆనందపడుతున్నాడని మనకు అర్థం అవుతుంది.(4) సుబ్బయ్యలోని ఒక పార్శ్వం ఏ కోరికలులేని యోగిలాగా ఉండాలన్న అతని అకాంక్షని దానివల్లే దారినపోయేవాడిని మునీశ్వరునిగా భావించటాన్ని విశదీకరిస్తోంది. ఇద్దరు ఆడపిల్లలకి 'లేడిపిల్లలు' అని పేరు పెట్టి వాళ్ళకొక సవతితల్లి ఉన్నదని, కష్టాలు పెడుతోందని, మిక్కిలి బీదవాళ్ళకిచ్చి పెళ్ళి చేస్తుందని కానీ వారి అదృష్టంవల్ల ఆ బీదవాళ్ళే గొప్పవాళ్ళవుతారని.... ఇలా ఆలోచిస్తూ ఉండటం తన చిన్ననాటి జీవనాన్ని ఇతరులతో పోలిక పెట్టుకునే ప్రవృత్తి వల్లనే వచ్చింది.

చాలావరకూ ఆర్థిక కారణాలు మానవునిలో భయాన్ని కల్గిస్తాయని మనస్తత్వశాస్త్రం చెపుతుంది. చిన్నప్పటినుంచీ ఆర్థిక సమస్యలతో సతమతమైన సుబ్బయ్యకి పెద్దయిన తర్వాతా ఆ పరిస్థితులు పోలేదు. జీవనాధారం ఉద్యోగం. ఎక్కడ ఆ ఉద్యోగం కాస్తా పోతుందో అనే భయంతో ఆఫీసులో అణిగిమణిగి ఉండేవాడు. అతనికి మామూళ్ళు పుచ్చుకోవటానికి ధైర్యంలేదు. ఆఫీసులో అందరూ అతన్ని తక్కువచేసి మాట్లాడేవాళ్ళు. అతన్ని డిస్పాచ్ సెక్షనుకి మార్చటం కూడా లోకం దృష్టిలో అతను అసమర్థునిగా ఉండటమే.

జమీందారీ కుటుంబానికి చెందిన సావిత్రికి సుబ్బయ్యలో రాజచిహ్నాలేవీ కనిపించలేదు. భర్తని ఆమె తన ఆయా కొడుకుతో పోల్చుకుంది. మొదట్లోనే "ఇతనా నాకు పెనిమిటి" అనుకొంది. ఆదిలోనే సావిత్రికి తాను తగననే అభిప్రాయం కలిగి సుబ్బయ్య ఆమెపట్ల భయభక్తులతో మెలగుతుంటాడు. పులుసులో ఉప్పు ఎక్కువైనా, భోజనం చేసే సమయంలో దగ్గర కూర్చుని వడ్డించకపోయినా ఏమీ అనలేదు. తన బాధలని ఇబ్బందులని గమనించి ఓదార్పుగా మాట్లాడకపోవటం వల్ల అలానే ఆడవాళ్ళని ఆకర్షించాలనే అభిలాషవల్ల, తెలియని వాంఛలతో మనసు చలించటాన్ని తెలుసుకొని వేరే స్త్రీతో భద్రతాభావం పొందాలని చూస్తుంటాడు.(5) సంసారం ఉండే వేరే స్త్రీతో సంబంధం ఏర్పరుచుకోవటం నైతిక విరుద్ధమన్న తన మనస్సాక్షి నోరు నొక్కలేక, ఆ తర్వాత వచ్చే పర్యవసానాలను తల్చుకొని భయపడుతూ ఉంటాడు.

భార్యకు కావల్సిన డబ్బు, సుఖం తను సమకూర్చలేడు. ఆమె నుండి తనకు కావల్సిన ప్రేమాదరణలని ఎలా పొందాలో తెలీనివాడు. అన్ని అసంతృప్తులనుంచి బయటపడటానికి ఊహలని ఆశ్రయిస్తాడు. తనకు వచ్చే క్షోభ తగ్గించుకోవటానికి ఇతరులకి అలాంటివే బాధలు, ఆందోళనలు ఉంటాయన్న ఆలోచనలతో కాలం గడుపుతుంటాడు.

తనది గుమస్తా ఉద్యోగం కాబట్టి, డాక్టర్లకి ఉన్న గౌరవాదరాలని చూసి తనూ డాక్టరీ చదివితే బావుండేదని అనుకుంటాడు. ఆర్థిక కారణాలవల్లే వెంకట్రావు ముందు ఎప్పుడూ ఒదిగి ఉంటుంటాడని మనకు తెలుస్తుంది. డబ్బున్నవారింట పుట్టకపోయినా కాంట్రాక్టర్ గవరయ్య బాగా సంపాదిస్తున్నాడని, అందువల్ల తాను అతనిముందు అల్పుడననే భావిస్తుంటాడు. ఆ కారణాలే సుబ్బయ్యని గవరయ్యముందు భయంగా, వినయంగా మాట్లాడేలా చేస్తాయి.

గవరయ్య లుంపెన్ ప్రొలిటేరియట్‌కి ప్రతినిధి. డబ్బుసంపాదనే పరమావధిగా ఉన్న వెంకట్రావు కూడా సిగ్గూ, లజ్జా విడిచిపెట్టేశాడు. మొండికవచం తొడిగాడు. స్వలాభం అనే జెండా ఎత్తి జీవితమనే యుద్ధంలోకి దిగిన ఈ వెంకట్రావు పడినా, లేచినా మనసుకి పట్టించుకోనివాడు. వారి వ్యక్తిగత, సామాజిక అనుభవాలు వారినట్లా చేసాయి.

జమీందార్ల కుటుంబంలో పుట్టిన వెంకట్రావు ఎవరి దగ్గరా 'దాసోహం' అని ప్రవర్తించడు. చాలామందితో 'నువ్వెంత' అన్నట్లు బేఖాతర్‌గా, నిర్లక్ష్యంగా ఉంటాడు. సరదాలతోనే జీవితాన్ని గడిపిన వెంకట్రావు – తండ్రి మరణంతో, నెత్తిమీద అప్పులతో రోడ్డున పడ్డాడు. మేనమామ నరసయ్య నిజానికి సాయం చేద్దామని వచ్చినా, ముసలి గుమస్తా కామేశంతో కుమ్మక్కవుతాడు. జమీన్దారీలో తనేది తిన్నప్పటికీ అది 'అన్యాయపు సొమ్ము' అనిపించుకోదని కామేశం తనకితాను చెప్పుకుంటాడు. చివరకి లాభంలో కొంతభాగం వదులుకుందామనే కామేశం నిర్ణయానికి, నరసయ్య వాటాలు తీసుకోవటం మేలన్న బుద్ధి జతగూడింది. ఫలితం – కూతురు శాంతమ్మని వెంకట్రావుకి ఇద్దామనుకున్న నరసయ్య తన దారి చూసుకోవటం. ఇవన్నీ కలిసి వెంకట్రావులో మార్పుని తెచ్చాయి. మసిపూసి మారేడుకాయ చేయటం వెంకట్రావుకీ పట్టుబడింది.

భూస్వామ్యవర్గం ఏ విధంగా కూలిపోయి క్రమేణా పెట్టుబడీదారులుగా, దళారులుగా మారుతున్నదో వెంకట్రావు పాత్రద్వారా తెలుస్తుంది.

గవరయ్య తండ్రి అతని కుటుంబాన్ని వదిలి రంగూన్ పోయి మరి రాలేదు. తల్లి గంగమ్మ పోషించింది. ఆమె వ్యభిచరించి డబ్బు గడించేదని అనేవారు. వయసురాగానే అతనికి రామయ్యమ్మతో పెళ్ళి జరిగింది. తల్లి చనిపోవటంతో గవరయ్య గంగలో పడ్డట్టు అయాడు. తన స్నేహితుడు నూకరాజుని తెలివైనవాడని, బతకనేర్చినవాడని అనుకునేవాడు. తాలూకాఫీసులో అటెండరు ఉద్యోగాన్ని నూకరాజు ప్రోత్సాహంతో సంపాదించాడు. తాశీల్దారుకు తన భార్యతో సంబంధాలున్నాయని తెలియటం అతన్ని ఎంతో బాధపెడుతుంది. తనకోసం తనతల్లి సామాజిక నైతిక విరుద్ధమైన పనిచేస్తూందని తెలిసినా ఆమెపట్ల కృతజ్ఞతాభిమానాలవల్ల ఆమెని ఆ విధంగా వ్యభిచారిని చేసిన సామాజిక ఆర్థిక వ్యవస్థపట్ల అతనికి కోపద్వేషాలు ఉండుంటాయి.

భార్యను పోషించుకోగల ఆర్థిక స్థోమత సంపాదించుకున్నానన్న అతని ఆనందాన్ని తాశీల్దారు బుగ్గిపాలు చేసాడు. ప్రేమించే భర్తను తాను ఉన్నాను అనుకునేవాడు కాబట్టి భార్యమీద విశ్వాసం ఉండేది. తల్లి హయాంలో గడిచిన సామాజిక విరుద్ధమైన పనులు తన తరంలో కూడా పునరావృతం అవటం గవరయ్య

సహింపలేకపోయాడు. బంట్రోతుల భార్యలని పక్కదారిలోకి లాగే అధికారవ్యవస్థపట్ల తీవ్రమైన కోపం ఏర్పడి భార్యని, తాశీల్దారుని చంపెయ్యాలనుకుంటాడు.

నూకరాజు గవరయ్య కోపాన్ని దారిమార్చి డబ్బు సంపాదించే వేపు తిప్పుతాడు. దాంతో తహసీల్దారుని బెదిరించి డబ్బు సంపాదించాలనే ప్రణాళిక వేశారు. కానీ ఇందులోనూ నూకరాజు తనకు మొత్తం డబ్బు ఇవ్వలేదని గ్రహించి అతన్ని నిలదీసి మిగతాడబ్బు వసూలుచేస్తాడు. ఏ ఒక్కరినీ నమ్మకపోవటం, అందరిపట్ల కఠినంగా వ్యవహరించటం గవరయ్య జీవనవిధానం అయింది. అన్ని సంవత్సరాలుగా మందంగా, మొద్దుగా ఉన్న గవరయ్య మెదడు ఒక్కసారిగా పదునెక్కింది. గవరయ్య ఇప్పుడు కంట్రాక్టర్ అయ్యాడు.

తమకు జరిగిన ఏవో అనుభవాల ద్వారా కోపం పెంచుకొని, దాని నుంచి ఉద్భవించే మానసికోద్వేగం అసూయలతో ఆర్థికంగా సామాజికంగా తమకన్నా క్రింద ఉన్న వారిని ఏడిపించుకుంటూ బ్రతకటం, నిరసన భావంతో చూడటం వెంకట్రావులాంటి వాళ్ళు చేసే పని.

వెంకట్రావు తన అవసరాలకు సుబ్బయ్యని తోలుబొమ్మని చేసి ఆడించటానికి కారణాలు అతని గత జీవితానుభవాలని ఈ నవల నిరూపిస్తుంది. అయితే మనిషి ప్రవర్తనకు కారణాలు చెప్పి, దానికి ఏ ప్రయోజనాన్ని ఆశించి ఆ వ్యక్తి అలా ప్రవర్తిస్తున్నాడో తెల్సుకొని ఆ ప్రయోజనం సాంఘికీకరణకి ఉపయోగపడితే దాన్ని ప్రోత్సాహించాలన్న విషయాన్ని ఈ నవల చెపుతుంది. అదే విధంగా అతని ప్రవర్తన స్వార్థపూరిత అభిరుచులతో ఉంటే దాన్ని వివరించి, అతని జీవితమార్గాన్ని మళ్ళించటం అవసరమని మనోవైజ్ఞానికశాస్త్రం చెప్పే విషయం తీసుకొని రచయిత ఈ నవలలో సుబ్బయ్య ప్రవర్తన ఏ ప్రయోజనాన్ని ఆశించి ఉందో నిర్ధారించుకునే వెసులుబాటుని కల్పించారు.

వెంకట్రావు తన అవసరాలకు సుబ్బయ్యను 500 రూపాయలు గవరయ్య వద్ద నుంచి తీసుకోమని చెపుతాడు. ఆ పనిని తనవంటి ఎందుకూ కొరగాని మనిషి అంతటి ఘనకార్యం చేయగల్గినందుకు అతనికి చెప్పలేనంత సంతోషం కలిగింది. ఆ తర్వాత సుబ్బయ్య సీటు మారతాడు. తన డబ్బులు తిరిగి ఇవ్వమని గవరయ్య ఒత్తిడి తెస్తాడు. వెంకట్రావుని అడుగుదామంటే అడగలేక ఎంతో తటపటాయించి చివరికి అడుగుతాడు. అతని ఇంట్లో కూడా అంతకుముందు "వెంకట్రావు అతని ఆడమనిషి మధ్య పానకంలో పుడకలా నా కర్కశ కంఠం" అని తనను తాను తక్కువచేసుకుంటాడు. తర్వాత నన్ను వెర్రివెధవని చేసి నవ్వుకుంటున్నారని సుబ్బయ్య బాధపడతాడు. ఇది అతని ఆత్మన్యూనతాభావాన్ని వెల్లడిస్తోంది.

గవరయ్య బిల్లులను తన దగ్గర ఉంచుకొని 500 రూపాయలు తీసుకోవటం సుబ్బయ్యకి సంతోషం కలిగించింది. నేను కూడా ధీమాగా, ధైర్యంగా ఉండగలిగితే - అని అనుకునే సుబ్బయ్య లంచం తీసుకుంటే ఏమవుతోందోనన్న భయంవల్లే ఇన్నాళ్ళు ఊరుకున్నాడు. ఆఫీసులో అవధాని "చూడూ! సుబ్బన్నా మనం అనుకున్నంత

అమాయకులం కామోయ్" అన్న మాటలు సుబ్బయ్యకి అంతరాంతరాల్లో, ఇతరులు ఏమైనా ప్రేరేపిస్తే పని చేసే లక్షణం ఉందని వివరిస్తాయి.

లంచం తీసుకున్నట్లు ఆఫీసులో తెలిస్తే ఉద్యోగం ఏమవుతుందోనని సుబ్బయ్య విపరీతంగా బాధపడతాడు. ఈ సందర్భంలోనే జబ్బుగా ఉన్న ఎదురింటి మాష్టారిని చూడటానికి వచ్చిన మనోరమ గురించి బోలెడన్ని ఆలోచనలు చేస్తాడు. ఆమె కోసమే తాను పుట్టానని, తనకోసమే ఆమె ఇన్నాళ్ళ నుంచి నిరీక్షిస్తున్నదని ఊహలు అల్లుతాడు.

మనోరమతో స్నేహం చేసి, ఇంటికి వెళ్ళి ఆమె సాన్నిహిత్యంలో సంతృప్తిని అనుభవించటం కూడా సుబ్బయ్య తనలోని అభద్రతాభావం పోగొట్టుకోవటానికి చేసిన పనే. కానీ, మనోరమ డబ్బు ఇవ్వమని అడుగుతుందో లేదా పెళ్ళి చేసుకోమని కోరుతుందో అని బెంగపడుతుంటాడు.[11] ఎన్నో అనుమానాలతో 'మనోరమకు మరి కనిపించను, కనిపించానంటే పీకేస్తుంది' అని అనుకుంటాడు. తనకు, మనోరమకు సంబంధం ఏర్పడుతుందేమో అది తెలిస్తే సమాజంలో, కుటుంబంలో ప్రస్తుతం ఉన్న భద్రతకు ప్రమాదం వాటిల్లుతుందేమోనని బాధపడుతుంటాడు. ఈ సంగతి గ్రహించి భార్య ఇంట్లో నుంచి గెంటివేస్తుందేమోనని మరో రకంగా భయం.

డబ్బు సంపాదించాలన్న ఆలోచన లేకుండా, డబ్బు సంపాదించే సామర్థ్యం ప్రాతిపదికగా కాక తనకు కష్టాల్లో ఉన్నప్పుడు ఓదార్పు నివ్వటమే కాకుండా, మనిషిగా గుర్తించి ప్రవర్తించిన మనోరమని సుబ్బయ్య చాలా ఆరాధిస్తాడు. వంతెన మీద కూర్చున్న తమిద్దరినీ చూసి ఇతరులు ఈర్ష్యతో, క్యూరియాసిటీతో ఉన్నారనుకోవటం సుబ్బయ్యకి ఎంతో ఉత్సాహం కలిగించింది.

డబ్బు కోసం గవరయ్య హెచ్చరికలు చేస్తుంటాడు. దీంతో సుబ్బయ్య పడ్డ క్షోభ ఎక్కువయింది. వెంకట్రావుని అడిగితే డబ్బు తిరిగి ఇవ్వలేనని చెప్పమని సుబ్బయ్యకి సలహానిచ్చి అంతటితో తన బాధ్యత తీరిపోయిందన్నట్లు ప్రవర్తిస్తాడు. గవరయ్యకి 500 రూపాయలు తిరిగి ఇచ్చే మార్గం కనపడని పరిస్థితుల్లో ఏదో ప్రమాదం జరిగి గవరయ్య చనిపోతే బాగుండునని అనుకోవటం అతని ఆలోచనాధోరణిని, తన క్షేమం పరమార్థంగా చూసుకునే తత్వాన్ని చెపుతోంది. అలానే పుట్టినప్పుడే తాను చచ్చిపోతే బాగుంటుందన్న ఆలోచనలు కూడా అతనికి వస్తాయి.

గవరయ్య కారు ఆపి సుబ్బయ్యని కొట్టి, సొమ్మిచ్చేసి గౌరవం దక్కించుకోమని వార్నింగ్ ఇచ్చినప్పటినుంచీ సుబ్బయ్య సంతోషం చచ్చిపోయింది. జగన్నాథస్వామికి మొరపెట్టుకుంటాడు. తాను ఆడదానికన్నా అధ్వాన్నం అని ఆత్మనింద చేసుకుంటాడు. ఇలా సామాజికార్థికకౌటుంబిక వాతావరణ పరిస్థితులవల్ల కలిగిన అభద్రతాభావం, ఆత్మనింద, ఆత్మన్యూనతాభావాలు అతనిలో స్వార్థాన్ని పెంచుతుంటాయి. ఈ స్వార్థపూరిత ఆలోచనల్నీ, ప్రవర్తనని రచయిత కూడా అసహ్యించుకుంటాడు.

అవధాని, పోతన్నలు కూడా 500 రూపాయలు తాను గవరయ్యకు ఇవ్వలేనని చెప్పమని సుబ్బయ్యకి సలహానిస్తారు. ఆ ప్రకారమే చెప్పి సుబ్బయ్య అదేరోజు రాత్రి మనోరమ దగ్గర నుంచి వస్తూ గవరయ్య మనుషుల చేతిలో దెబ్బలు తింటాడు. వెయ్యి

రూపాయలు బాకీ ఉన్నట్లుగా వ్రాయించిన ప్రోనోటు మీద బలవంతంగా సుబ్బయ్య చేత సంతకాలు చేయిస్తారు. ఈ సంఘటన తన బాల్యంలో తండ్రికి జరిగినదాన్ని పోలి ఉండటంతో తీవ్రమైన మానసికోద్వేగాలకి సుబ్బయ్య గురయ్యాడు.[7] "భయపడి రాసేను. ఏదో ఒహటవుతుంది. భయం ప్రతివాడికి ఉంటుంది"... అని తనలోని అంతరంగ సంక్షోభాన్ని గుర్తిస్తాడు. ఇంతకాలంగా తాను అధికారమంటే హడలిపోతూ ప్రవర్తిసున్నానని తెల్సుకుంటాడు. హీనంగా, నీచంగా, దైన్యంగా ఇన్నాళ్లబట్టీ తాను బ్రతికిన జీవనాన్ని గ్రహించాడు. అందుకే దానికి స్వస్తి చెప్పి తనలోని, ఆత్మన్యూనతా భావాన్ని జయించి సామాజిక జీవిగా జీవించాలన్న అకాంక్ష అతన్లో మొదలయింది. ఇది సుబ్బయ్య పాత్ర సాధించిన విజయం. ఈ రకంగా రావిశాస్త్రి సుబ్బయ్యకు మంచిదారిని, మనుషులు నడిచే దారిని చూపించి ఆ బాటవెంట సాగిపొమ్మని సలహానిచ్చారు.

సుబ్బయ్య ముఖ్య విషయం మాట్లాడాలి రమ్మన్న మనోరమని ఆమె కష్టమేమిటో కనుక్కోని, చేతనైతే సాయం చేయాలని అనుకోవటం అతను తనలోని పలాయన స్వభావాన్ని వెనక్కి నెట్టిన ఘనవిజయాన్ని వివరిస్తోంది. ప్రోనోటు విషయం తెల్సిన అవధాని, వెంకట్రావు, మనోరమలు తలా ఒకరకంగా గవరయ్య మీద ఒత్తిడి తెస్తారు. చివరకు గవరయ్య ఆ నోటు తిరిగి సుబ్బయ్య వద్దకి పంపిస్తాడు. సుబ్బయ్య దాన్ని కాల్చేసి మనోరమ కోసం వెళ్ళి సముద్రపు ఒడ్డున ఆమెను కలవటం జరుగుతుంది.[8]

గవరయ్య ఎంత కఠినంగా ప్రవర్తించినా, చివరకి సుబ్బయ్య తరపున తన దగ్గరకు వచ్చిన మనోరమ చిన్నతనంలో తన తల్లికి ఎంతో ఇష్టంగా ఉండేదన్న విషయం గుర్తుకువచ్చి ఆలోచిస్తాడు. మనోరమ గురించి చాలా ఆర్తిని చెందుతాడు. సుబ్బయ్యచేత బలవంతంగా రాయించిన ప్రోనోటును తిప్పి పంపిస్తాడు. ఒక విధంగా, భార్య ప్రవర్తనవల్లే తాను రాక్షసుడిగా మారానన్న విషయం తెల్సుకున్న గవరయ్యలో చైతన్యం ఉంది. ఇది మంచీ, చెడులని గ్రహించి ఏనాడైనా మారే అవకాశాలు గవరయ్యకు ఉన్నాయన్న విషయం స్పష్టం చేస్తోంది. పుట్టుకతో తానే వర్గానికి చెందినవాడో గ్రహించి ఆ వర్గం పక్షాన నిలబడేటందుకు అతనికి సమస్త అవకాశాలు ఉన్నాయని, అవి ఉపయోగించుకోవటం అనేది అతని పని అని రచయిత భావన.

భయపడటం తనకు అవసరం అని సర్దిచెప్పుకుంటూ దాని వెనక తన అభద్రతా భావాన్ని దాచుకుంటూ బ్రతికిన సుబ్బయ్య అంతగా భయపడాల్సిన అవసరంలేదని తెలుసుకుంటాడు.[9] మనిషిగా తాను అన్ని పనులు చేయగలనని, ఆ శక్తిసామర్థ్యాలు తనకూ ఉన్నాయని నమ్మకం తెచ్చుకోవటం జరిగింది. రావిశాస్త్రి ఈ పాత్ర ద్వారా మంచికి మనుషులని మార్చాల్సిన ఉద్యమం మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి వర్గాలని దృష్టిలో ఉంచుకొని విస్తృతంగా నిర్మించాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారు. మధ్యతరగతి వర్గానికి ప్రతినిధి అయిన సుబ్బయ్య విజయం సోషలిస్టు విజయానికి దారి తీస్తుందనే ధ్వని ఈ నవల్లో ఉంది. ఇది రచయిత సాధించిన సాహితీ విజయం.

పెట్టుబడిదారీ వ్యవస్థను మంచికి మార్చటం ఎంతో కష్టమని గ్రహించిన రచయిత వెంకట్రావు ఎందుకు మంచిగా మారలేదో వివరించాడు. ఆ వ్యవస్థలో మంచి అంటే వ్యాపార వర్గాల ప్రయోజనమే. అది సమస్త మానవులను, సామాన్య జనాన్ని

దృష్టిలో ఉంచుకొని సమిష్టి ప్రయోజనాల కోసం పాటుపడేటంత 'మంచి' కాదు కాబట్టి రావిశాస్త్రిగారు సుబ్బయ్యని ప్రధానపాత్రగా తీర్చిదిద్ది అతనికి మంచిని మార్పుగా చూపించారు. మధ్యతరగతి కళ్ళు తెరిచి సామాజిక జీవులుగా, నలుగురి మంచీ ఆలోచించే వాళ్ళుగా అవటం అలానే మనిషి జీవితం మీద పెత్తనం చేసే ఉద్యోగ వ్యవస్థ, అధికార వ్యవస్థ, రాజ్య విధానం, వివిధ యాజమాన్య వ్యవస్థల స్వభావాన్ని గుర్తిస్తుందనటాన్ని సోపపత్తికంగా నిరూపించారు.

అల్పజీవులు పరిపూర్ణ మానవులుగా తయారైతే సోషలిస్టు సమాజ నిర్మాణానికి సైనికులవుతారని తెలుస్తోంది. సుబ్బయ్యలో జరిగిన మంచిమార్పుని రచయితలు వారి ఆశయంగా పెట్టుకోవాలని రావిశాస్త్రి సలహానిచ్చారు.

మనోరమకోసం బీచ్‌లో ఎదురుచూస్తూ ఉండటమో, మొహం తప్పించి పోవటమో అన్న ఆలోచనలు వచ్చినప్పుడు, సుబ్బయ్య వుడాయించటం దొంగల, దగుల్బాజీల లక్షణమని అనుకొంటాడు. దాంతో తన ముప్ఫయి అయిదేళ్ళ జీవితానికి మూలసూత్రాన్ని అర్థం చేసుకొంటాడు.[10] ఇది స్వాతంత్ర్యానంతరం పరివర్తన చెంది తన వర్గస్వభావాలని తెలుసుకున్న మధ్యతరగతి స్వరూప స్వభావాల్ని మన కళ్ళముందు సాక్షాత్కరింపచేస్తోంది.

రావిశాస్త్రి తన ఆదర్శ రచనల ద్వారా ఆధునిక తెలుగు సాహిత్యాన్ని ఎంతో ప్రభావితం చేసారు. మధ్యతరగతి,. శ్రామిక వర్గాలని తన సాహిత్యంలో నెత్తురూ చీమూ ఉన్న పాత్రలవలే చిత్రించి సాహిత్యంలో వారికి శాశ్వతత్వం ఇచ్చాడు. తన రచనల ద్వారా సాహిత్య ప్రయోజనాన్ని వివరించి దాన్ని త్రికరణశుద్ధిగా రచయితలు పాటించాల్సిన అవసరాన్ని చెప్పారు. ఆయన చాలా మంచి రచయిత.

## వివరణలు:

1. రావిశాస్త్రిగారి స్వంత మాటల్లో చెప్పాలంటే.... "కాని స్వతహాగా డబ్బుగలవారి కుటుంబాలకే చెంది వాళ్ళమధ్యనే ఉంటూ కారణాంతరాలవల్ల డబ్బులేనివాడిగా అవడంవల్ల నాలో పరస్పర విరుద్ధమైన వాంఛలూ, సరదాలూ, చింతలూ, చిరాకులూ, ఆశలు, నిరాశలూ, నిర్లక్ష్యత, బాధ్యత అన్నీ ఒకేసారిగా ఉంటూ వచ్చేయి. వాటిని వ్యక్తీకరించడంలో నాలోనుంచి రకరకాల కథలొచ్చేయని నేను తలుస్తున్నాను."
2. అల్పజీవి నవలకి తొలిపేరు "చేదువిషం జీవఫలం." దీన్ని రచయితే పెట్టుకున్నారు. 1953లో ఇది భారతి పత్రికలో అల్పజీవి పేరుతో అచ్చయింది. ఆచంట జానకిరాంగారు దీన్ని A man of consequence పేరుతో 1994లో ఇంగ్లీష్‌లోకి అనువదించారు.
3. దేముడే లేదన్న డార్విన్ సిద్ధాంతం, శాస్త్రీయ దృక్పథం పెరగటం, పారిశ్రామిక విప్లవం కారణంగా సమాజంలోని విభిన్న వర్గాల మధ్య ఘర్షణలు.... ఇలాంటి వాతావరణ నేపథ్యంలో వ్యక్తి వైయక్తిక పరిధిని తీసుకొని రచనలు చేసే విధానం తెలుగు సాహిత్యంలోనూ వచ్చింది.

4. ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని ఇంకా మెరుగుపర్చిన ఆడ్లర్ ప్రతిపాదించిన ఆత్మన్యూనతా సిద్ధాంతం ముఖ్యమైనది. ప్రతి వ్యక్తి పుట్టినప్పటి నుంచి ఆధిక్యత కోసం ఎలా ప్రాకులాడతాడో అది లభించనప్పుడు ఎలా కుంగిపోతాడో ఈ సిద్ధాంతం వివరిస్తుంది.
5. సుబ్బయ్యలోని ఆత్మన్యూనత అతని అచేతనలో అణచివేయబడ్డ లైంగిక వాంఛలూ ఈ ఊహాగానాల రూపంలో బయటకి వస్తున్నాయి. అతని అన్ని Fantasies లోనూ సుబ్బయ్యగారే కథానాయకులు.
6. సుబ్బయ్య అచేతనలో ఉన్న చెడుతలంపుల projection అంతా ఇందులో కన్పిస్తుంది.
7. సుబ్బయ్య విషయంలో ఈ Primal trauma – అంటే జీవితం తొలిదశల్లో వ్యక్తి ఎదుర్కొన్న సంఘటనలు శాశ్వతంగా అతన్ని ఇబ్బంది పెట్టడం కనిపిస్తోంది.
8. సుబ్బయ్యలోని అచేతనలో ఆధిక్యత (Superiority) కోసం జరుగుతున్న ఆరాటానికి మనోరమ కొంతవరకు సంతృప్తినిచ్చింది. సుబ్బయ్య చివరలో మనోరమని కలవడం అనేది అతగాడిలోని భయాలకు కారణభూతమైన ఆత్మన్యూనతని తొలగించుకోవటం క్రిందకి వస్తుంది.
9. అంతకుముందు సుబ్బయ్య Fantasies లో ఉన్న Conquering hero dreams అలాగే Suffering hero dreams అన్నీ పోయి Plus minus conflict లో సుబ్బయ్య వెలుగులోకి నడిచాడు.
10. సుబ్బయ్య తాను నిర్మించుకున్న ఆలోచనల సౌధాలలోకి తాను స్వయంగా అడుగుపెట్టి తనని తాను తెల్సుకున్నాడు. మనోరమ ఒక విధంగా అతని mother figure. ఇప్పుడు ఆ స్థాయినీ దాటి, ఫోబియాలు పోగొట్టుకొని మనిషి అంతరంగంలాంటి సముద్రం కేసి చూసాడు.

# డా॥ సి. నారాయణరెడ్డి

సింగిరెడ్డి నారాయణరెడ్డి ఆధునిక తెలుగుసాహిత్యంలో చాలా పేరు పొందిన కవి, పరిశోధకుడు. 1931లో కరీంనగర్‌జిల్లా హనుమాజీపేటలో జన్మించిన నారాయణరెడ్డి స్వయంకృషితో అంచెలంచలుగా ఎదుగుతూ తెలుగు సాహితీ క్షేత్రంలో అరుదైన ప్రయోగాలు చేసారు. బుచ్చమ్మ, మల్లారెడ్డి దంపతులకు జన్మించిన వీరు ఎటువంటి సాహితీ వాతావరణం లేకపోయినా స్వీయ ప్రతిభతో ఎన్నో శిఖరాలను అధిరోహించారు.

ఉస్మానియా యూనివర్సిటీలో తెలుగు ప్రొఫెసరుగా, తెలుగు విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా పనిచేసారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి సాంస్కృతిక సలహాదారునిగా అమూల్య సేవలను అందించారు. రాజ్యసభ సభ్యులుగా కీలక బాధ్యతలను పోషిస్తున్నారు. ఎన్ని పదవులు చేపట్టినప్పటికీ తెలుగు కళామతల్లికి సేవచేయటాన్ని విస్మరించలేదు.

ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు అనే వీరి పరిశోధనా గ్రంథం తెలుగు సాహిత్యంతో పరిచయం ఉన్న ప్రతివారు తప్పక సంప్రదించాల్సిన గ్రంథంగా పేరు పొందింది. జలపాతం, నాగార్జునసాగరం, కర్పూరవసంతరాయలు, దివ్వెలమువ్వలు, అక్షరాల గవాక్షాలు, మధ్యతరగతి మందహాసం, మంటలు - మానవుడు, మనిషి - చిలుక, నడక నా తల్లి, విశ్వంభర, మట్టీమనిషీ ఆకాశం వంటి అనేక కవితా సంపుటులు ప్రచురించారు.

జ్ఞానపీఠ పురస్కారం అందుకున్న రెండవ తెలుగు కవి. విశ్వంభర కావ్యానికి లభించిన ఈ సన్మానంతో తెలుగుసాహితీ కన్యకు నూతన ఆభరణం సమకూరింది. ఈ కావ్యం అనేక భారతీయ భాషల్లోకి కూడా అనువాదం అయింది. అంతకుముందు ఈ కావ్యానికి సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు కూడా లభించింది.

మాత్రాచ్ఛందస్సుల అశ్వహృదయం తెల్సిన క్రీడాకారుడు సినారె. వీరి కవితాశక్తి, వర్ణనా వైదగ్ధ్యం బహు ప్రశంసనీయమైంది. విశిష్ట గేయకావ్యాలను అందించటంలో సినారె చూపిన పాండిత్యం చాలా విశిష్టమైంది. ప్రాచీన సాహిత్యాన్ని, పాశ్చాత్య సాహిత్యాన్ని పరిపూర్ణంగా అధ్యయనం చేసి మేలిమిగాళ్ళవంటి పదాలతో కర్పూర పరిమళాలు వీచేటట్లు వీరు రచనలు చేసారు.

ఉపన్యాసాలలోనూ వీరికి తిరుగులేదు. ఇటీవలి కాలంలో ఒక ట్రస్టు ద్వారా ప్రజాసేవలో నిమగ్నులయ్యారు.

మట్టిని స్థలానికీ, ఆకాశాన్ని కాలానికీ ప్రతీకలుగా స్వీకరించి మానవుడిని ఈ రెంటికి అనుసంధానకర్తగా రూపొందించి వెలువరించిన కావ్యం మట్టీమనిషీ ఆకాశం. నిత్య చైతన్యవంతుడైన మనిషి కాలాన్ని జయిస్తాడన్న అభిప్రాయాన్ని ఈ కావ్యం ద్వారా కవి వ్యక్తీకరించారు.

# 27. మట్టీ మనిషీ ఆకాశం - ప్రతీకలు, కావ్య పరమార్థం

వర్తమాన కాలంలో డా॥ సి. నారాయణరెడ్డిగారి బహుముఖ ప్రజ్ఞ తెలుగు సాహిత్యాన్ని అనేక విధాలుగా ప్రభావితం చేసింది. మన కాలంలోని ఆలోచనావాదుల్లో సృజనాత్మకతకి, పరిణామశీలతకు, వస్తు వైవిధ్యానికి, భావానుభూతుల ప్రకటనకి వీరి కావ్యాలు మంచి ఉదాహరణ. తెలుగు సాహిత్యంలో వచనకావ్యాలను వెలువరించటంలో వీరు నూతన ఒరవడిని ప్రవేశపెట్టారు. సంక్షిప్తతని దృష్టిలో పెట్టుకొని విషయ ప్రకటనకి ప్రాధాన్యతనిస్తూ రచనలు చేసిన నారాయణరెడ్డి కవిత్వ గుబాళింపులు చాలాకాలం నిల్చి ఉంటాయి. 'మట్టీ మనిషీ ఆకాశం' కావ్యంలో సినారె నూతన ప్రమాణాల్ని నెలకొల్పారు. ఈ గేయం నిజానికి కావ్యేతిహాసం. సంప్రదాయాన్ని గౌరవించి, దాన్ని పునాదిగా చేసుకుని చక్కని భావుకతతో కావ్యాన్ని రాయటాన్ని వ్రతంగా చేసుకున్న నారాయణరెడ్డి వందపేజీల కావ్యేతిహాసంలో వేయి పేజీలకు పైబడే భావాలను నిక్షిప్తీకరించారు. ఈ విశిష్టత టి.ఎస్. ఇలియట్‌లాంటి మేధావులు సాధించిన సాహితీ విజయంతో పోల్చతగినది.[1]

ప్రస్తుత కావ్యేతిహాసం ప్రతీకాత్మకమైనది. ప్రతీకలను చక్కగా ఉపయోగించటంలో నిష్ణాతులు కాబట్టి నారాయణరెడ్డి తన కావ్య లక్ష్యాన్ని సునాయాసంగా సాధించగలిగారు. పాశ్చాత్య సాహితీ క్షేత్రంలో వెల్లివిరిసిన ప్రతీకాత్మక కావ్యాలను అన్నింటినీ పరిపూర్ణంగా అధ్యయనం చేసిన సాహితీవేత్తగా సినారె ఈ కావ్యేతిహాసంలో కనిపిస్తారు.

ఇతిహాసం సాహితీ ప్రపంచంలో ఒక అత్యున్నతమైన ప్రక్రియగా గుర్తింపు పొందింది.[2] ఇది చాలా బృహత్స్వరూపం కలిగింది. ఈనాటి రోజుల్లో వ్యక్తి దీర్ఘమైన ఇతిహాసాలను చదివే తీరికలేక ఉన్నాడు కాబట్టి సాహితీవేత్తలు ఇతిహాస లక్షణాలన్నీ వచ్చేలాగా, కావ్యంలోనే సంక్షిప్తతతో దాని విశిష్టతను సాధించేలా కృషి చేస్తున్నారు. ఏది ఏమైనా కావ్యేతిహాస రచనకి పూనుకోవటం ఒక సాహసం.

మట్టీ మనిషీ ఆకాశంలోని నాయకుడు మానవుడే. నిత్యచైతన్యవంతుడైన మనిషి నిరుత్సాహపడకుండా, ఏ విషయానికి కృంగిపోకుండా, తిరోగమన ధోరణులని కట్టిపెట్టి జీవితంలో పురోగమనానికి కృషిచేస్తాడని ఈ కావ్యేతిహాసం వివరిస్తుంది. చైతన్యమూర్తికి కవిత్వం ద్వారా ఉత్సాహాన్నందించటం, లక్ష్యసాధనలో నిరుత్సాహం వద్దని సూచించటం దీనిలో కన్పిస్తాయి. సమస్త మానవజాతి నిర్భీతితో, ఆనందంతో, చైతన్యవంతంగా మసలాలని ఈ కావ్యేతిహాసం ఆకాంక్షిస్తోంది.

ఈ కావ్యేతిహాస ప్రారంభంలో సూచించినట్లు మానవుడిని స్థలానికీ, కాలానికీ అనుసంధానకర్తగా గ్రహించాలి. అహంకార రాహిత్యాన్నే ఈ కావ్యేతిహాసం అంతిమంగా ప్రబోధిస్తోంది. మనిషికి మరణం లేదనే ఇది వివరిస్తోంది. చ్యుతి అనేది శరీరానికి తప్ప మానవుని ఆలోచనలకు, చైతన్యానికి కాదని కవి చెప్తున్నారు. పంచేంద్రియాల మాయాజాలానికిలోనై తన అస్తిత్వాన్నే పోగొట్టుకునే ప్రమాదం ఉందని ఈ కావ్యం హెచ్చరిస్తోంది. భ్రాంతికీ, వాస్తవికతకి మధ్య ఏమి చేయాలో తెలీక ఊగిసలాడతాడు. అయితే ఎటువంటి విపత్కర పరిస్థితులలోనూ చలించక, నిటారుగా ధైర్యంగా నిలబడి

మధ్య జరిగే ఘర్షణతో పోల్చవచ్చు.

ఒక విధంగా చూస్తే కావ్యేతిహాసంలో అన్ని సాహితీ ప్రక్రియలు కలిసిపోయి, ఏకప్రక్రియగా అవతరించినట్లు కనిపిస్తోంది. ఎక్కడా అధ్యయన విభజనకానీ, శీర్షికలుకానీ, ఉపశీర్షికలుకానీ లేకుండా ఈ దీర్ఘకావ్యం సాగడం, ఆగిపోవటం, కొనసాగటంగా స్థూలదృష్టికి కనపడే జీవితం చైతన్య స్వరూపాన్ని, నిత్యగమనాన్ని సూచిస్తోంది.

నిత్యజాగృతి, మనిషి అమర్త్యతత్వం, ద్వంద్వాతీత వైఖరి, సర్వజ్ఞత, మృత్యుఘోష, స్థితప్రజ్ఞత్వం, అహంకార వైఖరి, మానవతత్వం... ఇలా చెప్పుకుంటూ పోతే మానవుని జీవితంలోని ప్రతి అంశాన్ని ఈ కావ్యం తడుముతోంది. పాత్రలకు మానవీయత కల్పించకుండానే కవి దీన్ని సాధించారు.

డా॥ సి. నారాయణరెడ్డిగారి కవిత్వతత్వం కూడా ఈ కావ్యంలో కనిపిస్తుంది. జడసృష్టిని, చైతన్యమూర్తికి ఆదర్శంగా పేర్కొనటం గమనిస్తే ఈ విషయం తెలుస్తుంది. కళాత్మకమైన విషయం ఏదైనా సరే అది చదువరులకు ఆనందం కలిగిస్తుంది. అంతిమంగా కావ్యసందేశమే చదువరులకు జీవధాతువుగా, జీవన సందేశంగా గోచరమవటం అంటే సామాన్య విషయం కాదు. ఆకాశాన్ని మనిషికి ఆదర్శంగా చూపటం కోసం దానికి తత్వారోపణ చేయటం జరిగింది. సాహితీ విమర్శకుల దృష్టిలో కావ్యపరమార్థం వ్యక్తిలోని సహృదయతని తట్టిలేపటం. కవిత్వం దీనికి ఉపకరణంగా, వాహికగా ఉంటుందని ఈ కావ్యం ద్వారా కవి నిరూపించారు.

"మట్టి మనిషీ ఆకాశం
వీటి చుట్టే అల్లుకుంది సృష్టికథా సూత్రం"

అన్న ప్రారంభవాక్యాలు వస్తు నిర్దేశనంతో పాటుగా కావ్యపరమార్థాన్ని వెల్లడిస్తున్నాయి. సృష్టి కథాసూత్రాన్ని మొత్తాన్ని ఈ కావ్యేతిహాసం తనలో ఇముడ్చుకుంది. మట్టికీ, ఆకాశానికి అనుసంధానకర్త మానవుడే - ఈ కావ్య వస్తువు. అంతేకాదు, 'ఆశీర్నమః స్క్రియా వస్తు నిర్దేశో పాపితన్ముఖమ్' అన్న లాక్షణిక నియమానుసారం కవి కావ్యాన్ని ప్రారంభిస్తూ మానవుడిని ఆశీర్వదిస్తున్నాడు. ఏ ప్రతీకల ద్వారా కావ్య రచన చేస్తున్నాడో వాటినే మొదటగా చెప్పటం గమనార్హం.

మనిషికి ఉన్న అంతఃశ్శత్రువులలో అహంకారం మొదటిది. దీన్ని వ్యంగ్యంగా "చంద్రబింబం నుంచి తాను తవ్వితెచ్చిన రాతిబెడ్డలు ఇప్పటికీ అద్దాల గంపల్లో ఉన్నాయి. అవి గుర్తుకొచ్చినప్పుడల్లా అహం కొమ్ములకు పదును పుడుతుంది" అని కవి చెపుతున్నారు.

ఏమో ఎప్పటికైనా ఆకాశాన్ని మడచి తెచ్చి
భూమి ఒంటికి చుట్టకపోతాడా
నిరంతరాన్వేషి మనిషి
అన్వేషణకు మూలం పరిణామశీలం

ఆకులలములు తింటూ, కొండగుహల్లో తలదాచుకుంటూ గడిపిన మానవుడు ఇంత పురోగతి సాధించటానికి కారణం అతని నిర్విరామ అన్వేషణ. ఈ గొప్ప లక్షణమే ఇన్ని విజయాలకు దారితీసింది. కాలాన్ని జయించగలదన్న విశ్వాసమే ఇక్కడ వ్యక్తం అవుతోంది.

కాలం శక్తినీ, దాని ప్రభావాన్ని ఈ కావ్యం గుర్తించింది. కాలాన్ని భౌతికదృష్టి నుంచి కాక దాని అఖండత్వాన్ని వివరించేందుకు విశాలదృష్టితో ప్రయత్నించటం చూడాలి.

కదిలిపోవడమంటే కాలాన్ని కత్తిరిస్తూ పోవటమే
కత్తిరించిన చేతులు కనుమరుగయ్యేలోగా
ఎప్పటిలా కాలం అతుక్కుపోతుంది
పడవ చీల్చుకుపోయిన నీళ్ళలా

కాలాన్ని కవి అంగీకరించి పాఠకులకి కూడా కాలాన్ని వృధాచెయ్యవద్దనే సలహానిస్తున్నారు. అసలు కాలాన్ని స్తంభింపచేయాలనుకోవటమే సరికాదని కవి మాటలు: "కాసేపు పడుకుంటామని కెరటాలు మొండికేస్తే నది (సముద్రం?) లెంపలు వాయించదూ"? అంటారు. 'నిత్యసంచలనశీలికి నిద్రలోకూడా నిద్రపట్టదని' చెప్తారు. 'విశ్రాంతి తీసుకో అంటే గాలి అసహ్యించుకోదూ' అని ప్రశ్నిస్తున్నారు. "ప్రతి మనిషి అనుక్షణం కరగాలి, కదలాలి కాలానికి అశ్వగతులు నేర్పుతూ" అనటం మనిషి కాలప్రాధాన్యతని గుర్తెరిగి నడుచుకోవాలనే విశిష్టార్థాన్ని ఇస్తోంది.

ఏ మనిషైనా ఎందుకు పుడతాడు?
జీవితాన్ని పూయించటానికే
ఏ కళ్ళైనా ఎందుకు విచ్చుకోవాలి?
ఆకాశం కొనలని తమలోకి లాక్కోవటానికే

జీవితంలో సార్థకతని సాధించటమే జీవితాన్ని పూయించటం. మానవ జన్మ దీనికోసమే. కాలాన్ని తమలోకి లాక్కోవాలనే విచ్చుకున్న ప్రతికళ్ళు సదా ప్రయత్నిస్తుంటాయి. అంతర్దృష్టి, బహిర్దృష్టి రెంటినీ ఆసరాగా చేసుకొని మానవుడు సమ్యక్‌దృష్టితో సమస్త జీవులని దర్శించి ఆదర్శమూర్తిగా నిలబడాలి.

ఈనాటి మానవుడు మృత్యుభయంతో అనుక్షణం మరణిస్తున్నాడు. కానీ నాశనం భౌతికమైన శరీరానికే తప్ప అభౌతికమైన, నిత్య చైతన్యవంతమైన మానవుని ఆలోచనా స్రవంతికి కాదు. 'దీపం వూపిరికున్న తెగింపు మనిషి ప్రాణానికి లేకుంటే యెలానని' కవి ప్రశ్నిస్తున్నారు. ఆత్మ విశ్వాసమే మనిషికి ఆయువుపట్టు. ఎన్ని సమస్యలు ఎదురైనా చలించక 'మళ్ళీ కొత్త ఆశ మట్టి మొలకై మాట్లాడినట్లు' మానవుడు నడవాలనే సూచన ఇక్కడ ఉంది. 'మృత్యువు ఎక్కడైనా, ఏ రూపంలోనైనా రావచ్చు దానికోసం ఎక్కడ పై కప్పు కూలిపడుతుందోనని పడుకోవటం మానుకుంటాము' అని హాస్యధోరణితో అంటున్నారు.

ప్రకృతికి మనిషికి మధ్య సృష్ట్యాదిగా అల్లుకున్న బింబానుబింబ సంబంధం గురించి కవి వివరించారు. మానవునికి ప్రకృతే పరమోత్తమమైన పాఠశాల. నీటినించి తడిని విడదీయటం ఎలా వీలవదో ప్రకృతి నుంచి మనిషిని విడదీయాలని చూడటం అటువంటిదే. కొన్ని సందర్భాల్లో ప్రకృతి చెలరేగిపోతే జరిగేది విధ్వంసమేనని అయితే అనంతరం వికాసం మొదలవుతుందని వీరు చెప్తున్నారు. ప్రకృతిలో మొక్కల మూలాలు జీవశక్తిని చేదుకుని పరిణత వృక్షాలై నిలుస్తాయని అలాగే శిశువులు ఎదిగి నిలువెత్తు మనుషులవుతారని పరిణామ క్రమాన్ని వివరిస్తున్నారు. అఖిల విశ్వానికి ఆశ ప్రదీపక శక్తి.

*మంటికీ మింటికీ మధ్య మనిషెందుకున్నట్టు?*
*అల్లెతాటిని బిగించినట్టు*
*ఆ రెంటినీ కలిపేయటానికే*
*స్థలమాతృకనూ కాలపతాకనూ*
*అనుసంధానించటానికే*

ఈ అఖిల విశ్వంలో మనిషి ఉనికి స్థలకాలాలని జయించటంలోనే ఉందని కవి భావం. కావ్యప్రారంభంలో వివరించినట్లు మట్టీ, ఆకాశాలను ప్రతీకాత్మకంగా తీసుకొని, పై పంక్తుల్లో వాటిని మరింత విశదీకరించి కావ్య ఆశయాన్ని, పరమార్థాన్ని చెపుతున్నాడు. స్థలమాతృకను, కాలప్రతీకను అనుసంధానించే క్రమంలో మనిషి స్థితమతిగా ఎదగాలి. 'నత్తగుల్లల్లా పడివుంటామంటే ఎలానని' కవి ప్రశ్నించే సందర్భం శతకకారుడు చెప్పిన 'పడివుండదె పేర్మిపాము పదినూరేండ్లును' గుర్తుకు తెస్తోంది. పురుషార్థపరుడు కావటమే మనిషి జీవితానికి సార్థకత. ఆశయాలు దీనికి ఉపయోగపడతాయి. 'భ్రాంతి కలిగించే వెర్రితలలు కావు ఆశయాలంటే అవి వాస్తవాల జీవనదుల ముసుగుల్లేని అలలు' అని కవి చెపుతున్నారు.

కల మనిషికి ఊరటనిస్తుందని కవి అంటారు. బాలగంగాధరతిలక్ అన్నట్లుగానే 'కాసేపు కొమ్మగూటిలో ఒదిగిపడుకొని కలల కువకువలను వినాలనుకుంటుంది' అంటారు.[3]

స్వేచ్ఛగా జన్మించిన మనిషికి అడుగడుగునా అంక్షల సంకెళ్ళే. వాంఛా సఫలతకు ప్రయత్నించటం మానవనైజం. 'కాంక్ష ఏ కాంక్షకు లొంగదని మధ్యలో హద్దులుగా ఉన్న ఉక్కుగోడలు మట్టిపెళ్ళల్లా చూర్ణమైపోతాయని' ఈ కావ్యం చెపుతోంది. కలయికలో అస్తిత్వం కోల్పోవటమే అద్వైతం అని కవి వివరణ. మరో విధంగా చూస్తే పరమాత్మలో కలిసిపోవాలని, కరిగిపోవాలని జీవాత్మపడే వేదనని అక్షరబద్ధం చేసినట్లు కనిపిస్తుంది. "సముద్ర గర్భంలో కలిసిపోయిన నది తన పూర్వరూపాన్ని తలుచుకోదు" అన్న వాక్యాలు దీన్ని బలపరుస్తున్నాయి. మానవుడు ప్రకృతిలో లీనమై తన అస్తిత్వాన్ని కోల్పోవటాన్ని, అద్వైతస్థితికి చేరుకోవటాన్ని గురించి కూడా ఇక్కడ ప్రస్తావిస్తున్నట్లుగా అనిపిస్తోంది.

భూమిలో పుట్టిన అహంకారాన్ని, అది అణిగిన విధానాన్ని కవి ఎంతో సజీవతతో చిత్రించారు. భూమి బుర్రలో 'ఆకాశం అస్తిత్వం ఏమిటా' అన్న వికట ప్రశ్న తొలుస్తుంది అని ఇది మానవునికీ వర్తిస్తుందని సూచనాప్రాయంగా వెళ్ళడించారు. "రత్నగర్భగా ఉన్న నాకూ నిత్యరిక్తంగా ఉన్న నింగికీ పోలికేమిటని" భూమి గర్వపడితే హఠాత్తుగా ఓ ఉరుము ఉరిమి, ఫెళ పెళమంటూ ఓ పిడుగు విరుచుకుపడి ఆ దురహంకారం పడిపోతుంది. అవధులని కమ్మేసిన అహంభావుకత ఎక్కడికి తీసుకొని వెళుతుందో అతి నైపుణ్యంగా కవి వర్ణించారు.

అవనిని అమ్మను చేసిన మట్టిచేతులు
ఆకాశం వైపు లేస్తాయి ప్రార్థనాముద్రలో

ఆకాశానికి సముద్రమంటే కన్ను కుడుతుందని చెపుతూ దాని పర్యవసానాన్ని కూడా వివరించారు. మనిషికి ఆదర్శమైన మట్టీ, ఆకాశాలు అసూయకి, అహంభావానికి లోనైతే మరి మనిషి పరిస్థితి ఏమిటి అన్న ప్రశ్న ఉదయించక మానదు. స్థలానికీ, కాలానికీ రాగద్వేషాలుంటే లేదా అసూయ తలఎత్తితే వినాశనం తప్పదు.

కాలం తన అరచేతి ఇంద్రజాలం
సూర్యుడంతటివాడే తన చూపుడువేలు
అహంకారం నెత్తికెక్కిన నింగి

తరగలైనా, నురగలైనా తడిమనసుంటేనే ఉదయిస్తాయని కవి చెపుతున్నారు. మనిషికి కావల్సింది దయ అనీ అది కొంచెమైనా ఉంటే జడ ప్రకృతిలో కూడా కరువు వెల్లివిరుస్తుందనీ కవి భావం. ఇంద్రియలౌల్యం మనిషికే కాదనీ, సముద్రానికీ ఉందని వేరొకచోట అంటారు. దీన్ని జయించటమే మనిషికి కీలకం.(4) అహంకారం అజ్ఞానానికి దారితీస్తుంది.

కాలరహస్య జిజ్ఞాస మానవ మేధను కదిపే నిరంతర పిపాస. ఏవో కొలబద్దలు పెట్టుకొని కాలస్వరూప స్వభావాదుల్ని తెల్సుకుందామని మనిషి ప్రయాసపడుతుంటాడు. అయితే స్థలాన్ని గీట్లు గీసి చూపినంత సులభంగా కాలాన్ని కొలిచి చూపటం వీలవదనే కవి ప్రకటిస్తున్నారు. మనిషి పిల్చుకునే భూత, భవిష్యత్, వర్తమాన కాలాలు నిజానికి కాలాన్ని పరిమిత దృష్టితో చూసే ప్రయత్నమే. పరిమిత మానవ మేధస్సు కాలాన్ని నిర్వచించటంలోనూ, అర్థం చేసుకోవటంలోనూ పరిపూర్ణమైనది కాదని కవి స్పష్టీకరిస్తారు.

కాలం ఖండఖండాలుగా విడిపోనే పోదు
కత్తితో నరికేస్తే జలం ముక్కలవుతుందా?
వెలుతురులో నల్లటిగీత గీస్తే దాన్ని విభజించినట్లా?

బాల్యాన్ని పాత్రగా తీసుకొని "శైశవం ఆడుకోవటానికి నేల ఒడి చాలదు.

ఎక్కడికైనా పరుగెత్తుకెళ్ళాలని చూస్తుంటుంది" అంటారు. శైశవాన్ని ఇలా ఒక పాత్రగా నిరూపించటం నూతనత్వంతో ఉంది. "చుట్టూ తల్లుల్లా కాపలా కాసే చెట్లే" అని అంటూ శైశవం ఎక్కడకని పోతుందని ప్రశ్నిస్తున్నారు. ఇలా అనటంతో మాతాశిశువులు అన్న భావం కనపడటంకన్నా మాతృప్రేమ అనే నియంత్రణలో శైశవం ఎక్కడికీ వెళ్లలేకపోతోందనే అర్థమే కనిపిస్తోంది., ఆ వెంటనే "సుఖంగా నిద్రపోవే పనితనమా అని జోకొడితే పక్కకుదరదు" అంటారు. నిజానికి శైశవం చెట్టుకింద నీడలాంటిదని కవి వివరిస్తారు. చెట్టుని తల్లికి ప్రతీకగా అనుకొని చూస్తే తల్లి నియంత్రణలోనే శైశవం ఉంటుందనే అర్థమే వస్తోంది. శైశవానికి తల్లిగా శిశువు జన్మని అనుకుంటే మానవ జీవితంలోని వివిధ దశల్లో సాగే చైతన్యం ఆనాడే రూపుదిద్దుకుందని చెప్పినట్లుగా అనిపిస్తోంది.

స్వప్నమంటే అసంపూర్ణ చింతన మూర్తికట్టిన చిత్రం అని కవి నిర్వచనం. స్వప్నమే సర్వమనుకుంటే ఫలితం సర్వాంగపతనం అని హెచ్చరిక చేస్తున్నారు. భ్రాంతికీ, వాస్తవికతకీ మధ్య ఉన్న అంతరాన్ని వివరించటానికి "కొన్ని రూపాలు ప్రతిరూపాలుగా ఉంటేనే సొగసని" వాటిని అద్దంలో చూసినప్పుడే ఆహ్లాదాన్ని ఇస్తాయని చెపుతున్నాడు.

ఐశ్వర్యకాంక్ష పొదరింటిలా అల్లుకుపోయేది
పదవీ ప్రలోభం అడుగడుగునా రుచులు పుట్టించేది
ఆ మాదకత ఆవరించినప్పుడే

సంపూర్ణచింతన ఉన్నప్పుడు ఐశ్వర్యకాంక్ష, పదవీ ప్రలోభంలాంటి ప్రతిరూపాలను వ్యక్తి ప్రతిరూపాలుగానే చూస్తాడు. లేని పక్షంలో భ్రాంతిలోపడి ఆ 'కల'నే వాస్తవం అనుకుంటాడు.

అభ్యుదయగళం కూడా ఈ కావ్యం అంతటా వాస్తవాలను చెపుతూ ఉంది. సంపదని చేతిలో పెట్టుకొని, భూమిని ఆక్రమించి తీరా వాళ్ళకి అవకాశాలనివ్వక దమననీతితో ప్రవర్తించేవారికి 'మనలో మనతో శిరస్సెత్తుకు తిరిగే భూమిపుత్రుల దళితగాత్రాలు' గురించి హెచ్చరిస్తున్నాడు. 'ఇక్కడ పుట్టిన ఈ తొలిచూలు బిడ్డలు' అన్యాయాలని ఇంక సహించరనీ దౌష్ట్యం మీద విరుచుకుపడతారని అంటున్నాడు. "ఏళ్ళకొద్దీ రాయిలా పడివున్న మౌనం పేలిపోతున్నది మందుపాతరలా" అన్నప్పుడు వివిధ విప్లవోద్యమాలు, ప్రజాపోరాటాలు గుర్తుకు వస్తున్నాయి.

సిమెంటు కట్టడాలకింద అణచివేశామనుకుంటే పునాదులను పెళ్ళగించుకొస్తారు భూమిపుత్రులు అనటంతో మహాకవి శ్రీశ్రీ చెప్పినట్లు "స్థాపించిన సామ్రాజ్యాలూ, నిర్మించిన కృత్రిమచట్టాల్ ఇతరేతర శక్తులు లేస్తే పడిపోయెను పేకమేడలై" తథ్యం అని స్ఫురిస్తోంది.

మనిషిలోని పేరాశను కూడా ఈ కావ్యం ఖండిస్తోంది. మిల్టన్ మహాకవి చెప్పినట్లు భూమిని స్వార్థం కోసం తవ్వేవారిని ఈ కవి నిరసిస్తున్నాడు.[5]

ఇటు నేలతవ్వటం ఇప్పటిది కాదు
మనిషి పుట్టినప్పటినుంచి జరుగుతూనే వుంది
పుచ్చిపోయిన బొమికలు తప్ప
స్వచ్ఛమైన జ్ఞాపకాలు దొరకలేదు

న్యాయాన్ని అణగదొక్కాలని చూసేవారిపై ఈ కావ్యం కవితాస్త్రం ఎక్కుపెట్టింది. "ఎక్కడ న్యాయాన్ని తొక్కేసినా ఇక్కడి గుండె మీద ఇనుప బూట్లు దిగుతాయి" అంటారు. ఇనుపబూట్లు అన్నప్పుడు శ్రీశ్రీ చెప్పిన లోహరాక్షసుల పదఘట్టనచే కొనప్రాణంతో కనలేవాళ్ళు జ్ఞప్తికి వస్తారు.[6]

మానవుని విజయానికి విశ్వాసం ఎంత ముఖ్యమో కవి వివరించారు. అంతా పోయినాసరే ఆత్మవిశ్వాసం పోలేదంటూ మానవుడు తన ఆత్మ విశ్వాసంతో పైకి లేస్తాడు. జయింప శక్యంకాని ఆత్మబలం, జీవధాతువు హేతువు ఆహారపానీయాలుగా మానవ చైతన్యం అంకురిస్తోంది.

*మరి విత్తు మాటేమిటి?*
అది సత్తా పుంజుకొని మొలకలతో కుమ్ముకుంటూ
నెత్తిమీది కప్పును తుత్తునకలు చేస్తూ
ఏడేదు నిలువులు ఎదిగెదిగి నిలబడుతుంది

అన్న పై పంక్తులు బైబిల్‌లోని వాక్యాల స్ఫూర్తిని ఇముడ్చుకున్నాయి.[7]

మానవుని మంచి వెంటనే చెడు ఉంటుంది. "ఎంత అప్రమత్తంగా ఉంటున్నా ఎదుగుదలకి దోహదం చేసే నీటి పక్కనే విషక్రిమి వుంటుంది" అంటారు. ద్వేషం మానవుని అస్తిత్వానికే ప్రమాదం తెస్తుంది. ఇది ఎన్ని ధూర్తకృత్యాలకు పాల్పడినా సరిపడక, చాలక తాను పుట్టిన మనసుని దగ్ధం చేసినప్పుడే సంతృప్తి చెందుతుందని నిజం చెపుతున్నారు. ఆధునిక కాలంలోని ఈ ద్వేష ప్రవృత్తే మనిషిని మనిషికి శత్రువుగా చేస్తోంది. ద్వేషాన్ని చంపలేని మానవుడు ప్రేమను చంపినట్లే.

పరాజయానికి వెన్నంటి నడిచేది మృత్యువనీ అది జననంతో పాటే మొలకెత్తిందని భావించాలి. జన్మగతిని మృత్యువు అనుక్షణం నీడలా వెంటాడుతుంటూ ఉంటుందని ఈ కటిక నిజం మానవమేధకు తెలుసని కవి పలుసందర్భాల్లో చెప్పారు. మనిషి అహంకృతి తలకెక్కి మరణిస్తాడని, ఆ హుంకారంలో మరణం అలికిడి వినిపించదని చెపుతున్నారు.

జననంతో పాటే మృత్యువు పుడుతుంది
కన్నువాల్చని సాక్షిగా అది
జన్మగతిని అనుక్షణం గమనిస్తుంటుంది
అగుపించని నీడలా వెంటాడుతుంది
మనిషికి కలిగే ప్రతి ఘోర పరాజయంలో
తానున్నానని తట్టి చెపుతుంది.

సమదర్శిగా ఎదిగిన మానవుడే మృత్యువులాంటి ద్వేషాన్ని జయించగలుగుతాడు. తనను సమస్త ప్రాణికోటిలో దర్శించగలిగిన స్థాయికి మానవుడు చేరుకోగలగాలి. "పక్కపక్కన ఉన్న చెట్ల కొమ్మలు పలకరించుకుంటాయి, నీడలు ఆన్యోన్యంగా కౌగిలించుకుంటాయి" అంటూ ప్రకృతిని చూసి మానవుడు నేర్చుకోవల్సింది చాలా ఉందని ప్రకటిస్తున్నాడు. మానవుడు సాటిమానవుడిని హీనంగా చూడటం, అవమానించటం అమానుషత్వం. అహంకారాన్ని విడనాడి మనిషిని మనిషిగా చూడటం ముఖ్యం. సాటిమనిషితో 'తాదాత్మ్యం' పొందగలగటం మానవుని చైతన్య స్వరూపానికి ఆదర్శం. షేక్స్పియర్ నాటకం 'కింగ్‌లియర్'లో లియర్ రాజు తన కూతుళ్ళు అవమానించగా దేశద్రిమ్మరిగా మారి పేదసాదలని చూసి జీవితం అంటే అర్థం చేసుకుంటాడు. రాజుననే గర్వం పోయి ఒక బిచ్చగాడితో మాట్లాడుతూ తాదాత్మ్యం చెందుతాడు.

ఎక్కడెక్కడి మట్టిలోంచి కొట్టుకొచ్చిన నీళ్ళో
ఏటి పాయలో ఎంత బాగా ఒదిగి పారుతాయి
అవి దప్పు కొట్టుకుంటాయా
తాము పుట్టిన మట్టి మాత్రమే గొప్పదని

అయితే మానవ పురోగతికి, విజయానికి అనేక ఆటంకాలు ఉన్నాయి. కొన్ని అతనే సృష్టించుకున్నవి కాగా మరికొన్ని సమాజం విధించినవి. కవి ఇక్కడ చాలా తీవ్రంగా మానవ జీవన క్షేత్రంలో నాటిన కంచెలను, నైతిక ప్రవర్తనపై విధించిన అంక్షలను విమర్శిస్తున్నాడు. "అహంతకు ప్రాకారాలుగా కట్టుకున్న అంక్షలు మాత్రం ఎంతోకాలం నిలవవు" అని కవి గట్టిగా చెపుతున్నాడు.

ఎటువంటి ఆంక్షలైనా ఎల్లకాలం నిలబడవని కవి వివరిస్తున్నారు. బైబిల్‌లోని ఆదాం కథను ప్రస్తావిస్తూ "అదిగో ఆ పండు తినకు - తింటే పాపం" అన్న తీవ్ర దివ్యస్వరాన్ని ధిక్కరించిన ఆదిమానవుడు ఆత్మజ్ఞుడే కాదు విశ్వజ్ఞుడే అయ్యాడు అంటున్నారు. మతం విధించిన ఎన్నో అంక్షలను మానవుడు వ్యతిరేకించాడు.

ఇదిగో ఈ నీళ్ళు అంటుకోరాదు - అంటుకుంటే నేరం
అది కఠోర వర్ణ దుశ్శాసనం
ఆ ఆంక్షను ప్రతిఘటించిన అస్పృశ్యుడు
అభినవ శాసనకర్త అయ్యాడు

భారతీయ సమాజంలో వర్ణం కారణంగా కొందరిని అస్పృశ్యులనిచేసి, ఆంక్షలు విధించిన దుర్నీతిని పై వాక్యాలు ఖండిస్తున్నాయి. దాన్ని ప్రశ్నించి, వ్యతిరేకించి, ఉద్యమించిన అంబేద్కర్ భారత రాజ్యాంగశిల్పి అయ్యాడు.

నీతిని కాపాడవల్సిన వాళ్ళే దాన్ని కబళించటం, అవకాశవాదులు రంగులుమార్చి ఆంక్షలను విధించటంలాంటి హేయమైన చర్యలను నిర్ద్వంద్వంగా ఖండిస్తున్నారు.

"కాపుగా నిలిచే కంచెలు వంచనలకు మరిగి పచ్చని చేలను కబళించినప్పుడు" చిక్కు వచ్చి పడుతుందని చెపుతున్నారు.

మానవుడిలోని కృత్రిమత్వాన్ని, నటనను కూడా ఈ కావ్యం ఏవగించుకుంటోంది. నిజం ఎన్ని ముసుగులు కప్పినా మరుగుపడదు. గోముఖ వ్యాఘ్రాలు పైపైకి చిరునవ్వులు చిందిస్తుంటారు. కానీ, ఎంతకాలం నటిస్తారు?

కొన్ని నటనలు సహజంగా పుష్పిస్తాయి
మరికొన్ని పెదవుల కుండీల్లో అమర్చిన
కృత్రిమ కుసుమ హాసాల్లా ఉంటాయి

"మేఘం ఎదురుకాగానే వంగి దండంపెట్టి అది చెదిరిపోగానే మీసం మెలిపెట్టి" అవకాశవాదంతో నడిచే ప్రవృత్తి కాదని, కావల్సింది నిజాయితీయేనని కవి వెల్లడిస్తున్నారు.

అంతర్వీక్షణం ఉన్న మానవుడు, ప్రకృతి ప్రదర్శిస్తున్న ఐక్యదృష్టిని పరిశీలిస్తూ ఆత్మవిమర్శ ద్వారా తన మనసుకి పట్టిన జాడ్యాల్ని వదిలించుకుంటాడు.

ఎక్కడ కన్నీరు తొణికినా
తుడిచేయాలనే తహతహ తన వేళ్ళకు
ఏ హృదిలో చితి రగిలినా
ఆర్పేయాలనే తపన తన కన్నీటి జల్లులకు

మానవునికి అంతర్వీక్షణ ఉంటేనే సత్యాన్ని దర్శించగలడు. మరో సందర్భంలో "మంటి పొరల్లోని మింటి తెరల్లోని ఆర్ద్రత మానవాంతరంగంలోనూ తరగలెత్తుతుందని" కవి ఆశాభావాన్ని వ్యక్తం చేస్తారు. కరుణరసాన్ని ఈ కావ్యంలో కవి అద్భుతంగా వివరించారు. మానవునికి కావల్సింది రవ్వంత దయ. ఇది ఉంటే మానవుడు కరుణామయునిగా అవుతాడు. అదే అతని జీవిత పరమార్థం. ఈ కావ్యపరమార్థం కూడా మానవుని కరుణ గురించే.

"ఆర్ద్ర చిత్తమే లేకుంటే
ఆకాశానికి అవి మబ్బుల పులకలెలా కలుగుతాయి?"

ఎటువంటి కసాయి హృదయంలోనైనా కరుణని కలిగించటానికి ప్రేమ శక్తికి అవకాశం ఉంది. "భూమ్యాకాశాల లాలనలో పెరిగిన బిడ్డ కదా! ఆ క్షమాగుణం ఆ దయాగుణం ఎక్కడికిపోతాయి?" అంటారు కవి. మానవజాతికి వారసత్వంగా అందుతూ వచ్చింది ఈ ఆర్ద్రచిత్తమే. ధరిత్రి అనేక వైపరీత్యాలను భరిస్తుంది. ఎట్టి పరిస్థితుల్లో, తన తనువంతా ఎండిపోయి బీటలుపారినా సరే తనలోని తడిని అంటే ఆర్ద్రతను - కాపాడుకుంటుంది. ఈ దయాగుణాన్ని తనవారి కోసం, తన సంతతికోసం పదిలపరుస్తుంది నేల తల్లి. మనిషి దీన్ని నిలబెట్టుకోవటానికి అనుక్షణం శ్రద్ధతీసుకోవాలి.

మానవునిలో అనూహ్యామథనం అనివార్యంగా మొదలవుతుంది. గర్భకోశం లేదా గాజుపాత్రల్లో దేన్లో జన్మించినా సరే తన ఉత్పత్తికి మూలం వీర్య కణబీజమేనని తెల్సుకుంటాడు. కానీ అసలు రహస్యం అంతుపట్టక వ్యక్తి మూలకారకుడెవ్వడోనని ఆలోచిస్తాడు. జగత్సృష్టి కారకుడైన ఆ బీజ ప్రదాత ఏడీ? అని ఉద్వేగంతో అంటాడు. ఈ భావాలు పోతన భాగవతం స్ఫూర్తితో రాసినట్లుగా కనిపిస్తున్నాయి.[8]

అదృశ్యవాణి మనిషికి ఈ క్రింది విధంగా చెప్పిందని కవి వివరిస్తున్నాడు.

ఆదిశక్తిని నేనే
అవ్యక్తమూర్తినీ నేనే
సకలసృష్టికి బీజప్రదాతను నేనే
చరాచరస్థితి లయ నిర్ణేతను నేనే
నీలోని ఆత్మధాతువు నేనే
జీవకోటి జననమరణం సేతువు నేనే

పరమాత్మ స్వరూప స్వభావాదుల్ని కవితాగానం చేయటం చాలా బాగుంది. కావ్యేతిహాసంలో సర్వేశ్వరుని వాణి వినిపించినట్లు రాయటం ఒక చక్కని విధానం. 'ఈశ్వరుని గళాన్ని విని మానవ శతాధిక కంఠాల్లో ఒకే నినాదం పలికి సమూహంగా మానవుడు సముద్గమిస్తుంటే చైతన్యవాహినులు నురగలెత్తుతాయని' కవి అంటున్నాడు. మరి విశ్వప్రగతి సాధ్యమేనా?

ఇటు మట్టిని అటు మింటిని
అనుసంధానించే సేతువులా వున్న మనిషి
స్థితమతిగా రూపొందితేనే విశ్వప్రగతి

మానవుడు స్థితమతిగా రూపొందితేనే ప్రగతి వీలవుతుంది.[9] సహమానవ స్పర్శంటేనే అసహనంతో బుసలుకొట్టే పరిస్థితులు జడసృష్టి రంగరించుకున్న సమదృష్టిని మానవుడు కోల్పోవటం వల్లే ఉత్పన్నమయ్యాయి. అన్ని కొమ్మలకు ఆధారం స్కంధమనే సత్యాన్ని మానవుడు మరువకూడదు. ఇలా అన్నప్పుడు పోతనగారి 'లలిత స్కంధము కృష్ణ మూలము'... జ్ఞాపకం వస్తోంది. సకల సృష్టికి మూలకారణమైన ఆ జగన్మాతని కవి స్మరించటం గమనించాలి. యంత్రనాగరికత మోజులోపడి మానవ ముఖాలు వెగటు కలిగిస్తున్నాయని అనుకోవటం అవివేకం. అధికార తృష్ణకు, కీర్తి దాహానికి దాసోహమని సాటిమనిషిని అవహేళన చేయటం తప్పు. "అస్పృశ్యతా జాడ్యమంటిని సమస్పర్శి వాయువు" నుంచి మానవుడు నడత నేర్చుకోవాలి.

మానవ సంబంధాల ప్రాముఖ్యతని కూడా ఈ కావ్యేతిహాసం వివరించింది. మంచితనం ఇంకా మరణించలేదని, దానికి మానవునివల్లే మరణమే లేదని కవి చెపుతాడు. సౌజన్యమూర్తులు ఎందరో ఇంకా ఉన్నారు. వీరు మానవజాతికి ఆదర్శం కావాలి.

ఛిద్రమవుతున్న మానవ సంబంధాలను
చేజారుతున్న సౌజన్య మూల్యాలను
భద్రపరుచుకునే హృదయ పేటికలు
ఇంకా కొన్ని మిగిలివున్నాయి

ఈనాటి నాగరికత, విషసంస్కృతులని కవి తీవ్రంగా విమర్శిస్తున్నారు. 'పక్షుల్లాంటి అమాయకుల స్వచ్ఛస్వరాలు ప్లాస్టిక్ చెవులకెక్కవు' అనే మాటలు దీనికి నిరూపణ.

అర్భకులకి, మానసిక దుర్బలులకి స్వర్గనరకాల గురించిన చింత, నమ్మకం ఉంటాయని అపహాస్యం చేస్తున్నారు. నిజానికి ఇవి ఎక్కడో లేవని మనిషి మనసులోనేనని చెపుతున్నప్పుడు జాన్ మిల్టన్ కవితా పంక్తులు మదిలో మెదలుతాయి.[10]

ఎక్కడో లేవు స్వర్గనరకాలు
తన హృదయ సదనంలోని రెండు గదుల్లో వున్నాయి

మానవునికి వ్యక్తిత్వమే అతిముఖ్యం. వ్యక్తిత్వ వికాసమే మానవుడిని స్థితమతిగా రూపొందిస్తుంది. అయితే ఈ ప్రక్రియ నిరంతరమైంది. అందుకే "వ్యక్తిత్వమంటే బొంగరంలా కాసేపు తిరిగి బూదిలా చతికిల పడేది కాదు. భూమిలో నిరంతరం పరిభ్రమించేది" అంటున్నారు. వ్యక్తిత్వం లేనివాళ్ళు రాశి ఫలితాలను నమ్మటమో, చేతికి మట్టి అంటకుండా ఫలితాలు మాత్రం తలలూపుతూ రావాలని ఎదురు చూడటమో చేస్తారు.

మానవజన్మకు సార్థకత సర్వజ్ఞతలో ఉందనీ, జ్ఞాన తృష్ణకు ధూళిరేణువు కూడా గవేషణ కేంద్రమవుతుందని ఈ కావ్యం చెపుతోంది.

బాహిరసృష్టికున్న ఐక్యదృష్టి
అంతర్వీక్షణమున్న మనిషికెందుకు లోపించాలి?

మానవసంబంధాలు బలహీనమైతే సమాజం మృగసముదాయంగా మిగులుతుంది. మానవుడిని నిఖిల విశ్వంభరా పురోగతుల నియతిని కాపాడే సూత్రధారిగా కవి కీర్తిస్తారు. ఈ కావ్యేతిహాసంలోనూ, సృష్టిలోనూ నిత్యచైతన్యంతో నిలిచే మనిషి నిష్క్రమణలేని పాత్రధారి. జీవిత నాటకరంగంలో, గగనాన్ని మకుటంగా చేసుకొని అందరి ఆశయాలను తనలో శ్రుతిచేసుకుంటూ, అందరిలో తన బింబాన్ని చూసుకుంటూ మానవుడు సమదర్శిగా, సమస్పర్శిగా వర్ధిల్లుతాడు. మానవుని విజయం తథ్యం అని ఈ కావ్యేతిహాసం వెల్లడిస్తోంది.

'మట్టీ మనిషీ ఆకాశం'లో ప్రతీకల ద్వారా మానవునికి కర్తవ్య బోధన చేసిన తీరు అత్యున్నతమైనది. విశ్వంభరా పురోగతుల నియతిని మనిషి కాపాడతాడని, దానికోసం అతని చైతన్యాన్ని ప్రోదిచేయటం అనే లక్ష్యంతో ఈ కావ్యరచన సాగింది. మన

కాలంలోని ఈ కావ్యేతిహాసం మానవునికి నిరంతర స్ఫూర్తిని కల్గించే శక్తివంతమైందని చెప్పవచ్చు. తెలుగు సాహిత్యంలో ఇది ఒక అపురూప విషయం.

## వివరణలు:

1. ఆంగ్ల సాహిత్యంలో టి. ఎస్. ఇలియట్ కావ్యం ద వేస్ట్‌ల్యాండ్ 434 లైన్లలోనే ఎన్నో భావాలను ఇముడ్చుకున్న కావ్యంగా ప్రశంసలు పొందింది. నవీన ఉద్యమానికి చెందిన నూతన ప్రయోగంగా దీన్ని అభివర్ణిస్తూ ఎజ్రాపౌండ్ దీన్ని ఆంగ్లసాహిత్యంలో అతి పెద్ద గేయం అన్నాడు.
2. రామాయణం, మహాభారతం, ఒడిస్సీ, డివైన్‌కామెడీ, ఏనీడ్, ఇలియడ్, పారడైజ్ లాస్ట్ మొదలైనవి ఈ కోవలోకి వస్తాయి. 'ఒక కాలమున ఒక రాజవంశమునకో, ఒక జాతికో సంబంధించిన చారిత్రికాంశము కలది ఇతిహాసం' అని పింగళిలక్ష్మి కాంతంగారు అంటారు.
3. తిలక్ అమృతం కురిసిన రాత్రి గేయ సంపుటిలోని 'స్వేచ్ఛా విహారం'లో ఇలా చెప్పాడు-

   కొంచెం సేపు స్వప్నంలోకి
   గోర్వంకల రెక్కలతో
   ఎగిరిపోదా మన్నీ మరిచి

4. భగవద్గీతలో సకల కర్మలు ప్రకృతి గుణముల ద్వారానే చేయబడుచున్నాయని అయితే అహంకారం చేత భ్రమించిన అంతఃకరణం కల్గిన అజ్ఞాని అంతటికీ తానే కర్తనని తలుస్తాడు అని వివరించారు.

   ప్రకృతేః క్రియమాణానిగుణైః కర్మాణి సర్వశః
   అహంకార విమూఢాత్మా కర్తాన హమితి మన్యతే

5. పారడైజ్ లాస్ట్ కావ్యంలో జాన్‌మిల్టన్ ఈ విధంగా పేర్కొన్నాడు.
   "Men also, and by his suggestion traught
   Ransack'd the center, and with impious hands
   Rifl'd the bowels of their mother Earth
   for tresures bettes hid" (Book one: 685-688)
6. శ్రీశ్రీ మహాప్రస్థానంలోని 'ప్రతిజ్ఞ' అనే గేయంలో ఈ విధంగా ఉంది.

   నిరపరాధులై దురదృష్టంచే
   చెరలసాలలలో చిక్కేవాళ్ళూ-
   లోహరాక్షసుల పదఘట్టనచే
   కొనప్రాణంతో కనలేవాళ్ళూ-

7. బైబిల్‌లో ఈ విధంగా చెప్పారు:

   1. "If you have faith as a grain of mustard seed ... nothing shall be impossible to you".
   2. If thou cans't believe all things are possible to him that believeth (Mark 9:23)
   3. According to your faith be it unto you (Mathew 9:29)

8. పోతన భాగవతంలోని పద్యం ఇలా వివరిస్తోంది:

   ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై
   యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
   బెవ్వఁ డనాది మధ్య లయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైన వాఁ
   డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్

9. భగవద్గీతలో ఏ పురుషుడు సర్వత్ర స్నేహరహితుడై యుండి, ఆయా శుభాశుభములగు వస్తువులను పొంది ఆనందాన్నిగానీ, ద్వేషాన్నిగానీ పొందకుండా ఉంటాడో అతని బుద్ధి స్థిరమైనది అని పేర్కొన్నారు.

   యః సర్వత్రాన భి స్నేహస్త త్ర్రాప్య శుభాశుభమ్
   నాభినందతి న ద్వేష్టి తగ్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా

10. "The mind is its own place can make a hell of a heaven, and heaven of hell" (Paradise Lost)

# 28. కర్పూర వసంతరాయలు గేయకావ్యంలోని కర్పూరపరిమళాలు

ఒక చారిత్రక శకలాన్ని ఆధారంగా చేసుకొని శృంగార ప్రధానంగా తీర్చిదిద్దిన కర్పూరవసంతరాయలు గేయకావ్యం నారాయణరెడ్డిగారి కవితా శక్తికి చక్కని నిదర్శనం. నర్తకి లకుమ చుట్టూ అల్లుకున్న ఈ కావ్యంలో అనురాగానికి, ధర్మానికి మధ్య జరిగిన సంఘర్షణని కవి చాలా చక్కగా చిత్రించారు. వ్యక్తి క్షేమం కన్నా దేశక్షేమం ముఖ్యమని ప్రతిపాదించిన ఈ కావ్యం మాత్రాఛందస్సులతో నిర్మించబడి పాఠకులకి రసానందాన్ని కలిగిస్తుంది. తెలుగు సాహిత్యంలో ప్రబంధకవులు తమ అపారమైన పాండిత్యంతో, అనన్య సామాన్యమైన శబ్దశక్తితో రచనలు చేసారు. మన కాలంలో ప్రబంధ యుగస్ఫూర్తిని తీసుకొని, ఆ మహానుభావులు చూపించిన మార్గంలో, గేయ కావ్యాలను రాసే సాహసానికి నారాయణరెడ్డి సిద్ధపడ్డారు. కర్పూరవసంతరాయలు గేయ కావ్యం చదివినవారు ప్రబంధసాహిత్యాన్ని చదవాలనే కోరికతో ఉంటారు. ఈ విధంగా వసంతరాయల ప్రబంధ సాహితీ సౌధసౌందర్యాన్ని ఆస్వాదించటానికి పాఠకులని సంసిద్ధం చేస్తుంది.

పూర్వరాజవృత్తాంతం, కవితా కల్పన రెండూ కలిసిన కావ్యం సానబెట్టిన ఉత్తమరత్నం వంటిది.[1] మాత్రాఛందస్సుల మర్మాలను పూర్తిగా ఆకళింపు చేసుకున్న కవి ఒక నిపుణుడైన స్వర్ణకారుడిలా ఈ కావ్యానికి మెరుగులు దిద్దాడు. ఐదు అశ్వాసాల ఈ గేయకావ్యంలో అడుగడుగునా తెలుగు నుడికారపు సొగసులు కనిపిస్తాయి. అశ్వాసాలను నిర్మించిన తాను పెట్టుకున్న కఠిన పరీక్షలా కనిపించకమానదు. లకుమ, వసంతరాయడు. మహారాణి, కాటయవేముడు అనే నలుగురు పాత్రల చుట్టూ పరిభ్రమించే ఇతివృత్తం చిన్నదే అయినా, పాత్రలు పరిమితంగా ఉన్నా ఈ గేయకావ్యం లక్ష్యాన్ని సాధించింది. వస్తు సాక్షాత్కారం కలిగించి పాఠకుల మనసులని రంజింప చేయటమే ఈ లక్ష్యం. .ఈ కావ్యాన్ని చదివిన పాఠకులు నాటకాన్ని చూసిన అనుభూతిని పొందుతారు. కరుణ, వీర రసాలను కూడా ఈ కావ్యంలో పోషించారు.

ఈ కావ్యంలో తొలుదొల్తగా నాయకుడైన వసంతరాయుడు ప్రవేశిస్తాడు. "జయ జయ సమగ్రాంధ్ర సర్వంసహా భార సంభరణ శేషాహిరూపా!"... అంటూ వందిమాగధులు జయజయ ధ్వానాలు పలుకుతుండగా మహారాజు పాలసముద్రపు నురుగు తరగలు పరిమళించిన ఐరావతంపై స్వారీ వెడలే శచీద్వితీయునిలాగా కనిపించాడు. రాజుగారికై చేసే స్తోత్రగీతాలు జనుల చెవినపడ్డాయో లేదో కొండవీటిపురాన ఉన్న బండలు గూడా గుండెలు గలగలలాడ 'కో' యంచు పిల్చాయని

కవి వర్ణిస్తారు. అంతకుముందు మన్నుదిన్న పాములాగే ఉన్న రాజమార్గములు ఒక్కసారిగా మహానదిలాగా ఉప్పొంగాయట.

చైత్రశుద్ధ త్రయోదశీ దినాన మదనదేవుని పూజ ఆరంభ దినం కాబట్టి రాజు ఉత్సవాలను తిలకించాలని బయలుదేరతాడు. నగరోద్యానవనంలో పంచబాణుని పూజతో ఇవి మొదలవుతాయి. ఈ ఉత్సవాలపుడు పండుముసలులు కూడా నవయువ తాభిరాములు అవుతారట. మహావైభవంగా వెళుతున్న రాజుని 'గవాక్ష రంధ్రమ్ములన్ని కన్నులు చేసుకొని ముగ్ధాంగనలు, ఒక తలుపురెక్క తీసి వయ్యారముగా మధ్యలు, ద్వారమ్ములు తీసి ప్రౌఢలు చూసారు. ఆనందంతో వృద్ధాంగనలు మంగళాక్షతలు ఆశీరామృతముతో తడిపి రేనిపై చల్లారు.

నాగరికులు జానపదులు
నారీనరులెల్లవారు
పూలజల్లుతో రాయల
మూర్ధము నభిషేకించిరి.

రాచబాట చివరన ఉద్యానవనం దగ్గరికి రాగానే రాయడు గజం దిగి రాణి, కాటయవేముడు వెంటరాగా మంటపము చేరతాడు. వేదికాగత మదన మధు శివ విఘ్ననాథాప్సరః ప్రతిమలను చూచినంతనే రాయని చూపులు అంతర్ముఖములవుతాయి. పూజ ప్రారంభించి రాజు దోసెళ్ళతో పూవులెత్తి మధుమూర్తిపైన చల్లుతాడు. ఆ సుప్రసన్న సమయాన నగరోద్యానవనంలో కళాలక్ష్మి అందె సవరించింది.

ఒక పాలరాతి వేదికపైన వ్రేలు యవ
నిక వెండిమలపైని నీలిమేఘమురీతి కన్పించె
యవనికాభ్యంతరమునందుండి మంద మం
దముగ వీణాదివాద్యములు శ్రుతి కూర్చినటు విన్పించె

నృత్యాన్ని తిలకించటానికి రాజు 'వామదిశ ఆదిసతి కెనవచ్చు రాణి గంభీరతాస్థానియై కూర్చుండె' అన్న వాక్యంలో ఆదిసతి అన్న పదం వల్ల రాజు లకుమని ద్వితీయసతిగా చేసుకుంటాడని స్ఫురిస్తోంది. భావికథా సూచన వస్తోంది. నర్తకి లకుమని చకితుడై రాయడు చూడగా, కాటయవేముడు ప్రభుముఖమ్ము పఠియించె, అన్న మాటలో రాయనికి లకుమపై ప్రేమజన్మించిందని కాటయవేముడు గ్రహించినట్లు స్పష్టం. తనసోదరి ఆనందం, దేశ క్షేమం ప్రధానమైనవిగా భావించే వేముడు ఏమి చేయనున్నాడోనని చదువరులకు ఉత్కంఠ కలగటం సహజం. లకుమ హస్తముద్రలు చూసిన మహారాజుకి తనపైన పారిజాతములు జలజల కురిసినట్లు అనిపించింది. ఆమె ముకుళముద్రను చూపినపుడు రాజు కనుబొమలను వంచి రమణీయంగా చూసాడు. లకుమ భ్రమరహస్తం పట్టి ఆహ్వానించింది.* నృత్యం తిలకించి నగరాభిముఖుడగుచున్న రాజు తన పౌరులపై మందహాస చంద్రికలు కురిపిస్తూ, నిండు దోసిళ్ళతో మృగమద

* రాజుకి ఒక భృంగి యెదలోన చొరబడి ఝుంకృతి చేసినట్లు అనిపించిందట.

శ్రీచందనరజాన్ని కుమ్మరించాడు. వసంతోత్సవాల్లో రాజు పౌరులతో కలిసిపోయి ఆటలాడటం ఒక విశేషం. ఇది రాయని ప్రజావాత్సల్యాన్ని, ప్రేమని వెల్లడిస్తోంది.

ఎక్కడ చూసినా కర్పూరం, గంధం, ఆనందం వెల్లివిరిసాయి. ఈ పరిమళాలతో నింగీనేలా రెండూ పరిమళించాయి. తుమ్మెదపదాలు, వెన్నెల పదాలు కమ్మగపాడుతూ, ఢమరువులని మ్రోగిస్తూ దేశీమార్గముల నృత్త నృత్యముల ప్రజలు వసంతోత్సవాలని జరుపుకున్నారు. తొమ్మిది రోజులపాటు రాజ్యంలో ఈ విధంగా ఉత్సవాలు చేస్తారు.

చైత్రపూర్ణిమనాడు లకుమ ఖండితనాయిక రాధికగా అభినయించింది.(2) ఉద్యానవనం బృందావనంకాగా, లకుమ రాధ అయి దొంగకృష్ణుని పైన కోపాన్ని అభినయించింది. రాధ మనసు మంచుముద్దలాగా కరిగిపోయింది. మురళీగానం విన్పిస్తుండగా కృష్ణునికోసం నాలుగుదిక్కులా చూసింది కానీ కనిపించలేదు. ఎదురుగా చూడగానే వసంతరాయుడు. శ్రీకృష్ణుడు. అతను కూడా ఆమె చూపులతో చూపులు కలిపాడు. పరవశుండైన రాజు వెన్నెల తరగలంబడి తేలిపోతాడు. ఉద్యానవన పరిసరాలని మర్చిపోయి ఊహాజగత్తులోకి వెళతాడు.

రసజగత్తున కీశ్వరుండగు
రాజునకు తను తాను కృష్ణ
స్వామిగా రూపొందినటు ఏ
దో మహానుభావమ్ము కల్గెను
లకుమ రాజును చూచినంతనె
ఒక నిమేషమ్మాయె తను గత
కించితమ్మైనట్టు లయ్యెను

ప్రభువుకు తానే శ్రీకృష్ణునిలా అనిపించింది. లకుమని రాధగా రాజుగారు భావించారు. లకుమ పెదవులని సగం విప్పి ప్రియా అని సంబోధించింది. అతను కూడా అదేమాదిరిగా కన్నులరమూసి ప్రియా అని సంభోదించాడు. వీరిరువురికీ అసంకల్పితంగానే ఒకరిపై మరొకరికి ప్రేమ జనించాయి. అతడు ఆమెను, ఆమెను అతడు చూస్తుండగా ఆదిదంపతుల మాదిరి ఆ చూపులు తోచుచున్నాయని కవి వివరణ. నృత్యాన్ని తిలకిస్తున్న అందరి మనసుటద్దమ్ములను చిత్రముగ కన్పించింది రాధకృష్ణులేనట. ఆ పరిస్థితిలో రాజుకి లకుమతప్ప కనపడదు.

ప్రభువు తన్మయుడయ్యె
ప్రభువు చిన్మయుడయ్యె
ప్రభువు లకుమాలగ్న
పంచప్రాణుండయ్యె

మన్మథుని ఆరవబాణం (లకుమ) రాజు మనస్సులో అవతరించింది. 'రేని స్నిగ్ధహృదంతరాన అమృతాంశు పదునేడవకళయే' స్ఫురించింది. రాజు ఎలానో తన

చూపులు తిప్పి కాటయవేమునిపై సారిస్తాడు. రాజు పెదవులమీదుగా 'లకుమా' అనే అక్షరాలు ఒలకగా" లకుమచరణానద్ధ రత్నకింకణులు మెల్లగా 'ప్రభూ' అంటూ పల్కినవి"

లకుమకి రాజును చూసిన సందర్భంలో కలిగిన శృంగారకాంక్ష విప్రలంభము ఇది అభిలాష, ఈర్ష్య, విరహ, ప్రవాసభేదములచే నాలుగు విధాలుగా ఉంటుంది.[3]

రాయడు 'తనకొరకు తపముచేసిన పార్వతి సమక్షమున నిల్చిన మహేశ్వరుని' వలె ఉన్నాడు. నృత్యం ముగిసి వయ్యారంగా లకుమ నిల్చిపోవటం, జనం ఉప్పొంగి హర్షధ్వానాలు చేయటం జరిగాయి. లకుమ తప్ప ఇంక ఎవరూ, చివరకు రాణి, కాటయవేముడు కన్పడలేదు.తన మెడలోని రత్నహారము తీసి రాజు లకుమ మెడలో వేయబోగా 'దండతోపాటు కరదండ యుగళము గూడ లకుమ గళమందున అలంకరణమై' పోయాయట. జనం ఆకాశం దద్దరిల్లేటట్లుగా హర్షనాదాలు చేసారు. రాణిమాత్రం నవ్వలేకయే లోన నవ్వుకున్నది.

మొదటి అశ్వాసంలోని రెండు ప్రధాన సంఘటనలు - వసంతోత్సవాల నిర్వహణ, లకుమనృత్యం కవి రచనాశక్తికి పరాకాష్టలా కనిపిస్తాయి. లకుమ, వసంతరాయ ప్రణయానికి ఈ ఆశ్వాసంలోనే బీజం పడింది. దీనిలో శృంగారరసమే పోషించబడింది.

రెండవ అశ్వాసం ఈ కావ్యంలో చాలా ప్రధానమైంది. దీనిలో రాయల విరహవర్ణన, లకుమ విరహవర్ణనలనే రెండు సంఘటనలను అత్యంత రమణీయంగా కవి రచించారు.

నాటిరేయి కుమారగిరి రా
ణ్మౌణి కన్నుల రెప్పవాలదు
ఎపుడో దాటిన దర్ధరాత్రము
ఎగియు ఊహలరెక్క వాలదు

ఎపుడూవీచే గాడుపే ఆనాడు వేడిగా వీస్తున్నట్లు, ఎపుడూ కాచే వెన్నెల ఆనాడు ఎంతో వేడిగా వీస్తున్నట్లు రాయలుకి అనిపించిందట. పాన్పున చల్లిన మల్లెలు పల్లేరుగాయలుగా తోచాయట. చంద్రుడు ఒక్కడే అయినా వేలచుక్కలు అతని చుట్టూ తిరుగుతున్నట్లు, లకుమ ఒక్కతే అయినా ఆమె చుట్టూ లక్ష ఊహలు లాస్యమాడాయట. లకుమ అన్న మూడక్షరాల పేరు చెవిలోపడ్డప్పటినించీ అదే ప్రణవనాదంలా రాజుకి మనస్సులో ముద్ర పడిపోయాయట. ఆనాడు పురూరవుని ముందు అవతరించిన ఊర్వశిలా ఈనాటి కొమరగిరీశ్వరుని దృగ్వాటిలోన లకుమయే నిల్చిపోయింది. లకుమని గురించిన ఊహలు చెలరేగగా పాన్పు చంద్రనిప్పుగా అనిపించి రాజు ఈ పక్కకి ఆ పక్కకి దొర్లసాగాడు. ఆమె నృత్యాన్ని, సాత్విక భావనాట్యాన్ని మరలమరల స్మరించి భూపతి పాన్పుపై విరహంతో కదిలాడు.

తన పక్క ఏదో కదిలినప్పుడు ఆలకించి రాజు పాన్పుపై తిరిగి రాణి వంక చూస్తాడు. 'పండువెన్నెల నీటిపాయ లోపల నీది ఆమె కన్నులు మెరిసియాడె మీనములనట్లు' అనటంతో రాణి రాజుని గమనిస్తూ ఉందా అన్న ఊహ కలుగుతోంది. అపరాధభావనతో నృపుడు తలదిప్పుకుంటాడు. 'ఇంతసేపాయె తన్నే పరీక్షించెనా?" తన వికారముల నా తన్వి గమనించెనా?' అని రాజు మథనపడతాడు.

కనులు కష్టమున మూసెనుగాని ఝుంఝూని
లముకన్న స్వచ్ఛమైన మనస్సు నెటుమూయు

నిజచంద్రికలు రాయనికి కనీసం దౌత్యమూలకమ్ములు కాకపోయెనని వాపోయాయి. రాజు మనసుకి విశ్రాంతి ఇవ్వలేదని అలా ఇవ్వలేకపోయినందుకు తాను ఎందుకు అని భావించి చంద్రుడు అస్తమిస్తాడు. రాజు నిద్రా నూత్న జీవగోళమున పయనించటం ప్రారంభిస్తాడు. కలలో రాజు చంద్రకాంత శిలావినిర్మిత వేదికపై లకుమని పట్టుకోవాలని వెంబడిస్తాడు. ఒక పుష్పవాటికను రాజు చూస్తాడు.

కోకిలాది శకుంతముల
కాకలీస్వరములు తప్ప
వేరుగొంతుకలు పల్కిన
తీరు కానిపించ దచట
గువ్వల మవ్వపు వ్రేళుల
కొసల తాకిడులను తప్ప
అచటి చిగురుకొమ్మలు అ
న్యస్పర్శ నెరుంగలేదు.

లకుమ పురుషస్పర్శ నెరుంగని స్త్రీ అని దీన్నిబట్టి స్ఫురిస్తోంది. రాజుకి ఆమె శకుంతలగానూ, తాను, దుష్యంతునిగానూ అనిపిస్తుంది. మొదట్లోనే రాజు కాటయవేమతో "కాళిదాసు శకుంతలకు పాఠాలు నేర్పేదు బావగారూ! మీ రసజ్ఞత మదనదేవ సమీపవర్తిని కాదనెదరా?" అని పరియాచకాలాడతాడు. కానీ ఈనాడు రాజుకి ఇది వర్తిస్తోంది. అతను మన్మథావేశంతో లకుమ వసనాంచలము లాగాననుకొని రాణి కొంగును లాగుతాడు. ఈ విధంగా రాయలు ఎన్నో మానసిక వికారాలకు లోనవుతాడు.

లకుమ కూడా అక్కడ రాజులాగానే విరహవేదనని అనుభవిస్తూ ఉంటుంది. ప్రబంధనాయిక వరూధిని వలే ఆమె తీవ్రమైన బాధకి లోనవుతుంది. నాయికకు పరిణయముహూర్తములో ప్రియసఖులు గిలిగింతలు పెట్టినట్లుగా వెన్నెలను ఆమె భావిస్తుంది. ఎప్పుడూ చూసే చంద్రుడు, తారలు ఆనాడెందుకో 'అమృతస్యందులై డెందము గలంచెను'. ఆమె ప్రభువుని చూసిన సందర్భాన్ని స్మరించుకొని, ప్రణయ భావనలతో నిండిపోతుంది.

ఈ విధాన మరందతుందిల
భావనలతో ఆమెడెందము
సాంద్ర చాంద్రీడోలికల ని
స్తంద్రముగ ఉఝ్జూతలూగెను

'తుందిల' శబ్దం లకుమ శృంగారకాంక్షను సూచిస్తున్నాయి. వరూధిని ఇదే విధంగా ప్రవరుని సంబోధిస్తుంది.[4]

లకుమకి కలలో పరమశివుడు సాక్షాత్కరిస్తాడు. ఆమె భక్తితో శిరము వాల్చగా శిరోలంకరణమా నాగమణి ఫణివోలె బుసకొడుతూంది. ఆ పాము మెడపై, శరీరమంతా పాకినట్లు అనిపించి కెవ్వుమని కేక పెడుతుంది. కలచెదరి ఆమె ఉవ్వెత్తున ఎగిసిపడుతుంది.

లకుమ స్వప్నము తునాతు
నకలైపోయిన తీరున
రేయి వెలసిపోయి వెల్గు
రేకలు విచ్చెను తూర్పున

పై వృత్తాంతం రాజు లకుమ మెడలో రత్నాభరణాన్ని వేసిన ఘటనని గుర్తుచేస్తోంది. 'లకుమ స్వప్నము తునాతునకలైపోయిన తీరున' అన్న కవి వ్యాఖ్యానం భావికథలో లకుమ - రాజుల ప్రణయం కూడా తునాతునకలవుతుందనే ఊహ కల్గిస్తోంది.

రాయడు, కాటయవేముని పిలిపించి లకుమని రాజనర్తకిగా చేయాలన్న తన సంకల్పాన్ని వివరిస్తాడు. సృజనాత్మకతని తారాస్థాయికి చేర్చటంలో తనలో ఏదో లోటు ఉందని అతని భావం.

'నాలుగు మాటలు గిల్కగనే
అలంకారికుడను నేమా?'

ఇన్నాళ్ళకి తనలోని కళ బహిర్ముఖత్వము పొందే అవకాశం వచ్చిందని రాజు వెల్లడిస్తాడు. సకల కళా సంగమతీర్థము లకుమని రాజనర్తకిగా ప్రకటిస్తారు. ఈ వార్త లకుమ వింది. ఆమెకు ఆ వార్త 'కల్వనెలంత కంటిపాపలపైన పాల వెన్నెల సోకినట్లు' అయింది.[5] రాణికి మాత్రం ఆ వార్త 'ఖరకరుని అశ్వరింఖల చప్పుడుగా' తోచింది.

మూడో అశ్వాసంలోని సంఘటనలతో లకుమకి రాజనర్తకి పట్టం కట్టబెట్టటం, వసంతరాయలు లకుమతో కలిసి అహోబిలస్వామిని, దాక్షారామ, భీమేశ్వరుని సందర్శించటం ముఖ్యమైనవి.

రేనిలో వెల్తురుల మేడలు
రాణిలో తిమిరంపు నీడలు
కాటయవేమునిలో రెండును
కలిసిపోయిన సందెజాడలు

సభతీర్చిన రాజు రెడ్డి వంశపు రీవి ప్రోవై గూఢహాస నిరూఢముఖుడై కూర్చున్నాడు. చీనిచీనాంబర సువర్ణాధ్యాణ కంకణ కింకిణీయుతమా పసిడి పళ్ళెరాన్ని లకుమకి అందిస్తాడు. ఉత్సవం ముగిసినా రాజు మనసులో లకుమాగత వాంఛావళి పెరిగి, ఎప్పుడు ఆమె సాన్నిహిత్యంలో ఉంటానో ననే ఆలోచనలు తగ్గలేదు. ఒకనాడు కాటయవేముని పిలిపించి తనలో చిగురించిన తీర్థ ప్రసేవనా కాంక్షని వెల్లడిస్తాడు. మర్నాడే బంగారు రథంలో రాజు, లకుమలు తీర్థయాత్రలకు వెళతారు. మహారాణి కుమిలికుమలి తనలోనే ఏడుస్తుంది.

ఆహోబిల నరసింహుని దివ్యసన్నిధిలో ప్రభువు, లకుమలు, పులకరించిపోతారు. రాజు ఆ రాత్రి రాతితిన్నెపై శయనించినా పూలసజ్జెకన్నా అతి వేల సుఖం అనుభవిస్తాడు. సూర్యోదయంతోనే రాజు, లకుమ శిబిరాన్ని చేరతాడు. ప్రభువు ఆమెకు సమీపంగా చేరాడో, లేదో చిలిపి పవనుడు ఆమె చేలాంచలాన్ని తొలగిస్తాడు. మన్మథుని కార్యాన్ని పవనుడు నిర్వర్తించాడు. లకుమ కళ్ళు తెరిచి తన ఎదుటనున్న మన్మథ ద్వితీయాకృతిని చూస్తుంది. ఆమె అతిసంభ్రమంతో తన కొంగునకు బదులు ముంగురులు సవరించిందట.

భవనాశీనాథు పావన పయస్స్నాత
ములు ప్రభాతాలసానిల పోతములు వీచె
సుఖనిద్రనున్న రాజునకు ప్రాతస్సమీ
రములు వైతాళికత్వమును నిర్వర్తించె

ఎర్రన కృతి "నృసింహపురాణం'లో భవనాశిని వర్ణనని దృష్టిలో ఉంచుకొని ఆ మహాకవి స్ఫూర్తితో నారాయణరెడ్డిగారు తన కావ్యాన్ని రచించారు.[7] "ఇరుదెసనబ్బినాదుడు సమీరుడుకాంచన దారుదండ చామరములు దాల్చి" అన్న ఎర్రన వాక్యాల ప్రభావంతో "నిదుర మున్గిన లకుమ నీలాలకల తోడ కోడెగాడుపులు దాగుడుమూతలాడె" అని కవి ప్రయోగించారు.

ఆహోబిల నరసింహుడు నరనాథుని భక్తి భర ప్రణతాత్మకు చిత్రమైన రమ్యభయానకమూర్తిగా కనిపించాడు. ఆనాడు లకుమ చెంచులక్ష్మిలా నృత్యం చేస్తుంది. ఆమె వాసకసజ్జయై నిలిచి, స్వామికై ఎదురుతెన్నులు చూస్తుంది. నాట్యానంతరం రాజనర్తకి, రాజేంద్రుడు స్వామిని దర్శిస్తారు. లకుమ స్వామి నయన కోణములందు హిరణ్యకశిపుని నెత్తురు చారలు చూస్తుంది. ఏదో అవాంఛనీయ సంఘటన జరుగుతుందని ఈ 'నెత్తురు' సూచిస్తోంది. కంఠీరవమూర్తిని చూసి లకుమ కంపితయై, వశం తప్పి రాజుపై పడిపోతుంది.

తాను, రాజుబాహువె ఉప
ధానముగా చేసికొనియె
నని తెలిసి అదిరిపడి రా
యని పదముల వ్రాలె నామె
ముకుళితా క్షుడైన రాజు
చకితుండై కనులు విప్పి
లేవనెత్తె నిజచరణ వి
లీనవదనయౌ లకుమను

వారిరువురూ గుండెలు రాచికొనగ చూసుకున్నారని, ఆ చూపులు విడిపోవుటయ్యె కైమోములు దించుకొన్నారని కవి మనోహరంగా వర్ణించారు.

రాజు, రమణి కలిసి దాక్షారామ భీమేశ్వరుని దర్శించాలని వెళతారు. మందాకిని నదిని చూసిన రాయనికి 'సీతారామచంద్రుల వలపుతీవెల వాంఛలూరగ పెంచు గోదావరీ జలమ్ములు' జ్ఞప్తికి వస్తాయి. లకుమ విస్ఫురితాంగ సౌందర్య ప్రమత్తుడు రాయడు ఆమెను కౌగిలించగ మించగా సైకతములు అతన్ని అడ్డగించాయి. లకుమ, రాజుల ప్రణయం అర్థంతరంగానే ఆగిపోతుందనే సూచనలు ఎన్నో కావ్యంలో కనిపిస్తాయి.

కాలభైరవ హసిత కహకహనినాదముల్
వీరభద్రుని తాండవోరుగుల్ఫధ్వనుల్
నీ నిత్యసంగీతముల్
నీ శ్రవణ సంప్రీతముల్

వీరభద్రుని పేరు వినగానే సతీదేవి గుర్తువస్తుంది. లకుమ సందర్శించిన స్థలాలు ఆమె విషాదనాయికగా అవుతుందనే ఊహకు హేతువును ఇస్తున్నాయి.

లకుమ రాజుని తొలిసారిగా మనసారగ కౌగిలిస్తుంది. అక్కడ రాణికి పీడకలలు వస్తాయి. తలపై గంగను దేహార్ధమున పార్వతిని నిల్పిన సర్వజ్ఞుడు అమాయకుని సరణి దిక్కులని చూసాడట.

చతుర్థాశ్వాసం ఈ కావ్యంలో చాలా ప్రాధాన్యతకల ఆశ్వాసం. దీనిలో రాయలు కేళీమందిరంలో రాజ్యాన్ని విస్మరించి లకుమే ఊపిరిగా జీవించటం, ఆమె ప్రోత్సాహంతో వసంత రాజీయమనే నాట్యగ్రంథాన్ని రచించటం ముఖ్య సంఘటన.

ప్రతీకాత్మకంగా చూస్తే లకుమ కళకు సంకేతం. రాజు జిజ్ఞాసువు. ఇతను సాధన ద్వారా తనలోని కళాప్రేమని బహిర్గతపరచాలని ప్రయత్నిస్తుంటాడు. దీనికి లకుమ యానకం, రాజుకి ఒక విధంగా చూస్తే కళాసాధనలో గురువు.

చతుర్థాశ్వాసంలో కాటయవేముడు విజయనగరం మీదకి దండువెడలి విజయునిగా రావటం, రాణి ఆరోగ్యం చెడటం అనే ఇతర సంఘటనలు కూడా ఉన్నాయి.

లకుమాసమేతుడై రాయడు తీర్థయాత్రలని పూర్తిచేసుకొని వస్తూ ఉండగా రాచబాటను నిల్చిన ప్రజలు వారు రతీమన్మథుల ప్రతిరూపాలుగా ఉన్నారని అనుకున్నారు. రాణి ఉండవల్సిన భాగంలో నర్తకి కూర్చోవటేమిటని జనసమక్షంలో రాజన్యుడు, ఒక అన్యకాంత పక్కన ఉండటమేమిటని ప్రజలు గుసగుసలు ఆడారు. ఎవరికి తోచిన విధంగా వారు ఆలోచనలు చేసారు.

రాజుని ఆహ్వానించటానికి ఎదురేగిన కాటయవేముడు లకుమని చూసి ముఖం మాడిపోగా, రాణి సుడిగాలి చరచినటుల వడదెబ్బ తాకినట్లు వణికిపోతుంది.

కాటయవేమప్రధాని మరునాడు రాజుతో మాట్లాడుతూ విజయనగరం బహుమనీ సుల్తానులు ఇద్దరూ కొండవీటికి పక్కలో బల్లెంగా ఉన్నారని, వెంటనే సమరసన్నాహాలు చేస్తానని చెపుతాడు. రాజులో పౌరుషం లావా లాగా పొంగి జాప్యమేల? యీనాడే సమరభేరీ మ్రోగింపుము అవశ్యముగ నేనుగూడ" అనబోయి వెంటనే ఆగిపోతాడు.

లకుమ కాలిగజ్జెలు ము
క్త కంఠమ్ముతో పిలిచెను
రేనిలోని పౌరుషాన్ని
జానువెన్నెలై నిలిచెను

శృంగారాసక్తిలోపడి రాజు అన్య విషయాలను వేటినీ ఆలోచించటం లేదు. కాటయవేముడు రాయని హృదయంలో మొలచిన ఇంద్రచాపాన్ని వెంటనే గమనిస్తాడు. సంగ్రామ భేరికా ధ్వనివిని రాజు వేముని నిష్క్రమణాన్ని గుర్తిస్తాడు.

తొలుత లకుమా కింకి
ణులకు రాయండు ముగ్ధుండయ్యె
ఆ వెనుక ఆమె తను
లావణ్యమునకె దాసుండయ్యె

లకుమ కన్నులు విరిసినంతసేపే రాజు పగలుగా భావిస్తున్నాడు. ఆమె కన్నులు మోడ్చినపుడె రాత్రి అయిందని అనుకుంటున్నాడు. పంచభూతాలను ఆమె శరీరంలో దర్శించి ఆమె సర్వాంగాలలోనూ ఐక్యమయ్యాడు. లకుమే గానంగా, ప్రాణంగా నాదబిందుకళానిదానమ్ముగా రాజుకి తోస్తోంది. వారిరువురి సాంగత్యం వాగర్థమ్ముల కేలికలాగా ఉంది.(8)

ఆమె నది పోలిక పొంగులు పోయినపుడు ప్రభువే రత్నాకరుడై తనలో విలీనం చేసుకుంటున్నాడు. వారిరువురూ అనేక క్రీడా వినోదాల్లో కాలం మరచిపోతున్నారు. ఈదులాడుతున్నప్పుడు రాజు ఎపుడో నీటమునిగి ఆమె వద్ద చక్కిలిగింతలుగా గభాలున లేచేవాడు.

ఇరువురు చదరంగమాడు
దురు ఎంతో కక్షబూని
ఎవరోడిన చివరికి బిగి
కవుగిలింత శిక్షయౌను

చదరంగంలో గెల్చినా, ఓడినా ప్రేమికులకు ఒకటే ప్రతిఫలం. చిత్తరువులు గీసే పందెంలో ఏ రూపం గీసినా అది చివరకు వారి రూపాన్నే పోలి ఉండేది. సాయంసంధ్యా మధురవేళల్లో లకుమ గజ్జె కదిలిస్తే ప్రభువు శరీరం నాదబ్రహ్మమై పులకించేది. ఆమె సాత్వికభావాల్ని అవధరించినపుడు సరసుడు రాయడు పైపైకి ఎగిసిపోయేవాడు. నాట్యశాస్త్రంలో పరిపూర్ణత్వం సాధించిన లకుమ భరతునికే తెలియని భావాలని చూపించేది. రాజు తన గ్రంథం "వసంతరాజీయం"లో భరతుడు కూడా రచించని విషయాలను రచించాడు.

లకుమ నాట్యమున రంభాదుల మించెను
ప్రభువు గ్రంథరచన పూర్తికావించెను
లకుమ ఆడియాడి రేని మ్రోల వ్రాలె
లకుమ ప్రభుని పరిరంభణమున దేలె

మట్టిముద్దగా ఉన్న తనను అనర్ఘమణిగా, సాలగ్రామంగా లకుమ తీర్చిదిద్దిందని రాజు గురుభావంతో అంటాడు. తన గ్రంథాన్ని ఆమె కరాంభోజాతము లందు రాయదర్పించగా లకుమ ఆ రత్నాన్ని కన్నులకు అద్దుకుంటుంది. జైత్రయాత్రల్లో తాను సాధించేది ఒక భూపతి నెత్తురు పంటనో లేదా ఒక సతి కన్నీటిమంటనో తప్ప వేరే ఏమీ కాదని అంటాడు.

లకుమ తాను రాజుకి చరణదాసినని వినయంతో అంటుంది. రాజు నాగస్వరమైతే తాను నాగినినని, అతను నిండు చంద్రుడనైతే తాను కల్వల చెల్వను అని చెపుతుంది. రాజు పాదపరాగము తన పాపిట సిందూరముగా ఉండే భాగ్యంకన్నా ఇంక ఏమీ అవసరంలేదని బదులిచ్చింది.

దండయాత్రకు వెళ్ళిన కాటయవేముడు విజయోత్సాహంతో తిరిగివస్తాడు. శరణుజొచ్చిన శత్రువు హరిహరుని వదిలిపెట్టి, అతని పుత్రికను క్షాత్ర శుల్కంగా స్వీకరించానని రాజుతో చెపుతాడు. 'ఇన్నినాళ్ళ తపమ్ము పల్కినదోయి నా జన్మమ్ము పండినదోయి బావా' అని సంతోషంగా తన గ్రంథాన్ని తెచ్చి వేమునికి రాజు చూపిస్తాడు.

రాయడు వేశ్యాలోలుండని, లకుమా దాసుడని రాజ్యంలో గుసగుసలు, చర్చలు అవుతాయి. అణగారిన అంతఃకల్లోలాలని అణచటానికి కాటయవేముడు రంగంలోకి దిగుతాడు. మహారాణి మనోవ్యాధితో మంచం పడుతుంది. వేముడు రాణిని చూసి శోకిస్తాడు. కేళికాహర్మ్యంలోకి వెళ్ళి రాజుని కలుస్తాడు. మహారాణి అనారోగ్యం పాలయిందని, రాచకార్యాలు జరగటం లేదని విన్నవిస్తాడు. రాయడు తల ఆడిస్తాడు.

పంచమాశ్వాసంలో రాయడు రాజుని దర్శించటం, మహారాణి స్వయంగా లకుమని కలిసి పరిస్థితి విన్నవించటం, లకుమ పిడిబాకుతో ఆత్మహత్య చేసుకోవటం మొదలైన సన్నివేశాలు ఉన్నాయి. వసంతరాయడు సభలో ఆసీనుడవుతాడు. రాజు సభలోని వారిని అందరినీ కలియచూస్తాడు. ఇంతలో పిడుగుపాటువంటి వార్త – లకుమ కాలు బెణికింది అనేది రాజు చెవిన పడుతుంది. వెంటనే రాజు ఆస్థానాన్ని వదిలి

ఒక నర్తకికి కాల్బెణకుటే మి
ఎకిమీడు పరులెత్తుట యేమి!
ఒక చిన్న ఘటన జరుగుట యేమి
ఒడ్డోలగమ్ము వీడుట యేమి
సభకిది తిరస్కారము
సభ్యతకు సీత్కారము

కొలువులోని వారందరూ రాజు చర్యను తప్పుపడతారు. కేవలం నర్తకి కోసం రాజు సభను అవమానించటం తగదని వారి అభిప్రాయం. కానీ, రాజుదృష్టిలో ఆమె ప్రాణసఖి. సభ నుంచి హుటాహుటిన లకుమ సన్నిధిలో వ్రాలిన రాజు ఆమె చరణాలని తన ఒడిలో పెట్టుకొని నిమరసాగాడు. ఆమె వారించినా వినక ముత్యాలవంటి బాష్పమ్ములతో ఆమె చరణాలని అభిషేకిస్తూ ఎంతో బాధను వ్యక్తం చేస్తాడు. శ్రీకృష్ణుడు సత్యాదేవి తనను కాలితో తన్నినా సహించి లాలిస్తాడు. ఆమెను అనునయిస్తాడు. ముక్కు తిమ్మన ఎంతో రమణీయంగా రచించిన పద్యాల స్ఫూర్తితో నారాయణరెడ్డి ఈ సన్నివేశాన్ని తీర్చిదిద్దాడు.(9)

ప్రియా! నీదు కాల్మాత్రమె
బెణకిపోవలేదు సుమా
నా జీవనవామృత భాం
డమె తొణకెనో లకుమా

పూరేకులలాంటి ఆమె కాళ్ళని ఒడిలో పెట్టుకుని 'పువురేకులను తాకినచో బొబ్బలెత్తు నీ అరికాళ్ళు' అని చెప్పి వాటిని నిమిరితే పంచప్రాణాలు పులకిస్తాయని ప్రేలాపిస్తాడు.

ఈ విషయం తెలుసుకున్న రాణి అప్పటికే రెక్క తెగిన విహంగంలాగా కుప్పకూలినది కాస్తా, బాణందెబ్బతిన్న దానిలాగా బాధపడసాగింది. ఆమె మనసులో ఎంతో వేదనని అనుభవిస్తుంది. కార్చిచ్చులాగా దహించే ఈ బాధను ఓపలేక రాణి వేముని పిలిపించి అన్నా అంటూ అతనిపై పడి ఏడవసాగింది.

ఆటకత్తెల నాదరించుట
అధిపులకు ధర్మమ్మె కానీ
వారి అడుగుల మ్రోల బ్రతుకుల
ధారపోయుట యేటి న్యాయము?

కేళికామందిరం కన్నా ఓలగమ్ము పవిత్రమైందని, ప్రభువుకు ఈనాడు దేశం పట్టటంలేదని శోకిస్తుంది. రాచకులానికి ఇంతవరకూ మహీసంరక్షణ ధ్యేయమని కానీ ఈనాడు ఒక వ్యక్తి కోసం దేశాన్నే మహారాజు విస్మరిస్తున్నాడని పలుకుతుంది. మధుభాంచిడం లాంటి కొండవీటిలో నీటి చినుకొకటి రాలిన అది వ్యర్థం- అవుతుందని ఎంతో దూరం ఆలోచించి చెపుతుంది.

చెల్లెలి దుఃఖాన్ని చూసి తట్టుకోలేక కాటయవేముదు ప్రభువు వద్దకు వెళ్ళి రాణి మనోవ్యాధితో మంచం పట్టిందని, ఆమెను ఓదార్చి రమ్మని చాలా వినయంగా విన్నవిస్తాడు.

లకుమ తాను అస్పష్టంగా కాటయవేముని మాటలను విన్నానని, పట్టమహిషి వ్యాధి మహోపప్లవమ్ము సూచిక అని చెపుతుంది. రాణిని వెళ్ళి చూసి రమ్మని అర్థిస్తుంది. రాజు మాత్రం 'ఎవరెంతగ అన్నను రమణీ! నా చిత్తము మారదు' అంటాడు. లకుమ సాహచర్య చికీర్షాదాహము చల్లారదని రాజు స్పష్టంచేస్తాడు.

కాటయవేముదు మరల వచ్చి కనులనిండుగా రాణి బాధను కురిపిస్తాడు. అతను తిరిగి వెళతాడు కానీ రాజులో చలనం ఉండదు.

మహారాణి దేశక్షేమం కోసం సిద్ధపడుతుంది. అర్థరాత్రి ముసుగులో ప్రభు కేళీ సౌధరత్న ప్రాంగణానికి చేరుతుంది. తలుపు తట్టగా లకుమ వచ్చి తలుపు తీస్తుంది. రాణి తన పేరుని తెల్పగానే లకుమ గుండెలు జల్లుమంటాయి. రాణిమూర్ధము లకుమ చరణాగ్రములవైపు వినమ్రమవగానే, చకితురాలై లకుమ రాణిని చేతులతో పైకి లేవనెత్తుతుంది. పాపం చేసానంటూ రాణిపాదయుగ్మముపై తలపెట్టి ఏడుస్తుంది.

నీ పయిన్ ఒక ఘోరభారము
మోపగా వచ్చితిని చెల్లీ
పాల ముంతువొ నీట ముంతువొ
బాధ్యతని గమనించి తల్లీ

వ్యక్తి, సంఘం ఈ రెంటిలో ఏది ప్రథమగణ్యమో నిర్ధారించుకోమని రాణి మాట. "భూపతిని ఎటులైన విడిపోవుటయె నీకు అవశ్యమమ్మా" అని లకుమతో చెపుతుంది.

రాణివెళ్ళిన తర్వాత లకుమ వసంతరాయనిపై ప్రేమ, దేశక్షేమ ప్రాధాన్యత రెంటినీ ఆలోచించి పరిపరి విధాలుగా బాధపడుతుంది. రాణికి ఇచ్చిన వాగ్దానాన్ని ఎలా నెరవేర్చాలో అని మథనపడుతుంది. 'ఎందుకీ హృదయమ్ము నిచ్చితి వీశ్వరా! ఈ సానిదానికి' అని శోకిస్తుంది.

సూర్యోదయం అనగానే లకుమ నిర్వేణియై, ఉన్మత్తవాణియై, గోపిత గ్లానియై కనిపిస్తుంది. ఆమె చిత్రవిచిత్ర చేష్టలు చూసి 'ఇదియేమి అభినయమ్మే ప్రేయసీ' అని రాజు ప్రశ్నిస్తాడు. 'అభినయము కాదు ఇది ఆగామిసూచిక' అని ఆమె సమాధానం ఆమె శివతాండవాన్ని అభినయిస్తుంది.

లకుమ గజ్జెలు ఖణీల్లని విరిగి చెదరిపడె
ఆమె మేఖల పుటుక్కనుచు తెగి క్రిందబడె
ఒక్కమాటుగ ఆమె ఒడిలోన చేయివేసె

నృపుని కనులం దొక మెరుపు తణుక్కున దూసె రాయడ – తన ప్రాణాలు పోవుతున్నట్లుగా బాధపడుతూ అరచి ముందుకు వెళతాడు. పడతి గుండెల్లో ఒక పిడిబాకు చీకటిలో మెరుస్తుంది. రాయనికి తన శరీరము, మనసు, సర్వము పాతాళకుహారాన పడిపోయినట్లు శోకిస్తాడు. తన జీవనిధి, తన పంచప్రాణాలను దోచుకున్న ఆ చురికను కన్నులవెంట నిప్పులు రాలగా రాయడు చూస్తాడు. దాని పిడి చుట్టూ రక్తసిక్తాక్షరాలతో ఉన్న పత్రం కనిపించి రాజు దాన్ని చదువుతాడు. అది లకుమ ఆఖరి సందేశం. రాయలుకి అందిన ప్రేమపత్రం.

శిబి, దధీచులమ మించిన లకుమ త్యాగశీలతకు ప్రభువు తనువు లజ్జాపిహీతమవుతుంది. 'వ్యష్టికన్నను దేశదృష్టియె గరిష్ఠమని' లకుమ సందేశాన్ని గ్రహించిన రాజు జాగృతుడవుతాడు. అతని కన్నులకు అప్పుడు కొండవీడు, మహారాణి, జనమహాంబోధి కనిపిస్తాయి.

కావ్యాన్ని చదివిన పాఠకులు కూడా లకుమ అపూర్వ త్యాగానికి చలించిపోతారు. ఈ కావ్యంలోని లకుమ చిరస్థాయిగా వారి హృదయాల్లో నిలిచి ఉంటుంది. వసంతరాయలు ధీరలలితుడు.[10]

నేటికిని లకుమ అందెల ఝుణత్కారములు
వినిపించు కొండవీటను వీచు వాయువులు
కొమరగిరి చరితమ్ము కొండవీటను శిశిర
మును సైతము వసంతముగ రూపు గట్టించు
కొండవీటను పాదుకొన్నట్టి మట్టిలో
సైతమ్ము కర్పూరసౌరభమ్ములు వీచు

డా॥ నారాయణ రెడ్డిగారు ఈ కావ్యం ద్వారా తన మానవతావాదాన్ని ప్రచారం చేసారు. వీరి కావ్యాలన్నింటిలోకి 'కర్పూరవసంతరాయలు' యౌవన నైగనిగ్యంతో ఈనాటికీ ప్రకాశిస్తూనే ఉంది. పఠితలు దీనిలోని కర్పూరసౌరభాలను ఆస్వాదించి, ఆనందిస్తారు.

## వివరణలు:

1, రామరాజభూషణుని 'వసుచరిత్రము' కావ్యంలో ఈ విధంగా పేర్కొన్నారు.

కేవలకల్పనా కథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నముల వారిత సత్కవికల్పనా విభూ
షావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్

2. "కావ్యాలంకార సంగ్రహము"లో ఈ విదంగా వివరించారు.

నృపులకు నెల్లవారల భరించుట యోగ్యముగాన నేఁటి రే
యపరిమితోత్సవంబునఁ బ్రియాసదనంబులకేఁగి యేగి యా
నెపమున మద్గృహంబునకు నీ వరుదేరఁ బ్రభాతమయ్యెఁగా
కిపుడు నృసింహ! నీ పయినొకించుక వంచనలే దెఱుంగుదున్

నాయకుడు అన్యకాంతాసంగమ మొనర్చి వచ్చిన సంగతి కనిపెట్టి సోత్ప్రాసముగా పలుకునది ఖండిత నాయిక.

3. కావ్యాలంకార సంగ్రహకర్త ఈ విధంగా పేర్కొన్నాడు:

కలయుటకు మున్ను కోరిక
యిల నభిలాషంబు; మానమీర్ష్య; విరహమౌఁ
గలసి యెడఁ బాయ హృదయో
త్కలిక; ప్రవాసము విదేశగతిఁ యెట్లన్నన్

నాయిక నాయకుని కలుసుకొనుటకు ముందు కలిగిన కోరికయే అభిలాష యనబడును. ఈర్ష్య అనగా మానము. ఇక్కడ మానము అనగా కోపం అని గ్రహించవలెను. నాయికా, నాయకుల ఎడబాటు విరహమగును. నాయికా, నాయకులు భిన్నదేశముల ఉండుట తటస్థించినచో ప్రవాస విప్రలంభము.

4. బహురత్న ద్యుతి మేదురోదరదరీ భాగంబులన్ బొల్చు ని
మ్మి హి కహార్యమునన్ జరింతు మెపుడుం బ్రేమన్ నభోవా
హినీ, లహరీ శీతల గంధ వాహపరిఖేన్మంజరీసౌరభ, గ్రహ
ణేం దిందిర తుందిలంబులివి మత్కాంతార సంతానముల్

(మనుచరిత్ర - ద్వితీయ: 45)

5. కనులను తెలుపుగా వర్ణించుట కవి విధానం.

కలువలనుం జకోరములఁ గారు మెఱుంగుల గండు మీల వె
న్నెలలను దమ్మితేకులును నిర్మల మౌక్తికరత్నశక్తులన్
దలఁచి పయోజగర్భుఁడు సుధారసధారలు రెంటిలో విసం
బులు చిలికించి చేసెనొకొ పొల్పొసలారఁగ దీని నేత్రముల్

(శృంగార నైషధం - 3వ అధ్యాయం: 166)

7. ఎఱ్ఱనగారి నృసింహపురాణంలో ఈ విధంగా వివరించారు.
శ్రీ కమనీయమూర్తి నరసింహ పదాంబుజ సేవ గోరి మం
దాకిని ధాత్రి మీది కవతార మొనర్చె నిజాంగ లీల న
స్తోక తరంగ సంఘములతో సమదాలి మనోజ్ఞపంకజో
త్సేకముతో లసచ్ఛిశిరసైక మనోజ్ఞ మహోత్సవంబుతోన్

8. వాగర్థా ఇవ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరమ్ —కాళిదాసు

9. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తాఁ
చిన యది నాకు మన్నన య; చెల్వగు నీ పద పల్లవంబు మ
త్తను పులకాగ్రకంటక వితానము దాఁకిన నొచ్చునంచు నే
ననియెద; నల్క మానవుగదా! యిఁక నైన నరాళకుంతలా!
(పారిజాతాపహరణం ప్రథమాశ్వాసం - 123)

10. ధీరలలితుడు ఇంద్రునితో సమానమగు భోగాలను అనుభవించినవాడు. 'కర్పూర వసంతరాయలు' కావ్యంలో నాయకుడిని ధీరోదాత్తుడు అని కూడా కవి ఒక చోట అంటారు. రూపం, యౌవనం, ఉత్సాహం కలవాడు, దాత, కులీనుడు, సిరిగలవాడు, అనురక్తలోలుడు, దక్షుడు అయినవాడు, కళాకారుడైనవాడు, తేజస్సు ఉన్నవాడు ధీరోదాత్తుడు.

# 29. కవితా ఓ కవితా - ఆధునిక కవిత్వ మార్గం

తెలుగు సాహిత్యం ఆకాశమంత ఉన్నతమైంది. కవులు అనేక ప్రక్రియలద్వారా తమ ఆలోచనలకు అక్షరరూపం కల్పిస్తూ వచ్చారు. సాహిత్యంలోని విభిన్న ప్రక్రియల్లో కవితకు ఒక ప్రత్యేకస్థానం ఉంది. 1981-90 దశకంలో వివిధ తెలుగు ప్రక్రియల్లో వచ్చిన కవితలను విశాల ప్రాతిపదికన ఏరి కూర్చిన సంకలనమే కవితా ఓ కవితా. వివిధ కవులు వేర్వేరు సందర్భాలలో రచించిన కవితలు ఈ సంకలనంలో పొందుపర్చబడ్డాయి కాబట్టి వస్తువైవిధ్యానికి ఇది చక్కని ఉదాహరణ. సంపాదకులు పాపినేని శివశంకర్, పెనుగొండ లక్ష్మీనారాయణలు వివరించినట్లు 'భూమ్మీద పాదం మోపి ఎన్నెన్నో దశలు గడచి తాదాత్మ్యపు అంచున మజిలీ చేసిన' కవితా సంకలనం ఇది. ఒక దశాబ్దికాలంలో తెలుగు కవిత్వం జీవితానికి దర్పణంవహించిన వైనం ఈ సంకలనంలో ఉండి, చదువరులకు సామాజిక జీవితాన్ని స్థూల, సూక్ష్మస్థాయిలలో వివరిస్తోంది. సంపాదకుల కృషి ప్రశంసనీయం.

ఈ సంకలనంలో కవితలను ఎంపిక చేయటంలో చారిత్రక, సామాజిక సందర్భం (ఉద్యమాలు, ధోరణులు, ముఖ్య సంఘటనలు, పరిణామాలు), వస్తువైవిధ్యం రూపసౌందర్యం, స్థూలంగా ప్రగతిశీలన, దశాబ్దికాలంలో ఆయా కవుల ప్రత్యేక కృషి మొదలైన ప్రమాణాలను పాటించారు. ఈ సంకలనంలో స్త్రీవాదధోరణి, దళితవాదం, విప్లవవాదం మొదలైనవి ప్రధానమైనవి.

తెలుగుకవిత్యంలో స్త్రీవాదసాహిత్యం ఒక ఆవేదనగా, నిరసనగా, ఆక్రందనగా కనిపిస్తుంది. 'ఆకాశంలో మేము సగం, అవకాశాల్లో కూడా సగం' అంటూ స్త్రీజాతి ఉద్యమించటానికి ఈ కవిత్వం దోహదపడింది. తెలుగు స్త్రీ వాదకవిత్వంలోని కొన్ని కవితలను స్త్రీలు రాస్తే, మిగతావాటిని పురుషులే రాసారు. మొత్తం మీద ఈ కవితలు బలంగా ఒక ధోరణిని వెల్లడించేవిగా స్థిరపడ్డాయి. స్త్రీలోకం తమ ఆగ్రహాన్ని ప్రకటించటానికి కవిత్వాన్ని ఒక యానకంగా గ్రహించింది. వస్తువైవిధ్యానికి, వస్తు నిర్వహణకు స్త్రీవాదకవితలు పేరుపొందాయి. కొందరు కవయిత్రులు తమ కవితలలో స్త్రీ శారీరక బాధలను తీసుకొని వాటికి కవితాగౌరవం కల్పించారు. ఏ విధమైన శంకలకు, అనుమానాలకు తావివ్వక అన్ని విషయాలను చర్చించటం వాటిపై అభిప్రాయాలను వ్యక్తీకరించటం ద్వారా స్త్రీవాదులు స్వీయచైతన్యం పొందారు. ఈ చైతన్యం ద్వారా తరతరాలుగా తమని పట్టి ఉంచిన పితృవాద దాస్యశృంఖలాలని వదిలించుకోవాలని ప్రయత్నాలు చేసారు. పురుషుడి అమానుష ఆధిపత్యాన్ని వీరు ధిక్కరించారు.

సంప్రదాయంపేరిట స్త్రీకి విద్యాబుద్ధులను దూరంచేయటం, వంటింటికే పరిమితం చేసి ఆమెను బందీచేయటం మొదలైనవాటిని తెలుసుకున్న స్త్రీ - సమాజంలోని ద్వంద్వ ప్రమాణాలపై తిరుగుబాటు చేయటం పరిశీలించాలి.

బాహ్యనిర్బంధాలనుంచి విముక్తికావటానికి ప్రయత్నం చేయటం ఒక క్రమం అయితే అంతర్‌బాధలనుంచి విముక్తికావటానికి ప్రయత్నించటం మరో క్రమం. తరతరాలుగా స్త్రీ ఒక భోగవస్తువుగానే పరిగణించబడింది. పురుషుడిని సంతోషపెట్టటమే స్త్రీ విధి అని సమాజం నిర్దేశిస్తూవచ్చింది. తన శరీరంలో తానే బందీ అయిన స్త్రీ చేసే తిరుగుబాటు మొదటగా శారీరక బాధలతోనే, శరీరంతోనే మొదలవుతుంది. స్త్రీవాద రచయిత్రులలో ఎక్కువమంది కవితలలో కేంద్రబిందువు స్త్రీ శరీరమే. స్త్రీ విముక్తి కూడా సామాజిక విముక్తిలో భాగమేనని వీరి భావన. అయితే అశ్లీల పదాలను ఉపయోగించటం విమర్శలపాలైంది. అయితే స్త్రీపురుషుల లైంగిక సంబంధాన్ని కించపర్చటమే అశ్లీలతగా పరిగణించనవసరంలేదని కొందరు విమర్శకులు అంటున్నారు. పురుషుణ్ణి ప్రేమిస్తూనే పురుష దురహంకారాన్ని నిరసించటం గొప్ప స్త్రీవాదరచన అవుతుంది. స్త్రీ పురుషుల స్నేహ సంబంధాన్ని గురించికూడా ఆర్ద్రంగా వివరించటం స్త్రీవాదసాహిత్యంలో ఒక కొత్త అధ్యాయమని గ్రహించాలి.

దళితవాదసాహిత్యం ఇటీవలికాలంలో ఎన్నో ఆలోచనలకు వీలు కల్పిస్తోంది. భారతీయ సమాజంలో కులానికున్న ప్రాధాన్యత చాలా ఎక్కువ.

అధికార సోపానాలుగా కులమతాలు ఏనాటి నుంచో మన దేశంలో ప్రభావం చూపుతున్నాయి. ఒక వ్యక్తిని మిగతా మనుషులు తమతోటి వానిగా గుర్తించకపోవటం ఒక దౌర్భాగ్యం. ఈనాటికీ దళితులపై సాగుతున్న దాడులు మానవత్వానికే మచ్చ. ఒక విధమైన అస్తిత్వ సంక్షోభం ఈ ధోరణిలో కనిపిస్తుంది. కులమత వ్యతిరేక వైఖరి, కులం పేరుతో సాగే దారుణదమనకాండని ఈ కవులు విమర్శించారు. అగ్రవర్ణాధిపత్యాన్ని, సుఖాలకు నెలవైన వారి లోగిళ్ళను విమర్శించటం, బ్రాహ్మణ విమర్శ, పురాణాలు ఆదిగా నిందించటం మొదలైన వైఖరులు దళితవాద సాహిత్యంలో కనిపిస్తున్నాయి. అయితే, దళిత, మైనారిటీ కవులు మనిషిని మనిషిగానే గుర్తించాలని కోరుతున్నారు. దళితుల్లో పెరుగుతున్న చైతన్యం, ఆత్మవిశ్వాసం వారి రచనల్లో కనిపిస్తున్నాయి. అయితే ఫ్యూడల్ సమాజంలో ప్రతి వర్గం ఇతర వర్గాలకన్నా పై స్థాయికి వెళ్ళాలని ప్రయత్నించటాన్ని కూడా గమనించి దళితవాద సాహిత్యం పేరుతో కొన్ని వర్గాలను లక్ష్యంగా పెట్టుకొని వారిని తీవ్రంగా తిట్టటం ఎంతవరకు సబబో నిర్ధారించుకోవాలి. సమానత్వ సమాజ నిర్మాణ ఉద్యమ స్ఫూర్తిని దిగజార్చి కులపోరాటాల స్థాయికి తీసుకొని వెళుతున్న విధానాలను అర్థం చేసుకోవాలి.

కులతత్వానికి వ్యతిరేకంగా పోరాడటానికి కొన్ని వర్గాలవారినే నిందించే విధానాలు ఎంతవరకు ఉపయోగపడతాయి? అగ్రవర్ణాల వారిలో అందరూ కులపిచ్చి ఉన్న వాళ్ళే కాదుగా! కులతత్వాన్ని విమర్శించటం, కులానికి చెందిన వారిని నిందించకపోవటం వాంఛనీయం. కవిత్వాన్ని కూడా వర్గదృష్టితో విడగొట్టటం మొత్తం సమాజాన్ని సంఘటితపర్చటానికి అడ్డంకి అవుతుంది.

విప్లవవాద ధోరణులు తెలుగు కవిత్వంలో కొత్త కావు. తెలుగు విప్లవ కవికి అక్షరాలు అగ్ని జ్వాలలు కాగా కవిత్వం ఒక అగ్నికీల. తెలంగాణా సాయుధపోరాటం, భూపోరాటాలు మొదలైనవాటి అన్నింటి వెనకా విప్లవకవి అగ్ని స్పర్శ ఉంది. ఒక సాంస్కృతిక సైనికుడిగా మారిన కవి సమాజంలోని విభిన్న శక్తులను, వివిధ రాజకీయార్థిక అంశాలను అర్థం చేసుకున్నాడు. విప్లవ పునాదిని ప్రభావితం చెయ్యగల శక్తి కవిత్వానికి ఏ మేరకు ఉందో నిరూపించాడు. ఈ కవిత్వ ధోరణిలో అవర్గీకరణ చెందటం మొదటి మెట్టు. ప్రజా జీవితం నుంచి నేర్చుకుంటేనే ప్రజలకు ఏదైనా వివరించగలమని విప్లవ కవి అర్థం చేసుకున్నాడు. ఈ విధమైన అవర్గీకరణవల్ల నిబద్ధత, నిమగ్నతలు పెరిగాయి. శ్రమ విలువని గ్రహించటం, శ్రమదోపిడీ విధానాలను తెలుసుకోవటం తద్వారా శ్రమకీ, అధికారానికి మధ్య ఉన్న శత్రు వైరుధ్యాన్ని కూడా విప్లవకవి తెలుసుకొని తన కవిత్వంలో దాన్ని ఆవిష్కరించాడు. కవిత్వం అంతిమంగా ప్రజాసంక్షేమానికే ఉపయోగపడాలని ఈ కవి భావించాడు. వాస్తవికత, ప్రజా జీవన విధానం విప్లవ కవికి ప్రధాన ఉపకరణాలైనాయి. కవిత్వం ఆయుధమై యుద్ధ భూమిలో గొంతు విప్పాల్సి ఉందని విప్లవకవి తన సంకల్పాన్ని చెప్పాడు. ప్రజా ప్రయోజనం ప్రధానమైందని చెప్పే కవి రూపవాదాన్ని తిరస్కరించటం ఒక ముఖ్య పరిణామం. పద్యంలో ఇమడాల్సిన అందం జీవన వాస్తవికతే కానీ, దాన్ని మరుగుపర్చి మోసగించే మాటల గారడీ కాదు. విప్లవ కవి అనేక రకాల అణచివేత సంఘటనల్నీ, దోపిడీ దృశ్యాల్నీ, తిరుగుబాటు సన్నివేశాల్ని నిశితంగా పరిశీలించి, పోరాట సారాంశాల్నీ కవిత్వంలో వివరించాడు.

మారుతున్న పరిస్థితుల్లో కవులు తమని తాము బేరీజు వేసుకొని తమ పరిధినీ, దృక్పథాన్ని విస్తరించుకుంటూ ముందుకు నడుస్తున్నారు. యంత్రనాగరికతలో మానవ సంబంధాలు హీనంగా మారిపోవటం, మానవీయ విలువలు మంటగలపటం మొదలైనవాటినన్నింటినీ కవులు అర్థం చేసుకున్నారు. నూతన కవులు తమ గళాలు విప్పి తమదైన అభిప్రాయాలను వ్యక్తీకరించసాగారు. వారి అస్తిత్వ వేదన, అనుభూతి తత్వం, జీవన తత్వం, పరాజయ భావన మొదలైనవన్నీ కవిత్వంలో చోటుచేసుకున్నాయి.

భూమ్మీద పాదం మోపుతావు
భూమ్మీదపాదం మోపినప్పుడే మనిషి పచ్చదనాల్ని చూడగలవు
భూమ్మీదపాదం మోపినప్పుడే మనిషి గర్జనల్ని వినగలవు
భూమ్మీదపాదం మోపినప్పుడే మనిషి పరసత్వ పర్వత సమూహాల్ని చూడగలడు

శివారెడ్డి మనిషి అంతరంగంలోని యుద్ధరంగాన్ని చూడగలిగాడు. భూమ్మీద పాదం మోపినప్పుడే మనిషి ప్రకృతిని అధ్యయనం చేయటం మొదలెడతాడు. ఆకలి జంతువుల్ని, పర్వత సమూహాల్ని చూసిన మనిషి సంఘర్షణ అనివార్యమని అర్థం చేసుకుంటాడు. గోదావరి గర్భంలో రాళ్ళు నిదానంగా దొర్లుతుంటాయి, నీళ్లలోనూ రాళ్ళలోనూ ఒక ఎర్ర జీర వ్యాపిస్తూ ఉంటుంది. ప్రజా ఉద్యమాలకి తగిన నేపథ్యం ఉంది. అందుకే కవి తుపాకీతో ఉద్యమ సూర్యుణ్ణి కూల్చగలడా అని ప్రశ్నిస్తున్నాడు.

కత్తితో సూర్యుణ్ణి రెండుగా చీల్చగలదా? విప్లవశక్తులు తప్పక విజయాన్ని పొందగలవని కవి ధీమా వ్యక్తం చేస్తున్నారు.

గుడిహాళం రఘునాథం 'పద్యంలో ఇమడాల్సిన అందం' కవితలో భావం ప్రధానమని కవితా నియమాలు ప్రజల్నుంచి తనను దూరం చేస్తున్నాయని చెపుతాడు. విప్లవం ముసుగేసుకున్న భావకవి పేలని తుపాకీ అని కవి అంటారు. కళ్ళు మూసుకొని అందమైన అలంకారాల కోసం కవి వెతుకుతూ ఉన్నప్పుడు పద్యంలో ఇమడాల్సిన అందం పద్యం ముందే తెరగా వాలిపడుతుందని హెచ్చరిస్తాడు.[1] వాస్తవికత కవిత్వానికి ప్రాథమిక లక్షణం అని కవి అభిప్రాయం.

నీకు తెలీకుండానే నీ పద్యం వెనుక దాక్కుని
అందం నిన్ను మోసం చేస్తుంది
అందం నిన్ను వికృతం చేస్తుంది
నీ పద్యంలో ఇమడని అందం
నిన్ను నిలువుగా ముంచేస్తుంది

'లాల్ బనో గులామీ చోడో బోలో వందేమాతరం' కవితలో ఎన్. కె. రత్నగర్భ తన మాతృదేశం ఎలా బానిసగా మారిందో వివరించాడు. ఒక దీర్ఘ కవితలో మొత్తం భారతదేశ చరిత్రను స్థూలంగా ఇమడ్చాలని ప్రయత్నించాడు. గులామీ చోడో అని కేక వేస్తాడు. 'నా దేశపు స్త్రీల సౌందర్యం బానిస సరుకుగా నడిబజార్లో నిలబెట్టబడ్డది, అమ్మబడ్డది' అని ఆక్రోశిస్తాడు. స్వాతంత్ర్యోద్యమంలోని ఉజ్వల ఘట్టాలను వివరిస్తూ బ్రిటీష్ కుట్ర బెంగాల్‌ను రెండు ముక్కలు చేస్తే నిరసనగా ఉబుకెత్తిన స్వరం వందేమాతరం అంటాడు. దీని సారాన్ని, జీవాన్ని, సమరశీలాన్ని నీరుగార్చి దారి మళ్ళించింది మీరు అని గర్జిస్తున్నాడు.

లభించిన స్వాతంత్ర్యం సామాన్యులది కాదని దోపిడీవర్గాల వారిదని చెపుతూ నాకు స్వాతంత్ర్యం రాలేదు, నా దేశ దాస్యశృంఖలాలు యీనాటికీ తెగిపోలేదు అని వెల్లడిస్తున్నాడు.

సమస్త రాజ్యాధికారం శ్రామికుని హస్తగతం కావాలని
ఉత్పత్తి శక్తుల చేతుల్లోకి ఉత్పత్తి సాధనాలు రావాలని
దున్నేవానికే భూమి కావాలని విప్లవం వర్థిల్లాలని

ఆశిస్తూ అందరికోసం ఆయుధం అందుకున్నాను, రాజ్యాధికారం కోసం ఆయుధం అందుకున్నాను అని ప్రకటిస్తున్నాడు. నా దేశ చరిత్ర అంతా రైతాంగ పోరాటాల చరిత్ర, రైతుబిడ్డల త్యాగాల చరిత్ర అంటారు.

విప్లవకవి వరవరరావు 'ఏడుపాయల నది ఏమన్నది' కవితలో అమాయక ఆటవికుల జీవితాల గురించి వివరించాడు. వాళ్ల జీవితాలు ప్రకృతిలాగానే నిష్కల్మషంగా, నిండుగా ఉంటాయి. అడవి పూలకున్నన్ని ఆకాశపుటూహలు, ఆకాంక్షలు ఉన్న వారి

మనసు భూమంత విశాలమైనది. ఈ స్వేచ్ఛా జీవుల్ని నాగరికత పేరుతో కట్టడిచేయటం, ప్రజాస్వామ్యం పేరిట వారి జీవితాలని నియంత్రించటం మొదలైనవాటిని కవి నిరసిస్తున్నారు.

వాళ్ళకొక గొండ్వానా రాజ్యం ఉండేదని మనకు తెలియదు
వాళ్ళకొక సంప్రదాయజెండా వుందని మనకు తెలియదు
అశోకచక్రం కింద బతుకుతూ
మూడు సింహాల 'అహింస'కు అలవాటుపడ్డప్పటి నుంచి

మన ఆకాశంలో సూర్యచంద్రులే మనకు పరాయి వాళ్ళయ్యారు. అడవి ఒడిలో ఒదిగిన వీరిని దోపిడీ చేయటం, వాళ్ళ మానాన వాళ్ళని బతకనివ్వక సతాయించటం ప్రభుత్వ విధానమైంది. అంతర్గత సామ్రాజ్యవాదం Internal colonialism వాళ్ళు స్వతంత్రంగా బతకటానికి ఆటంకమైందని కవి అంటున్నారు. వాళ్ళ జెండా ఎగిరితే చాలు మన కేంద్రీకృత బానిసత్వానికి అది స్వతంత్రక్తర ప్రకటించుకోవటంగా భయమేసిందని కవి వివరుస్తున్నారు.

కవిత్వం ఆయుధమై సమాజ అసమానతల్ని, రాజ్యహింసను, దోపిడీపాలనను ఎదుర్కోవాలని నందిని సిధారెడ్డి చెపుతున్నారు. కవిత్వం ఊట మీద లాఠీ వేలాడుతుంది, మరింత గట్టిగా నిర్భయంగా కలలు కన్నంత స్వేచ్ఛగా స్వచ్ఛంగా కవిత్వం రాయాల్సి ఉంది అని ప్రకటించటం కవిత్వం సామాజిక ప్రయోజనం కోసమే అనటం.

తెల్లారకముందే
తలుపుతట్టి నిద్రలేపి తన ఇంటిగోడకే నిల్చోబెట్టి
కాల్చివేసిన ఖాకీ విలాసాన్ని ప్రశ్నిస్తుంది

కవిత్వం ఆయుధం కావాలనే కవి ఆశయం. మన కవిత్వం ఆయుధం కావాల్సి ఉంది అని యుద్ధ భూమిలో గొంతు విప్పాల్సి వుంది అని కవి చెపుతున్నారు.

గోండు స్త్రీ బొడ్లోంచి కొడవలి తీసినట్లు తను కవిత్వం తీస్తున్నానని అనటం విప్లవసాధనలో కవిత్వం శక్తిని వెల్లడించటం. సవరవీరుడు బాణం ఎక్కుపెట్టినట్లు నేను కవిత్వం ఎక్కుపెడుతున్నాను అంటూ ఈనాటి విప్లవకవి గర్జిస్తున్నాడు.

గని కార్మికుడి జీవితాన్ని వఝల శివకుమార్ వివరించిన విధానం చాలా వాస్తవంగా ఉంది. కడగళ్ళ నెగళ్ళలో కమిలి విషవలయాల్లో కనలి గుండెలోతుల్ని స్పృశిస్తూ బతుక్కి అర్థమౌతున్న గని కార్మికుడి జీవితాల్ని ఈ కవి వివరించిన విధానం వారి జీవితాల్లోని ఆవేదనని వెల్లడిస్తోంది.

కళ్ళకి బొగ్గు జీవితంలా.....
జీవితం రేపటికి బూడిదయ్యే బొగ్గులా....
నీళ్ళు చిమ్ముతూ నిప్పులు చెరుగుతున్న కళ్ళు.....

బొగ్గు బావులలో పనిచేసే కార్మికులు ప్రాణాలని పణంగా పెట్టి, చీకటి కుహరాల్లో అన్వేషణ సాగిస్తున్న విధానాన్ని అక్షరబద్ధం చేసారు. వారి శ్రమకు విలువకట్టే షరాబీ లేడని, గని గుండెల్లో నిప్పుకి నీరాజనం పడుతున్న వారి జీవితాలు చాలా గొప్పవని కవి చెపుతారు.

పెట్టుబడిదారీ విష సంస్కృతి పెరిగే కొద్దీ సంప్రదాయ కళారూపాలు బలహీనమవుతాయి.(2) బహిరూపి ఒక కళాకారుడు. నా లోకం నాదేగని గీ లోకంలో ఏమయ్యేది నాకే మెర్క' అని ప్రశ్నించే ఈ అమాయక కళాకారుల జీవితాలని దేవరాజు మహారాజుగారు 'బయిరూపులోల్లం' అనే కవితలో కళ్లముందు సాక్షాత్కరించారు. హైక్లాస్ సొసైటీలోని పెద్ద మనుషులందరూ వేషాలు వేసి, మార్చి ప్రజలని ఏమార్చి బతికేవాళ్ళేనని కవి వ్యంగ్యంగా అంటారు.

మీ పెద్ద పెద్దోల్లంత నా లెక్కనే ఏసాలు గద్దరని

నా లెక్కనే పల్కులు పలుకర్తని నాకే మెర్క గులాపోన్ని

భూదేవి కుంతి తమని కని పారేసిందని, మీ కండ్లకు పురుగులైనంగాదుండి అని ఈ బహిరూపి అంటున్నాడు. వారి జీవితాలు మట్టిల చేసి వారి జీవితాలు పుళ్ళుపడిపోయాయి. పెత్తనం ములుగర్ర తోటి అందరూ వాళ్ళని పొడిచినవారే. జిత్తుల మారోడు ఇంద్రజిత్తు వేషం వేసుకొని మీరందరూ ఎక్కడుంటారో ఏమో మీ కలంపోటు బాణాలన్నీ మాకే తగులుతున్నాయని అంటాడు. నాగరికులందరూ ఇతరులని పీడించే సంస్కృతికి స్వస్తి పలకటం సమానత్వభావనతో నడుచుకోవటం అత్యావశ్యకమని ఈ కవిత చెపుతోంది.

యాభయ్యేళ్ళ స్వాతంత్ర్యంలో రైతుల ఆకలిచావులు, ఆత్మహత్యలు ఎక్కువ అవటం జాతి దౌర్భాగ్యానికి నిదర్శనం. మహబూబ్‌నగర్, కలహందీ సంఘటనలపై స్పందించిన వసీరాతాను బియ్యపుగింజ మీద వాటిని చూపించగలనంటున్నారు. దేశానికి అన్నం పెట్టే రైతుకే అన్నం కరువైనపుడు ఆ పాపం ఎవరిదని కవి ప్రశ్నిస్తున్నారు. పారిశ్రామికవేత్తల చందాలతో అధికారాలలోకి వచ్చే ప్రభుత్వాలు ప్రజలకు కనీస సౌకర్యాలను కూడా కల్పించక, కరువు పరిస్థితుల్లో వినోదాలతో కులికే క్షుద్ర సంస్కృతిని విమర్శిస్తున్నారు.

అన్నం మెతుకు మీద లేత బుగ్గల రక్తం చారికల్నీ
గోధుమగింజ గొంతులో న్పొడర్నీ
బీడీ ఆకు హరితకణాల్లో
బిగిసిన విల్లంబుల్నీ చూపించగలను

ఏడాది పొడుగూతా రెక్కలు ముక్కలు చేసుకున్న రైతు పంట చేతికి అందకపోతే విలపించటం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయుడు. అన్ని రుతువుల్లోనూ కష్టపడే రైతు ఆకలి రుతువు మాట వింటేనే హడలిపోతున్నాడు. రైతు సంక్షేమమే ప్రధానమని

ఊకదంపుడుగా ఉపన్యాసాలు చెప్పే ప్రభుత్వాలు ఆచరణలో చేసేది శూన్యం. ఈ పరిస్థితులని వివరిస్తూ అమ్మంగి వేణుగోపాల్ ఎండుటాకులో విధంగా అంటున్నారు.

దారిద్ర్యరేఖకు అకుపచ్చరంగు పులిమి
హరిత విప్లవం అని అరుస్తున్నపుడు
ఎండుటాకులు ఏమని వ్యాఖ్యానించాయో మీకు తెలుసా?

దురదృష్టవశాత్తూ రైతుకు ఎండుటాకుల భాష తెలుసు అని అనటం రైతు ప్రపంచం మోసాల్ని చూస్తూ మౌనంగా ఊర్కొన్నా, అతను దీన్ని ఎదుర్కొంటాడని సూచిస్తోంది. అప్పులు పాలయిన రైతుల కడగండ్లని తన కవితలో వివరించాడు. ఖండాంతర లావాదేవీల్లో జాతికి వెన్నెముక రైతన్న జీవితాన్ని నాయకులు తాకట్టు పెట్టారని చెపుతాడు. పురుగుని చంపలేని మందులు రైతుల ప్రాణాలు తీయగలిగినప్పుడు ఒక్క క్షణమే ఆశ్చర్యం అని కవి అంటారు. రైతుల ప్రాణ త్యాగాలకు ప్రభుత్వం ఏమీ చలించలేదు. వారి శవాల ఉసురు పోసుకునే చీకటి - డబ్బునీ, దాని కావలి కుక్కల్నీ ప్రశ్నిస్తానని కవి ఎంతో ఉద్వేగంతో చెపుతారు.

శ్వేత జాత్యహంకారానికి వ్యతిరేకంగా గళం విప్పిన అమెరికన్ నీగ్రో గాయని ట్రేసీ చాప్‌మన్. ఈ గాయనిని నారాయణస్వామి తన కవిత ద్వారా పరిచయం చేసారు. సమస్త ప్రపంచానికే తిండి పెడుతున్నా మా పసిపిల్లలు ఎందుకు ఆకలి కరువుతో కనలిపోతున్నారని నీగ్రోసమాజం ప్రశ్నించింది.

నీ పాట వేదనై సాగుతుంది
నీ పాట వూపిరై ఎగిసిపడుతుంది
నీ పాట వేడి నెత్తురై చలిస్తుంది

నిరంతర మృత్యుభయాల్లో జీవితం కళ్ళలో వత్తులైన నీగ్రో ప్రజల అభద్రతని సుడులు తిరిగే ట్రేసీ పాటలు దూరం చేస్తాయని కవి భావిస్తున్నారు. ట్రేసీ పాటలను పెట్టుబడిదారులు అమ్మకానికి పెడతారని, వేలం వేస్తారని, అవార్డులు ప్రకటిస్తారని చెపుతూ దానికి అంగీకరించవద్దని కవి చెపుతారు. దోపిడికీ, అణచివేతకి, శ్వేత జాత్య హంకారానికి వ్యతిరేకంగా మన పాటలు పోరాట నినాదాలుగా జ్వలించాలి అని ఆకాంక్షని వ్యక్తం చేస్తున్నారు.

నగర జీవితాన్ని, అందులోని ప్రజల తత్వాన్ని గోదావరిశర్మ కలం చాలా సహజధోరణిలో వెలుగులోకి తెచ్చింది. ఈ కాంక్రీట్ జంగిళ్ళలో ప్రజలు కూడా డబ్బాపాలతో, రక్షిత జలాలతో పెరుగుతున్న వారే. నగరం పెంచుతున్న పిల్లలు నాగరికులు - నవ్వటం మరిచిపోయారు. నాజూకుగా పెరిగే వీరికి నాణ్యత అంటేనే తెలీదు. ప్రకృతిలో లీనమయ్యి పనిచేసేవారికి సృజనాత్మకత, వ్యక్తిత్వం, ఆలోచనా విధానాలు ఏర్పడతాయి కానీ ఇలా నగరాల్లో అహర్నిశలూ యంత్రాలను సేవిస్తూ బతికేవారికి అంతరాత్మ ఉందనే విషయం గుర్తుండదని చెపుతారు.

ఆచామగా వాగినప్పుడే అర్థమై పోయింది
పెళ్ళంటే పెద్ద శిక్షని!
మొగుడంటే స్వేచ్ఛాభక్షకుడని
మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తోందని

ఛాయరాజ్‌గారు 'కుంతి'లో ఫ్యూడల్ సంస్కృతి ఎలా పురిటిలోనే మీసమెత్తి పుడుతుందో చిత్రించారు. కాలుజారిన కన్నెపిల్లను సమాజం అంత చిన్నచూపు చూస్తుంది. ఆనాటి కుంతి కూడా శోకంతో కర్ణుడిని కాలప్రవాహంలో విడిచింది. ఈనాడు కన్నె కాలుజారి పిల్లను కని వదిలేస్తే ప్రభుత్వం అనాథశరణాలయాలను చూపిస్తుంది. స్త్రీ శిశుసంక్షేమ బడ్జెట్లు మగ తేనెటీగలకు విందు చేస్తాయి.

స్త్రీలలో వస్తున్న చైతన్యాన్ని వివరిస్తూ-

ఆనాటి కుంతి అవిశ్రాంతంగా ఆలోచిస్తూ బతికిపోయింది
నిన్నటి కుంతి నిరంతరం పెనుగులాడుతూ హత్యగావించబడింది
నేటి కుంతి
సంఘటిత పోరాటాల లోనికి ఆహ్వానించబడుతోంది

రావులపల్లి సునీత 'ఆత్మహత్య నా నిరసన' అనే కవితలో ఎన్నో ఆలోచనలను రేకెత్తించారు. స్త్రీ తనను పెరగనివ్వని ప్రపంచం మీద, బ్రతకనివ్వని కాలుష్యం మీద నిరసన ప్రకటిస్తోందని చెప్పారు. సతీసహగమనం పేరుతో ఎందరో స్త్రీల జీవితాలు బుగ్గిపాలయ్యాయి. "నా పతి లాలిత్యం మోయలేక నన్ను నేనే తగలబెట్టుకున్నాను అది నా నిరసన" అని కవయిత్రి ప్రకటిస్తున్నారు.

నన్ను కాల్చుకు తినబోయే
గుంటనక్కల్ని వదిలించుకునేందుకు
వేపుకి తిని చచ్చిన నా మొగుడి ఒడిలోనే తలవాల్చి
నన్ను కాల్చుకున్నాను.

వరకట్న హత్యలు, లైంగిక వేధింపులు స్త్రీల పాలిట శాపాలయ్యాయి. ఉద్యమించిన స్త్రీ శక్తి ఈ పురుషాధిక్య సమాజ ద్వంద్వ ప్రమాణాలను ప్రశ్నిస్తోంది.

గ్రామీణ ప్రాంతాల్లో స్త్రీలు కష్టం చేసి తమ బిడ్డలను పెంచుతున్నారు. పొద్దుతో పాటే పంట పొలంలో పనిచేసి మా అమ్మ అంటూ అల్లం నారాయణ 'అమ్మ' అనే కవితలో స్త్రీలు వంటిళ్ళలోనే ఎలా జీవితాల్ని వెళ్ళదీస్తున్నారో వివరించాడు. తన కంట్లో కారుచీకట్లు దాచుకుని మా అమ్మ వెన్నెల నవ్వులు విరిసింది, పక్షుల్ని పిలిచి మాకు పాటలు నేర్పింది అని తల్లి తమ కోసం పడ్డ కష్టాన్ని వెల్లడించిన తీరు మన మనసుకి హత్తుకొని పోయేటట్లుగా ఉంది. జీవితంలో ఏ సుఖానికి నోచుకోక ఎందరో అమ్మలు

వంటింటి గడపమీద శిలలు అవుతున్నారు. తమ సుఖాలను త్యజించి బిడ్డల సుఖానికి సర్వం త్యాగం చేసే మాతృమూర్తుల జీవితానికి ఈ కవిత అక్షరనీరాజనం పలికింది. తల్లి ప్రేమను ఇంత అపురూపంగా గుండెగొంతుల్లోంచి పలకటం చాలా బాగుంది. "పొగచూరిన పాత వంట గదికావల నా కోసం మా అమ్మ కిటికీ తెరిచింది." అనటం ఆమె జీవితం ఎంత దుర్భరంగా సాగిందో వెల్లడిస్తోంది. అమ్మ చూపించిన మార్గం ద్వారా ప్రపంచాన్ని తెలుసుకొని తాను మాత్రం సురక్షితంగా ఒడ్డునపడ్డాడు. కానీ సంప్రదాయ ఇనుప సంకెళ్ళు ఆమెను పట్టి బంధించి రక్తమాంసాదుల్ని పీల్చి పిప్పి చేసాయి. ఈ కవితలో ప్రతీకల ద్వారా కవి జీవితాన్ని చిత్రించిన విధానం చాలా వాస్తవంగా కవిపిస్తోంది.

పసుపు కుంకుమలు, తాళిబొట్టు, కాలిపట్టెడ
పాతివ్రత్యధర్మం మీద పూర్వీకుడు రాసిన పుస్తకం
సాక్షీభూతాలుగా
మా అమ్మ వంటింటి గడప మీద
శిలయింది

అలంకారిక వస్తువులుగా కనపడే తాళి, మట్టెలు స్త్రీని బంధించే బంధనాలు అయ్యాయని కవి వ్యంగ్యంగా చెపుతున్నారు. సంప్రదాయం పేరిట స్త్రీ జీవితం నాశనమవుతందని ఈ కవిత వివరిస్తోంది.

ఘంటసాల నిర్మల 'ఎ కాల్‌గర్ల్స్ మోనోలాగ్'లో వేశ్య జీవితాన్ని చూపించారు. సమాజం తన విశృంఖల అవసరాల కోసం ఏర్పరిచి పెంచిపోషిస్తూ వచ్చిన ఈ వ్యవస్థలో వేశ్యలు దుర్భర పరిస్థితుల్లో ఉంటున్నారు. అవసరం తీర్చుకొని వెంటనే దూరంగా విసిరికొట్టే వ్యక్తుల చేతుల్లో ఈ ఆటబొమ్మలు ప్రతిసారీ పగిలిపోతున్నాయి. విటుల విపరీతపు చేష్టలకు, తీరని కోర్కెల దాహానికి మౌనంగా అంగీకరించటం మినహా ఏమీ చేయలేని నిస్సహాయత.

వేల వేల వీర్యాల వర్షాల్ని
కళ్ళు మూసుకునైనా భరిస్తున్నదాన్ని

వికృత మనస్తత్వానికి ఆనందాల్ని పంచే వారిని అసహ్యించుకోవటం అధమత్వానికి ఆవల కేవలం నీచత్వానికి క్షుద్రప్రతీక అని రచయిత్రి ఈసడించుకుంటున్నారు.

వంటిల్లు అనే కవితలో విమల సమాజంలోని స్త్రీ దుస్థితిని వివరించారు. బాల్యంలోనే ఆడపిల్లకు వంటిల్లు ఒక వదలని విషయమైపోతుంది. అమ్మా నాన్న ఆటలు, పప్పుబెల్లాలతో వంటావద్దనలు మొదలైనవన్నీ అమ్మాయిల మనస్సులని ఒకరకంగా తయారయ్యేలా చేస్తున్నాయి. ఆత్మవిశ్వాసంతో అడుగువేయటం, నిర్ణయాలు తీసుకోవటం లాంటివి నేర్పకుండా ఎప్పుడూ వంటగదిలోనే మగ్గిపోవటం స్త్రీ జీవితం,

అని ఆలోచించే దశకు ఈ విధంగా వారిని తీసుకొని వెళ్ళటం జరుగుతోంది. 'ఇక్కడే నన్ను తీర్చిదిద్దటం మొదలైంది' అని కవయిత్రి అంటున్నారు. ఆడదానిగా ఎలా బతకాలో ఇక్కడే స్త్రీకి నేర్పుతారు. 'వంటింటి తనాన్ని' ఇక్కడే నేర్చుకున్నాను అని కవయిత్రి వ్యంగ్యంగా చెపుతుంది.

ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మ రాణి

అయినా, చివరకు వంటింటి గిన్నెలన్నిటిపైనా మా నాన్న పేరు అనటం ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీకి లేదని పై వాక్యాలు నిరూపిస్తున్నాయి. ఏ విషయంలోనైనా స్త్రీకి స్వేచ్ఛలేదని, అన్నిటికీ మగవాడిపై ఆధారపడి బతకాల్సిన పరిస్థితులు ఉన్నాయని ఈ కవిత ద్వారా కవయిత్రి విషయం చెపుతున్నారు. మన రక్తం పీల్చేసి, మన ఆశల్నీ కలల్నీ కాజేసి కొద్ది కొద్దిగా మన జీవితాలను పీక్కుతింటున్న రాకాసిగద్ద ఈ వంటిల్లు అని చివర్లో ఆమె అంటున్నారు. మన పిల్లల కోసం వంటరి వంటగదులని కూల్చేందుకు రండి అని ఆమె పిలుపునిస్తున్నారు.

శారీరక హింసగా శృంగారాన్ని చెపుతూ స్త్రీలకు 'లేబర్‌రూమ్' బాధలను గుర్తుకు తెచ్చే కొండేపూడి నిర్మల కవిత ప్రకృతిపరంగా స్త్రీలు పడే వేదనని వివరించింది. మాతృత్వం అని ముద్దుగా పిల్చుకునే ఈ ముళ్ళ కిరీటాన్ని మోయలేనని స్త్రీ చెపుతోంది. శోభనం గదిలో తెల్లచీర, మల్లెపూలు, పాలగ్లాసు మొదలైనవి ద్వీపాంతరవాసం, బానిస కన్నీరు, పరాధీనతలను గుర్తుకు తెస్తాయని ఆమె చెపుతున్నారు. లేబర్‌రూమ్ ఒక నరకకూపమని ఆమె అభిప్రాయం.

కాళ్ళనలా ఎడం చేసి దీనంగా హీనంగా నీచాతినీచంగా
ఒక హింసాతుల పరాకాష్టకోసం ఎదురు చూడ్డమంటే
రైలుపట్టా మీద నాణెం విస్తరించిన బాధ
కలపను చెక్కుతున్న రంపం కింద పొట్టులా
ఉండ చుట్టుకున్న బాధ

పాటిబండ్ల రజని 'అబార్షన్ స్టేట్‌మెంట్' అనే కవితలో తల్లి హృదయవేదనని చూపించారు. అబార్షన్ పేరిట కొందరు తల్లులు తమ కడుపులోని బిడ్డను భూమ్మీద పడనీయకుండా వదుల్చుకుంటున్నారు. ఇంకో జీవిని లోకంలోకి తేవటానికి అనంగీకారం, పెంచేందుకు తీరికలేకపోవటం భ్రూణహత్యలకు దారితీస్తోంది. అమ్మగా పసిపాపని లాలించాల్సిన ఆ చేతులే బిడ్డ జీవితాన్ని అంతంచేయటం పాశవికం. అబార్షన్ అనే పైశాచిక సంప్రదాయాన్ని కనిపెట్టిన వాళ్ళ ముఖాలపై ఉమ్మునీళ్ళతో ఉమ్మేయ్యాలని వెర్రి ఆవేశంగా కన్నతల్లి మాట్లాడుతోంది. మనసుకి తగిలిన ఈ గాయం మానే విధానమే తెలీక.

అయ్యో
పాలింకి పోవటానికున్నట్లు
మనసింకి పోవటానికీ
మాత్రలుంటే ఎంత బాగుండును

వ్యాకులతతో సగం చస్తూ సగం బ్రతుకుతూ ఉండాల్సివస్తోందని ఆమె అంటున్నారు.

స్త్రీలను ప్రేమతో, అనురాగంతో దగ్గరకు తీసుకోవటం కాక జీతం లెక్కలను వేసుకుంటూ గడిపే భర్తలే ఎక్కువ ఉన్నారు. ఈ విధమైన ఆర్థికలాభాపేక్ష సంసారాన్ని కృత్రిమంగా చేస్తోంది. పెండ్లాం సంపాదన గురించి మాత్రమే ఆలోచించే భర్తల కౌగిళ్ళు ఉరితాళ్ళలాగా ఉంటాయి. మందరపు హైమవతి తన కవితలో ఈ విధంగా సుకుమార ప్రణయానుభూతిని కాటువేయబోయే సర్పపరిష్వంగం గురించి వెల్లడించారు.

శృంగారంలో మునిగి రసానందాన్ని పొందుతున్న అమృత ఘడియల్లో భర్త నోటివెంట "జీతం ఎప్పుడిస్తారు" అనే ప్రశ్న రావటం పిడుగుపాటులాగా హృదయాన్ని తాకుతుంది. వెంటనే తన జీవితం నుంచి భర్తను దూరంగా విసిరివేయాలనే ఆలోచన ఆడవాళ్ళకి వస్తుందని కవయిత్రి అంటారు. ఒక్కసారిగా వేయి రాక్షసబల్లులు మీద పాకినట్లు మనస్సు జడుసుకుంటుందని చెపుతారు. కానీ భారత స్త్రీ అయినందుకు

క్షణక్షణం ఇలా రాజీపడుతూనే
మృత్యుపర్యంతం బ్రతికేస్తూనే ఉంటాను.
నీ సర్పపరిష్వంగంలో

దళితవాదకవిత్వం వర్తమాన తెలుగు సాహిత్యంలో చాలా చర్చలకి, వివాదాలకు కారణమైంది.[4] భారతీయ సమాజం పిరమిడ్‌ని పోలి ఉంది. ఈ సమాజ ఉక్కు చక్రం జన్మకారణాన కొందరికి అవకాశాలను, మరికొందరికి ఏ హక్కులు లేకుండా బతికే పరిస్థితులని కల్పిస్తోంది. మన తోడివారిని దూరంగా ఉంచి, మనలో ఒకనిగా గుర్తించక వారిని సతాయించే సంస్కృతిని కులవ్యవస్థ పెంచి పోషిస్తోంది. దళితుడు కళ్ళు తెరిచి ఈ అన్యాయాలను ప్రశ్నించటం మొదలుపెట్టాడు.

సతీంద్ర "దళిత మానిఫెస్టో" కులవ్యవస్థపై, దాన్ని విశ్వసిస్తూ కొనసాగించాలని కోరుకునే శక్తులపై ఎక్కుపెట్టిన కవితా బాణం. తాను దళితుడనేనని, అందుకు తానేమీ కించపడటం లేదని నిక్కచ్చిగా కవి అంటాడు. దేవుడి గుళ్ళోకి తనను రానివ్వకపోవటం వల్ల తాను నాస్తికుణ్ణయ్యానని, అదీ తనకు మంచిదే అయిందని అంటాడు. అగ్రవర్ణ అహంకారం దళితుడికి చదువుని నిషేధించింది. దీనివల్ల వీరిది ఎంత విశాలహృదయమో తనకు తెల్సిపోయిందని అంటాడు. "నువ్వెంతటి మూర్ఖుడివో నాకు తెలిసిపోవటమే మేలైందని" చెపుతాడు. మానవులని విభజించి వృత్తులని విభజించిన విధానం దళితుడికి పారిశుధ్యం, శవసంస్కారంలాంటి పనులే చేయమని నిర్దేశిస్తూ వచ్చింది. దీనికి సమాధానం చెపుతూ ఇదీ మంచిదేనని దీని ద్వారా మీ ప్రాణాలను కూడా ఎలా పాతేయాలో తనకు తెలియడమే మంచిదని కసిగా అంటాడు. "నా

ఆడదాన్ని - నాలో సగాన్ని ఒళ్ళమ్ముకొనే బతకమన్నావు" అనటం దళితుడి జీవితాన్ని సమాజం ఎంత తీవ్రంగా గాయపర్చిందో చెపుతోంది. ఇంత ఘోరాన్ని, హాలాహలాన్ని భరించి కూడా ఇంకా ఆత్మబలంతో ముందుకు సాగటం అభినందనీయం.

ఎవడు ఎలా పిలిస్తే నాకేం
వీళ్ళ విలువల మీద
తుప్పున ఉమ్ముస్తున్నప్పుడు

దళితుని ఛీత్కారాన్ని, ఆగ్రహాన్ని, భావోద్వేగాన్ని చూడవచ్చు.

'మర్రికింద మల్లెతీగ' అనే కవితలో అడిగోపుల వెంకటరత్నం ఎన్నో సత్యాల్ని వెల్లడించారు. చారిత్రక తప్పిదాల్ని సవరించటానికి ఉద్దేశించిన శాసనపరమైన రిజర్వేషన్లను కనీసం అందుకునే స్థాయిలో కూడా దళితుడు లేడు. ఒకరి ఆత్మవిశ్వాసాన్ని అడుగుకంటా తొక్కివేసిన తర్వాత అసలు ఆ జీవి ఎలా జీవితంలో పైకి రాగలదు? దళితునికి మొదట్నుంచీ అవమానాలే తప్ప ఆసరాగా ఏమీ దొరకదు. అందుకే "మాకు అనుభవాలకేం కొదవ మా రక్తమంతా అవమానాల వెల్లువ" అని కవి అంటాడు.

మేము మర్రిచెట్టు క్రింద మల్లె తీగలం
పెరగకుండా బ్రతకాలి చావకుండా నిలవాలి
నీడనిచ్చినా పెరగలేదని
నీతులు మీరు చెప్పుకోవాలి

మర్రి కింద మల్లె తీగ పెరగదు. చుట్టూతా విస్తరిస్తూ తన నీడలో ఎవరికీ అవకాశాలు లేకుండా చేయటం మర్రిచెట్టు లక్షణం. కులవ్యవస్థ అనే మర్రిచెట్టు కూడా తన ఊడలను విస్తరిస్తూ దళితులని ఎదగనివ్వటం లేదని కవి వివరిస్తున్నారు.

గుంటూరు ఏసుపాదం "నేపథ్య శోకం" అనే కవితలో ఎవరికీ పట్టని దళితుని గురించి చెప్పారు. పై మెట్టు నుంచి కింది మెట్టువరకు ఉన్న వ్యక్తులందరూ దళితుడిని ఒంటరివాడిని చేసారు.

చరిత్ర పుటల్లో చెదతిన్న అథో జ్ఞాపికలు
పుణ్యభూమి పొలిమేరల్లో విసిరేసిన విస్తళ్ళు

మన దేశం పుణ్యభూమి, వేదభూమి అని చెపుతారు. మన సోదరుడిని మనమే విస్తరాకులా నెట్టివేయటం అమానుషం. సంఘం ఇనుప పాదాల కింద పడి సర్వం కోల్పోయిన వర్గం వారిని - సంఘటిత మవ్వాలని, అన్యాయాలపై తిరగబడాలని కవి అంటాడు.

'తమ్ముడి ఉత్తరం' అనే కవితలో యాకూబ్ గ్రామప్రజల జీవితాల్లోని నిర్మలత్వాన్ని గుర్తు చేస్తాడు. నగరంలోని ప్రజలు దాని ఊచల మధ్య బందీలే కదా అనటం మానవత్వమే కనిపించని నగర జీవినవిధానాన్ని అపహాస్యం చేస్తోంది. గ్రామప్రజల,

వివరించింది. ఆధునిక జీవితంలోని సంక్లిష్టత ఆత్మీయాభిమానాలని కాదని డబ్బు, స్వార్థం ప్రథమస్థానం ఆక్రమించగా, తల్లిదండ్రులు - ఏ విధంగా కన్నవాళ్ళ దగ్గరే అనాథలుగా అవుతున్నారో ఈ కథలో రచయిత్రి చిత్రించింది.

కె. రామలక్ష్మిగారి 'అదెక్కడ' కథ స్త్రీకి అమ్మతనం, భార్యతనం, అత్తతనం, నానమ్మతనం - అన్నీ ఆనందమేనని కానీ, తానూ ఒక మనిషినని వాళ్ళనుకున్నప్పుడు అని చెపుతుంది. భర్త 'అది' అని పిలవటం క్షణం సేపు సజీవపదార్థాన్ని ఇలా 'అది' ఎప్పుడయ్యాను చెప్మా అని పద్మావతిని వింతపడేలా చేస్తుంది. చివర్లో ఆమె 'ఇక్కడ నేనో మనిషిని. ఇక్కడ నేను జీవచ్ఛవాన్ని కాదు. ఇక్కడ నన్నెవరూ అది అనరు. నాకంతకంటె ఏం అక్కరలేదు. మనిషిన్నేను...' అనటం ఆమెలోని చైతన్యాన్ని సూచిస్తుంది. స్త్రీకి ఆర్థిక స్వేచ్ఛ ఉండాల్సిన అవసరాన్ని ఈ కథ వివరిస్తుంది. వర్జీనియా ఉల్ఫ్ కథ 'ఎ రూమ్ ఫర్ వన్స్ ఓన్'లో స్త్రీకి ఒక గది, కొంచెం ఆర్థిక స్వాతంత్ర్యం, కొంచెం ఆలోచన చాలని చెపుతారు. ఈ కథ స్ఫూర్తి రామలక్ష్మిగారి కథలోనూ ప్రతిఫలించటం చూడాలి.

ఇంద్రగంటి జానకీ బాల 'మూడోపేజీ'లో సమాజంలోని వివక్షను ప్రశ్నించారు. 'నీతిలో, నియమంలో, జీవిత నిర్వహణలో, స్వేచ్ఛగా ఉండటంలో, స్నేహాలు చేయటంలో వాళ్ళకొక రూలూనూ, తన కొక రూలూనా?' అన్న మాటలు సమాజంలోని ద్వంద్వ ప్రమాణాలని నిరూపిస్తున్నాయి. స్త్రీకి నరనరానా, తరతరాల్లో జీర్ణించుకొనిపోయిన పిరికితనం, అభద్రతా భావం ఎన్ని యుగాలు పోరాడితే తొలగించగలం? అని రచయిత్రి ప్రశ్నిస్తారు. కనీసం మూడో తరంలోనైనా స్త్రీ కోల్పోయిన విలువైన జీవితాన్ని తిరిగి అందుకోగలదన్న ఆశ ఇక్కడ వ్యక్తమయింది.

అవసరాల రామకృష్ణారావు కథ అరుదైన ఆత్మహత్య పురుషాధిక్యత ఎక్కువైతే వాడి వ్యక్తిత్వం వికృతమైపోయినట్టేనని నిరూపిస్తుంది. వెంకటేశ్వరరావుది స్త్రీల విషయంలో మరీ సనాతన భావాలు. ఆడదాని ఉద్యోగాన్ని అతను భరించలేడు. భార్యని ప్రతి విషయంలోనూ తక్కువ చేసి మాట్లాడేవాడు. చివరికోనాడు ఇంటికి వెళ్ళిన అతనికి భార్య రాసిన చీటీ ఆమె బదులుగా కనిపిస్తుంది. 'బొత్తిగా పలకరిస్తే కసిరికొట్టే మీ వ్యవహారం ఈ వారం రోజుల్నుంచి చూస్తుంటే నేనూ ఓ మనిషి ననిపించుకోవటం ఎలాగో ఇవాళకి తెలిసింది... మీరు మరో పెళ్ళి చేసుకోవచ్చు. ఇంట్లో కనిపెట్టుకుని ఉంటుంది గనక మోకాళ్ళ వరకు తెగిన వనితనెవరినైనా పెండ్లాడితే బాగుండునని నా సలహా' అని ఆమె రాసిన చీటీలో ఉంటుంది. ఈ కొసమెరుపు అతని ప్రవర్తనతో విసిగిపోయిన స్త్రీ చేసిన సాహసం.

అల్లం శేషగిరిరావు కథ 'వఱదు' జీవితారణ్యంలో ఒక వ్యక్తి తన స్వార్థం కోసం వేరొకరిని ఉపయోగించుకునే క్షుద్ర విధానాన్ని ఎండగడుతుంది. "వఱదు అనేది గొప్ప మాయదారిది. లుచ్ఛా జంతువమ్మా! చూశారా.... బాగా ముసలిదైపోవటంవల్ల, దానంతటది వేటాడి తినలేదు. అందుకే పులిని అంటిపెట్టుకుని ఎప్పుడూ తిరిగుతుంటుంది. పులి తిని విడిచిపెట్టేసిన మాంసం, దుమ్ములు తిని బ్రతుకుతుంది. పగలంతా ఇతర జంతువుల ఉనికిని కనిపెట్టి, రాత్రవగానే పులిని చాటుగా వాటి మీదకు తీసుకెళ్ళి చంపించేస్తుందిట".... అన్న మాటలు జీవితమనే అడవిలో దశరథ

రామయ్యలాంటి వఱదులు డిస్ట్రిక్టు ఇంజనీరు అనీ పులిని చిన్నయ్య అనే జంతువు మీదికి ఉసిగొల్పి, తన ఉద్యోగాన్ని పదిలపర్చుకుందామని చూసిన వైనాన్ని వివరిస్తున్నాయి. మనిషిలోని మృగ మనస్తత్వాన్ని రచయిత అద్భుతంగా విశ్లేషించారు. దశరథ రామయ్యలాంటి వాళ్ళు పొట్టకోసం ఎంతకైనా తెగిస్తారు. మిలిట్రీలో జీవితాంతం పనిచేసిన చిన్నయ్య, ముసలివాడైన దశరథరామయ్య మీదకు ఇంజనీరు ఫైలు విసిరేస్తే దశరథరామయ్యకు రక్షణగా ఉండి ఇంజనీరు వైపు విసురుగా వెళతాడు. కానీ దశరథ రామయ్య తన మనుగడకోసం స్వార్థంతో విజృంభిస్తాడు. దేనికీ భయపడని చిన్నయ్య అందుకే వఱదు అరుపుకి భయపడతాడు

భరాగో కథ 'వార్నింగ్' స్త్రీలు మరొకరెవరూ నేర్పించకపోయినా వాళ్ళు స్వయంగానే తమ జీవితశైలిని నిర్ణయించుకోగలరని, ఎటొచ్చీ ఆ సత్యం మగవాళ్ళకే యింకా స్పష్టంగా తెలిసినట్లు లేదని హెచ్చరించే కథ. 'సంసారం, కుటుంబ పద్ధతి మంచివి కావని నేనూ అనను. కానీ, ఒంటరిగా బతకటం ఆడదానిక్కూడా చేతనవుతుందని ఇరవై యేళ్ళ వయస్సొచ్చేసరికే నాకు తెలిసింది'.. అన్న మాటలు దాన్ని వెల్లడిస్తున్నాయి. స్త్రీజాతి ఈనాడు చైతన్యమైందని, మగవాడు – పెళ్లిచేసుకుంటే వచ్చే డెబిట్ క్రెడిట్‌ల గురించి ఆలోచిస్తుంటాడని తెలుసుకుందని, అంత తెలివితక్కువగా ఏమీ లేరని ప్రసన్నలక్ష్మిలాంటి వాళ్ళు ప్రవర్తించే విధానం తెలుపుతోంది. స్త్రీవాదాన్ని సమర్థిస్తూ వచ్చిన రచనల్లో ఇది ఒక మంచి కథ.

చాసోగా సుపరిచితులైన చాగంటి సోమయాజులు రచనలన్నింటిలోనూ పూర్తి తెలుగుదనం వెల్లివిరుస్తుంది. 'వాయులీనం'లాంటి మంచి కథలను చాసో ఉన్నత ప్రమాణాలతో రచించారు. మాండలిక రచన ఆఁవెత (విందు భోజనం) ధనప్రభావంతో కలుషితమైన జీవన విధానాన్ని, పతనం అంచుకు చేరిన మానవ జీవితాలని వర్ణించిన కథ. ఒక సాధారణ స్త్రీ, చాకలిది; తన పెళ్ళి కోసం తల్లిదండ్రులు అప్పుచేయగా, మొగుడు రంగూన్ పోగా, చాలాకాలం వేచి ఉండి చివరికి విధిలేక శాస్త్రి దగ్గరకు వెళ్లటానికి ఒప్పుకోవటం ఈ కథలోని ఇతివృత్తం. దాపరికం లేని వైఖరి, నిజాయితీ నిండుగా ఉండే గ్రామీణ స్త్రీల మానసిక చింతన దీనిలో వెల్లడైంది. "ఇంక ఊళ్లో గొడవ. ఎదవ గేమాల్లో రంకుతనం తప్పుకాదు. గర్లంట గడ్డికి పోతే ఇదే గోల. పొలాల్లో పనికిపోతే ఇదే సంత. పుట్ట సాటైతే సిక్కు. ఒంటరిగా ఆడదుంటే పెమాదం. ఆడకీ, మగకీ పొద్దత్తమానం రంకు గొడవే; పెద్దలకీ పిన్నలకీ ఇదే పోగాలం".... అన్న మాటలు గ్రామాల్లోని వాస్తవ పరిస్థితులని వివరిస్తున్నాయి. ఇక్కడ ఏ విధమైన అబద్ధాలకీ, హిపోక్రసీకి తావులేదు. చివర్లో భర్త తన దగ్గరకు రాగానే "నా దేముడు నా దగ్గర కొచ్చినాడు; జనమ కేటిగావాలి!" అని అనుకోవటం, 'శాత్తిరి ఇంకా తోటనో కొత్తాననుకుంటున్నాడు గావాల' అని అనటం అంతకుముందు శాస్త్రి వెంట వెళ్ళినందుకు దాలిగోడికి అపచారం చేసానని బాధపడటం ఈ కథలోని స్త్రీపాత్ర నిర్మలత్వాన్ని వెల్లడిస్తోంది. మానసిక వ్యభిచారం హేయమనీ స్త్రీకి తన శరీరం మీద, మనస్సు మీద స్వీయ నిర్ణయాధికారం ఉండాలని రచయిత భావిస్తున్నట్లుగా ఉంది.

కథావేదిక వ్యవస్థాపకులు వుప్పుల నరసింహం తెలుగు మాండలిక రచయితల్లో ప్రముఖులు.[4] తెలంగాణా మాండలికంలో నడిచే వీరి కథలు ఆ ప్రాంత ప్రజల జీవన వైఖరిని, విశ్వాసాన్ని వెల్లడిస్తాయి. ఎడ్డిపిల్ల లచ్చిమి - ఎర్ర రిబ్బను కథలో ప్రధాన పాత్ర మూగపిల్ల లచ్చిమి. కరువుదినాల్లో ఒక దినం జడకు రిబ్బను కట్టుకోవాలని ఆ పిల్లకు మనసు అయింది. తల్లిని ఎంత బతిమిలాడినా పైసలేదన్నది. ఫలం లేదన్నది. తండ్రిని అడిగింది. కోపంల కొట్టనీకి బోయిండు. నోటి కొచ్చినట్టు తిట్టిండు. మూగపిల్ల లచ్చిమి మనసు చిన్నబోయింది. తల్లి కోపంతో కొట్టగా ఆ పిల్ల ధరణిపై పడింది. అదే, ఊళ్ళో ఈశ్వరమ్మ అనే భారీ గుణం గల తల్లి బంగారుతల్లి ఉండేది. వెన్న తీరుగ ఆ అమ్మ మనసు. ఎవరికీ అపకారం తలవని పెద్దమనసు ఆ తల్లిది. ఆమె భర్త బాలమల్లయ్య అందరికీ "మీరు ఎట్టి జెయకుండ్రి, ఎత్క తినకుండ్రి. మీరు పటేళ్లకు, దొరలకు బుగులు పట్టకుండ్రి, భయం చెందకుండ్రి. మీ రెక్కల కష్టం మీరు అడుగుండ్రి, ఆళ్ళ ఎనక బలగమున్నదని, బందూకులున్నయని, ఎయ్యికాళ్ళ జెర్రులని మీరు భయం చెందకుండ్రి - బుగులు పట్టకుండ్రి - అని బోధ జేస్తున్నడు." భార్యాభర్తలు ఆదర్శదంపతులని దీన్నిబట్టి తెలుస్తోంది. రిబ్బను కావాలని అలిగిన లచ్చిమిని ఈశ్వరమ్మ నెత్తి నిమిరి, రిబ్బను కొనిచ్చింది. 'ఆ దినమునే ఈశ్వరమ్మ మొగుడు బాలమల్లయ్య ఇంటికి వచ్చి ఎడ్డిపిల్ల ఎర్రరిబ్బను జూసి ముసిముసిగా నవ్విండు! బాలమల్లయ్య బయట చెప్పేదాన్ని ఇంట్లో భార్య ఆచరిస్తోంది. చిన్నపిల్లల ఆనందంలో ఆనందం పొందే ఉత్తమ వ్యక్తుల పాత్ర చిత్రణ ఈ కథలో చాలా చక్కగా. జరిగింది.

సమాజంలో మూఢనమ్మకాల పిచ్చి ఎంత తీవ్రంగా ఉందో సొదుం జయరాం కథ 'తాకట్టు' వినరిస్తుంది. వాస్తుశాస్త్రం పై మన ప్రజలకు ఎనలేని నమ్మకం ఉండటం ప్రతిదానికి వాస్తుదోషమే కారణమని విశ్వసించటం చాలా అనర్థాలకు దారి తీస్తోంది. నీలకంఠంలాంటి వ్యక్తులు వారు పడుతున్న ప్రతి ఇబ్బందికి ఏదో వాస్తుదోషం కారణమని భావిస్తూ దానికోసం అనవసర వ్యయం చేస్తూ ఆర్థిక సమస్యలు తెచ్చుకుంటున్నారు. భార్య నగలు తాకట్టుపెట్టి మరీ వాస్తులోపాల్ని సరిచేయించుకుంటున్నారు. ఈ అవాస్తవ వాస్తు విశ్వాసాన్ని రచయిత చాలా నిర్దిష్టంగా వివరించారు. మనవాళ్ళకి ఎప్పుడు హేతుబద్ధ ఆలోచన పెరుగుతుందా అని కథ చదవగానే అనిపిస్తుంది.

యండమూరి వీరేంద్రనాథ్ ఈ కాలంలో చాలా ప్రాచుర్యం పొందిన రచయిత. విభిన్న అంశాల మీద ఆహ్లాదకరంగా రాసే నేర్పు, చదివించే కథాకథన విధానం, శైలివల్ల ఈ తరం పాఠకులకు సుపరిచితులయ్యారు. ఒక అంతస్తు నుంచి మరో అంతస్తుకి పెరిగే క్రమంలో ప్రతి వ్యక్తీ ఆత్మవంచనకి పాల్పడటం, తనకూ ఆ అంతస్తు కొత్త కాదని నిరూపించుకోవటం కోసం ప్రవర్తించటం సాధారణం. చూసేవాడికి, చూస్తున్న దృశ్యాలకు మధ్య ఏదో పొగమంచు కమ్ముకోవచ్చు. దాన్ని నిత్యసత్యమని భావించేవారు మూర్ఖులైతే, ఆ భ్రమను పటాపంచలు చేసుకొని నిజాన్ని చూడగలిగినవారే ఉత్తములు అని రచయిత భానుమూర్తి పాత్ర ద్వారా నిరూపించారు. మిస్ట్ కథలో పై అంతస్తులోని వాళ్ళు ఎంత ఇరుకైన గదుల్లో ఉంటారో రచయిత వాస్తవ దృష్టితో

వర్ణించారు. ఇంక్రిమెంట్ పెరిగి ఫస్ట్‌క్లాస్‌లో ప్రయాణించే అవకాశాన్ని భానుమూర్తి పొందాడు. కానీ కంపార్ట్‌మెంట్‌లో పై అంతస్తు వ్యక్తులతో సహజంగా ప్రవర్తించటానికి ఇబ్బందిపడతాడు. 'భానుమూర్తికి ఒక్కసారిగా భరించలేని నిస్సత్తువ ఆవరించింది. అయిదుగురు ఆఫీసర్ల మధ్యకు వెళ్ళి ఫైల్ అందించవల్సిన ఎల్డీసీ పరిస్థితిలా ఉంది'. వాళ్ళ ప్రవర్తన మాత్రం చాలా హీనంగానే ఉంటుంది. కాఫీ తాగి అర్థరూపాయి కోసం పిల్లాడిని ఏడ్పించటం వాళ్ళకే చెల్లింది. కాఫీలమ్మే పిల్లాడు తిడతాడు. అంతే గాజులాటి అరిస్టోక్రసీ పటాలున పగిలింది. భానుమూర్తి చువ్వలా లేచి తన దగ్గర ఉన్న చిల్లరను ప్లాట్‌ఫారం మీదకు విసిరేస్తాడు. ఆ తర్వాత చాలా మామూలుగా బ్యాగ్‌లోంచి పంచెతీసి కట్టుకొని బెర్త్ మీద పడుకుంటాడు. ఇలా భానుమూర్తి కళ్ళముందు కమ్ముకున్న పొరలు క్రమంగా విడిపోతాయి.

ఆధునిక పద్ధతిలో హాస్య విధానంలో సాగిన కథ 'లక్ష్మీ కటాక్షం'. ఈ కథలోని ప్రతి మాట నవ్వుల పువ్వులు విరజిమ్మింది. తోలేటి జగన్మోహనరావు షేర్‌మార్కెట్ మాయా ప్రపంచాన్ని అద్దంలో చూపించారు. "ప్రస్తుతం శవాసనం వేసింది సెన్సెక్స్. శవాసనం తర్వాత కొంచెం తలెత్తి భుజంగాసనం వేస్తుంది. ఆ తర్వాత లేచి కూర్చుని వజ్రాసనం వేస్తుంది. అప్పుడు మనం (షేర్లు) అమ్మటం మొదలెట్టాలి. అది చేతులెత్తి తాళాసనం వేసేలోగా మనం అమ్మెయ్యాలి. లేకపోతే అది మళ్ళీ శీర్షాసనం వేస్తే ప్రమాదం" అన్న వాక్యాలు రచయిత చమత్కార రచనా నైపుణ్యాన్ని నిరూపిస్తున్నాయి. రాత్రికి రాత్రే ధనవంతులై పోవాలనే ఆలోచనలతో జనాలు, షేర్ల మార్కెట్‌లో ఎండమావులు చూస్తూ 'స్టాక్ మార్కెట్లో స్మార్ట్‌గా ఉండాలి' అనుకుంటూ ఆశావాద ధోరణితో చూస్తుంటారు. బంగార్రాజు షేర్ మార్కెట్ పరిస్థితుల గురించి ఏవేవో చెపుతుంటాడు. ఇవేవీ అంతగా తెలీకపోయినా బంగార్రాజు స్టాకోపదేశంతో నరసింహం షేర్లు కొంటాడు. మొత్తానికి ఆ షేరు ధరలు పెరుగుతాయి. నరసింహం ఏనుగు కుంభస్థలం కొడితే బంగార్రాజు ఆ ఏనుగు కాళ్ళ కింద పచ్చడైపోయానని చెపుతాడు. బుట్టాగారి తల ఈ షేర్ల దెబ్బకి ఎగిరిపోతుంది. ఈ కథలో షేర్‌మార్కెట్ ఇంద్రజాలాన్ని రచయిత వివరించిన ధోరణి బాగుంది.

యర్రంశెట్టి శాయి తెలుగులో నవ్వులు పండించిన చక్కని రచయిత. వీరి హ్యూమరాలజీ చాలా పేరు పొందింది. సర్కస్ అన్న కథలో మంచి సామాజిక స్పృహ ఉంది. ఆ ఊరికి సర్కస్ వస్తుంది. కాలనీలోని పిల్లలందరూ సరదాపడతారు. తల్లిదండ్రులు వెంటనే ఫ్రీపాసుల కోసం వేట ప్రారంభిస్తారు. చివరికి పాసులు సంపాదించి సర్కస్‌కి వెళతారు. మృగాలన్నీ బక్క చిక్కినట్టు కనిపించి అందరూ ఆశ్చర్యపోతారు. కారణమేమిటా అని విచారిస్తే "ఎంతమంది టికెట్లు కొంటున్నారు? పోలీసోళ్ళకి ఫ్రీ. రెవిన్యూ డిపార్ట్‌మెంట్ వాళ్ళంతా పాస్‌ల మీదే వస్తారు. రైల్వే వాళ్ళందరికీ ఫ్రీ పాసులే. మునిసిపల్ కార్పోరేషన్ వాళ్ళకూ పాస్‌లే. ఫైర్ డిపార్ట్‌మెంట్ వాళ్ళకూ, రాజకీయనాయకులకూ, గూండాలకు, వీళ్ళందరి బంధువులకు - ఇంక టికెట్లు కొనేదెవరు సార్? వాళ్లందరికీ తప్పకుండా మూగజీవాల ఉసురు తగుల్తుంది సార్" అని ఒకరి సమాధానం. ఈ ప్రశ్నలు నిజానికి మనకి సంధించినవి. కథలో

మాటలకు మరుగులేదు, దాపరికం లేదు. నవ్వుల్ని మర్చిపోయి ఉరుకులు పరుగులు మధ్య గడిపే వారి జీవితాల్ని గురించి కవి వ్యాఖ్యానించిన తీరు చాలా వాస్తవంగా ఉంది. నగరమైనా, పల్లెటూరైనా ఎవరూ ప్రత్యేకించి ఏం బావుకునేది లేదని చివర్లో అనటం ఈ కవితకు ఆదనపు ఆకర్షణని కల్పించింది.

ఆఫ్రికాలోని నమీబియా ప్రజలు సమిష్టిగా పోరాడి స్వాతంత్ర్యాన్ని పొందారు. దక్షిణాఫ్రికా శ్వేతజాతి పాలకుల గుండెల్లో గగ్గోలు పుట్టించి జాతీయ పోరాటాన్ని చేసిన నమీబియా ప్రజలు ఇతర ప్రాంతాల్లోని వారందరికీ ఆదర్శం. విముక్తి పోరాటాలలో నమీబియా పోరాటం అగ్రశ్రేణికి చెందిందని, సాయుధ సమరాలతో స్వేచ్ఛ సాధించుకుందని కవి చెపుతారు. 'రెడ్ సాల్యూట్ నమీబియా' అనే ఈ కవితలో కవి ఎస్వీ 'నీ సంకెళ్ళు తెగుతున్న చప్పుడు నేడు ప్రపంచం వింటున్నది' అంటారు.

*కూలిపోతున్న కోటగోడలకు*
*రాలిపోతున్న డేగ రెక్కలకు*
*విరిగిపోతున్న సిరిహపు కోరలకు*
*రెక్కలు విప్పుతున్న చైతన్యానికి*
*ప్రతీకగా నిలిచిన నమీబియా! లాంగ్ లివ్*

డేగ, సింహం మొదలైనవి నియంతృత్వ పాలకులని, (అమెరికా, బ్రిటన్‌ల చిహ్నాలు) కోటగోడలు భూస్వామ్య సంస్కృతిని సూచిస్తున్నాయి. దశాబ్దాలపాటు ఈ దేశస్థుల అవిశ్రాంతంగా పోరాటాలు చేసి తమ స్వతంత్ర జెండాని అజేయంగా ఎగరవేసుకున్నారు.

బాలకార్మికుని జీవితాన్ని చూసి మనసు కరిగి ఒక కవి కవితరాస్తే, మరోకవి పెళ్ళి చేసుకొని పుట్టినింటినుంచి ఊరునుంచి వెళుతూ వీడ్కోలు చెప్పలేక కన్నీటిపర్యంతమైన పెళ్ళికూతురి గురించి చెప్పాడు. శివారెడ్డి ఒక కవితలో "ఒక సంక్షుభిత పగటి తర్వాత ఒక వ్యాకుల కీలత శిధిల పగటి తర్వాత" విశ్రమిస్తున్న గృహిణి శ్రమ విలువగురించి వివరించాడు.

మృత్యుభీతి కూడా అనేకమంది కవుల రచనల్లో ఉంది. 'ఉండుండి గుండెల్లో విధి, అడుగుల సవ్వడి దగ్గరౌతున్న భీతి' ప్రవేశిస్తుంది అని కొందరు కవులు చెప్పారు. అస్తిత్వ వేదనతో వాడ్రేవు చినవీరభద్రుడులాంటి కవులు కవితలు చెప్పారు.[5]

నూరుమందికి పైగా కవులు తమ గళాలు విప్పి అభిప్రాయాల్ని వ్యక్తీకరించిన వేదిక ఈ కవితా సంకలనం. తెలుగు కవిత్వం వ్యక్తీకరిస్తున్న అనేక భావాలు, ధోరణులు దీనిలో కనిపిస్తున్నాయి. జీవితాన్ని వేర్వేరు దృష్టిపథాలనుంచి విశ్లేషించిన ఈ కవితలు ఒక ఉత్తమ స్థాయి ఆలోచనలను కలిగిస్తాయి. మంచితనాన్నే ఈ కవులందరూ వారి అంతిమ లక్ష్యంగా ఏర్పరచుకొని రాసారు కాబట్టి ఇవి విలువల సమాహారం అవుతాయి.

వివరణలు:

1. విస్తృతమైన అధ్యయనం, భాషాబలం ఉంటే ఆ కవి ఇంకా శక్తివంతుడవుతాడనేది నిర్వివాదాంశం. తాను చెప్పదల్చుకున్న భావం, అభిప్రాయం తనకే స్పష్టంగా తెలీనప్పుడే కవి ఆ లోపాన్ని అధిగమించటానికి దాన్ని 'భాష అసమర్థత' క్రిందకి తోసివేయటం జరుగుతోంది.

2. మార్క్సిస్టు తాత్విక చింతన ప్రకారం పెట్టుబడిదారీ నాగరికత కళలను బతకనివ్వదు. కళలు, కవిత్వం, తత్వం మొదలైనవన్నీ శ్రామికులకే అంకితమవ్వాలని వారి ఆశయసిద్ధికే ఉపయోగపడాలని మార్క్సిస్టులు భావిస్తారు. బూర్జువా సమాజానికి ధనమే సుందరాతి సుందరమైన వస్తువని క్రిస్టోఫర్ కాడ్వెల్ అనే మార్క్సిస్టు భాష్యకారుడు అంటాడు.

3. ఫెమినిజాన్ని "సమాజంలోనూ, కుటుంబంలోనూ, పనిలోనూ స్త్రీలు గురవుతున్న అణచివేత, దోపిడీకి సంబంధించిన అవగాహన కలిగి ఉండి, ఈ పరిస్థితి మార్చటానికి స్త్రీలు పురుషులు కలిసికట్టుగా చేసే చైతన్యవంతమైన కార్యక్రమం" అని సౌత్ ఏషియన్ వర్క్ షాప్‌లో పాల్గొన్న వివిధ దేశాల ప్రతినిధులు నిర్వచించారు.

4. "ఆత్మగౌరవానికి అక్షరరూపమే దళితసాహిత్యం" అని ప్రసిద్ధ దళిత సాహితీవేత్త అర్జున్ డాంగ్లే చెప్పారు.

5. మనిషి అస్తిత్వం వాస్తవమే. అస్విత్వ వేదనా వాస్తవమే. కానీ, వేదన వేదనా ప్రేమకి దారితీయటం జీవన నౌక నిరాశాంతరంగాల్లో మునిగిపోవటం అసహజం. జననమరణాల మధ్య ఏదో ఉంది. దాన్ని సాధించటానికే మనిషి పుట్టాడు.... అని ఈ సంకలన సంపాదకులు పాపినేని, పెనుగొండలు వివరించారు.

# 30. కథాసాగర్ - తెలుగు కథల్లోని సాహితీ వాతావరణం

ఆదికవి నన్నయే తెలుగులో మొదటి కథకుడు. మహాభారతంతోనే కథాప్రక్రియ మొదలైంది. అయితే అది ఒక మహాకావ్యంలో అంతర్లీనంగా ఉండిపోయింది తప్ప దానికదే విలక్షణమైన విధానంతో లేదు. ఆధునిక కాలంలోని కథ అంటే గురజాడవారి 'దిద్దుబాటు'గానే ఎక్కువ మంది తెలిసినవాళ్ళు నమ్ముతున్నారు.[1] ఆనాటి నుంచీ ఎందరో రచయితలు తెలుగు కథతో ప్రయోగాలు చేస్తున్నారు. తెలుగు పాఠకులు కూడా కథాప్రక్రియకే ఎక్కువ ఆదరణ చూపించటం పరిశీలించాలి. 1991, 93, 95, 96 సంవత్సరాలలో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డులు తెలుగు సాహిత్యంలో కథారచనలకే రావటం గమనార్హం. ఈ విధంగా తెలుగులో కథారచనకు ఉన్న విశిష్టత తెలుస్తోంది. తెలుగు జీవితాన్ని అద్దం పట్టి చూపించే ప్రక్రియగా కథ పేరు పొందింది. ఆధునిక సాహిత్యంలో వస్తువు, శైలి, భాష, రచనా విధానం మొదలైన అన్ని సాధనాలవల్ల కూడా తెలుగు కథ ఇంతగా ప్రాచుర్యం పొందటానికి కారణం.

అనేకమంది సృజనాత్మక రచయితలు "కథ కళలకు కేంద్రబిందువు" అని అభిప్రాయపడుతున్నారు. ప్రతివ్యక్తి మానసిక పరివర్తన పొందటానికి, సంస్కారాన్ని అలవరచుకోవటానికి, మంచీ చెడుల తారతమ్యాన్ని గ్రహించటానికి, ఆలోచనాశక్తిని రేకెత్తించటానికి కథలు నిజంగానే ఉపయోగపడతాయి. ఎంతో చక్కని కథ రాయాలంటే జీవితంపై గంభీరమైన దృష్టి, సమగ్రమైన అవగాహనలు ఉండాలి. తెలుగు కథలపై ఎన్నో ఉద్యమాల ప్రభావం పడింది. పునరుద్ధరణ వాదం, సంస్కరణ వాదం, విప్లవ వాదం తెలుగు కథల్లో కనిపిస్తుంటాయి.[2] తెలుగు కథ నిరంతర ప్రవాహమైన తెలుగుభాషలోని వివిధ మార్పులకి ఆలంబనం అయింది. ఉత్తమ సమాజ నిర్మాణానికి కథారచయిత తన బాధ్యతని గ్రహించాడు. మన తెలుగు కథా రచయితలందరూ ఉత్తమ సమాజ నిర్మాణానికి కథ ఉపయుక్తమవుతుందని ప్రగాఢంగా విశ్వసించారు. నిజానికి ఆదర్శ రచయితలు స్వీయ జీవితానుభవాలనుంచి, చూసిన దాని నుంచి, విన్నదాని నుంచి, చదివిన దాని నుంచి ఇతివృత్తం స్వీకరిస్తారు. విస్తృత పఠనం, జీవిత పరిశీలన ఈ రెంటినీ విశ్లేషించి అనుసంధానించటం ద్వారా చక్కని రచనలు చేయటం వీలవుతుంది. ఈ విధంగా వెలువడిన మంచి తెలుగుకథలు ఎన్నో భారతీయ భాషలలోకి, విదేశీ భాషలలోకి అనువదించబడ్డాయి. ఇతర భాషల్లోని ఉత్తమ కథలు కూడా తెలుగులోకి అనువదించబడ్డాయి. ఈ ఇచ్చిపుచ్చుకునే ధోరణివల్ల తెలుగు సాహిత్యం చాలా ప్రభావితమైంది. మాండలికాల్లో కథారచన చేయటం కూడా పలువురిని ఆకర్షిస్తోంది.

కళాసాగర్ సంస్థ 1972లో ఊపిరిపోసుకున్నప్పటినించీ సాహితీ, సేవా కార్యక్రమాలలో నిమగ్నమై పనిచేస్తోంది. వారే స్వయంగా చెప్పినట్లు ఇరవై అయిదేళ్ళ క్రిందట చిన్న చలిచెలమగా ప్రభవించి, తటాకమై, ప్రవాహమై చివరకు తన పేరుకు అనుగుణంగా కళాసాగరమై, తెలుగు సంస్కృతీ వికాసానికి చేతనైనంతలో దోహదక్రియలు సమకూర్చటమే ఏకైక లక్ష్యంగా నిలిచింది. సంస్థ ఆవిర్భవించి పాతికేళ్ళు నిండిన సందర్భంగా ఎం. ఎ. సుభాన్ సంపాదకత్వంలో తెలుగులో కొన్ని విలక్షణమైన కథలను ఏరి 'కథాసాగర్'గా ప్రచురించారు. నిజంగానే ఈ కథాసాగర్ తెలుగు కథల సాగరంగా ఉంది. 1910లో ఆధునిక తెలుగు కథ పుట్టింది అనుకుంటే 1997 నాటికి కళాసాగర్ ఆవిర్భవించి 87 సంవత్సరాలు పూర్తి అవుతోంది కాబట్టి 87 కథలను ఈ సంకలనంలో చేర్చారు. ఇందులోని కథలన్నీ విశాల ప్రాతిపదికన ఏరి కూర్చినవే. ఎన్నో పరిమితులు ఉండటం వల్ల కొన్ని ఉత్తమ కథలు ఈ సంకలనంలో లేవు. నామిని సుబ్రమణ్యంనాయుడు, గోపీచంద్ లాంటి ప్రఖ్యాత, రచయితల కథలు కూడా దీనిలో లేవు. కొందరు ప్రఖ్యాత రచయితల విషయంలో మరీ అంత పేరుపొందని కథలను దీనిలో చేర్చారు. ఏది ఏమైనా మొదటితరం నుంచి ఈనాటి తరం వరకు ఉన్న కథలను వస్తుపరంగా, ప్రక్రియాపరంగా విభిన్నమైన కథలను చేర్చిన ఈ సంకలనం చదువరులకు విందుభోజనంగా ఉంటుంది.

అబ్బూరి ఛాయదేవి రాసిన 'తనమార్గం' కథ స్త్రీవాద ధోరణిలో సాగుతుంది.[3] వర్ధనమ్మ భర్తపోయిన స్త్రీ ఎంతగా ఒంటరితనం అనుభవించిందో ఈ కథ వివరిస్తుంది. "పదహారో ఏట కాపురానికి వచ్చినప్పటినుంచి అదే వరస. పొద్దు పొడవకముందే లేచి పెరట్లో పాచిపనులు చేయడంతో మొదలుపెట్టి రాత్రి పొద్దుపోయాక పాలు తోడుపెట్టి వంటింటి తలుపు మూసివేసే వరకూ ఇంటి పనులూ, అవికాక పతిసేవ, లేకపోతే పిల్లల సేవ, లేకపోతే రోగిష్టివాళ్ళయిన అత్తమామల సేవ, ఆ తరువాత మనుమలకు సేవ - ఈ వరసన సాగింది సంసార జీవితం ఇంతదాకా"... అన్నమాటలు చాకిరీతో నిత్యం సతమతమయ్యే స్త్రీల పరిస్థితులని వివరిస్తున్నాయి. పెళ్ళి చేసి తల్లిదండ్రులు ఈ మార్గాన వెళ్ళు అని అప్పగింతలు పెడతారు. భర్త ఆ దారిన నడిపిస్తే తలొంచుకుని నడవటం తప్ప ఆమెకు మరో తలపురాలేదు. సమాజం ఆ విధంగా స్త్రీకి శిక్షణనిచ్చింది. పెళ్ళితంతులో చిటికెన వేలు పట్టుకోవటం తరువాత వైవాహిక జీవితంలో పక్కపక్కన నడిచిన గుర్తు ఆమెకి లేదు. ఎప్పుడూ వెనకాలే - నీడలా నడవటం తప్ప స్త్రీకి మరేమీ లేదని సంప్రదాయం నిర్దేశిస్తూ వచ్చింది. కథలో చెప్పినట్లు 'రావిచెట్టులాంటి వాడికిచ్చి పెళ్ళి చేసారు'. ఆ నీడన బతకమని చెపుతారు. భర్త అనే చెట్టుపోయాక దాని తాలూకా మొక్కలు అక్కడా ఇక్కడా పెద్దవికాగానే మళ్ళీ ఇంటి నీడన బతకాలి.

అంటే సమాజంలో స్త్రీకి ఉన్న స్థానం తెలుస్తోంది. ఆమెకంటూ వ్యక్తిత్వం ఉందనే విషయాన్నే అందరూ విస్మరిస్తున్నారు. వర్ధనమ్మని అత్తగార్ని విమర్శించిందని చెంప ఛెళ్ళుమనిపిస్తాడు భర్త. ఒక సినిమాలో నాయిక సంప్రదాయ విరుద్ధంగా ప్రవర్తించినా వర్ధనమ్మ నిరసనగా ఆలోచించలేకపోతుంది. ఆ సినిమాలోని నాయికతో తనను తాను పోల్చుకుంటుంది. స్త్రీ లోకంలో వస్తున్న ఆలోచనా మార్పులని ఈ కథ

# నండూరి రామమోహనరావు

నండూరి రామమోహనరావుగారు తెలుగు సీనియర్ జర్నలిస్టులలో చాలా పేరు పొందిన రచయిత. నిరంతర పఠనం, రచనా వ్యాసంగంతో వీరి ఆలోచనలు పరిపూర్ణ మైనవిగా అయ్యాయి. వైజ్ఞానిక విషయాలు, తాత్విక అంశాలు, కవితలు, అనువాద రచనలు, బాలసాహిత్య అంశాలు, సంపాదకీయాలు, ఆర్థిక విషయాలపై వ్యాసాలు, పుస్తక సమీక్షలు, సినిమా సమీక్షలు, సాహిత్య అంశాలు, పీఠికావ్యాసాలు, అనువాద కథలు ఇలా ఒకటేమిటి సమస్త విషయాలపై వారు తమ అభిప్రాయాలను వెలువరించారు.

జీవితం అంటే అక్షరయాత్ర అనీ, సాహిత్య వ్యాసంగమే జీవితయాత్ర అని భావించే నండూరి వృత్తిధర్మంగానే ఇన్ని కాల్పనికేతర రచనలు చేయవలసివచ్చిందని స్వయంగా చెప్పుకున్నారు. ఇన్ని విషయాలపై అనురాగంతో, అధికారంతో రచనలు చేసిన ఈ రాతగాడికి తలరాతకన్నా 'రాత' మీదే గురి. రాశి ఫలితాలకన్నా రాసి ఆ తర్వాత ఫలితాలు చూసుకోవటమే వీరి అలవాటు. సైన్సు విషయాలపై వారు రాసిన రచనలు నిజంగానే విజ్ఞానకోశంకన్నా అధికంగా ఉపయుక్తమైనవి.

నండూరి ఆంధ్రజ్యోతిని దేదీప్యమానంగా వెలిగించిన రచయిత. సుమారుగా అయిదు దశాబ్దాల కాలం వీరి కలం తెలుగు పాఠకులని ఉర్రూతలూగించింది. యాభయ్యేవడిలో పడ్డ నండూరి జర్నలిజం ప్రస్తావించని అంశం అంటూ లేదు. ప్రసిద్ధ వ్యక్తులు, సాహితీ వేత్తలు, చిత్రకారులు, నటులు, ఇతర రంగాలకు సంబంధించిన ప్రముఖులు ఇలా ఎందరో మహానుభావులకి ఈ విధంగా వివిధ సందర్భాల్లో వారు రాసిన వ్యాసాలు 'అక్షరయాత్ర' పేరుతో వెలువడ్డాయి. సంకలనంలో వీరి వ్యాసరచనా విధానం శిఖరాగ్రానికి చేరింది. నండూరిని "తెలుగు గార్డినర్" అనటం సబబుగా ఉంటుందని కొందరి అభిప్రాయం.

రామమోహన్‌రావుగారు అనేక మారుపేర్లతో రచనలు చేసారు. ఎన్., ఆర్., ఎన్నార్, సవ్యసాచి, మధుశ్రీ, ప్రద్యుమ్న, సామగానం, సరస్వతీదేవి, శేఖర్, కె.వి. రామచంద్రమూర్తి లాంటి ఎన్ని పేర్లతో రాసినా వారి "ముద్ర" మాత్రం ప్రతి రచనలోనూ కనిపిస్తుంది. అక్షరయాత్రను తన హితుడు, శ్రేయోభిలాషి శ్రీ పొనుగోటి కృష్ణారెడ్డికి అంకితమిచ్చిన నండూరి స్నేహానికి ప్రాణం పెడతారన్న విషయం వేరుగా ప్రస్తావించనవసరం లేదు. వీరి అనువాద రచనలు తెలుగు పాఠకులని విశేషంగా ఆకర్షించాయి. మార్క్‌ట్వైన్ రచనలు అనేకం వారు అనువదించారు. విశ్వదర్శనం, విశ్వరూపం, నరావతారం, వ్యాఖ్యావళి వీరి ఇతర రచనలు.

తెలుగు జర్నలిజానికి నండూరి చేసిన సేవలు అపురూపం. వీరి రచనలు అనుభవాల స్మృతులకు నిలువుటద్దంవంటివి. ఒక జర్నలిస్ట్‌గా వీరు జీవితంలో ఎంతో సాధించారు.

# 31. అక్షరయాత్ర - వ్యాసప్రక్రియ విశిష్టతలు

మన సాహిత్యంలో వ్యాసప్రక్రియకు చాలా ప్రాముఖ్యత ఉంది. సంస్కృత సాహిత్యకారుల్ని అనుసరించి గద్యం రాయలేనివాడు కవి కాడు. ఆంగ్ల సాహిత్యంలో కూడా మొదట్నుంచి వ్యాసరచన ఒక విశిష్ట ప్రక్రియగా పలువురిని ఆకర్షిస్తూ వచ్చింది. బేకన్, ఎడిసన్, స్టీల్, గార్డినర్, రాబర్ట్ లిండ్, మాథ్యూ ఆర్నాల్డ్, పెరల్ ఎస్. బక్, జార్జ్ ఆర్వెల్, రస్సెల్‌లాంటి హేమాహేమీలందరూ వచనరచన ద్వారానే సాహిత్యంలో వారి స్థానాన్ని నిలబెట్టుకోగలిగారు. తెలుగు సాహిత్యకారులు వచనాన్ని, పద్యాన్ని వేర్వేరుగా చూడకుండా ఈ రెంటినీ కలిపే 'చంపూకావ్యాలు' రాయటం చేసారు. నన్నయభట్టు తన మహాభారతంలో మంగళ శ్లోకం తర్వాత వెన్వెంటనే వచనాన్ని ఉపయోగించారు. ఆంగ్ల సాహిత్యంలో మహాకవి మిల్టన్ కూడా వచనంలోనూ, పద్యంలోనూ ఈనాటికీ ఎవరూ ప్రయత్నించని విషయాల గురించి రాయటం తన లక్ష్యంగా పేర్కొన్నాడు.[1] అంటే రచయితలందరూ వ్యాసరచన ప్రాధాన్యతను, ప్రాశస్త్యాన్ని తెలుసుకున్నవారే అని గ్రహించవచ్చు.

కొందరు భావించినట్లు వ్యాసప్రక్రియ ఆంగ్ల సాహిత్య ప్రభావంవల్లనే ఆధునికాంధ్ర సాహిత్యంలో ఒక నూతన ప్రక్రియగా ఆవిర్భవించింది అనుకోలేము. మొదట్నుంచీ తెలుగులో వ్యాసప్రక్రియ ఉంది. అయితే అది దానికదే ప్రత్యేకమైనదిగా లేక ఇతర ప్రక్రియల్లో అంతర్లీనంగా ఉంది. ఆంగ్లంలో ఎస్సె (Essay) అని పిలిచే పదం నిజానికి యాస్సే (Assay). దీనికి ప్రయత్నం అని అర్థం. తెలుగు వ్యాసానికి మొదట్లో 'వ్యాసం' అన్న పేరు లేదు. సామినేని ముద్దు నరసింహనాయుడు తన గ్రంథంలో ఎస్సేకి పర్యాయపదంగా ప్రమేయం అని ప్రయోగించారు. పరవస్తు వేంకట రంగాచార్యులు కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు. ప్రమేయం, సంగ్రహం, ఉపన్యాసం, వ్యాసంలాంటి అనేక పేర్లు ఉన్నప్పటికీ నేడు అందరం 'వ్యాసం' అనే అంటున్నాము.

వెబ్‌స్టర్స్ డిక్షనరీలో ఎస్సేని "ఒక చిన్న సాహిత్య సంగ్రహం ఏదైనా ఒక విషయాన్ని రుజువు చేయటానికిగాని లేదా ఒక నిర్దిష్ట విషయాన్ని వ్యాఖ్యానించటానికిగాని ఉద్దేశించింది" అని నిర్వచించారు.

వ్యాసం అంటే విభాగం అనే అర్థం ఉందని చెపుతారు. అంటే ఒక నిర్దిష్ట విషయాన్ని కొన్ని అంశాలుగా విభజించి, వివరించి చెప్పటాన్ని వ్యాసంగా పేర్కొనవచ్చు. వ్యాసంలో వచనత్వం, సంక్షిప్తత, సృజనాత్మకత, వాస్తవికత ముఖ్య లక్షణాలు.

తెలుగులో వ్యాసాన్ని ఒక సారస్వత ప్రక్రియగా తీర్చిదిద్దిన గౌరవం కందుకూరి వీరేశలింగంగారికి దక్కుతుంది.[2] కందుకూరి గిడుగులు వారి ఉద్యమాల కోసం వ్యాసాన్ని ఒక సాధనంగా ఉపయోగించుకున్నారని కొందరు చెపుతారు.

తెలుగు వ్యాసకర్తలలో పానుగంటి లక్ష్మీనరసింహంగారి గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాల్సి ఉంది. ఎడిసన్, స్టీల్‌లు ఆంగ్ల సాహిత్యంలో వ్యాసాన్ని ఎంత చక్కగా తీర్చిదిద్దారో, అలాగే పానుగంటి తన సాక్షి వ్యాసాల ద్వారా తెలుగులో వ్యాసప్రక్రియకు విశేష ప్రజాదరణను, ప్రాచుర్యాన్ని కల్పించారు.[3]

నందూరి రామమోహన్‌రావుగారు ప్రతిభావ్యుత్పత్తులను రెండింటిని సమంగా పెంచి పోషిస్తూ వచ్చినవారు. వృత్తి పట్ల అంకిత భావం ఉన్న రచయిత కాబట్టి అసంఖ్యాక రచనలను మంచినీళ్ళు త్రాగినంత సులభంగా, ఆహ్లాదకరమైన శైలితో రచించారు. వీరి రచనలన్నింటిలోనూ నిశిత పరిశీలన, అద్భుతమైన విషయ పరిజ్ఞానం, సునిశిత హాస్యం తొంగి చూస్తుంటాయి. ఈ వ్యాస సంకలనం వీరి అర్థశతాబ్దికి పైబడిన యాత్రగా కూడా పాఠకులకి అనిపిస్తుంది.

స్వతంత్ర భారతావని స్వర్ణోత్సవాల సమయమే నందూరివారి అక్షరయాత్రోత్సవంలో యాభయ్యో మైలురాయి. నిరంతరం చక్కని పుస్తకాల అధ్యయనంలో గడిపే ఈ అక్షరోపాసకుడు తన వృత్తిలో భాగంగా ఎందరో ప్రముఖులతో తాదాత్మ్యం అనుభవించాడు. ఈ అనుభవాలన్నింటినీ వ్యాసాల రూపంలో పాఠకులకు అందించాడు. తన పేరు ఉపయోగించకుండా మారుపేర్లతో రచనలు చేయటం వీరి విధానం. తను పేరు కోసం చూసుకోకుండా రచన బాగుండటమే ఆశయంగా రాయటం ఒక మంచి విషయం.

సాహిత్య, సాహిత్యేతర వ్యాసాల పూలమాల అక్షరయాత్ర. నందూరి దీన్ని 'కలగూరగంప'గా చమత్కరించినా ఈ వ్యాసాలను చదివిన పాఠకులు ఇది ఎంతో శ్రద్ధగా, జాగ్రత్తగా ఎవరో చేయి తిరిగిన మాలకారుడు కూర్చిన పూలమాల అనే నిర్ధారిస్తాడు. ఈ సంకలనం 70 వ్యాసాలలోని గుండెని హత్తుకొనిపోయి తీపిగుర్తుల్లా ఎప్పటికీ నిలిచే ఉంటాయి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి జ్ఞాపకాల జాడలతో మొదలయ్యి వారి స్మృతితోనే ముగిసే ఈ సంకలనం నందూరివారికి జీవితంపై ఉన్న సమగ్ర, దృక్పథాన్ని వివరిస్తాయి. వ్యాసాలు చదవటం ముగిసినా "గొంతు మూగబోయినా గుండె పాడుతుంది" అన్న దేవులపల్లి వారి కవితలా ఒక నిర్మల నీరవ సౌందర్యం మనల్ని ఆవరిస్తుంది.

వస్తు వైవిధ్యానికి చక్కని ఉదాహరణగా పేర్కొనదగ్గ 'అక్షరయాత్ర'లో మొత్తం ఎనిమిది విభాగాలు ఉన్నాయి. స్మృతిపథం, ప్రతిభా పరిమళాలు, మందార మకరందాలు, సమీక్షా సౌరభాలు, చిత్రశాల, దూరతీరాలు, వ్యాసవిన్యాసం, జ్ఞాపకాల జాడలు అనే ఈ వివిధ విభాగాల్లోని నందూరివారి వ్యాసవిన్యాసాలు మనల్ని ఏ దూరతీరాలకో తీసుకొనివెళతాయి. చెప్పాలంటే అన్ని వ్యాసాల్లోని మందార మకరందాలు పాఠక మధుపాలని ఆకర్షించి ఆనందింపచేస్తాయి. ఎంత నిక్కచ్చి విమర్శకుడైనా ఈ రచయిత ప్రతిభా పరిమళాలు ఆస్వాదించాక మరి మాట్లాడలేడు. వ్యాసాలు చదవటం భౌతికంగా పూర్తి అయినా సమీక్షకులకు వాటి సౌరభాలు ఆహ్లాదాన్ని కలిగిస్తూనే ఉంటాయి. చిత్రశాలలో దృశ్యాల్ని చూస్తున్న అనుభూతిని పొందిన పాఠకులు వీటి జ్ఞాపకాల జాడలలో ఉండిపోతారు. దటీజ్ నందూరి!

స్మృతిపథం అనే విభాగంలో మొదటి రెండు వ్యాసాలలో కృష్ణశాస్త్రి కవిత్వం గురించి వివరించారు. కృష్ణశాస్త్రిగారి 'కృష్ణపక్షం' సాహిత్య లోకంలో పెద్ద సంచలనం. 'దేవులపల్లి వంశమున దేవులు పుట్టిరినేడు' అని చెళ్ళ పిళ్ళవారు ప్రస్తుతించిన కవిపండితుల వంశంలో జన్మించిన శాస్త్రి సుకుమారమైన పదజాలంతో, అంతకంటే

సుకుమారంగా ఊహించిన భావజాలంతో ఇంద్రజాలం చేసారు. మాటమాటనీ సానబెట్టి, మెరుగుపెట్టి మరీ వాడారు. ఆ రోజుల్లో అందరూ వారి వేషభాషలనీ, కవిత్వాన్ని అనుకరించాలని ప్రయత్నించినవారే. భావకవిత్వం మీద వచ్చిన విమర్శలకు సమాధానమిస్తూ నండూరి కృష్ణశాస్త్రి కవిత్వాన్ని అందమైన పూలహారంగా పోల్చారు. అందమైన పువ్వుని రేకురేకునా తుంచి వేస్తే ఏమీ మిగలనట్లు శాస్త్రిగారి కవిత్వాన్ని పదాలవారిగా విడదీస్తే ఏమీ కనిపించదని నండూరి చెపుతారు. కవిత్వం అనుభవించి ఆనందించటానికిగానీ ఏ ముక్కకి ఆ ముక్కగా కోసి చూడటానికికాదు.

కృష్ణశాస్త్రి మహతి అపురూప గంధర్వగానాలకు ఆలవాలమైంది. ఆయన ఒక్కరే సాహిత్య, సంగీతాల రహస్యం తెలిసి పాటలు రాశారనిపిస్తుందని నండూరి మాట. పాటలో మాటమాటని చిత్రికపట్టి, నగిషీపెట్టిగాని రాసేవారు కాదట. వారి మాటలు అప్రయత్నంగా వాటంతటవే దొర్లి వచ్చినంత సహజ సుందరంగా, ఆయన భావావేశానికి సరైన వాహికలుగా అమరేవి. ఒక్క వ్యర్థపదం లేకుండా రాయటం, క్లుప్తంగా చెప్పటంవల్ల భావం మరింత పదునెక్కుతుంది. ఆయన మాటల్లో అమృత సమానమైన భావం వెల్లివిరియటం వల్ల వినేవారు తన్మయత్వంతో నిండిపోతారు. నండూరి సాహితీ విమర్శ విధానాల్ని క్షుణ్ణంగా జీర్ణించుకున్నట్లు అనిపిస్తుంది. కృష్ణశాస్త్రి కవిత్వంపై వీరి అవగాహన చాలా ఉన్నతమైందని తెలుస్తుంది.

శ్రీశ్రీ తెలుగు సాహిత్యంలో పెద్ద మార్పు తెచ్చిన మనిషి. ఆధునిక మానవుడి హృదయానికి తగిలిన గాయాలను గేయాలుగా రాసిన కవి శ్రీరంగం శ్రీనివాసరావు. ఎన్నెన్నో అనుభవాలను స్వంతం చేసుకొని తెలుగులో ఇంతవరకెవ్వరు తొంగిచూడని అగాధాలను వర్ణించాడు. ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు ప్రస్థానత్రయం అయితే మహాప్రస్థానాన్ని కలిపి ప్రస్థాన చతుష్కం అవుతుందని కొందరు అంటారు.

నన్నయ ఆదికవి అయితే గురజాడ తెలుగు కవిత్వాన్ని ప్రజామార్గం పట్టించిన కవి. శ్రీశ్రీ తెలుగు కవిత్వాన్ని మరో మలుపు తిప్పి మరో ప్రపంచానికి పోయే విప్లవ పథంలో పరుగెత్తించాడు అని నండూరి వివరిస్తారు. సూర్యుడికి దివిటీ పట్టటం ఎలాగో శ్రీశ్రీని తెలుగువారికి పరిచయం చేయటం అలాంటిదేనని నండూరి అభిప్రాయం. ఆంధ్ర కవితా స్వరూప స్వభావాలను శాసించిన శాబ్దికుడు శ్రీశ్రీ. ఈ విప్లవ కవికి నండూరి తన వ్యాసంలో అక్షరనీరాజనం సమర్పించాడు.

పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన' తెలుగు కథ గొప్పతనాన్ని ప్రపంచానికి చాటిచెప్పింది.[4] నండూరి ఈ వ్యాసంలో తెలుగు సాహిత్యం గురించి స్థూలంగా పరిచయం చేసారు. గాలివాన కథ ప్రవర్తనా వాదం సిద్ధాంతపరిధిని దాటి మానవత్వాన్ని వికసింపజెయ్యటంతో ముగుస్తుందని నండూరి నిరూపించారు. నండూరి విశ్లేషణా సామర్థ్యం సాహితీప్రీతి ఈ వ్యాసంలో కనిపిస్తాయి.

తెలుగు కథా సాహిత్యంలో కొడవటిగంటి కుటుంబరావు స్థానం అద్వితీయం. తెలుగు వచన శైలిని తీర్చిదిద్దిన ఈ అగ్రశ్రేణి రచయిత రచన ఊపిరిగా, ఆలోచన జీవితంగా భావించారు. ఆయనతో సంభాషించటమే చాలా సరదాగా ఉండేదని నండూరి మాట. పిలకా గణపతిశాస్త్రి సంస్కృత సాహిత్యాన్ని కాచివడపోశారు. ఇంగ్లీష్, హిందీ,

ఎందరెందరో ఫ్రీ పాసులతోనే సర్కస్ చూడాలని రావటాన్ని, వివిధ శాఖలకు చెందిన ఉద్యోగస్తులు సర్కస్ వాళ్ళని బెదిరించటాన్ని రచయిత వివరించిన విధానం మనల్ని ఆలోచింపచేస్తుంది. కాలనీ పిల్లలంతా టికెట్లు కొని వెళదామని ముక్తకంఠంతో అంటారు. "నిజమే ఎందుకూ పనికిరాని వెధవ సినిమాలకి వందలు ఖర్చుపెడుతున్నాం. క్రికెట్ మ్యాచ్‌లు చూడ్డానికి వందలు, వేలు ఖర్చుచేస్తున్నాం. ఎగ్జిబిషన్ చూడ్డానికెళ్తే వందలు ఖర్చయిపోతుంది.... కానీ, ఇన్ని జంతువులు, ఇన్ని వందలమంది సర్కస్ ఆర్టిస్టులకు వంద రూపాయలు ఖర్చుపెట్టటానికి మనసొప్పదు. నిజంగా మనల్ని చూసి మనమే సిగ్గుపడాలి" అని నిశ్చయించుకొని పాసుల్ని చింపివేసి, టికెట్లు తీసుకొని సర్కస్ చూస్తారు. గుండెల నిండా సంతృప్తి నింపుకుంటారు. కథ చదివాక పాఠకులు క్షాళన పొందుతారు. ఆలోచన రేకెత్తించటం ఈ కథ సాధించిన విజయం.

దేవరకొండ బాలగంగాధర తిలక్ వచన రచనలో అంచులు ముట్టినవాడు. వీరి 'అమృతం కురిసిన రాత్రి' చదివినవారికి అనుబంధపు, ఆనందపు అనుభూతి మిగులుతుంది. తిలక్ కథారచయితగా కూడా తన ప్రతిభకు పదునుపెట్టుకున్నాడు. మానవతావాదం వీరి కథల్లోని ప్రధాన లక్షణం.

సీతాపతి కథలో ఒక యువకుడు అనవసరంగా పెళ్ళాంపై తెలియని కోపం పెంచుకుంటాడు. 'తన భార్య తనని, బొచ్చుకుక్కని ఒకలాగే పెంచుతోంది. తనకి ఇష్టాయిష్టాలు లేవు. వ్యక్తిత్వం లేదు. తన మనస్సునీ శరీరాన్నీ ఆమె ఎప్పుడో వప్పగించేసుకుంది. తనకి విముక్తి లేదు' అని ఆలోచిస్తుంటాడు. ఇది అతని ఆత్మన్యూనతా భావం. భార్య పాతిక ఎకరాల ఆస్తితో, పెద్ద మేడతో వచ్చింది. ఇదిగాక ఇంకో ముప్పైవేలు ఆమె పేర బ్యాంకిలో ఉన్నాయి. ఎప్పుడేనా తనని లోకువ చేస్తుందేమో, హేళన చేస్తుందేమో అప్పుడు దెబ్బలాడవచ్చునని అనుకుంటాడు. కానీ, అతని భార్య పద్మ అతనికి ఆ అవకాశం ఇవ్వదు. చివరికోనాడు ఇల్లు వదిలిపెట్టి వెళ్ళిపోతాడు. ఒక రోజు పద్మతో క్లబ్బు కెళుతున్నానని చెప్పి ఒక మిత్రుడి ఇంటికి వెళ్దామని రైలెక్కుతాడు. తీరా ఆ ఊరెళ్ళేసరికీ తన మిత్రుడు ఆ ఊళ్ళో తనకున్న ఆస్తిపాస్తులు మొత్తం అమ్ముకొని వెళ్ళాడని తెలుస్తుంది. అతని వెంటవస్తున్న ఆ ఊరి పూజారికి తన కూతుర్నిచ్చి పెళ్ళి చేసి ఇంట్లో ఉంచుకుంటే అనే గొప్ప ఊహ వస్తుంది. పూజారి కూతురికి వయసులో పెద్దవాడైనా, అందగాడైనవాడూ, చదువుకున్నవాడూ భర్తగా దొరుకుతాడన్న ఆశ ఆ వర్షాకాలంలో ఆమె గుండెల్లో వసంతాగమనాన్ని సూచించింది. సీతాపతికి తీవ్రంగా జ్వరం తగిలి, నిద్రలోనే కలవరిస్తుంటాడు. పూజారి సమాచారం పంపితే పద్మ వచ్చి చివరకు సీతాపతిని ఇంటికి తీసుకొని వెళుతుంది. ఉన్నదాన్ని వదులుకుంటూ, లేనిదాన్ని అన్వేషించిన సీతాపతి మానసిక పరిస్థితిని రచయిత అద్భుతంగా చిత్రించారు.

ఎన్. ఆర్. నంది కథ 'గాంధీలు ఇక మరణించారు' ఒక చక్కని శిల్పానికి ఉదాహరణ. వీరి 'మరో మోహంజోదారో' ప్రయోగాత్మక నాటకం కొన్ని వేలసార్లు ప్రదర్శించబడి, అన్ని భారతీయ భాషల్లోకి అనువదించబడింది. ప్రస్తుత కథ ఒక ఆదర్శ గ్రామాన్ని, అందులోని శాంతమూర్తులని పరిచయం చేస్తుంది. ఆ ఊళ్ళో తప్పులు చేసే

వాళ్ళుందరు. ఎవరి రోడ్లు వాళ్ళే వేసుకుంటారు. డబ్బులు తీసుకొని అన్నం పెట్టరు. ఇటువంటి గాంధీలు పోలీసుజులుంపై తిరగబడటం కర్రలు ఎత్తటం ఒక చక్కని సన్నివేశం. "మా పొలాల్లోకి అడవి జంతువులొస్తే ఈ కర్రలెత్తే బాదేవాళ్ళం. కాని ఎప్పుడూ మనిషి మీద ఎత్తలేదు. కానీ ఆ దుర్మార్గుడు మా ఆడపడుచుల్ని అర్థరాత్రి రోడ్డు మీద నడిపిస్తూ మానభంగం చేశాడు. అమాయకుల్ని చంపాడు. ఈ వేళ గాంధీలను రెచ్చగొట్టాడు. మనిషి కూడా జంతువుగా మారితే జంతువుని ఎలా బాదుతామో అలాగే వాడిని బాదుతాం". అని ప్రజలు ఉద్యమించటం రచయిత వ్యంగ్య రచనా విధానాన్ని చూపిస్తోంది. సమాజంలో పెరిగిపోతున్న పోలీసు జులుం శాంతచిత్తులైన ప్రజలముందు నిలబడదని రచయిత వివరించారు. 'చివర్లో మిలిటరీ కమాండర్ ప్రజలపై ఫైరింగ్ చేసినా గాంధీలెవరూ చావలేదని, ఎత్తిన కర్రలు పట్టుకొని హాహాకారాలు చేస్తూ మిలటరీ తుపాకుల మీద, రాకెట్ల మీదా, బాంబుల మీదికి ఒక్క వూపున దూకారు' అని రచయిత ప్రజా ఉద్యమాలకు తిరుగులేదని చెపుతూ వారి శాంతాన్ని తప్పుగా అర్థం చేసుకోవద్దని రాజ్య యంత్రాంగానికి వివరిస్తున్నట్లు ఉంది. ప్రయోగరీత్యా ఈ కథ ఉత్తమస్థాయికి చెందింది.

శ్రీరమణ రాసిన 'బంగారు మురుగు' కూడా ఉత్తమ స్థాయికి చెందిన కథ. కాంక్రీట్ జంగిల్‌లో అంతరించిన మానవతా విలువలు, సున్నితమైన మానవ సంబంధాల గురించి రచయిత చాలా హృద్యంగా అభిప్రాయాల్ని వ్యక్తం చేసారు. అనగనగా ఓ బామ్మ. ఆమెకు ఒక ముద్దుల మనమడు. వ్రతాలు, ఉపవాసాలు, ఆచారాలు, అనుష్టానాలు అవేవీ ఆమెకి తెలీదు. మొక్కకు ముంతెడు నీళ్ళు పోయటం, పక్షికి గుప్పెడు గింజలు చల్లటం, బిచ్చగాడికి పట్టెడన్నం పెట్టటం ఇదే ఆమె నేర్చిన జీవనవేదం. మనవడి పై ఈగ వాలినా సరే ఆ బామ్మ సహించదు. ఇటువంటి బామ్మ మనకుంటేనా అని ఎవరికైనా అనిపిస్తుంది.

ఒకరోజు వాళ్ళింట్లో ఒక స్వాములవారూ, శిష్య బృందం దిగుతుంది. మనవడు తీర్థం కోసం వెళితే చొక్కా తొడుక్కున్నాడని, మహాపచారం చేసాడని స్వామి అంటాడు. వాళ్ళ నాన్న పిల్లాడిని చావచితగ్గొడతాడు. వెంటనే బామ్మ 'ఏం స్వామిలారయ్యా బోడి సాములారు... ఊరిఖే బృహదారణ్యాలు భగవద్గీతలు వల్లిస్తే లాభం లేదు.... అరిశెల్ని, అప్పాల్ని వదల్లేనివాడు అరిషడ్వర్గాల్నేం వదుల్తాడు' అని తిడుతుంది. 'మహానివేదన కాకుండానే చిట్టి గారెలు పిల్లాడికి పెట్టా... చెప్పుకో దిక్కున చోట' అని సవాల్ చేస్తుంది. మనవడికి సంబంధం కూడా బామ్మే నిర్ణయిస్తుంది. చివరి రోజుల్లో నిన్ను వదిలిపెట్టి ఎక్కడికి పోతాన్రా వెర్రినాగన్నా అంటూ అలా వెళ్ళి కాసేపు పెత్తనం చేసి మళ్ళీ నీ ఇంటికే వస్తాగా అంటుంది. మనవడి కడుపున పుట్టాలని బామ్మ కోరిక. ఇదో విశ్వాసం. రచయిత కూడా బామ్మ మా ఇంటికి వస్తుంది – అన్న మాట ప్రకారం ఆవిడ బంగారు మురుగు ఆవిడకే, గాయత్రి సాక్షిగా అని కథ ముగిస్తారు. చిన్నతనం నుంచీ బామ్మతో పెనవేసుకున్న జ్ఞాపకాలు, ప్రేమ ఆ మనవడికి గుర్తుకు వస్తాయి. బామ్మా, మనవళ్ల ప్రేమానుబంధాన్ని రచయిత చక్కగా వర్ణించారు.

చిలుకూరి దేవపుత్ర కథ బందీ - నాస్తికత్వం, హేతువాదం మొదలైనవన్ని మంచి ఆదర్శాలేననీ అయినా వ్యక్తిని, కుటుంబాన్ని గుర్తించే సంఘం ఒకటుందని జ్ఞాపకం పెట్టుకోమని చెపుతుంది. వ్యక్తికి అన్ని విధాలుగా బాసటగా నిలిచేది సంఘం. నిజంగానే వ్యక్తిని మంచికీ, చెడ్డకీ, పెళ్ళిళ్ళకీ, చావులకీ ఆదుకునేది సంఘమే. దేవుడున్నాడో లేదో తెలీదు. ఇలా ఈ కథ వ్యక్తికి, సంఘానికి మధ్య ఉండాల్సిన సంబంధాన్ని వివరిస్తోంది.

బి. ఎస్. రాములు కథ 'సదువు' భారత ఉపఖండంలో దళిత తాత్విక భూమికలు ఏర్పరిచిన రచయిత వాదనని వివరిస్తుంది. దళితవాద స్ఫూర్తి సదువు కథలో కనిపిస్తుంది. ప్రకృతి ఒడిలో జన్మించిన వారందరికీ సృజనాత్మకత, ఆలోచన, తెలివితేటలు పిట్టకి ఎగరటం వచ్చినంత సహజంగా వస్తాయి. కానీ, ఈనాటి పాఠ్యపుస్తకాలు పట్టణవాసపు అగ్రకులాల, మధ్యతరగతి పిల్లల కోసం రాసినట్టుంటాయి. పల్లెటూరి పిల్లలకు, అందునా దళితులకు అవి ఏ మాత్రం అసక్తిలేని విధంగా ఉంటాయి. బడిలో నేర్పే చదువులు ఏ మేరకు మంచి వ్యక్తిత్వాన్ని కలిగిస్తున్నాయి? ఏ తెలివితేటలని ఈ చదువులు వృద్ధిచేస్తున్నాయి. స్వేచ్ఛగా తిరగబట్టి రవీంద్రుడు విశ్వకవి కాగలిగాడేమోనని రచయిత అంటారు. తనకు తాను స్వేచ్ఛగా తెల్సుకునే పరిస్థితులు, అవకాశాల్తో ఆసక్తి, అభిరుచి కలిగించేలా ఉంటమే, సరైన సహజ విద్యావిధానం అని రచయిత భావించినట్లుగా ఉంది. ఈ కథ విద్యావిధానంపై, విద్య పరమార్థంపై ఒక వ్యాఖ్యానంలాగా ఉంది.

కథాసాగర్‌లోని కథలు తెలుగు మేధావుల ఆలోచనా తీరుతెన్నులని ప్రతిబింబిస్తున్నాయి. ఆధునిక జీవితంలోని ప్రతి అంశాన్ని ఈ కథలు తడుముతున్నాయి. అనేక మంది వ్యక్తులు వారి జీవితానుభవాలని ఈ పేజీల్లో నిక్షిప్తీకరించారు. తెలుగు కథకులు చేసిన ప్రయోగాలను ఈ వేదిక ప్రదర్శిస్తోంది. ఎన్నెన్నో ప్రభావాలకు లోనైన తెలుగు కథారచయితల గళాలు దీనిలో వినిపిస్తున్నాయి. అవి చదివేవారిని కూడా జీవితం విలువలను గ్రహించటానికి, దానికి ఉన్న విభిన్న కోణాలను పరిశీలించటానికి అవకాశాలు కల్పించి తమని తాము తెల్సుకునేలా వీలు కల్పిస్తున్నాయి. ఈ సంకలనం పేరు సార్థకమైంది. ఈనాటి సమాజంలో కథాసాగర్ లాంటి సంకలనాలు నిర్మాణాత్మక పాత్ర పోషిస్తాయని విశ్వసించవచ్చు. ఇటువంటి ఉత్తమ కథాసాహిత్యం అనుమానం లేకుండా ఉత్తమ సమాజనిర్మాణానికి ఉపయోగపడుతుంధని చెప్పవచ్చు.

## వివరణలు:

1. మొదట్లో కథ పేరు 'దిద్దుబాటు'గా ఉన్నా గురజాడ వారే స్వయంగా దాన్ని 'కమలిని'గా తీర్చిదిద్దారు. ఆణిముత్యాల్లాంటి కథలను ఇంగ్లీష్‌లోకి అనువదించిన వి. రంగారావు కూడా దీన్ని 'కమలిని'గానే పరిగణించారు. అయితే 1903 నవంబరు నెలలో కల్పలత (విశాఖపట్టణం) సంచికలో వచ్చిన ఆచంట సాంఖ్యాయన శర్మ కథ 'లలిత' మొట్టమొదటి కథ అని పలువురు భావిస్తున్నారు.

చేతిలో మొట్టికాయలు తిని తిని సైగల్ పిచ్చిపోయిందా?" అని రాశాడు. సైగల్‌తో పోల్చదగిన గాయకుడు లేదని నండూరి నిర్ద్వంద్వంగా అంటారు. లతా, పంకజ్ మల్లిక్, రఫీ, ముఖేష్, తలత్, కిశోర్‌కుమార్, ఎస్.డి. బర్మన్, నూర్జహాన్ మొదలైన గాయకులందర్నీ తన వ్యాసంలో ప్రస్తావించిన నండూరి సైగల్‌కి మాత్రం అగ్రతాంబూలం అందచేసాడు. సముద్రంలో అలలు ఉవ్వెత్తున లేచి విరిగిపడుతున్న విధంగా, దూరంగా ఒక మేఘం మంద్రమంద్రంగా ఉరుముతున్నట్లు అతని కంఠం గంభీరంగా ఉంటుందని నండూరి ఆ గంధర్వ గాయకుడిని సన్మానిస్తాడు. ఒకసారి విషాదాన్ని స్పందిస్తూ, ఒకసారి వినోదాన్ని చిందిస్తూ అతని పాటలు ఉంటాయట. నండూరివి ఉత్తమాభిరుచులు. జీవితం అంటే ఏమిటో, దాన్ని ఎలా అనుభవించాలో, దాని విలువ ఏమిటో అర్థం చేసుకున్నవాడు.

పంకజ్‌మల్లిక్ గురించి మరో వ్యాసంలో నండూరి వివరించారు. సైగల్ వ్యాసానికి లభించిన అపూర్వ పాఠక స్పందనని చూసి ఈ వ్యాసం రాసానని నండూరి పేర్కొన్నారు. ఉత్తమ రచయితకి పాఠక స్పందన ప్రేరణగా పనిచేస్తుంది. పంకజ్‌మల్లిక్ అనేక చిత్రాలకు సంగీతదర్శకత్వం వహించాడు. నృత్య గీతాలకు సంగీతం సమకూర్చటంలో అతనికి అతనే సాటి. ఏ పాట తీసుకున్నా దాన్ని ఒక అద్భుత శిల్పఖండం లాగా చెక్కి, చెక్కి నగిషీలు పెట్టిగాని తృప్తిపడని సంగీతశిల్పి. ఇతని ఆర్కెస్ట్రేషన్ విలక్షణంగా ఉంటుంది. అతని గొప్ప పాటలను తాజ్‌మహల్‌తో నండూరి పోలుస్తారు. మంచి సిమెట్రీ, పర్‌ఫెక్షన్, ఫినిష్ ఇతని పాటల్లో ఉంటాయి. నండూరిది కావ్య కళాదృష్టి. పంకజ్ దగ్గర శిష్యరికం చేద్దామని కూడా నండూరి మొదట్లో అనుకున్నా అది తీయని తీరని కోరికగానే మిగిలిపోయిందని అంటారు. ఇక్కడ వెంటనే 'ఆంధ్రదేశం ఒక గొప్ప గాయకుడిని నష్టపోయిందని చెప్పే అహంభావం నాకు ఎంత మాత్రం లేదు సుమండీ' అనటం నండూరి హాస్య ప్రవృత్తిని సూచిస్తోంది.

బడే గులాం ఆలీఖాన్ సంగీతానికి తాను గులామునయ్యానని నండూరి అంటారు. ఖాన్‌సాహెబ్ పాడుతుంటే వినటమే కాదు, చూడ్డం కూడా ఒక గొప్ప అనుభవం. ఆయన గాలిలోంచి స్వరాలను పువ్వుల్లా కోస్తారు, మాలగా గుచ్చుతారు. మళ్ళీ విడదీసి ఏ పువ్వుకు ఆ పువ్వు అక్కడ పెడతారట. ఖాన్‌సాహెబ్ కచేరీల్లో దక్షిణాది విద్వాంసులు ఆనందంతో ఊగిపోయేవారుట. ఠుమ్రీలు ఆయన అద్భుతంగా పాడ్డం చూసి ఆయనకి పెద్ద విద్వత్తులేదని కొందరంటారని, కానీ వాళ్ళ మాటలు నమ్మకండని నండూరి చెపుతారు. మనం మనకి నచ్చిన సంగీతాన్ని విని, ఆనందించటం చూసి ఓర్చలేని వాళ్ళయి ఉంటారు వాళ్ళు... అని విషయం చెపుతున్నారు. నండూరిగారిది పాఠకుల మనసులని చదివి దానికి తగినట్లుగా రాసే నేర్పు. ఎందరో గొప్పవ్యక్తుల జీవితాల స్ఫూర్తిని తీసుకొని తన రచనలో ప్రమాణాలు సాధించాలని ప్రయత్నించటం నండూరి విధానం. విభిన్న రంగాల్లో ప్రముఖులు సాధించిన విజయాలను చూసి, వాటికి పరవశించిన నిజమైన కళాకారుడు నండూరి. సృజనాత్మకతని ఆవిష్కరించటానికి అనేక యానకాలు ఉన్నాయి. ఇది విభిన్న కళారూపాలలో ప్రకటితమవుతుంది. నండూరి

కళాదృష్టి ఎల్లలు ఎరగనిది కాబట్టే అంత అద్భుతంగా వివిధ కళాకారుల విజయాల గురించి రాయగలిగారు.

ప్రతిభా పరిమళాలు 'ఎవర్‌గ్రీన్ హీరో' అక్కినేని నాగేశ్వరరావు గురించి వివరించే వ్యాసంతో మొదలవుతుంది. ఈ హీరో ప్రతి చిన్న మేనరిజాన్ని యువకులైన ప్రేక్షకులు బహుజాగ్రత్తగా గమనించి, జ్ఞాపకం పెట్టుకొని, మనం కూడా అలా ఉంటే అలా చేస్తే ఎంత బాగుంటుంది అనుకుంటారట. నండూరి దృష్టిలో అక్కినేనికి రెండు హాబీలు అలవాటైనాయి, అవి ఇంకా పోలేదు కూడా. ఇంతకీ అవి ఏవిటంటే శతదినోత్సవాలు చేసుకోబోయే చిత్రాలలో తరచుగా నటించటం, ఉత్తమ నటుడిగా రాష్ట్రపతి బహుమతి నుంచి రాష్ట్ర జనుల బహుమతి వరకు సత్కార పరంపరలను స్వీకరించటం. ఇంత సరదాగా రాయటం ఇంక ఎవరు చేయగలరండీ?

ఆరుద్ర నవ కవితా కల్లోలినీలో ఉవ్వెత్తున లేచిన కెరటం. అభ్యుదయ కవిత్వానికి ఆదిరుద్రుడైన శ్రీశ్రీ ఆరుద్రని ఆరో రుద్రుడని పేర్కొన్నారు. శ్రీశ్రీ మార్క్స్ అయితే ఆరుద్ర ఎంగెల్స్. వ్యక్తిగా నిత్యోత్సాహి లోపలా బయటా కూడా ఆరుద్రగానే జీవించటం, ఆరుద్రగానే భావించటం ఒక అసాధారణ ప్రజ్ఞ. 'నీవు ఎక్కదలచుకున్న రైలు ఒక జీవితకాలపు లేటు' అన్న ఆరుద్రకు మాత్రం రైలు సకాలానికే వచ్చింది. ఏళ్ళూ పూళ్ళూ నిరీక్షించలేక ఏదో ఒక బండీ ఎక్కలేదు. తన ఆదర్శాల లగేజీని టిటిసి ఎక్స్‌ప్రెస్ అనటానికి వీలులేకుండా చేసుకున్నాడు. ఆధునికాంధ్ర సాహిత్య ఖగోళంలో ఉదయించిన ఆరుద్ర మెరుపు, ఎరుపు ఈనాటికీ తగ్గలేదని నండూరి అంటారు.

సత్తిరాజు లక్ష్మినారాయణని ఇంటా బయటా అందరూ బాపు అంటారు. అతని చిత్రకళానైపుణ్యం చూసినవాళ్ళు బాపురే అని నోరు వెళ్ళబెడతారు. కుంచెను కొంచెమే ఉపయోగించి "గీత"రహస్యాన్ని కాచి వడపోశాడు. కలాయుధుడు చిన్ననాటి నుంచి కళా తపస్సు చేసి విదేశీయుల కథా చిత్రాల సన్నిధిలో ఏకలవ్యపు శిష్యరికం చేసి బాపు లెటరింగ్‌ను సాధించాడు. గాలిబ్ గీతాలకు, జనార్దనాష్టకానికి వేసిన చిత్రాల రేఖాసౌకుమార్యం అతని ప్రతిభావుకతకు నిదర్శనం. అనేక చిత్రాలను తీసి అక్కడా తన పేరు నిలబెట్టుకున్నాడు. బాపూకి పొగరులాంటి ఆత్మవిశ్వాసం విజయం పొంది తీరాలనే విగరులాంటి పట్టుదల ఉన్నాయని నండూరి అంటారు. మరో వ్యాసంలో కూడా తనకు తెలిసిన బాపు గురించి వివరిస్తాడు. ఒకే వ్యక్తి గురించి రెండుసార్లు రాసినా చదివేవాళ్ళు ఏ మాత్రం ఇబ్బందిగా అనుకోకపోవటం గమనించాలి. నండూరి శైలి విలక్షణమైంది. అదే విషయాన్ని మార్చి మార్చి చెప్పటం ఆయనకు కొట్టిన పిండి.

ముళ్లపూడి వెంకటరమణ పాఠక హృదయాలలోకి ఝూమ్మని దూసుకుపోయి తిష్టవేసుకుని కూర్చున్నాడు అని వాక్యం మొదట్లో రాస్తే ఆ తర్వాత అక్షరాల వెంట మన కళ్ళు పరుగులెత్తకుండా ఉంటాయా? నండూరి వ్యాసాలు చదివేవాళ్ళని వంచిన తల ఎత్తనీకుండా చదివిస్తాయి. ఇలా పాఠకుల్లో వినయాన్ని కలిగిస్తున్న రచనాశక్తి నండూరిది! ముళ్లపూడి గురించి వీరు రాసిన వ్యాసం ఆయన టైటిల్‌లాగానే రమణీయకథ.

జగమెరిగిన జర్నలిస్ట్ తుర్లపాటి కుటుంబరావు పై రాసిన వ్యాసంలో ఆయన ఉపన్యాసశక్తి గురించి చెపుతూ మొత్తం 'ఉపన్యాసం' గురించే వ్యాసంలో చెప్పారు. తనకంటే వయసులో చిన్న అయినా తుర్లపాటిగారి ప్రతిభ గురించి నండూరి అంత చక్కగా చెప్పటం మెచ్చుకోదగ్గ విషయం. తుర్లపాటిని 'ఆంధ్ర సిసిరో' అని నండూరి వ్యవహరించారు. ఏ విషయంపైనైనా, ఎంతసేపైనా సరే ఉపన్యసించి ఉద్రూతలూగించగల శక్తి ఆయనది. తుర్లపాటి జీవిత చరిత్రలను ప్రత్యేక శ్రద్ధతో స్పెషలైజ్ చేసారు.(5)

కథకుడిగా కొండలరావు ఎన్నో విజయాలు సాధించాడు. తన కథలను ముగిస్తూ ముగింపు తర్వాత జరిగే దాన్ని వాచ్యంగా చెప్పకుండా పాఠకుల ఊహకి వదిలేస్తాడట. ముమూర్ష, దిదృక్ష, చంద్రశేఖరుని కథ, స్నేహం మొదలైన వాటినన్నింటినీ స్థూలంగా వివరించాడు.

మహదేవన్ తెలుగు నుడికారపు సొంపు ఏ మాత్రం చెడకుండా, తెలుగు పలుకుబడిలోని సొగసులని ఆయన తన స్వరాలలో పలికిస్తున్నారని నండూరి రాశారు. ఇటువంటి కొన్ని వాక్యాలు వీరి వ్యాసాలలో అక్కడక్కడా కనిపిస్తాయి. ఒక్క మాటలో చెప్పాల్సినదాన్ని ఇలా అదే పదంతో పెంచి రాయటం బాగాలేదు.

శ్రీమతి భానుమతి గురించిన వ్యాసం నిజానికి చాలా చిన్నది. ఈ వ్యాస సంకలనంలో ఆయనే చెప్పినట్లుగా కొన్ని ఉఫ్ అంటే ఎగిరిపోయేటంత చిన్నవిగా ఉన్నాయి. ఏ కారణం వల్లనో కొన్ని వ్యాసాలు ఆ పేరుతో పిలవతగినవిగా లేవు. విషయం కూడా చాలా పరిమితంగా ఉంది.

గంధర్వగాయని లతామంగేష్కర్ గురించి రాసిన వ్యాసంలో ఆమెతో తాను చేసిన సంభాషణ సారాంశాన్ని క్లుప్తంగా వివరించారు. మీరేదైనా జాతీయ గీతాలు పాడారా అంటే ఆనంద మఠ్ చిత్రంలో వందేమాతరం తప్ప మరే జాతీయగీతమూ పాడలేదన్నది.

మందార మకరందాలు అన్న శీర్షిక క్రింద 'మన తెలుగు తల్లి' వ్యాసం ఆంధ్రప్రదేశ్ చరిత్రను సంక్షిప్తంగా మనకు అందించింది. సప్తవర్ణాలు కలిసి సూర్యకాంతి అయినట్లు ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమలు కలిసి ఆంధ్రప్రదేశ్ అయ్యాయని ఎంత ప్రాంతీయ వైవిధ్యం వున్నా తెలుగు ప్రజల సాంస్కృతిక వారసత్వం సమిష్టి సంపదని నండూరి అభిప్రాయాల్ని చెపుతున్నాడు. మన జాతి ఏకత్వం వైవిధ్యం రెండూ పరస్పరాశ్రితాలు. నండూరి బాధ్యత ఎరిగి రచనలు చేసిన వ్యక్తి.

'మహా సంకల్పం' తెలుగు సాహిత్యంపై ఒక సిద్ధాంత పత్రం లాగా ఉంది. కవిత్వం అంటే ఏమిటి, దాని ప్రయోజనం ఏమిటి లాంటి అనేక మౌలిక ప్రశ్నలకు సమాధానాలను ఇవ్వటానికి నండూరి ప్రయత్నించారు. కవిత్వానికి కవితాగుణాన్ని ఆపాదించే లక్షణాలెన్నిటితో పాటు కవి నిజాయితీ ఒక ముఖ్య లక్షణమని అభిప్రాయం చెపుతారు.

ఈ విభాగంలో ఆరుద్ర, తిలక్‌లపై మళ్ళీ వ్యాసాలు రాసారు. అయితే తిలక్‌పై రాసిన వ్యాసంలో ఏదో ఆత్మీయతా లక్షణం ఉండి మనల్ని ఆకర్షింపచేస్తుంది. తిలక్‌కి, జాన్ కీట్స్‌కి పోలిక పెట్టారు నండూరి.

చేరాగా అందరికీ సుపరిచితులైన చేకూరి రామారావు బహుముఖ ప్రజ్ఞాశాలి. వీరి పరిచయం తొలిసారిగా అయినప్పుడు అరె ఇన్నాళ్ళూ ఈయన్ని ఎలా మిస్ అయ్యాను? ఇంతకుముందే పరిచయమైతే ఎంత బాగుండేది అని నండూరికి అనిపించిందట. చేరా మాస్టారు భాషాశాస్త్రవేత్త. తెలుగు వాక్యం వీరికి ఆరోప్రాణం. మంచి సాహితీ విమర్శకుడు. స్త్రీ పక్షపాతిత్వం ఎక్కువ. చేరాతలు ఎందరికో స్ఫూర్తి ప్రదాతలయ్యాయి. చేరాతలలో ఒక సహృదయ విమర్శకుడు కనిపిస్తున్నాడని నండూరి వివరిస్తారు. ఒక శాస్త్రీయ విధానంలో సాగే వీరి రచనలు తెలుగు విమర్శలో ఒక నూతన ఒరవడిని ప్రవేశపెట్టాయి. ఎందరో రచయితలను వెన్నుతట్టి, అవసరమైన చోట ఓ చరుపు చరిచి, చురక వేసి, మొత్తం మీద వారిని బహుళ ప్రచారంలోకి తీసుకొని వచ్చిన ఘనత మాత్రం చేరాగారిదేనని నండూరి గట్టిగా చెపుతున్నారు.

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, బీనాదేవి, భమిడిపాటి రామగోపాలం, సి. రామచంద్రరావు, పురాణంవారు, శ్రీరమణ, మల్లాది సుబ్బమ్మ, వివేకానందమూర్తి, యండమూరి మొదలైన రచయితలపై ఈ విధంగా నండూరి రాయటం బాగుంది. ఇవన్నీ వ్యాసాలుగా లేవు. నండూరి వ్యాసప్రక్రియలో సాహితీ సమీక్షను, జీవిత చరిత్రలను ఇమిడ్చి ఒక విశిష్టతను సాధించారు. నిజానికి నండూరి అభిప్రాయాలను వెల్లడించటానికి వ్యాసప్రక్రియ పరిధిని పెంచారు.

సమీక్షా సౌరభాలు శీర్షికలో చాకుల్లాంటి చాసోకథలు తొలివ్యాసం. చాగంటి సోమయాజులు కథారచనలో మహాశిల్పి. కథ చెప్పేటప్పుడు తనకు తానుగా ఏమీ చెప్పకుండా ఎంతో కథ చెప్పటం ఆయన టెక్నిక్. "తెల్లారుకట్ట కోడి కూయనంత మాత్రం చేత కాకులు అరవనంత మాత్రాన తెల్లారకుండా పోదని అలాగే కవులు కావ్యాలు కథకులు కథలు రాయనంత మాత్రాన జీవితం ఆగిపోదు; ఎందుకీ సాహిత్యం అంటారు చాసో". నండూరికి ఈ మాటలు రుచించలేదు. అందుకే బహుశా ఇలాంటి నిర్లక్ష్యం పెట్టుకునే చాసోగారు తన కథల సంకలనం పట్ల ఇన్నాళ్ళూ అశ్రద్ధ చూపించారేమో! అని చురక అంటించారు.

కూచిపూడి నృత్యాన్ని అంతర్జాతీయ స్థాయిలో ఇనుమడింపచేసి గౌరవాన్ని, గుర్తింపుని తెచ్చిన వెంపటి చినసత్యం గురించి నండూరి తన వ్యాసంలో పాఠకులకి పరిచయం చేసారు. కూచిపూడి నాట్య పునరుజ్జీవాన్ని తన జీవితలక్ష్యంగా నిర్ణయించుకొని, నిరంతరం కృషి చేసినవారు. క్షీణదశలో ఉన్న ఈ నృత్యాన్ని తీర్చిదిద్ది, సృజనాత్మకమైన మార్పులు తెచ్చిన గొప్ప వ్యక్తి.

ఆధునిక కవులలో గుంటూరి శేషేంద్రశర్మ అగ్రశేణి. పండితకవిని నండూరి అక్షరాలతో సన్మానించారు. ఇంగ్లీష్ కవి, విమర్శకుడు ఎలియట్ లాగేనే శేషేంద్ర కవిత్వాన్ని, కవితా సిద్ధాంతాలను విడదీసి చూడలేము. తెలుగుసాహిత్యం గురించి శర్మగారి అభిప్రాయాల్లో ఎంత వైదుష్యం కనిపిస్తుందో అంతగా వివాదాస్పదంగా ఉంటాయని నండూరి చెపుతూ కొన్ని ఉదాహరణలు కూడా ఇచ్చారు.

కథాసాహిత్య కేదారంలో బంగారు పండించే నిత్యకృషీవలుడు మధురాంతకం రాజారాం. ఆయన సృష్టించిన పాత్రలలో, వర్ణించిన ప్రకృతి పరిసరాలలో ఇతివృత్తానికి

అనుగుణంగా ఉపయోగించిన భాషలో ప్రాంతీయతా పరిమళం గుబాళిస్తూ ఉంటుందని నండూరి అంటారు. కొన్ని వాక్యాలు సంక్లిష్టంగా, 'లోడెడ్'గా, సాధారణీకరణలతో కూడిన వాక్యాలు రాస్తారు. దీనివల్ల కొన్ని కొన్ని వాక్యాలను ఆగి ఆగి ఆలోచిస్తూ చదవవలసి ఉంటుందని వివరిస్తారు. నండూరిది నిష్పక్షపాత ధోరణి. ప్రతి ఒక్కరినీ వాస్తవికదృష్టితో అధ్యయన చేయటం, వారి లోటుపాట్లని సరిగా అంచనా వేయటం నండూరి సమీక్షల వెనక ఉన్న విషయం.

చిత్రశాల శీర్షిక క్రింద కొన్ని అద్భుత చిత్రాలను నండూరి చక్కగా విశ్లేషించారు. దేవదాసు చిత్రం తెలుగులో గొప్ప విజయం పొందింది. కథ చాలా స్పష్టంగా, సూటిగా, కథనం చెయ్యబడింది. ప్రసిద్ధి పొందిన ఈ ప్రేమకథలో సంఘం, తల్లిదండ్రులు ఒక ప్రేమజంటని ఎలా విడదీయబోయారో వర్ణించబడింది. తెలుగు దేవదాసులో అక్కినేని, లలిత, పేకేటి శివరాం మొదలైనవారి నటన అద్భుతంగా ఉందని కానీ ఇతర నటీనటుల మీద దర్శకుడు ఎక్కువ శ్రద్ధ తీసుకోనట్లు కనిపిస్తుందని నండూరి చెపుతున్నారు. అన్ని అంశాలను పరిశీలించటం, వాని పై వ్యాఖ్యానించటంవల్ల నండూరి విశ్లేషణ సమగ్రంగా, సహేతుకంగా ఉంటుంది.

ఇటాలియన్ దర్శకుడు విట్టోరియా డీ సికా తీసిన అపూర్వచిత్రం 'బైసికిల్ తీఫ్స్'. రెండో ప్రపంచయుద్ధం తర్వాత ప్రబలిన నిరుద్యోగ సమస్య, ప్రజాజీవితాల్లో అది కలిగిస్తున్న సంక్షోభం సినిమాలో ఇతివృత్తం. ఒకటే ప్రధానపాత్ర నిరుద్యోగ కార్మికుడు తన సైకిలుని పోగొట్టుకొని అది దొరకక ఇబ్బంది పడి తానే చివరకు ఒక సైకిలుని దొగిలించి పట్టుబడటం, అందరూ అతనికి హితబోధ చేయటం ఈ సినిమాలో ఉంది. నండూరి భారతీయ చిత్రాలను వీటితో పోల్చి అనేక అంశాల్లో విదేశీ సినిమాలు ఎందుకు ఉన్నతంగా నిలుస్తాయో విశ్లేషించారు.

రెస్పెక్టబుల్ ప్రాస్టిట్యూట్ అనే ఫ్రెంచి చిత్రం అమెరికాలో జాతి విద్వేష విధానాన్ని, నీగ్రోల జీవన పరిస్థితుల్ని అద్దంపడుతుంది. కథా చిత్రణలో ఎక్కడా ఆడంబరం లేకుండా, డొంక తిరుగుళ్ళు లేకుండా ప్రతి అంశం ప్రయోజనాత్మకంగా ఉన్న ఈ చిత్రం ఒక వేశ్య గురించింది. నాగరిక ప్రపంచంలోని అమానుష లక్షణాలను, దాని దృష్టిలో 'సంస్కారం నాగరికత, సభ్యత' లేని వారిలో ఉండే మానవతను ఈ పాత్ర ద్వారా చూపించారు.[6]

విదేశీ చిత్రాలను చూడటం, విషయాల్ని తెలుసుకోవటం వ్యక్తి ఆలోచనా పరిధిని విస్తృతం చేస్తుంది. మనిషి ఎల్లలు ఎరగని, అడ్డుగోడలులేని విశ్వమానవునిగా ఎదగటానికి మంచి చిత్రాలు దోహదపడతాయని నండూరి విశదీకరించి చెపుతున్నారు.

దూరతీరాలు శీర్షిక క్రింద కొందరు ప్రపంచ ప్రఖ్యాత సాహితీమూర్తుల గురించి నండూరి వివరణాత్మక వ్యాసాలు రాసారు. నండూరి సాహితీ దృష్టికి తన, పర భేదం లేదు. రష్యన్ మహారచయిత, మహామనిషి లియో టాల్‌స్టాయ్ జీవితాన్ని ఆయన ఆదర్శాలను ఒక వ్యాసంలో వివరించారు. వెయ్యి పేజీలకు పైబడ్డ టాల్‌స్టాయ్ నవల 'వార్ అండ్ పీస్' ప్రపంచ వ్యాప్తంగా ఎందరికో అభిమానపాత్రమైంది. సజీవ పాత్ర చిత్రణ, వాస్తవికత ఆయన రచనల్లో కనిపిస్తాయి. ఏసుక్రీస్తు ప్రవచనం 'దౌష్ట్యాన్ని

నిరోధించకు' అనేది ఆయనకు ధ్యేయమైంది. టాల్‌స్టాయ్ వ్యాసాన్ని కొన్ని ఉపశీర్షికలతో నందూరి ఇంద్రజాలంలాగా ప్రదర్శించారు.

టి. యస్. ఎలియట్ బ్రిటీష్ మహాకవి. వీరి వేస్ట్‌ల్యాండ్ కవితా సంపుటి నోబుల్ పురస్కారాన్ని పొందింది. ఆయన ఎంత గొప్ప కవో అంత గొప్ప విమర్శకుడు. భారతీయ వేదాంత ధోరణిని అభిమానించి తన కావ్యంలో కొన్నిటిని వివరించారు. బృహదారణ్యకోపనిషత్‌లోని మేఘగర్జన ఉదంతాన్ని చాలా చక్కగా 'దత్త-దమయత-దయాధ్వామ్' గా తన కావ్యంలో ఆవిష్కరించారు.[7] చివరగా శాంతి, శాంతి, శాంతి అంటూ ముగించారు. ఆయన పాడిన భావచిత్రాలు (Images) విమర్శకులకే కొరుకుడు పడలేదు.

చిలీ జాతీయకవి పాబ్లోనెరూదాకి నోబుల్ బహుమతిని ప్రకటించిన సందర్భంలో నందూరి ఒక వ్యాసం రాశారు. దీనిలో నోబుల్ పురస్కారంపై గతంలో రేగిన వివాదాలను కూడా ఆయన ప్రస్తావించారు. మరో రచయిత సాల్‌బెల్లో నోబుల్ బహుమతికి అర్హుడైన విషయంగా నందూరి మరో వ్యాసం వెలువరించారు. వేదనా పూరితమైన కథనంలో సున్నితమైన హాస్యాన్ని కూడా చొప్పించటం సాల్‌బెల్లో పద్ధతి.

హాస్యానికి హెడ్డాఫీసు మార్క్‌ట్వేన్. నందూరి వీరి నవలలని చాలా వాటిని తెలుగించారు. ఛలోక్తులు విసరటంలో, సమయస్ఫూర్తితో సమాధానాలు ఇవ్వటంలో ఇతనికి ఇతనే పోటీ. అతని చమత్కారం సాధారణంగా సున్నితంగా, అవసరమైనప్పుడు మొరటుగా, క్రూరంగా ఉంటుందట. ఇండియా సందర్శించి ఇతను అనేక ఉపన్యాసాలిచ్చాడు. తాజ్‌మహల్‌ని దర్శించే సమయంలో గ్రహణం పట్టిందట. అతను "తాజ్‌మహల్ కట్టిన తర్వాత ఇంత ఘనగౌరవం నాకు తప్ప మరెవరికీ జరగలేదు. 1876లో ప్రిన్స్ అఫ్ వేల్స్ తాజామహల్‌ను సందర్శించిన సందర్భంలో చంద్రగ్రహణం ఏర్పాటు చేద్దామనుకున్నారుగానీ సాధ్యం కాలేదు"... అని చమత్కరించాడట.

ప్రసంగ చాతుర్యంలో ప్రసిద్ధుడు వెల్ష్ బెర్నార్డ్ షా ఛలోక్తులు, చాప్లిన్ శతజయింతి, బీతోవెన్ వెన్నెలపాటలను గురించి నందూరి రాసిన వ్యాసాలు వారి అహ్లాదరచనకి మంచి ఉదాహరణలు. ముఖ్యంగా చార్లీచాప్లిన్ సినిమాల గురించి నందూరి చెప్పిన వివరాలు చదివి తీరవలసినవి. వాల్ట్‌డిజ్నీ అపూర్వ ప్రయోగాలను, కార్టూన్ చిత్రాల విజయాలను నందూరి అద్భుతంగా వెల్లడించారు.

వ్యాస విన్యాసంలో నందూరి హాస్యరసాన్ని కురిపించి చదువరులను కడుపుబ్బ నవ్వించారు. ఈ శీర్షిక క్రింద ఉన్న అన్ని వ్యాసాలు వారి రచనా చమత్కారానికి ఉదాహరణలు. "నువ్వు ఆశావాదివా, నిరాశావాదివా అని ఎవరైనా ప్రశ్నిస్తే మరో ఆలోచన లేకుండా నిరాశావాదినని చెప్పేస్తాను. ఎందుకంటే నేను నిజంగా లోలోపల ఆశావాదిని" అని వ్యాసాన్ని ప్రారంభిస్తారు. మొదటి వాక్యం ద్వారానే అందరినీ ఆకర్షించటం నందూరి వాక్యానికి అలవాటు. ఒకవేళ మనం ఒకటో నెంబరు బస్సు కోసం నిలబడితే మనం అర్జెంటుగా వెళ్ళవలసి ఉన్నట్లు దానికి తెల్సిపోయి ఎంతసేపు ఎదురుచూసినా అది రాదట. అప్పుడు ఏం చేయాలి అంటే, "నా పిచ్చిగాని ఒకటో నెంబరు బస్సు ఎందుకు వస్తుంది? రాదు రాదు" అనుకోవాలి. అంటే తన్ను

మోసగించటానికి అలా అనుకుంటున్నట్లు ఆ ఒకటోనెంబరు బస్సుకి తెలియకూడదు. చిత్తశుద్ధితో నిరాశ చేసుకోవాలి. వెంటనే ఠపీమని ఒకటో నెంబరు బస్సు వచ్చేస్తుంది. ఇంత సరదాగా రాయటం నండూరికే చెల్లింది.

మరపురాని మనుషులు వ్యాసంలో సహజానంద, ఆశ్చర్యానందల గురించి - అందరిలా కాకుండా విచిత్రంగా ప్రవర్తించే వ్యక్తులు - అంత సరదాగా రాయటం ఒక కళ. అన్నీ మామూలుగా, సహజంగా కనిపించే సహజానంద ఎంత షాక్ కలిగించే వార్త చెప్పినా, ఆశ్చర్యం కలిగించే విషయం చెప్పినా ఏ మాత్రం తొణకరు, బెణకరు. ఎవరికో జబ్బు చేస్తే "మనవాడికి టైఫాయిడ్ అటండీ" అని ఇతనితో అన్నారట. అవునుమరి జబ్బు చేస్తే ఎలా లేస్తాడు? అన్నాడట ఆయన తన సహజధోరణిలో. "టైఫాయిట్ట" అంటే ఆయన 'టైఫాయిడే!' అని మామూలుగా మాట్లాడాడట. ఇటువంటి వ్యక్తులు మనకు జీవితంలో తారసపడుతూనే ఉంటారు. స్వామి ఆశ్చర్యానంద మొదటి వ్యక్తికి పూర్తి వ్యతిరేకి. ఆయనకి అన్నీ అద్భుతమే, వింతే. "నేనివ్వాళ హైదాబాద్ వెళ్తున్నాను సార్" అని ఆయనతో అంటే "ఆ! హైదరాబాదే! అయ్యబాబోయ్! హైదరాబాదు? ఏదీ, మన రాజధాని హైదరాబాదు? అబ్బా! రైల్లోనా, బస్సులోనా ?" అని బోలెడంత ఆశ్చర్యం చూపిస్తాడు. ఇలా సాధారణ విషయాలను తీసుకొని నవ్వు తెప్పించే రచనలు చేయటంలో నంధూరికి స్టీఫెన్‌లీకాక్‌తో పోలిక ఉంది.[8]

పోస్ట్‌పోన్‌మెంటాలిటీ, అప్పులకుప్పలు, హాచ్చీ, ఖామాకలాపం లాంటి ఇతర వ్యాసాల్లో కూడా వీరి హాస్యం కడుపునొప్పి తెప్పించకమానదు.

జ్ఞాపకాల జాడలు అన్న శీర్షికక్రింద నండూరి వారి వ్యాసం "ఆనాటి కలలేవీ"? ఆయనలోని మేధావిని బయటికి చూపిస్తుంది. స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సమయంలో ఆనాటి నాయకుల కలలనీ, ఆశయాలనీ స్మరించుకొని జాతి ముందుకు నడవాలని నండూరి ఉద్బోధించారు. మహాకవి ప్రశ్నించినట్టు 'ఏవి తల్లీ, నిరుడు కురిసిన హిమసమూహములు? 'నండూరి జాతిని సవాలు చేస్తున్న ప్రశ్నలివే అంటారు. తన చిన్నతనంలో స్వాతంత్ర్య సమరయోధుల ప్రసంగాలు విని ఉర్రూతలూగిన దేశప్రేమికుడు నండూరి. మరుగుజ్జుల వంటి నాయకుల చేతిలో చిక్కి దేశం నత్తనడక నడుస్తోందని, ఈ పరిస్థితి మారాలని నండూరి ఆకాంక్ష.

కృష్ణశాస్త్రిగారి జ్ఞాపకాల గురించిన వ్యాసంతోనే అక్షరయాత్ర గమ్యాన్ని చేరుతుంది. యాత్ర ముగిసినా నండూరి మెరుపులు, మనల్ని వీడివెళ్ళవు.

నండూరి జర్నలిస్ట్ కెరీర్ అంతా ఒక ఎత్తు కాగా ఈ వ్యాస సంకలనం ఒక్కటే మరో ఎత్తు. వ్యాసాన్ని మొదలుపెట్టే విధానం, ఎత్తుగడ, మలుపులు, ముగింపు వీటన్నింటిలోనూ నండూరి రచనా నైపుణ్యం కనిపిస్తుంది. వైవిధ్య భరితమైన అంశాలను తీసుకొని ఇంత సమాచారాన్ని చక్కగా, చిక్కగా అందించిన వ్యాస రచనాశిల్పి నండూరి. అక్షరయాత్ర ద్వారా నండూరి తన అక్షరశక్తిని చూపించారు. ఈ వ్యాస సంకలనం అందరినీ ఆనందింపచేస్తుంది. ఇది ఈ రచయిత హామీ!

## వివరణలు:

1. మిల్టన్ తన కావ్యం పారడైజ్ లాస్ట్‌లో ఇలా పేర్కొన్నాడు-

I thence
*Invoke thy aid to my adventroves song*
*Thet with ni middle flight intends to soar*
*Sbove th' Aorian mount, while it persues*
*Things unattenrpted yet in prose or Rime.* (Book One - 12-16)

సామినేని ముద్దు నరసింహనాయుడు, పరవస్తు వేంకట రంగాచార్యులు, జియ్యరుసూరి మొదలైనవారు తెలుగులో వ్యాస ప్రక్రియను ప్రారంభించిన వారని విమర్శకులు అంటారు.

3. The concise cambridge History of English literature Writes "They were complementary writers. steal was moze more effective. Together they succeeded because they were the voice of a new and civilied urban life". ఇంగ్లీష్ సాహిత్యంలో ఎడిసన్ స్టీల్ తమ వ్యాసాల ద్వారా ఎంతో చైతన్యాన్ని కలిగించేవారు. 'స్పెక్టేటర్' పత్రికలోని వీరి వ్యాసాలు ఎందరో రచయితలకు మార్గదర్శకత్వం వహించాయి. పానుగంటి (1865-1940) తన వ్యాసాలను ఆంధ్రపత్రికలో ప్రచురించారు.
4. న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యున్ పత్రికవారు 1952లో జరిపిన ప్రపంచ కథానికల పోటీలో పాలగుమ్మి పద్మరాజు కథ 'గాలివాన'కు బహుమతి లభించింది. ఏ కథకూ మెజారిటీ ఓట్లు రానందున నిర్వాహకులు బహుమతి మొత్తాన్ని (5,000 డాలర్లు) అయిదు కథలకు పంచారు.
5. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులో వెల్లివిరిసిన మరో ప్రక్రియ జీవిత చరిత్ర. దీన్ని 'బయోగ్రఫీ'గా వ్యవహరిస్తారు. కందుకూరి విక్టోరియా రాణి, జీసస్ మొదలైన జీవిత చరిత్రలు రాసారు. చిలకమర్తి వారు గౌతమబుద్ధుడు, గురునానక్, గురుగోవిందసింగ్ మొదలైన వారి జీవిత చరిత్రలను రచించారు.
6. సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత జాఁ పాల్ సార్త్రీ నాటకం ఆధారంగా ఈ సినిమా తీసారు.
7. వేస్ట్‌ల్యాండ్ కవితాసంపుటికి ఎలియట్ స్వయంగా కూర్చిన నోట్సులో ఇలా పేర్కొన్నాడు -

   *"Datta Dayadhvam, Damayata"* (Give, sympathise, contsol). The fable of the meaning of the thundes is found in the Brihadaranyaka upanishad.
8. స్టీఫెన్‌లీకాక్ (1869-1944) ఆంగ్లో కెనడియన్ పొలిటికల్ ఎకానమిస్ట్. సాధారణమైన అంశాలను చక్కని ఇతివృత్తాలుగా మలచటంలో లీకాక్‌ది అందెవేసిన చేయి. విత్ ది ఫోటోగ్రాఫర్, మై లాస్ట్ డాలర్ లాంటి రచనల్లో హాస్యం వెల్లివిరిసింది.

# ఓల్గా

పోపూరి లలితకుమారి గుంటూరులో 1950లో జన్మించారు. వీరి జననీ జనకులు పోపూరి వెంకటసుబ్బమ్మ, సుబ్బారావు. మొదట్లో అధ్యాపక వృత్తి చేపట్టి పలువురు విద్యార్థులకు విద్యాబుద్ధులు నేర్పారు. తర్వాత కవితా క్షేత్రంలో కాలిడి మంచి కవయిత్రి అని పేరుపొందారు. రష్యానది ఓల్గాను తనపేరుగా చేసుకున్నారు. అనేక ప్రక్రియల్లో రచనలు చేసి తన సాహితీ పరిధిని విస్తృతం చేసుకున్నారు. పైగంబర కవుల్లో ఒకరుగా సాహితీ ప్రియులకి పరిచయమయ్యారు.

స్వేచ్ఛ నవల తొలిసారిగా చతురలో ప్రచురింపబడి ఆంధ్రప్రదేశ్‌లోని పలువురు మేధావుల్ని ఆకర్షించింది. ఓల్గా పేరు అందరికీ తెలిసింది. సహజ, కన్నీటి కెరటాల మానవి, ఆకాశంలో సగం మొదలైన రచనల ద్వారా ఆమె తన అభిప్రాయాలను వెల్లడించారు. వర్తమాన స్త్రీవాద రచయిత్రులలో ఒక ప్రత్యేకతని సాధించారు.

సాహిత్యం ద్వారా జీవితాన్ని విశ్లేషించటం, విషయాల్ని వివరించటం వీలవుతుందని ఓల్గా తన రచనల్లో నిరూపించారు. స్వేచ్ఛ నవలలో జీవన సార్థకతని అన్వేషించారు. వ్యక్తిగా మనుగడ సాగించటానికి స్త్రీకి గుదిబండలుగా కుటుంబం ఉంటోందని తన నవలలో ఆమె సూచించారు. ఒక మామూలు ఆడపిల్ల మానసికంగా ఎదుగుతూ సమాజనీతిని, ద్వంద్వ ప్రమాణాలను అర్థం చేసుకొని తనను తాను నిరూపించుకోవాలని పడిన తాపత్రయం అర్థం చేసుకోవాలి.

చదివించే గుణం వీరి రచనల్లో అధికం. సరళమైన శైలితో, చక్కని ఉదాహరణలతో సాగే స్వేచ్ఛ నవల వర్తమాన స్త్రీవాద సాహిత్యంలో చాలా ప్రసిద్ధికెక్కింది. వీరి 'రాజకీయకథలు' కూడా చాలా పేరు పొందాయి.

అస్మిత అనే సంస్థ ద్వారా స్త్రీవాద ఉద్యమానికి తనవంతు సేవ అందిస్తూ స్త్రీ సమస్యల పరిష్కారానికి తన పరిధిలో పనిచేస్తున్నారు. అనేక సామాజిక కార్యక్రమాలకు మద్దతునిస్తూ, సమాజ వివక్షకి వ్యతిరేకంగా ప్రజలను సమీకరిస్తూ జీవితం అర్థాన్ని, ప్రయోజనాన్ని సాధించారు.

వామపక్ష భావాలు, స్త్రీవాద ధోరణులు వీరి రచనల్లో కనిపిస్తాయి. ఉద్యమం పట్ల అంకితభావం, నమ్మకం ఉండాలని వీరి అభిప్రాయం. వీరి కవిత్వం కూడా భావావేశానికి, భావ వ్యక్తీకరణకి చాలా పేరు పొందింది.

ఓల్గా తన రచనల ద్వారా తెలుగుసాహితీ సేవ చేస్తున్నారు. వీరి రచనలు ఆధునిక తెలుగుసాహిత్యంలో ఎంతో ప్రభావానికి కారణమయ్యాయి.

# 32. స్వేచ్ఛ - స్త్రీవాద భావాలు, అభిప్రాయాలు

స్త్రీవాద ధోరణిని ప్రచారం చేయటంలో స్వేచ్ఛ నవల చాలా పేరుపొందింది. ఆడ మగ ఇరువురూ సమానమేనని సమాజంలో ఇద్దరికీ సమాన హోదా, అవకాశాలు ఉండాలని స్త్రీవాదం చెపుతుంది. సమాజంలోని అసమానతల కారణంగా స్త్రీలు ఇబ్బందులు పడటాన్ని గర్హిస్తూ, కుటుంబ వ్యవస్థలోని లోపాల్ని వివరిస్తూ స్త్రీవాదులు రచనలు చేస్తున్నారు. అయితే సమాజంలోని కట్టుబాట్లు తమ అభివృద్ధికి ఆటంకమని గ్రహించి సమాజం నిర్దేశించిన నిర్దిష్ట 'స్త్రీ' నమూనాలో ఇమడలేక జీవితంలో స్వేచ్ఛకోసం పరితపించే కొందరు స్త్రీలు ఎప్పుడూ ఉంటారు. జీవితాన్ని సరిగా అర్థం చేసుకోగల నేర్పు ఉండి శక్తియుక్తులతో జీవిత గమనాన్ని తామే నిర్ణయించుకునే చైతన్యం పొందాలని వారు భావించవచ్చు. ఈ అంశాన్ని ఇతివృత్తంగా తీసుకొని రాసిన స్వేచ్ఛ నవల మన కాలంలో ఎంతో చర్చకి, వివాదానికి దారితీసింది.

వ్యక్తిగత విషయాలుగా మనం భావించే వాటిని సాహిత్యంలో వస్తువుగా తీసుకొని వాటి గురించి సంపూర్ణంగా చర్చించటం ఆధునిక సాహిత్యంలో కొత్త విషయమేమీ కాదు. అయితే స్వేచ్ఛ నవల చర్చించిన విధానం, రేకెత్తించే ఆలోచనలు చాలా నవీనమైనవి. స్త్రీ జీవితాన్ని ఒక రంగుటద్దం నుంచి చూడటం అలవాటైన వ్యక్తులకి వాస్తవిక పరిస్థితులని అంచనావేయటం, విషయాన్ని అర్థం చేసుకోవటం ఎలానో చూపించిన కారణంగా స్వేచ్ఛ ఆలోచించే వారందరినీ తీవ్రంగా ప్రభావం చేసింది.

మన అవసరాలకు, ఉనికికి అత్యవసరమైన విషయాలను మనం గుర్తించటమే స్వేచ్ఛ అనుకుంటే దీన్ని సాధించుకోవటం ప్రతి ఒక్కరి జన్మహక్కు అని తెలుస్తుంది. సంప్రదాయం మొదటి నుంచి స్త్రీలకు ఎన్నో విషయాలను నూరిపోస్తూ ఆమె ఎలా ప్రవర్తించాలో, కూడదో నిర్దేశిస్తూ వస్తోంది. వీటన్నింటివల్లా స్త్రీలు ఒక విధానంలో మాత్రమే ఆలోచించేలా, సమాజం తనను ఎలా ఉండాలని ఆశిస్తోందో 'అలా' మాత్రమే ఉండటం జరుగుతుంది. స్త్రీ హక్కులు అనగానే బాధ్యత వద్దా అనటం, మానవత్వం అనగానే ఇప్పుడు లేదా అనటం, స్వేచ్ఛ అనగానే కుటుంబం మాటేమిటి అనటం రివాజు. లింగవివక్షని వ్యతిరేకిస్తూ ఉద్యమాలు చేయటాన్ని బరితెగించటం అంటున్నారు.(1) హక్కులు, బాధ్యతలు కలిసే ఉంటాయని విద్యాధికులైన స్త్రీలకు తెలుసు. బాధ్యతల గుదిబండలే స్త్రీకి ఇంతకాలంగా తన హక్కులు తనకే తెలీకుండా ఉండటానికి కారణమవుతున్నాయి. బాధ్యతలు హక్కులు స్త్రీలకీ పురుషులకీ ఉంటాయి, అలా ఉండాలి కూడా. అయితే స్త్రీలకి బాధ్యతలు పురుషులకి హక్కులు ఉన్న ప్రస్తుత వ్యవస్థలోని లోపాల్ని గుర్తెరగాలి. సమానత్వం స్త్రీలకి ఎంత ఉందో కుటుంబ వ్యవస్థను పరిశీలిస్తే తెలుస్తుంది. ఒక వ్యవస్థలో తాము చిరస్థాయిగా కొనసాగిస్తూ వచ్చిన వివిధ విషయాలను స్త్రీలు అర్థం చేసుకున్నారు. మాతృత్వం, సంతానం మొదలైన బాధ్యతలు స్త్రీలు కావాలని కోరుకున్నవి కావు. ఈ ముళ్ళకిరీటాలని కుటుంబ వ్యవస్థే స్త్రీ నెత్తిన మోపింది. లైంగికత్వం, పునరుత్పత్తి కార్యక్రమం స్త్రీల జీవితాలను శాసించి వారి జీవితాలకు ఒక సాంస్కృతిక రూపాన్ని ఇస్తోంది. మతం, సాహిత్యం, సంప్రదాయం

ఇవన్నీ దీనికోసమే పనిచేస్తున్నాయి.[2] స్త్రీలు వారి జీవితానుభవాల ద్వారా తీవ్ర సంక్షోభానికి మానసిక ఉద్వేగానికి గురి అవుతున్నారు. వారి జీవితాలని అణచి వేస్తూ వస్తున్న వివిధ విధానాలను తెల్సుకున్నాక వాటిపై తప్పనిసరిగా ఉద్యమిస్తారు. దీన్లోనుంచే సంఘర్షణ ఏర్పడుతుంది. ఇలా సంఘర్షణకు పూనుకోవటమే వారి స్వేచ్ఛాకాంక్షకి నిదర్శనం. స్వేచ్ఛ అంటే మన జీవితాల్లోనయినా వాటి చుట్టూ ఉండే సమాజం లోనైనా వాటి చలన సూత్రాలను అన్వేషించటమనే ఆవశ్యకతను గుర్తించటం అని రచయిత్రి చెపుతారు.[3] స్వేచ్ఛ ప్రాధాన్యతను తెల్సుకున్నవారు ఇతరులకీ ఆ స్వేచ్ఛ అవసరమని తప్పక తెల్సుకుంటారు.

ఒక సాధారణ ఆడపిల్ల చిన్ననాటినుంచీ తనను కట్టిపడవేస్తున్న అభిప్రాయాలను, ఆచారాలను, విధానాలను తెల్సుకుని జీవిత ప్రహేళికను సాధించాలని ఆరాటపడటాన్ని ఈ నవలలో రచయిత్రి చిత్రించారు. కుటుంబం తనను ఎంత కట్టడి చేస్తోందో చూసి దాన్నుంచి బయటికి వచ్చి తనను తాను నిరూపించుకోవటానికి స్త్రీ చేసే ప్రయత్నాలను ప్రతీకాత్మకంగా రచయిత్రి తన కథలో చూపించారు. స్త్రీవాద ఉద్యమాలు విజయవంతం అవుతాయని కథానాయకురాలి పాత్ర ద్వారా చిత్రించారు. ఒక వ్యక్తిగా కాక ఉద్యమశక్తిగా తన పాత్రను నిర్మించిన రచయిత్రి ఆమె సంక్షోభ దశ దాటి సంఘర్షణలో ఆనందాన్ని పొందగలిగే క్రమాన్ని చూపించారు. ఆ క్రమం నిజానికి వర్తమాన కాలంలోని స్త్రీ ఉద్యమాల నేపథ్యాన్ని, ప్రభావాన్ని వివరించేది. వివిధ వ్యవస్థల తీరుతెన్నులని కూడా రచయిత్రి అద్భుతంగా విశ్లేషించారు. లింగవివక్షని కొనసాగించే శక్తులను వాటి స్వరూప స్వభావాల్ని కూడా కొన్ని పాత్రల ద్వారా కళ్ళముందు నిలిపారు.

స్త్రీవాద కవిత్వానికి స్త్రీలు తమ సమస్యలని వ్యక్తిగతమైనవిగా కాక సామాజిక సమస్యలుగా అన్వయించుకోవటం ఈ వ్యక్తిగతమైనది రాజకీయమైనదని తెల్సుకొని దానికి ప్రతిగా ఉద్యమించటం మొదలైనవి ప్రేరణనిచ్చే అంశాలు. స్త్రీల అస్తిత్వానికి నూతన అర్థాన్నిచ్చే విధానాలని స్త్రీవాదం ఆహ్వానిస్తుంది. పితృస్వామ్య వ్యవస్థ మూలాలను విశ్లేషించటం, సమాజంలో స్త్రీ స్థానాన్ని సరిగా అంచనావేయటం, స్త్రీల సమస్యలకు రాజకీయాలకు ఉన్న సంబంధాన్ని బయటపెట్టడం స్త్రీవాద రచనల్లో కనిపించే ధోరణి. 'స్వేచ్ఛ' నవలను ఈ ప్రాతిపదికగా పరిశీలిస్తే అది సాధించిన విజయాలు తెలుస్తాయి.

మధ్యతరగతి కుటుంబానికి చెందిన అరుణ ఈ నవలలో నాయిక. సాధారణంగా ఆడపిల్లలంటే ఉండే చిన్నచూపు, ప్రతిమాటకు అదుపులో పెట్టాలని చూసే తత్వం మొదలైనవన్నీ ఈ కుటుంబాల్లో కనిపిస్తాయి. ప్రతినిత్యం అణచిపెట్టి ఉంచాలని చూసే ఈ వాతావరణాన్ని అరుణ చిన్ననాటినుంచే అసహ్యించుకుంది. అరుణ మేనత్త చిన్ననాడే భర్తను పోగొట్టుకొని తమ్ముడు జానకిరామయ్య ఇంటికి చేరుతుంది. అసూయతో ప్రవర్తిస్తూ, ప్రతిదాన్నీ విమర్శిస్తూ, ఎవరు ఆనందంగా ఉన్నా కళ్ళలో నిప్పులు పోసుకునే తత్వంతో ఆమె ఉండేది. ఆమె ఆస్తిమీద ఆశతో అందరూ ఆమెకి భయపడేవారు. ఆమె అరుణని అనవసరంగా ఆ మాట, ఈ మాట అని బాధపెడుతూ ఉండేది. స్త్రీ ఉద్యమాలకు అడ్డుతగిలే సంకుచిత స్త్రీలకు కనకమ్మ ప్రతీక. అరుణ తండ్రి, అన్నలు

పితృస్వామ్య భావజాలానికి గుర్తు. అరుణ తల్లి సీతమ్మ చాలా ఉత్తమురాలు. ఈ నవల్లో ఈమె స్త్రీవాదానికి మద్దతునిచ్చే, సానుభూతి చూపించే శక్తులకు సంకేతం.

"ఎందుకూ? చదువంట చదువు. నాకు తెలిసి చదువుకున్న ఏ ఆడదీ బాగుపడలా? సంసారాలు చేసుకునే వాళ్ళకి చదువులు అచ్చిరావు" అంటూ కనకమ్మ అరుణకి చదువు చెప్పించవద్దనే వాదించేది. ఇంట్లో వున్నంతసేపూ తన ప్రతి కదలికా అత్త రికార్డు చేస్తోందనే స్పృహ అరుణకి పెద్ద నిస్పృహ కలిగించేది. "ఈ ఇంట్లో వాళ్ళంతా నన్నూ నా పవిత్రతను కాపాడటమే లక్ష్యంగా పెట్టుకున్నారు" అంటూ స్నేహితురాలుతో చెప్పేది. కుటుంబ వ్యవస్థ, పితృస్వామ్యం స్త్రీని ఈ విధంగానే వేధిస్తుంటాయి.[4]

తండ్రి అరుణని ఎమ్మే చదివించటానికి కారణం ఇల్లు కట్టుకోవటానికి అప్పులతో సతమతమవుతున్న అతనికి ఆమె పెళ్ళిచేసే శక్తి లేదు. ఆడవాళ్ళకి విద్యాబుద్ధులు కల్పించాల్సిన అవసరాన్ని పితృస్వామ్య వ్యవస్థ అంగీకరించదు.

కథానాయికకి అరుణ అని పేరుపెట్టటమే ఆమె చివరకి వామపక్ష ఉద్యమాలవేపు ఆకర్షితురాలయి, స్త్రీవాద ఉద్యమాలని నిర్వహిస్తుందనే సూచనగా ఉంది.

కుటుంబ వాతావరణం నుంచి తప్పుకొని మొదటగా ఆర్థికంగా స్వతంత్రంగా నిలబడాలని అరుణ ఆశిస్తుంది. పెళ్ళి చేసుకుంటే తను స్వేచ్ఛగా బ్రతకగలనని భావిస్తుంది. ప్రేమించిన ప్రకాశంతో పెళ్ళి చేసుకున్న తర్వాత కూడా తనకు తానుగా నిలబడాలని, డబ్బుల కోసం భర్త మీదనైనా సరే ఆధారపడకూడదని అనుకుంటుంది. ప్రకాశం పెళ్ళికి తొందరపెట్టినా, మొదట ఉద్యోగం సంపాదించాకే పెళ్ళి అంటుంది.

అరుణ స్నేహితురాలు ఉమ. నవలలో ఈ పాత్ర స్త్రీవాద ఉద్యమాల మరో పార్శ్వంగానూ, అరుణ స్వేచ్ఛాకాంక్షకు ప్రతిరూపంగాను కనిపిస్తుంది. "నువ్వనుకునే స్వేచ్ఛ చాలా తక్కువ మందికి ఉంటుంది. కానీ, పెళ్ళయితే ఆ కాస్త స్వేచ్ఛా పోతుందేమో. మీ అమ్మా, నాన్నా, వదినా, అత్త అందరి పాత్రల్ని ప్రకాశం ఒక్కడే నిర్వహిస్తాడేమో" అని ఉమ అరుణతో అంటుంది. అరుణ పెళ్ళి చేసుకుంటే స్వేచ్ఛ పోతుందేమోనని భావిస్తుంది. ఉమ తన జీవితాన్ని కావాలని ఒంటరిగా ఉండటానికి నిశ్చయించుకుంటుంది. తర్వాత కాలంలో ఆమె తనకు పరిచయం అయిన మరో లెక్చరర్‌తో కలిసి ఉంటుంది. పెళ్ళి అనేది లేకుండా ఒకరికి ఒకరు తోడుగా ఉంటూ నచ్చినపుడు కలుస్తూ జీవిస్తూ ఉంటారు. స్త్రీలలో ఒక వర్గం తీసుకున్న నిర్ణయాల గురించి రచయిత్రి ఈ పాత్ర ద్వారా వివరించారు.

తనకి ఇష్టం వచ్చిన రీతిలో బ్రతుకుదామని నిశ్చయించుకున్న అరుణ తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవటానికి ప్రయత్నించింది. చిన్నతనం నుంచీ ఒకరి అదుపాజ్ఞల్లో బ్రతుకుతూ వచ్చిన ఆమెకి పెళ్ళి చేసుకుని స్వేచ్ఛగా జీవించవచ్చన్న భ్రమ ఏర్పడింది. అయితే పెళ్ళి తర్వాత తను ఎంత స్వేచ్ఛగా బ్రతుకుతుందో ఆమెకి తెలీదు. మొదట్లోనే ప్రకాశంతో మాట్లాడుతూ "పెళ్ళయ్యాక ఆడదాని ప్రేమ ఆవిడ చేసే సేవల్లో కనపడుతుంది మగవాళ్ళకి.... క్రమంగా నేనో వ్యక్తిగా కనపడటం మానేసి బాగా మన్నుతున్న వస్తువులా కనపడి" అనటం గమనిస్తే ఆమె వాస్తవాలని ఎంతగా అర్థం

చేసుకుందో తెలుస్తుంది. జీవితాన్ని పంచుకుందామనుకున్న ప్రకాశంతో కూడా అందుకే నిక్కచ్చిగా మొదట స్వేచ్ఛ తర్వాత మిగతావన్నీ అని చెపుతుంది. ఇక్కడ గమనిస్తే ఆమె అనుకునే స్వేచ్ఛ ఆమెకే అర్థం కానిదనీ, ఆ స్వేచ్ఛ ఊహాత్మకమైంది తప్ప నిజ జీవితంలో వీలుపడదనీ తెలుస్తోంది.[5]

అరుణ, ఉమల సంభాషణని సునిశితంగా పరిశీలిస్తే వర్తమాన కాలంలోని స్త్రీవాదులకి ఉన్న 'అస్పష్టత' బయటపడుతుంది.

ప్రకాశంతో పెళ్ళి తర్వాత అందరు స్త్రీలు ఆలోచించినట్లే మొదట్లో అరుణ ఆలోచిస్తుంది. తనను ఎంతో కట్టడి చేసిన కుటుంబం నుంచి తప్పించిన ప్రకాశం అంటే మనసంతా కృతజ్ఞతే ఉంటుంది. చాలా నిరాడంబరంగా ప్రకాశం ఆమెను పెళ్ళి చేసుకుంటాడు. ఎటువంటి చెడు అలవాట్లు లేవు. అయితే అతనిలోని పురుషాధిక్యతను అరుణ ఎంతమాత్రం సహించలేకపోతుంది.[6] పెనం మీద నుంచి పొయ్యిలో పడ్డట్లు అయింది అరుణ పరిస్థితి. ఒక కుటుంబం నుంచి మరో కుటుంబానికి మారినంతమాత్రాన స్వేచ్ఛ సాధించినట్లు కాదని ఆమెకు ఆలస్యంగా అర్థం అయింది.

భార్య అంటే శృంగారపరమైన కోర్కెలను తీర్చే సాధనంగానే తప్ప వ్యక్తిగా చూడటం ఎక్కువమంది వ్యక్తులకు ఇష్టం ఉండదు. ఒక సందర్భంలో "ఇలా ముద్దులు పెడుతూ వంద ఖర్చు చెయ్యి, నేను ఒద్దంటానా? చెప్పుకునే పద్ధతి నీకు తెలియాలి" అంటాడు. తన కామం తీర్చే సాధనంగానే అనాదిగా పురుషుడు స్త్రీని భావిస్తున్నాడని రచయిత్రి నేర్పుగా చిత్రించారు.

ఒక ఆదర్శం కోసం వందరూపాయలు చందా ఇచ్చే అవకాశం ఆమెకి లేదు. పత్రిక కోసం చేద్దామనుకున్న ఆ ఖర్చుని ప్రకాశం వ్యసనాలకై చేసే ఖర్చుతో పోల్చటం అరుణ మనసుని గాయపరుస్తుంది.

ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలో పనిచేసే స్త్రీల గురించి వ్యాసం రాయటానికి వెళ్ళటాన్ని ప్రకాశం అంగీకరించడు. ఆమెను కోప్పడతాడు. అరుణకి స్వేచ్ఛ లేకపోవడం తీవ్రంగా కలచివేస్తుంది.

స్త్రీని వంటింటికే పరిమితం చేసిన కుటుంబ వ్యవస్థలోని లోపాలపై అరుణపాత్ర ద్వారా ఎదురుతిరగటాన్ని రచయిత్రి చూపించారు. ఒక మామూలు గృహిణి దినచర్యను అరుణ జీవితం ద్వారా రచయిత్రి చూపించారు. వంటింట్లో ఆడదాన్ని బంధించటాన్ని మించిన క్రైం లేదని రచయిత్రి మాట.

ఉదయం లేస్తూనే అంట్లుగిన్నెలు, పాచిపని
కాఫీలు, పాపకు స్నానం, వంటా,
ఇంత తిని హడావుడిగా కాలేజీకి పరిగెత్తటం
రాగానే మళ్ళీ బట్టలుతకటం, ఇస్త్రీ
మళ్ళీ వంటా – ఇల్లు సర్దుకోవటం
గేయంగా వచనాన్ని మలచటంలో ఎంతో పరిణితి సాధించారు.

పెళ్ళయిన తర్వాత గర్భవతి అయితే అరుణ అబార్షన్ చేయించుకుందా మనుకుంటుంది. ఈ మాటలకి ప్రకాశం ఎగిరిపడతాడు. "పిల్లల్ని కంటాను. అది కాదు సమస్య. నాకు ఇప్పుడే పిల్లల్ని కనాలని లేదన్నప్పుడూ, అబార్షన్ గురించి ఆలోచించినప్పుడూ ప్రకాశం నన్ను సరిగ్గా అర్థం చేసుకోలేదన్నది నన్ను చాలా బాధించింది" అంటూ అరుణ ఉమతో చెప్పుకుంటుంది. పిల్లల్ని కనమన్నప్పుడు కనాలి. వద్దంటే వద్దు. ఇదే పురుషాధిక్య సమాజం స్త్రీలపై సాగిస్తున్న నియంత్రణ. స్త్రీ అంటే పిల్లల్ని కనే ఒక యంత్రంగా చూడటాన్ని స్త్రీవాదం నిరసిస్తోంది.

అరుణ తల్లి అవుతుంది. అరుణ అత్తగారు కమలమ్మ సంరక్షణలో పాపాయిని ఉంచి అరుణ కాలేజికి వెళ్ళేది. స్త్రీవాదం పట్ల కొంత సానుకూలంగా స్పందించే వర్గాలకు కమలమ్మ ప్రతినిధి. కమలమ్మ ఓపిక ఉన్నంతవరకూ తన వారికోసమే శ్రమపడింది. ఇటికిటికా చూసుకుంటూ ఆమె భర్త, ఆమె కట్టిన ఇల్లది. కుటుంబం కోసం ఇంతగా శ్రమించిన ఆమెను వృద్ధాప్యంలో కోడలు లీల కష్టపెడుతుంది. దీంతో ఆమె వెంటనే ప్రకాశం, అరుణల వద్దకు వస్తుంధి. "ఇంటిని అద్దంలా ఉంచుకోవాలని ఒక్క క్షణం నడుం వాల్చకుండా చాకిరి చేసేదాన్ని" అన్న కమలమ్మ మాటలు వృద్ధాప్యంలో ఆర్థికపరమైన ఇబ్బందులతో సతమతమయ్యే స్త్రీల గురించి చెపుతున్నాయి.

కాలేజీలో మీటింగ్‌వల్ల అరుణ ఆలస్యంగా వచ్చేసరికి పాపాయి ఆరోగ్యం బాగాలేదని ప్రకాశం ఆసుపత్రికి తీసుకెళ్ళి తిరిగి వస్తూ కనిపిస్తాడు. అరుణ తల్లిగా తన బాధ్యతలని విస్మరించిందని ప్రకాశం కోప్పడతాడు. పాపకి సంబంధించిన బాధ్యతలన్నింటిలోనూ తల్లిగా అరుణదే బాధ్యత అని ప్రకాశానికి స్థిరమైన అభిప్రాయం.

తోటి స్త్రీలు అరుణ నిబద్ధతనీ, అంకితభావాన్ని ఎగతాళి చేస్తుంటారు. "ప్రభావతిగారు నిజంగా గొప్ప మనిషండి. అంత చదివిందా, ఎంత వినయమో. ఇంటి దగ్గర దించిన తల యూనివర్సిటీలో డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళిన తర్వాతే ఎత్తుతుంది".... అని అరుణతో అంటూ ఉంటారు. చిన్నతనంలో మేనత్త నెమ్మదిగా నడిస్తే 'చీమనడకలంటూ', చురుగ్గా ఉంటే ఆడపిల్లకు 'నిదానం కావాలంటూ' ఆంక్షలు పెట్టినట్లే వీళ్ళూ ప్రవర్తిస్తుండటం అరుణకి బాధకలిగిస్తుంది.

అరుణ 'సంసారపక్షంగా ఉండటమే ప్రకాశానికి ఇష్టం కానీ ఆమెకు సోషల్‌లైఫ్ ఉండటం కాదు. లెక్చరర్లు పూర్తి జీతం కోసం చేస్తున్న ఆందోళనలో పాల్గొన్నప్పుడు అరుణ ఫోటో పేపర్లో వస్తుంది. దీన్ని ప్రకాశం హర్షించడు. భార్యాభర్తల మధ్య ఈ విషయంగా మాటామాటా వస్తుంది.

ప్రకాశం ఒక సందర్భంలో 'మీ వాళ్ళు నిన్నంత కట్టడిగా ఎందుకు పెంచారో నాకిప్పుడు తెలిసింది' అన్న మాటలకు అరుణ కందిరీగలు మనసుకి కుట్టినట్లుగా కమిలిపోతుంది. మొదట్లోనే ఉమ చెప్పినట్లు ప్రకాశం తన పరిధిలో ఉంచుకోవాలని చూస్తున్నాడా అని చాలా ఆలోచిస్తుంది. 'అసలు ప్రకాశానికి ఇష్టంలేని పనులు మానేస్తే' అన్న ఆలోచనని ఆమె మనసు ఒక్కసారిగా తిరుగుబాటు చేస్తుంది.

బెంగుళూరు వెళ్ళినప్పుడు ప్రకాశం ప్రేమంటే ఇదిగో ఇది అంటూ అరుణ పెదవులమీదా, కళ్ళమీదా, చెక్కిళ్ళమీదా వూపిరాడకుండా ముద్దులు పెట్టి వుక్కిరి బిక్కిరి చేస్తాడు. అరుణకి మనసులో ఏదోమూల 'యిదేనా ప్రేమంటే' అన్న ప్రశ్న మొలకెత్తక మానదు. స్త్రీ కోరుకునే ప్రేమని పురుషుడు అర్థం చేసుకోవటంలేదని రచయిత్రి చిత్రించారు. చాముండీ లోయ ఎక్కుతుంటే కనిపించిన లోయ తనలాగే వొంటరిగా నిశ్శబ్దంగా ఆలోచనల్తో వుంటుందా అని అరుణ ఆలోచిస్తుంది.

అరుణ, కేశవరావులు కలిసి ఆసక్తిగా 'వెలుగు' పేజీలు బయటికి తెస్తుంటారు. ఈ పత్రిక గురించి, అరుణ ఆశయాల గురించి ప్రకాశం అవమానకరంగా మాట్లాడటమే తప్ప ప్రోత్సాహాన్ని అందించడు. ఒక ఉత్తరంలో ఉమ ఒకరితో తనకు నచ్చినన్ని రోజులు నచ్చిన విధానంలో గడుపుతూ బ్రతకటానికి నిశ్చయించుకున్నానని రాస్తుంది. దీన్ని ప్రకాశం ఎకసెక్కం చేస్తాడు. "ఎవరిళ్ళు వాళ్ళుంచుకుని అప్పుడప్పుడు కలిసి భార్యాభర్తల్లా ఆడుతున్నారు" అన్న ప్రకాశం మాటలకు కమలమ్మ సమాధానం ఇస్తుంది. నిజానికి వీనిద్వారా రచయిత్రి తన భావాలను చెపుతున్నట్లుగా ఉంది. "కాపురం అనే పేరుతో వొకింట్లో చేరి అస్తమానం పిల్లీ యెలకల్లా కొట్లాడుకునేకంటే యెవరిళ్ళు వాళ్ళకుంటే నయమేలేరా" అంటుంది కమలమ్మ. అంతకుముందు కూడా ప్రకాశం ఉమ వాళ్ళు పెళ్ళిలేకుండా ఉంటున్నారని అన్నప్పుడు కమలమ్మ వాళ్ళు ఆ కాగితాలు కూడా ఒద్దనుకున్నారు. అంతమాత్రాన వాళ్ళు మొగుడు పెళ్ళాలు కాకపోతారా? అంటుంది. ఈ విధంగా రచయిత్రి పెళ్ళి 'మనసుల కలయిక' అని చెపుతున్నట్లుగా ఉంది.[7]

పెళ్ళి తర్వాత ప్రకాశం భార్యగా బతకాల్సిరావటం, తనకంటూ ఒక స్వతంత్రం లేకపోవటంతో అరుణకి ఏం చెయ్యాలో తోచదు. ప్రతి విషయంలోనూ "తన గార్డియన్‌కి కోపం వస్తుందేమోనని' భయపడుతూ జీవిస్తుంది. బైటి విషయాలకొచ్చేసరికి ప్రకాశం తనను కంట్రోల్ చెయ్యాలని చూస్తున్నాడని, ఏదోరకంగా తానా కంట్రోల్‌ను ఆమోదించాల్సిన పరిస్థితి వస్తోందని గ్రహించేసరికి జీవితంలో తను ఎంత ముఖ్యమైనదాన్ని పోగొట్టుకుంటోందో అరుణకి అర్థం అయింది. అయినా మనసుని చంపుకొని ప్రకాశానికి 'ఎలా చెపితే' నచ్చుతుందో అలా చెప్పటానికి సిద్ధపడుతుంది. ఇలా ఆత్మత్యాగానికి సిద్ధపడటం ఆమె వ్యక్తిత్వంలో వచ్చిన మరో మార్పు. అయితే తన జీవితాన్ని అణచివెయ్యటానికి ప్రకాశానికేం అధికారం ఉందని ఆలోచిస్తుంది. కన్నవాళ్ళకు ఆ అవకాశం ఇవ్వని తను ప్రకాశానికి ఎందుకివ్వాలని అనుకుంటుంది. ఈ విధంగా స్వేచ్ఛ ప్రాధాన్యతనీ, అనివార్యతనీ ఆకళింపుచేసుకున్న ఆమె మళ్ళీ పంజరంలో పక్షి కాదల్చుకోలేదు. దీంతో ఆమె జీవితం సంఘర్షణలో పడింది.

వద్దన్నకొద్దీ ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలోని స్త్రీలపై వ్యాసం రాయటానికి వెళ్ళినందుకు ప్రకాశం అరుణపై ధ్వజమెత్తుతాడు. చిన్నపిల్లను బెదిరించినట్లు మానెయ్యవూ అని గద్దిస్తాడు. మానెయ్యవూ అంటూ చేయి ఎత్తుతాడు కూడా. అరుణ ఈ సంఘటనతో తీవ్రంగా ఆలోచనల్లోకి వెళుతుంది. ప్రకాశం ప్రేమనే తాను ప్రేమించానని, అతన్ని కానని అనుకుంటుంది. వారిద్దరిదీ ప్రేమ కాదని భావిస్తుంది.

ఇంట్లో కాదని బయట 'ఆదర్శజీవితం'లో గడుపుదామని కేశవరావు ఇంటికి వెళితే అతను భార్యను అదీ, ఇదీ అనటం, హీనంగా చూడటం, సేవల్లో లోపం జరిగితే కొట్టటం తెల్సుకొని ఊపిరాడక గింజుకుంటుంది.

కృష్ణమూర్తి అనే విజ్ఞుడు మెహందీ స్త్రీల గురించి వ్యాసం రాద్దామని అరుణతో అంటాడు. ఎలాగో అనిపించినా అరుణ వాళ్ళని ఇంటర్వ్యూ చేయాలని నిర్ణయించుకుంటుంది. సిటీ చివర్లో ఉన్న పల్లెటూళ్ళో రేప్ అయిన స్త్రీ గురించి ఇంటర్వ్యూ చేయటానికి వెళుతుంది. ఆ రాత్రి ప్రకాశం ఆవేశంగా అరుణని ముద్దుపెట్టుకుంటుంటే అరుణకి ఎక్కడలేని నీరసం వస్తుంది. తన అయిష్టాన్ని లెక్కచేయకుండా, తాను వారించినా వినకుండా ప్రకాశం తన కోరిక తీర్చుకోటాన్ని అరుణ 'రేప్'గానే భావిస్తుంది.

ఏది ఏమైనా మెహందీకి వెళ్ళి అక్కడి పరిస్థితుల గురించి రాయాలనే అరుణ గట్టిగా చెపుతుంది. "నువ్వు ఇవ్వాళ వెళ్ళినా, ఇక ముందు మీటింగ్‌లకు వెళ్దామనే ఆలోచనతో ఉన్నా ఇక నీకు, నాకూ సంబంధం తెగిపోయినట్లేనని" ప్రకాశం అంటాడు. తన కిష్టమైన పనులు చెయ్యొద్దని శాసించే ప్రకాశంతో కలిసుండటం దేనికని అరుణ మథనపడుతుంది. రక్షణ కోసమో, పాపకోసమో ప్రకాశంతో కలిసి ఉండనవసరం లేదని అరుణ తేల్చుకుంటుంది.

మెహందీ స్త్రీలతో మాట్లాడుతూ "మీరు మేమూ అందరం ఆడవాళ్ళమే మీకు పోలీసులు మొగుళ్ళయితే మాకు మొగుళ్ళే పోలీసులు" అని అరుణ అంటుంది. ఈ మాటలు నిజానికి వివాహ వ్యవస్థలో స్త్రీల స్థానం గురించి వివరిస్తాయి.

పత్రికకు సంబంధించిన వ్యక్తులందరూ పత్రిక కోసం సంసారాన్ని పాడుచేసుకోవద్దని సలహానిస్తారు. అరుణ కోపంగా తనెంత ఆర్తిగా పత్రికకు సంబంధించిన పనులను చేస్తున్నానో అర్థం చేసుకోమని చెపుతుంది. "భర్తతో తగాదాలు వస్తే అతన్నుంచి విడిపోతే ఆడదాని జీవితమంతా పాడయినట్లేనని మీరు చెప్పినదాన్ని బట్టే మీ సంస్కారం తెలుస్తోంది" అని వాళ్ళతో అంటుంది.

ఎవరూ స్త్రీవాద ఉద్యమ స్ఫూర్తిని, ధోరణిని అర్థం చేసుకోవట్లేదని చెపుతూ లోకంపోకడ ఎలా ఉంటుందో నవల్లో రచయిత్రి చాలా వాస్తవంగా చిత్రించారు.

అరుణ, కేశవరావుతో సన్నిహితంగా ఉండటాన్ని సాటి ఆడవాళ్ళే హేళన చేస్తుంటారు. "నిన్న కేశవరావుగారు రెండు మూడు సార్లడిగారు. అరుణగారెందుకు శలవండీ అని".... అని కంపరంపుట్టేలా మాట్లాడుతుంటారు. దీనికి అరుణ కోపం తెచ్చుకునేది. తన భయమూ, తన అశాంతీ వాళ్ళకా అధికారాన్నిస్తోందని అరుణ అర్థం చేసుకుంటుంది.

మెహందీ స్త్రీలను ఇంటర్వ్యూ చేసి ఇంటికి వెళ్ళిన తర్వాత ప్రకాశం పాపను తీసుకొని గదిలోకి విసురుగా వెళ్ళిపోతాడు. జరిగిన విషయాల్లో తన తప్పేమీ లేదని అరుణ అభిప్రాయం. తనని కోల్పోతున్న విచారం ప్రకాశానికి లేనిది తనకెందుకని నిశ్చయించుకుంటుంది. తన జీవితం తనదని, ఆ జీవితాన్ని ధైర్యంగా గడపాలని ఆమె నిర్ణయించుకుంటుంది.

ఉమ బతికే విధానాన్ని కూడా అరుణ అంగీకరించదు. అది సమస్య నుంచి తప్పించుకోవటం అనిపిస్తోందిగానీ సమస్యను ఎదుర్కోవటం కాదని అభిప్రాయపడుతుంది.

అరుణ ఉమ దార్లో నడవకుండా సమాజంతో తనకు సజీవ సంబంధం కావాలని ఆరాటపడుతుంది. సమాజంతో సంబంధం లేకుండా ప్రకాశమే ప్రపంచమైతే చాలామంది మగాళ్ళకన్నా ప్రకాశమే మంచివాడని ఆమె తనకు తాను చెప్పుకుంటుంది.

స్వేచ్ఛ కోసం అరుణ ఎంతో తపనపడింది. స్త్రీ తన 'ఉనికి'ని నిలబెట్టుకోవటం కోసం ఎంత సంఘర్షణ ఎదుర్కోవాలో అరుణ పాత్రద్వారా రచయిత్రి చూపించారు.(8) జీవితం వ్యక్తి ఆదర్శాల ప్రకారం జరగదు. జీవితం మనది మాత్రమే కాదు. దీనిపై చుట్టూ ఉన్న సమాజ ప్రభావం కూడా ఉంటుంది. స్త్రీ చైతన్యాన్ని బట్టి మగాళ్ళ పెత్తనాన్ని సహిస్తుందని, వ్యక్తిత్వంతో ఉంటేగానీ వాళ్ళ పెత్తనం స్త్రీ జీవితమంతా వారి గుప్పిట్లో ఉంటుందని అర్థంకాదని అరుణ ఎంతో అవగాహనతో మాట్లాడుతుంది. తన జీవితం సంక్షోభంలో పడినా బెదిరిపోక వేర్వేరు పరిస్థితుల్లో స్త్రీలు ఏ విధంగా వారి ఐడెంటిటీ కోసం తపనపడుతున్నారో, స్రగులవుతున్నారో ఆలోచిస్తుంది. ఈ విధమైన మానసిక పరిపక్వతవల్ల రోజురోజుకీ తనలో తను స్త్రీ అని పెరుగుతున్న స్పృహని గ్రహిస్తుంది. సమాజాన్ని చూస్తున్నకొద్దీ, అనుభవాలు పొందుతున్న కొద్దీ తాను స్త్రీనని అందరూ చెబుతున్నట్లుగా తెల్సుకుంటుంది. అరుణలో సాగుతున్న ఆలోచనలు స్త్రీ ఉద్యమాల దశ - దిశలను సూచిస్తున్నాయి.

సమాజాన్ని సంపూర్ణంగా మార్చలేకపోయినా, తన చిన్నపరిధిలో తనకు చేతనైంది చేయాలని అరుణ లక్ష్యంగ పెట్టుకుంటుంది. సమాజసీమలో తనవంతు కృషిచేయటం ద్వారా తన జీవితం సార్థకమవుతోందన్న భావం, ఆ భావం కలగటమే స్వేచ్ఛ అని నొక్కి చెపుతుంది. తన బ్రతుకేదో తాను బతకటం కాదని, స్వేచ్ఛ అంటే ఒక అర్థం ఉండాలని దాన్ని అన్వేషించటమే జీవిత లక్ష్యంగా పెట్టుకుంటుంది. జీవితం అర్థాన్ని, ప్రయోజనాన్ని తెల్సుకోవటమే స్వేచ్ఛ అని చెపుతుంది. ఆడవాళ్ళ కోసం ఆడవాళ్ళు ఏమైనా చెయ్యాలని నిర్ణయించుకోవటం, ఆమె స్వేచ్ఛ ప్రాధాన్యతని, నిజమైన అర్థాన్ని తెల్సుకుందని వివరిస్తోంది.

ఈ నవల ప్రయోజనం ఏమిటీ, సూచించిన పరిష్కారాలు ఏమిటీ అని ప్రశ్నించటం అనవసరం అని రచయిత్రి ముందుమాటలో చెప్పారు. అయితే వ్యక్తిగత విషయంగా కాకుండా సామాజిక సమస్యలుగా నవల్లో చర్చించి సమిష్టి పోరాటాల ద్వారానే స్త్రీలు సమాజంలో తమ పాత్రను పునఃనిర్వచించగలరని చెప్పటం పరిష్కారమార్గమే అవుతోంది.(9) స్త్రీవాద ఉద్యమానికి మేధోపరమైన ఊతం అందించటంలో 'స్వేచ్ఛ' విజయం సాధించింది. సమాజంలోని విభిన్న శక్తుల విషయాల్ని అర్థం చేసుకొని చైతన్యవంతంగా మారటానికి, సమానత్వ దిశగా నడవటానికి ఇది దోహదం చేస్తుంది.

నిస్సందేహంగా 'స్వేచ్ఛ' నవల స్త్రీవాద ధోరణులని శాస్త్రీయంగా విశ్లేషించిందనే చెప్పుకోవచ్చు. ఓల్గా వర్ధమాన స్త్రీవాద రచయిత్రులలో మంచి పేరు ప్రఖ్యాతులని సాధించారు.

## వివరణలు:

1. రచయిత్రి ఈ నవల్లో లింగ వివక్ష గురించి ప్రధానంగా చర్చించారు. అబార్షన్ చేయించుకుంటానంటే వీలుకాదని ప్రకాశం తన అధికారాన్ని చూపించ పోవటం ఈ చర్చకి దారితీసిన నవలా సంఘటన.
2. ప్రాచీన సాహిత్యమంతా స్త్రీని కట్టడి చేయటానికి ఉద్దేశించినదేనని స్త్రీవాదం భావిస్తోంది. మతగ్రంథాలు స్త్రీ పురుషులకు వేర్వేరు నీతులను ప్రబోధిస్తున్నాయి. స్త్రీ నడతని ఇవి నిర్దేశిస్తున్నాయి.
3. "Freedom is the recognization of necessity" అని ఎంగెల్స్ అంటాడు.
4. పితృస్వామ్య సమాజం తరతరాలుగా స్త్రీలమీద కన్యాత్వం, భార్యాత్వం, మాతృత్వం మొదలైన బాధ్యతలని మోపింది. స్త్రీ జీవితమంతా పితృస్వామ్య భావజాలానికి అనుగుణంగా నడిచేలా ఆమెకు ఒక సాంస్కృతిక రూపాన్ని ఇచ్చారు. వివిధ ప్రతీకల ద్వారా లైంగికత్వం, పునరుత్పత్తి కార్యక్రమాలు ఆమె జీవితానికి అర్థం అన్నట్లుగా చిత్రిస్తున్నారు.
5. ముందుమాటలో రచయిత్రి మననుండి మనకు స్వేచ్ఛ, మన ఉనికికి అత్యవసరమైన విషయాలను మనం గుర్తించటమే స్వేచ్ఛ అంటూ దాన్ని సాధించటమే చాలా కష్టమని పేర్కొన్నారు. అయితే మానవ సమూహాలు ఒక వ్యవస్థగా కుటుంబం, సంఘం, మతం, ప్రభుత్వం లేదా ఏదైనా సంస్థ - ఏర్పడితేనే సమిష్టి ప్రయోజనాలు వీలవుతాయి. ప్రతి వ్యక్తీ తన స్వేచ్ఛలో కొంత వ్యవస్థకి దత్తతచేసి బదులుగా దాన్నుంచి భద్రతను పొందుతాడు మరి పరిపూర్ణ స్వేచ్ఛ ఎలా వీలవుతుంది.?
6. ప్రకాశం - అరుణ అబార్షన్ చేయించుకుంటానంటే అడ్డుపడటం, ఆ తర్వాత ఆమెను పత్రిక పనులమీద తిరగవద్దని శాసించటం పురుషాధిక్యతగా రచయిత్రి చిత్రించారు.

   ఈ కథలో ఉమ "నువ్వు ఆ విషయంలో రాజీపడి మళ్ళీ ఇదంతా మనసులో పెట్టుకోవటం దేనికి? అతన్తో వివరంగా మాట్లాడలేదా?" అంటుంది. మరో సందర్భంలో "ఒకరి స్వేచ్ఛను యింకొకరు గౌరవించుకుంటూ ఆదర్శంగా బతకటం - నిజంగా యీ ఊహ చాలా అద్భుతంగా వుంటుంది. కానీ జీవితంలో అది కుదరదు" అంటుంది.

   అరుణ, ఉమ మొదలైన పాత్రలన్నీ రచయిత్రి మానసిక సంఘర్షణలోంచి జన్మించినవే. ఉమ వద్దకే అరుణ వెళ్ళటం, ఆమెకి తన నిర్ణయాలు అభిప్రాయాలు వివరించటం చూస్తే రచయిత్రి 'పురుషాధిక్యత'ను సరిగా చిత్రించలేకపోయినట్లు అనిపిస్తుంది.

7. నవల్లో ఎక్కడా కూడా ప్రకాశంతో తన స్వేచ్ఛా కాంక్ష గురించి పెళ్ళికి ముందుగానీ, తర్వాతగానీ అరుణ చర్చించినట్లు లేదు. తన ఇంట్లో స్వేచ్ఛలేదని అనుకున్నప్పుడు అరుణ ప్రకాశంతో పెళ్ళి తర్వాత స్వేచ్ఛవస్తుందని ఎలా భావించిందో అర్థం కావటం లేదు. అరుణ మొదట్లోనే "మీ ఇంట్లో వాళ్ళు మరికాస్త ఎక్కువ కట్టడి చేస్తారుగాని యించుమించు అందరిళ్ళలోనూ కట్టడి అనేది అలాగే వుంటోంది" అంటుంది. ఈ వాస్తవాల్ని అరుణ పరిగణించకపోవటం గమనార్హం.

8. నిజానికి ఈ సంఘర్షణ అరుణ కోరి తెచ్చుకున్నదేమో అని కూడా కొందరికి అనిపించవచ్చు. మొదట్నుంచి తనకున్న స్వేచ్ఛాకాంక్షను గ్రహించి స్నేహితురాలి బాటలో నడవవచ్చు. 'స్వేచ్ఛాకాంక్ష' పేరుతో ప్రకాశం జీవితాన్ని, పాప జీవితాన్ని కూడా సంఘర్షణలోకి, సంక్షోభంలోకి నెట్టివేయటం ఎందుకు?

9. సైమన్ డి బావా తన గ్రంథం 'సెకండ్ సెక్స్'లో "మన జీవితంలోని వివిధ పరిస్థితుల గురించిన సరైన అవగాహన నుంచే జీవించే శక్తిని, మన జీవన విధానానికి తగిన హేతువులను సంపాదించుకోవాలి" అని సూచించారు. ఈ నవల దీన్ని సాధించుకోవటానికి ఉపకరిస్తుంది.

# బిరుదురాజు రామరాజు

బిరుదురాజు రామరాజు వరంగల్‌జిల్లాలో 1925లో జన్మించారు. సాహిత్యం, చరిత్ర, సంస్కృతి వీరికి అభిమానాంశాలు. సురవరం ప్రతాపరెడ్డిగారి ప్రోత్సాహంతో తెలుగు జానపదగేయాలు సేకరించి వాటిపై పరిశోధన చేసారు. తెలంగాణాలో పర్యటించి ఎన్నో ప్రయాసలకు ఓర్చి జానపద సంప్రదాయాలకు నెలవైన తెలుగు జానపదగేయాలను లిఖిత రూపంలో ముందు తరాల వారికోసం భద్రపర్చారు. వీరి కృషి ఫలితంగా ఎన్నో అపురూపగేయాలు అందరికీ అందుబాటులోకి వచ్చాయి. ఇవి మహోన్నతమైన తెలుగు సంస్కృతీ సంప్రదాయాలకు ఆలవాలం. వీటి ద్వారా జానపదుల ఆచారవ్యవహారాలు తెలుస్తాయి. వారి జీవన విధానం తెలుస్తుంది. ఈ గేయాలలో పౌరాణికములు, మతసంబంధములు, చారిత్రకములు, పారమార్థికములు లాంటి ఎన్నో అంశాలు ఉన్నాయి.

ఆదిమమానవులు సుఖదుఃఖాలను అనుభవించినపుడు లయాన్వితమైన గేయాలు జన్మించాయి. ఇవి ఒక తరం నుంచి మరో తరానికి ప్రయాణిస్తాయి. ఈ గేయాలు మౌఖిక సంప్రదాయానికి మంచి ఉదాహరణ. తరాలు గడిచినా ఈ గేయాలు నిల్చి ఉన్నాయంటే వీటిలోని సంగీతం, మాధుర్యం, ప్రదర్శనా సౌలభ్యం కారణం. కొందరు ప్రాచీన కవులు కూడా దేశావృత్తాలను కావ్యాల్లో ప్రయోగించారు. మన జాతి సంస్కృతీ సంప్రదాయాలను జానపద గేయాలు వెల్లడిస్తున్నాయి.

రామరాజుగారు సంస్కృతాంధ్ర భాషలలోనూ, ఉర్దూలోనూ మంచి అభినివేశం కలవారు. అనువాదం చేయటం వీరికి దోసిలి నుంచి నీరు త్రాగినంత సులభం. గురుగోవిందసింగు చరిత్ర, ప్రేమ్‌చంద్ మొదలైన రచనలు వీరి అనువాద విధానాన్ని వివరిస్తున్నాయి. తెలుగు అధ్యాపకునిగా సుదీర్ఘ అనుభవం గడించిన రామరాజు ఎన్నో ప్రాచీన గ్రంథాలకు పరిష్కర్తగా పనిచేసారు. వీరు శ్రీనాథుని గ్రంథం "శ్రీ శివరాత్రి మహాత్మ్యము" పరిష్కరించారు. తెలంగాణా పిల్లల పాటలు, త్రివేణి, తెలంగాణా పల్లెపాటలు వీరి ముఖ్య రచనలు.

"తెలుగు జానపదగేయ సాహిత్యము" వీరి బృహత్ రచన. పరిశోధనాత్మకమైన రచనల్లో ఇది చెప్పుకోదగ్గ గ్రంథం. తెలుగులో ఇంత వివరణాత్మకంగా, విశ్లేషణాత్మకంగా జానపదగేయాలపై ఎవరూ దృష్టిసారించి రచన చేయలేదు. రామరాజుగారి కృషి చాలా ప్రశంసనీయమైంది. జానపద సాహిత్యము శిష్టసాహిత్యమునకు పునాదిలాంటిది. దీనికోసం బిరుదురాజు రామరాజుగారు వెచ్చించిన శ్రమ వెలకట్టలేనిది. ఆయన తెలుగు జానపద సాహిత్యానికి చేసిన సేవ చిరస్మరణీయమైంది.

## 33. త్రివేణి - జానపద గేయాల్లోని విశేషాలు

త్రివేణి అంటే మూడునదులు సంగమించే అపూర్వ ఘట్టం. ఈ త్రివేణి సంకలనం కూడా తెలంగాణ, ఆంధ్ర, రాయలసీమలకు చెందిన అపూర్వ జానపదగేయాల సంగమం. అక్షరజ్ఞానం లేకపోయినా అమాయక ప్రజలు ఆనందంగా పాడుకునే ఈ పాటల్లో ఎన్నో విషయాలు వస్తాయి. భావావేశాల్ని పల్లెజనం ఆవిష్కరించిన విధానం దాన్ని ఈనాటివరకూ ప్రాణప్రదంగా చూసుకుంటూ వచ్చిన వైనం గొప్పది. హాలుని గాధాసప్తశతిలో, పాల్కురికి సోమనాథుని రచనల్లో, ఆదికవి నన్నయ రచనలో, శ్రీనాథుని కావ్యాలలో వీటి గురించిన ప్రస్తావన ఉంది. లభ్యమవుతున్న ఆధారాలను పట్టి చూస్తే ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తెలుగు జానపద గేయాలను సేకరించటాన్ని తొలిసారిగా ప్రారంభించిన వ్యక్తి.(1) వేంకట పార్వతీశకవులు, టేకుమళ్ళ కామేశ్వరరావుగారు, ఇల్లిందల సరస్వతీదేవి, నేదునూరి గంగాధరం, ఎల్లోరా, బిరుదురాజు రామరాజులాంటి వారు జానపద గేయాలను ప్రచురించారు.

రాసినవారు ఎవరో సాధారణంగా తెలీకపోవటం, నిర్ణీతమైన స్వరూపం లేకపోవటం, ఏ సందర్భంలో ఏ కాలంలో మొదలైందో తెలీకపోవటం, మౌఖికంగా ప్రచారం అవటం, సహజమైన శైలితో స్వచ్ఛంగా ఉండటం, భావాత్మకంగానూ అశువుగానూ ఉండటం, లయబద్ధంగా తాళానికి అనుగుణంగా సాగటం, జనసామాన్య ఆశయాలను వ్యక్తపరచటం మొదలైనవన్నీ జానపదగేయాల మౌలిక లక్షణాలు.

త్రివేణి సంకలనంలోని గేయాలను పిల్లల పాటలు, వేడుక పాటలు, స్త్రీల పాటలు, శ్రామికుల పాటలు, వలపు పాటలు, హాస్యపు పాటలు, కన్నీటి పాటలు, పారమార్థికాలు, ప్రకీర్ణాలు అనే తొమ్మిది వర్గాలుగా విభజించారు. ఈ గేయాలు నవరసాలను వెల్లడిస్తున్నాయి. ఈ నవశీర్షికలలో 243 పాటల తోరణం ఉంది. ఇవి తెలుగువారి సుసంపన్నమైన సంస్కృతిని ప్రతిబింబిస్తున్నాయి. ఈ సంకలనంలోని తెలంగాణా పాటలను రామరాజుగారే అందించగా కోస్త ప్రాంతాల గేయాలను శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు, నేదునూరి గంగాధరంగారు సమకూర్చారు. రాయలసీమ ప్రాంతపు గీతాలను ఆచార్య తూమాటి దొణప్పగారు సంకలనం చేసారు.

పిల్లల పాటలలో 22 జీవచైతన్యం నిండిన పాటలు ఉన్నాయి. కొన్ని పిల్లల కోసం పెద్దలు రాసినవి కాగా మరికొన్ని వారే స్వయంగా పాట కట్టినవి. వ్యక్తి తొలిదశల్లో సమాజ సభ్యునిగా నేర్చుకునే వివిధ విషయాలు ఈ గేయాల రూపంలో వెలువడ్డాయి. గ్రామాల్లోని పిల్లలు ఈ మౌఖిక శిక్షణ ద్వారా జీవితానికి ఉపయోగపడే విలువైన పాఠాలను నేర్చుకుంటారు. లెక్కలు కట్టటం, వారాలపేర్లు, అవయవాల పేర్లు, ఆటపాటలకు చెందిన అనేక విషయాలను సులువుగా నేర్చుకుంటారు. వినోదాన్ని అందించే పిట్టకథలు కూడా వీటిలో ఉన్నాయి. బాలబాలికలలో ప్రశ్నించే సామర్థ్యాన్ని, ధారణాశక్తిని, పదశక్తిని గేయాలు పెంపొందిస్తాయి. వీటిని ఇంగ్లీష్‌లో అర్థములేని పాటలు (Nonsense Rhyms) అని పిలుస్తారు కూడా!(2)

'ఆదివారంనాడు అరటి మొలచింది...' అనే గేయం పిల్లలకు వారాల పేర్లను నేర్పిస్తుంది. దీన్ని అనుసరిస్తూ సాగే ఈ క్రింది గేయం గోదావరి జిల్లాల్లో చాలా ప్రాచుర్యంలో ఉండేది.

"ఆదివారమునాడు అమ్మన్నబుట్టే
సోమవారమునాడు చురుకుగా నడిచె
మంగళవారమునాడు మాటలు నేర్చె"

భాగవతగాథ తెలుగునాట ఇంటింటా ప్రాచుర్యంలో ఉంది. తమ బిడ్డలను ఆ చిన్నికృష్ణునిగా చేసి ముద్దుచేయటం మన వాళ్ళకు చాలా ఇష్టం. వాస్తవానికి బిడ్డ దీనిద్వారా భద్రతా భావాన్ని, ప్రేమానురాగాల్ని పొందుతాడు. ఇంట్లో చిన్నపిల్లలను ఇలా చేయటం చూసి కొంచెం పెద్దపిల్లలు పిల్లలతో ఏ విధంగా ప్రవర్తించాలో నేర్చుకుంటారు. ప్రకృతిలోని అందమైన వస్తువులతో తమ పిల్లల అవయవాలను పోల్చి సంబరపడతారు. ఈ గేయం చూడండి-

"చిన్ని నా రుక్మిణీ చిరుమొగము చూసి
సిగ్గుపడి చంద్రుడు శిరసువంచేను."

మొదటి నుంచి పిల్లలకు పని విలువను నేర్పటం మన సంప్రదాయం. దేముని పూజ అనేది పిల్లలలో క్రమశిక్షణకు ఉద్దేశించింది. చిన్నతనం నుంచే అహంకార పడకుండా ఎవరో మనకన్నా చాలా గొప్పవాడు, మంచివాడు ఉన్నాడని చెప్పటం మంచిదని మనవాళ్ళు అనుకుంటారు.

"పొద్దున్నె పొద్దున్నె లేద్దామా
దేవుడి గుళ్ళోకి పోదామా
కిరకిర తలుపులు తీద్దామా
దేవుని మెడలో వేద్దామా"

ఉదయాన్నే నిద్రలేవటం, పూలు కోయటం, దేవుని పూజించటంలాంటి విషయాలను వివరిస్తుంది.

బొమ్మల పెళ్ళిళ్ళు చేయటం తెలుగు బాలబాలికలకు చాలా ఇష్టం. ఆ సందర్భంగా పాడుకునే గేయంలో మన ఆచార వ్యవహారాలు కూడా వస్తున్నాయి.

"తాటాకు బొమ్మకు కాటుక బొట్టుపెట్టి
చీర సింగారించి చేశారు
గౌరి కళ్యాణాల రేఖ దిద్దారు
పానకం బిందెలు సిద్ధపరిచారు
పాప పేరంటాళ్ళు కాచుకున్నారు"

'తారంగం, తారంగం తాండవ కృష్ణా తారంగం' అనే గేయం లాగానే ఈ క్రింది గేయం కూడా సాగుతుంది. పిల్లాడిని కాళ్ళ పై కూర్చోబెట్టుకొని బంగారు బొమ్మలాగా, గుడిగోపురంలాగా వర్ణించటం ఎంతో సహజంగా ఉంది.

"ఈగాడమ్మా ఈగాడు - ఈగేచి ఉలకా ఈగాడు
బంగారు బొమ్మా ఈగాడు - తంగేడు పువ్వా ఈగాడు
కులదీపంగా ఈగాడు - గుడి పావురమా ఈగాడు

ఒక పదం నుంచీ మరో పదంలోకి జాలువారే ఈ పాట పిల్లలు పరస్పరం ప్రశ్నోత్తరాలను సంధించటాన్ని ఎక్కువ చేస్తోంది. ఒక ప్రశ్న దానికి జవాబులతో సాగే ఈ తరహా పాటలు పిల్లలలో విజ్ఞానాన్ని వృద్ధిచేస్తాయి.

పిట్టమ్మ పిట్ట
ఏమి పిట్ట? చిలక పిట్ట
ఏమి చిలుక? హంస తెలుపు
ఏమి హంస? రాజహంస

అలానే మన ఇళ్ళలో పిల్లలచేత చెప్పించే ఈ గేయం -

"కాకీ కాకీ కవ్వాళ్ళ కాకీ, కాకీ నోట్లో దీపం పెడితే
దీపం తీసుకొని దిబ్బకిస్తే, దిబ్బనాకు ఎరువు నిస్తే
ఎరువు తీసుకొని చేనుకిస్తే, చేనునాకు గడ్డి నిస్తే"

పై గేయంలాగానే ఇదికూడా దేనినుంచి ఏది వస్తుందో వివరిస్తోంది. పిల్లలకు ఉచ్చారణ సరిగా రావటానికి నోరుతిరగని ఎన్నో పదాలను గేయరూపంలో, వచనరూపంలో నేర్పుతారు. 'కరణమోరి కర్రి గొర్రెపిల్ల కొర్రకయ్యి కరకరమేసే' లాంటివి దీనికి ఉదాహరణ.

కోస్తా జిల్లాల్లో ఒక పిచ్చుక కథని ఈ కింది విధంగా గేయరూపంలో చెపుతారు. ఇదే కొద్దీ మార్పులతో రాయలసీమలోనూ ప్రచారంలో ఉంది.

"కందిగింజకు కదురునూలు
కదురునూలుకు కమ్ములపంచ
కమ్ములపంచకు కొమ్ముల గొర్రె
కొమ్ములగొర్రెకు మదపుటేనుగు"

తెలుగులోని కొన్ని సవ్యాపసవ్యపదాలు (Palindromes) శిష్ట సంప్రదాయంలోనూ నేర్పటం ఉంది. 'రాముడెవ్వనిగూడి రావణుమర్దించె? పరవాసు దేవుని పట్టణమేది?' అని సాగే ఈ పద్యం కొంతకాలం క్రితం పిల్లల పాఠ్యపుస్తకాలలో ఉండేది.[3]

వేడుక పాటలు తెలుగు నుడికారానికీ, హాస్యానికీ, వ్యంగ్యానికీ, జీవన విధానానికి అద్దం వంటివి. దసరాపద్యాలు, గొబ్బిపాటలు, పౌరాణిక చారిత్రక విషయాలు, బావామరదళ్ళ సరదాలు ఇవన్నీ మన సంప్రదాయానికి సజీవ సాక్ష్యంగా నిలుస్తాయి.

'అయ్యవారికి చాలు ఐదు వరహాలు, పిల్లవాళ్లకు చాలు పప్పుబెల్లాలు'

అని సాగే ఈ పాటలు నవనాగరికులకు నచ్చవుగాని తెలుగువారి నోళ్ళలో అనునిత్యం నానాయి. ఈ పాట చివర్లో 'పావలా అయితే పట్టేది లేదు' అంటూ ఎంత దానంగా ఇవ్వాలో చెప్పటం గిలిగింతల హాస్యాన్ని కల్గిస్తుంది. ఆనాటి గురువుల ఆర్థిక స్థితీ వెల్లడవుతోంది. గురుశిష్యుల సంబంధాలు, గురువుకు - తల్లిదండ్రుల మధ్య ఉండాల్సిన ఆదర్శ సంబంధం ఈనాడు నశించిపోవటంవల్ల దసరా పాటలు ఈనాటివారికి రుచించవు. కార్పొరేట్ కళాశాలల కాలంలో చదువు ఉపాహార దర్శినిలో దొరికే కొనుక్కున్న ఇడ్లీ లాగానూ, గురువుని ఆ ఇడ్లీ అందించేవాడిగానూ సమాజం భావిస్తున్న ఈ పరిస్థితుల్లో వేడుకపాటలు పెద్దగా పట్టవు.

"మరు జనక మమ్మేలు మత్స్యావతార
గురుతుగా కృపజూడు కూర్మావతార
వరదుడవు కావయ్య వరాహావతార"

పై గిలక పద్యం దశావతారాలను భక్తియుక్తంగా వివరిస్తోంది.

సంక్రాంతి సంబరాలు తెలుగు ఆడపడుచుల గొబ్బిపాటలను వివరిస్తాయి. గుండ్రంగా నర్తిస్తూ ఆడపిల్లలు పాడే ఈ పాటలు ఎంతో లయబద్ధంగా సాగుతాయి.

గొబ్బియెళ్ళో గొబ్బిగొబ్బి పాడరమ్మో!
గొబ్బిలిలాలాయె యగో
చందమామ చందమామ చందమామ

బావామరదళ్ళ సరదాలు ఎన్నో ఉండేవి. అన్యోన్యతని, స్నేహభావాన్ని ఈ సరదాలు పెంచేవి. వియ్యాలవారి గురించిన ఈ గేయం చూడండి-

వియ్యాల వారింట్లో విందూ చేసేరంటా
దండిగా ప్రాణాలు మెండుగానే లేవు ॥వి॥
వట్టీ కందిపప్పు వడ్డించి వెళ్ళారు
ములక్కాయ ఇగురు ముడిబియ్యమన్నాము ॥వి॥

వరుసయ్యే వారందరూ పెళ్లి వేడుకల్లో, పాల్గొని ఆనందించేవారు. తలంబ్రాల తర్వాత, ఊరేగింపు తర్వాత, నలుగుబెట్టి వధూవరూలకు మంగళస్నానాలు చేసేటప్పుడు పాడుకునే అనేక పాటలు ఉన్నాయి. పెళ్ళి కొడుక్కి బాసికంకట్టి పెళ్ళికి తరలివెళ్ళే సందర్భంలో ఈ పాట పాడతారు.

"భీముని బాసింగం కట్టవేళాయె
గుఱ్రం మీద పెండ్లికొడుకు కూర్చుండ
పచ్చన్ని పచ్చన్ని పందిళ్ళలోన"

పెళ్లి వేడుకలలో భాగంగా అలంకరణలు చేస్తారు. నలుగురు పెద్ద ముత్తయిదువలు రాగయుక్తంగా పాటలు పాడతారు. దీంట్లో పెళ్ళి కూతురిని ఆట పట్టించటం, ఒద్దికగా ఉండాలని చెప్పటం కనిపిస్తాయి.

"చుక్కల్లో చంద్రుడమ్మ పెండ్లి కూతుర
చుప్పనాతి దానవమ్మ పెండ్లి కూతుర"
అలానే ఈ గేయం పెళ్ళి కుమార్తెకు నలుగుపెట్టే సందర్భంలో స్త్రీలు పాడతారు.

"వనజాక్షి వేగరావే వనితరో నలుగు కపుడు
లావాటి చీరకట్టి రంగైన రైక తొడిగి
కమ్మని కస్తూరి నొసట తిలకముదిద్ది"

ఇంట్లోకి ప్రవేశించేముందు వధూవరులను తలుపు దగ్గరే ఆపి పేర్లు చెప్పించటం, అల్లుడు అలకపాన్పు ఎక్కటం, ఆడపడుచు తన అన్నతో అతని కూతురిని తన కొడుకుకి ఇచ్చేటట్టు వాగ్దానం చేయమనటంలాంటి ఎన్నో ఆచారాల సందర్భంగా పాటలు పాడతారు. అన్నా చెల్లెళ్ళు ఇలా 'మేనరికపుబాస' చేసుకుంటారు.

అన్నయ్య: వియ్యాలకెవరూ మాకెవరుగలరూ
నీకు పట్టుచీరే బావకు శాలువ

చెల్లెలు: అన్నకు పట్టుశాలువ వదినెకు సరిగంచు చీరె
వియ్యమందే కట్నాలివిగో అన్నయ్య

డబ్బుపిచ్చి పట్టనివాళ్ళు, ప్రేమగా కుటుంబ బాంధవ్యాన్ని కొనసాగించాలనుకునేవారు ఇలా వాగ్దానాలు చేసుకోవటం గమనించాలి.

వరంగల్ తదితర ప్రాంతాల్లో ఈ క్రింది పాట చాలా ప్రాచుర్యంలో ఉంది.

"ఇస్తనని పలుకవే ఇయ్యంపురాలా
నీకునూ నాకునూ ఎవ్వరే సాక్షి
బాసికం కట్టిన బ్రాహ్మడే సాక్షి
పెండ్లికి వచ్చిన పెద్దలే సాక్షి"

బొడ్డెమ్మ పండగ లేదా బతకమ్మపండగ తెలంగాణా ప్రాంతానికి చెందిన పండగ. తొమ్మిది రోజులుసాగే ఈ పండగలో గౌరమ్మని ఆరాధిస్తూ ఆడపిల్లలు పాటలు పాడతారు. పూలతో బతకమ్మని చేసి వాటి చుట్టూ గుండ్రంగా తిరుగుతూ ఎన్నో పాటలు

పాడతారు. ఆఖరి రోజున వాటిని ఏదైనా చెరువులో కలిపివేస్తారు. ఇవి సంతాన సాఫల్య ఆరాధనా విధానానికి (Fertility cult) ఉదాహరణ.[4]

ఈ క్రింది పాటలో చక్కని మేడ, అందులోని అవివాహిత స్త్రీలు గురించి ప్రస్తావన. మంచి మల్లెతీగెలతో కన్యలను పోలుస్తూ కోసేవారెవరూ లేక అది కొండ అంత ఎత్తుకు ఎదిగిందని చిత్రించటం ఉంది. చందమామ అనే మకుటంతో ఈ పాట సాగుతుంది. ఖమ్మంజిల్లాలోని వైరా తదితర కొన్ని ప్రాంతాల్లో "ఓ రాచగుమ్మడీ" అనే మకుటంతో ఈ పాట సాగుతుంది.

మూలుమర్తి మేడ మీద - చందమామ
మూలుమర్తి మేడ మీద - చందమామ
ముత్యాల ముగ్గులకు - చందమామ
వజ్రాల వాకిండ్లు - చందమామ
వజ్రాల వాకిండ్లకు - చందమామ
మంచినీళ్ళ బావిపెట్టు - చందమామ
మంచినీళ్ళ బావిపెట్టు - చందమామ
కోయించు చందప్ప - చందమామ
పంచిపెట్టు గౌరమ్మ - చందమామ

'పల్లెకూటాలెక్కి పత్రాలు దూయంగా, మేమంత ఆడంగా మా కాంతుడు చూడంగ....' అని సాగే మరో పాట కూడా లయబద్ధంగా సాగుతూ వినసొంపుగా ఉంటుంది.

స్త్రీల పాటలు అనే శీర్షిక క్రింద కన్యాశుల్కం పాటలు, వేవిళ్ళ పాటలు, వదిన ఆడపడుచుల సంభాషణలు, బాలింతల పాటలు, అత్తా-అల్లుళ్ళ పాటలు, పుట్టింటి గొప్పలు, మెట్టినింటి కష్టాలు, కట్నకానుకల కోసం పాటలు మొదలైనవన్నీ ఉండేవి. వినోదం కోసం ప్రధానంగా ఈ పాటలు సాగేవి. శారీరక శ్రమ మరపించే తిరగలి పాటలు కూడా ఉండేవి. ఆనాటి పాటలలోనూ చక్కని ప్రతీకలు ఉండటం, సాధారణ విషయాలు ఉండటం గమనించాలి. స్త్రీల గేయాలన్నింటిలోనూ వారి విశ్వాసాలు కనిపిస్తాయి.

"పరమేశుడిచ్చిన పసుపు కుంకుమలు
నొసటకుంకుమలుంటే ఇష్టాలుదీరు
పసుపు ఒంటినుంటె భయమేమినాకు"

స్త్రీ సౌభాగ్యానికి నిత్యాలంకారాలతో ఉన్న బాలింతను అదే ఇంట్లోని గడుసు పడుచు 'బాలింత గాజుల్లు భద్రకాళీలు, చూలింత గాజుల్లు గాజుల్లు' అంటూ ఆట పట్టిస్తుంది. దానికి పై గేయాన్ని సమాధానంగా చెపుతుంది. పసుపు కుంకుమలే

సౌభాగ్యమని భర్త తప్ప ఇతరమైన బంధువులు ఎందరు ఉన్నా ఆ సౌభాగ్యం ఉండదనీ చాలామంది స్త్రీలు నమ్ముతారు.

"ఏరు ఒడితెనె మేలు మగడా మనము
పొత్తులుంటేనే పోరు మగడా" ॥ఏరు॥

అన్నదమ్ముల నుంచి వేరుపడమని ఒక తెలివిగల ఇల్లాలు భర్తను ప్రోత్సహించటం అలా చేస్తే తన శక్తియుక్తులతో సంసారాన్ని అభివృద్ధి చేస్తానని హామీ ఇవ్వటాన్ని పై పద్యంలో చూడవచ్చు.

పుట్టింటి వారిపై తెలుగు ఆడవాళ్ళకి ఆదరణ మెండు. పెళ్ళికాగానే అందరినీ వదిలి వేరే ఇంటికి వెళ్ళినా నిజానికి ఆమె మనసంతా పుట్టింటి విషయాలే ఉంటాయి.

"శ్రీరామ చింతిల్ల పండు బండింది
చూచిరావే సీత కోసుకుందామె"

పుట్టింట నుంచి తనను తీసుకొని పోవటానికి వచ్చిన అన్నలు, మామగారిని అత్తను అనుమతి కోసం ప్రాధేయపడటం ఈ గేయంలో వర్ణించబడ్డాయి.

"కలవారి కోడలు కలికికామాక్షి, కడుగుచున్నది పప్పు కడవలో బోసి
అప్పుడే వచ్చాడు ఆమె పెద్దన్న, కాళ్ళకు నీళ్ళిచ్చి కన్నీరు నింపె

అన్న: ఎందుకూ కన్నీరు ఏమి కష్టాలు, తుడుచుకో చెల్లెలా ముడుచుకో కురులు ఎత్తుకో బిడ్డను ఎక్కి అందలము, పెట్టుకో సొమ్ములు కట్టుకో చీర, చేరి మీ యత్తమామలకు చెప్పిరావమ్మ
కోడలు: కుర్చి పీట మీద కూర్చున్న అత్త, మాయన్న లొచ్చారు నన్నంపుతార
అత్త: నేనెరుగ నేనెరుగ నీ మామనడుగ"

అధికారం చూపించే అత్తగారు, పెత్తనం కావాలనుకునే కోడలు మొదలైనవారి గురించిన గేయాలు ఉన్నాయి. ఇవన్నీ తెలుగు లోగిళ్ళలో సామాన్యంగా జరిగే అనేక అంశాలను వివరిస్తాయి. స్త్రీల పాటల రూపాన స్త్రీల జీవితం వ్యక్తమవుతుంది. కొన్ని సందర్భాలలో పురాణపాత్రలైన సీత, సుభద్ర, శశిరేఖ, శాంత మొదలైన వారి పేరు మీద సాగే గేయాలు స్త్రీ జీవితంలోని వివిధ దశల్ని చర్చిస్తుంటాయి.

శ్రామికుల పాటల్లో 31 మేలిమి రత్నాల్లాంటి పాటలు వస్తాయి. చాపలు అల్లేటప్పుడు, విత్తనాలు వేసేటప్పుడు, వ్యవసాయ పనుల్లో, విసురురాతి, ఏతం, రోకటితో పనిచేస్తున్నప్పుడు అలుపు తెలీకుండా ఉండేందుకు ఈ పాటలు పాడతారు.

ఏతం బావినుంచి నీరు తోడుతున్నప్పుడు పాడుకునే ఈ పాటలో దురదృష్టవంతుడైన రైతు జీవితాన్ని చిత్రించారు. కష్టపడి పుట్ల పంటని పండించినా అతని కడుపు నిండే అవకాశం లేదు. గ్రామాధికారి అతని కొడుకు రైతుని పట్టి పీడించేవారు. ఆలుబిడ్డలు కూడా అతన్ని హింసించేవారు. చివర్లో 'నాదేటి

బ్రతుకాయెరన్నా' అని రైతు వాపోతున్న దృశ్యం మనల్ని కదిలిస్తుంది. అముక్తమాల్యదలో ఈ పాటల ప్రస్తావన ఉంది.

"ఏటికెంత బెట్టి ఎయిపుట్లు బండించి
ఎన్నడో మెతుకెరగరన్న నేను గంజిలో మెతుకెరుగరన్నా ॥ఏటి॥
కాళ్లేయి కడుక్కొని కట్టమీద గూసుంటె
కాకీ దన్ని పోయేరన్నా కాకిపిల్ల దన్ని పోయేరన్నా ॥ఏటి॥

నాదేటి బ్రతుకాయెరన్నా
నేను నాడె చావక బోతిరన్నా" ॥ఏటి॥

వ్యవసాయం చేసేటప్పుడు రైతుల వేషం విత్తనాలు వేయటానికి సన్నాహాలు ఈ క్రింది పాటలో వస్తాయి. విత్తనాల కడవకు విభూతి బొట్టుపెట్టి, ఏరువాకకి రమ్మని ముత్తయిదువులని ఆహ్వానించటం ఇక్కడ కళ్ళకు కట్టినట్లు వర్ణించటం జరిగింది.

పులిగోరు తాయెతులు - బొమ్మంచు సెల్లా
గుంటకెద్దులకేమొ - కుచ్చుల్ల తాడూ
బోరు బోరు గజ్జెల్లు - బొడ్డు గంటల్లు
పైసాల చెన్నయకు - పగిడి కడియాలు
గజ్జెల్లి మొలతాడు - గిరక సెప్పల్లూ
కుచ్చుల్ల వణకట్టు - కురుమల్లితాడు

భావ సౌకుమార్యము కల మరొక ఏరువాక పాట ఈ విధంగా 'తొలకరీ ఒక మబ్బు తొంగి చూచినది – మబ్బులో ఒక మెరుపు మెరిసిపోయింది' అని నడుస్తుంది. వ్యవసాయం పనులు ఏరువాకతో మొదలవుతాయి. ఎద్దులని అలంకరించి పూజించి ఊరు బయటకు తోలుకొనిపోతారు. ఈ ఆచారం చాలా ప్రాచీనకాలం నుంచే ఉండేదని సురవరం ప్రతాపరెడ్డిగారు వివరించారు.(5)

'వానల్లు కురవాలి వానదేవుడా' అని సాగే మరో పాట చాలామందికి తెలిసింది. ఇటువంటి గేయ సంప్రదాయం దేశమంతటా ఉంది.

అన్నదాత రైతుకు పశువులపై ఉండే ప్రేమను వర్ణిస్తూ వ్యవసాయం భగవంతునిపై ఆధారపడిందని ఈ క్రింది గేయం తెలుపుతుంది. గ్రామకరణాలు ఏ విధంగా రైతులపై పెత్తనం చేస్తారో కూడా తెలుస్తుంది.

"కరణాలు కాపులూ పన్నులడుగా వస్తే
పన్నుగట్టకపోతె పట్టి తన్నేరు
వాసిగా భద్రాద్రి ఈశుణ్ణి నమ్మితే
ఇరవై యారుపుట్ల జొన్నలెల్లునురా"

బుట్టలల్లుకునే మేదరవారు పాడుకునే "చిన్నా చిన్నా ముల్లు చిన్నారి ముల్లు దాని కిందున్నాది జడల మాదారి?" పాటలో వృత్తిలోని సాధక బాధకాలు వర్ణించబడ్డాయి.

చర్మకారులు 'లెల్లెపాటలు' పాడుతూ అడుగులు వేస్తారు. అగ్రవర్ణ భూస్వాములు తగాదాలాడినప్పుడు వీరి ద్వారా ప్రత్యర్థుల ఇళ్ళ ముందు ఈ పాటలు పాడిస్తారు.

కార్మికగేయాలు కొన్ని శృంగార పూరితముగా ఉంటాయి. ఈ క్రింది గేయంలో సినిమా ప్రశంస కూడా వస్తుంది.

"బొంబాయి సికె ముడ్సి – బబ్బిలీ బొట్టు పెడితే
సీనిమాలోల్లంత – నిన్నె సూతురు నీలా"

ఒక జానపదుడు తన ప్రేయసి రూపాన్ని "అచ్చాము తెల్లచీర అంచూన జిల్లేడుగొమ్మ, నీ కొంగున రామచిలుకలే – ఓ బొల్లారపిల్లా" అని అద్భుతంగా వర్ణిస్తున్నాడు.

"ఇక్కాడ బొగ్గుగుట్టా – అక్కాడ బొగ్గుగుట్టా
గుట్టనడుమ బండ్లబాట – గుర్రమెక్కి రావోయి కొడుకా
ఓ గిల్లగీతల రాజా"

బొగ్గుగనుల్లో పనిచేసే కార్మికుడు తన కుమారుని కూలిపనికై తానున్న చోటుకి రమ్మని పిలవటం పై గేయంలో కన్పిస్తోంది.

గౌడగీతములు కూడా చాలా ప్రసిద్ధమైనవి. గౌడుల ఆదిదేవుడు కాటమహేశ్వరుండు బ్రహ్మోత్సవములో ఈ గౌడగీతాలతో స్వామిని సేవించటం ఆచారంగా వస్తున్నది. శ్రీ మార్గవి సుబ్బారావుగారు 'కాటమహేశ్వరచరిత్ర'లో గౌడులు గౌడగీతములతో గౌరీశంకరస్తవము చేయుచుంటారని చెప్పారు.(6)

శ్రామికుల పాటల్లో గానం, పదం అద్భుతంగా ఉన్నాయని అనేక మంది పండితులు భావిస్తారు. వీటిలో చక్కని భాష, శబ్దం, సౌకుమార్యం, వ్యంగ్యం ఉన్నాయని భాషాశాస్త్రవేత్తలు అంటారు.

వలపుపాటలు అనే శీర్షిక క్రింద 31 వైవిధ్య భరితమైన గేయాలు సమకూర్చారు. ప్రేయసీ ప్రియుల పాటలు ఈ సంకలనంలో ఉన్నాయి. వలపుపాటలు, విరహగీతాలు, వలపుని వివరించే పాటలు, సంకేత స్థలం గురించిన పాటలు ఇవన్నీ చాలా సరదాగా సాగుతాయి.

శ్రీకాకుళంజిల్లా కిల్లారి అప్పన్న పాడగా సేకరించిన ఈ క్రింది గేయంలో ప్రేమించిన చిన్నదాన్ని గురించి ప్రియుడు ఇలా అంటున్నాడు.

"నన్నూ జూచి నవ్వింది దిశోళ్ళ చిన్నదీ
మెట్టా (కొప్పు) పెట్టింది మయేళ్ళ చిన్నదీ ద                    ॥నన్ను॥

చట్టి చేత బట్టుకొని సాగెలుతుందీ
మిట్టపిల్లలాగే మిడిసి మిడిసి పడుతుందీ //నన్ను//
కోకకట్టుకుందీ చవ్వాకు పెట్టుకుందీ
నాకేసి చూడకుండ నవ్వుకుంట వెళ్ళుతుంది //నన్ను//
ఎల్లోరా! ఎల్లోరా! ఎల్లు ఎల్లు మన్నది"

వరంగల్ ప్రాంతాల్లో చాలా ప్రాచుర్యం పొందిన "గండరగండరా భాయ్ గాణుపోల చిన్నది" అనే గేయం హుషారుగా ఉండి ఆహ్లాదం కలిగిస్తుంది.

ప్రేయసీ ప్రియుల మధ్య సాగే సంభాషణా రసగుళికలు వింటేనే ఒళ్ళు ఝల్లుమంటుంది. వెంకయ్య – చంద్రమ్మ పాట ఆంధ్రప్రదేశ్ అంతా వ్యాపించిన ప్రేమ కావ్యం. హరిజనుడైన వెంకయ్య కాపు పడుచైన చంద్రమ్మల ప్రణయవృత్తాంతం పామరుల్లో ప్రతిధ్వనించింది.

"చింతచెట్టెక్కేవు, చిగురాకు కోసేవు కొమ్మయిరిగితే ముండకొడుకో
రెంకయ్య కూలిపోతవు ముండకొడుకో రెంకయ్య"

శృంగార ప్రధానమైన గేయములందు సాధారణంగా విప్రలంభశృంగారం అధికంగా ఉంటుంది. వియోగంతో సాగే పాటలు మనస్సుకి హత్తుకొనిపోతాయి.

"వచ్చిపోయే తోవలోన చందమామవోలె చందమామ
నీవు ఆశ మొదలు పెట్టుకుంటివి చందమామవోలె చందమామ
ఇద్దరాము కూడితిమి" చందమామవోలె చందమామ

ఒక బుద్ధిలేనివాడు 'మూడు రూపాయలిత్తా – ముత్యాల పోగులిత్తా నువు రావె పిల్లా గురిజాల గుట్టమీదికి' అని ఆశపెడతాడు. ఆ పిల్ల మాత్రం "మూడు రూపాయలొద్దు, ముత్యాల పోగులొద్దు – నేను రానోయ్ రాజా దేవుడున్న గుట్టమీదికి" అని సమాధానం ఇస్తుంది. దైవభీతి, జాగ్రత్తలు కనిపిస్తాయి.

జారిణియైన స్త్రీని భర్త ప్రశ్నలడిగితే ఆమె తెలివిగా సమాధానం ఇవ్వటం 'గట్టుకి బోయి నేను – కట్టెలు తెమ్మంటే, కొప్పునున్నా పూలు ఎక్కడివే భామా' అని సాగే ఒక గేయంలో ఇతివృత్తం.

ఒక నెరజాణ 'అవునంటే కాదనిలే' అన్న రీతిలో తనకు ఏమి కావాలో ప్రియునికి వివరించటం, దానికి అతనిచ్చిన సమాధానాలు క్రింది గేయంలో వస్తాయి. ఒక సినీగేయం కూడా దీన్ని పోలి ఉంటుంది.

"ఆకులు పోకలియ్యకురా!
నోరం తెర్రగ చేయకురా!
ఆకులు పోకా తెచ్చెదనే
నీ నోరం తెర్రగ చేసెదనే"

ఈ విధంగా తెలుగు వలపు మాటలు పాటలుగా ప్రజల మనసులో నిల్చిపోయాయి. కొన్నిసార్లు మోటుసరసం, విరహం శ్రుతిమించినట్లు అనిపించినా వాటిని మన సంస్కృతి సంప్రదాయాల నేపథ్యంలో అర్థం చేసుకోవాలి. ప్రతీకలు, శ్లేషలు గేయాల్లో ఇమిడిపోయి విషయం స్పష్టంగా, తేలికగా సూచితమవటం విశేషం.

హాస్యరసం ఏ మనిషికైనా బాధలను మర్చిపోయి హాయిగా నవ్వుకోవటానికి ఉపయోగపడుతుంది. హాస్యపు పాటల్లో మోటుసరసం కనిపిస్తుంది. తెలుగులో హాస్య రచనలు ఎక్కువే. తెలుగువాళ్ళు హాస్య ప్రియులు. ప్రాచీన లాక్షణికులు 'వికృతాకార వాగ్వేష చేష్టోదే ర్నర్త కాద్భవేత్ హాస్యో హాసస్థాయి భావ:' అని హాస్యాన్ని నిర్వచించారు.

ముసలిమొగుడు – పడుచుపెళ్ళాం గురించి వ్యంగ్యంగా "ముసలాడు మాత పసిపసి నిమ్మపండు పడుచుదానిని పెండ్లాడి పై కాపులుండె" సాగే పాట పడుచుపెళ్ళాం కోసం చేసే సౌకర్యాలని వివరిస్తోంది.

నాచుల యుండే మీసముదువ్వే రొయ్య పీతగారూ
రొయ్యపీతకి మొనగాడండీ మట్టగిడిసగారూ
మట్టగిడిసకి మొనగాడండీ ఎంద్రకాయగారూ
ఎంద్రకాయకి మొనగాడండీ నక్కపోతుగారూ
నక్కపోతుకి మొనగాడండీ కుక్కపోతుగారూ
కుక్కపోతుకి మొనగాడండీ దుడ్డుకర్రగారూ

పై పాట 'అతని కంటె ఘనుడు ఆచంటి మల్లన్న' అనే విషయాన్ని గురించి సాగుతోంది. "ఒకరిని మించేవారు ఇంకో వారుంటారు, వారిని పేర్కొంటూ ముక్తపదగ్రస్తంగా హాస్యంలో యుక్తి యుక్తంగా ఉందీ పాట. వినోదాలలో ఈ గేయాలు పాడతారు" అని రామరాజుగారే స్వయంగా వివరించారు.

మెదక్ జిల్లా మాధవరం గ్రామంలో చిందుమాదిగ కొండయ్య 1952లో పాటను పాడగా, సేకరించారు. వెట్టిచాకిరీ తెలంగాణాలో చాలాకాలం రాజ్యమేలింది. ఎన్ని రకాల ఎత్తులు వేసినా వెట్టి నుంచి తప్పించుకోలేవని ఒక యువకుడితో వదినగారు అంటుంది. పైకి హాస్యంగా కనిపించినా ఈ గేయం విషాదాన్ని, నిస్సహాయతని సూచిస్తోంది.

"బొంతకాలెననీ దొంతుల్ల పండబెడితే
ఎలుకలూ యెక్కిరించే నా మరిదినీ
ఎలుకలెక్కిరించెనని సావట్ల పండబెడితే
యెట్టి మల్లెలు బెట్టిరి నా మరిదికీ"

పెళ్ళి కొడుకుని హాస్యం చేస్తూ పెళ్ళికూతురు తరుపువాళ్ళు ఈ క్రింది విధంగా పాడతారు.

"గుఱ్రాలు లేవని యేలడిగినారు గుడ్డీకుక్క నెక్కి లేచిరావయ్య
పల్లకీలు లేవని యేలడిగినారు పందికొక్కు నెక్కి లేచిరావయ్య
మేనాలు లేవని యేలడిగినారు మేకపోతునెక్కి లేచిరావయ్య

పెళ్ళికూతురి తరపున పేరంటాళ్ళు పెళ్ళికుమారుని అల్పబుద్ధిని వేళాకోళమాడుతూ ఈ క్రింది విధంగా పాడతారు.

"ఏమియో పెండ్లి కొడుకా యెంత కీరితి తెస్తివి!
సన్నబియ్యం కోడిపెట్టా మేము పెడతామంటిమీ
రాగిముద్ద ఉలవాచారూ నాకే కావలనంటివీ!
తూగుటుయ్యాల ఒరుగుదిండూ మేము ఇస్తామంటిమీ
పాతచాపలు పంచటరుగులు నాకే కావలెనంటివీ!"

ఈ విధంగా తెలుగు జానపదులు హాస్యపు పాటలతో కష్టాలను మర్చిపోయి సంతోషంగా ఉంటారు.

కన్నీటి పాటలు శీర్షిక క్రింద ఈ గేయ సంకులనంలో 19 పాటలు ఉన్నాయి. చారిత్రక విషయాలను ప్రస్తావిస్తూ గేయాలు సాగాయి. చరిత్రలో త్యాగాలు చేసిన అమరవీరుల గాథలు కూడా వివరించబడ్డాయి. యుద్ధాలలో అమరులైన పోరాటవీరుల గాథలు, కొట్లాటలో ప్రాణాలు కోల్పోయిన వారి జీవిత కథలు ఈ శీర్షిక క్రింద మనకు పరిచయం చేయబడ్డాయి. భూస్వామ్య సమాజంలో భూమి మీద ఆధిపత్యం కలిగిన రెడ్లను గురించిన ఎన్నో గేయాలు ఈ సంకలనంలో వస్తాయి.

ఉయ్యాలవాడ నరసింహారెడ్డి బ్రిటీష్ పాలనపై విరుచుకుపడిన పులిబిడ్డ. ఇతని వీరమరణాన్ని స్మరించుకుంటూ ప్రజలు పాడుకునే పాట ఒక ఉత్తేజగీతంలా ఉంటుంది.

దాచేపల్లిలో హత్యచేయబడ్డ గుఱ్రాల గోపిరెడ్డి పాట, ఈడిగ రామన్న మీద పాట, కురుములయ్య మీద పాట, మారెమ్మ ఉత్సవాల సందర్భంగా చనిపోయిన కోమటి రామయ్య మీద కోలాటపాట, కల్లుగీత గుత్తేదారుడైన వెంకట్రామిరెడ్డి చేసిన దౌర్జన్యాలను ప్రతిఘటించి ప్రజలు అతనిపై దాడిచేసి చంపిన వృత్తాంతం పాట మొదలైనవన్నీ ఈ సంకలనంలో చోటుచేసుకున్నాయి.

నాగిరెడ్డి ఒక ఆంధ్రా రాబిన్‌హుడ్. ధనికుల డబ్బు కొల్లగొట్టి ఆ ధనాన్ని బీదసాదలకు పంచేవాడు. ఈ వీరుడు పట్టపగలే నడివీధిలో ధనికుల పన్నాగాలకు బలైపోయాడు. ఈయన స్మృతి ప్రజలను వీడలేదు. నాగిరెడ్డి పై జానపదులు పాటకట్టారు.

"చుట్టు ముట్టూ పల్లెలకెల్లా శూరుడమ్మా నాగిరెడ్డి దెబ్బెయేదు
పల్లెలకెల్లా దేవుడమ్మా భీమలింగా
పక్కనున్న పల్లెలకెల్లా పాళెగాడు నాగిరెడ్డి"

ఈ కన్నీటి పాటలు కరుణరసాన్ని వెల్లివిరుస్తూ ఆనాటి వీరుల త్యాగాలను స్మరిస్తున్నాయి.

పారమార్థికాలు అనే శీర్షిక కింద 27 గేయాలు అందించారు. వీటిలో ఎక్కువభాగం గ్రామదేవతలకు, తత్వానికి చెందినవి. సాధారణ భాషలో సాగే ఈ గేయాల్లో హిందువుల మౌలిక విశ్వాసాలూ, తాత్విక చింతనలూ ప్రతిబింబిస్తాయి. వీరబ్రహ్మం బోధనలు తెలుగు ప్రాంతంలోని ప్రజలకు సుపరిచితాలు. నాగపూజ సంతానాన్ని ఇస్తుందని హిందూ స్త్రీల ప్రగాఢ నమ్మకం.

వేమన తర్వాత తెలుగు నేలలో కులమతాలను కాదని, సౌభ్రాతృత్వాన్ని బోధిస్తూ వీరబ్రహ్మంగారు దేశిరచనలు చేసారు. వీరి పేరు మీద ఎన్నో జానపదగేయాలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. క్రింది గేయం చాల చక్కగ బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వాన్ని వివరిస్తుంది.

"నందామయా గురుడా నందమయా
ఆనందదేవికీ నందామయా
వీరబ్రహ్మంగారు వీధమ్మటొస్తారు
వీధీధికిద్దరిని కంటారయా //నందా//
ముత్యాలమ్మ గుడి కాడ మూలస్థంభం కాడ
ముండలకు పెళ్ళిళ్ళు అవుతాయయా!" //నందా//
అలానే లింగని పరముగా సాగే మరోపాటని చూడండి-
"ఏమిసేతుర లింగ, ఏమిసేతుర లింగ
గంగ ఉదకము తెచ్చి నీకు, లింగపూజలు చేతమంటే
గంగనున్నా చేపకప్పలు ఎంగిలంటున్నాయి లింగా
మహానుభావా, మా లింగమూర్తి"

ఈశ్వరనిరూపణము, ప్రపంచ నిరూపణము, జీవాత్మ నిరూపణము మొదలైన ఎన్నో విషయాలు ఈ గేయాలలో ఉన్నాయి. 'శ్రీరామనామం మరువాం మరువాం, సిద్ధము యమునికి వెరువాం వెరువాం' అనే పాట ఆంధ్రదేశమంతటా ఆబాలగోపాలానికి తెలుసు. దీనిలో భాగవతం వివరించిన నవవిధ భక్తిమార్గాలు వివరించబడ్డాయి.[7]

ఎవరో పనికట్టుకుని ప్రచారం చేస్తేనో, భయపెడితేనో ఈ పాటలు ప్రజల మనసుల్లో నిల్చిపోలేదు. జానపదుల నాలికలపై పరుగులెత్తే ఈ గేయాలు మన పారమార్థిక చింతనని నిరూపిస్తున్నాయి.

ప్రకీర్ణాలు అనే శీర్షిక క్రింద 21 విలక్షణమైన పాటలను కూర్చారు. కాకిని శకునం అడిగే ఇల్లాలి పాట, గ్రహణాల పాట, కరువుల్ని ఆకలి బాధల్ని వివరించే పాట ఈ శీర్షిక క్రింద ప్రచురించిన వాటిల్లో ముఖ్యమైనవి.

'కానివారితో కావించు చెలిమి కట్టె విరిచి పోయిని పెట్టినట్లుండు, అయిన వారితోటీ కావించు చెలిమీ ఆకుమడచి మడత పెట్టినట్లుండు" అని సాగే ఒక పాట/ మంచి, చెడ్డ స్నేహాల తారతమ్యాన్ని విశదీకరిస్తోంది.

బుడబుక్కల వారు ముఖ్యంగా శక్తిని ఆరాధిస్తారు. 'అంబపలుకు జగదంబ పలుకు' అంటూ ఇంటింటా తిరిగి బిచ్చమెత్తుకునే వీరి వేషధారణ బహు చిత్రంగా ఉంటుంది.

ఈ గేయం జానపదుల జీవితానుభవాలను నిక్షిప్తీకరించుకున్న అక్షరమాల.

*"కొడుకు మరము కన్నతల్లికే యెరుక*
*అడవిలో తిరిగేటి అయ్యకే మెరుక*

*వనము సింగారంబు వానకోయిల కెరిక*
*కంపలో పండేటికాడికే మెరిక*
*గందంపు వాసనా గాడిదకే మెరుకా*
*వంటలో పాకంబు గంటికేమెరుకా*
*నానారుచులు తిన్న నాలుకా కెరుకా"*

మానవ జీవితమే అంత. ఎలా పుట్టామో తెలీదు. తల్లి చెపితే కానీ ఎవరికి పుట్టామో తెలుసుకోలేము. అర్జున పుష్పాలుగానే పుట్టి ఏదో నాలుగు డబ్బులు సంపాదించామని నీలిగి 'పుట్టలోని చెదుల'లాగా పుట్టిపోయేవారు కొందరు. జీవితం గురించి తీవ్రంగా ఆలోచించి దాని విలువ తెలుసుకునేందుకు ప్రయత్నించేవారు మరికొందరు. జీవన మాధుర్యం తెలిసినవాళ్ళకి జీవితం విలువ అర్థం అవుతుంది. ఏ విశ్వవిద్యాలయాలు బోధించని, బోధించలేని ఈ విషయాలని జానపదులే సరిగా తెలుసుకున్నారు.

తెలుగు జానపదగేయాల్లో జీవితం అంత విస్తారమైనది. వీటి విలువ జీవితం అంత. ఈ గేయాలను శ్రమకోర్చి ఇంత విశాల ప్రాతిపదికన సేకరించి, లిఖితరూపంలో భద్రపరిచిన ఘనత శ్రీ రామరాజుగారిది. ఈ గేయాలను సమాజశాస్త్ర, మానవ విజ్ఞానశాస్త్ర దృష్టితో పరిశీలిస్తే మరిన్ని విశేషాలు వెలువడతాయి.

## వివరణలు:

1. బొబ్బిలికథ, కుమార రాముని కథ, కామమ్మ కథ మొదలైన తెలుగు గాథా గేయములను బ్రౌణ్య పండితుడు తొలిసారిగా సేకరించాడు. వీరు ఈ విధంగా అన్నారు –
"Some of these, as the bobbili katha or Rangarao Charithra and the Nagamma Catha and the like are Chiefly Preserved by oral tradition".

2. పిల్లలు సొంతంగా కూర్చిన గేయాలను Nonsense Rhyms గా పిలుస్తారు. అయితే వీటిలో ఎన్నో అర్థాలు, ఉపయోగాలు, రహస్యాలు ఉంటాయని పరిశోధకులు నిరూపించారు. కాళ్ళగజ్జి కంకాళమ్మ' అని మనకు తెల్సి దేశమంతటా కొద్ది మార్పులతో పాడే ఈ పాటలో ఎన్నో ఆయుర్వేద రహస్యాలు ఉన్నాయని వేదాల తిరుమల రామానుజస్వామి వద్ద నుంచి బి. రామరాజుగారు తెల్సుకున్నారు.

3. ఈ పద్యానికి ఇవి కుడినుంచి ఎడమకి, ఎడమనించి కుడికి ఎటువేపు చూసినా ఒకేలా ఉంటాయి. వచ్చే సమాధాన పద్యంలో ముఖ్యమైన సవ్యాపసవ్య పదాలను వివరిస్తారు. అవి లకోలకోల, జంబీరబీజం, మందారదామం, తోకమూకతో, రంగనగరం, నందసదనం, పంచాస్యచాపం.

4. గ్రీక్పురాణ సంప్రదాయంలో హయాసింథ్ అనే పుష్పాన్ని సంతాన సాఫల్య ఆరాధనారీతిలో ఉపయోగిస్తారు. ఈజిప్ట్ లాంటి దేశాల్లో కూడా దేవతారూపాల్ని, పుష్పాల్ని ఆరాధించి వాటిని సముద్రంలో వదిలిపెట్టటమో లేదా నేలలో పాతిపెట్టటమో చేసేవారు. బతకమ్మపండగ కూడా దీని కోవలోకే వస్తుంది.

The wasteland కావ్యంలో టి. ఎస్. ఇలియట్ ఈ ప్రాచీన ఆరాధనా విధానాన్ని ప్రస్తావించాడు.

"That corpse you planted last year in your garden " Has it begun to sprout"? Will it bloom this year?

5. ఈ ఆచారము చాలా ప్రాచీనకాలం నుంచే ఉన్నట్లు జైమినీ న్యాయమాలా గ్రంథమున హోలాధికరణమున ఈ విధంగా ఉందని సురవరంగారు వివరించారు:

"ఉద్వృషభయజ్ఞాదాయ ఉదీచ్యైః జ్యేష్ఠమాసస్య పౌర్ణిమాస్యాం బలీవర్దాన్
అభ్యర్చ్య ధావయంతి సో యమ్ ఉద్వృషభయజ్ఞ".

6. గౌడు గీతములు - (మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము) అముద్రిత గ్రంథములలో ఈ విధంగా పేర్కొన్నారు.

"తిరుపతి తిరునారాయణములకు మధ్యదేశము కదిరి. ఈ ప్రాంతమున నింత గొప్ప క్షేత్రము ఇంకొకటి లేదు. ఫాల్గుణశుక్ల పక్షము నందిచట బ్రహ్మోత్సవము జరుగును. కదిరి నరసింహునకు గౌడుల ఆదిదేవుడు కాటమహేశ్వరుండు బ్రహ్మోత్సవమునందు ఈ గౌడు గీతములతో స్వామిని సేవించే వాడుక చాలా పురాతనము నుండి వచ్చుచున్నది".

7. "శ్రవణం, కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్య సఖ్య మాత్మనివేదనమ్" - శ్రీమద్భాగవతం